

కళాప్రపూర్ణ

# చిలకమర్తి లక్ష్మీనరసింహకవి

జననము : 26—9—1867 మరణము : 17—6—1946

# అవతారిక

చరిత్రలు దేశాభ్యుదయమునకు తోడుపడును. కావున దేశ చరిత్రలు మిక్కిలి యుపయోగ్యములు. బహుపురుషుల చరిత్రలు గలసి దేశచరిత్ర లగును. కాబట్టి జీవితచరిత్రలు మిక్కిలి యుపయోగ్యములు. మహాపురుషుల చరిత్రములు శ్రద్ధతో వ్రాసినవా రున్నపక్షమున యవి యువజనులకు నాదర్శములుగా నుండును. ఒకరి చరిత్రము మరియొకరు వ్రాసినపక్షమున వ్రాయవలసిన విషయములు సమగ్రముగా లభింపవు. అందుచేత నెవరి చరితము వారే వ్రాసుకొన్నపక్షమున విషయములన్నియు సంపూర్ణముగా నుదాహరించుట కవకాశ ముండును.

కాని స్వీయచరిత్రములలో నొక లోప ముండవచ్చును. పురుషుడు తన చరిత్రము వ్రాసుకొన్నపుడు తన యుత్తమగుణములనేగాని దుర్గుణములను వెల్లడింపడు. ఒకరిచరిత్ర మరియొకడు నిష్పక్షపాతముగా వ్రాయుట తటస్థించెనేని కథానాయకుని సుగుణములతోపాటు దుర్గుణములనుగూడ జిత్రించును. స్వీయచరిత్రములు వ్రాసుకొన్న వారిలోగూడ కొందరు స్వీయలోపములను నిశ్శంకముగా వెల్లడింతురు. అట్టి మహనీయులు జగంబున నరుదుగ నుందురు. అట్టి మహనీయుడు గాంధిమహాత్ముఁ డొక్కఁడే.

ఘనకార్యములుచేసిన మహాపురుషులు పరులకు మార్గదర్శకములుగా నుండుటకై తమ చరిత్రలు తప్పక వ్రాయవలయును. మహాత్మ గాంధిగారు, జవహరలాలు నెహ్రూగారు మొదలగువారుత్తమ జీవితములు జీవించి స్వార్థత్యాగులై లోకోపకార పరాయణులగుటచే నట్టివారి జీవితము లమూల్యములు. మన యాంధ్రదేశమున మొట్టమొదట స్వీయచరిత్రము వ్రాసుకొన్నవారు మహనీయులైన రావుబహదూరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు. ఆ మహాపురుషుని చరిత్రమంతయు స్వార్థత్యాగముతోడను, లోకోపకారక

మైన ఘనకార్యములతోఁ డను నిండియున్నది. కావున వారి స్వీయ చరిత్రము నిశ్చయముగా నాంధ్ర సారస్వతమున కలంకారమై యాంధ్రజనులకు మార్గదర్శకమై యున్నది.

శ్రీ వల్లూరి సూర్యనారాయణరావుగారుగూడ స్వీయచరిత్రము వ్రాసుకొనిరి. ఆయన తన యార్జించిన విత్తమంతయు విద్యాసంస్థ కిచ్చియుండుటచే నాయన చరితముకూడ ప్రశంసనీయమే.

నా మిత్రులైన రాయసము వేంకటశివుడుగారు, చిన్ననాట నుండియు బుద్ధిమంతులై సత్ప్రవర్తనము గలిగి నుపాధ్యాయపదవిలో నుండి, కట్టకడపట నెల్లూరులోని వెంకటగిరి మహారాజాగారి కళాశాలకు ప్రధానాచార్యులై. "జనానా" పత్రిక మొదలగు కొన్ని పత్రికలు నడిపి, స్త్రీల కుపయోగించు గ్రంధము లనేకములు రచియించి, గుంటూరులో కొన్నివేలరూపాయలు ఖర్చుపెట్టి ధర్మార్థముగా నొక మందిరము గట్టించి, ప్రజలకు నప్పగించిన యుదార పురుషు డగుటచే, వారి "యాత్మకథ"గూడ శ్లాఘనీయమైయున్నది.

ఆ స్వీయచరిత్రముల ముందట నావంటివాని స్వీయచరిత్రము దివిటీముందర దీపమువలె నుండునని నే నెరుగుదును. అయినను నేల వ్రాయవలసివచ్చినదన్న నేతద్వృత్తాంతము వినిపించెద వినుడు.

1928 వ సంవత్సరము మార్చి నెలతో నా షష్ఠిపూర్త్యుత్సవమునకు రాజమహేంద్రవరము దయచేసినపుడు, మునగాల రాజాగారగు శ్రీ రాజా నాయని వెంకటరంగారావు బహదరువారు, నాస్వీయ చరిత్రము వ్రాయవలసినదని నాతో నొక్కి చెప్పిరి. పిమ్మట వీరేశలింగోన్నత పాఠశాలలో సహోపాధ్యాయులును నాకు మిత్రులు నైన యడవి శంకరరావుగారు, నా స్వీయచరిత్రము వ్రాయవలసినదని నా మేనల్లునిచేత పలుమారులు వర్తమానమంపుటయేగాక, వారు నన్ను గలసికొన్నప్పుడెల్లను జెప్పుచువచ్చిరి. ఏవిధమైన ఘన కార్యములు చేసి యెరుగని నా వంటి సామాన్యుని చరిత్రము లోకమున కేమి యుపకరించునని, నే నా ప్రయత్నముచేయక చిరకాల

మూరకొంటిని. కాని యైదారు మాసముల క్రిందట నాకు బాల్య మిత్రులైన రాయసము వెంకటశివుడుగారును, చిరకాల మిత్రులైన విస్సా అప్పారావుగారును నడుమనడుమ మా యింటికి వచ్చి నా స్వీయచరిత్ర వ్రాయుమని హెచ్చరించుచు వచ్చిరి. వారుభయులు నన్ను పలుమారులు గ్రంథ మెంతవరకు వ్రాసినారని యడుగుచు వచ్చిరి. నే నారంభించలేదని నాలో నేను సిగ్గుపడుచు పలుమారులు వారికి చెప్పితిని. ఆరంభించకపోవుటకు గారణమేమని వెంకటశివుడు గారు నన్ను నొక్కి యడిగిరి. వెంకటశివుడుగారు నాకు సహాధ్యాయు లును బాల్యమిత్రులు నగుటచే సందేహము విడిచి యిట్లు చెప్పితిని. "అయ్యా నాకు శ్రీ పిఠాపురము మహారాజావారు పరమదయాళులై నెలకు ముప్పదిరూపాయలు జీతమిచ్చుచున్నారు. నా మీద ననేకు లాధారపడి యుండుటచే నా కా సొమ్ము చాలక యెన్నో చిక్కులు పడుచుంటిని. నే నంధుడను, నితర శరీర దౌర్బల్యము గలవాడ నగు టచే నా కన్నపానాదులు సమకూర్చుటకును న న్నావలకు నీవలకు దీసికొని వెళ్లుటకును మనుష్యులు కావలెనుగదా? వారిని నేను పోషిం పక తప్పదుగదా? నాకు రాజమహేంద్రివరములో స్వంతయిల్లు లేక పోవుటచే గాపురమున్న యింటికి నద్దె నీయవలెనుగదా? అందుచేత నాకు సొమ్ము చాలక మనస్థిమితము లేదు. నిర్విచారముగా నిర్మల మైన మనస్సుతో వ్రాయవలసిన గ్రంథము చిక్కులలోబడి మన స్థిమితములేని నే నెట్లు వ్రాయగలను? నాకు నెల కరువదిరూపాయ లుండినగాని నెల గడువదు. అందుచేత నే వ్రాయజాలను క్షమిం పుడు." ఆ పలుకులు విని శ్రీ వేంకటశివుడుగారు "తక్కిన ముప్పది రూపాయలు మీకు వచ్చునట్లు మే మేర్పాటు చేసెదము. గ్రంథ మారంభింపుడు" అని చెప్పి వెడలిరి. నేను సంవత్సరాది వెళ్ళిన మరునా డనగా చిత్రభాను సంవత్సర చైత్రశుద్ధ విదియనాడు (18-3-1942) ఉదయమున నా స్వీయచరిత్రమును నా గుమాస్తాచేత వ్రాయింప నారంభించితిని. వెంకటశివుడుగారును, అప్పారావుగారును

నా కష్టటినుండియు నెలకు ముప్పది రూపాయలచొప్పున యిచ్చుచున్నారు.

ఆహాహా! వారి దేశాభిమానము నేనేమని వర్ణింతును. నామీదగల దయ యెంతని చెప్పుదును? వారి స్వార్థత్యాగ మేమని కొనియాడుదును? నా వంటివాని స్వీయచరిత్ర లేనిచో లోకమున కేమి లోపమువచ్చును? ఈ యుదారచిత్తు లిరువురుగూడ నంత పట్టుపట్టి కష్టార్జితమైన స్వంతసొమ్ము ఖర్చుపెట్టి, నాకు వ్రాయుటకు గావలసిన కాగితముసైతమునిచ్చి, నాచే నీ గ్రంథమేల వ్రాయింపవలెను? మహారాజుగారిచ్చునట్టి ముప్పదిరూపాయలకు తోడుగ నీ పరమాప్తులు బంపినట్టి ముప్పదిరూపాయలతో మనస్థిమితముగలిగి నీగ్రంథము వ్రాసి పూర్తిచేయగలిగితిని.

నేనయిదవ యేప్రియలువరకు రాజమహేంద్రవరములోనుంటిని. జపానువారిదాడివలన విశాఖపట్టణమునకును కాకినాడకును బట్టినగతియే, రాజమహేంద్రవరమునకును బట్టునను భయమున, 6—4—1942 నాడుదయమున రాజమహేంద్రవరము విడిచి పడమటి గోదావరిజిల్లాలో తణుకు తాలూకాలోని కాకరపఱ్ఱుగ్రామము వెళ్ళితిని. అక్కడ నాముఖ్యబంధువులు నాకుబసయిచ్చి నన్ను నాకుటుంబమును నాదరించుచున్నారు. రాజమహేంద్రవరములోనుండగా నా గుమాస్తాయైన ఐనపర్తి సత్యనారాయణగారిచేత నూటతొంబదిమైదుపుటలువ్రాయించితిని. కాకరపఱ్ఱు వెళ్ళిన తరువాత మిగిలిన గ్రంథమంతయు నా మేనల్లుడైన పురాణపండ వెంకటదీక్షితులు వ్రాసిపెట్టెను. మొత్తముమీద గ్రంథము వ్రాతప్రతిలో రమారమి యెనిమిది వందల పుటలైనది. నాచరిత్ర యింతపెద్దదిగ నుండునని నేనారంభమున ననుకొనలేదు.

స్వీయచరిత్రలు వ్రాయువారికి వారివారి దినచర్యా గ్రంథములు (Diary) నితర సహాయములు నుండును. నేనంధుడనగుటచే

నట్టి దినచర్యాగ్రంథములు వ్రాయ లేకపోతిని. కాబట్టి యీగ్రంథము వ్రాయుటకు పూర్తిగ పరమేశ్వరుడు నాకిచ్చిన జ్ఞాపకశక్తియొక్కటే నాధారముగాని, లిఖితపూర్వకమైన యాధారముగాని మరి యే యితర సహాయముగాని లేదు. జ్ఞాపకశక్తినిబట్టి డెబ్బదిసంవత్సరముల చరిత్ర వ్రాయవలసివచ్చుటచే నచ్చటచ్చట ప్రమాదములుండిన నుండవచ్చును. కొన్ని విషయములు మరచియుండవచ్చును. తేదీలు నెలలు పొరపాటుగ తప్పులుపడియుండవచ్చును. బుద్ధిపూర్వకముగా నేనేమియు నసత్యములు వ్రాయ లేదు. పొరపాటులున్న పక్షమున పాఠకమహాశయులు క్షమింతురుగాక !

ఇంతపెద్దగ్రంథమచ్చుపడునని ధైర్యము నాకు లేదు. ఈశ్వరునివేనమ్మి గ్రంథమువ్రాసి పూర్తిచేసితిని. ఈ గ్రంథము 18-3-1942వ తేదీన ప్రారంభించి 12-7-1942 వ తేదీన ముగించితిని. మొత్తము మీద నీ గ్రంథమువ్రాయుటకు రమారమి నాలుగుమాసముల యిరువదినాలుగు దినములుపట్టెను. నాకిప్పుడు డెబ్బదియైదవసంవత్సరము జరుగుచున్నది. ఇంత వార్ధక్యములో నాకు పూర్తియైన జ్ఞాపకశక్తిని, ఓపిక, నారోగ్యము నిచ్చి నాచే నీ గ్రంథము రచియింపజేసిన పరమేశ్వరునకు నేను శతసహస్రవందనము లాచరించుచున్నాను.

నా స్వీయచరిత్రము వ్రాయుమని నన్ను నిర్బంధించిన నేరమునకు నేను (శ్రీ) రాయసము వెంకటశివుడుగారికిని, (శ్రీ) విన్నా అప్పారావుగారికిని ధనదండనము విధించినాను. ఆ జరిమానా వారు నాకు వాయిదాలమీద నెల నెలకు జెల్లించుచున్నారు. గ్రంథమువ్రాయుట ముగిసినను వారు నాకు 1943 వ సం॥ అక్టోబరు వరకు యీ సహాయము జేసిరి. నేరము జేసిన వారికి శిక్ష ననుభవింపక దప్పునా ? ఆ యుదార పురుషుల కిరువురకు నా కృతజ్ఞతాపూర్వ కాశీర్వచనములుచేసి గ్రంథము ముగించుచున్నాను. పరమేశ్వరుడు వారికి, వారి కుటుంబములకు దీర్ఘాయురారోగ్యైశ్వర్యముల నిచ్చుగాక.

కాకరపఱ్ఱు, 12-7-1942<br>చిత్రభాను సం॥ నిజజ్యేష్ఠ<br>బహుళ అమావాస్య భానువారం.

ఇట్లు<br>చిలకమర్తి లక్ష్మీనరసింహం

# స్వీయ చరిత్రము

## మొదటి ప్రకరణము

## బాల్యదశ

నేను జన్మముచేత వైదిక బ్రాహ్మణుడను. వైదికులలో మా శాఖ యారామ ద్రావిడశాఖ. వైదికులలో ద్రావిడశాఖ లనేకములు గలవు. పేరూరు ద్రావిళ్లు, దివిలి ద్రావిళ్లు, పుదూరు ద్రావిళ్లు, ఇప్పగుంట ద్రావిళ్లు, ఆరామద్రావిళ్లు. వీరు నివసించు గ్రామమునుబట్టి కొందరి కా పేళ్లు గలిగినవి. పేరూరు ద్రావిళ్లు మొట్టమొదట పేరూరులో నివసించుటచేతను, కొందరు ద్రావిళ్లు దివిలిలో నివసించుట చేతను, కొందరు పుదూరులో నివసించుటచేతను, మరికొంద రిప్ప గుంటలో నివసించుటచేతను, గ్రామముల పేళ్లనుబట్టి వారివారి కాయా గ్రామముల పేళ్లు గలిగినవి. ఈ ద్రావిళ్లందరు పూర్వకాలమున ద్రవిడదేశ నివాసులు. కొన్ని వందల సంవత్సరముల క్రిందట నేదో కారణమున, నేరాజు ప్రోత్సాహముచేతనో, యాంధ్రదేశమునకు వచ్చి యుందురు. ఐనను వారి ద్రావిడ శబ్దము పోలేదు. కాని వా రాంధ్రులనియే నేటికాలమున వ్యవహరింపబడుచున్నారు. అరవ భాష మాని వారు తెలుగే మాటాడుచున్నారు. కాని కొన్ని యరవ యాచారములుమాత్రము నిలుపుకొని యున్నారు. వెలనాటులు, వేగి నాటులు, తెలగాణ్యులు, కాసలనాటులు, ములికినాటులు మొదలగు తెలుగుదేశ బ్రాహ్మణుల స్త్రీలవలె గాక, పేరూరు ద్రావిడ స్త్రీలు కుడిపైట వేయుదురు. ఇవిగాక మరికొన్ని ద్రావిడాచారము లున్న వని చెప్పుదురు. పేరి నారాయణమూర్తిగారు, గంటి లక్ష్మన్నగారు పేరూరు ద్రావిళ్లు. అల్లాడి కృష్ణస్వామయ్యగారు, వేదము వేంకటరాయశాస్త్రిగారు, వావిళ్ళ రామస్వామిశాస్త్రిగారు, పుదూరు ద్రావిళ్లు. బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు, పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు, ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రిగారు, చర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు మొదలగువారు, మా యారామ ద్రావిళ్లు. ఆరామద్రావిళ్లకు తోటయరవలని యింకొక పేరు గలదు. దక్షిణ

దేశమునుండి మొట్టమొదట వీరు వచ్చినప్పుడు కోటలలో నెక్కువనో నివసించియుందురు. ఆకారణముచేతనే కోటఁవారలని వారు వ్యవహరింపఁబడుచుండిరని తోఁచుచున్నది. ఈ శాఖవారు విశేషముగ నిప్పటి పడమటి గోదావరిమండలములోని కాకరపర్తి గ్రామములో నెక్కువగ నున్నారు. వారిలో ననేకులు గొప్ప పండితులు గలరు. అగ్రహారీకులును గలరు. కూచిమంచి జగ్గకవి వ్రాసిన చంద్రరేఖా విలాపములో, జగ్గకవిచేత నెన్నో తిట్లు దిన్న యానిమళ్ల వెంకట సోమయాజులుగారు, సుప్రసిద్ధ పండితుఁడై సంస్కృతకవియై ముక్కురాలపాడు, బోదుగల్లునను నగ్రహారములను సంపాదించెను. ఆయన సంతతివా రిప్పటికి నా యగ్రహారముల ననుభవించుచున్నారు.

మా యింటిపేరు చిలకమర్తివారు. చిలకమఱ్ఱను పేరుగల గ్రామము తెలుగుదేశమున నెచ్చటనో యుండి యుండును. ఆ గ్రామమును బట్టి మా పూర్వుల కా గ్రామనామ మింటిపేరుగ వచ్చియుండును. ఆ చిలకమఱ్ఱుగ్రామము నిజామురాజ్యములో నున్నదని కొందరు చెప్పుదురు. కాని మా తాతగారి నివాసము ప్రస్తుతము గుంటూరు మండలములో వంగవోలు సమీపమున నున్న మద్దిపాడు. మా తాతగారిపేరు చిలకమర్తి పేరయ్య. ఆయన భార్యపేరు లక్ష్మిదేవమ్మ. ఏ కారణముచేతనో యచ్చమ్మ యని యామెకు రెండవ పేరు గలదు. ఆమె పుట్టిన యూరద్దంకి. మా నాయనమ్మ మిక్కిలి సాహసురాలు, నల్లగ, పొడవుగ నుండెడిది.

ఆమె చిన్నతనములో ననగ 1816 సంవత్సరప్రాంతమునందు, నుత్తరసర్కారులను దోఁచుకొనుటకై పిండారిదండు వచ్చియుండెను. అప్పు డద్దంకిలో జనులు దండునకు జడిసి గ్రామము విడిచి, వలసబోయి, జొన్నచేలలో దాఁగుకొనిరట. మా ముసలమ్మ యున్న చేనులోకి పిండారిదండులోఁజేరిన యొక సైనికుఁడు వచ్చెనట. అప్పు డామె రోకలి దీసుకొని యా దురాత్ముని పొడవబోయెనట. అంత వాఁడు పారిపోయెనట. ఆమె కెన్నో పాటలు వచ్చును. శ్రావ్యముగ పాడుచుండెడిది. నేనామెను బాగుగ నెఱుంగుదును. నాకు పండ్రెండుసంవత్సరములు వచ్చువరకు నామె బ్రతికెను.

ఆ దంపతులకు నిరువురు బిడ్డలు పుట్టిరి. ప్రథమసంతతి కూఁతురు.

ఆమె పేరు సుబ్బమ్మ. రెండవ సంతతి కుమారుడు. ఆయన పేరు వెంకన్న. చిలకమర్తివారు కాశ్యపసగోత్రులు. అశ్వలాయనసూత్రులు. ఋగ్వేదులు. చిలకమఱ్ఱివారు వైష్ణవులలోగూడ గలరు. వారు మొట్టమొదట నారామద్రావిడశాఖలలో చేరిన వైదికులై యుందురు. కొంతకాలము క్రిందట విశిష్టాద్వైతమతముమీద వారి కభిమానము గలుగుటచే చిలకమఱ్ఱివారు శ్రీవైష్ణవులై యుందురు. వారుగూడా కాశ్యపసగోత్రులే. మాకును వారికిని గల భేద మొకటి గలదు. మా యింటిపేరు చిలకమర్తివారు, వారి యింటిపేరు చిలకమఱ్ఱివారు.

1832 వ సంవత్సరమున నాంధ్రదేశమున గొప్ప కఱవు సంభవించినది. అది మిక్కిలి భయంకరమైన కాటకము. అదే నందన సంవత్సరపు కఱవని మన పెద్దలు చెప్పుదురు. ఆ కాటకములో వేలకొలది మనుష్యు లన్నము లేక మృతి నొందిరి. గుంటూరునుండి రాజమహేంద్రవరమువరకు గల బాటలు శవములతో నిండియుండె నని చరిత్రకారులు వ్రాసిరి. ఆ కాటకమునకు మడిమాన్యములు లేని పేరయ్యగారు, సకుటుంబముగా గోదావరి మండలమునకు వచ్చిరి. వారు మొట్టమొదట, ప్రస్తుతము పడమటి గోదావరి జిల్లాలో నున్న మొగలితుర్రు గ్రామములో ప్రవేశించిరి. ఆ కాలమున తహసీల్దారు కచేరీ మున్నగునవి, నేటివలె నరసాపురములోగాక మొగలితుర్రు గ్రామములోనే యుండెనట. పేరయ్యగారి కుమార్తెయు నా మేనత్తయు నైన సుబ్బమ్మగారిని, కొందరు బంధువుల కుట్రచేత, మా శాఖలో చేరిన చామర్తివారు దొంగతనముగ నెత్తుకొనిపోయి, తమ కుమారుడైన రాజన్న యనునతని కిచ్చి వివాహము చేసికొనిరట. వెంటనే మహాకోపముచేత మా పితామహి తన కూతురు మంగళసూత్రము త్రెంపివైచినది. కాని హిందూధర్మశాస్త్రప్రకారము వివాహము దొంగతనముగనైనను రద్దుపడగూడదు గావున, వివాహము స్థిరమైనది. ఆకారణముచేత, మా పితామహుడు మొగలితుర్రు గ్రామము విడిచి, యక్కడికి సమీపమున నున్న వీరవాసరము గ్రామము చేరెను. వీరవాసరమునకు వీరాసనమనిగూడా పేరు గలదు. ఆ గ్రామమున వీరభద్రస్వామి యాలయము గలదు. అందుచేత నా గ్రామమునకు వీరవాసర మని పేరు వచ్చియుండునేమో! వీరాసనము క్రమ

ముగ వీరాసరమై, తరువాత వీరవాసరమై యుండును.

వీరవాసరము సుప్రసిద్ధమైన గ్రామము. పెద్దాడ నాగరాజు గారను మహాకవీశ్వరుడా గ్రామవాసి. ఆయన శకుంతలా పరిణయ మను ప్రబంధము నాంధ్రమున రచించెను. ఈ కావ్యము ప్రౌఢమై సరసమై యున్నది. ఈ గ్రంథమును నాగరాజుగారి మునిమనుమ డును, శ్రీ పోలవరము జమీందారుగారు నైన, శ్రీ రాజా కొచ్చర్ల కోట రామచంద్ర వెంకటకృష్ణారావుగా రచ్చు వేయించి ప్రచురిం చిరి. నాగరాజుగారు పూర్వకాలమున మచిలీపట్టణమున (బందరు) నుండిన ప్రొవిన్షియల్ కోర్టులో వకీలుగా నుండి, చాలమంది జమీందారుల పక్షమున న్యాయవాదిగ నుండి చాల ధనము నార్జిం చిరి. గ్రామమున కొన్ని చెఱువులు త్రవ్వించిరి. ఆయన కుమారుడు పెద్దాడ మల్లిఖార్జునుడుగారు. ఆయన కుమారుడు పెద్దాడ నాగరాజు గారు. ఆ నాగరాజుగారి ప్రథమ భార్యయు, పోలవరము సంస్థానాధి పతియైన జగన్నాధరాయణంగారి భార్య కామాయమ్మగారు, నప్ప చెల్లెండ్రు. నాగరాజుగారి ప్రథమ కళత్రము ప్రసవించి యొక కుమా రుని గని వెంటనే చనిపోయెను. మాతృహీనుడైన యా బాలకుని పెద తల్లియైన శ్రీ కామాయమ్మగారు, సంతానము లేకపోవుటచే పెంచు కొని, బాలకునికి రామచంద్ర వెంకటకృష్ణారావని పేరు పెట్టెను. పెద్దాడ నాగరాజ కవిగారికిని రామచంద్ర వెంకటకృష్ణారావుగారికిని గల సంబంధ మిది.

వీరవాసరము చారిత్రక గ్రామము. తూర్పు ఇండియా కం పెనీవారు, నరసాపురము దగ్గర మాధవాయి పాలెములో వ్యాపారస్థా నము స్థాపించి, బట్టలు మొదలైనవి నేయించి, వాణిజ్యము జరుపు చున్న కాలమున ననగా 18 వ శతాబ్దమున, వీరవాసరము, కంపెనీ వారి వాణిజ్యస్థానమునకు శాఖగా నుండెను. కాలక్రమమున భీమవ రము తాలూకాకు వీరవాసరము కొన్ని సంవత్సరములు ముఖ్యస్థాన మయ్యెను. భీమవరము తాలూకా కచ్చేరీ, పూర్వము భీమవరము నకు సమీపమున నున్న "ఉండి" గ్రామములో నుండెనట. 1815 సంవత్సరమున రామరాజను నొక క్షత్రియుడు, కొందరు రాజులను వెంటబెట్టుకొని, తహసీల్దారుగారి గృహమునకు బోయి, యతని

మీఁద నున్న కసి తీర్చుకొనుటకై యతనిని చంపెనట. చంపి యంతటితో బోక, చిన్న సేన చేరదీసి, పాలకొలను మొదలైన కొన్నిగ్రామములను దోచుకొనెనట. తరువాత గవర్నమెంటువారు వారిని బట్టుకొని శిక్షించి, భీమవరము తాలూకాకచ్చేరి వీరవాసరమునకు మార్చిరట. నాఁడు మొదలుకొని వీరవాసరము తాలూకాకు మధ్యగ లేకపోయినను, 72 సంవత్సరములు ముఖ్యస్థానమై యుండెను. వీరవాసరము తాలూకాకు నడుమ నుండకపోవుటచేతను, భీమవరము తాలూకాకు నడుమనుండుటచేతను, గవర్నమెంటువారుభీమవరములో కచ్చేరీ కట్టించి, 1887 సంవత్సరములో కచ్చేరీ భీమవరము మార్చిరి.

పూర్వము వీరవాసరములో కచ్చేరీ యుండెడి భవనము, తూర్పు ఇండియా కంపెనీవారు సరకులు నిలువజేయు భవనమేమో యని నా యభిప్రాయము. ఏల యన, నా భవనముయొక్క చుట్టు గోడలకు నాలుగుమైపుల నాలుగు బురుజు లుండెడివి. విశేషముగ దొంగ లుండెడి యాకాలమున, కంపెనీవారి సరకులు దొంగలు బందిపోటులు మొదలగువారి పాల బడకుండ, సేవకులు బురుజుల మీఁద నిలుచుండి కాపాడుట కేర్పడినవేమో యని నా యూహ. ఆ భవన మున్నది గాని యా బురుజు లిప్పుడు లేవు. మట్టిక్రింద త్రవ్వుకొనిపోయి పొలములలో బోసుకొనుటకు సర్కారువా రాజ్ఞయిచ్చిరి. ఆ భవనముయొక్క వీధితలుపులు కోటతలుపులవలె మిక్కిలి పెద్దవి. వీధియరుగులుగూడ చాల విశాలములైనవి. వీరవాసరము గ్రామమే గాని పెద్దగ్రామము. రమారమి పదివేల జనసంఖ్య గలది. ప్రతి సోమవారమునాఁడు సంత జరుగును. ఇది నివాసయోగ్యమైన గ్రామము. ఎంత వాన కురిసినను బురద యుండదు. నీటివసతి మిక్కిలి యెక్కువగ నున్నది. దక్షిణమున పీర్లకోడని చిన్న కాలువ గలదు. తక్కిన మూఁడు దిక్కులను చెఱువులు గలవు. తృణకాష్ఠజలసమృద్ధిగల గ్రామము. 1855 వ సంవత్సరమున దొరతనమువా రొక యింగ్లీషు పాఠశాల స్థాపించిరి.

ఆకాలమున వీరవాసరములో రహీముద్దీన్ సాహెబుగా రని మహమ్మదీయు లొకరు తహసీల్దారుగ నుండిరి. ఈయనను గురించి యొక చిత్రకథ గలదు.

వేదవేత్తయైన యొక బ్రాహ్మణుడు శిష్యులకు వేదము జెప్పుచు వీధి వెంట నడిచి పోవుచుండెనట. తహసీలుదారుగారా బ్రాహ్మణుని బిలిచి, ఈ వేదము చెప్పుకొని మీ శిష్యులేమి చేయుదురని యడిగిరట. ఎక్కడనో బిచ్చమెత్తుకొని బ్రతుకుదురని యా బ్రాహ్మణు డుత్తరము చెప్పెనట, "నే మిక్కడ పాఠశాల బెట్టినాముగదా, బాలుర నా పాఠశాలకు బంపక పాడుచేయుచున్నావు. ఇకముందీపని చేయవద్దు. జాగ్రత్త!" యని తహసీల్దారుగారు బెదరించిరట. నాటనుండియు నా బ్రాహ్మణుడు శిష్యులకు వేద మింటనే జెప్పుచు బైట జెప్పుట మానెనట. ఈ కథ నా చిన్నతనములో గొందరు పెద్దలు జెప్పగ వింటిని. ఆ పాఠశాల బోర్డుపాఠశాలయై నేటికిని వర్ధిల్లుచున్నది. గవర్నమెంటువారు పట్టణమైన నరసాపురములో పెట్టక వీరవాసరములో నేల పాఠశాల పెట్టిరో తెలియదు. దొరతనమువారు 1853 సంవత్సరములో రాజమహేంద్రవరమున కళాశాల స్థాపించి, 1855 సంవత్సరమున వీరవాసరములో పాఠశాల స్థాపించిరి. 1885 వ సంవత్సరమువరకు నీ పాఠశాల గవర్నమెంటు పాఠశాలయై, 1886వ సంవత్సరమున బోర్డు పాఠశాలయయ్యెను. నేను జదువుకొన్నదీ పాఠశాలలోనే.

మా తాతగారు వీరవాసరములో వైదికవృత్తివల్ల జీవించిరట. మా తండ్రి చిన్నవయసులో నుండగనే యాయనతండ్రి చనిపోయెనట. గృహముగాని మడిమాన్యములుగాని లేకపోవుటచే, మా పితామహి యాకాలముననున్న తెలుగు చదువు తనకుమారునకు చెప్పించి యా గ్రామముననున్న నియోగుల నాశ్రయించి, కుమారుని గడు గారాబముగ బెంచి వృద్ధిలోనికి దెచ్చెను. మా తండ్రిగారిదస్తూరి మిక్కిలి చక్కనిది. ముత్యాల కోవవలె నుండునని చెప్పుట యతిశయోక్తిగాదు. చిన్నతనమునుండి నియోగుల సహవాసమగుటచేత, మా తండ్రి వైదికవృత్తిమాని, లౌక్యవృత్తిచే యావజ్జీవము కాలక్షేపముజేసెను. ఆగ్రామములో ద్రోణంరాజువారు పెద్దాడవారు నను నియోగులుగలరు. వీరిలో జాలమందిని మా తండ్రి స్నేహముచేత "నేమిరా" యని పిలుచుచుండెను. ఈ నియోగులుతప్ప తక్కినజనులు మమ్ము నియోగులని భావించెడివారుగాని, వైదికులని యెంచెడివారు

గారు. మా తండ్రి వీరవాసరములో గృహము సంపాదించెను.

తణుకు తాలూకాలోని ఖండవల్లి గ్రామములో నాకాలమున నొక పండితుడుండెను. ఆయనపేరు పురాణపండ భద్రయ్యశాస్త్రి గారు. ఆయన సంస్కృతాంధ్రములలో నిరుపమానమైన పాండిత్యముగలిగి, పురాణము చెప్పుటలో మంచి నేర్పుగలిగి, గొప్ప పౌరాణికుడని పేరుగాంచి, పురాణము చెప్పియు, రాజుల గృహములలో పురోహితుడయ్యు, కుటుంబ సంరక్షణము చేసికొనుచుండెను. ఆయన గ్రుడ్డివాడు. జాత్యంధుడుకాడు. కొంతకాలము జరిగిన తరువాతనే యంధత్వము వచ్చినదట. ఆయన కైదుగురు కూతులు, నొక కుమారుడు గలిగిరి. ఆ కుమారుడే పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు. భద్రయ్యశాస్త్రిగారి ప్రథమ పుత్రికను, మా తండ్రికి సన్నిహిత జ్ఞాతియైన చిలకమర్తి వెంకటశాస్త్రిగారు, వివాహమాడిరి. ఆ వెంకటశాస్త్రిగారు గొప్ప సంస్కృత పండితుడు. గొప్ప తర్కవేత్త. తన పాండిత్య ప్రభావముచేత ననేక స్థలములలో సన్మానముపొంది కుండలములు శాలువలు సంపాదించెను. భద్రయ్యశాస్త్రిగారికి రెండవ కుమార్తెయగు వెంకటరత్నమ్మగారి కొరకై, బంధువులు సంబంధముకొరకు వెదకుచుండగ, చిలకమర్తి వెంకటశాస్త్రిగారు మామగారికి నచ్చజెప్పి, తన మరదలైన వెంకటరత్నమ్మగారిని, తనకు దగ్గరదాయాదియైన మా తండ్రిగారి కిప్పించి వివాహము చేయించిరి. గృహము కట్టుటచేతనేగాక వివాహము చేసికొనుటచేతగూడ మా తండ్రిగారు నిజముగ గృహస్థులైరి.

మా తల్లికి మొట్టమొదట నొక కుమార్తెగలిగెను. తరువాత గూడ కుమార్తెయే గలిగెను. పిమ్మట నేను పుట్టితిని. మాతల్లి సంతానములో నేను మూడవబిడ్డను. నాచిన్నతనమందే మా పెద్దప్ప గారైన లచ్చమ్మ మృతినొందెను. నేను ప్రభవ సంవత్సర భాద్రపద బహుళ చతుర్దశినాటి రాత్రి మొదటిభాగమున జన్మించితినని, నా మేనమామగారు చెప్పుచుండెడివారు. ఇంగ్లీషు తారీఖుల ప్రకారము 1867వ సంవత్సరమున సెప్టెంబరు నెల 26 వ తారీఖున, ఖండవల్లి గ్రామములో మా మేనమామగారియింట జన్మించితిని. నాది పుబ్బ నక్షత్రము. నాకొక మేనత్త చామర్తి సుబ్బమ్మగారనునామె యుండె

వని చెప్పితిని. ఆమెకొక కుమార్తెయు నొక కుమారుఁడునుండిరి. భర్తపోయినతరువాత బిడ్డలు నామె యుండఁగానే మృతినొందిరి. ఆమె కూతురుపేరు పున్నమ్మ. ఆ పున్నమ్మ ప్రసవించి మృతినొందెను. నేను పుట్టినదినములలో నామె మాతల్లికి స్వప్నమందు గనఁబడి తన పేరుపెట్టుమని కోరెనఁట. అందుచేత మా మాతామహియు మొదలగు బంధువులు పున్నయ్యయని నాకు నామధేయముచేసిరి. ఊరక యట్లు పిలిచిరిగాని నాకు నామకరణ జాతకరణోత్సవములు జరుగలేదు. మూఁడు నెలలు వయసు వచ్చినతరువాత నన్ను నా మాతామహి మా తల్లితోఁ జీరవాసరము పంపించెను. మా మేనత్త సంతానము పోయినతరువాత మాయింటనే యుండెను. తనకూతురు స్వప్నములో మా తల్లికి గనపడి పేరుపెట్టుమని కోరినదన్నమాట, మా మేనత్త కిష్టములేకపోయెను. అందుచేత మాతండ్రియు, మా మేనత్తయు మా పితామహియు నాలోచించి, పున్నయ్య యను పేరు దీసివైచి, మాకు సమీపమందున్న యంతర్వేదిలో వేంచేసియున్న శ్రీ లక్ష్మీనరసింహస్వామివారి పేరు నాకు పెట్టిరి. నాటనుండియు నేను కొంతకాలము లక్ష్మీనరసయ్యయనియు, నిటీవల లక్ష్మీనరసింహమనియు, నామధేయములతో వ్యవహరింపఁబడుచుంటిని. ఇప్పుడు లక్ష్మీనరసింహమనియే నన్ను లోకులుపిలుచుచుందురు. కాని నా చిన్నతనములో మా మాతామహుని బంధువులందరు పున్నయ్యయనియే బిలుచుచువచ్చిరి. మా మాతామహుఁడైన భద్రయ్యశాస్త్రిగారు, 1866వ సంవత్సరమునకు సరియైన యక్షయ సంవత్సరములో మృతినొందిరి. నేను గర్భములోనున్నప్పుడు మాతల్లి తన తండ్రిని నిరంతరము తలచుకొనుటచేతనో, మరెందుచేతనో నేను మా మాతామహుని యాకారముతోనే పుట్టితినని మా పెద్దలు చెప్పుచువచ్చిరి. నా బక్కపలుచని శరీరము, నా కంఠస్వరము, నా మేనిపొడవు, సరిగ మా మాతామహుని పోలియుండెనని, మాతల్లియు పినతల్లులు చెప్పుచు వచ్చిరి. నాకు నా మాతామహుని పాండిత్యమంత గొప్ప పాండిత్యము లేకపోయినను, రవ్వంత కవిత్వధోరణియు నంధత్వమును సిద్ధించినవి. భద్రయ్యశాస్త్రిగారు చక్కని తెలుఁగుకవిత్వము చెప్పగలవారు. నా యంధత్వము మిక్కిలి చిన్నతనమందేయుండెనో

నేనెఱుగను గాని, నాకు జ్ఞానమువచ్చినతరువాత రాత్రులు స్వేచ్ఛముగ నడచుటకుగాని చదువుటకుగాని వీలులేకపోయినదని యెఱుగుదును. పగలుగూడ చీకటిలోనున్న వస్తువులు స్పష్టముగ కనబడెడివి కావు. పాఠశాలలో నల్లబల్లమీద వేసిన యంకెలు సులభముగ కనబడెడివికావు. దేశపటములలో పట్టణములు మొదలైనవి చూపుమని యడిగినప్పుడు, నాకవి సులభముగ గనబడెడివికావు. మిత్రులతో గలిసి బంతియాట యాడుకొన్నపుడు నేను బంతి బట్టుకొనలేకపోయెడివాడను. ఇట్లు నేను నలువదిసంవత్సరములు వచ్చువరకు పగలు స్వేచ్ఛగ సంచారము చేసితిని. పాఠములు పగలే చదువుకొనుచుంటిని. రాత్రులెన్నడు చదువుకొనుటలేదు. పాఠములు చదువవలసినప్పుడు మిత్రులచే జదివించుకొని వినుచుండెడివాడను. పగలు గ్రామంలో సంచరించుటకును, బడికి వెళ్ళుటకును, పగలు వ్రాసుకొనుటకును చదువుకొనుటకును, వీలుండెనుగాని. రాత్రులుమాత్రము పరసహాయము కావలసివచ్చెను. ఈవిధముగ 1909 వ సంవత్సరమువరకు జరిగెను. ఆ సంవత్సరమున నేనొకనాడు నా మనోరమా ముద్రాక్షరశాలకు బోవుచుండగ నొక యావుమీద బడితిని. అప్పటినుండియు నేను స్వయముగ ప్రయాణములు చేయగూడదని నిశ్చయించుకొని, పగలుకూడ పరసహాయముచేతనే తిరుగుచుంటిని. 1909 సంవత్సరము వరకు రాత్రులు దీపము, చంద్రబింబము, పెద్దపెద్ద నక్షత్రములు, పగలు సూర్యబింబము నాకు కనబడెడివి. కొన్నాళ్లు వెన్నెలలో రాత్రులు నడవగలిగి యుంటిని. చీకటిరాత్రులలో ముందు దీపము పోవుచున్నయెడల దానివెనుక నేను వెళ్ళగలిగియుంటిని. 1910 వ సంవత్సరము నుండి యీ లక్షణములు గూడ పోయినవి.

నా చిన్నతనమందు మా యింట, మాతండ్రిగారికి పినతల్లి కుమారుడైన వరదా కుటుంబము గారను నొక యువకుడు వచ్చి యుండెను. ఆయన నివాసస్థాన మద్దంకివద్దనున్న కాకానిపాలెము. అది కుగ్రామము. ఆయన కక్కడ మడిమాన్యము లేమియు లేవు. ఆకారణమున దన తల్లిని వెంటబెట్టుకొని యాయన మాయింట జేరెను. మాతండ్రిగారు సంపాదించిన భూముల నతడు సేద్యము చేయించుచుండెను. ఆ కుటుంబముగారి కప్పటికి వివాహముకాలేదు.

ఆయన ఘోటకబ్రహ్మచారియై యుండుటచేత, నాయన తల్లియు, మా పితామహియు, మా మేనత్తయు నెట్లయిన వివాహము చేయింపు మని మాతండ్రిని ప్రోత్సాహపరచిరి. కుటుంబముగారు నిర్ధనులు. అడిదము సూరకవిగారు చెప్పినట్లు, "మాన్యములు సామాన్యములు, భూములు రుద్రభూములు" గల కుటుంబముగారికి రమ్మని పిలిచి పిల్ల నెవరిత్తురు ? ఆయన నల్లగ నుండెడివాడు. శరీరముమీద దట్టమైన తామర యుండెడిది. మాపితామహియు, మా మేనత్తయు, కుటుం బముగారి వివాహము నిమిత్తమై యొక పన్నుగడ పన్నిరి. నాకంటె పెద్ద పిల్ల యొకర్తె యుండెనని చెప్పితిని. ఆమె పేరు సుబ్బమ్మ. ఆమె కప్పుడు రమారమి తొమ్మిది లేక పదిసంవత్సరములు వయసుండెను. ఆమె నెవరికైన నిచ్చి కిరాయింపుమీద కుటుంబముగారికి వివా హము చేయుమని, మాతండ్రిగారిని, మా పితామహియు నా మేన త్తయు బలవంతము జేసి యొడంబరచిరి.

ఆకాలమున తణుకు తాలూకాలోని మంచిలి గ్రామములో నొక గృహస్థుండెను. ఆయనపేరు పోదిలి రాయప్పగారు. ఆయ నను రాయప్పావధానులుగారని లోకులు వ్యవహరించుచుండెడివారు. ఆయన మొదటి భార్య మృతినొందెను. ఆమె మృతినొందునప్పటి కామెకు ముగ్గురు కొమార్తెలు నొక కుమారుడును గలరు. ప్రథమ పుత్రిక కప్పటికే వివాహమయ్యెను. ద్వితీయ పుత్రికపేరు పల్లాలమ్మ. ఆమెకు వివాహము కాలేదు. ఆ రాయప్పావధానులుగారు తన రెండవ వివాహమునకై ప్రయత్నము చేయబొచ్చిరి. మనదేశములో ముఖ్యముగ, కోమటి బ్రాహ్మణులలో మొదటి కళత్రము పోయి నప్పుడు, రెండవ పెండ్లి చేసికొనుటకు నెంతె వయస్సుగలవారైన సందేహింపరుగదా ! పిల్లనిచ్చుటకు గృహస్థుడు గూడ సందేహింపక, సిగ్గుపడక ధనమున కాసపడియో, కిరాయింపు పెండ్లికో, బంధువుల ప్రేరణకో, లొంగి తమకూతును ముసలిదయ్యముల కిచ్చి పెండ్లిచేసి బలియిత్తురుగదా ! రాయప్పగా రప్పటికి నలుబది సంవత్సరములు దాటి యేబదియవ పడిలో బ్రవేశించిరి. ఆయన లావుగనుండెడివారు. శుద్ధవైదికుడు. స్మార్తము బాగుగ జదువుకొని షోడశకర్మలు నసర్గళ ముగ జేయింపగల ప్రజ్ఞగలవారు. ఆయన పునహా సతారాలుగూడ

వెళ్ళి ధనమార్జించిరని చెప్పుకొనిరి. మా పెద్దయప్ప లచ్చమ్మ యంతకుముందే మృతినొందుటచేత, మాచిన్నప్ప సుబ్బమ్మను రాయప్పగారి కిచ్చి వివాహముచేయునట్లును, రాయప్పగారి రెండవ కుమార్తెయైన పళ్ళాలమ్మను మా కుటుంబము బాబుగారికిచ్చి వివాహము చేయునట్లును, వివాహము తిరుపతిలో చేయునట్లును మా పెద్దలు నిశ్చయించిరి. కుటుంబముగారి తల్లి మాతండ్రికి పినతల్లి యగుటచే నామె పోరుచేతను, నాపితామహి యొక్కయు నామేనత్తయొక్కయు ప్రోత్సాహముచేతను, నెట్లయిన దిక్కులేనివాని నొకనిని గృహస్థుని జేయుట పుణ్యమని తలంచుట చేతను, మా తండ్రి యీ యనుచిత కార్యమున కొప్పుకొనెను. ఈ విచిత్రవివాహము, నెనుకటి యాంగీరస సంవత్సరములో ననగా 1872 వ సంవత్సరమున జరిగెను. నేనప్పటి కైదుసంవత్సరముల వయస్సువాడను. పనిలో పనియని యీ పెండ్లితోపాటు మా తండ్రి నాకుపనయనముకూడ తిరుపతిలో చేయ నిశ్చయించెను. నా తరువాత నాలుగేండ్లకు నాతమ్ముడు కృష్ణమూర్తి జన్మించెను. ఈ వివాహమువిషయమున మా తండ్రి మా మేనమామతోగాని, మా మాతామహితోగాని, తక్కిన బంధువులతోగాని యాలోచింపలేదు. వారికీవివాహమిష్టములేకపోవుటచేతనో, మాతండ్రివారితో నాలోచింపక పోవుటచేతనో, మా తల్లివంక చుట్టములెవ్వరును యీ వివాహమునకు రాలేదు. ఆ వివాహములును నా యుపనయనమును ద్వారకా తిరుమలయను పేరుగల చిన్న తిరుపతిలో జరిగెను. వీరవాసరము నుండి బండ్లమీద తాడేపల్లి గూడెము వెళ్ళి, యక్కడనుండి పెదతాడేపల్లి వెళ్ళి, క్రమముగ భీమడోలువెళ్ళి, మేము తిరుపతి జేరితిమి. మా తల్లికి మా పెదతల్లికి మా పినతల్లులకు బండియెక్కిన పక్షమున వికారము పుట్టి వాంతులు వెళ్ళునట్టి రోగముకలదు. ఆరోగము మా తల్లికి విశేషముగ కలదు. బండెక్కి బాధపడుట కిష్టములేక, పాప మా యిల్లాలు, వీరవాసరము నుండి తిరుపతి వరకు మేమందరము బండ్లెక్కినను, నామె మాత్రము బహుకష్టపడి నడచియే వచ్చెను. ఆ వివాహకాలమున తన కూతురును ముసలివానికి గట్టిపెట్టుటచేతనో, మరెందుచేతనో, మాతల్లి కంటతడిబెట్టెనట. అందుచేత మా మేనత్తయు మాపితామహియు

మాతల్లిపైన సలిగిరట. తన చుట్టములెవ్వరు వివాహమునకు రాలే దని విచారపడితినని మాతల్లి వారికి ప్రత్యుత్తరమిచ్చెనట. అప్పుడు నాకేగాక నా యీడువాడైన రాయప్పావధానిగారి కుమారుడు లక్ష్మయ్యకుగూడ నుపనయనమయ్యెను. రాయప్పావధానిగారు మా యిరువురకును సంధ్యావందనము జెప్పిరి. స్మార్తములో రాయప్ప గారు గొప్ప ప్రజ్ఞగల వారగుటచే, మాకు ఋగ్వేద సంధ్యావంద నము గూడ చెప్పగలిగిరి. కాని మా యప్ప సుబ్బమ్మ మిక్కిలి యదృష్టవంతురాలని చెప్పవచ్చును. ముసలి మగనిని గట్టుకొని సవతి బిడ్డలతో గాపురము జేయనక్కర లేకుండ, బాల్యమున వైధవ్యదుఃఖ మనుభవింప నక్కర లేకుండ, నామె త్వరలోనే మృతినొంది సవతిని జేరుకొనెను. వివాహమయిన నెలదినములో, రెండు నెలలో గడచిన తరువాత, యాకస్మికముగ జ్వరము తగిలి, తగిలిన యైదుదినముల లోనే యామె మృతినొందెను.

మా యింటిప్రక్క నొక నియోగి స్త్రీ యుండెను. ఆమె పేరు పెద్దాడ నరసమ్మ. ఆమె బాలవితంతువు. ఆమె దొడ్డిలో నేవియో మొక్కలు వేసి వాటికి నీరుపోయుమని మా యప్పను బలవంత పెట్టెను. మా మేనత్తకునూ, నరసమ్మకును మిక్కిలి స్నేహము. అందుచేత నామెయు మావాండ్రును నొక కుటుంబములోని వారు గనే యుండెడివారు. ఆ గాఢమైత్రిచేతనే, యామె మా యింటి వివాహోపనయనములకు మా... తిరుపతి గూడ వచ్చెను. ఆమె బొందిలీలనుండి యీ యిల్లు క్రయమునకు దీసుకొనెను. ఆమె కొనక ముందాయింటిలో నొక పుణ్య స్త్రీ మృతినొందెను. మా యప్ప మొక్కలకు నీరుబోయుచు నా దొడ్డిలో జడుసుకొనెనట! వెంటనే జ్వరమువచ్చినదట! ఆమెకు జ్వరము తగిలిన మూడవనాడు సంధిం చెను. పేలాపన హెచ్చిపోయెను. ఆసన్నిపాతములో, చనిపోయిన బొందిలీ స్త్రీ స్తంభముమీద గూర్చుండి, నిమ్మపండు చేతపట్టుకొని, తన్ను పిలుచుచున్నదని పలవరించుచుండెడిది. ఐదవనాటి రాత్రి కాబోలు నామె మృతినొందినది. పాపము రాయప్పావధానులుగారికి వివాహ సుఖము లేదు. సరిగదా, త్వరలోనే ద్వితీయకళత్రమునకు శ్రాద్ధకర్మ చేసుకొన వలసిన యోగముపట్టెను. ఈ వివాహమున

కాబ్దికమే యాయనకు ఫలమయ్యెను. ఆయనకేగాదు, ఆయనకుమారుడు లక్ష్మయ్యకుగాడ, తనతల్లి యాబ్దికముతో పాటు సవతి తల్లి యాబ్దికముగూడ, ప్రతి సంవత్సరము పెట్టవలసిన వాడయ్యెను. రాయప్పావధానిగారు తరువాత కొన్ని సంవత్సరములకు మృతి నొందిరి.

మా తండ్రి నన్ను గొప్ప కర్మిష్ఠిని చేయవలెనని సంకల్పము కలిగి యుండెను. ఆ కోరికతో నాయన నాకు గట్టిగా సంధ్యావందనము జెప్పింపదలచుకొనిరి. మా తండ్రికి సంధ్యావందనము వచ్చును. కాని నాకు జెప్పుటకాయన కెంతమాత్రము తీరుబడి లేదు. ఆయన సంవత్సరమున కారుమాసములు తాలూకాకచ్చేరిలో నమీనా యుద్యోగము జేయుచుండెడివారు. తక్కినకాలములో శాక్యవృత్తి నవలంబించుటచే కవుల్లు, కదపాలు, దస్తావేజులు, గ్రామవాసులకు వ్రాసిపెట్టుచుండెడివారు. దస్తూరి మంచిదగుటచే తరుచుగా రైతులు మొదలయినవారాయననే వ్రాతకు బిలుచుచుండెడివారు. ఆయన వ్రాసిన కాగితము లిప్పటికిని మా తమ్మునివద్ద గొన్ని కలవు. ఆయన తాటియాకులమీద గూడ బాగుగ వ్రాయగలవారు. నాకు గాని, మా తమ్మునకుగాని, తాటియాకుమీద వ్రాత యలవడినదిగాదు. నేను ప్రతిదినము త్రికాలములయందు యథావిధిగా సంధ్యావందనముచేసి, నిష్ఠతో నుండవలెనని మా తండ్రి యభిప్రాయము. అందుకు సంధ్యావందనము నేర్చుకొనుటకై నన్ను మా మాతామహీస్థలమైన ఖండవల్లి గ్రామమునకు మా తండ్రిగారు పంపిరి. అప్పుడు మా మేనమామగారు ఖండవల్లిలో లేరు. ఆ దినములలో నాయన విజయనగరములో సంస్కృత విద్యాభ్యాసము చేయుచుండిరి.

నేను ఖండవల్లిలో గొంతకాలముంటిని. సవితాల సుబ్బారాయుడుగారని యొక బ్రాహ్మణోత్తముడు నాకు సంధ్యావందనము చెప్పెను. చిన్నవాడనగుటచే నేనంత శ్రద్ధగా నేర్చుకొనలేదు. కాని నేనప్పుడొక తప్పుజేసితిని. ఆయూరిలో నే నొక మంగలికుర్రవానితో నాడుకొనుచుంటిని. అప్పుడప్పుడు నేనతనికి గాయత్రిమంత్రము చెప్పుచువచ్చితిని. ఒకనాడు నేను మంగలికుర్రవానికి గాయత్రిమం

త్రము చెప్పమండగా సవితాల సుబ్బారాయుడుగారాదారిని వెళ్లుచు వినిరి. ఆయనకు వెంటనే కోపమువచ్చెను. ఆయన తరువాత మా మాతామహునికడకు బోయి జరిగినసంగతి జెప్పి "కొంచము పెద్దవాడయినప్పుడు గాని మీ పిల్లవానికి సంధ్యావందనము జెప్పగూడదు. ప్రస్తుతము వీరవాసరము పంపించవలసిన"దని చెప్పిరి.

తరువాత నేను ఖండవల్లి గ్రామమువదలి సంధ్యావందనము నేర్చుకొనుటకై మా పెదతల్లిగారి గ్రామమైన వెలగదుఱ్ఱు వెళ్ళితిని. ఆయూరిలోనుండి, యచటికి సమీప గ్రామమైన తాడిపఱ్ఱులో ఋగ్వేద సంధ్యావందనము చెప్పగలవారుండుటచేత ప్రతిదినము నేను తాడిపఱ్ఱు వెళ్లుచుంటిని. ఇది చిరకాలము పొసగినదిగాదు.

పిమ్మట నేను మంచిలి గ్రామము వెళ్ళవలసివచ్చెను. అక్కడ మా పినతల్లియు, నామె పెనిమిటియు నుండిరి. మా పినతండ్రికి యజుర్వేద సంధ్యావందనముగాని, ఋగ్వేద సంధ్యావందనముగాని రాదు. మంచిలిలో నున్నప్పుడు నే నొక వీధిపాఠశాలకు వెళ్లుచుంటని. ఆ పాఠశాల కరణముగారి నావడిలో నుండెను. సోమంచి సుబ్బారాయుడుగా రని యొక పంతు లుండెను. ఆయన నాకు తాటియాకులమీద వరవడిపెట్టి నాచేత వ్రాయింపప్రయత్నించెను. ఆయన యెంత యత్నము జేసినను, నే నెంత కష్టపడినను, నాకు గంటము పట్టుకొనుటయే చేతనైనది గాదు. అక్కడ నే నుండుట యన్నివిధముల వ్యర్థమయినది. తరువాత నేను వీరవాసరము వెళ్ళితిని. ఆయూరి సమీపమున మత్స్యపురియను నొక గ్రామము కలదు. అది నరసాపురము తాలూకాలోనిది. ఆ యూరిలో చిలకమర్తి కుటుంబములు మూడు గలవు. వారు మువ్వురు మాకు దగ్గరజ్ఞాతులే. అం దొకరు చిలకమర్తి నరసింహశాస్త్రిగారు. ఆయన సంస్కృత కావ్యములు జదువుకొనిరి. ఆయన తెనుగులోను సంస్కృతములోను కవిత్వముకూడ చెప్పగలిగి యుండిరి.

ఆయన స్మార్తకర్మలుగూడ చేయింపగలరు. సంధ్యావందనము నిమిత్తము మా తండ్రి నన్నా గ్రామములో వారి యింట విడిచెను. నేను వారి యింట కొన్ని మాసము లుండి త్రికాల సంధ్యావందనములు క్షుణ్ణముగ నేర్చుకొంటిని. పిమ్మట నేను మరల వీరవాసరము

నేర్పితిని. సంధ్యావందనము చక్కగా వచ్చినందున నేను సంపూర్ణ ముగ నుత్సాహముగలిగి, యుదయమున మొగమునందును చేతుల మీదను కడుపుమీదను విభూతి పెండికట్లు పెట్టుకొని, బహుశ్రద్ధతో మూడుపూటల సంధ్యావందనము చేయుచుంటిని. అప్పుడు మా యూరిలోనున్న నెలిచేటివారిబడిలో జదువుకొనుచుంటిని. నెలిచేటి రామప్పగారు, భద్రాచలముగారు నను నిద్దరన్నదమ్ములు బడిపెట్టిరి. ఆబడిలో నేను జేరితిని. వారు నాకు ప్రథమగురువులు. తరువాత నేను సోమంచి నరసయ్యగారి బడిలో జేరితిని. అక్కడ నున్నప్పుడు నేను గిలకలు బట్టితిని. గిలకల పద్యములు గంభీరమైన కంఠముతో శ్రావ్య ముగ జదువనేర్చితినని మా పంతులుగారు నన్ను చాల మెచ్చుచుం డిరి. ఆకాలమున మా మేనమామగారు మల్లయ్యశాస్త్రిగారు విజయ నగరములో విద్యాభ్యాసముచేసి స్వదేశమువచ్చిరి. ఆయన యుద్యో గమునకై ప్రయత్నముచేసి బెజవాడలో నొక బంధువుండుటచే వానిని జూడబోయిరి. అప్పుడు బెజవాడలో వేదంత్రపు వెంకటాచలం పంతులుగారు తహసీల్దారుగ నుండిరి. మల్లయ్యశాస్త్రిగారి కాయన పరిచయ మాయెను. వెంకటాచలము పంతులుగారు విద్యాభిమా నము గలవారు. పండిత పక్షపాతి. ఆదినములలో బెజవాడలో హారి సన్‌గారను క్రైస్తవ మతబోధకుడుండెను. వెంకటాచలము పంతులు గారును క్రైస్తవుడే. ఏదేని యొక యుద్యోగమును శాస్త్రిగారి కిప్పింపుమని పంతులుగారు, దొరగారికి సిఫారసు జేసిరి.

బెజవాడకు సమీపమందున్న కొండపల్లి గ్రామములో మిషనునారి పాఠశాల యొకటి యుండెను. దానిమీద పెత్తనమం తయు దొరగారిది. దొరగారు శాస్త్రిగారికా పాఠశాలలో తెనుగు పండితుని పనియిచ్చెను. ఆ పాఠశాలలో ముగ్గురే యుపాధ్యాయులు. ఒకరింగ్లీషు చెప్పుటకును, మరియొక పర్షియాభాష చెప్పుటకును, శాస్త్రి గారు తెనుగుచెప్పుటకును నిర్ణయింపబడిరి. శాస్త్రిగారు కొండపల్లి వెళ్ళునప్పుడే పదినిమిది సంవత్సరములు వయస్సుగల నన్నుగూడ దీసి కొనిపోయిరి, కొండపల్లిలో నేను కొంతకాలముంటిని. ఊరి చివర నొక కొండమీద నా పాఠశాలయుండెను. పాఠశాలకు నేనును మా మేనమామగారును నడచి పోవుచుంటిమి. ఆ యూరిలో బ్రహ్మమేడి

డొంకలు మెండు. అదిగాక పాముల సంచార మెక్కువగ నుండెను. ఒకనాఁడు మా మాతామహి నిద్రపోవుచుండగ నామె శరీరముమీఁద నుండి యొక త్రాచుపాము ప్రాకి వెళ్లెను. మెలకువ వచ్చినను సర్పము కరచునేమో యను భయమున కదలక మెదలక యూర కుండెను. అక్కడ మహమ్మదీయులు మెండుగనుండిరి. పట్టణము నందు వలెనే యచ్చట బజారును కొట్లును గలవు. నేను మొట్ట మొదట సౌటాకు, చటాకు, సవాసేరు మొదలగు శబ్దములచ్చటనే వింటిని. కొండపల్లి వెళ్లకమునుపు మేము బెజవాడలో కొన్నాళ్లుం టిమి. అప్పుడే నేను మొట్టమొదట పర్వతములు జూచితిని. కృష్ణానది గూడ నేనప్పుడే మొట్టమొదటిసారి జూచితిని. కొండపల్లినీరు నాకు గాని మా మేనమామగారికి గాని సరిపడలేదు. ఆయన వ్యాధిగ్రస్తు డయ్యెను. నేనును జబ్బుపడితిని. మా మేనమామగారికి విభవ సంవ త్సరమునందు మత్స్యపురిలోనున్న మా చిలకమర్తివారి యాఁడుపడు చునే యిచ్చి వివాహము జేసిరి. మేము కొండపల్లిలో నుండగా యాయనభార్య కాపురమునకు రాలేదు. కావున మా మేనమామయు మా మాతామహియు నేనును ముగ్గురము మాత్రమే యక్కడ నుం టిమి. మహమ్మదీయుడగు పంతులుగారి సహవాసమున మా మేన మామగారు హిందూస్థానీగూడ మాటాడగలిగిరి. అసమానమైన పాండిత్యము మంచిబోధనశక్తియు నుండుటచే మా మేనమామగారు గ్రామస్థుల యొక్కయు, విద్యార్థులయొక్కయు మెప్పుబడసిరి. అయి నను రోగపీడితులగుటచేత శాస్త్రిగారా యూరు విడువవలసి వచ్చెను. కొండపల్లి లక్కబొమ్మలకు చాల ప్రసిద్ధి. అక్కడనుండి మేము బయలుదేరునప్పుడు కొందఱు ముచ్చివారు శాస్త్రిగారి కొక లక్క పెట్టెయు, లక్క దానిమ్మచెట్టును చేసి బహుమానమిచ్చిరి. శాస్త్రి గారు ఖండవల్లి వెళ్లిరి. నేను వీరవాసరము వెళ్లితిని.

జబ్బు నెమ్మదించిన తరువాత శాస్త్రిగారు మరల తణుకు తాలూకాలోని మొయ్యేరు గ్రామములో నుపాధ్యాయపదవి సంపా దించిరి. అక్కడ నాలుగేండ్లుండిరి. ఆకాలమున సంజీవరావు పం తులుగారని యొకమాధ్వుడు పాఠశాలా పరీక్షకుడుగా (Dy. Ins- pector of Schools) నుండెను. ఆయనకు సంస్కృతములో గొంత

పాండిత్యము గలదు. అందుచేత శాస్త్రిగారిమీద నభిమానము గలిగి యాపదవి నిప్పించిరి.

అప్పటి పాఠశాలా పరీక్షకుల సంగతి కొంచెము వ్రాయుట యవసరము. ఇప్పటివలె జిల్లాకొక యధికారి లేడు. నాలుగుజిల్లాల కొక పరీక్షాధికారి (Inspector of Schcols) యుండెడివాడు. ఆయన మకాము విశాఖపట్టణము. ఆయనాంగ్లేయుడు. జిల్లాకు నిద్దరు ముగ్గురు డిప్యూటీ యినస్పెక్టరులు మాత్రముండిరి. తూర్పుగోదావరి జిల్లాయు, పడమటి గోదావరిజిల్లాయు గలసి యప్పుడొకటే జిల్లాగా నుండెను. జిల్లాకంతకు నిద్దరే డిప్యూటీ యినస్పెక్టర్లు. రాజమహేంద్రవరము తాలూకా, అమలాపురము పెద్దాపురము రామచంద్రపురము కాకినాడ తాలూకాలు, పిఠాపురము తుని డివిజనులు కలసి, యొక డిప్యూటీ యినస్పెక్టరుగారి యధికారమందుండెను. ఆఖండమునకా కాలమున శ్రోవి దక్షిణామూర్తిశాస్త్రిగారు పాఠశాలా పరీక్షాధికారిగ (Dy. Inspector of Schools) నుండిరి. రెండవ ఖండమున కనగా ఏలూరు, ఎర్రగూడెము, తణుకు, నరసాపురము, భీమవరము తాలూకాలకు నొక డిప్యూటీ ఇనస్పెక్టరుగారుండిరి. ఆయనే కళానిధి సంజీవరావు పంతులుగారు. ఆకాలమున పాఠశాలలు విశేషముగ లేకపోవుటచేతను, విద్యావ్యాప్తి తక్కువగ నుండుట చేతను, పరీక్షాధికారులుగూడా తక్కువగ నుండిరి.

1874 వ సంవత్సరములో ననగా శ్రీముఖసంవత్సరమున, మార్గశిర మాసముననో పుష్యమాసముననో, నామేనత్త చామర్తి సుబ్బమ్మ మృతినొందెను. ఆమెకు కొన్నియేండ్లక్రిందట నెలుక కఱచినందున నాజంతువు విషము జీర్ణించి చనిపోవువరకు నామెను బాధ పెట్టెను. పున్నమికి నమావాస్యకు బాధకలుగుచుండెను. ఆ కారణమున నామె యకాలముననే తల్లియుండగ మృతినొందెను. ఆమెకు సంతానము లేకపోవుటచే మృతినొందక మునుపు మరణశాసనము వ్రాయించి దన యాస్తినంతయు మాతండ్రిగారి కిచ్చివేసెను. వివాదములు లేకుండుటకై యీ మరణశాసనము రిజిష్టరు చేయించెను. అప్పుడు రిజిష్ట్రారులులేరు. తాలూకా తహసీల్‌దారో సిరస్తదారో కాగితములు రిజిష్టరు చేయుచు వచ్చిరి. మా మేనత్తకు మొగలితు

రుస్తిలో విశాలమైన స్థలము పెంకుటిల్లు నుండెను. అదిగాక యిత్తడి సామానులు కొయ్యసామానులు విశేషముగ నుండెను. ఆయాస్తి మాకు సంక్రమించినందున మా యిల్లు సామానులతో నిండిపోయెను. మా తండ్రిగారు బంధుగులకు మిత్రులకు నెన్నో మంచములు మొదలైన సామానులు యిచ్చివేసిరి. మా మేనత్తగారియిల్లు మా తండ్రిగారు తరువాత కొంతకాలమునకు విక్రయించిరి.

నేను కొండపల్లి నుండి వచ్చినతరువాత సోమంచి సరవయ్యగారి పాఠశాలలోనే మరల జదివితిని. అక్కడ చదువు ముగియగానే 1878 వ సంవత్సరములో నేను వీరవాసరములోని దొరతనమువారి పాఠశాలలో మొదటితరగతిలో జేరితిని. అది యూరిచివర పడమర దిక్కుగ నుండెడిది. అది గడ్డియిల్లు, మట్టిగోడలు. నేనక్కడ జేరు నప్పటికా గృహము శిథిలమై యుండెను. ఆ పాఠశాలకు ప్రధానోపాధ్యాయు లప్పుడు చెన్నాప్రగడ లక్ష్మీనరసయ్యగారు. ఈయన యింగ్లీషులో ప్రవేశపరీక్షయందు కృతార్థులగుటయేగాక సంస్కృతాంధ్రములలో గూడ మంచి పాండిత్యము గలిగియుండిరి. తెనుగులో జక్కని కవిత్వము జెప్పగలరు. గవర్నమెంటువారికి మొన్న మొన్నటి వరకు ట్రాన్స్లేటరుగ నుండిన చెన్నాప్రగడ భానుమూర్తిగారికి ఈయన సాక్షాత్తు పెదతండ్రి కుమారుడు.

లక్ష్మీనరసయ్యగారు చదువుచెప్పించుటకై తనతో గూడ భానుమూర్తిగారిని వీరవాసరము దీసికొనివచ్చిరి. భానుమూర్తిగారును నేనును ఒకపాఠశాలలోనే జదువుకొనుటచేత మా కిరువురకును స్నేహభావ మేర్పడెను. తరువాత నేమిరువురము చెరియొక యూరులో నున్నను భానుమూర్తిగారి కిప్పటికి నాయెడ నత్యంతస్నేహము, ప్రేమయు గలవు. భానుమూర్తిగా రుభయభాషలయందు ప్రవీణులు. ఇంగ్లీషునందు బి. ఏ. పరీక్షయం దుత్తీర్ణులైనవారు. విశేషించి బ్రహ్మజ్ఞానసంపన్నులు. భూతదయాళువు, నుదారశీలుడు, సుగుణపుంజమై యాంధ్రదేశమున కొక యలంకారమయ్యెనని జెప్పవచ్చును. అదృష్టవశమున నీయ నిప్పటికి నారోగ్యముగ నున్నారు. ఈయన కవిత్వము ధారాళమైనది. ఈయనకుమారుడు సుబ్బారావుగారిప్పుడు రాజమహేంద్రవరములో వైద్యులైయుండి, పితృ మిత్రు

డైన నాకు, నా కుటుంబమునకు, వైద్యసహాయము చేయుచున్నారు.

దొరతనమువారి పాఠశాలలో బాలుడు గిలకలుపట్టరు. అక్కడ చదువుచున్నను మా తొల్లిటి యుపాధ్యాయుడైన సోమంచి సరవయ్యగారి ప్రేరణముచేత గిలకలు పట్టవలసినవాడనైతిని. నేను గిలకల పద్యములు శ్రావ్యముగ జదువగలుగుటచే, నన్ను దీసుకొని వెళ్ళిన యెడల నెక్కువ డబ్బు తనకు వచ్చునను నాసచే, మా తండ్రిగారిని బ్రతిమాలి నన్నొడంబరచి, సరవయ్యగారు, దొరతనమువారి పాఠశాలలో విద్యార్థినైన నన్నుగూడ వెంటబెట్టుకొని, భాగ్యవంతులగు గృహస్థుల యిండ్లకు దీసుకొనిపోయి పద్యములు చదివించుచుండెను.

మా మేనత్త మరణానంతరమున మాకొక చెల్లెలు పుట్టెను. నేను పుట్టినపుడు స్వప్నములో గనబడినట్లే మాతల్లికి పురిటిలో మా మేనత్తకూతురు పున్నమ్మ కలలోకనబడి పేరుపెట్టమని కోరెనట. అప్పటికి మా మేనత్త లేదుగనుక మా తండ్రిగూడ మా చెల్లెలికి పున్నమ్మగారిపేరు పెట్టుట కొప్పుకొనెను. అందుచేత నామె యన్నపూర్ణమ్మయనియు పున్నమ్మయనియు వ్యవహరింపబడుచున్నది. ఈమె వివాహవిషయమై యిచ్చట గొంత చెప్పవలసియున్నది. మా తల్లిదండ్రులకు మొదటిబిడ్డయైన లచ్చమ్మయనుపిల్ల వివాహము కాకుండగనే చనిపోయినది. రెండవ పిల్లయైన సుబ్బమ్మ పొడిలి రాయప్పావధానులుగారిని వివాహమాడి కొలదికాలముననే మృతినొందెనని యీవరకే చెప్పితిని గదా! కాబట్టి యాడుపిల్ల పున్నమ్మయొక్కతెయే యుండెను. రమారమి పదిసంవత్సరములు పెంచి పెండ్లి చేసినపిల్ల పెండ్లికాగానే పోవుటచేతను, పెద్దపిల్ల పెండ్లి కాకుండగనే మృతినొందుటచేతను, పున్నమ్మకు చిన్నతనమందే పెండ్లి చేసిన పక్షమున చిరకాలము జీవించునని మా పితామహికిని, మా తండ్రికిని నమ్మిక గలిగెను. మొగలితుఱ్ఱు గ్రామములో మాకు సన్నిహిత జ్ఞాతులైన చిలకమర్తి పుల్లయ్యగారుండిరి. అయన జీవించియుండగనే పెద్దకుమార్తె ప్రసవించి యొక కుమారునిగని మృతినొందెను. ఆ దౌహిత్రుడు పుల్లయ్యగారి యింటనే పెరుగుచుండెను. ఆతనికి రమారమి పదునెనిమిది సంవత్సరములు వచ్చినతరువాత వివాహముచేయ నిశ్చయించిరి. అతని యింటిపేరద్దంకివారు. అతనిపేరు వెంకటరామయ్యగారు. ఆయన

తండ్రిపేరు కృష్ణమ్మగారు. పుల్లయ్యగారికి నరసాపురము కోర్టులో స్టాంపు వెండరుపని యుండెడిది. తల్లి లేని పిల్లవాడుగదాయని పుల్లయ్య గారు వేంకటరామయ్యగారికి యీపని వేయించిరి. వేంకటరామయ్య గారు నరసాపురములోనుండి యీపని జూచుచుండిరి. పుల్లయ్యగారు మా చెల్లెలు పున్నమ్మను వేంకటరామయ్యగారికిచ్చి వివాహము చేయుమని మా తండ్రిగారికి వర్తమానమంపిరి. బాల్యముననే కూతు నకు వివాహము చేయవలెనన్న మా తండ్రిగారికా రాయబారము సంతోషదాయక మయ్యెను. ధాతసంవత్సరములో ననగా 1877వ సం వత్సరములో; మా చెల్లెలు పున్నమ్మకు మూడుసంవత్సరముల వయ స్సులో మా స్వగృహమున వివాహము జరిగెను. కాని మిక్కిలి చిన్న పిల్లయగుటచే మా చెల్లెలు పెండ్లిపల్లకిలో గూర్చుండక మారము జేసెను. అందుచేత మాతండ్రిగారు పల్లకిలో పెండ్లికుమారుని కెదు రుగ నన్ను గూర్చుండబెట్టి, మా చెల్లెలిని నా యొడిలో గూర్చుండ బెట్టుచు వచ్చిరి. మా చెల్లెలితోబాటు నేనుగూడ నైదు దినములు నూరేగితిని. అతి బాల్యవివాహములలో నిటువంటి వైచిత్ర్యములు తరుచుగా జరుగుచుండునుగదా! అప్పటికి నాకు పది సంవత్సరముల వయస్సు. వంకాయలపాటినుండి వేంకటరామయ్యగారి సవతితల్లియు మొదలయినవారనేక బంధువులు మా పున్నమ్మ పెండ్లికి మా యిం టికి వచ్చిరి. ఆసంవత్సరము గొప్ప కరవైనను మా పొలములు బాగుగపండుటచే నేకొరతయు లేకుండ వివాహము బాగుగజరిగెను. చిలకమర్తి పుల్లయ్యగారు దౌహిత్రునకు నుద్యోగమిప్పించుటయేగాక మొగలితుర్రు సివారు గ్రామమైన సేరిగపాలెములో గొంతభూమి గూడ నిచ్చిరి. పుల్లయ్యగారు ధనము, భూమియు సంపాదించిరి. పుల్లయ్యగారు జీవించియుండగనే యాయన యేక పుత్రుడు చనిపో యెను. ఆకుమారునకొక కుమారుడుండెను. పుల్లయ్యగారు కొంత భూమి దౌహిత్రునకిచ్చి తక్కిన భూమియు రెండు పెరకుటి యిండ్లను తన పౌత్రుడైన లింగమూర్తిగారి కిచ్చిరి. లింగమూర్తిగారు నాకంటె కొంచము పెద్దవారు. దైవానుగ్రహమున నాతడిప్పటికిని జీవించి యున్నాడు.

పున్నమ్మ వివాహములో బాల్య చాపల్యముచేత నేనును లింగ

మూర్తిగారును, మా జ్ఞాతియైన మఱొకపిల్లవాఁడును, నొక తెలివి తక్కువపని జేసితిమి. మా యూరికి పడమటి వైపున ఎల్లమ్మ చెరువని యొక తటాకము గలదు. మేము మువ్వురము వస్త్రములు విసర్జించి వాటిని గట్టుమీఁద బెట్టి చెరువులో జలక్రీడ లారంభించితిమి. మేమా గొడవలోనుండగా వస్త్రము లెవ్వరో దొంగిలించుకొనిపోయెను. కట్టుకొనుటకు గుడ్డలులేక దేసమొలలతో సిగ్గుపడుచు సందుల గొందుల దారిబట్టి యింటికివచ్చి పెద్దలచే దిట్టముగ జీవాట్లుతింటిమి.

మా పాఠశాల మట్టిగోడలతో గట్టబడి యావరు గట్టికప్పు గలిగి కొన్నిచోట్ల పెద్దపెద్ద రంధ్రములుపడి శీర్ణస్థితిలో నుండుటచే, నచ్చట పాఠశాలనుంచుట యుచితముగాదని పైయధికారుల సెలవు పొంది, గ్రామమధ్యమున నొకయిల్లు నద్దెకుపుచ్చుకొని, ప్రధానోపాధ్యాయులైన లక్ష్మీనరసయ్యగారు బడి నచ్చోటికి మార్చిరి. బాలు రూరిచివరకు బోనక్కరలేక యూరినడుమనేయున్న పాఠశాలకు బోయి సుఖించిరి. ఆకాలమున మా పాఠశాలలో రెండవ యుపాధ్యాయుడు బ్రహ్మశ్రీ ఆదిభట్ల సాంబమూర్తిగారు. మూడవ ఉపాధ్యాయుడు నేను బడిలో జేరునప్పటికి చిలకలపూడి రామస్వామిగారు. నేను వెళ్ళినకొలదికాలముననే యాయన మఱొకచోటికి మార్చబడిరి. ఆయన స్థానమందు మూడవ యుపాధ్యాయుడుగ ఆచంట వెంకటాచలపతిగారు నియమింపబడిరి. ఈయన డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారి పినతండ్రిగారు. ఈయన యొకటి రెండు తరగతులకు బాఠము చెప్పుచుండెడివారు. నేను 1879 వ సంవత్సరములో రెండవతరగతి జదివితిని. నేను పాఠములు జక్కగ చదువుకొని యుపాధ్యాయుల మెప్పుబడయుచుంటినిగాని గణితమునందు నాకభిరుచి లేదు. 1880 వ సంవత్సరమున మూడవతరగతిలో జేరితిని. అది యిప్పటి మొదటి ఫారమునకు సరియైన తరగతి. ఈ తరగతికి మోరల్‌క్లాసుబుక్కను పేరుగల నింగ్లీషు పాఠపుస్తకముండెను. అది మిక్కిలి మంచిపుస్తకము. అందులో రమారమి యాబదిపుటలు మూడవ తరగతికిని నూరుపుటలవరకు పై తరగతికిని పాఠ్యములుగ నేర్పరచిరి. అటువంటి పుస్తక మిటీవల క్రిందితరగతులకు నియమింప బడనేలేదు. ఆకాలమున మొదటితరగతికి దొరతనమువారు రచ్చవేయించిన తెలుగు

పుస్తకమును, వారిచేతనే ప్రకటింపబడిన "Madras Reader" (మెడ్రాస్ రీడర్) అను నింగ్లీషుపుస్తకమును చెన్నపురిరాజధాని భూగోళమును, శేషయ్య వ్యాకరణమును, హిందూదేశచరిత్రములో నారధ్యాయములును, పఠనీయములై యుండెను. రాజమహేంద్రవర ములో కొంతకాలము మండల న్యాయాధిపతిగా (District Judge) నున్న మారిసుదొరగారింగ్లీషులో నొక హిందూదేశచరిత్రము వ్రాసిరి. ఆ చరిత్రమునకు దొరతనమువారు తెలుగు వ్రాయించి పండ్రెండధ్యాయములుగల గ్రంథముగ ప్రకటించిరి. అది నాలుగవ మైసూరు యుద్ధములో ననగా టిప్పుసుల్తాను మరణములో సమాప్తమయ్యెను. అందు మొదటి యారధ్యాయములు మొదటితరగతికిని, దక్కిన యారధ్యాయములు, రెండవతరగతికిని బఠనీయములుగ నేర్పడినవి. రెండవ తరగతికిగూడ గవర్నమెంటువారే తెలుగువాచకమును, రెండవ మెడ్రాసు రీడరును ప్రకటించిరి. అవే మేము జదువుచుంటిమి. అప్పుడు జిమ్నాస్టిక్సు, డ్రిల్లు మొదలైనవి లేవు. మేము రెండవతరగతి జదువుచుండగనే దొరతనమువారు ప్రయిమరీపరీక్ష స్థాపించిరి. అదే తరువాత అప్పర్ప్రైమరీ పరీక్షగ మారెను. అందు కృతార్థులైనవారు నార్మలు స్కూలులో ననగా ట్రయినింగుస్కూలులో జేరుట కధికారముండెను. ఆ కాలమున నరసాపురమున నొక నార్మలు స్కూలును, రాజమహేంద్రవరములో నొక నార్మలుస్కూలు నుండెను. అప్పుడు హయ్యరెలిమెంటరీ గ్రేడనియు, లోయరుగ్రేడనియు భేదములులేవు. తరువాతనే యీ మార్పులు వచ్చెను. రెండవ తరగతి పరీక్షలో నేను కృతార్థుడనై మూడవతరగతిలో 1880 వ సంవత్సరమున జేరితిని. ఈ తరగతిలో మారిసుదొరగారు చేసిన యింగ్లీషు వ్యాకరణముగూడ మేము జదువవలసివచ్చెను.

ఆ 1879 సంవత్సరములోనే మా పితామహి మృతినొందెను. ఆమె మరణమునకు ముందు నాలుగుమాసములో మూడుమాసములో మంచమెక్కెను. మా తండ్రిగారు మొదటినుండియు మాతృభక్తి విశేషముగ గలవారు. ఆమె యేదికోరిన నది చేసెడివారు. వరదాకుటుంబముగారి వివాహముగూడ నామె ప్రోత్సాహముచేతనే జేయబడినది. మా తండ్రిగా రామెకు చేసిన యుపచారము వర్ణనా

తీతము. చిన్నతనమున తనతండ్రి మృతినొందిన నాటనుండి బంధు
సహాయము లేకపోయినను, నిల్లు వాకిలి మడిమాన్యములు లేకపోయి
నను, మిక్కిలి శ్రమపడి పెంచి విద్యాబుద్ధులు చెప్పించి తన్నొక
యింటివానిని తనతల్లియే జేసినదని, మా తండ్రిగారు మిక్కిలి కృత
జ్ఞులై, యామె నఖండగౌరవముతోను ప్రేమతోను జూచి ముప్పొ
గడపిరి. ఆమె నవసానస్థితిలో క్రిందపడవైచిరి. ప్రాణము చాలసేపు
వరకు పోలేదు అప్పుడు మా తండ్రిగారు నీళ్ళలో కొన్ని తులసీ
దళములు వేసి యుద్ధరిణెతో నాతులసితీర్థము నాచేత నామెనోటిలో
బోయించిరి. ఆమె బహుధాన్యసంవత్సర కార్తికపూర్ణిమనాటి యుద
యమున మృతినొందెను. ఆదినముననే మా గురువైన సోమంచి సర
వయ్యగారు కూడ మృతినొందిరి. ఆయన తండ్రికొక్కడే పుత్రుడు.
వివాహముకూడ నయ్యెను. మాయూరిలో సోమంచివారి కుటుంబ
ములైదారు గలవు. మాపితామహీ శ్రాద్ధమునకు మా తండ్రిగారు
సోమంచివారి పిల్లలను భోక్తలుగ బిలిచిరి. "మా సరవయ్యగారి
శ్రాద్ధమునకు మీా పెద్దపిల్లవానిని భోక్తగ బంపితిమేని మా పిల్లలను
మీాయింటికి బంపెదమని," సోమంచివారు కొందరు మాతండ్రిగా
రితో జెప్పిరి. మేము వైదికవృత్తిలో లేకపోయినను, తల్లి శ్రాద్ధము
నకు భోక్తలు దొరకరేమో యను భయమున, మా తండ్రిగారు
నన్ను బలవంతపెట్టి షోడశ బ్రాహ్మణార్థమునకు బంపిరి. విధిలేక
నేను వెళ్ళవలసివచ్చినది.

ధాత సంవత్సరపు క్షామమునకు, నెల్లూరు మండలమునుండి
మా బంధువులు రెండు కుటుంబముల వారక్కడ యన్నవస్త్రములు
జరుగక వీరవాసరమువచ్చి యచ్చట కాపురముండిరి. అందొక
కుటుంబమువారు అక్కాపంతుల నరసయ్యగారు. వారద్దంకి సీమలోని
సోమవరప్పాడునుండి వచ్చిరి. ఆయనభార్య మాతండ్రిగారికి పిన
తల్లి కూతురు. అనగా వరదాకుటుంబముగారి యప్పగారు. రెండవ
కుటుంబము వారు మధునాపంతుల కాలభైరవశాస్త్రిగారు. ఆయ
నయు నద్దంకిసీమలోని మేదరమెట్టనుండివచ్చిరి. ఆయన భార్య,
మత్స్యపురి గ్రామములో నుండి నాకు మున్ను సంధ్యావందనము
నేర్పిన చిలకమర్తి నరసింహశాస్త్రిగారి యప్పగారు.నరసయ్యగారును

కాలభైరవశాస్త్రిగారును బహుకుటుంబీకులు. నరసయ్యగారు యాయా
వారముచేసి కుటుంబపోషణము జేసికొనుచుండెడివారు. కాలభైరవ
శాస్త్రిగారు మిక్కిలి వృద్ధులై సంచారము జేయుటకు సమర్థులు గాక
పోవుటచే జ్యేష్ఠకుమారుడు చుట్టుప్రక్కల గ్రామములలో యాయా
వారము చేసి తలిదండ్రులను తమ్ములను చెల్లెండ్రను బోషించుచుం
డెను, వారి యింట మరణములు వచ్చినప్పుడుగూడ మాతలిదండ్రుల
బలవంతము చేత నేను వారి యిండ్లకు శ్రాద్ధభోక్తగా వెళ్ళవలసి
వచ్చెడిది.

1860 వ సంవత్సరమున నేను మూడవతరగతిలో (నన గా
నిప్పటి ఫస్టుఫారములో) చేరగానే, మా తల్లిదండ్రులు నరసాపురము
నకు సమీపమందున్న, యంతర్వేదియాత్రకు బోదలచిరి. మాబడికి
ప్రధానోపాధ్యాయులైన చెన్నాప్రగడ లక్ష్మీనరసయ్యగారు, నేను
మా జననీ జనకులతో వెళ్లుటకెంత కుతూహలపడినను నాకు శలవిచ్చి
నారుగారు. అందుచేత మా తలిదండ్రులు, భోజనమునకై నన్నొక
పేదబ్రాహ్మణులయింట నప్పగించి కావలసిన సరకులు వారికిచ్చి
యాత్రకుబోయిరి. అంతర్వేదిక్షేత్రము నే నంతకు మున్నొకటి రెండు
సారులును, తరువాత నొకసారియు జూచితిని. అచ్చట లక్ష్మీనరసింహ
స్వామివారు ప్రధానదేవత, నీలకంఠేశ్వరస్వామి యను శివుడు క్షేత్ర
పాలకుడు, గుఱ్ఱాలక్క గ్రామదేవత. నరసాపురమునుండియు, యితర
స్థలములనుండియు, వేలకొలది యాత్రికులు మాఘశుద్ధ దశమినాటి
కిచ్చటికి జేరుదురు. ఆరాత్రియే నరసింహస్వామివారి కళ్యాణము.
ఆ తిరునాళ్లు నాలుగుదినములు జరుగును. తీర్థవాసులు గోదావరి
స్నానము, సాగరసంగస్నానముజేసి, స్వామిని సేవించి పోవుచుం
దురు. గౌతమి యంతర్వేది దగ్గరనే సముద్రములో గలియును.

నేను మూడవతరగతి జదువుచున్నప్పుడు గణితములో మిక్కిలి
వెనుకబడియుంటిని. తెలుగులోను నింగ్లీషులోను దేశచరిత్రములోను
భూగోళములోను ప్రజ్ఞావంతుడనేగాని గణితములో సమర్థత తక్కువ.
దీనికి రెండుకారణములు. నాకు గణితములో సహజముగ నభిరుచి
లేకపోవుట యొకటి. నా దృష్టిదోషము రెండవ కారణము. ఉపాధ్యా
యులు నల్లబల్లమీద వేసెడు యంకెలు నాకు గనబడెడివికావు.

ఈరెండు కారణములచేత నేను గణితములో మిక్కిలి వెనకబడియుం డెడివాడను. ఆచంట వెంకటాచలపతిగారు మూడవతరగతికి గణితము నేర్పుచుండిరి. ఆయన మిక్కిలి కోపస్వభావులు. లెక్కలు తప్పినప్పు డెల్ల నన్నాయన బెత్తముతో దండించుచుండెను. ఒకసారి యీ పంతులుగారు కోపించి, లెక్కతప్పినందుకు రెండు చేతులమీద నన్ను యిరువది దెబ్బలకంటె నెక్కువగా కొట్టిరని, నాకుజ్ఞాపకము. అప్పుడు నాకు పదమూడేండ్ల వయసు. ఎలాగో నొకలాగు సంవత్స రాంతమున మూడవతరగతి పరీక్షయందు కృతార్థుడనై నాలుగవ తరగతికి వెళ్ళితిని. మూడవతరగతివరకు దేశచరిత్రము భూగోళము గణితము తెనుగులో నేర్పుచుండిరిగాని, నాలుగవ తరగతినుండి తెలుగువాచకములుతప్ప తక్కిన వింగ్లీషు భాషలోనే నేర్పుచుండిరి. నాలుగవతరగతి యిప్పటి రెండవ ఫారముకు (II nd form) సమా నము. అప్పుడు దానికి (Lower fourth class) లోవరు ఫోర్తు తర గతియని పేరు. దానికి మోరలుక్లాసు పుస్తకములో నూరు పుటలును, మాన్యూలు గ్రామరను పేరుగల యింగ్లీషు వ్యాకరణమును, మారిసు దొరగా రింగ్లీషులో వ్రాసిన హిందూదేశ చరిత్రలో కొన్ని యధ్యా యములును, యింగ్లాండు దేశచరిత్రములో కొంతభాగమును, క్లయిర్ దొరగారుచేసిన ప్రపంచభూగోళములో నాసియాఖండమును, డంకన్ దొరగారు వ్రాసిన హిందూదేశ భూగోళములో గొంతభాగమును, యూక్లిడుచేసిన రేఖాగణితములో పదునారు ప్రమేయములును, నాలుగవతరగతి బాలురు జదువవలసి యుండెను. అవి యన్నియు నింగ్లీషులోనే జదువవలసి యుండెను. తెలుగులో భారతమందలి నలోపాఖ్యానమున నేబది పద్యములవరకు మూడవ తరగతిలోను, నూరుపద్యములవరకు నాలుగవ తరగతిలోను,జదివి యప్పగింపవలెను.

నేను మూడవతరగతిలో నుండగనే చెన్నాప్రగడ లక్ష్మీనర సయ్యగారికి వీరవాసరమునుండి బదిలీయయ్యెను. ఆయన స్థానమం దనకాపల్లినుండి పూడిపెద్ది మహాదేవము పంతులుగారు వచ్చియుం డిరి. ఆయన రమారమి పాతిక సంవత్సరములు వయసుగలవారు. మిక్కిలి చురుకుగలవారు. చెన్నాప్రగడ లక్ష్మీనరసయ్యగారు వీరవా సరమునుండి వెళ్ళిన తరువాత, నమలాపురము హైస్కూలులో

సహోపాధ్యాయులుగ నుండి, పెద్ద తరగతులకుగూడ భాషాంతరీ కరణము మున్నగునవి నేర్పుచు, విద్యార్థులచేతను పురజనులచేతను గౌరవింపబడుచు, చాలకాలము బనిజేసి యుపకారవేతనము పొంది, పిమ్మట కొంతకాలమునకు మృతినొందిరి. ఈయన నాకు మిక్కిలి పూజ్యులు, చిరస్మరణీయులు. లక్ష్మీనరసయ్యగారి స్థానమున వచ్చిన క్రొత్త ప్రధానోపాధ్యాయులు మహాదేవముగారు మిక్కిలి చాకచక్య ముగలవారు, గట్టి బోధనశక్తి గలవారు. లోవరుఫోర్తు తరగతిలో మాకీయన యన్నిపాఠములు జెప్పుచుండెడివారు. ఇంగ్లీషు మిక్కిలి శ్రద్ధతోను నిపుణతతోను జెప్పిరి. ఆయన వేసినపునాది నాకు ప్రవేశ పరీక్షయందు కృతార్థుడనైనదాక నుపకరించెను.

ఆ దినములలో నుత్తరసర్కారులకు పాఠశాలాపరీక్షకులుగా నలెగ్జాండరు మన్రోదొరగారుండిరి. నాకేటేట వచ్చి మా పాఠశా లను పరీక్షించుచుండిరి. 1881 వ సంవత్సరమున దొరగారు వచ్చు నప్పటికి నేను తరగతిలో మొదటివాడనై మానేటరుగ నుంటిని. ఆయన నన్ను పరీక్షించి నాకొక పుస్తకమును బహుమతిగ నిచ్చిరి. అదియొక యింగ్లీషు నిఘంటువు. పూర్వకాలము పరీక్షాధికారులు బహుమానమిచ్చుటకై దొరతనమువారు ప్రత్యేకముగ గొన్ని పుస్త కముల సిద్ధముచేయుచుండిరి. అవి దట్టమైన కాలికోఅట్టగలిగి, యట్టల మీద బంగారపుటక్షరములు గలిగి, మిక్కిలి మనోహరముగ నుండె డివి. నాకిచ్చిన పుస్తకముగూడ నట్టిదే. ఆ బహుమానముతో నేను మిక్కిలి తెలివిగలవాడనని యూరంత జెప్పుకొననారంభించితి. మా తల్లిదండ్రులయానందమునకు మితియే లేదు. మాపాఠశాలలో మూడవ యుపాధ్యాయుడుగ నుండిన యాచంట వేంకటాచలపతిగారి స్థానమున ఉచ్చు శ్రీరాములుగారనువారు వచ్చిరి. ఆయన కొన్నిమాసములుం డిరి. ఈ శ్రీరాములుగారు పిమ్మట రాజమహేంద్రవరములో ట్రయి నింగుస్కూలులో చిరకాలము పనిచేసి పింఛను పుచ్చుకొని యిటీవ లనే మృతినొందిరి. ఆయన స్థానమునందు దువ్వూరి సుబ్బరాయుడు గారు వచ్చిరి. ఈయన కొంతకాలము పనిజేసి, తరువాత కోర్టులో గుమాస్తాగాజేరి యీ పట్టణమందలి కోర్టులోగూడ పనిజేసి, యిటీ వలనే మృతినొందిరి. ఇంగ్లీషుపాఠము మొదలైనవి నాకుపాధ్యాయులు

చెప్పగానే వచ్చెడివి. నాకు జ్ఞాపకశక్తి మెండు. ఇప్పుడు నాకు డెబ్బది యేడు సంవత్సరములున్నను శరీరశక్తులు చాల తగ్గినవిగాని జ్ఞాపకశక్తి తగ్గలేదు. ఇది దైవానుగ్రహము. నా కైదవయేడు వచ్చినది మొదలుకొని జరిగిన సంగతులు చాలవరకు నాకిప్పటికిని జ్ఞాపకమున్నవి. ఆ కారణమున నాకన్న మందమతులైన బాలురు నాకడకు వచ్చి యింగ్లీషుపాఠములు మొదలైనవి నేర్చుకొనుచుండిరి. విసుగుకొనక నేను వారికి జెప్పుచుండెడివాడను. అందుకు వారు కృతజ్ఞులై నాకు కానీ, రెండుకానులు బహుమానమిచ్చుచుండిరి. ఆ డబ్బులు నేను సొంతముగ వాడుకొనక నాకు మిక్కిలి ప్రేమాస్పదురాలైన మా తల్లికిచ్చుచుండెడివాడను. మా తండ్రివలెనే నాకును మాతృభక్తి విశేషమని జెప్పుట యతిశయోక్తిగాదు.

ఇచ్చట మాతల్లిని గురించి కొంత చెప్పవలసియున్నది. ఆమె కోడరికపుబాధ మిక్కిలిపడెను. మా పితామహి మిక్కిలి కోపస్వభావురాలు. ఆమెచేత మాయమ్మ పడినబాధలనేకములు. మాతండ్రి గూడ మాయమ్మయెడ కఠినముగనే ప్రవర్తించెను. అప్పుడప్పుడు మాయమ్మను మాతండ్రి గొట్టుటజూచి నే నేడ్చెడివాడను. మా యమ్మ గర్భవతియై చుట్టుప్రక్కల నూతులకుబోయి నీళ్లుదెచ్చి, చెరువునకుబోయి యంట్లుదోముకొని, మంచినీళ్లుదెచ్చి, ధాన్యము గూడ దంపుకొనవలసినదయ్యెను. ఆమె కష్టములు మా తండ్రిగాని, మా పితామహిగాని కనిపెట్టెడివారుగారు. మా మేనత్త మాత్రము మాతల్లియెడ నించుక దయగ నుండెడిది. మా తండ్రి బిడ్డల యెడల మిక్కిలి దయగనుండెడివాడు గాని కఠినముగనుండెడివాడు గాడు. కొందరు తండ్రులవలె జీటికిమాటికి బిడ్డలగొట్టుటలేదు. ఒకటి రెండు సారులు మాత్రము నన్నాయన స్వల్పముగ శిక్షించెను. ఒకసారి పాఠశాలలో నెవడో యొక బాలుడు నా పుస్తక మొకటి దొంగిలించెను. వానిపేరు దెలియలేదు. వాడు పట్టుబడలేదు. కోడిగుడ్డు దెచ్చి భూమిలో పాతిపెట్టిన యెడల దొంగిలించినవాని కడుపుబ్బునని నాకెవరో జెప్పిరి. బాలుడనైన నాకామాటలు నచ్చినందున, నాతరగతిలో చదువుచున్న యొక చాకలి కుర్రవాని యింటికి, నేను గ్రుడ్డు నిమిత్తము వెళ్ళితిని. అది నాకప్పుడు లభింపలేదు గాని, తిరిగి నేనింటికి

వచ్చుచుండగా నాతండ్రిగారు కనబడి చాకలిగూడెములోనికి ఎందుకు వెళ్ళితివని, నన్ను నిర్బంధించి యడిగెను. నేను నిజము చెప్పితిని. వెంటనే యాయన కోపించి "నీవు బ్రాహ్మణుడవు, కోడిగ్రుడ్లు నిమిత్తము చాకలివాని యింటికి వెళ్ళితివా! గాడిదా!" యని చిన్న బెత్తముతో నన్ను దండించెను.

ఇచ్చట మా తండ్రిని గురించి కొన్ని మాటలు చెప్పవలెను. ఆయన మొత్తముమీద సాధుశీలుడు. సంగీతము గూడ పాడగలరు. దేవుడూరేగునప్పుడు పల్లకితో గూడ నడచివెళ్ళి భజనలు చేసెడివారు. ఆయన మావీధి నొక రామమందిరము నెలకొల్పి, చుట్టుప్రక్కల కాపులచేత ప్రతి రాత్రి భజనలు చేయించుచుండెడివారు. వీరవాసరములో నొక సత్రము కట్టించవలెనని యాయన ప్రయత్నించిరిగాని యది సాగలేదు ఆయన యిల్లు వాకిలి సంపాదించుటయే గాక, నాలుగెకరముల ఈనాము భూమియు, నాలుగెకరముల జిరాయితీభూమియు, మా యింటికి రమారమి రెండువందల గజముల దూరమున దక్షిణపువైపున గొంతస్థలముతో గూడిన యిల్లును, సంపాదించి యా యింటి ఖాళీస్థలములో నొక గాదెగూడ కట్టిరి. మాపొలములో బండిన ధాన్యమా గాదెలో బోసెడివారు. నా చిన్నతనములో మాకు జాల పశువులుండెడివి. ఆ పశువులన్నియు నా గాదె దొడ్డిలోనే యుండెడివి. ఈ పశువుల పేడయంతయు మా యమ్మయే జేసి పిడకలు తయారుజేయవలెను. మా తండ్రిగారి ప్రయోజకత్వమున మాకు నా చిన్నతనమున కావలసినంత పాడియు, పంటయు గలిగి యుండెడిది.

మా తండ్రికి జాలమంది తహసీల్దారులు స్నేహముగ నుండెడివారు. అందు ముఖ్యులు పత్రి సుబ్బారావు పంతులుగారు. ఆయన మా యింటి యెదుటనే కాపురముండెడివారు. ఆయన చాల మంచివారని ప్రజలు చెప్పుకొనుచుండెడివారు. ఆయన మనుమలిప్పుడు రాజమహేంద్రవరములో నున్నారు. ఆయన న్యాపతి సుబ్బారావు పంతులుగారి తల్లికి మేనమామ. ఆయన ప్రోత్సాహముచేతనే,న్యాపతి సుబ్బారావుపంతులుగారు,రాజమహేంద్రవరములో 1879వ సంవత్సరమున న్యాయవాదిగ బ్రవేశించిరి.మాతండ్రిగారిస్నేహితులలో రెండవ

వారు బెన్నూరి నారాయణరావు పంతులుగారు. ఈయన కరణకమ్మ వ్యాపారులు. మూడవ తహసీల్‌దారుగారు కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు. వీరిలో శ్రీ పత్రి సుబ్బారావు పంతులుగారు మా తండ్రిని మిక్కిలి యాదరించి పని చెప్పించిరి. వెంకటనారాయణరావు పంతులుగారి దగ్గర మా తండ్రికి మిక్కిలి చనువు. ఆయన తన యింటి పెత్తనమంతయు మా తండ్రిమీదనే వదలిపెట్టెను. శ్రీ గురజాడ పట్టాభిరామయ్యగారుకూడ మా తండ్రికి మిత్రులుగానే యుండిరి. వీరవాసరములో పనిజేసిన తహసీల్‌దారులలో శ్రీ పట్టాభిరామయ్యగారే కట్టకడపటివారు. ఈయన కాలములోనే తాలూకా కచేరి వీరవాసరమునుండి భీమవరమునకు మార్చబడెను.

మా తండ్రి బంధుప్రియుడు. పరోపకార పరాయణుడు. ఇందుకొక్క యుదాహరణము జెప్పెదను. శ్రీ పత్రి సుబ్బారావు పంతులుగారు పింఛను పుచ్చుకొని వెళ్ళిపోయిన తరువాత, వారి రెండవ యల్లుడు సర్వపతి పురుషోత్తము పంతులుగారు, విషూచి వ్యాధిచే తగిలి మా యింటిప్రక్క నున్న యింటిలో మృతినొందిరి. ఆయన కాపురమున్న యింటివారు మాధ్వులైనను శవదహనము విషయమై వారేమియు ప్రయత్నము చేయలేదు. గ్రామములోని యితర మాధ్వులుగాని, స్మార్తులుగాని, విషూచి యంటురోగమని భయపడి శవము దగ్గరకు రాలేదు. ఆయన మామగారు పత్రి సుబ్బారావుగారా యూరిలోనున్న పక్షమున శవమును మోయుట కెవరో వచ్చియుందురు. పురుషోత్తము పంతులుగారు పోయిన మూడవ రోజున మా తండ్రియు, మా పురోహితులైన చిలుకూరి వెంకయ్యగారును నిర్భయముగ శవమునుమోసి దహనముచేసిరి. ఈ విధముగ మా తండ్రి బంధుమిత్రుల గృహములలో ననేక శవములు మోసెను. అనాథ ప్రేత సంస్కారమాయనకు మిక్కిలి యిష్టమైన కార్యము. నెల్లూరు నుండి వచ్చి మాయూర కాపురమున్న మా చుట్టముల గృహములలో నేకష్టసుఖములు వచ్చినను మా తల్లిదండ్రులు నడుముకట్టుకొని పనిచేసెడివారు.

నేను చదువుచున్న తరగతికి 1880-1881 సంవత్సరములలో దొరతనమువారు క్రొత్తగా నొకపరీక్ష పెట్టిరి. దానిపేరు కంపెటిటివ్

ఎగ్జామినేషన్ (Comparative Examination). అవి యుపాధ్యాయులు చేయునట్టి పరీక్షకాదు. పెద్దపరీక్షలకువలెనే యచ్చు కాగితములు చెన్నపురినుండి, సంచులలో పెట్టి సీళ్ళు వేసి ప్రథానోపాధ్యాయుని కడకు వచ్చెడివి. ఆప్రశ్నముల కాగితములు మాకిచ్చెడివారు. వాటికి నేము త్తరములు వ్రాసియిచ్చెడి వారము. అవి పైకి పంపబడుచుండె డివి. ఇది 1881 సంవత్సరమున డిశంబరులో మాపాఠశాలలో జరిగి నది. పరీక్షాఫలితములు 1882 వ సంవత్సరము జనవరిలో వచ్చినవి. ఈ పరీక్షకు మా పాఠశాల నుండి యేడుగురు బాలురము వెళ్ళితిమి. అందరును కృతార్థులైరి. నేనును వేమూరి నాగయ్యయు మొదటి తరగతిలో కృతార్థులమైతిమి. మా యిద్దరిలో వేమూరి నాగయ్య మొదటివాడయ్యెను. ఎక్కువ గౌరవముతో నేను కృతార్థుడనగుట చేత, నరసాపురము హైస్కూలులో నాకు జీతములేకుండ చదువు చెప్పుదురేమోయని యాసగలిగెను, నాకంటె మొదటివాడుగ కృతార్థుడైన వేమూరి నాగయ్య కది లభించెను.

మా పున్నమ్మ జన్మించిన తరువాత మాకు మరియొక తమ్ముడు పుట్టెను. వాని పేరు సుబ్బారాయుడు. మా పినతల్లి ముల్లంగి వెంకయ్యగారి భార్య సూరమ్మగారు, తనకు సంతానము లేనందున యీ పిల్లవానిని పెంచుకొనెను. అతడు మొదటినుండియు జబ్బు వాడు. కాని పెంపకమిచ్చిన తరువాత మంచిలిగ్రామములో కొంత కాలము దేహారోగ్యము గలిగియుండి, మంచిలిలోనే తరువాత మశూచిజాడ్యమువల్ల మరణమొందెను. వాని తరువాత మాకు మరి యొక చెల్లెలు పుట్టెను. ఆబిడ్డ పుట్టిన రెండుమాసములకే మశూచ కమువచ్చి మృతినొందెను. పిమ్మట మరియొక చెల్లెలు పుట్టెను. అచ్చమ్మ యామె పేరు.

వీరవాసరములో నాలుగవ తరగతిలో జదువుచున్నపుడు, నా సహాధ్యాయులలో ముఖ్యులు పెద్దాడ సాంబశివరావుగారు, రెం డవవారు పెమ్మరాజు సీతారామయ్యగారు. సాంబశివరావుగారు దురదృష్టమున బాల్యమునుండియు కుంటివాడయ్యెను. కుంటివాడయ్యు నాంగ్లేయ విద్య నభ్యసించి రాజమహేంద్రవరములో జదివి పట్ట పరీక్షా సిద్ధుడై, పిమ్మట చెన్నపురి వెళ్ళి బి. యల్. పరీక్షయందు

గూడ కృతార్థులై, కొంతకాలము రాజమహేంద్రవరములోను, పిమ్మట గోదావరికావలనున్న ఖండము నూతనముగా కృష్ణా జిల్లాలో కలిపినప్పుడు రాజమహేంద్రవరమువిడిచి ఏలూరులోను, న్యాయవాదిగనుండి, పేరుప్రతిష్ఠలను ధనమునార్జించి, 1920 సంవత్సరములో మృతినొందిరి. పెమ్మరాజు సీతారామయ్యగారు కూడ రాజమహేంద్రవరమున జదివి బి. ఏ. పరీక్షయందు కృతార్థులై, కొంతకాలము ఉపాధ్యాయుడుగ పనిచేసి పిమ్మట న్యాయవాదులై ఏలూరులో నుండి, యిటీవలనే మృతినొందిరి. వీరుగాక మరికొందరు సహాధ్యాయులుండిరి గాని వారు వృద్ధిలోనికి వచ్చినవారుగారు.

నా స్వభావము చిన్ననాటనుండియు గంభీరమైనదని చెప్పుట మాత్రస్తుతిగాదు. ఏకారణముచేతనైన నాకాగ్రహము వచ్చినప్పుడు నే నన్నముదినుట మాని యెవ్వరితో మాటాడక మూకీభావము వహించి యుండుట నా స్వభావము. ఒకప్పుడు జననీజనకులు చీవాట్లు పెట్టినను నేను మారుమాటాడకుండువాడనుగాను. ఆ తిట్లు చీవాట్లు మిన్నక పడుటయే నా స్వభావము. బాల్యమున నున్న గుణములు వయస్సు ముదిరినను పోవు. నా కిప్పటికైనను కోపమువచ్చెనా, యన్నము మానివేయుదును. ఎవరిమీద కోపమువచ్చెనో వారిని దూషించుట మొదలైనవి నా కిష్టము లేదు. చిన్నతనమున నేజేసిన తప్పొకటి యిచ్చట చెప్పవలెను.

పెద్దాడ సాంబశివరావుగారు మొదటినుండియు భాగ్యవంతులు. ఆయన, తల్లి యెరుగకుండ నాలుగైదురూపాయలామె పెట్టెలోనుండి దీసుకొని, ఒక యంగడికి బోయి, కలములు పెనిసిల్లు నోకరీము కాగితము కొని మిత్రులకు బంచిపెట్టెను. నాకుగూడ గొన్ని కాగితములిచ్చెను. ఆసంగతి బైటపడగ నతనితల్లి చెన్నాప్రగడ లక్ష్మీనరసయ్యగారికి వర్తమానమంపించెను. లక్ష్మీనరసయ్యగారు విచారణజేసి సత్యము గ్రహించి మాదగ్గరనున్న కాగితములు మొదలైనవి వానికి తిరిగి యిప్పించిరి.

చిన్ననాడు నేను చీట్లపేక యాటలో కొంచెము కుతూహలము గలవాడను. ఆ విషయమై చెన్నాప్రగడ లక్ష్మీనరసయ్యగారు విన్నప్పుడు నన్ను నామిత్రులను శిక్షించిరి. చీట్లపేకనుగురించి నాకు

రెండుసార్లు శిక్షజరిగెను. నేను నామిత్రులు మెంతరహస్యముగ నాడి
నను నదియు బైటపడుచువచ్చెను. మా యింటిప్రక్కనే పెద్దాడ
నరసమ్మగారని యొక నియోగిస్త్రీ యున్నదని చెప్పితిని. ఆమె బాల
వితంతువగుటచే జిన్నతనమం దెన్నోపాటలు నేర్చుకొనెను. ఆమెకు
రానిపాటలు లేవనిచెప్పవచ్చును. చుట్టుప్రక్కల స్త్రీలందరూ నామె
చుట్టునుచేరి పాటలుపాడించి విని సంతోషించుచుండిరి. జ్ఞానము
వచ్చినప్పటినుండియు నాకాపాటలు వినుటయందు మిక్కిలి కుతూ
హలము. ఆమెపాడినపాటలన్నియు నేను మిక్కిలి యాసక్తితో విను
చుండెడివాడను. ఆమెకు గోవిందనామములు, కుశలవకథ, ధర్మ
రాజుజూదము, లక్ష్మణదేవరనవ్వు, శాంతాకళ్యాణము మొదలయిన
పాటలు వచ్చియుండుటచే, నవి నేవిని భారతరామాయణములలోని
ముఖ్యవిషయములను నేర్చుకొంటిని. ఆమెకు విచిత్రమైన కథలెన్నో
కూడవచ్చును. అందుచేత నేనును నామిత్రుడొకడును నామెనుబతి
మాలి కథలు చెప్పించుకొని పాటలుగూడ పాడించి వినుచుంటిమి.
పాటలనాసక్తిచేత నేనప్పుడప్పుడు బడిగూడ మానుచుంటిని. ఇప్పటి
కిని నాకాపాటల వరుసలన్నియు దెలియును. ఇప్పటికైన నాకాపాటలు
వినుటకు కుతూహలమున్నది. భారతరామాయణములలోలేని కొన్ని
క్రొత్త కథలు యీ పాటలలోగలవు. అవి మిక్కిలి మనోహరములుగ
నుండును. లక్ష్మణస్వామి నవ్వు రామాయణ మందెచ్చటనులేదు.
అది మిక్కిలి విచిత్రమైన కల్పనము. ధర్మరాజులవారి జూదముపాట
ములో లక్ష్మీదేవికిని, నామెయక్కయైన పెద్దమ్మకును జరిగిన సంభా
షణముగూడ మిక్కిలివిచిత్రము. కుశలవపాటలోగూడ నుత్తర రామా
యణములోలేని విచిత్ర కల్పనలు గొన్నిగలవు.

ఆ నరసమ్మగారి నెందుచేతనో యూరివారందరు "అప్పాయి"
యని పిలుచుచుండెడివారు. నేనును నా మిత్రులును నట్లే పిలుచుచుం
టిమి. ఆమె యనుగ్రహము సంపాదించి పాటలు కథలు వినుటకై,
యామె యావు నిమిత్తము తుమ్మకాయలుకొట్టి తట్టలకొలది మోసి
తెచ్చి, యామెకు కానుకగా సమర్పించుచుంటిమి. ఆమె సంతో
షించి, విసుగుకొనక బద్ధకింపక నేమడిగినప్పుడు కథలుచెప్పి పాటలు
పాడుచుండెడిది. ఆమె దయ సంపాదించుటకై నేను తదాజ్ఞ శిరసా

వహించి యేపనిచెప్పిన నాపని జేయుచుండెడివాడను. గ్రామ మున సబుగారి యింటిలోని స్త్రీలకు, నామెకు మైత్రి గలదు. అప్పాయి యప్పుడప్పుడు మంచిమంచి కూరలు పచ్చళ్లుజేసి వారి కిచ్చి రమ్మని నాచేత బంపుచుండెడిది. ఆమె పాటలమీద నాసక్తిచేత నేనది నీచ మైన పనియని యనుకొనక చెప్పగానే చేసెడివాడను.

మా తమ్మునిగురించి యొకమాట వ్రాయవలెను. మాయింటి ప్రక్కనే దేవరకొండ శేషాచార్యులుగారని యొక మాధ్వ బ్రాహ్మ ణుడు కాపురము చేయుచుండెను. ఆయనకు ముగ్గురు కొమార్తెలు నిద్దరు కుమాళ్ళు నుండిరి. ఇరుగుపొరుగువార మగుటచే మేమును వారును నొకకుటుంబమువలె నుండెడివారము. ఆయనభార్యను మేము దొడ్డమ్మయనియు, కుమార్తెలను నక్కయ్యలనియు, కుమాళ్ళ నన్న య్యలనియు బిలుచుచుంటిమి. ఆయన పెద్దకుమార్తె పాపమ్మగారు లింగంపర్రు గ్రామ నివాసియైన జమ్మి హనుమంతాచార్యులుగారి భార్య. లింగంపర్రు పెద్దాపురం తాలూకాలో ఏలేశ్వరం వద్దనున్నది. పాపమ్మగారికి మాతమ్ముడు కృష్ణమూర్తిమీద నెంతో ప్రేమకుదిరి నది. తరుచుగ నతడు శేషాచార్యులుగారి యింటనేయుండి యక్కడనే భోజనముచేయుచుండెడివాడు. పాపమ్మగారొకసారి పుట్టినింటికివచ్చి, కొంతకాలముండి మాతమ్ముని మిక్కిలి చనువుజేసుకొని, తనతోగూడ వానిని లింగంపర్రు దీసికొనిపోవుటకై సెలవిమ్మని మా తల్లిదండ్రుల నడిగిరి. మా తమ్ముడుగూడ వారితో వెళ్ళుటకు గుతూహలపడెను. మొగమోటమిచేత మా తల్లిదండ్రు లొప్పుకొనిరి. పాపమ్మగారు మా తమ్ముని వెంటబెట్టుకొని భర్తతో గలిసి లింగంపర్రు వెళ్లెను. అక్కడ మావాడు రమారమి మూడు సంవత్సరములుండెను. వీర వాసరమునుండి వెళ్లినప్పుడు వానికేడెనిమిది సంవత్సరములు వయస్సు. అతడు నేను నరసాపురములో జదువుకొనుచున్నప్పుడు తిరిగి మాయొద్దకువచ్చెను. లింగంపర్రు మన్యప్రదేశమగుటచే వాని దేహా రోగ్యము కొంతజెడెను.

———

# స్వీయ చరిత్రము

## రెండవ ప్రకరణము

### నరసాపురములోని విద్యాభ్యాసము

**1881** సంవత్సరం డిశంబరుతో వీరవాసరములో నా చదువు ముగిసెను. వీరవాసరములో, లోవరుఫోర్తుకంటె నెక్కువతరగతి లేదు. పై తరగతి జదువుటకై నరసాపురము వెళ్ళవలసి వచ్చెను. నరసాపురము మా యూరికి నడ్డదారిని తొమ్మిదిమైళ్లు. రోడ్డుదారిని వెళ్ళిన పక్షమున పండ్రెండు మైళ్ళుండును. నరసాపురమునకు పాలకొల్లు మూడు కోసులు. పాలకొల్లునుండి వీరవాసరమున కెనిమిదిమైళ్లు. మా తండ్రిగారు నాచదువు నిమిత్తమై నన్ను నరసాపురము తీసికొని వెళ్ళిరి. తటవర్తి శేషమ్మగారి పూటకూళ్ళ యింట ప్రవేశపెట్టిరి. నాకు రోజుకు మూడుపూటలు భోజనము పెట్టుటకు మూడు రూపాయలు నెలకు పుచ్చుకొనుట కామె సమ్మతించెను. నాకేగాదు, నా యీడువారి కందరకు నట్లే. నార్మల్ స్కూలులోను, పై తరగతుల లోను జదువు విద్యార్థులకు నామె నెలకు మూడు రూపాయలకే, దినమునకు రెండుసారులు భోజనము పెట్టుచుండెను. అంత చౌక భోజనము పెట్టుచున్నదన్న నీనాటివారు నమ్మకపోవచ్చును. ఆనాడు రూపాయకు నారుకుంచముల బియ్యము నిచ్చెడివారు. నేయి వీశె మూడు పావులాలు. అన్ని వస్తువులు మిక్కిలి చౌక. ఆ కారణముననే పూటకూళ్లు పెట్టువారికి మూడు రూపాయవల్లనే కొంత లాభము వచ్చుచుండెను.

అప్పుడు నరసాపురములో రెండు పాఠశాలలు గలవు. సెంట్రల్ స్కూలను నామాంతరముగల టెయిలరు హైస్కూలొకటి, మిషనువారి యున్నతపాఠశాల యొకటి. టెయిలరు దొరగారు నరసాపురములో సబ్ కలెక్టరు పనిజేసినందున వారి పేర టెయిలరుపేట కట్టబడెను. అక్కడ నొక పాఠశాలగూడ వారిపేరనే స్థాపింపబడెను. నేను వెళ్లినప్పటికా పాఠశాలకు మహారాజశ్రీ "అణుచ్చిదంబర ప్రాణ

శాస్త్రి పారయ్యరుగారు" ప్రధానోపాధ్యాయులు. ఈయన పట్టభద్రప్రసిద్ధులు, చాల గొప్పయుపాధ్యాయులు. వరదరాజులు మొదలియారుగారు రెండవ యుపాధ్యాయులు. మెయిలరు హైస్కూలులో విద్యార్థులిచ్చుకొనవలసిన జీతము లెక్కువ. నేను జేరవలసిన తరగతి యప్పుడు ఫోర్తుతరగతి. ఈ తరగతిలో జేరినవారందరు సంవత్సరాంతమున మిడిలుస్కూలు పరీక్షకు వెళ్ళవలెను. పూర్వము దొరతనమువారి యుద్యోగములకు బోనదలచువారికి జనరలు టెస్టని (General test) యొక పరీక్ష యుండెడిది. దాని స్థానమందు మిడిలుస్కూలు పరీక్షను దొరతనమువారు స్థాపించిరి. మెయిలరు హైస్కూలులో నీతరగతిలో జదువు బాలుడు నెలకొక రూపాయి జీతము నియ్యవలెను. మిషను వారి పాఠశాలలో జీతములు తక్కువ. ఆకాలమున మిషనువారి పాఠశాలకు రివరెండు జాను విలియము బీకుగారనువారు ప్రధానోపాధ్యాయులుగ నుండిరి. ఆయన తమ్ముడు ఛార్లెసు బీకుగారు రెండవ యుపాధ్యాయులుగ నుండిరి. వలివేటి భాస్కర లక్ష్మీనరసింహశాస్త్రిగారు మూడవ యుపాధ్యాయులుగ నుండిరి. వెలినెల నరసరాజుగారును, జంప వేంకటాచలముగారను క్రైస్తవుడును దక్కిన యుపాధ్యాయులు. ఏలేశ్వరపు వెంకటప్పయ్యశాస్త్రిగారు తెలుగు పండితులు. ఏలేశ్వరపు వారి వంశము బండితవంశము. వీరి యన్నగారైన ఏలేశ్వరపు లక్ష్మణశాస్త్రిగారు మొగలితుర్తి సంస్థానములో విద్వాంసులుగ నుండిరి. మత్స్యపురిలో నాకు సంధ్యావందనము నేర్పిన చిలకమర్తి నరసింహశాస్త్రిగారు, లక్ష్మణశాస్త్రిగారి వద్దనే కావ్యములు జదువుకొనిరి. ఏలేశ్వరమువారి వంశము మా చిలకమర్తివారి వంశమునకు గురువంశమని చెప్పవచ్చును. ఈ వెంకటప్పయ్యశాస్త్రిగారు నా మిత్రుడు బ్రహ్మసమాజ దీక్షాపరుడునైన పాలావఝ్ఝుల లక్ష్మీనారాయణగారికి మామగారు. పాండిత్యము గొప్ప పాండిత్యము. బోధనాశక్తి గూడ మంచిది.

నేను భాగ్యవంతుడను గాకపోవుటచే మిషనువారి పాఠశాలలో జేరితిని. అక్కడ మా తరగతికి జీతము నెలకు పదియణాలే, కాని చదువులో తక్కువలేదు. 1882 వ సంవత్సరమున జనవరిలో నేనా పాఠశాలలో జేరితిని. కొంతకాలము పూటకూటియింట దిని కాలక్షే

పము జేసితిని. తరువాత మా తల్లియు, మా పెదచెల్లెలైన పున్న మ్మయు, చిన్న చెల్లెలైన యచ్చమ్మయు వచ్చుటకు వచ్చిరి. పొగాకు వేణురావుపంతులుగారని పూర్వ మొక గొప్పవారు నరసాపురములో నుండెడివారు. ఆయన కిద్దరు కుమాళ్లు. మొదటివారు శివరావుపంతు లుగారు. రెండవవారు రామారావుపంతులుగారు. వేణురావుపంతులు గారు నెలకు రు. 300 లు జీతముగల యుద్యోగము సెటల్‌మెంటు డిపార్టుమెంటులో జేసి, రు. 150 లు నెలకు పింఛను పుచ్చుకొని చిర కాలము జీవించి మృతినొందిరి. వారు కరణకమ్మ వ్యాపారులు. పీలు కానావారు, సబ్బునీసువారు, బెస్నూరువారు, మద్దిరాలవారు, గజవల్లి వారు మొదలగువారు వీరి చుట్టములు. కరణకమ్మవ్యాపారులు మత మునందద్వైతులేగాని బట్టకట్టు మొదలైన విషయములలో మాధ్వు లను బోలియుందురు. మగవారి పేళ్ళకు పంతులనియు, నాడువారి పేళ్ళకు బాయమ్మయనియు మాధ్వులకు వలెనే నామాంతరముల యందు వీరికుండును. వీరి గురువులు స్మార్తగురువులైన శంకరాచా ర్యులవారే. వీరిలోగూడ వైదికులు నియోగులు గలరు. లౌక్యులు పంతులవారనబడుదురు. మంతపూడివారు మొదలైనవారు కరణ కమ్మ వైదికులు. వీరు శ్రాద్ధాదులయందు భోక్తలుగ వైదికులనే బిలు తురు. ఈ పొగాకువారికి మాతండ్రిగారికి మొదటినుండియు స్నేహము. వేణురావుపంతులుగారి యన్నగారైన బుచ్చికృష్ణమ్మ పంతులుగారు మొగలితుర్తులో సిరస్తదారు పనిజేసిరి. అప్పటినుండియు మా తండ్రి గారికి వారి కుటుంబముతో పరిచయముగలదు. అందుచేతనే శివరావు పంతులుగారికిని రామారావు పంతులుగారికిని మా తండ్రిగారి యెడ నభిమానము గలదు.

నా సంరక్షణమునకై మాతల్లి నరసాపురము వచ్చినప్పుడు కాపురమునకు మాకిల్లు కావలసివచ్చెను. పొగాకువారి యిల్లు మిక్కిలి పెద్దది. ముందరను వెనుకను ప్రక్కలను విశాలమగు దొడ్లుగలవు. 1885 వ సంవత్సరములో నరసాపురమువచ్చి నాటకములాడిన ధార వాడ నాటకసమాజమువారు, వేణురావు పంతులుగారి ముందరవాకి టనే నాటకశాల నిర్మించి నాటకములాడిరని జెప్పిన పక్షమున, వారి స్థలమెంత విశాలమైనదో చెప్పనక్కరలేదు.

శివరావుపంతులుగారు వారియింటిలో నొకగది మాకాపురము నిమిత్త మద్దెలేకుండ నిచ్చిరి. ఆగదిలో మేము వంటజేసుకొని, విశాలమైన సావడిలో బండుకొనుచుంటిమి. నేనును మా చెల్లెండ్రిద్దరును మాతల్లియు మాత్రమే యచ్చటనుంటిమి. మాతండ్రిగారు వీరవాసరములోనే యుండిరిగాని, మాతో రాలేదు. మాతండ్రిగారి కప్పటికి ఉద్యోగములేదు. తాలూకకచ్చేరిలో నుండెడి యమీనాపనులు తగ్గిపోయెను. భూములు ఋణగ్రస్తములయ్యెను. ఆపుకారీయిజారాదారుల వద్ద గుమాస్తాగనుండియు, రైతులు మొదలయినవారికి కవుళ్ళు, కదపాలు, దస్తావేజులువ్రాసియు, గొంత ధనమార్జించి మా తండ్రిగారు తనపొట్టపోసుకొని, కొంతసొమ్ము మాకు నరసాపురము పంపెడివారు. మా మేనమామగారప్పుడు తణుకులో స్థాపింపబడిన పాఠశాలకు నాంధ్రోపాధ్యాయుడుగ మొయ్యేరునుండివచ్చి చేరిరి. ఆయనకు మొదటనుండియు మాకుటుంబముమీద మిక్కిలిప్రేమ. ఏలయన, యాయన సోదరీజనములో పుత్రసంతానముగలది మాతల్లి యొకర్తెయే. మల్లయ్యశాస్త్రిగారి పెద్ద యప్పగారైన చిలకమర్తి వెంకటశాస్త్రిగారి భార్యకు నొకకుమార్తె మాత్రమే యుండెను. మల్లయ్యశాస్త్రిగారికి చెల్లెండ్రిద్దరుండిరిగాని వారికి సంతానములేదు. మాతల్లి మల్లయ్యశాస్త్రిగారికి రెండవయప్పగారు. అదిగాక కోడరికపు బాధ మాతల్లి మిక్కిలి పడినదని, మా మేనమామగారికి నెక్కువ జాలియుండెడిది. ఆయన నాజీతమునిమిత్తము, పుస్తకములనిమిత్తము నరసాపురములో నేనున్నప్పుడు, నెలకు నాకు రెండురూపాయిలు పంపుచుండెడివారు. నేను నరసాపురములో జదివిన రెండు సంవత్సరములు యీ విధముగనే సాయముజేసెడివారు. మల్లయ్యశాస్త్రిగారి కప్పచెల్లెండ్రమీద మిక్కిలి ప్రేమ. ఏటేట వారిని దీసుకొనిపోయి వారికి చీరలుసారెలు పెట్టి పంపుచుండెడివారు.

నరసాపురములో స్టాంపువెండరుగ మా బావమరది యద్దంకి వేంకటరామయ్యగా రుండిరి. ఆయన భార్య మాచెల్లెలు పున్నమ్మ చిన్నదగుటచే, నతడు సంసారమేమియు లేక యొక్కడే వంటపూటెంటదిని, యుద్యోగము జేసికొనుచుండెను. కాని యాయనవల్ల మాకే సాయమును లేదు. పిలిచినను మాయింటి కతడేపండుగకును భోజనము

నకేని వచ్చెడివాడుగాడు. మామీద నతనికా దినములలో నభిమా
నములేదు. దానికొక కారణముగలదు. మా తండ్రిగారు వేంకటరా
మయ్యగారివద్ద రెండువందల రూపాయిలు ఋణముచేసిరి. అదిగాక
మరియొకరివద్ద మరి రెండువందల రూపాయలు ఋణముచేసిరి. వేం
కటరామయ్యగారు తన సొమ్ము నిమిత్తము మాతండ్రిగారిమీద నర
సాపురము కోర్టులో వ్యాజ్యమువేసి, డిక్రీపొంది, స్థిరాస్తివేలము నిమి
త్తము దరఖాస్తుపెట్టి, మా గాదెదొడ్డి రు. 75/-ల కమ్మించి తన బాకీ
క్రింద జమకట్టుకొనెను. అంతతో నాతని ఋణమంతయు దీరలేదు.
ఆకారణమున మా తండ్రిగారికని నాతనికిని మనస్పర్థలు గలిగెను.
వారు రాకపోకలు, మాటలు మానుకొనిరి. ఇదిగాక మరియొకరికి
గూడ మాతండ్రిగారు 200 రూపాయిలు నీయవలసియున్నదని వ్రాసి
తినిగదా! అతనుగూడ సొమ్ముకై మాతండ్రిని తొందరపెట్టజొచ్చెను.
అప్పుడు మా మేనమామగారు తణుకునుండివచ్చి, వేంకటరామయ్య
గారిని మాయింటికి దీసికొనివచ్చి, మా తండ్రికిని మా బావకును
రాజీజేసిరి. మా తండ్రిగారు మరొకరి కియ్యవలసిన రెండువందల
రూపాయిలుగూడ వేంకటరామయ్యగారే తీర్చునట్లును, వేంకటరామ
య్యగారి కియ్యవలసిన మిగతాబాకీకిని, యీ పై వారికి తీర్చిన సొమ్ము
నకును, మా తండ్రిగారు తన స్వార్జితమైన యీనాముభూమి నాలుగె
కరములును, దానిప్రక్క జిరాయితీభూమి యొక యెకరమును, వెరసి
యైదెకరములు వేంకటరామయ్యగారికి స్వాధీనపు తణఖా యిచ్చున
ట్లును, భూమిమీదవచ్చు ఫలసాయము వేంకటరామయ్యగారు వడ్డి
క్రింద ననుభవించునట్లును, నిర్ణయింపబడి, యట్లు పత్రములు వ్రాసు
కొనబడెను. వేంకటరామయ్యగారు మా తండ్రికొక యుత్తరము
వ్రాసియిచ్చి యణాబిళ్ళ యంటించి సంతకముజేసి యిచ్చిరి. ఆయుత్త
రములో నేమున్నదనగా! "చిలకమర్తి వేంకన్నగారుగాని, యాయన
కుమాళ్ళైన మీముగాని, యెప్పుడు వెంకట్రామయ్యగారికి నాలుగు
వందల రూపాయిలు నిచ్చివేయుదుమో యప్పుడు మా భూమి మా
కతడుగాని యతని వారసులుగాని వదలివేయవలయును" అని యున్నది.

ఈవిధముగ రాజీపడినను మాతండ్రిగారియొక్కయు, వెంకట
రామయ్యగారియొక్కయు మనసులు చక్కబడలేదు. మాతండ్రిగారి

మొద్ద వేంకటరామయ్యగారు స్వాధీనపుతనఖా పుచ్చుకొన్న భూమికి సర్కారు పన్ను చెల్లించుటకై యేటేట వీరవాసరము వచ్చుచుండిరి గాని, మా యింట నెన్నడు బసచేయలేదు. నరసాపురములో నే మున్నను మాకు రాకపోకలులేవు; భోజనాదులులేవు. నేనుమాత్ర మాయనకడకప్పుడప్పుడు పోవుచుండెడివాడను. మిడిలుస్కూలు పరీక్షకు మూడు రూపాయిలు దరఖాస్తుసొమ్ము కట్టవలెను. దానికి సొమ్ము నావద్ద లేకపోయెను. మా తండ్రిగారు సమయమునకు బంప లేకపోయిరి. నా మేనమామగారివద్దనుండి సొమ్ముతెప్పించి మరల నిచ్చెదనని నేను గట్టిగచెప్పి యడిగినమీదట, నా బావగారు నాకు మూడు రూపాయిలప్పునిచ్చిరి. దానితో నేను పరీక్షకు దరకాస్తుకట్టి శ్రద్ధగ చదివితిని. మిడిలుస్కూలు తరగతనగ నిప్పటి మూడవ ఫారముకు సమానము. అప్పుడు నేను చదువవలసిన పాఠములివి. ఇంగ్లీషులో బ్రాడ్షాదొరగారి మొదటవాచకము, మాన్యుయలు గ్రామరను నింగ్లీషు వ్యాకరణము, లెత్బ్రిడ్జిగా రింగ్లీషులో వ్రాసిన హిందూదేశచరిత్ర, కాలియరుసు వ్రాసిన యింగ్లాండు దేశచరిత్ర. మాన్యుయలు భూగోళము, అంకగణితము (Arithmetic) బీజగణితము (Algebra), రేఖాగణితము (Geometry) మొదటిపుస్తకము, పఠనీయ గ్రంథములు కఠినముగను, మెండుగను నుండెను. మాతరగతి రెండు భాగములుగనుండెను. ఎ. డివిజను, బి. డివిజను. నేను ఎ. డివిజను లోనే యుంటిని. మాడివిజనుకు భాస్కరశాస్త్రిగారింగ్లీషు చెప్పుచుండిరి. వెలినెల నరసరాజుగారు గణితము మొదలయినవి చెప్పుచుండిరి. దేశచరిత్రము, భూగోళము చిన్నదొరగారైన ఛార్లెసుబీరు దొరగారు చెప్పుచుండిరి. వెంకటప్పయ్యశాస్త్రిగారు తెలుగు బోధించుచుండిరని వేరెచెప్పనక్కరలేదు. జంప వెంకటచలముగా రింగ్లీషులో గొప్పసమర్థులని వాడుక. వారు బి. డివిజనుకు నింగ్లీషు చెప్పుచుండిరి.

ప్రతిదినము పదిగంటలకా పాఠశాలలోనున్న బాలకులందరును భవనముయొక్క మధ్యభాగమున బల్లలమీద కూర్చుండవలెను. అప్పుడు, చిన్నదొరగారో, పెద్దదొరగారో, వారికి వీలులేనపుడు జంప వెంకటచలముగారో వచ్చి, బైబిలుగ్రంథము తెచ్చి, యేదో

భాగముచదివి, దానికి వారు వ్యాఖ్యానముచేసి, క్రైస్తవమతము బోధించుట యాచారమైయుండెను. ఇదిగాక, వారమునకొకసారి ప్రతితరగతిలోను బైబిలు పాఠముండెడిది. ఆదినమున పెద్దతరగతుల లోని, బాలకులింగ్లీషు బైబిలులో నుండియు, చిన్నతరగతులలోని బాలురు తెనుగుబైబిలులోనుండియు, కొన్నిపంక్తులు దొరగారికప్ప గించవలెను. మిడిల్‌స్కూలుపరీక్ష సాధారణముగ డిశంబరు నెల మొదటివారములో జరిగెడిది. చెన్నపురినుండి యచ్చువేసిన ప్రశ్న పత్రములువచ్చెడివి. నరసాపురములో టెయిలరు హైస్కూలు బాల కులకును, మిషనుపాఠశాల బాలకులకును, మిడిలుస్కూలుపరీక్ష టయిలరుహైస్కూలులోనే జరిగెడిది. ఆపరీక్షకు సూపరింటెండెంటుగ ప్రణుతార్తిహరయ్యరుగారే యుండెడివారు.

ఆ సంవత్సరము (1882) మిడిలుస్కూలు పరీక్షలో నొక చిత్రము జరిగినది. పగలు పదిగంటలు మొదలొంటిగంటవరకు యివ్వ వలసిన ప్రశ్న పత్రములు సకాలమునకే వచ్చినవి. ఆపూట యింగ్లీ షుభాషా విషయము. మధ్యాహ్నము గణితము. ఆ ప్రశ్న పత్రములు సకాలమునకు రాలేదు. అవి మధ్యాహ్న మెప్పుడో వచ్చినవి. పరీక్ష నిలుపుచేయుటకు వీలులేకయ్యరుగారు గణిత పరీక్ష రాత్రి పెట్టిరి. సాయంకాలమారు గంటలకు ప్రశ్న పత్రములు బాలురకియ్యబడెను. "అసలేకోతి, యామీద దయ్యము పట్టెను. అదిగాక యీతకల్లు త్రాగెను, యామీద తేలుకుట్టెను" అన్న సామెతగా నాకసలే గణిత మందభిరుచి తక్కువ. అందులో రాత్రి కన్నులు కనబడనివాడను. అప్పుడు నాయవస్థ యెట్లుండునో మీరే యూహించుకొనుడు. అప్పు డప్పుడు రాత్రులు నేను దీపముముందర తలపెట్టుకొని, కన్నులకు పుస్తకము మిక్కిలి దగ్గరగపెట్టుకొని యైదారుపంక్తులు చదువ ప్రయ త్నించుచుండెడివాడను. అప్పుడు చదువుటకంతగ వీలులేకపోవుటయే గాక దీపపువేడితగిలి తలమీద ముంగురి వెండ్రుకలు కాలిపోవుచుండె డివి. ఒక్కొక్క పిల్లవాని కొక్కొక్క కొవ్వువత్తిముక్కనిచ్చి యా వెలుతురున ప్రశ్నపత్రములకు ఉత్తరములు వ్రాయుమనిరి. నేనెట్లో కచ్చాపచ్చాగా వ్రాసితిని. పరీక్షలో నేను కృతార్థుడనౌదునని నాకు ధైర్యము లేకపోయెను. తెలుగుదేశచరిత్రములు మొదలైనవాటిలో

నిచ్చిన ప్రశ్నపత్రములన్నింటికి సరిగనే యుత్తరముల వ్రాసితిని. మిడిలుస్కూలు పరీక్ష మూడుదినములు జరిగెడిది. పరీక్ష ముగిసిన తరువాత రమారమి రెండుమాసములు లోపుగ దాని ఫలితములు తెలిసెడివి.

నా మేనమామగారు సీతకాలపు శెలవులకు తణుకు రమ్మని నాకు జాబువ్రాసిరి. అందుచేత నేను తణుకు వెళ్ళితిని. అక్కడ నుండగానే పరీక్షాఫలితములు తెలిసెను. అక్కడ జిల్లా మునసబుగనున్న నల్లమురెడ్డి రాఘవులు నాయుడుగారి యింటికిబోయి, ఫోర్టు సెంటు జార్జి గెజిటు తెచ్చుకొని చూచుకొనగ, నాపేరు కృతార్థులైన బాలకులలో మూడవ తరగతి జాబితాలో నుండెను. ఆ పరీక్ష మొదటి తరగతిలో కృతార్థులైనవారికి గవర్నమెంటువారి కొలువులో నేదైన నుద్యోగ మీయవచ్చుననియు, రెండవతరగతిలో కృతార్థులైనవారికి బోర్డులో నుద్యోగ మీయవచ్చుననియు, మూడవ తరగతిలో కృతార్థులైనవారిని పై తరగతిలో వేయవచ్చుననియు, నప్పటి నిబంధనలుండెను. ఈ మూడు రకములు గాక పై తరగతిలో వేయుటకు తగినవాడని (Fit for promotion) యింకొక రకముగూడ నుండెడిది. ఈపరీక్ష 1878 మొదలుకొని 1890 వరకు నుండెడిది. 1891 వ సంవత్సరము నుండి దాని స్థానమందు లోవరుసెకండరీ పరీక్ష నెలకొల్పబడినది. ఇందు కృతార్థులైనవారు మీది తరగతికి బోవుటయేగాని యుద్యోగములులేవు. నేను గణితములో నసమర్థుడనగుటచేతను, పరీక్ష రాతి) జరుగుటచేతను, గణితములో నాకు మిక్కిలి తక్కువమార్కులు వచ్చియుండును. ఆకారణమున నేను మూడవతరగతివాడుగ గృతార్థుడనైతినిగాని, లేనిచో నధమపక్షము రెండవతరగతి వాడుగనైన వచ్చియుండును.

1883 వ సంవత్సరము జనవరిలో తణుకునుండి మరల నరసాపురమువచ్చి పై తరగతియైన యైదవతరగతిలో జేరితిని. అది మెట్రిక్యులేషను తరగతికంటె క్రిందిది. దానికి మెట్రిక్యులేషను పరీక్షకు జెప్పునట్టి పాఠములన్నియు జెప్పుచుండిరి. ఆ ప్రవేశపరీక్షకు నిర్ణయింపబడిన యింగ్లీషు పాఠపుస్తకమే యీ తరగతిలోగూడ జెప్పెడివారు. నేను మిడిలుస్కూలు క్లాసులో జదువుచుండగ వేసవికాలపు శెలవుల

యనంతరమున భాస్కరశాస్త్రిగారు పని మానుకొని న్యాయవాది
వృత్తిలో జేరిరి. ఆయన స్థానమందు పూర్వము మా వీరవాసర గ్రామ
వాసియు, పిమ్మట రాజమహేంద్రవరములో బి. యే. తరగతిలో జేరి
నట్టియు, ప్రగళ్ళపాటి జోగిలింగముగారను లింగధారి కోమటి మా
కుపాధ్యాయుడుగ వచ్చెను. భాస్కరశాస్త్రిగారు తక్కువ పరీక్ష
యందు కృతార్థులైనను జోగిలింగముగారి కంటె నింగ్లీషు పాఠములు
బాగుగ చెప్పుచుండెడివారు. భాస్కరశాస్త్రిగారు సంస్కృతముగూడ
జదివినవారు. బ్రహ్మజ్ఞాన సంపన్నులు. అందుచేత న్యాయవాది
వృత్తిలో నధర్మము జేయక, ధనమే ప్రధానముగ జేసుకొనక, న్యాయ
ముగ కాలక్షేపము చేయుటచే న్యాయవాదిగ గొప్ప పేరు సంపాదిం
పలేదు.

నేను నరసాపురములో నున్నప్పుడు పారుపల్లి పుండరీకాక్షుడు
గారు డిప్యూటీకలెక్టరుగాను, కురుమద్దాలి వేంకటచలముగారు జిల్లా
మునసబుగాను, నాథముని మొదలియారుగారు తహసీలుదారుగను నుం
డిరి. ప్రజలకు తెలియక యీయన పేరు నారదముని మొదలియారు
గారని బిలిచెడివారు. ఇంగ్లీషుపాఠములు మాకు పెద్దదొరగారు చెప్పు
చుండెడివారు. ఆయన పాఠబోధయు మతబోధయుగూడ మిక్కిలి
తృప్తికరముగ నుండెడివి. ఆయన కాంధ్రభాషలోగూడ గొంత ప్రవే
శము గలదు. చిన్నయసూరి నీతిచంద్రికకర్థము చెప్పెడివారని ప్రతీతి
గలదు. పై తరగతులకుగూడ చిన్నదొరగారు దేశచరిత్రము, భూగో
ళము, ప్రకృతిశాస్త్రము చెప్పుచుండెడివారు. కాని పరీక్షాఫలితములు
మిషను పాఠశాలలో కంటె, టెయిలరు హైస్కూలులోనే బాగుం
డెడివి.

1883 వ సంవత్సరమున రెండవ భాగమున నాకు గొన్ని
చిక్కులు సంభవించినవి. మాతల్లికి మొదటినుండియు గుండెలలో
నొప్పి వచ్చుచుండెడిది. ఆమె యందువల్ల మిక్కిలి బాధపడుచుం
డెడిది. ఆబాధ నేను చూడలేక నామెకు నొప్పి వచ్చినప్పుడు వీధిలో
గూర్చుండెడివాడను. ఇప్పటికీ నా స్వభావమదే. ఎవరైన బాధపడు
చున్న నే చూడజాలను. మందులు తెచ్చియు, తెప్పించియు చికిత్సలు
చేయించగలనుగాని బాధమాత్రము చూడజాలను. మాయమ్మకు

జబ్బుగనున్నదని మా మేనమామగారికి తెలిసి మాయమ్మను తమకు పంపించవలెనని వారు నాకు వ్రాసిరి. నే నామెను, మా చెల్లెం డ్రను నచటికి బంపితిని.

అప్పుడు నా కన్నము దొరకుటయే కష్టమయ్యెను. నేనొక నాల్గయిదుస్కూలు విద్యార్థితో గలిసి వంటబెట్టితిని. పాకములో నక్క తపరిచయుడ నగుటచేత గొన్నినాళ్ళయిన పిమ్మట నది మానవలసి వచ్చెను. అప్పుడు నేను పూటకూళ్ళ యింటికి బోవలసి వచ్చెను. దానికి నెలకు మూడు రూపాయలు ఖర్చు. కాని నా దగ్గర రూపాయి న్నరకంటె నెక్కువ యుండెడిదిగాదు. అందుచే నేను పూటకూళ్ళ యింటివానితో బేరమాడి, నేనిచ్చెడు రూపాయిన్నరకు నా కొక్క పూట మాత్రమే యన్నముపెట్టవలసినదని కోరితిని. ఆ పూటకూళ్ళ యింటి యజమాని నవుడూరి కామయ్య యను బ్రాహ్మణుడు. అతడు నా కోరిక నంగీకరించెను. దినమున కొక్కపూట మాత్రమే తిని పాఠశాలకుబోయి చదువుకొనుచుంటిని. రెండవపూట తరుచుగా నొక డబ్బుపెట్టి, యొక కోమటి దుకాణముమీద రెండు మినుపగారెలు కొని, యతితిని, కాలువకుబోయి మంచినీళ్లుత్రాగి, రాత్రి పోగాకు వారి యిల్లుజేరి యచ్చట బండుకొనుచుంటిని. ఇట్లు సరియైన భోజనము లేకపోవుటచే శరీరము శుష్కించెను. అప్పుడప్పుడు కొంచెము జ్వరముగూడ తగులుచుండెను. అయినను నేను బడి మానలేదు. ఆ సంవత్సరాంతమున సాంవత్సరిక పరీక్ష జరిగెను. ఆ పరీక్షలో నన్ని పాఠములలోను నాకు మార్కులు వచ్చెను. కాని గణితము, బీజగణితము వాటిలో మాత్రము మిక్కిలి తక్కువ మార్కులు వచ్చెను. ఆ కారణమున నన్ను పెద్దదొరగారు మెట్రిక్యులేషను తరగతిలో వేయ లేదు.

ఆ సంవత్సరమే రిప్లయికార్డు లను జంటకార్డులు క్రొత్తగ వచ్చెను. జంటకార్డువెల యర్ధణా. ఆకార్డు తీసుకొని ప్రధానోపాధ్యాయులైన పెద్ద బీరు దొరగారికి, నన్ను పైతరగతిలో వేయుమని వేడుకొనుచు నొకజాబు వ్రాసితిని. ఆజాబునకు రెండవ కార్డుమీద నాకు వారుత్తరము వ్రాసిరి. నీవు తగని తరగతిలో నిన్ను వేయుమని వేడుకొనుటకంటె చదువు మానుకొనుటయే యుత్తమమని వారు కఠిన

ముగ వ్రాసిరి. ఇది 1884 వ సంవత్సర ప్రారంభమున జరిగెను. ఈ సంగతి నేను తణుకు వెళ్ళి మా మేనమామగారితో జెప్పితిని. ఆకాలమున తణుకు గ్రామములో నాలమూరు రామచంద్రరావుగారు సబు రిజిస్ట్రారుగ నుండిరి. మల్లయ్యశాస్త్రిగారు పనిచేయుచున్న పాఠశాలా పరిపాలక సంఘములో రామచంద్రరావుగారొక సభ్యులై యుండుట యేగాక, మల్లయ్యశాస్త్రిగారికి మిక్కిలి ముఖ్యమిత్రులు. రామచంద్రరావుగారు పారుపల్లి పుండరీకాక్షుడుగారికి మేనకోడలు పెనిమిటి. పుండరీకాక్షుడుగారు టెయిలరు హైస్కూలు పరిపాలక సంఘమున కధ్యక్షులు. నేను నెల జీతమిచ్చి తిరిగి మిషను పాఠశాలలోగాని, టెయిలరు హైస్కూలులోగాని, వెనుకటి తరగతిలో మరల జదువ జాలనందున, నాకు టెయిలరు హైస్కూలులో జీతము లేకుండ చదువు చెప్పింపుమని, మా మామగారి ప్రోత్సాహముచేత రామచంద్రరావుగారు పుండరీకాక్షుడుగారి కొకజాబు వ్రాసియిచ్చిరి. ఆజాబు తీసుకొనిపోయి నేను పుండరీకాక్షుడుగారికి జూపితిని. పుండరీకాక్షుడుగారు దానిపై నేదో వ్రాసి ప్రణుతార్తి హరయ్యరుగారికి జూపుమనిరి. నేనట్లు జేసితిని. అయ్యరుగారు నన్ను పాఠశాలకు రమ్మనిరి. కాని నాకు నాకోరిక ప్రకారము టెయిలరు హైస్కూలులో జీతము లేకుండ జదువుకొను నదృష్టము లేకపోయెను. నాలుగైదు దినములా పాఠశాలకు బోయితిని. అయ్యరుగారుగాని పుండరీకాక్షుడుగారుగాని నా కుపకారము జేయ లేకపోయిరి. ఆకారణమున నేను 1884 వ సంవత్సరమున జదువుమానుకొని కొన్నాళ్లు వీరవాసరములో నుంటిని.

ఆకాలమున పుప్పాల శ్రీరాములు నాయుడుగారని యొక డాక్టరుగారు తణుకులోనుండిరి. అప్పుడు డాక్టరును "ఆస్పటల్ అసిస్టెంటు" అని పిలిచెడివారు. ఇప్పుడు సబ్ అసిస్టెంటు సర్జన్ (Sub Assistant surgeon) అని పిలుచుచున్నారు. వీరవాసరములో నంతకు ముందు పుప్పాల శ్రీరాములు నాయుడుగారా పనిలోనే యుండిరి. తరువాత వారు తణుకు గ్రామమునకు బదిలీచేయబడిరి. మా మేనమామగా రాయనవద్దకు బోయి మందుదెచ్చి మాయమ్మ కిచ్చిరి. మాయమ్మ గుండెలలో నొప్పితగ్గెను. ఆదినములలోనే మాతమ్ముడు గూడ జబ్బుపడెను. మన్యప్రదేశమైన లింగంపర్రులో చాల కాలముం

కుటచే కాబోలు నతనిశరీరమిక్కడకు వచ్చిన తరువాత నీరుపట్టెను. అతనికిగూడ మా మేనమామగారు మందిప్పించి బాగుచేయించిరి. ఇచ్చట మాతమ్ముని గురించి యొక్కమాట చెప్పవలెను. అతనికి చిన్నప్పటినుండియు దేహారోగ్యము సరిగలేదు. తరుచుగ జబ్బు పడు చుండెడువాడు. 1884 వ సంవత్సర ప్రాంతమున, వానికొక మూర్ఛ రోగము బయలుదేరెను. మిక్కిలి శ్రమపడి మాతండ్రిగారు చికిత్సలు చేయింపగా నది యెట్టకేలకు నివారణమయ్యెను. అందుచేత వానికి సరిగ జదువంటలేదు. మా మేనమామగారు తణుకు కమిటీస్కూలులో నమారమి నాలుగు సంవత్సరములు పనిచేసిరి. ఆయన మొట్టమొదట అచ్చట జేరినప్పుడు గోటేటి వెంకటశివరావుగారు ప్రధానోపాధ్యా యులుగ నుండిరి. తరువాత వారు న్యాయవాది పరీక్షకుచదివి న్యాయ వాదియై ఏలూరులో చాలకాలము పనిచేసిరి. మల్లయ్యశాస్త్రిగారికిని వారికిని యావజ్జీవము స్నేహముండెను. అస్లే తణుకు పాఠశాల పరి పాలకసంఘములో ముఖ్యసభ్యులైన దొడ్డిపట్ల వెంకటరత్నముగా రితోగూడ నత్యంత స్నేహము మల్లయ్యశాస్త్రిగారికి గలదు.

చదువు మానుకొని నేనా సంవత్సరమున గోటేటి సోమరాజు గారను వారి కుమారుని కింటివద్ద పాఠములు చెప్ప నారంభించితిని. ఆయన నరసాపురము తాలూకా కచ్చేరిలో గుమాస్తాగ నుండిరి. ఆయనకుమారు డేదో చిన్నతరగతిలో చదువుచుండెడివాడు. చదువు చెప్పినందుకు నా కాయన భోజనము పెట్టుట నిర్ణయము. 1884 వ సంవత్సరము మార్చి, ఏప్రియల్ నెలలలో, నరసాపురములో వారి యింటనుండగ సోమరాజుగారు తన కుమారుని, నన్నును శివకోడు బంపిరి. శివకోడులో సోమరాజుగారి తమ్ముడు బాపిరాజుగారుండిరి. సోమరాజుగారి కుమారునకును, బాపిరాజుగారి కుమారునకును నేను శివకోడులోనుండి, బాపిరాజుగారింటనే భోజనముచేయుచు, బాలుర కిద్దరకు జదువు చెప్పునట్లేర్పాటుచేసిరి. ఆ పనిజేయుచు నేను శివకో డులో కొన్ని దినములుంటిని.

ఇప్పటివలె నప్పుడు రాజవోలు తాలూకా లేదు. శివకోడు నరసాపురము తాలూకాలో నొకభాగము. అచ్చట డిప్యూటితహసీలు దారు కచేరీయు, సబురిజిస్ట్రారు కచేరీయు మరికొన్ని కచేరీలునుండెను.

అక్కడకు రాజవోలు మిక్కిలి సమీపమున నుండెను. రాజవోలులో నొక గొప్ప కొబ్బరితోట యుండెను. అందులో వేలకొలది చెట్లు గలవు. అది రండలుదొరగారిది. పోగాకు వేణురావుపంతులుగారి రెండవ కుమారుఁడైన రామారావుపంతులుగారికిని, రండలుదొరగారికిని, వేణురావుపంతులుగారి నాటనుండియు పరిచయము గలదు. ఆ తోట వ్యవహారములు సరిగ లేనందున చెట్లకు మరమ్మతు చేయించుటకు, శిస్తువసూలుచేసి పంపుటకు దగిన మనుష్యుఁడుగావలసి యుండుటచే రండలుదొరగారు తమతోటమీఁద రామారావుపంతులుగారిని గుమాస్తాగా నియమించిరి. రామారావుగారు భార్యాసమేతులై నరసాపురమునుండి రాజవోలు వెళ్ళి, తోటలో నొక బంగాళాలో బసచేసియుండిరి. పూర్వము వారింట నేను కాపురముండుటచేతను, వారికి నామీఁద మిక్కిలి దయయుండుటచేతను, నేను వారినొకసారి జూచుటకై శివకోడునుండి రాజవోలు వెళ్ళితిని. అక్కడ కొన్ని దినములుండమని రామారావుపంతులుగారు నన్ను బలవంతపెట్టుటచేత రాజవోలులో కొన్ని దినములుంటిని. వేసవికాలపు సెలవులు ముగిసిన తరువాత, నేను శివకోడునుండి వీరవాసరము వెళ్ళి, యచటనుండి తణుకు వెళ్ళితిని.

ఆ దినములలో రాజమహేంద్రవరములో "ఆర్టుమను" దొరగారు మిషను పాఠశాల నొకదానిని స్థాపించిరి. దానికి నిడమర్తి దుర్గయ్యగారను వాడుకపేరుగల జలదుర్గప్రసాదరాయుడుగారు ప్రధానోపాధ్యాయులైరి. అంతకుముందు ఇన్నీసుపేట స్కూలులో చిరకాలమునుండి తెలుగు పండితులుగనున్న, బ్రహ్మశ్రీ వడ్డాది సుబ్బరాయుడుగారుకూడ, మిషనువారి పాఠశాలకు నాంధ్రోపాధ్యాయులుగ వెళ్ళిరి. అందుచేత నిన్నీసుపేట స్కూలులో నా పదవి కాళీ యయ్యెను. బ్రహ్మశ్రీ ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రిగారు చిరకాలమునుండి ఇన్నీసుపేట స్కూలులో సంస్కృత పండితులుగనుండిరి. వ్యాసమూర్తిశాస్త్రిగారును, మల్లయ్యశాస్త్రిగారును మిత్రులై, బంధువులైయుండిరి. అందుచేత మల్లయ్యశాస్త్రిగారు వ్యాసమూర్తిశాస్త్రిగారిద్వారా యాపనికి ప్రయత్నముచేసిరి. రాజమహేంద్రవరములో కళాశాలకు ప్రిన్సిపాలుగనున్న మెట్కాఫ్‌దొరగారి అధ్యక్షత క్రింద నొక పాఠ

శాలా పరిపాలక సంఘమేర్పడెను. ఆ సంఘము పరిపాలన క్రింద రెండు పాఠశాలలుండెడివి. ఒకటి యిన్నీసుపేట స్కూలు; రెండు టవునుస్కూలు. టవునుస్కూలు ప్రాతయూరిలో మెరకవీధి నుండెడిది. ఇప్పుడు టవునుహాలుకు నెదురుగానున్న స్కూలు మందిరమదే. అది సంఘమువారి సొంతభవనము. ఇన్నీసుపేట స్కూలు ప్రస్తుతము వరదరావుగారు మేడ గట్టినచోట నుండెడిది. ఆ పరిపాలక సంఘములో పట్టణములోని పెద్దమనుష్యులు కొందరు కళాశాలలోని యుపాధ్యాయులు కొందరు సభ్యులుగ నుండిరి. ఆ పరిపాలక సంఘమునకు కార్యదర్శిగ నప్పుడు శ్రీ పార్థి శ్రీనివాసరావు పంతులుగారుండిరి. ఆయనప్పుడు కళాశాలలో నొక యుపాధ్యాయుడుగ నుండిరి. ఆ పంతులుగారు మల్లయ్యశాస్త్రిగారికి నిన్నీసుపేట స్కూలులోని ఆంధ్రోపాధ్యాయ పదవినిచ్చిరి. అందుచేత మల్లయ్యశాస్త్రిగారు సకుటుంబముగ రాజమహేంద్రవరము వచ్చిరి. ఆయనయు, తల్లియు, భార్యయు, నేనును, శాస్త్రిగారి పెద్దకుమారుడైన భద్రయ్యశాస్త్రి మూడు సంవత్సరములవాడును, రాజమహేంద్రవరము వచ్చితిమి. నేను ధనహీనతచే మరల జదువుకొనక యుండుటచేత, శాస్త్రిగారు మా కుటుంబమునిూదను, నామిూదనుగల యభిమానముచే, నాకు రాజమహేంద్రవరములో జదువు చెప్పింపవలెనని వెంటబెట్టుకొని పోయిరి.

---

# స్వీయచరిత్రము

## మూడవ ప్రకరణము

### రాజమహేంద్రవరములోని విద్యాభ్యాసము

నే నదివరకెన్నఁడును రాజమహేంద్రవరము జూచినవాఁడనుగాను. చూడవలెనని మాత్రము కుతూహలముండెడిది. అది యీరూపమున సిద్ధించినది. రాజమహేంద్రవరమునం దానాఁడు గల పాఠశాలల గురించి కొంత చెప్పుట యనవసరముగాదు. ఇన్నీసుపేట స్కూలు, టౌనుస్కూలు, ఈ రెండును పురపాలకసంఘమువారి పరిపాలనక్రింద నుండెడివి. మూఁడవది మిషనువారి పాఠశాల. ఇది స్థాపించిన "ఆష్టమను" దొరగారు, 1834 వ సంవత్సర మాగస్టులోనో సెప్టెంబరులోనో మృతినొందిరి. కాని యాయన మరణముతో నా పాఠశాల నిలుపుచేయఁబడలేదు. అందలి ప్రధానోపాధ్యాయులైన నిడమర్తి దుర్గయ్యగారును, సహోపాధ్యాయులును, నేదోవిధముగ పాఠశాల నిర్వహింపఁజొచ్చిరి. అందు దుర్గయ్యగారు గాక, కృష్ణస్వామినాయుడుగారు, జిల్లెళ్ళ కృష్ణారావుపంతులుగారు, ప్రగళ్ళపాటి జోగిలింగముగారు, వడ్డాది సుబ్బారాయుడుగారు, చావలి సోమనాథశాస్త్రిగారు మొదలగువా రుపాధ్యాయులుగ నుండిరి. నాలుగవది యాస్తిక పాఠశాల (Theistic School). 1881 వ సంవత్సరమున కలకత్తానగరమునుండి పండిత శివనాథశాస్త్రిగారిక్కడకు వచ్చి, యేకేశ్వరారాధనమునుగూర్చి మహోపన్యాసములు జేసిరి. ఆ యుద్రేకములో ననేకులకేకేశ్వరోపాసనము మీఁదను, బ్రహ్మసమాజము మీఁదను, నభిమానము గలిగెను. అట్లు కలిగినవారిలో మహారాజశ్రీ యేలూరి లక్ష్మీనరసింహముగారొకరు. వారు కులమున సృష్టికరణములు, పట్టపరీక్షయందు కృతార్థులైనవారు. ఆంగ్లేయభాషలో మంచి పండితులు. మంచి స్ఫురద్రూపి, యువకుఁడు. ఆయన యాస్తికపాఠశాల స్థాపించెను. అప్పటి కాయన కళాశాలలో నొక యుపాధ్యాయుఁడుగ నుండెను. ఐనను నేకేశ్వరారాధనము బాలురకు బోధించుటకై యా పాఠశాల స్థాపించి నడపిరి. నేను రాజమహేంద్రవరము వచ్చునప్పటి

కాపాఠశాలకు, టి. శివకుమారశాస్త్రిగారు ప్రధానోపాధ్యాయులుగ నుండిరి. ఆయనగాక వైద్యనాథయ్యరుగారు, ముత్తుస్వామిశాస్త్రిగారు గూడ నుపాధ్యాయులుగ నుండిరి. దుర్భా లక్ష్మీనరసింహశాస్త్రిగారు తెలుగు పండితులుగను, మల్లంపల్లి వీరయ్యశాస్త్రిగారు సంస్కృత పండితులుగను నుండిరి. ఐదవది "పేట్రియాటిక్" స్కూలు. దేశాభిమాన పాఠశాలయని దీనియర్థము. ఈ పాఠశాలను ద్రోణంరాజు కృష్ణారావుగారు స్థాపించిరి. ఇది ప్రస్తుతము విఘ్నేశ్వర దేవాలయమున్న ప్రాతయూర నొక వీధిలో నద్దెయింటనుండెను. ద్రోణంరాజు కృష్ణారావుగారు గోలకొండ వ్యాపారులు. ఆయన శ్రీ సుమ్మెలూరి వెంకటరంగారావుగారి బావమరిది. ఈ పాఠశాల లన్నింటిలో మెట్రిక్యులేషను తరగతి యుండెను. ఇప్పటివలె పాఠశాలా సంస్థాపనమునకుగాని, నిర్వాహణమునకుగాని, కఠినమైన నిబంధనలప్పుడు లేవు. సర్టిఫికెట్టులులేకుండ విద్యార్థులొక పాఠశాలనుండి మరియొకపాఠశాలకు, యథేచ్ఛముగ మారవచ్చును. విద్యార్థులిచ్చుకొనవలసిన జీతములు గూడ నంతకఠినముగ లేవు. నేనిక్కడకువచ్చినది తారణసంవత్సరము, అనగా 1884 వ సంవత్సరము. ఆసంవత్సరము గోదావరిపుష్కరము. మేము రాజమహేంద్రివరము రాగానే చెరుకువాడ లక్ష్మీనరసయ్యగారి యింటిలో బసచేసితిమి. ఆయింటిలో నొక భాగమున వ్యాసమూర్తిశాస్త్రిగారుకూడ బసచేసియుండిరి. అక్కడ రమారమి యొక నెలదినములుండి మేము బసమార్చితిమి. అప్పుడు పుష్కరము సంపూర్ణముగ జరుగుచుండెను. ఉత్కలదేశమునుండియు, నిజామురాజ్యమునుండియు, దక్షిణ యాంధ్ర మండలములనుండియు, వేనవేలు యాత్రికులువచ్చిరి. నేను పుష్కరము జూచుటకదే ప్రారంభము. అప్పటికి నాకు పదునేడు సంవత్సరముల వయస్సు. ఆంగీరస సంవత్సరములో (1872) నొకపుష్కరము జరిగినదిగాని నేనప్పుడు జిన్నవాడనగుటచే, నాకాగొడవ దెలియదు. మాతండ్రి మొదలగు పెద్దలు, చేరువనున్న నరసాపురము వెళ్ళి, గోదావరిస్నానముచేసిరని మాత్రము తరువాత వింటిని.

ఇన్నీసుపేటస్కూలుకు శ్రీ దామరాజు బసవరాజుగారు ప్రధానోపాధ్యాయులుగను, సోమంచి భీమశంకరముగారు రెండవ యుపా

ధ్యాయులుగను, శ్రీ సత్యవోలు లక్ష్మీపతిగారు మూడవ యుపాధ్యాయులుగను నుండిరి. టవునుస్కూలునకు యేలేశ్వరపు పేరయ్యశాస్త్రిగారు ప్రధానోపాధ్యాయులు, బ్రహ్మశ్రీ కల్లూరి వెంకటరామశాస్త్రిగారు సంస్కృతపండితులు, మండవల్లి కనకయ్యశాస్త్రిగారు తెలుగు పండితులు, వీరు ముఖ్యులు. పూర్వకాలమున రాజమహేంద్రవరము నందలి గవర్నమెంటువారి కళాశాలలో యిఫ్. ఎ., బి. ఎ. తరగతులే గాక, మిడిలుస్కూలు మెట్రిక్యులేషను మొదలగు క్రింది తరగతులు కూడ నుండెడివి. ఆ తరగతులకు బసవరాజు గవరరాజుగారు, బుర్రా రాజలింగశాస్త్రిగారు, ఏలూరి లక్ష్మీనరసింహముగారు మొదలగువారుపాధ్యాయులుగ నుండెడివారు. క్రమక్రమముగ, గవర్నమెంటువారు చిన్నతరగతులను తీసివేయుచువచ్చిరి. 1885 వ సంవత్సరమువరకు నిట్లు జరిగెను. ఆ సంవత్సమున కాలేజీ తరగతులతోపాటు మెట్రిక్యులేషను తరగతికూడ నుండెను. ఆ సంవత్సరాంతమున నాతరగతిగూడ దీసివేసిరి. 1886 వ సంవత్సరము జనవరి మొదలుకొని యఫ్. ఏ., బి. ఏ తరగతులు మాత్రమే కళాశాలలో నుండెడివి.

1884 వ సంవత్సరము డిశంబరులో నేను చల్లపల్లివారి చిన్న యింట నివసింపబోయితిమి. అది యిప్పుడు హిందూసమాజ మున్న వీధిలో నుండెడిది. ఆ యిల్లిప్పుడులేదు. అందొక భాగములో గర్జము శంభుశాస్త్రిగారను నొక కాలేజీవిద్యార్థి సకుటుంబముగ నుండెను. రెండవ భాగములో మల్లయ్యశాస్త్రిగారు ప్రవేశించిరి. 1885 వ సంవత్సరమున నన్ను మెట్రిక్యులేషను తరగతిలో ప్రవేశపెట్టుటకు మా మేనమామగారు ప్రయత్నించిరి. 1885 వ సంవత్సరమున కాలేజీలో మెట్రిక్యులేషను తరగతి యుండినది. కాలేజీలోనే చదువుట నాకు మిక్కిలి కుతూహలముగ నుండెను. విద్యార్థులను జేర్చుకొనుటకు మెట్కాఫ్ దొరగారొక ప్రవేశపరీక్ష పెట్టిరి. ఇంగ్లీషులోను, గణితము లోను మాత్రమే పరీక్ష జరిగెను. గణితములో నాకు మార్కులు తక్కువ వచ్చియుండునుగాని, యింగ్లీషులో మార్కులు బాగుగవచ్చి యుండును. పరీక్షించిన యుపాధ్యాయులు నా గణితపు మార్కుల సరకుగొనక, యింగ్లీషు మార్కులతో మాత్రమే సంతసించి, నన్ను మెట్రిక్యులేషను తరగతిలో జేర్చుకొనిరి. ఆ తరగతి కాకాలమున

సంవత్సరమునకు రు 36/-లు మాత్రమే జీతముక్రింద విద్యార్థి కట్టవ లెను. ఏ చిక్కులుపడియో మాతండ్రిగారా జీతము నిచ్చిరి. అప్పుడు కళాశాలలో మా తరగతికి పాఠములు చెప్పువారెవరనిన, బ్రహ్మశ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు. వీరు పట్టపరీక్షాసిద్ధులు. ఈయన గణితమును, భూగోళశాస్త్రమును బోధించుచుండెడివారు. విశ్వనాథయ్యరుగారని మరొక ద్రావిడి యుండెను. ఆయన మా కింగ్లీషును, హిందూదేశ చరిత్రమును, నింగ్లాండుదేశ చరిత్రమును జెప్పుచు వచ్చిరి. కందుకూరి వీరేశలింగము పంతులుగారప్పుడు సహాయాంధ్రోపాధ్యాయుడుగ నుండి, మాకు తెలుగు జెప్పుచుండిరి. విశేషకాలము వారివద్ద సంఘ సంస్కరణము మొదలయిన విషయములే యెక్కువగ వచ్చుచుండెను. దీనినిబట్టి పాఠములు చెప్పుచుండుటలేదని యభిప్రాయపడగూడదు. ఆయన పాఠములు సరిగ చెప్పుచుండెడివారు. ఆ సంవత్సరము, మాకు భారతములోని సభాపర్వమందలి ద్వితీయాశ్వాసము, పద్యకావ్యముగ నియమింపబడెను. శ్రీమాన్ కొమాండూరి యనంతాచార్యులుగారు రచియించిన యుత్తరహరిశ్చంద్రచరిత్రమును, బ్రహ్మశ్రీ కొక్కొండ వెంకటరత్నము పంతులుగారు రచించిన యువరాజ హిందూస్థాన సందర్శన మను వచనకావ్యమును, పాఠ్యగ్రంథములుగ నిర్ణయింపబడెను. ఈ కడపటి గ్రంథమును గురించి కొంత చెప్పవలెను. శ్రీవిక్టోరియారాజ్ఞీగారి జ్యేష్ఠపుత్రుడైన యెడ్వర్డుప్రభువుగారు యువరాజుగ (Prince of Wales) నున్నప్పుడు, 1875 వ సంవత్సరమున హిందూదేశమును సందర్శింప వచ్చిరి. ఆ సందర్శనమును గూర్చి, యన్ని భాషలలోను గ్రంథములు రచియింపబడెను. చెన్నపురివాసులాసందర్శనమును గూర్చి, తెలుగులో నొక గ్రంథమును వ్రాయుమని, శ్రీ కొక్కొండ వెంకటరత్నముపంతులు గారిని కోరినందున వారా గ్రంథమును రచించిరి. అందులో కొంత భాగము మాకు పఠనీయ గ్రంథముగ నియమింపబడెను. అప్పుడు కళాశాలలో నలుగురు పండితులుండిరి. కాలేజీ తరగతులకు తెలుగు చెప్పుటకు, తొల్లి రామశాస్త్రిగారుండిరి. ఈయన మిక్కిలి గట్టివారని వారి శిష్యులిప్పటికి చెప్పుచుందురు.

కాలేజీ తరగతులకు సంస్కృతము చెప్పుటకు, వేదం వెంకట రమణశాస్త్రిగా రుండిరి. ఈయన వేదం వేంకటరాయశాస్త్రిగారి తండ్రిగారు, ఈయన మిక్కిలి సమర్థులు. క్రింది తరగతులకు సంస్కృతము చెప్పుటకు కస్తూరి శివశంకరశాస్త్రిగారును, తెలుగు చెప్పుటకు కందుకూరి వీరేశలింగముగారు నుండిరి. ఆసంవత్సరమే రాజమహేంద్రవరము కళాశాలలో ప్రకృతిశాస్త్ర శాఖగూడ క్రొత్తగ బెట్టిరి. ఆశాస్త్రము బోధించుటకై, చెన్నపురినుండి మాలూరి రంగాచార్యులుగారు, కళాశాలకువచ్చిరి. శాస్త్రపాఠముల నాసంవత్సర మాయనే చెప్పిరి. ఆయన నామీద చాల దయగలవారై నా కన్నులకు సులోచనముల కోసము చెన్నపురినుండి దెప్పించుకొమని, చాలసార్లు సలహా నిచ్చిరి. అప్పుడు తాయి సూర్యప్రకాశరావు నాయుడుగారు బి. ఏ. తరగతిలో చదువుచుండిరి. ఆయనకుగూడ నేత్రములలో గొంత లోపముండెను. ఆయన నిరంతరము కంటిజోడు ధరించుచుండిరి. ఆయన నాకు మిత్రులై చెన్నపురికి వ్రాసి కొన్ని సులోచనపు జోళ్లు తెప్పించిరి. అవి యేవియు నాకంటికి సరిపడలేదు. కావున జోళ్లు వెంటనే పంపించివేసిరి. ఇంగ్లీషులోను, దేశచరిత్రములలోను, నాంధ్రభాషలోను, నేను తరగతిలో నగ్రగణ్యుడనై యుంటిని. కాని, గణితములో మాత్రము లోపమెప్పటివలెనే యుండెను.

అప్పుడు కాలేజీలో ప్రధాన సహాయోపాధ్యాయులుగ (First Assistant) సి. నాగోజీరావు పంతులుగా రుండిరి. అంతకుముందే కొన్నాళ్ళ క్రిందట, గవర్నరుజనరలుగారైన "రిప్పను" దొరగారివల్ల, స్థానిక స్వపరిపాలనము మనకు వచ్చినది. పూర్వము సబ్ కలెక్టరే మునిసిపలు చైరుమనుగ నుండెను. 1884 వ సంవత్సరము మొదలు కొని మునిసిపలు కౌన్సిలరులను, నధ్యక్షుని, ప్రజలే యెన్నుకొనుట కధికారము వచ్చెను. అప్పటి నిబంధనల ప్రకారము గవర్నమెంటు వారి యుద్యోగస్థులుగూడ, మునిసిపలు చైరుమనుగను, కౌన్సిలరుగను యుండవచ్చును. అందుచేత నాగోజీరావు పంతులుగారు, రాజమహేంద్రవరమునకు మొట్టమొదట ప్రజలచే నెన్నుకోబడిన మునిసిపలు సంఘాధ్యక్షులైరి, వీరేశలింగముగారుకూడ మునిసిపలు సభ్యులుగ నుండిరి. మెట్రిక్యులేషను పరీక్షకు విద్యార్థులను బంపుటకు ముందుగ

నుపాధ్యాయులొక చిన్నపరీక్ష చేసిరి. అందు కృతార్థులైనవారినే పరీక్షకు పంపవలెనని వారు నిశ్చయించుకొనిరి. ఆ పరీక్షలో గణితమున నాకు తక్కువ మార్కులు వచ్చెను. మొదటవారు నన్ను పరీక్షకు బంపదలుచుకొలేదు గాని, ఇంగ్లీషులోను, దేశచరిత్రములోను, మార్కులు బాగుగ వచ్చియుండుటచే గాబోలు, వారు నన్ను పరీక్షకు పంపిరి. పంపినను నేను గణితములో నంతగ కృషి చేయలేదు.

ఆ తరగతిలో ప్రవేశించినది మొదలుకొని, నాకు తల్లాప్రగడ చలపతిరావుగారు మిత్రులైరి. మా మైత్రియంతకంతకు హెచ్చెను. చలపతిరావుగారు శ్రీ పాలుపల్లి పుండరీకాక్షుడుగారి యల్లుడు. ఆ సంవత్సరము నరసాపురమునుండి, పుండరీకాక్షుడుగారి కుమారు డచ్యుతరామయ్యయు, వారి యింటనేయుండి చదువుకొనుచున్న వారి మేనమామ కుమారుడు చిలకలపూడి సీతారామయ్యయు, వారియింటనే భోజనముచేసి చదువుకొనుచున్న ద్విభాష్యం కనకయ్య నతడును, వీరు ముగ్గురు, టయిలరు హైస్కూలు విద్యార్థులై చదివి, మెట్రిక్యులేషను పరీక్ష నిమిత్తమై రాజమహేంద్రవర మొక నెల ముందుగవచ్చి, చలపతిరావుగారి యింట బసచేసిరి. ఆ కాలమున మెట్రిక్యులేషను పరీక్ష ప్రాతగోదావరి జిల్లాకంతకుగూడ నొక్క రాజమహేంద్రవరములోనే జరుగుచుండెను. కాకినాడ, యమలాపురము, నరసాపురము, యేలూరు ననుచోట్లనే యున్నతపాఠశాల లుండెను. మెట్రిక్యులేషను పరీక్ష ప్రతి సంవత్సరము డిశంబరు పదునైదవ తేదీ మొదలుకొని యైదుదినములు జరుగుచుండెను. ఇతర స్థలములనుండి వచ్చిన విద్యార్థులతోను రాజమహేంద్రవరపు విద్యార్థులతోను పట్టణము నిండియుండెడిది. పరీక్షకు కూర్చుండెడి విద్యార్థులు రమారమి యైదారు వందలమంది యుండెడివారు. ప్రథమశాస్త్ర (యఫ్. ఏ.) పరీక్షగూడ నా దినములలోనే, కళాశాలలో జరిగెడిది. స్థలము చాలనందున కళాశాలా భవనముచుట్టును తాటియాకులపందిళ్ళు వేయబడుచుండెడివి.

పుండరీకాక్షుడుగారి కుమారుడును, వారి బంధుమిత్రులును, తెనుగు పాఠములు చక్కగ చదువుకొనందునను, నేను తెనుగులో మిక్కిలి యభిరుచిగలవాడ నగుటచేతను, యచ్యుతరామయ్యయు

వాని బంధుమిత్రులును ముందుగవచ్చి, నాచేత తెలుగు చెప్పించు కొనిరి. మెట్రిక్యులేషను తరగతిలో మేము నలుబది మంది చదువు కొంటిమి. అందరిపేళ్లు నాకిప్పుడించుమించుగ జ్ఞాపక మున్నవి. వారిలో యిప్పుడు బ్రతికియున్నవారము దువ్వూరి వీరభద్రయ్యగారును, దుగ్గిరాల దేవళరాజుగారును, నేనును. మరియెవరైన బ్రతికియున్నా రేమో నాకు దెలియదు. అప్పటి నా సహాధ్యాయులలో గొప్ప యుద్యోగముచేసిన వారొక్కరు మాత్రమే యుండిరి. ఈపట్టణమందు గొప్ప వైద్యుడని ప్రసిద్ధికెక్కిన, యేలూరి సాహేబుగారి తమ్ముని కుమారుడు సయ్యద్ ఉద్దీన్ సాహేబుగారు, కాకినాడలో జిల్లా రిజిష్ట్రా రుపనిచేసి యీమధ్యనే కీర్తిశేషులైరి. నా సహాధ్యాయులలో తల్లాప్ర గడ చలపతిరావుగారు, సూరి సుందరరామశాస్త్రిగారు, న్యాయవా దులై కొన్నాళ్ళ క్రిందట కీర్తిశేషులైరి. పరీక్షకు నన్ను బంపిరేగాని గణితవిద్యలో, నేను మిక్కిలి పేదవాడనగుటచే నాసంవత్సరము నేను పరీక్షలో దప్పితిని. ఆ పరీక్ష యిప్పటి స్కూలుఫయినలు పరీక్షకు సమానమందురుగాని, కొంతభేదము గలదు. ఇంగ్లీషులో నూటికి ముప్పదిమూడు మార్కులు, తెలుగులో నూటికి ముప్పదిమూడు మార్కులు రావలెను. గణితము, బీజగణిత, రేఖాగణితముననను, మూడు విషయములలో వచ్చు మార్కులు కలుపుదురు. అందులో నాలుగవవంతు మార్కులు రావలెను. దేశచరిత్రములోను భూగోళ ములోను ప్రకృతిశాస్త్రములోను వచ్చుమార్కులు కలిపివేయుదురు. అందులోగూడ నాలుగవవంతుమార్కులు రావలెను. కాని మొత్తము మీద నన్నిమార్కులలోను మూడవవంతు రావలెను.

18౬౫ వ సంవత్సరము జనవరి నెలలో, ననగా తారణ సంవ త్సర పుష్యమాసములో, నాకు మూడవచెల్లెలు పుట్టినది. ఆమెపేరు వెంకటరమణమ్మ. ఈమె పుట్టినది మొదలు నాలుగు సంవత్సరముల వరకు రోగపీడితయై, తలమీద కురుపులు మొదలగువాటితో బాధ పడుచుండెను. ఈమె జీవించునని మా తలిదండ్రులుగాని, బంధువులు గాని, యనుకొనలేదు. ఈమె బ్రతికినచో, నీమెపెండ్లి చిన్న తిరు పతిలో చేయుదుమని, మా తలిదండ్రులు మ్రొక్కుకొనిరి. అదృష్ట వశమున నెట్లో గండములుగడచి మా చెల్లెలు బ్రతికెను. మా తండ్రి

గారికి నాయుపిల్లలమీద మిక్కిలి ప్రేమ. రమణమ్మ పుట్టిన వెంటనే మాతల్లికి గుండెలలో నొప్పి మరల బయలుపడెను. వీరవాసరములో మంచి వైద్యులు లేరు, అందుచేత మా తల్లి రాజమహేంద్రవరములో నున్న మా మేనమామకడకు వచ్చెను. అదృష్టవశమున నాదినము లలో, వెనుక మాందిచ్చిన పుప్పాల శ్రీరాములునాయుడుగారు, కార్యాంతరముమీద రాజమహేంద్రవరము వచ్చిరి. నేను వారిబసకు వెళ్ళి మా తల్లి రోగమునకు మంచిమ్మని యడిగితిని. ఆయన కాగి తముమీద మందులపేర్లు వ్రాసియిచ్చి, యవికొని నేలవేము కషా యముతో పుచ్చుకొనుమని చెప్పెను. ఆ దినములలో మందుల విక్ర యించెడి యంగళ్లు లేవు. ఆల్‌కాటుతోటలో డాక్టరు హేందెనను నొక దొరగారుండిరి. ఆయన వైద్యులు. వారమునకు మూడు రూపాయలు పుచ్చుకొని టంజాముమీద నెక్కి వెళ్ళి, గృహస్థుల యిండ్లలో వైద్యము చేయుచుండెడివారు. ఆయనవద్ద మందులు విక్రయమునకు గూడ దొరకుచుండెడివి. మా మేనమామగారు దొరగారియింటికి వెళ్ళి, యా మందులుకొని, యేమందు నెన్నిపాళ్ళు కలుపవలెనో దొరగారి వలన తెలిసికొని, యా ప్రకారము మందివ్వజొచ్చిరి. ఆ మందుతో మాతల్లికి నొప్పి నివారణమయ్యెను. ఆరోగ్యము సంపూ ర్ణముగ గలిగిన పిదప, మాతల్లి నన్ను దక్కినబిడ్డలను దీసికొని, వీర వాసరము వెడలిపోయెను.

1885 సంవత్సరము వేసవిసెలవుల యనంతరము కాలేజీలో నొక మార్పు జరిగెను. వేసవికాలపు శెలవులలో, లొల్ల రామశాస్త్రి గారు స్వర్గస్థులైనందున, శ్రీ వీరేశలింగం పంతులుగారిని వారి స్థాన మందు ప్రధానాంధ్రోపాధ్యాయులుగ దొరతనమువారు నియమించిరి. రెండవ తెలుగుపండితపదవి తీసివేయబడెను. ఆ సంవత్సరము నేను పరీక్షలో తప్పిపోతిని గావున, మఱుసటిసంవత్సరము మరల చదువ వలసివచ్చెను. 1886 సంవత్సరమునుండి కాలేజీలో మెట్రిక్యులేషను తరగతి తీసివేసిరి. కాబట్టి నేను మఱియొక పాఠశాలలో చదువవలసి వచ్చెను. అంతలో మరియొకమార్పు జరిగెను. ఇన్నీసుపేటస్కూలు, టవునుస్కూలు నను రెండు పాఠశాలలు మెట్కాఫ్ దొరగారి యధ్యక్షతక్రింద నేర్పడిన యొక పరిపాలకసంఘముక్రింద యుండెనని

యిదివరకే చెప్పితిని. ఆ రెండుపాఠశాలలలోనున్న హైస్కూలు తరగతులు తీసివైచి, పరిపాలకసంఘమువారు టౌన్ అండ్ ఇన్నీస్‌పేట్ హైస్కూల్ (Town and Innıspet Highschool) అను నొక క్రొత్త యున్నతపాఠశాలను పెట్టిరి. తగిన చోటులేనందున, కాలేజీ యావరణమున దక్షిణపునైపున నొక తాటియాకులపాక వైచి, దానిలో నా పాఠశాలను నెలకొల్పిరి. దానికి వేదం వెంకటరమణశాస్త్రిగారి రెండవ కుమారుడును, మునుపు రాజమహేంద్రవర కళాశాల విద్యార్థియు పట్టపరీక్షాసిద్ధుడు నైన, శ్రీ వేదము వేంకటాచలముగారిని, ప్రధానోపాధ్యాయులుగ నేర్పరచిరి. ఏలేశ్వరపు పేరయ్యశాస్త్రిగారను వారిని, ద్వితీయోపాధ్యాయులుగ నేర్పరచిరి. ఇందు మెట్రిక్యులేషను తరగతియు, దానిక్రింది తరగతియు మాత్రమే యుండెను. తక్కిన తరగతులు లేవు. రెండే తరగతులు. ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రి గారును, పురాణపండ మల్లయ్యశాస్త్రిగారును, నుదయమున నిన్నీసు పేట స్కూలులో సంస్కృతాంధ్రములు జెప్పునట్లును, మధ్యాహ్నమీ క్రొత్తపాఠశాలలో పనిచేయునట్లును, నధికారులు నిర్ణయించిరి. మొత్తముమీద నీ పాఠశాలలో తరగతులు రెండు. పనిచేయునట్టి యుపాధ్యాయులు నలుగురు. వేదము వేంకటాచలముగారు మిక్కిలి సమర్థులు. ఆ పాఠశాలాపరిపాలకసంఘమున కప్పుడు కళాశాలలో ప్రకృతిశాస్త్ర పండితుడుగ నుండిన యమ్. రంగాచార్యులుగారు, కార్యదర్శిగ నుండిరి.

1886 వ సంవత్సరమున మొదటగాక జూలై నెలలో నేనీ క్రొత్త పాఠశాలలో జేరితిని. అప్పటి నిబంధనలప్రకారమాలాగున చేరవచ్చును. ఆసంవత్సరము మాతరగతిలో నించెమించుమించుగ నపువది డెబ్బదిమంది విద్యార్థులుండిరి. అప్పటి నాసహాధ్యాయులలో శ్రీ రాయసం వెంకటశివుడుగారు, శ్రీ చెదలవాడ గోపీనాధముగారు, శ్రీ ధరణీప్రగడ శివరావుగారు. శ్రీ సారంగ భీమశంకరముగారు మాత్రము దైవానుగ్రహమున నిప్పటికి జీవించియుండబట్టి కలుసుకొనెడిభాగ్య మప్పుడప్పుడు నాకుకలుగుచున్నది. ఆకెళ్ళ ప్రకాశముగారిటీవల స్వర్గస్థులైరి. ఆ సంవత్సరమైనను నేను గణితములో గట్టి కృషిచేయ లేదు. ఆ యేడుగూడ నేను పరీక్షకు దరఖాస్తు చేసితిని.

గణితమున మంచి ప్రశ్నలేనందున నేనా యేటగూడ తప్పిపోతిని. ఆ సంవత్సరము పరీక్షముందర నాకొక చిక్కుగూడ సంభవించెను.

పరీక్షముందర నా కజీర్ణమువల్ల భేదిగలిగినది. నేను ధర్మాసుపత్రికిబోయి మందు తెచ్చుకొంటిని. ఆ వైద్యుఁడు నా తత్వమెరుగక మందులో నల్లమందుకూడ కొంతగలిపెను. చిన్ననాటనుండియు నాకు నల్లమందు బొత్తిగపడదు. అది వాసనజూచినంతమాత్రముననే నాకు వమనములు వెళ్ళును. ఈ వైద్యముచేత నాకు డోకులు వెళ్ళనారంభించెను. ఇంటివద్దనుండి పరీక్షకు కాలేజీకి వెళ్ళుచుండగా త్రోవలో నెన్నో వమనములు వెళ్లెను. పరీక్షకు గూరుచుంటినిగాని వికారముచేత నాతల దిరుగజొచ్చెను. అక్కడగూడ రెండు మూడు డోకులు వెళ్లెను. ఈ విధముగ ప్రథమదిన మెట్లో గడిచెను. మరునాఁడు వికారము, వమనములు లేవు. ఏ కారణముచేతనైన నేమి నేను పరీక్షలో దప్పిపోతిని. ఆ సంవత్సరమున నాకు (శ్రీ) పారుపల్లి పుండరీకాక్షుఁడుగారి కుమారు డచ్యుతరామయ్య, తనకు గత సంవత్సరమున నేను తెనుగు చెప్పినందుకు కృతజ్ఞుడై పదిరూపాయలు నాకు బహుమానమిచ్చెను. నేను పరీక్షలో దప్పిపోతినని దెలియఁగానే, రెండు సార్లు దప్పిపోతినని విచారించి, కొంచెము విరక్తి గలిగి, నావద్ద నున్న పది రూపాయలు చేతబుచ్చుకొని, కాకినాడకో మరెక్కడికో బోవలెనని, ధవళేశ్వరముదాక నడచి వెళ్ళితిని. 1886 వ సంవత్సరమున గోదావరికి గొప్ప వరదలువచ్చుటచే, ధవళేశ్వరపులాకు బ్రద్దలై కొట్టుకొనిపోయెను. అందుచేత గవర్నమెంటువారు దాని దగ్గరనే మరియొక క్రొత్త లాకు కట్టింప నారంభించిరి. నేను ధవళేశ్వరము వెళ్లినప్పటి కది తయారగుచుండెను. నాకప్పుడు దారి తెలియక కంగారుపడి ప్రయాణముమాని, యింటికివచ్చితిని. నా మేనమామగారు నేను పరీక్షలో దప్పిపోతినని విని, కొంచము విచారించి, "మరల చదువుకొందువుగాని విచారింపకుమని" నాకు ధైర్యముచెప్పి, చీవాట్లుపెట్టి తిట్టక యూరకుండిరి.

1887 వ సంవత్సరమున యేప్రిఁయల్ నెలలో నా రెండవ చెల్లెలైన యచ్చమ్మకు వివాహమయ్యెను. వరుడు మధునాపంతుల కాలభైరవశాస్త్రిగారి మూఁడవ కుమారుఁడైన రామస్వామి. అతడు

వీరవాసరము స్కూలులో మిడిలుస్కూలు పరీక్షయందు కృతార్థుడై నవాడు. అతడు నాకంటె రెండు సంవత్సరములు చిన్నవాడు. ఈ పిల్ల నతనికిచ్చి వివాహముచేయుట మా బంధువులలో చాల మంది కిష్టములేదు. ఏలయన మధునాపంతులవారు, ధాత సంవత్సరము కరువునకు నిలువలేక యుద్దంకి సీమనుండి వచ్చి యేలాగో కాలక్షేపము చేయుచున్నవారు. వారి కిల్లువాకిలిగాని, మడిమాన్యములుగాని లేవు. చదువు చిన్నచదువు. కాని వరుడు రూపసి. తెలివిగలవాడు. వినయము, వివేకముగలవాడు. అందుచేత మాతండ్రిగారు పిల్లను వానికే యిచ్చుటకు నిశ్చయించిరి. అతనికిచ్చుట నాకు నిష్టమే. ఆ వివాహములో నా తమ్మునకు కృష్ణమూర్తి కుపనయనము జేసిరి. అతని కప్పటికి పదియారేండ్ల వయస్సు. అతడు మొదటినుండియు జబ్బువాడగుటచే నంత యాలస్యముగ నుపనయనమయినది. ఆ వివాహదినములలోనే నా పెద్దచెల్లెలయిన పున్నమ్మకు పునస్సంధానముజేసి యత్తవారింటికి బంపిరి. ఈ వివాహమైన రెండునెలలకు మాకొక తమ్ముడు పుట్టెను. ఆ శిశువు పురిటిలోనే సంధిగొట్టి మృతినొందెను. మొత్తము మీద మా తలిదండ్రులకు పదిమంది పుట్టితిమి. మా జననీజనకులు మృతినొందునప్పటికి నేమయిదుగురము మాత్రము బ్రతికియుంటిమి. నేనును, మా తమ్ముడు కృష్ణమూర్తియు, మా పెద్దచెల్లెలు పున్నమ్మయు, మా రెండవ చెల్లెలయిన యచ్చమ్మయు, మూడవ చెల్లెలయిన రమణమ్మయు మా మాతాపితల కంత్యమువరకు సేవ చేయ గలిగితిమి.

1887 వ సంవత్సరమున శ్రీ విక్టోరియారాణిగారప్పటి కేబది యేండ్లు పరిపాలనము చేసినందున సువర్ణోత్సవము (Golden Jubilee) జరిగెను. అది సామ్రాజ్య మంతటను జరిగెను. హిందూదేశమందలి పట్టణముల యందేగాక పల్లెలయందుగూడ నీ యుత్సవము వైభవముగ జరిగెను. మెట్కాఫ్ దొరగారు, కళాశాలా విద్యార్థులను నుపాధ్యాయులను వెంటబెట్టుకొని, జయపతాకములతోను మంగళవాయిద్యములతోను నూరేగుచు, మహ్యాజియముచేరిరి. పురప్రముఖు లనేకులాయుత్సవములో పాల్గొనిరి. రాజమహేంద్రివరమందలి కవులు కందుకూరి వీరేశలింగముగారు, వడ్డాది సుబ్బారాయుడుగారు, వావిలాల

వాసుదేవశాస్త్రిగారు, సుసర్ల అనంతరావుగారు, చిలంబి యాదినారాయణప్పనాయుడుగారు మున్నగువారు పద్యములు చెప్పిరి. రాజమహేంద్రవరమున నీయుత్సవము రెండుసారులు జరిగెను. రెండుసారులు పద్యములు జదువబడెను. నేను మొదటిసారి కొన్ని పద్యములు రచియించితినిగాని యవి నా మిత్రులు విని సంతోషించిరేగాని సభలో చదువబడలేదు. రెండవసారి యుత్సవము జరుగునప్పటికొక చిత్రకథ జరిగెను. నా పరిచితుడొకడు రాణిగారి మీఁద పద్యములు చెప్పవలెనని కుతూహలపడెను. కాని యతనికి లక్షణజ్ఞానములేదు. ఐనను తనకుతూహలము నెరవేర్చుకొనుటకై, యెవరిచేతనైన పద్యములు చెప్పించి తనకిప్పింపుమని, తనకును నాకును మిత్రుఁడైన దామెర్ల వెంకటరమణారావుగారి నడిగెను. ఆయన వానిని గురించి నాకు సిఫారుసుచేసిరి. నేను వారి మాటనుబట్టి తొమ్మిది పద్యములు వ్రాసి వానికిచ్చితిని. ఆయన యాపద్యములక్రింద తన పేరు వేసుకొని, యచ్చువేయించి, సభలో దక్కినవారి పద్యములతో పాటు శ్రీ వడ్డాది సుబ్బారాయుడుగారిచే చదివించుకొనెను. పేరులేకపోయినను యవి నాపద్యములేగదాయని నేను సభలోఁగూర్చుండి, విని సంతోషించితిని. తాను వ్రాయక పోయినను తన పేరు పదిమందిలోను వెల్లడియయ్యెనని యతడు సంతోషించెను. సభాసదులాపద్యములాలకించి, రచియించిన వారెవరో దెలిసికొనలేకపోయిరిగాని, పేరు వేసికొనిన నా మిత్రుఁడు మాత్రము రచియించలేదని నిశ్చయించిరి.

1887 వ సంవత్సరములోనే, మెట్కాఫ్‌దొరగారు సెలవు దీసికొని సీమ వెళ్ళిరి. వారి స్థానమందు దొరతనమువారు మాసుదొరగారిని యేర్పరచిరి. నాగోజీరావుపంతులుగా రంతకుముందే కళాశాలలోని ప్రథమ సహాయోపాధ్యాయత్వమువూని, యుత్తరమండలముల పాఠశాలా పరీక్షాధికారిగ వెళ్ళిపోవుటచే, వారి స్థానమున ప్రధాన సహాయోపాధ్యాయుడుగ వచ్చిన క్షీరసాగరము సుందరరావుపంతులుగారు, మెట్కాఫ్‌గారి సెలవుదినములలో తన కాపదవి నిత్తురని యాసపడి, యది యన్యథాజరుగుటచే బెంగగొనియో, మరియేకారణముననో, పక్షవాతము జబ్బుతగిలి యేప్రియల్ నెలలో నకస్మాత్తుగ మృతినొందిరి. ఈయన నాగోజీరావు పంతులుగారి తరువాత మ్యునిసి

పలు సంఘాధ్యక్షుడుగూడ నయ్యెను. మాసుదొరగారు ప్రథమశాస్త్ర పరీక్షకు చదువు విద్యార్థులచే, నా సంవత్సరము పాఠ్యపుస్తకమయిన "వెనీసు వర్తకుడు" (Merchant of Venice) అను నింగ్లీషు నాటకము నాడించిరి. అది షేక్సుపియరు మహాకవిచేసిన నాటకము. దొరగారు విద్యార్థులకు రెండు మూడు మాసము లుచ్చారణమును, నభినయనమును నేర్పి యాడించిరి. నాటక పాత్రధారులలో నా ప్రియమిత్రులయిన పారుపల్లి యచ్యుతరామయ్య, చిలకలపూడి సీతారామయ్య, తల్లాప్రగడ చలపతిరావు, సత్యరాజు మృత్యుంజయరావు మొదలగువారుండుటచే, నేనా నాటకమునకు పోయి చూచి మహానందమును పొందితిని. అందు షయిలాకు వేషము వేసిన వానిని సభాసదులు మెచ్చుకొనిరి. ఆనాడు నాటకశాలలు గాని పురమందిరములు గాని లేకపోవుటచే, నాటకము నవాబుదేవిడీలో నాడబడెను. ఇది సెప్టెంబరులో జరిగెను. రాజమహేంద్రవరములో నింగ్లీషు నాటకమాడుట కదియే మొదలు.

ఈ 1887 వ సంవత్సరమున కడపటిభాగమున, నాకు గొప్ప మనస్తాపము కలిగెను. పారుపల్లి పుండరీకాక్షుడుగారి కుమారుడైన యచ్యుతరామయ్యకును, నాకును దృఢమైన స్నేహబంధ మేర్పడెను. అతనికి మిత్రుడును, నాకు బంధువును నైన ద్విభాష్యం కనకము చనిపోయెను. అచ్యుతరామయ్యకు నక్టోబరు నెల 26 వ తేదీని జ్వరము తగిలెను. అది క్రమక్రమముగ హెచ్చెను. సెట్రలుజెయిలులో డాక్టరయిన తటవర్తి రంగనాయకులు నాయుడుగారు వైద్యముచేసిరి. కాని జ్వరము తగ్గలేదు. రోగికి రెండవవారము సంధించెను. చివరవారములో పుండరీకాక్షుడుగారు కూడ నరసాపురమునుండి వచ్చిరి. కళాశాలా విద్యార్థులైన చెన్నాప్రగడ భానుమూర్తిగారు, వెన్నేటి రామచంద్రరావుగారు మున్నగువారును మరికొందరు దగ్గరబంధుగులును, రోగి కెన్నో మందులిచ్చి యుపచారములుచేసిరి. అయినను రోగము తగ్గలేదు. కాలేజీలో ప్రకృతిశాస్త్ర పండితులైన రంగాచార్యులుగారు కూడ వచ్చి రోగిని పలుమారులు చూచి పెదవి విరచిరి. కాని మూడువారములు మంచముమీద నుండి, బాధపడి, యచ్యుతరామయ్య 1887 వ సంవత్సరము నవంబరునెల 18 వ తారీకున శుక్ర

వారమునా డుదయమున, మృతినొందెను. అతని కంతకుముందే వివాహమయ్యెను. పుండరీకాక్షుడుగారి కంతకుముందు పదమూడేండ్ల క్రిందట భార్యావియోగమయ్యెను. ఆయనకీ బాలుడొక్కడే కుమారుడు. ఈ పుత్రుని నమ్ముకొని యాయన మరల వివాహము మానుకొనెను. బాలుడు బుద్ధిమంతుడు, రూపవంతుడు, దృఢశరీరము గలవాడు. అట్టి వాడేగదా మృత్యుదేవతకు గావలసివాడు! అతని మరణము నాకు మిక్కిలి దుఃఖమును గలిగించెను. అతడు నా యెడల మిక్కిలి ప్రేమ గలిగి యుండెడివాడు. ఏకపుత్రు డగుటచే శ్రీ పుండరీకాక్షుడుగారు మిక్కిలి గారాబముతో పెంచి యాతడేమి గోరిన నవి యిచ్చెడివారు. కుమారుడు డింగ్లీషు కవుల గ్రంథములన్నియు చెప్పింపుమని కోరగ, తండ్రిగారు దెబ్బదియైదురూపాయ లందునిమిత్త మిచ్చిరి. అచ్యుత రామయ్య యా సొమ్ముతో నాంగ్లేయకవుల గ్రంథములు దెప్పించెనే గాని, యవి చదువుకొను భాగ్యమాతనికి పట్టలేదు. అతని కప్పటికి పదునెనిమిది సంవత్సరములు వయస్సు. తండ్రి వృద్ధుడు. భార్య పండ్రెండు సంవత్సరముల వయస్సుగల బాలిక. అతని మరణముచే బంధువర్గమును మిత్రమండలియును, దుఃఖసముద్రమున మునిగెను. పుండరీకాక్షుడుగారే స్వహస్తములతో నగ్నిహోత్రము పుచ్చుకొని కుమారుని దహనము చేయవలసివచ్చెను. కుమారుడు చనిపోయిన మూడవ దినమున పుండరీకాక్షుడుగారు, శ్రమపడి మందిచ్చిన రంగనాయకులు నాయుడుగారికి డెబ్బదిరూపాయ లిచ్చి, కుమారుని గ్రంథభాండారములో నున్న యింగ్లీషు గ్రంథములను వాని మిత్రులకు పంచిపెట్టిరి. థామ్సనుమహాకవి యింగ్లీషులో వ్రాసిన పద్యకావ్యము గల యొక చిన్న సంపుటమును నాకుగూడ వారిచ్చిరి.

మా పెదచెల్లెలు కాపురమునకు వెళ్ళినతరువాత, మాతండ్రిగారు పుత్రికనుజూచుట కప్పుడప్పుడు నరసాపురము వెళ్ళుటచేత, మామగారికి నల్లునకు మునుపటి స్పర్ధలుపోయి మాటలు వచ్చెను. రాకపోకలుకూడ కలిగెను. మా తండ్రిగారు జామాతృ గృహమున భోజనముగూడ చేయ నారంభించిరి.

శీతకాలపు సెలవులకు, నేను పీఠవాసరము వెళ్ళి, యొకనాడు మా చెల్లెలిని జూచుటకు నరసాపురము నడచి వెళ్ళితిని. భోజనము

చేయుచుండగ మా బావగారు, మా తండ్రిగారిపై నేనో లోపముల నెంచి, నిరసనగ మాటలాడెను. నాకు వెంటనే కోపమువచ్చెను. భోజనము చేయగానే నేను వీరవాసరమునకు బయనమైతిని. బావగారు వన్నాపూట వెళ్ళవద్దని నొక్కి చెప్పెను. కోపావేశమున నేనా యనమాట వినకబయలుదేరి తిరిగినడచియే వీరవాసరము వెళ్ళితిని. రాను పదమూడుమైళ్లు, పోను పదమూడుమైళ్లు నడచుటచే పాదములు పొక్కులెక్కి నెత్తురుగ్రమ్మెను. నా సాహసమునకు మా తండ్రిగారు నన్ను చీవాట్లుపెట్టిరి. మాతల్లి మిక్కిలి విచారించి వేడినీళ్ళతో పాదములు గడిగించి బాధతగ్గించెను. అభిమానగ్రస్థుడనై నేనట్లు చేసితిని. మాటపడుట నాకెంతమాత్రి మిష్టము లేకపోయెను.

1887 వ సంవత్సరములో నేను గణితములో ముఖ్యముగ నంకగణితములో గొంత పరిశ్రిమజేసితిని. రేఖాగణితములోనున్న పాఠములన్నియు కంఠపాఠముగ నల్లించితిని. బీజగణితములో మాత్రము నాకెంతమాత్రిము పాండిత్యము కుదరలేదు. ఆసంవత్సరమున మెట్రిక్యులేషను పరీక్షకు ప్రథమశాస్త్ర పరీక్షకును విద్యార్థులెక్కువగ వచ్చిరి. అందుచేత మెట్కాఫ్ దొరగారు ప్రథమశాస్త్ర పరీక్షను మ్యూజియములోపెట్టి, యచట ప్రధాన సహోపాధ్యాయుడైన హెన్సుమనుగారి నుపద్రష్టగ నియమించెను. మెట్రిక్యులేషను విద్యార్థులకు కొందరికి పరీక్ష యిన్నీసుపేట పాఠశాలాభవనములోపెట్టి, యచట పార్థి శ్రీనివాసరావుపంతులుగారి నుపదిష్టగ నియమించి, దామరాజు బసవరాజుగారిని మరియొకరిని వారికి సహాయులుగ నిచ్చిరి. ఇన్నీసుపేట పాఠశాలలోనే, నా స్థానముపడెను. అన్ని పాఠములలోని ప్రశ్నములకు నేనుత్తరములు సరిగ వ్రాసితినిగాని, యాల్జీబ్రా నాకు రాదుగనుక నేనో కొన్ని కొంకిరి గీతలు గీసి జవాబుల కాగితములు బసవరాజు గపవరాజుగారికందించితిని. అందులో నాకు సున్న వచ్చియుండును. అంకగణితమున రేఖాగణితమున నాకు మార్కులా సంవత్సరమెక్కువగ వచ్చియుండును. అందుచే నేనా సంవత్సరము పరీక్షలో కృతార్థుడనైతిని. ఆ సంవత్సరము నా తరగతిలో చదివినవారిప్పుడు కొంతమంది నాకు జ్ఞప్తిలోనున్నారు. పోలవరము జమీందారుగారైన శ్రీ కొచ్చర్లకోట రామచంద్ర వెంకటకృష్ణారావుగారు, అచంట సూర్య

నారాయణరాజుగారు, బుద్ధిరాజు వీరభద్రరావుగారు, ప్రక్కి జగ్గయ్య
గారు, గుడిపాటి లక్ష్మీనరసింహముగారు, మున్నగువారు, ఆసంవత్స
రము మేము పండ్రెండుగురము పరీక్షలో కృతార్థులమైతిమి. ఈపైన
పేర్కొనినవారును నేనును నా యేడుపరీక్షలో కృతార్థులైనవారిలోని
వారమే. నేను వీరవాసరములో నుండగ పరీక్షలో దేలినట్లు నాకు
పోలవరము జమీందారుగారు జాబును వ్రాసిరి. పిమ్మట నేను రాజ
మహేంద్రవరము వెళ్ళి ప్రథమశాస్త్ర తరగతిలో చేర యత్నించితిని
గాని, గణితశాస్త్రములో గట్టి ప్రజ్ఞ లేకపోవుటచేతను, దృష్టిదోష
మెక్కువగునను భయముచేతను, తగినధనము లేకపోవుటచేతను,
నేను చదువు మానుకొని రాజమహేంద్రవరములోనే యుంటిని.

నా స్నేహితుడైన తల్లాప్రగడ చలపతిరావుగారు, 1885 వ సం
వత్సరములోనే మెట్రిక్యులేషను పరీక్షయందు కృతార్థుడై, 1886,
1887 సంవత్సరములలో ప్రథమశాస్త్ర (F. A) పరీక్షకు చదువుచుం
డెను. 1887 వ సంవత్సరాంతము వరకు నతడిన్నీసుపేటలో నొక
యద్దె యింటిలో గాపుర ముండెను. ఆ సంవత్సరాంతమున నతడు
పేటలో బసమాని, ప్రాతయూరిలో నతని బావమరదియైన రాయవ
రపు శ్రీరామ అప్పారావుగారి యింట నివసింపబోయెను. ఇన్నీసుపే
టలో నున్నప్పుడు వారియిల్లు మా బసకు దగ్గరగ నుండెను. అందు
చేత నేను ప్రతిదినము భోజనముజేసి చలపతిరావుగారి యింటనే చదు
వుకొనుచు, నచ్చటనే పండుకొనుచుంటిని. మా మేనమామగారిబస
చల్లపల్లి వారివీధిని దామరాజు బసవరాజుగారి యింటి యెదుటనున్న
పోతరాజువారి యింటిలో, ఆగృహమిప్పుడు దేవరాజువారు కొన్నారు.
చలపతిరావుగారి యింట నేను నిరంతరముండుటచే వారికి నాకు మైత్రి
యధికమయ్యెను. ఆకారణమున నేను ప్రతిదినము రెండుసార్లు భోజ
నముజేసి, చలపతిరావుగారి సహవాసము కొరకు పేట నుండి నడచి
ప్రాతయూరికి బోవుచుంటిని. మధ్యాహ్నము వండిన యన్నము
సాయంకాలము తిని చీకటి పడకుండగనే, నేను ప్రాతయూరికి బోవు
చుండెడివాడను. వేయేల, నేను చలపతిరావుగారి యింటను రాయవ
రపువారి యింటను మిక్కిలి చనువుగలిగి వారి యింటి మనుష్యులవలె
నుంటిని. చలపతిరావుగారికి మేనల్లుడును శ్రీరాయవరపు అప్పారావు

గారి కుమారుఁడైన రామమూర్తి మిడిలుస్కూలు తరగతిలో చదువు-చుండెను. నేనా సంవత్సరము పనిలేనివాఁడను గనుక, తెలుగు, నిం-గ్లీషు, దేశచరిత్రము మొదలయిన పాఠములు చెప్పుచుంటిని. గణితము-మేనమామయైన చలపతిరావుగారు చెప్పుచుండిరి. రామమూర్తితో-గూడ కొచ్చెర్లకోట నరసింహారావు నాదగ్గర చదువుచుండెను.

రాయవరపు (శ్రీ)రామఅప్పారావుగారిని గురించి కొన్ని పం-క్తులు వ్రాయుట యనవసరముగాదు. ఆయన తండ్రిగారి పేరు రామ-న్నగారు, ఆయన జిల్లాకోర్టులో న్యాయవాదిగనుండి కొంతకాలము-గవర్నమెంటు న్యాయవాదిగగూడ నుండెను. ఆ రామన్నగా రన్న-ప్రదాతయని ప్రజలు చెప్పుచుండెడివారు. అప్పారావుగారు మెట్రిక్యు-లేషను వరకు జదువుకొని, రాజమహేంద్రవరము సెంట్రలుజెయి-లులో నొక గుమాస్తాగ నుండెడివారు. ఆయుద్యోగము 1886 వ సం-వత్సరమున పోయెను. పిమ్మట కొంతకాలమాయెన యుద్యోగములేక యుండి, మనదేశమున కాదినములలో నూతనముగ వచ్చిన రైలు-సంబంధములో కంట్రాక్టరుగ పనిజేసిరి. ఆయన భార్య చిన్నతనము-నందే చనిపోయెను. ఒక కుమారుఁడు, నిద్దరు కుమార్తెలు నుండిరి. ఆయన మరల వివాహముజేసికొనక యొక వేశ్యాంగనను భార్యగా స్వీకరించి, విష్ణుభక్తుఁడై జీవితముగడపిరి. ఆయన మిక్కిలి మంచివారు. ఆసంవత్సరమున (1888) మేనెలలో చలపతిరావుగారు "పెద్దదేవము" అనుగ్రామమున వారి బంధువులయింట జరుగు వివాహమునకు వెళ్ళ-వలసివచ్చి, బలవంతపెట్టి నన్నుగూడ వారి వెంట దీసికొనిపోయిరి. పెద్దదేవమను గ్రామము కొవ్వూరుతాలూకాలోనున్నది. జనసామా-న్యము "పెద్దేహము" అని వాడుదురు. మరల మేము రాజమహేంద్ర-వరము వచ్చుసరికి వారమురోజులయినది.

ఆదినములలోనే, రాజమహేంద్రవరమున తహసీలుదారుగనుం-డిన నందివాడ పేరాజుగారు, మృతినొందిరి. ఆసంవత్సరము జూలై 16 వ తేదీని (శ్రీ) బసవరాజు గవరరాజుగారు మృతినొందిరి. వీరు వీరేశలింగముగారికి ప్రాణమిత్రులు, వీరేశలింగముగారు చేయు సమస్త కార్యములకు గవరరాజుగారు సాయపడుచుండిరి. గవరరాజుగారు వీరేశలింగముగారితోపాటు వెలిలో నుండుటచేత వారి దహనమునకు

సభాపతులు కొన్ని చిక్కులుపెట్టిరి. నాకప్పటికి గవరరాజుగారితో బరిచయము లేకపోయినను, వారియందలి గౌరవముచేత, జూలై 17వ తారీఖున, వారిశవముతో గూడ శ్మశానమునకు బోతిని. శవమును గరికపాటి సుబ్బారాయుడుగారు, దామెర్ల రమణరావుగారు, గాదేపల్లి సుబ్బయ్యగారు మరియొకరు మోసిరి. గవరరాజుగారి జ్ఞాతియైన బసవరాజు సేతూరావుగారగ్నిహోత్రము పట్టుకొనిరి. మంత్రపుబ్రాహ్మణుడు దొరకకపోవుటచే, కందుకూరి వీరేశలింగముపంతులుగారు, పుస్తకముజూచి మంత్రముచదివి, కర్మజేయించిరి. శవమువెంట శ్రీ నాగోజీరావుపంతులుగారు, న్యాపతి సుబ్బారావుపంతులుగారు, మొదలగు పురప్రముఖులందరు వచ్చిరి. ఆ సంవత్సరమే యనగా సర్వధారి సంవత్సరమందు భాద్రపద బహుళామావాశ్యనాడు, పోలవరము జమీందారిణీగారైన శ్రీ కొచ్చర్లకోట కామాయమ్మగారు, మృతి నొందిరి. ఈమె మహాపతివ్రత. మిక్కిలి ధర్మాత్మురాలు. ఇంట నన్నము బెట్టి జీతములిచ్చి చాలమంది విద్యార్థులకు జదువుజెప్పించెను. ఆమె దత్తపుత్రుడైన శ్రీరామచంద్రి వెంకటకృష్ణారావుపంతులుగారు నాకు మిత్రుడును సహాధ్యాయుడును నగుటచేత, నేనాశవముతో గూడ వెళ్ళితిని. ఆసంవత్సరమే రాజమహేంద్రివరము సబుకలెక్టరుగారి కచేరీలో సిరస్తదారుగనుండిన తాయి శేషగిరిరావు నాయుడుగారు, మృతినొందిరి.

ఆ సంవత్సరమే (1888) రాజమహేంద్రివరమున కేలూరు కంపెనీ యని యొక నాటకసమాజము వచ్చెను. ధారవాడ నాటకసమాజమువారు మొట్టమొదట తెనుగుదేశమునకు 1881 సంవత్సరమున వచ్చి, 1885 వ సంవత్సరమున మరల వచ్చిరి. ఆ సమాజమునకు నాయకుడైన వామనభట్ట జోషికిని, దక్కిన సభ్యులకును మనస్పర్థలు గలిగినందున, నేలూరుపట్టణమున నతడు తన సమాజమునుండి విడిపోయి, సమాజముమీద కోపముచేత మరియొక సమాజము దానికి పోటీగా లేవదీయదలచి, మన యాంధ్ర యువకుల కొందరను జేర్చుకొని, యొక నాటకసమాజమును లేవదీసెను. దానికే యేలూరు కంపెనీయని పేరు. ధారవాడ నాటకసమాజమువారివలెనే వీరును హిందీలో నాటకము లాడెడువారు. వీరి నాటకములు రమ్యముగ నుండె

డివిగాని, సామాజికుల నడతలు మంచివికావని జనులు చెప్పుకొను చుండెడివారు. వీరి నాటకశాల రాజమహేంద్రివరములో కొనుపాలు ప్రక్కకు తూర్పుగ నప్పుడు కాళీగానున్న దొడ్డిలో వేసిరి. ధారవాడ వారు గూడ 1881వ సంవత్సరమున రాజమహేంద్రవరము వచ్చినప్పు డక్కడనే నాటకశాల నిర్మించిరి. ఆ నాటకసమాజములో నామిత్రు లైన తల్లాప్రగడ చలపతిరావుగారికి బంధువులు కొందరుండినందున, నాటకములకు సాధారణముగ మా చలపతిరావుగారు వెళ్లుచు, నన్ను గూడ దీసికొనిపోవుచుండిరి. చలపతిరావుగారు టికెట్టు కొననక్కర లేదు. ఆయనతోటిపాటు నేను గొననక్కరలేకపోయెను. కాని పలుమా రులు సొమ్ము చెల్లించకుండ నాటకమునకు వెళ్లుట నా కిష్టములేక, చలపతిరావుగారు పిలిచినను నేనొకనాడు రానని చెప్పితిని. రాయవ రపువారి సావడిలో వెదురుపేళ్ళ చాపయొకటి యుండెను. రానని నేనా చాపమీద పండుకొంటిని. చలపతిరావుగారు నన్ను పిలిచిపిలిచి విసిగి, యెట్టకేలకు నాపై నలిగి, నా రెండుకాళ్లు పట్టుకొని యెందుకు రావనినన్ను బరబర యీడ్చెను. నా వీపు కొట్టుకొనిపోయినను నా మొండిపట్టు విడువక నేను పండుకొంటిని. అతడు ప్రాణము విసిగి తానొక్కడే నాటకమునకు వెళ్లెను.

నా పట్టుదల విషయమై రెండు మూడు చిన్న విషయములు వ్రాసెదను. పెద్దేవము పెండ్లికి నేను వెళ్ళినప్పుడొకనాడు నాకు మంచి నీళ్లు త్రాగుటకు చలపతిరావుగారి యప్పగారు వెండిపాత్రయిచ్చెను. నాకు వెండిపాత్ర వద్దని రెండు మూడుసార్లులామెతో జెప్పితిని. కాని యామె యా పాత్రయిచ్చి వెళ్ళిపోయెను. వెండిపాత్రి వద్దన్నను యిచ్చినదన్న కోపముచేత దాహమెంతో యైనను మంచినీళ్లు త్రాగ కయే, భోజనముజేసితిని. మరియొక సంగతికూడ చెప్పెదను. పొగ చుట్ట నాకలవాటు లేదు. నా మిత్రులందరు చుట్టకాల్చెడివారే, "మే మందరము కాల్చుచుండగ నీవేల కాల్చకపోవలెను? నీకుకూడ చుట్ట యలవాటుచేసెదమని" నా మిత్రులు పారుపల్లి యచ్యుతరామయ్య, చిలకలపూడి సీతారామయ్య, ద్విభాష్యము కనకము, తల్లాప్రగడ చల పతిరావు నా చుట్టును గూర్చుండి, చుట్ట నా కలవాటు చేయవలెనని చుట్టలుకాల్చి యాపొగ నా ముక్కులలోను నోటిలోను నూదిరి. నే

నక్కిరిబిక్కిరియై చుట్టయలవాటు జేసుకొనననిగట్టిగ జెప్పితిని. నానడ తను గురించి కొన్నిమాటలు యిక్కడ చెప్పవలెను. చలపతిరావుగా రును నేనును జదువుకొనుచున్న కాలమున నొకనాటి సాయంకాలము నేమిరువురము షికారు వెళ్ళితిమి. అతడు చుట్టలు దిట్టముగ్గ కాల్చెను. రమారమి యేడుగంటల కిద్దరము చలపతిరావుగారింటికి వెళ్ళితిమి. అతని తల్లియు నప్పగార్లు నతనిని బలుకరింపగా నతడేదో జవాబు చెప్పెను. చుట్టకంపు గుప్పున వారికి గొట్టెను. అప్పుడు వారుమువ్వురు వానిని దూషించి "నీ సహవాసములు మండిపోను, దుస్సహవాస ములుచేసి చెడిపోవుచున్నావు." అని వానిని మందలించి నన్నుగూడ తూలనాడిరి. అది వెన్నెలరాత్రి యగుటచే నేను మిక్కిలి దగ్గరగా నున్న మాయింటికి నడచిపోయితిని. ఆ మఱునాటినుండి చలపతిరావు గారింటికి వెళ్లుట మానితిని. చలపతిరావు తల్లి నన్నుగురించి కొందరు స్నేహితుల నడిగెను. వారామెతో "లక్ష్మీనరసింహము చాల మంచి వాడు, చుట్ట త్రాగడు, వాని సహవాసముచేత మీ పిల్లవాడు బాగు పడునుగాని చెడిపోడు. వానిని రావద్దనుట పొరపాటు" అని చెప్పిరట. నేను పదునైదు దినములవరకు చలపతిరావుగారింటికి వెళ్ళలేదు. అప్పుడు చలపతిరావు తల్లియు నప్పగారును తమ యింటికి రమ్మని నాకు వర్తమానమంపిరి. రమారమి మూసముదినములకు నేను వారి యింటికి వెళ్ళ నారంభించితిని. ఒకప్పుడు మధ్యాహ్నము వండిన యన్నము మాయింట లేనియెడల, సాయంకాలపు వంటయైనతరు వాత వేడియన్నము దిని జీకటిలో నేను ప్రాతయూరికి బోవుట కష్ట మని, భోజనము చేయకయే చలపతిరావుగారింటికి బోవుచుండెడి వాడను. అతడును వాని యింటిలోనివారును భోజనముచేసితివా యని నన్నడిగినప్పుడు, చేయలేదని చెప్పినపక్షమున వారియింట భుజియింప మందురేమో యని, మోమోటముపడి, భోజనము చేసితినని యబ ద్ధము పలుమారు చెప్పుచు వచ్చితిని.

ఆ సంవత్సరమున మా మేనమామగారికి శరీరములో నక్షీర్ణ వ్యాధి గలిగినందున, వారికి బదిలీగా నేను వారిపాఠశాలలో దెనుగు పాఠములు జెప్పుచువచ్చితిని. వ్యాధి రాజమహేంద్రవరములో నివా రణగానందున, నేనును వారును గలసి మా వీరవాసరగ్రామము

వెళ్ళితిమి. అక్కడ నీళ్లు మంచివగుటచేతను, తగినమందుతీసుకొనుట చేతను, వారివ్యాధి నివారణమై మరల బనిలో జేరిరి. ఆ సంవత్సర మున నవంబరు డిశంబరు నెలలలో నేను హిందూస్తానీభాష నేర్చుకొన వలెనని యభిలాషగలిగి, నాకాభాష నేర్పుమని నవాబు ఖాజా అహమ్మదుల్లాఖాన్ సాహెబుగారినడిగితిని. వారు నామీద దయ గలిగి గొంచెము నేర్పనారంభించిరి. అక్షరములువ్రాయుట జదువుట వచ్చినవిగాని గుణితములు నేర్చుకొనుచుండగా నశ్రద్ధచే మానితిని.

మా గురువుగారైన వేదము వెంకటాచలముగారు, రాజమ హేంద్రవరమునుండి, బి. యల్. పరీక్షకు జదువుకొనుటకు నిశ్చ యించుకొని, చెన్నపురి వెళ్ళ బయనమైరి. ఆ వార్త పాతవిద్యార్థుల మైన మేమెరిగి యొక సన్మానముగావించి వారిని గౌరవించితిమి. (శ్రీ) పోలవరముజమీందారుగారు వారి శిష్యులేయగుటచే, వారొక జేబుగడియారము గురువుగారికి బహుమానము జేసిరి. ధనములేని వాడనగుటచే నేను భక్తితో నైదుపద్యములు రచించి వారికర్పించి తిని. పూర్వకాలము పురమందిరము లేదుగనుక సభలన్నియు సాధా రణముగ (శ్రీ) విజయనగరము మహారాజావారి బాలికా పాఠశాలలో జరుగుచుండెను. మా సభగూడ నచ్చటనే జరిగెను. ఆ సభకు (శ్రీ) న్యాపతి సుబ్బారావుపంతులుగా రధ్యక్షతవహించిరి. పద్యములువ్రాసి సభలో జదువుటకు నా కదియే ప్రారంభము. సభాసదులలో ననే కులు నా పద్యములు బాగున్నవని చాల మెచ్చుకొనిరి.

నా కవిత్వమునుగూర్చి యొక్కమాట నిచ్చట జెప్పవలెను. చిన్ననాడు నేను వీరవాసరములో జదువుకొనుచున్నప్పుడు, నా మిత్రుడు చెన్నాప్రగడ భానుమూర్తిగారు నాకంటె పైతరగతిలో జదువుచు, నప్పుడే కవిత్వము చెప్పనారంభించెను. పులినిజూచి నక్క వాతబెట్టుకొన్నదన్న సామెతగ, శబ్దజ్ఞానము లేకపోయినను, లక్ష ణము రాకపోయినను, నేనుగూడ పద్యములు చెప్పవలెనని కుతూ హలపడి, గణములు లేకుండ యతిప్రాసలు లేకుండ నేవో వెర్రి మొర్రి పద్యములు కొన్ని యల్లుచుండెడివాడను. నేను నరసాపురములో మిషనుస్కూలులో జదువుచున్న కాలమున, నేలేశ్వరపు వెంకట ప్పయ్య శాస్త్రిగారివద్ద, ఛందోవిషయసారసంగ్రహమను లక్షణ

గ్రంథమును జదివితిని. అందుచేత నేను గొంత లక్షణమును నేర్చితిని. రాజమహేంద్రవరము వచ్చినతరువాత, దానిని కొంత వృద్ధిచేసు కొంటిని. 1887 వ సంవత్సరమున జరిగిన విక్టోరియా జూబిలీ సందర్భమున నాపేర గొన్ని పద్యములు రచియించి, వానిని మిత్రులకు వినిపించి, నాపేరు లేకుండ గొన్ని పద్యము లొకమిత్రునిపేర రచియించితి నని యీవరకే చెప్పితినిగదా! ఈవిధముగ నేను గవిత్వములో వ్రేలుబెట్టితిని. మా గురువుగారిమీద నేను రచియించిన పద్యములలో నాపేరు బైటపడెను. నేను కవిననియు నాంధ్రభాషా పరిచితుడ ననియు గొందరి కప్పుడు తెలిసెను.

---

# స్వీయచరిత్రము

## నాలుగవ ప్రకరణము

## ఉద్యోగము - గ్రంథరచనము

1889 వ సంవత్సరము జనవరి నెలలో నొకనాడు శ్రీ యిమ్మానేని హనుమంతరావు నాయుడుగారు నానిమిత్తమువచ్చి, "మేమొక నాటకసమాజమును స్థాపించినాము. శ్రీ కోలేటి వెంకటసుబ్బారావుగారు హరిశ్చంద్ర నాటకమును ఆడుకొనుటకై మాకు వ్రాసియిచ్చిరి. మీరు కీచకవధ నాటకముగ వ్రాసి మాకియ్యవలెను." అని కోరిరి. నేను వెంటనే "శ్రీ సుసర్ల అనంతరావుగారు పాండవాజ్ఞాతవాసమను నాటకము వ్రాసిరి. అది మిక్కిలి బాగున్నది. దానిలో కీచకవధయున్నది. అదియుండగ నేను వ్రాయుట యెందుకు? దానిని మీరు ప్రయోగింపవచ్చునని" బదులుచెప్పితిని. అది విని నాయుడుగారిట్లనిరి. "అజ్ఞాతవాస చరిత్రమున్నదిగాని యందులో నెన్నో పద్యము లున్నవి. మా సమాజ సభ్యులు పద్యములు చదువలేరు. మాకు వచన నాటకమే కావలెను. కోలేటి సుబ్బారావుగారు వచనముగనే మాకు హరిశ్చంద్రనాటకము వ్రాసియిచ్చిరి. కావున మీరు కూడ నట్లే వచనముగ నాటకము వ్రాసియిండ"ని యడిగిరి. నేను వేదము వేంకటాచలముగారి మీద వ్రాసిన పద్యములు బాగున్నవని నాయుడుగారభిప్రాయపడి, నేను తెనుగులో గ్రంథములు రచింపగలనని భావించి, వారు నాకడకువచ్చిరి. నేను కొంచెమాలోచించి "సరే యట్లేచేయుదు"నని చెప్పి వారిని బంపితిని. వారు వెళ్ళిన తరువాత, భారతములోని విరాటపర్వమును కీచకవధవరకు నేను జదివించుకొనివిని, యజ్ఞాతవాసచరిత్రగూడ కొంత జదివించుకొనివిని, నాటకము వ్రాయనారంభించితిని. అప్పుడు నాదృష్టి బాగుండుటచే నాటకము నా స్వహస్తమున వ్రాసితిని. నాదస్తూరిమట్టుకు బాగుండెడిది గాదు. ఐనను గ్రంథమంతయు నేనే వ్రాసితిని.

ఇంతలో నాజీవితములో గొంతమార్పు వచ్చినది. రాజమహేంద్రవరములో నామిత్రులు గొందరు పాఠశాల నొకటి స్థాపించ

వలెనని సంకల్పించిరి. అందు ముఖ్యులు, మద్దూరి వీరభద్రయ్య గారు, వక్కలంక కామేశ్వరరావుగారు, నందివాడ సుబ్రహ్మణ్యము గారు, ఓరుగంటి కాంతయ్యగారు, కుందూరి వేంకటరత్నముగారు మున్నగువారు. ఆ సంకల్పము కార్యరూపము వహించినది. ఆర్యన్ హైస్కూలని యొకయున్నతపాఠశాల స్థాపింపబడెను. ప్రాతయూరిలో ఉప్పలూరి గంగరాజుగారి మేడలో నది నెలకొలుపబడెను. దానికి యువకుడును,పట్టపరీక్షాసిద్ధుడునైన, ఓరుగంటి కాంతయ్యగారు,ప్రధానోపాధ్యాయుడుగ నియమింపబడిరి. కొల్లా నరసయ్యగారు బి.ఏ.,గణితము నేర్పుచుండిరి. ద్రోణంరాజు రామకృష్ణారావుగారు, బి. ఏ. ప్రకృతి శాస్త్రము నేర్పుచుండిరి. వక్కలంక కామేశ్వరరావుగారు, మద్దూరి వీరభద్రయ్యగారు, కుందూరి వేంకటరత్నముగారు, క్రింది తరగతులకు నుపాధ్యాయులుగ నేర్పడిరి. తెలుగుపండితునిగ, నన్నేర్పరచిరి. నేనును కొల్లా నరసయ్యగారును తప్ప తక్కిన వారందరు జీతములు తీసుకొనకుండ పని చేయసాగిరి. ఆపాఠశాలలో, మెట్రిక్యులేషను తరగతి మొదలుకొని, ప్రస్తుతపు మొదటిఫారమునకు సరియైన మూడవతరగతి వరకు, నన్ని తరగతులు నేర్పడినవి. పిల్లలు చాలమంది చేరిరి. సర్కారు వారి యంగీకారము (Recognition) మాత్రము దొరకలేదు. కారణ మేమన, రాజమహేంద్రవరములో పాఠశాలలు ఎక్కువగ నుండుటచే, విద్య కట్టుదిట్టముగ విద్యార్థులకు వచ్చుటలేదని తలంచి, కాలేజి ప్రిన్సిపాలుగారైన మెట్కాఫ్‌దొరగారును, పాఠశాలాపరీక్షాధికారియైన నాగోజీరావు పంతులుగారును, మరికొందరు పురప్రముఖులును, సమావేశమై యాలోచించి, పట్టణములోనున్న పాఠశాలలన్నియు గలిపి యొకమహాపాఠశాలగ జేయుట మంచిదని యాలోచించిరి.

అనేక పాఠశాలలుండుటచే, బాలకులు నీతిలేక కట్టుబాటులేక యొకనాడొక పాఠశాలలోను, మరియొకనాడు మరియొక పాఠశాలలోను, చదువుచు, యిక్కడ జీతము లెగబెట్టి యక్కడికి, యక్కడ జీతము లెగపెట్టి యిక్కడికి పోవుచుండిరి. ఇది బాలకులకు మిక్కిలి యనర్థకముగనుండెను. అది కనిపెట్టి విద్యార్థుల క్షేమముగోరిన మెట్కాఫ్‌దొరగారు మొదలైనవారు, సకలపాఠశాలాసమ్మేళనము ప్రారంభించిరి. అప్పుడు పట్టణములోనున్న పాఠశాలలివి. వేదము

వేంకటాచలముగారు ప్రధానోపాధ్యాయులుగనున్న పాఠశాలయొకటి. మిషనుస్కూలొకటి. యేలూరి లక్ష్మీనరసింహముగారి యాస్తిక పాఠశాల యొకటి. దేశీయాభిమాన పాఠశాల యంతకుముందే యంతరించినది. అందుచేత మెట్కాఫ్‌దొరగారును,నాగోజీరావు పంతులుగారును, మిషను పాఠశాల ప్రధానోపాధ్యాయులైన దుర్గయ్యగారిని, యాస్తిక పాఠశాలాధికారియైన యేలూరి లక్ష్మీనరసింహముగారిని గలసి,మాటలాడి, సమ్మేళనము గురించి వారి నొడంబరచి, యూరిలోనున్న పాఠశాలలన్నియు గలిపి యొక పాఠశాలజేసిరి. ఆ మహాపాఠశాలకొక పరిపాలకసంఘ మేర్పడెను. ఆ సంఘమునకు మెట్కాఫ్‌గారే యధ్యక్షులుగ నుండిరి. కళాశాలలోని యుపాధ్యాయులు గొందరు, పురప్రముఖులు గొందరు దానిలో సభ్యులుగ నుండిరి. ఆ పాఠశాలపేరు రాజమహేంద్రవరోన్నత పాఠశాల. (Rajahmundry High school) ఆ పాఠశాలలో మెట్రిక్యులేషను తరగతియు, దాని క్రింది తరగతియు మాత్రమే యుండెను. ఆ పాఠశాలకు ప్రధానోపాధ్యాయులుగ శ్రీ యేలూరి లక్ష్మీనరసింహముగారి నేర్పరచిరి. చరిత్రము చెప్పుటకు శ్రీ వేదము వేంకటాచలముగారిని, గణితము చెప్పుటకు శ్రీ యేలేశ్వరపు పేరయ్యశాస్త్రిగారిని, ప్రకృతిశాస్త్రము నేర్పుటకు ముడుంబై రామానుజాచార్యులవారిని, సంస్కృతము నేర్పుట కాకొండి వ్యాసమూర్తిశాస్త్రిగారిని, నాంధ్రోపాధ్యాయులుగ వడ్డాది సుబ్బరాయుడుగారిని నియమించిరి. ఈ పాఠశాల చిత్రపు నరసింహారావుగారి గృహమున స్థాపింపబడెను. దీనికి మూడు శాఖాపాఠశాల లుండెను. ఒకటి మునుపటి టవునుస్కూలు, రెండవదిమునుపటి యిన్నీసుపేటస్కూలు, మూడవది యాస్తికమధ్యమపాఠశాల. ఈ మూడు పాఠశాలలలోను మిడిలు స్కూలు పరీక్షవరకు మాత్రమే చదువు చెప్పబడుచుండెను. అక్కడ చదువు ముగిసిన తరువాత బాలకులు, పై చదువుకొరకు నూతనముగ స్థాపింపబడిన హైస్కూలునకు, బోవుచుండిరి. పాఠశాలలలో తమలో తమకు పోటీలేకుండ నిట్టియేర్పాటు చేయబడినందున, మరియొక క్రొత్తపాఠశాల యేదైన స్థాపింపబడినయెడల, నది దొరతనమువారి చేత నంగీకరింపబడకుండునట్లు మెట్కాఫ్ దొరగారును, నాగోజీరావుపంతులుగారును దగిన యేర్పాటులు జేసిరి.

ఈ క్రొత్తపాఠశాల 1888 వ సంవత్సరమున స్థాపింపబడినది. దీనితో వెనుకటి పాఠశాలలన్నియు విరమించినవి. పోటీలేకుండ విద్యార్థులకు విద్య కట్టుదిట్టముగ నేర్పబడుచుండెను. మరియొక పాఠశాల యేగియు దొరతనమువారి యంగీకారము బడయకుండునట్లధికారులు నిశ్చయించుకొన్నందున, 1889 వ సంవత్సరములో స్థాపింపబడిన మా పాఠశాల పైయధికారుల యంగీకారము బడయుటకు వీలులేకపోయెను. ఆసంగతి తెలిసియే, యీ పాఠశాలాస్థాపకులు గూడ దొరతనమువారి యంగీకారముకొరకు ప్రయత్నము చేయలేదు. అట్టి యంగీకారమును బడయని స్కూలులో జదివిన పిల్లలు మెట్రిక్యులేషను పరీక్షకు దరఖాస్తు చేయవచ్చును. కాని, మిడిలుస్కూలు పరీక్షకు దరఖాస్తు చేయగూడదు. మా పాఠశాలలో మెట్రిక్యులేషను తరగతిలో నిద్దరుబాలురు మాత్రమే యుండిరి. దొరతనమువారి యంగీకారము బడయని పాఠశాలలో బాలురు చదువరు. అందుచేత నేప్రియలు మాసాంతమునకు, బాలకులు చాలమంది మా పాఠశాలను విడిచిపెట్టిరి. పాఠశాలలో పండితులెక్కువగ నుండుటచే పరిపాలకసంఘమువారు సభచేసి యొక పండితుని దీసివేయ నిశ్చయించిరి. ఆ పండితుడెవ్వరాయని మీమాంస వచ్చెను. రాజమహేంద్రివరములోనున్న పాఠశాలలన్నిటిలో పనిచేయుచున్న పండితులలో, శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిగారి సర్వీసు తక్కువగ నున్నదని నిశ్చయించి, సంఘమువారాయనను దీసివేసిరి. కాబట్టి మల్లయ్యశాస్త్రిగారికి రాజమహేంద్రివరములో నుద్యోగము పోయెను. ఆకాలమున నమలాపురము బోర్డుహైస్కూలులో నొక పండితపదవి కాళీవచ్చెను. అప్పుడు బోర్డుకు, రాజమహేంద్రివరములో సబుకలెక్టరుగ నున్న మోబర్లెదొరగారధ్యక్షులుగా నుండిరి. ఎర్రమిల్లి వెంకట్రావుగారు సిరస్తదారుగారు. ఆయన మల్లయ్యశాస్త్రిగారి పాండిత్యము ప్రజ్ఞ మొదలైనవి బాగుగ నెరుగుదురు. శాస్త్రిగారి ప్రజ్ఞావిషయమై స్తుతిజేయుచు, నమలాపురములోని పదవి శాస్త్రిగారి కిప్పింపవలసినదని, మెట్కాఫ్‌దొరగారు మోబర్లిగారికి జాబువ్రాసిరి. ఇదిగాక శ్రీ కందుకూరి వీరేశలింగముగారును, మల్లయ్యశాస్త్రిగారి నుగ్గడించుచు యోగ్యతాపత్రముల నిచ్చిరి. ఆపని మల్లయ్యశాస్త్రిగారి కయ్యెను.

మల్లయ్యశాస్త్రిగారు సకుటుంబముగ బ్రయాణమై యమలాపురము వెళ్ళిరి.

నేను వారితో వెళ్ళలేదు. కారణమేమన నాకీ క్రొత్త పాఠశాలలో నొక చిన్నయుద్యోగము దొరకినదిగదా! అదిగాక రాజమహేంద్రవరము విడిచిపెట్టుట నాకిష్టములేదు. మరియును మా మేనమామగారు ప్రయాణమైన దినములలో, శ్రీ రాయవరపు అప్పారావుగారి రెండవ కుమార్తెకు వివాహము నిశ్చయింపబడినది. ఆమెను వక్కలంక కామరాజుగారి రెండవ కుమారుడును, కామేశ్వరరావుగారి తమ్ముడునైన గవరరాజుగారి కిచ్చి పెండ్లిచేయుటకు నిశ్చయించిరి. ఈ సంబంధము నాచేత కుదుర్పబడినది. వక్కలంక కామేశ్వరరావుగారి యింటికి నేను పలుమారులు పోయి యీ సంబంధము విషయమై మిక్కిలి ప్రయత్నము జేసితిని. నా ప్రయత్నము సఫలమైనది. ఆబాలిక నా ప్రియమిత్రుడైన తల్లాప్రగడ చలపతిరావునకు మేనగోడలు. నా శిష్యుడైన రామమూర్తికి జెల్లెలు. ఆ వివాహమునకు నన్నక్కడ నుండవలసినదని చలపతిరావు బలవంతపెట్టెను. ఈసంగతి మా మేనమామగారితో జెప్పి, యంగీకారముబడసి, నే నమలాపురము వెళ్ళక యుండిపోతిని. మా మేనమామగారు వెళ్ళినది మొదలుకొని నాకు భోజనసౌఖ్యముతగ్గెను. పాఠశాలలో నేదో కొంచెము జీతము వచ్చుచున్నదిగనుక, నేను పూటకూళ్ళయింట బ్రవేశించి యొకపూటదిని యొకపూట దినక కాలక్షేపము జేయ జొచ్చితిని. తిన్నగ తినకపోవుటకు కారణమిది. పగలు నేను స్వయముగబోయి భోజనముచేయగలిగి యుంటిని, గాని రాత్రులు పరసహాయములేక వెళ్ళజాలను. అందుచేత గొన్నిరాత్రులు మానియు, గొన్నిరాత్రులు రామమూర్తిని సాయము తీసుకొనివెళ్ళియు నెట్లెటో కాలము గడపుచుంటిని.

1889 వ సంవత్సర మేప్రిలులో, నామిత్రుడైన తల్లాప్రగడ చలపతిరావునకు గొప్ప కష్టము సంభవించెను. 1888 వ సంవత్సరము చివరభాగము మొదలుకొని, చలపతిరావుభార్య యనగా పారుపల్లి పుండరీకాక్షుడుగారి మూడవ కుమార్తె, జబ్బుగనుండెను. ఆమె క్రమక్రమముగ శుష్కించుచుండెను. చలపతిరావు జిల్లా సర్జనుగారైన

డాక్టరు కస్తూరిరంగనాధరావుగారిని వైద్యమునకై పెట్టెను. నేను తరుచుగ మందులకై పోవుచుంటిని. ఎంత శ్రమపడినను వ్యాధి కుదురలేదు. ఆమె యేప్రిలు 30 తారీఖున రాత్రి మృతినొందెను. ఆమె కప్పటికి మూడుసంవత్సరముల వయసుగల కుమారుడుండెను. అతడే తల్లాప్రగడ నరసింహారావు. పిమ్మట నతడు పెద్దవాడై చదివి, బి.యల్, లో తేరి, కొన్నాళ్లు రాజమహేంద్రవరములోను, కొన్నాళ్లేలూరులోను న్యాయవాదిగనుండి, 1936 వ సంవత్సరమున నేలూరులో మృతినొందెను. ఆ కష్టదినములలో చలపతిరావు నోదార్చుచు కొన్ని దినములు కాలము గడపితిని.

ఆసంవత్సరము ఫిబ్రవరి నెలనాటికి, నేను కీచకవధా నాటకములో రెండంకములు వ్రాసి హనుమంతరావునాయుడుగారి కిచ్చితిని. తక్కినభాగ మేప్రియలునాటి కిచ్చితిని. గ్రంథరచనకారంభము గనుక మొదటి యంకములలో కఠినపదములు కఠిన సమాసములు ప్రయోగించితిని. ద్రౌపదీ కీచకుల సంభాషణములు వచ్చినప్పు డాభాగము శృంగారరస ప్రధానమైనది గనుక, సమాసములు మొదలయినవి ప్రయోగింపక సులభశైలితో వ్రాసితిని. ఇది నాటకసమాజము వేరుగ భావించిరి. కఠినసమాసమున్న భాగము నేను మా మేనమామగారిచేత వ్రాయించితిననియు, వారమలాపురము వెళ్ళిన తరువాత నీచివరి భాగము నేను స్వయముగ వ్రాసితిననియు, నందుచేత నీ సులభశైలిని బడినదనియు, నాటక సమాజమువారు తప్పుగ నభిప్రాయ పడిరి. శ్రీ లేటి సుబ్బారావుగారు వ్రాసియిచ్చిన హరిశ్చంద్ర నాటకమును నా నాటకమును వారు జదివి, హనుమంతరావునాయుడుగారు, వారి బంధువులైన స్త్రీలు ముందుగ జూచుటకై యీ రెండు నాటకములును, సామినేని బుచ్చిఅబ్బాయి నాయుడుగారను రెండవ పేరుగల "యహాళసింగరరావునాయుడుగారి" విశాలమైన సావడిలో, మొట్ట మొదట ప్రయోగించిరి. ఇది వేసవికాలపు శలవులలో జరిగెను. తరువాత జౌనుహాలు ప్రక్కనున్న యొకదొడ్డిలో గట్టి తాటియాకులపాక వైచి నాటకములాడ జొచ్చిరి. ఈ సమాజముపేరు "రాజమహేంద్రవర హిందూ నాటకసమాజము."

హనుమంతరావునాయుడుగారు రాదివెలమకులస్థులు, మాదిరెడ్డి వేంకటరత్నమునాయుడుగారు మొదలగువారికి బంధువులు. ఈయన స్వగ్రామము గుంటూరుజిల్లాలోని క్రొత్తపట్టణము, ఆయన పూర్వము మెట్రిక్యులేషను స్కూలులో జాలకాలము పనిజేసి, యక్కడ నొక నాటకసమాజము స్థాపించెను. ఆ మిషనుపాఠశాలలోనే, టంగుటూరి ప్రకాశముగారుకూడ జదువుకొనుచుండిరి. నాయుడుగారు స్థాపించిన నాటకసమాజములో వంగవోలుపురమున ప్రకాశముగారుకూడ పాత్ర ధరించుచుండిరి. రాజమహేంద్రవరములో మాకర్ల సుబ్బారావునాయుడుగారని యొక గొప్ప న్యాయవాదియుండెను. ఆయన శ్రీ మాదిరెడ్డి వెంకటరత్నమునాయుడుగారి తోడియల్లుడు. సుబ్బారావునాయుడుగారును, హనుమంతరావునాయుడుగారును బంధువులగుటయేగాక, మిత్రులు, సహాధ్యాయులును. ఆకారణమున సుబ్బారావునాయుడుగారి యొక్కయు, దక్కిన బంధువులయొక్కయు, ప్రేరణముచేత, హనుమంతరావునాయుడుగారు 1887వ సంవత్సరమున కుటుంబముతో రాజమహేంద్రవరమువచ్చిరి. ఆయనకు రాగానే యేలూరి లక్ష్మీనరసింహముగారు తమ యాస్తికపాఠశాలలో నొక యుపాధ్యాయపదవినిచ్చిరి. నాయుడుగారు వచ్చునప్పుడు, తమకు ప్రియశిష్యుడును దమ నాటకసమాజములో సభ్యుడునైన ప్రకాశముగారిని, రాజమహేంద్రవరము దీసుకొనివచ్చి, పాఠశాలలో జేర్పించిరి. ప్రకాశముగారు పూటకూళ్ళ యింట కొన్నాళ్లుదిని, కొంతకాలము మాతామహిని దీసుకొనివచ్చి, వేరే కాపురముండి చదువుకొనుచువచ్చిరి. హనుమంతరావునాయుడుగారే ప్రకాశముగారికి చదువు చెప్పించుచువచ్చిరి. నాయుడుగారి కతనిమీద పుత్రప్రేమయని చెప్పుటతిశయోక్తిగాదు. ప్రకాశముగారు బాలుడు, తెలివిగలవాడు. స్ఫురద్రూపి, హనుమంతరావునాయుడుగారికి నాటకములమీద కుతూహలము వంగవోలుతో నాగిపోక, రాజమహేంద్రవరమునకుగూడ వచ్చెను. హనుమంతరావునాయుడుగారికి రాజమహేంద్రవరములో స్థిరమైన యుపాధ్యాయ పదవి లభించెను.

అప్పుడాయన నాటకసమాజము స్థాపించెను. తానే యానాటకసమాజమునకు మేనేజరుగ నుండుటవలన గొన్ని బాధలున్నవని, రాజమహేంద్రవరము సెంట్రలుజెయిలులో నొక గుమాస్తాగనున్న పిళ్ళా

రిసెట్టి త్రియంబకరావు నాయుడుగారిని, మేనేజరుగ నేర్పరచెను. ఆ సంవత్సరము జూను నెలలో 8 వ తారీకున, నూతనముగ నిర్మించిన తాటియాకులపాకలో, మొట్టమొదట, సమాజమువారు ... శెట్టి సుబ్బారావుగారు వ్రాసియిచ్చిన "హరిశ్చంద్ర" నాటకమును ప్రయోగించిరి. మఱుసటి శనివారమునాడనగా జూను నెల 15 వ తేదీని నేను వ్రాసియిచ్చిన "కీచకవధా" నాటకమును ప్రయోగించిరి. నన్నుగూడ నాహ్వానించిరి. నేనా నాటకమునకు బోయి జూచితిని. ప్రేక్షకులు నాటకము బాగున్నదని సంతోషించిరి. హనుమంతరావు నాయుడు గారు భీమపాత్ర ధరించిరి. ప్రకాశముగారు ద్రౌపదీపాత్ర ధరించిరి. ఈ నాటకసమాజములో గొందరు ప్రసిద్ధులు పాత్రలు ధరించిరి. వారె వరనిన; హనుమంతరావు నాయుడుగారు, ప్రకాశముగారు, జిల్లాజడ్జి పనిజేసి పింఛను పుచ్చుకొని, 1939 వ సంవత్సరములో చెన్నపురిలో మృతినొందిన పిళ్ళారిసెట్టి నారాయణరావు నాయుడుగారు, సబుజడ్జి పనిజేసి పింఛను పుచ్చుకొని ప్రస్తుతము చెన్నపురిలో సుఖముగనున్న కోకా సాంబశివరావు నాయుడుగారు, పోస్టలు డిపార్టుమెంటులో పని జేసి పింఛను పుచ్చుకొని సుఖముగనున్న కోకా వెంకటరెడ్డినాయుడు గారు. ప్రకాశముగారు నాటకములో నే రసము నభినయించినను మిక్కిలి సొగసుగ నభినయించెడివారు. కరుణరసమునకును వీరరస మునకును వీరు పెట్టినదిపేరు. ఆ సమాజమునకు దక్షిణదేశస్థుడు సాతానియైన రామానుజయ్యయను నతడు సూత్రధారిగ వచ్చెను. ఇతడు చక్కగ గానము చేసెడివాడు. అతని గానము వినుటకే కొం దరు వచ్చెడివారనిన నతిశయోక్తిగాదు. కొంతకాలము బందరులో పోలీసు యినస్పెక్టరు పనిజేసి తరువాత మృతినొందిన వడ్లూరి సూర్య ప్రకాశరావుగారు తత్కాలమున రాజమహేంద్రివరములో ప్రథమ శాస్త్ర పరీక్షకు జదువుకొనుచుండి యీసమాజములో జేరి హాస్యము జెప్పుచుండెను. ఇతను హాస్యములో మిగుల గట్టివాడు. ఇతని హాస్యము జనరంజకముగ నుండెను. ఈ యిద్దరు ప్రకాశములవల్ల నాటకసమా జము ప్రకాశించెను. నేను రచించిన కీచకవధా నాటకము మొదటి సారి ప్రయోగింపబడినప్పుడు న్యాపతి సుబ్బారావుపంతులుగారు, నేర మిల్లి వేంకట్రావు పంతులుగారు మొదలగు పురప్రముఖులు చాల

మంది విచ్చేసి సంతోషించిరి.

ఈ నాటకము రెండవసారి మరికొన్ని దినములకు ప్రయోగించిరి. అప్పుడు ప్రేక్షకులతోడిపాటు నేనుగూడ నొక కుర్చీలో గూర్చుంటిని. బయ్యపునీడి జోగయ్యగారు మొదలగు పురప్రముఖులా నాటకమునకు వచ్చిరి. జోగయ్యగారు మెరకవీధి తెలగాలు. తెలుగులో నభిరుచిగలవారు. కొంతకాలము రాజమహేంద్రవరములోను, పిమ్మట విశాఖపట్టణములోను జిల్లాకోర్టులో సిరస్థదారుగనుండినవారు. ఆనాటకమున కాంచనవచ్చి హనుమంతరావునాయుడుగారు భీమ పాత్రనభినయించుచున్నప్పుడు సంతోషించి చప్పట్లుగొట్టిరి. సభాసదులుగూడ సంతోషముచే చప్పట్లుకొట్టిరి. జోగయ్యగారు కొన్ని పుష్పములు నా తలమీద జల్లిరి. ఈ గౌరవముచేత నేను మిక్కిలి సంతసించితిని. హనుమంతరావునాయుడుగారుకూడ మిక్కిలి సంతోషించి, మరియొక నాటకము వ్రాయుటకు నన్ను ప్రోత్సాహపరచిరి. నేనప్పుడు ద్రౌపదీ పరిణయనాటకమును వ్రాయనారంభించితిని. అది యైదంకముల నాటకము. అక్కడక్కడ కొన్ని పద్యములున్నను మొత్తముమీద నదిగూడ వచన నాటకమే. ముఖ్యపాత్రలు ధరించునట్టి హనుమంతరావు నాయుడుగారుగాని, ప్రకాశముగారుగాని, పద్యములు జదువలేరు. ఒక రిద్దరు పద్యములు జదువగలవారుండిరి. వారు ధరించుపాత్రలకే పద్యములు పెట్టుచూవచ్చితిని. ఈ నాటకముగూడ జాలవరకు స్వహస్తమున వ్రాసితిని. నాటకరచనము త్వరగ ముగింపవలెనను కుతూహలముతో హనుమంతరావునాయుడుగారొకప్పుడును దుగ్గిరాల గోపాలకృష్ణారావను సామాజికుడొకప్పుడును రాత్రులువచ్చి నేజెప్పగా నాటకము వ్రాయుచుండిరి.

1889 వ సంవత్సరము జూలై నెలలో మామిత్రులు స్థాపించిన యార్యను హైస్కూలు క్రమక్రమముగ క్షీణించిపోయినందున, యిప్పటి మొదటిఫారమునకు రెండవఫారమునకు సరియైన నాలుగవ తరగతియు, మూడవతరగతియు మాత్రమే నిలిచియుండెను. తక్కిన యుపాధ్యాయులందరు పాఠశాలనుండి మానివేసిరి. కుందూరు వేంకటరత్నముగారు, నేను మాత్రమే పాఠశాలను బట్టుకొని వ్రేలాడితిమి. నేమిద్దరము పాఠశాల నుప్పులూరివారి మేడలోనుండి దీసివేసి,

ధర్మాసుపత్రి వెనుక నుండిన తవ్వాలవారి బంగాళాలో బెట్టితిమి. పాఠశాలవల్ల వచ్చు నాదాయము నుండి కొంతభాగము వెంకటరత్నముగారును, కొంతభాగము నేనును బుచ్చుకొని కాలక్షేపము చేయుచుంటిమి. అప్పుడు నేను తవ్వాలవారి యింట బాలురకు నెలకు రు 6/- లు చొప్పున జీతమువిూద నింటివద్ద పాఠములు చెప్పుచుంటిని. వీరవాసరములో మా తండ్రిగారి సంపాదనము తగ్గిపోయినందున కుటుంబభారము నాపై నప్పగించిరి. కుటుంబమనగా మా తల్లి, మా తమ్ముడు, చిన్న చెల్లెండ్రయిన యచ్చమ్మ, రమణమ్మ, నేను. మే మిన్నీసుపేటలో నాళమువారి కొట్లలో నెలకు మూడు రూపాయలు బాడుగనిచ్చి కాపురముంటిమి. సాయంకాలము పాఠశాల వదలిపెట్టినతరువాత మేము, నాయుడుగారు మొదలగువారు గలసి నాటకశాలలో నిష్ఠాగోష్ఠి జెప్పుకొనుచు రాత్రి యెనిమిదిగంటలవరకు కాలక్షేపము జేసి యింటికి బోవుచుండెడివారము. నా సంపాదన జాలక, నాకు గొంతఋణమయ్యెను. ద్రౌపదీపరిణయ నాటక మా సంవత్సరము సెప్టెంబరు నెలలోనో, యక్టోబరు నెలలోనో, మొదటిసారి ప్రయోగింపబడెను. హనుమంతరావు నాయుడుగారు భీమపాత్ర ధరించిరి. ప్రకాశముగారర్జునపాత్ర ధరించిరి. వీరరస మభినయించుటలో ప్రకాశముగారద్వితీయులు. ఆ నాటకమున నాలుగవ యంకములో వీరరసమభినయించుటకు మిక్కిలి యవకాశముండెను. అది ప్రకాశముగారు మిక్కిలి యద్భుతముగ బ్రదర్శించిరి.

మద్దూరి నాగభూషణముగా రప్పుడు విద్యార్థిగనుండి నాటక సమాజములోజేరి ద్రౌపదీ పరిణయములో ద్రుపదపాత్ర ధరించిరి. ఈయన పద్యములు మిక్కిలి శ్రావ్యముగ జదువగలవారు. ఈయన పద్యములువిని ప్రేక్షకులు మిక్కిలి యానందించుచుండెడివారు. మద్ది గోపాలకృష్ణరావు దుర్యోధనపాత్ర ధరించెడివారు. ద్రౌపదీపాత్ర నెప్పల్లి బుల్లికృష్ణయ్య యను నొక యువకుడు ధరించెడివాడు. హిడింబాసుర, బకాసురపాత్రలు శ్రీమాద్దిరెడ్డి వెంకటరత్నమునాయుడుగారి తమ్ముడు చలపతిరావు ధరించుచుండెడివాడు. అతడు మిక్కిలి దృఢకాయుడు. హనుమంతరావు నాయుడుగారు మొదలగువారు నన్ను సామాజిక గ్రంథకర్తగ నెంచుకొని, నే నేపాత్ర ధరింపకపోయినను

నన్ను గూడ నొక సామాజికునిగ భావించెడివారు. "ద్రౌపదీ పరిణయ" నాటకముగూడ ప్రేక్షకుల నానదింపజేసినది.

తరువాత హనుమంతరావు నాయుడుగారు నన్ను "గయోపాఖ్యాన" నాటకము వ్రాయుమని పురిగొల్పిరి. అందుకు నేనిష్టపడి, "గయోపాఖ్యాన" నాటకమును 1889 వ సంవత్సర మక్టోబరులో రచియింప నారంభించితిని. రామకవి యనునతడు "గయోపాఖ్యాన" కథను దెనుగులో బద్య కావ్యముగ రచియించెను. అది యచ్చుపడి బజారులో విక్రయింపబడుచుండెను. ఆపుస్తకమును నేను సంపాదించి, చదివించుకొని విని, యాకథనుబట్టియే నేను "గయోపాఖ్యాన" నాటకమును రచించితిని. "చిత్రభారత"మను తెనుగు ప్రబంధములోగూడ నిటువంటి కథ యొకటి యున్నది. ఈ కథలో జెప్పబడినట్లు గయుడు శ్రీకృష్ణుని చేతిలోగాక, గాలవఋషి యర్ఘ్యమిచ్చుచుండగ నతని చేతిలో నుమిసినట్లు, నతడు తన పరాభవమును శ్రీకృష్ణున కెరింగింపగ, మహర్షిని పరాభవించినందుకు శ్రీకృష్ణుడు గయుని దండింప నెంచినట్లును, నందువలన శ్రీకృష్ణార్జునులకు యుద్ధము జరిగినట్లును, నున్నది. అయినను నేను కథాసంవిధానములో రామకవి పుస్తకమునే యనుసరించితిని. శ్రీకృష్ణుని పాత్రము ధరించుటకై యుద్దేశింపబడిన వారు పద్యములు జదువగలవారగుటచే నేనా పాత్రమునకు బద్యములు వ్రాసితిని.

1889 వ సంవత్సరము డిశంబరు 20 వ తేదీనాటికి నేను "గయోపాఖ్యానము"లో నాలుగంకములు వ్రాసి, నాటకసమాజము వారి కిచ్చితిని. అప్పుడొక యంతరాయము గలిగెను. నాటకసమాజమువారికి "శ్రీరామజనన"మను నాటకము మొదట నెవరో వ్రాసి యిచ్చిరి. అది చాలసారులు ప్రయోగించిరి. అది యెక్కువ రసవంతముగ నుండకపోవుటచే "శ్రీరామజనన" నాటకము మరియొకటి క్రొత్తగ వ్రాసియిమ్మని హనుమంతరావునాయుడుగారు నన్ను గోరిరి. ఆ కోరిక ననుసరించి సంపూర్ణ దీక్ష వహించి యహోరాత్రములు కష్టపడివ్రాసి, డిశంబరు ముప్పదియొకటవ తారీకునాటికి "రామజనన" నాటకమును బూర్తిచేసి యిచ్చితిని.. పగలు నేను వ్రాయుచుంటిని, రాత్రులు హనుమంతరావు నాయుడుగారు మొదలగు సామాజికులే

నేను చెప్పగ వ్రాయుచుండిరి. "శ్రీరామజనన" మైదంకముల నాటకము ఇందు నాలుగవయంకములో నచ్చరలు ఋశ్యశృంగ మహాముని దమవలలో వైచుకొని, యాశ్రమమునుండి దీసుకొనివచ్చిన కథలో వారి సంభాషణలు చమత్కారముగను, రసవంతముగను, వ్రాయబడినవని ప్రేక్షకులును, సామాజికులును నన్ను బ్రశంసించిరి. ఈ "రామజననము"గూడ వచన నాటకమే. ఈ నాటకము ముగించిన తరువాత నేను 1890 వ సంవత్సరము జనవరి నెలలో నా స్వగ్రామమైన వీరవాసరము వెళ్ళి, "గయోపాఖ్యానము"లోని మైదవయంకము నచటవ్రాసి, టపాలో దానిని హనుమంతరావునాయుడుగారికి రాజమహేంద్రవరము బంపితిని.

"శ్రీరామజనన" నాటకమును సామాజికులు జనవరి నెలలో కడపటి భాగమున బ్రయోగించిరి. అందు దశరథపాత్రి టంగుటూరి ప్రకాశముగారు ధరించిరి. రావణాసురపాత్రను హనుమంతరావునాయుడుగారు ధరించిరి. పది తలలుగల లక్కకిరీటము చేయించి, రెండు ప్రక్కల పలుచని యినుపబద్దెలు దానికమర్చి, నాయుడుగారు ధరించెడివారు. ఆ కిరీటమును ధరించి నాయుడుగారు రంగస్థలముమీదికి వచ్చినప్పుడు విగ్రహమతి భయంకరముగ నుండెడిది. అవి చూచి కొందరు పిల్లలు "బాబో" యని "యమ్మో" యని జడుసుకొనెడివారు. "రామజనన" నాటకములో గర్భవతియైన కౌసల్య యావేశమని యొక భాగముకలదు. గర్భములోనున్న శ్రీరాముడు రావణుని దుర్నయములు రోసి, తన యాగ్రహమును కౌసల్య నోటనుండి వెడల గ్రక్కినట్లు కథలో నుండును. అది కొంత భయంకరముగ నుండును. ప్రేక్షకులా రంగమునుగూడ మిక్కిలి మెచ్చుచుండెడివారు. ప్రకాశముగారు మొదటిసారి "రామజననము" ప్రయోగించినపుడు దశరథపాత్రి ధరించినను, రెండవసారి కౌసల్యపాత్రి ధరించి యావేశ రంగమును మిక్కిలి యొప్పించిరి.

"గయోపాఖ్యాన" రచన మారంభించునప్పటికి నా కిరువది రెండు సంవత్సరములు వయస్సు. నేను నాటక రచయితనని రాజమహేంద్రవరములో నాకు కొంతపేరు వచ్చినది. వల్లూరి సూర్యప్రకాశముగారు హాస్యముచెప్పుచు నాటక మెవరు రచియించిరని సూత్రి

ధారుని చేత నడిగించుకొని, చమత్కారముగ దాని నింగ్లీషులో నిట్లు చెప్పుచుండెడివాడు. "Parrot Baniyan Tree Riches Manly Lion" ఈ మాటలకు మొత్తముమీద నర్థము "చిలమర్తి లక్ష్మీనరసింహ"మని. "గయోపాఖ్యాన" నాటకమును మా నాటకసమాజమువారు మొట్ట మొదట 1890 వ సంవత్సర సెప్టెంబరు నెలలో ప్రయోగించిరి. గయుని పాత్రను నాయుడుగారే ధరించిరి. చిత్రరేఖ పాత్రను టంగుటూరి ప్రకాశముగారు ధరించిరి. రెండవ యంకములో స్త్రీపాత్రను ధరించి మిక్కిలి మెప్పించి, మూడవ యంకమున, నయిదవ యంకమున ప్రకాశముగా రర్జునపాత్రను ధరించి కన్నుల పైకుంఠముగ ప్రదర్శించెడివారు. కౌశికపాత్రను ఐనపోలు తాతయ్యనాయుడు ధరించెడి వాడు. అతనికి హాస్యరస మొప్పించుటలో మిక్కిలి ప్రజ్ఞగలదు. ప్రకాశముగారు రంగస్థలముమీద మూర్తీభవించిన వీరరసమువలె నుండెడివాడు.

"గయోపాఖ్యానము"లో నిప్పటి యైదవయంకములోని వచన భాగము దాదాపుగ మునుపటిదేగాని, పద్యభాగమంతయు నూతనముగ జేర్పబడినదే. సమాజములోని సభ్యులనుబట్టియే నాచేత నాటకములు వ్రాయబడుచుండెడివి. ఈ నాటకములో మునుపటి కంటెనా పేరు యెక్కువ ప్రసిద్ధికెక్కినది. "గయోపాఖ్యాన"మైన తరువాత నాయుడుగారు "పారిజాతపహరణ" నాటకము వ్రాయుమని నన్ను గోరిరి. 1890 వ సంవత్సరమున వేసవికాలములో నేను వీరవాసరము వెళ్ళక, "పారిజాతాపహరణ" నాటకము వ్రాసితిని. ఇదియు నైదంకముల నాటకమే. దీనిలో సత్యభామ పాత్ర ప్రకాశముగారే ధరించెడివారు. ఆయా రసమునుబట్టి యాయన ముఖవైఖరి, కంఠస్వరము మార్చుటజూచి, ప్రేక్షకులు మహానందమును బొంది చప్పట్లు గొట్టుచుండెడివారు. అందులోని కైరవపాత్ర తాతయ్యనాయుడు ధరించెడి వాడు. అప్పుడు శ్రీకృష్ణపాత్ర ధరిచినట్టి పిళ్ళారిసెట్టి రామకృష్ణమ్మ నాయుడుగారు పద్యములు చదువలేనివారు గనుక శ్రీకృష్ణునకు నేను మొదట పద్యములు పెట్టలేదు. ఇప్పుడచ్చుపడియున్న నా "పారిజాతాపహరణ" నాటకములో జాల పద్యములు పెట్టితిని. నెప్పలి బుల్లి కృష్ణయ్య యనునతడు చిన్న చిన్న స్త్రీపాత్రలను ధరించుటయేగాక,

మనోహరముగ నాట్యముగూడ జేసెడివాడు. ఈ సమాజమువారికి వచన నాటకములే యాడవలెనను సంకల్పము గలుగుటకు నొకటి రెండు కారణములు గలవు. సంగీతజ్ఞానము లేకపోవుట యొకటి. చక్కగా భాగములు చదివి ప్రయోగించిన పక్షమున పద్యనాటకములకంటె వచననాటకములే యెక్కువ మనోహరముగ నుండునను నభిప్రాయ మొకటి.

ఈ యభిప్రాయము గలుగుటకు గుంటూరు మొదటి నాటక సమాజము కారణము. చెన్నపట్టణమందలి పచ్చయప్ప కళాశాలలో నాంధ్రోపాధ్యాయులై బ్రహ్మశ్రీ కొండుభట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు, గుంటూరు నాటకసమాజమునకెన్నో వచననాటకములు వ్రాసి యిచ్చిరి. ఆ సమాజమువారు గుంటూరునందును, మరి యితరస్థలములందును వాటిని మిక్కిలి నేర్పుతో ప్రయోగించి పెద్దపేరును గాంచిరి. ఆ సమాజమువారు 1884 వ సంవత్సరమున డిశంబరు సెలవులలో రాజమహేంద్రవరమువచ్చి, వారు నాటకములను ప్రయోగించిరి. వచననాటకములైనను, నవి యెంతో మనోహరములుగ నుండెను. ఆ నాటకసమాజ సభ్యులలో మహారాజశ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్యగారుకూడ నుండిరి. వారి నాటకములలో "యుగంధర విజయ" మనునది మిక్కిలి చక్కగనుండెను. వారి "హరిశ్చంద్ర" నాటకముగూడ మిక్కిలి రసవంతముగనుండెను. పలుమాటలేల, వారి నాటకములన్నియు జనాకర్షకముగనే యుండెను. నాటకముల శైలిగూడ సులభమై, ప్రేక్షకులకు సుబోధకముగనుండెను. ఆ కారణమున రాజమహేంద్రవరపు "హిందూనాటక సమాజము" వారుగూడ మొదట వచననాటకములే ప్రయోగింపదలచి, యట్టివే వ్రాయించిరి. హనుమంతరావునాయుడుగారు, ప్రకాశముగారు మొదలగు నటుల కౌశలముచేత నాటకములలో పద్యములు లేవన్న వెలితి కనబడలేదు.

ఈ 1890 వ సంవత్సరము మే నెలలోసమాజమునకొకనష్టము సంభవించినది. సమాజములో సూత్రధారుడై యుండిన రామానుజయ్య యను సాతాని వైష్ణవుడు తాగుచుచుండెడివాడు. ఆతడింటి దగ్గరనే యాపని జేయుచుండెనుగాని రంగస్థలములో నట్టి పని జేసెడివాడుగాడు. హనుమంతరావు నాయుడుగారు రంగస్థలమును మిక్కిలి

పవిత్రముగ నుంచవలెనను తలంపుగలవారు. రామానుజయ్య యొక్క
నాడు, నాయుడుగారి స్వభావ మెఱుగక, త్రాగి రంగస్థలమునకు
వచ్చెను. అది చూచి హనుమంతరావునాయుడుగారు కోపించి, చీవా
ట్లుపెట్టి, రామానుజయ్యను రంగస్థలమునుండి యాపూట వెడలగొ
ట్టిరి. రామానుజయ్య పశ్చాత్తాపమునొంది, సమాజములో నున్నం
తకాలము నట్టి పని మరియెన్నడు జేయలేదు. నాయుడుగారు జేసిన
పనికి నేను మిక్కిలి సంతసించితిని. నాయుడుగారి యెడల సామాజికు
లకు మిక్కిలి భయభక్తులుండెడివి. ఈ రామానుజయ్య వేసవికాలపు
సెలవులలో నేదో పనిమీద కిర్లంపూడి వెళ్లెను. అక్కడ కొన్నా
ళ్లుండి పిమ్మట పిఠాపురము వెళ్ళదలచి, దిట్టముగ త్రాగి, పిఠాపుర
మునకు బండి మాట్లాడుకొని, యాబండిలో నెక్కి తన వెంట మరి
రెండు సారాబుడ్లు తెచ్చుకొని, రాత్రియంతయు మిక్కిలి త్రాగిత్రాగి
పండుకొనెను. తెల్లవారునప్పటికి బండి పిఠాపురము వెళ్లెను. బండి
వాడు తన బాడుగనిమ్మని రామానుజయ్యను లేపబోగా, నతడు నిద్ర
నుండి మేలుకొనలేదు. ఆ నిద్దుర పెద్ద నిద్దురయ్యెను.

రామానుజయ్య చనిపోయిన వార్త మాకు దెలిసెను. అతడు
పోయిన తరువాత నంతచక్కగా గానముచేసెడు సూత్రధారుడు చిర
కాలమువరకు దొరకలేదు. నల్లూరి సూర్యప్రకాశముగారికి తోడుగ
హాస్యమునకు రాయవరపు హనుమంతరావుగారనియొకరుగూడ వచ్చు
చుండెడివారు. వీరుగాక కంచి యానందరావుగారని యొక పురుషు
డొకసారి కాకినాడనుండి వచ్చి మా సమాజమున నొకనాటకములో
హాస్యముజెప్పిరి. ఆయన నివాసస్థానము కాకినాడ. కాకినాడలో
1885 వ సంవత్సరమునందే దినవహి హనుమంతరావుగారను సంపన్న
గృహస్థులొకరు, మిత్రుల ప్రోత్సాహముచేత నొక నాటకసమాజము
స్థాపించిరి. దాని తెరలకు నలంకారములకు నైదువేల రూపాయలు
వ్యయపరచిరి. ఆ సమాజములో నైజగ్ను అప్పారావుగారని యొక
పట్టపరీక్షాసిద్ధుడు, జయంతి భావనారాయణగారను నొక యాంధ్ర
కవియు మరియు ననేకులు పాత్రలను ధరించుచుండెడివారు. దానికి
సింగితపు అబ్బాయిగారను మాధ్వబ్రాహ్మణుడు మేనేజరుగ నుండెడి
వాడు. ఆ సమాజములో ఆనేసాలు భీమసేనరావుగారు కంచి యానం

దరావుగారు వల్లూరి సూర్యప్రకాశముగారు కోపల్లె రమణారావుగారు రాయసవరపు హనుమంతరావుగారు మొదలగువారుగూడ పాత్రలు ధరించియు, హాస్యములు జెప్పియు ప్రేక్షకులను రంజింపజేసెడివారు. ఆ కారణముననే మాసామాజికులు కంచి యానందరావుగారు మొదలగువారిని బ్రతిమాలి తమ నాటకములలోగూడ హాస్యము జెప్పించిరి.

"పారిజాతాపహరణ" నాటకమును 1890 వ సంవత్సరము రెండవ భాగములో మా సామాజికులాడిరి. అదియు జనరంజకముగ నున్నదనియే చెప్పుకొనిరి. ఆయేడు జూలై, యాగస్టు నెలలలో నేను "నల" నాటకమును వ్రాసితిని. అది వ్రాయుచుండగా, సమాజములో రాజు వేషము తరుచుగా ధరించుచుండెడు సిళ్ళారి సెట్టి రామకృష్ణమ్మ నాయుడుగారు నాయొద్దకువచ్చి, నలునిపాత్ర తనకిమ్మని యడిగి, పద్యములు పెట్టవద్దనియు, నొకవేళ పెట్టినను వాటికి సరియైనవచనము, క్రిందవ్రాయుమనియు నన్ను గోరుచుండెను. అందుకు నాకు పట్టరాని యాగ్రహముగలిగి, నాటకమువ్రాసిన పుస్తకమును చింపితిని. చింపుట యనగా ముక్కలు ముక్కలు జేయలేదు. వ్రాసిన కాగితముల పుస్తకము నిలువుగ జింపితిని. అక్షరములు మాత్రము జెడిపోలేదు. తరువాత సామాజికులా పుస్తకమును జూచి, మరియొక ప్రతి వ్రాసుకొని దగ్గర నుంచుకొని పలుమారు ప్రయోగించిరి.

ఇందు నలపాత్ర నాకొకవిధముగ శిష్యుడు, మిత్రుడునైన దుగ్గి గోపాలకృష్ణారావు ధరించెడివాడు. అతడు బద్యములు జక్కగా చదివెడివాడు. దమయంతిపాత్ర ప్రకాశముగారు ధరించెడివారు. ఈనాటక మచ్చుపడలేదు. కారణమేమన, బళ్ళారిలోనుండిన బ్రహ్మశ్రీ ధర్మవరము కృష్ణమాచార్యులవారు "చిత్రనళీయ" మనుపేర "నల" నాటకమొకటి వ్రాసిరి. ఆయన "సరసవినోదినీ" యను నొక నాటక సమాజము స్థాపించి యా సమాజము నప్పుడప్పుడు చెన్నపురి కేసికొనిపోయి, తానే నలునిపాత్ర ధరించి, దానిని, మరికొన్ని నాటకములను చెన్నపురిలో నాడి యా నగరమందలి యాంధ్రమహాజనుల నద్భుతానందరసములలో దేల్చెడివారు. వారి "చిత్రనళీయ" నాటకమును నేను జదివించుకొని, విని, యది యన్నివిధముల నా "నల"

నాటకముకంటె మిన్నగ నుండుటచేత నా నాటకము దానిముందర బనికిరాదని భావించి, యచ్చు వేయలేదు. వ్రాతప్రతిగూడ నాకిప్పుడు దొరకుట దుర్లభముగనున్నది. నాదగ్గర నేను వ్రాసిన నాటకములకు రెండవప్రతి నుంచుకొనకయే, సమాజమువారి కిచ్చుచుండెడి వాడను. 1890 వ సంవత్సరము మార్చి నెలలో నేను "సీతాకల్యాణ" మను నాటకము వ్రాసితిని. అది యాసంవత్సరము శ్రీరామనవమి దినములలో నాడవలెనని నాయుడుగారు నిశ్చయించి, నన్ను త్వర పెట్టినందున దానిని మిక్కిలి వేగముగ వ్రాసితిని. అది శ్రీరామ నవమి రోజులలోనే యాడబడెను.

1890 వ సంవత్సరము జూలై నెలలో మా కుటుంబము మరల రాజమహేంద్రవరము వచ్చెను. మాతల్లియు, నిద్దరు చెల్లెండ్రును, మా తమ్ముడు నుంటిమి. చిత్రపు నరసింహారావుగారి యిన్నీసుపేట యింటిలో నప్పుడు కాపురముంటిమి.

ఆర్యను పాఠశాలను గురించి యొకమాట జెప్పవలెను. పాఠ శాలయంతయు క్షీణింపగ, మూడు నాలుగు తరగతులను దీసికొని పోయి నేనును కుందూరు వెంకటరత్నముగారును తవ్వలవారి బంగా ళాలో బెట్టి జరుపుచుంటిమని చెప్పితినిగదా! 1890 వ సంవత్సర ప్రారంభమున నా పాఠశాల నక్కడనుండి మార్చి పెద్దబజారులో శ్రీ వాడ్రేవువారి "గాడేఖానా" యను పేరుగల యింట నెలకొల్పి, జరుపుచుంటిమి. క్రిందితరగతులుగూడ బెట్టి మానాప్రగడ పార్వతీ శముగారిని మూడవ యుపాధ్యాయునిగ దీసికొని, నడపుచుంటిమి. పిల్లలసంఖ్య యధికమగుటచే శ్రీపాద మందయ్యశాస్త్రిగారి నాంధ్రో పాధ్యాయులుగ నియమించితిమి. ఆ సంవత్సరము జూలైలో పైతర గతులలో బాలకులసంఖ్య యెక్కువగుటచే, వెంపరాల భీమశంకరం గారనువారిని గూడ మరియొక యుపాధ్యాయునిగ నియమించితిమి. ఈ భీమశంకరముగారు మెట్రిక్యులేషను తరగతియందు కృతార్థులైన వాడు. నాకు సహాధ్యాయుడు. చక్కని తెలుగు కవిత్వముగూడ జెప్పగలవాడు. పాప మితడు తరువాత స్వల్పకాలముననే మృతి నొందెను.

1890 వ సంవత్సరమున నవంబరు నెలలో కలకత్తానగరము నుండి సాధారణ బ్రహ్మసమాజ మతబోధకుడైన శ్రీ పండిత శివ నాథశాస్త్రిగారు రాజమహేంద్రవరమువచ్చి, యింగ్లీషు భాషలో నమృతప్రవాహమువంటి గంభీరోపన్యాసములిచ్చిరి. ఆయుపన్యాస ములు సభాసదులను సమ్మోహనాస్త్రములవలె బరవశము జేసెను. ఆయనమీద నే నప్పు డైదుపద్యములు జెప్పితిని. నాపద్యములువిని సభాసదులు సంతోషించిరి. అనేకులు నన్ను మెచ్చి, కొనియాడిరి. శివనాథశాస్త్రిగారు మొట్టమొదటిసారి రాజమహేంద్రవరమునకు 1881 వ సంవత్సరమున వచ్చిరని నేనిదివరకే జెప్పియుంటిని. వారు వచ్చుటకిది రెండవసారి. వారువచ్చి వీరేశలింగముగారియింటనే బస చేసిరి. నేను వీరేశలింగముగారి మేడమీదికిబోయి, వారిని సంద ర్శించి, మాటలాడితిని. వారు దయాపూర్వకముగ నన్నాదరించి మాటలాడి, నాసంగతివిని Local Shakespere (స్థానిక షేక్స్పియర్) అని నన్ను బ్రశంసించిరి. ఆబిరుదునకు తగినవాడనుగానని నే నెరుగు దును. నేను బహునాటకములు రచియించితినన్నమాటవిని, వారా విధముగ బ్రసంశించిరి. శివనాథశాస్త్రిగారిమీద నేనువ్రాసిన పద్య ములు "సునీతి" యను తెలుగుపత్రికలో బ్రకటింపబడెను. ఇప్పు డవి నాదగ్గర లేవు.

నేను రచియించిననాటకములేగాక, ముడుంబై రామానుజా చార్యులుగారిచే రచింపబడిన "సిరియాళరాజుచరిత్రి"మను నాటక మును, "పాండవాశ్వమేధ"మను నాటకమును మరియెవ్వరో రచి యించిన "సారంగధర" నాటకమును, వీరేశలింగముగారిచే రచియిం పబడిన "చమత్కారరత్నావళి"యును నీ సమాజమువారు బ్రయో గించుచుండెడివారు. స్త్రీ పాత్రను ధరించుటకు టంగుటూరి ప్రకా శముగారేగాక, యరగర్ల సత్యరాజుగారని యొకరుగూడ నుండెడి వారు. అప్పుడాయన విద్యార్థిగనుండెడివారు. ఆయన విగ్రహము గూడ సుందరముగనుండెడిది. ఆయన యాకారముగూడ స్త్రీ వేష మునకు మిక్కిలి యొప్పియుండెడిది. "సారంగధర" నాటకములో బ్రకాశముగారు రత్నాంగి పాత్రయు, సత్యరాజుగారు చిత్రాంగి పాత్రయు ధరించెడివారు. ఇతరులు ధరించిన నాటకములు మా

సామాజికులాడినప్పుడు వానిలోని లోపములు పూర్తిచేయుమని నాయుడుగారు నన్ను ప్రోత్సాహపరచుచుండెడివారు. అవి నేను పూర్తిజేసియిచ్చుచుంటిని. ఈవిధముగ "నశ్వమేధ" నాటకము లోను, "సారంగధర" నాటకములోను కొన్నిభాగములు క్రొత్తగ వ్రాసియిచ్చితిని.

ఆ సంవత్సరమున ప్రకాశముగారు ప్రథమశాస్త్ర పరీక్ష తరగతిలోజేరి చదువుచుండిరి. 1889 వ సంవత్సరము డిశంబరులో జరిగిన మెట్రిక్యులేషను పరీక్షలో ప్రకాశముగారు కృతార్థులైరి. అప్పటి కాయనకు రమారమి పదియారో, పదియేడో సంవత్సరముల వయస్సుండవచ్చును. ఆ సంవత్సరము వేసవికాలపు సెలవులలో ప్రకాశముగారికి వివాహమయ్యెను. ఆ సంవత్సరము డిశంబరు నెలలో రాజమహేంద్రవర హిందూనాటకసమాజము పైగ్రామములలో తమ నాటకముల ప్రదర్శింపదలచి, యమలాపురము వెళ్ళిరి. హనుమంతరావునాయుడుగారి బలవంతముమీద యమలాపురము నేను గూడ వెళ్ళితిని. కాని యమలాపురములో మా నాయుడుగారనుకొన్నట్లు ధనలాభము విశేషముగ గలుగలేదు. నాటకములకు గావలసిన తాటియాకులపాకలు మాచిరాజు నరసింహముగారు గుత్తకు దీసుకొని వేయించిరి. అప్పుడు హనుమంతరావునాయుడుగా రిన్నీసుపేట మిడిలు స్కూలులో ప్రథమసహాయోపాధ్యాయుడుగనుండిరి. అప్పుడు మిడిలు స్కూళ్లు శనివారముదయముగూడ బనిచేయుచుండెడివి. ఒక శనివారమునాడమలాపురములో "గయోపాఖ్యానము" ప్రయోగించుటకు నిర్ణయింపబడినది. హనుమంతరావునాయుడుగారు గయునిపాత్ర ధరింపవలసినవారుగనుక వారు శనివారమునాడు ప్రాతఃకాలమున బడికిపోయి పనిజేసి, బడికట్టివేసినతరువాత బయలుదేరి రాజమహేంద్రవరమునుండి యమలాపురము నలుబదిమైళ్లు నడచివచ్చి, యా రాత్రి యా పాత్రధరించి, యభినయించి, మరునాడు బయలుదేరి వెళ్ళిరి. హనుమంతరావునాయుడుగారికి నాటకములయందుగల కుతూహలమునుగూర్చి యింతకంటె నెక్కువ జెప్పనక్కరలేదు. ఎక్కడనున్నను నాటకశాలయే వారిగృహము. సామాజికులే వారికాప్తులు. అదియే వారికానందప్రదము.

ఉపాధ్యాయులుగ గూడ హనుమంతరావు నాయుడుగారు మిక్కిలి ప్రతిష్ఠవహించినవారే. ఇంగ్లీషు గణితశాస్త్రముగూడ వారు మిక్కిలి సమర్థతతో బోధించెడివారు. ఆయన మెట్రిక్యులేషను పరీక్షయందే కృతార్థులైనను, హైస్కూలు తరగతులకు గూడ నవలీలగ, గణితము నింగ్లీషు చెప్పగలవారు. బాలకులుగాక యుపాధ్యాయులు గూడ వారిబోధనమునుండి గొన్ని సంగతులు నేర్చుకొనవలసి యుండెడివి. ఆయనబుగ్గమీసములతో భయంకరాకారము గలిగియుండెడి వారు. కాని హృదయము చాలమంచిది. హైస్కూలులోని యుపాధ్యాయులు సెలవు దీసికొన్నప్పుడు వారి స్థానములందు మెట్కాఫ్ దొరగారు నాయుడుగారినే పంపుచుండెడివారు. ఈయన చేతిక్రింద నే నైదుసంవత్సరములు పనిజేసితిని. అందుచేత వారిసామర్థ్యము నేనెరుగుదును. నాటకపాత్రలు ధరించినప్పుడు వీరి యభినయము, వీరి యుచ్చారణము, శ్లాఘాపాత్రములుగ నుండెడివి. ఈయనది మిక్కిలి జాలిగుండె. ఎప్పుడైన కోపమువచ్చి కుమారుని కొట్టినప్పుడు తానుగూడ కన్నీరుపెట్టుకొని యేడ్చుచుండెడివాడు. నాటకసమాజము మమలాపురములో నున్నప్పుడు నేము చిలుకూరి లక్ష్మీనరసింహారావుగారి యింటనుంటిమి. వీరు మాధ్వులు. చిలుకూరి లక్ష్మీనరసింహారావుగారు రాజమహేంద్రివరములో బ్రిథమశాస్త్రపరీక్షకు చదువుచున్నప్పుడే మానాటకసమాజములో జేరిరి. ఈయన రాజమహేంద్రవరము సమాజములోని సభ్యులకు పదిరూపాయలు ఖర్చుపెట్టి బొబ్బట్లతో విందుచేసెను. అప్పటినుండియు సామాజికులు వీరిని వినోదార్థమై "బొబ్బట్లమేనేజ"రని పిలుచుచుండెడివారు. ఆయన కవిత్వముకూడ జెప్పగలరు. "ద్రౌపదీవస్త్రాపహరణ"మను నాటకమును, "సౌగంధికాహరణ"మను నాటకమును వీరు రచించిరి. అందు మొదటిది మా సమాజమువారు ప్రయోగించిరి. ఆయన సామాజికుల యెడల స్నేహముచేత సమాజమువారి కమలాపురములో దనయింటిలోని వెనుకభాగము బసగ నిచ్చెను. అదియొక సందులోనున్నది. కాని మాకు సౌఖ్యముగానే యుండెను. అప్పుడొక విపరీత బ్రాహ్మణుడు మాకు వంటకు గుదిరెను. వాడు కోపస్వభావుడు. పైగా నల్లమందు వేసెడివాడు. పెద్దవాడు. వానిగోళ్లు పుప్పిగోళ్లు. వాడు ప్రతి

దినము ప్రాతఃకాలమున మజ్జిగలో నటుకులు నానవేసుకొని, యుపాహారము దినుచుండెడివాడు. ఏది కొరతయైనను సహింపక కోపించుచుండెడివాడు. "నాపుప్పిగోళ్లు మంటబెట్టును. నేను పచ్చడిచేయలేను మహాప్రభో.!" యని యరచుచుండెడివాడు. "పుల్లలు తడిగానున్నవి, మండుటలేదు" అని కేకలువేయుచుండెడివాడు. "అటుకులలో వేసుకొనుటకు పెరుగులేదు. వెళ్ళిపోయెదను. మహాప్రభో!" యని మాటమాటకు బెదరించుచుండెడివాడు. సామాజికులతో తరుచుగా జగడమాడుచుండెడివాడు. ఎట్లెటో మేము కాలక్షేపముచేయుచుండగా, 1891 వ సంవత్సరము సంక్రాంతినాడా దురహంకారుడు మిక్కిలి కోపపడి యేదో వంకబెట్టి వంటచేయకుండ లేచిపోయెను. ఆదినము పండుగ యయ్యెను, పిండివంటలు లేవు సరిగదా, పట్టెడన్నమైనను దొరకుట దుర్లభమయ్యెను. సామాజికులలో నొకరిద్దరు మడికట్టుకొని, పగలు మూడుగంటలగునప్పటికి మాకింత చారుంగూడు పెట్టిరి.

అమలాపురములో మంత్రిప్రగడ కవులట్లయ్యగారను యొకయువకు డుండెను. ఆయన మా నాటకములుజూచి, నాలుగైదు సారులు మాబసకు వచ్చెను. వారికీ, నాకూ కొంత మైత్రియయ్యెను. ఆయన యష్టావధానము చేయుమని నన్ను గోరగా, నేను మాబసలోనే యొకనాటిరాత్రి మా సామాజికులయెదుట నొక యష్టావధానము జేసితిని. అప్పుడు నేనెనమండుగురికి వారుకోరిన విషయములమీద వారుకోరిన వృత్తములతో కవిత్వము జెప్పితిని. పుష్పగణనము, పురాణముచెప్పుట, చీట్లపేక, మొదలైన యంగములు లేవు. 1891 వ సంవత్సరమున మా సామాజికులు "హరిశ్చంద్ర" నాటకము ప్రయోగించిరి. ఆనాటకమున కారాత్రి ధవళేశ్వరములో నింజనీయర్లుగనున్న ముగ్గురు దొరలు వచ్చిరి. హాలీ, రాములీసు మరియొకరును. హిందువుల నాటకము లెట్లుండునో చూడవలెనను కుతూహలముతో వచ్చిరి. నాటకమైనతరువాత మరునాటి యుదయమున వారు హనుమంతరావు నాయుడుగారిని గలుసుకొని "మీసామాజికులు రాత్రివేసిన వేషములు మరల నీపూటవేసి కూర్చుండవలెనని మా కోరిక. ఎందుకనగా మేము ఫొటోగ్రాపులు తీసుకొని వాటిని

సీమకు బంపెదము, హిందువుల వేషము లెట్లుండునో చూడవలెనని మా దేశస్థులకు మిక్కిలి కుతూహలముండును" అని కోరిరి. తన మాట కడ్డుచెప్పువారెవరు లేరనుకొని, నాయుడుగారు సమ్మతించిరి. కాని యొక యాటంకమువచ్చెను. తనకు మిక్కిలి ప్రియశిష్యుడును, ప్రేమాస్పదుడును, దనకు పుత్రప్రాయుడునునైన ప్రకాశముగారే దాని కంగీకరింపరైరి "పీర్లపండుగలో వచ్చెడి నాడవేషములవలె నేను పట్టపగలు వేషము వేయుదునా ? నేనొప్పుకొన"నని తిరస్కరించిరి. తనమాట బోటుపోవునని ప్రకాశముగారిని నాయుడుగారు మిక్కిలి బ్రతిమాలిరి. కాని ప్రయోజనము లేకపోయెను. ప్రకాశముగారు చిన్ననాటనుండియు నన్నివిషయములలోను స్వతంత్రుడు. తనకు యుక్తమని తోచినపనినేగాని చేయరు. ఆయన యిట్లు ప్రవర్తింతురని యెవ్వరనుకొనలేదు. నాయుడుగారు కొంచెము విచారించిరి. సామాజికు లాశ్చర్యపడిరి. నాయుడుగారికి దొరలదగ్గర పరాభవము జరుగునేమోయని యెరగర్ల సత్యరాజుగారును, నెప్పలి బుల్లికృష్ణయ్యయు స్త్రీ వేషములు ధరించివచ్చిరి. నాయుడుగారును వారి సన్నిహితజ్ఞాతియైన యిమానేని కాంతారావునాయుడుగారును, అయినవోలు తాతయ్యనాయుడును పురుషవేషములు ధరించివచ్చి కూర్చుండిరి. దొరలు ఫొటోగ్రాపులు తీసుకొని నాటకము బాగున్నదని యోగ్యతాపత్రిక నిచ్చిపోయిరి. అమలాపురములో నుండగ సామాజికులలో గొందరు స్వల్పకారణమున గోపించి, నాటకములో వేషము వేయమని బెట్టుసరిజేసిరి. ఆనాడు వేయవలసిన నాటకము "గయోపాఖ్యానము." అందులో శ్రీకృష్ణపాత్ర ధరించునతడును బలరామపాత్ర ధరించునతడును కోపించిరి. వెంటనే శ్రీకృష్ణపాత్ర చదివి దుర్గి గోపాలకృష్ణారావు నటించెను. తరువాత నతడు శ్రీకృష్ణ పాత్రధారణములో మిక్కిలి పేరు సంపాదించెను. బలరామపాత్ర ధరించుటకు మరియెవ్వరు లేకపోయిరి. అందుచేత నాటకము జెడిపోవునేమోయని నేనాపాత్ర ధరించుటకు సిద్ధమైతిని. కాని సాయంకాలమగునప్పటికి బలరామపాత్ర ధరించునతడే స్వయముగవచ్చి, తానే యావేషము వేసెను. నాకు దృష్టి లేకపోయినను యెట్లో కాలక్షేపము జేయగలనని ధైర్యము గలిగి, నేనట్టిపని కొప్పుకొంటిని.

అమలాపురములోనుండగ నాయూరి పెద్దకోమటియింట వివాహము జరిగెను. నాలుగవనాడు మిక్కిలి వైభవముతో నూరేగింపు జరిగెను. హనుమంతరావునాయుడుగారును, మరికొందరు సామాజికులు నూరేగింపు జూచుటకై వెళ్ళిరి. నిద్రాభంగమగునని, నేను మాత్రము వెళ్ళలేదు. ఆయూరేగింపులో పెండ్లివారిపక్షమువారికిని, మరియొకపక్షమువారికిని వివాదము జరిగెను. ఆవివాదము క్రమముగ ముదిరి కొట్లాటలోనికిదిగెను. ఆవివాదము నెట్లో పరిష్కరింపదలచి, హనుమంతరావునాయుడుగారు వారిమధ్యకు వెళ్ళినిలిచిరి. కలహకారులు కర్రలతో కొట్టుకొనిరి. అందులో నొకదెబ్బ నిరపరాధియైన నాయుడుగారి నెత్తిపైదగిలెను. తలపగిలి, క్రొన్నెత్తురు బొట బొట గారదొడగెను. నాయుడుగారు వెంటనే యింటికివచ్చి కట్టుగట్టించుకొని పండుకొనిరి. మానాటకసమాజమునకు "నాయుడుల కంపెనీ"యని పేరు. రాజమహేంద్రవరములో వెలమనాయుడులు మిక్కిలి పలుకుబడిగలవారని లోకములో నొకవాడుకయుండెను. అందుకు దోడుగ మాసామాజికులలో నొకడైన యిమ్మానేని కాంతారావునాయుడుగారు, లక్ష్మీనారాయణనాయుడుగారును రాజమహేంద్రవరములో జిల్లా మునసబులుగనుండిరి. తనయింటి వివాహములోహనుమంతరావునాయుడుగారికి దెబ్బతగులుటచే నాయుడులవల్ల తనకేదో యపకారము జరుగునని భయపడి, సంపన్నుడైన యావైశ్యశిఖామణి మాసామాజికుల కొకనాడు తనతోటలో విందుచేసెను. ఈవిందువలన తనమీదికోపము సామాజికులకు పోవుననితలచెను. సామాజికుల కాతనిమీద నెట్టికోపములేదు. ఆవిందులో నా వైశ్యశిఖామణి నన్ను మిక్కిలి గౌరవించెను. అమలాపురమునుండి నేను నడుమనడుమ రాజమహేంద్రవరము వచ్చుచుంటిని. 1891 వ సంవత్సరము జనవరి నెలలోనో, ఫిబ్రవరి నెలలోనో, పూర్వము నాసహాధ్యాయుడు నాకు మిత్రుడు సజ్జనుడునైన బంధకవి వేంకటరావనువాడు మిక్కిలి జబ్బుగనున్నాడని తెలిసి, నేనమలాపురమునుండి రాజమహేంద్రవరము వానిని జూడవెళ్ళితిని. అతడు మాటలాడలేకయుండెను. తరువాత రెండు దినములకతడు మృతినొందెను. అతని మృతి నాకు కొంతమనస్తాపము కలిగించెను. అప్పటి కతని తండ్రి

ఉవించియుండెను. అతడు మెట్రిక్యులేషను పరీక్షయందు కృతార్థుడు. అంతకుముందే యతనికి వివాహమయ్యెను. నేను నాటకములమీద సరదాచేతను, వారము వారము నమలాపురము వెళ్ళి సోమవారము నాటికి బడికి రాలేకపోవుచుంటిని. కుందూరి వేంకటరత్నముగారును, నామిత్రులైన చెరుకుమిల్లి వేంకటరామయ్యగారును, నేనును గలసి మా యార్యను పాఠశాలనే "మ్యూనిసిపల్ స్కూలు" అను పేరుతో నడుప నిశ్చయించుకొంటిమి. నేను సరిగ బడికి పోలేకపోవుటచేత బడిలో పని జేయుట కశ్రద్ధచేయుచున్నానని పాఠశాలయొక్క కాల పట్టిక (Time Table) లో నుండి నాపేరు తొలగించిరి. కీనిఫలము వారిద్దరు నాయుద్యోగమును దీసివేసినట్లేగద ? నేనమలాపురమునుండి వచ్చిన తరువాత నాకావార్త వెంకటరత్నముగారు తెలియజేసిరి. అంతట నేనాబడినుండి తప్పుకొంటిని. ఇందువలన నేను 1891వ సంవత్సరమున నుద్యోగములేకయుంటిని. డి. జగన్నాథరావుగారియింటను, నాదినములలో రాజమహేంద్రవరము తహసీలుదారుగనుండిన శ్రీ వాడ్రేవు విజయరామయ్యగారియింటను, నేను బాలురకు పాఠములు చెప్పుచు స్వల్పధనమార్జించి కాలక్షేపముచేయుచుంటిని. అదిగాక, రాజమహేంద్రవరము కళాశాలలో, సాము కసరతుల యుపాధ్యాయులైన యేలూరి రామచంద్రరావుగారు, సాము కసరతులమీద నొక పుస్తకము వ్రాయబూని, శరీరపరిశ్రమయవసరమనియు నారోగ్యము ముఖ్యమనియు బోధించునట్టి పద్యములు గొన్ని యాగ్రంథములో నేసుకొనుటకు, వ్రాయుమని నన్ను గోరిరి. నేను చాల పద్యములు వ్రాసియిచ్చితిని. అందుకు ప్రతిఫలముగ, నాకు వారు నెలకు నాలుగైదు రూపాయలు యిచ్చుచుండిరి. ఈవిధముగ నేను చిక్కుపడుచు నెట్లో కాలక్షేపము చేయుచుంటిని.

# స్వీయ చరిత్రము

## ఐదవ ప్రకరణము

## నాటక సమాజము

ఇట్లుండగ నాకు శరీరారోగ్యము చెడెను. జ్వరము తగుల జొచ్చెను. రాజమహేంద్రవరములో నా బంధుగులెవ్వరును లేరు. పూటకూళ్ళయింట భోజనము చేయుచుంటిని. పూటకూళ్ళమ్మకు కొంత డబ్బిచ్చి కొంత యుగువు పెట్టుచుంటిని. నాకు దామెర్ల రమణరావుగారు మందిచ్చి కుదిర్చిరి. నామిత్రుడును, శిష్యుడునైన రాయ వరపు రామమూర్తి నామీద దయాభిమానములు గలిగి, నన్ను దన యింటికి దీసికొనిపోయి నాకు సకలోపచారములు జేసెను. క్రమ క్రమముగ నాజబ్బు తగ్గెను. నా జబ్బుసంగతి మా తండ్రిగారికి తెలిసి రాజమహేంద్రవరమువచ్చి, నెమ్మదించినతరువాత నన్ను వీరవాస రము దీసికొనిపోయిరి. అచ్చట కొన్నిదినములుండి, యక్టోబరు నెలలో రాజమహేంద్రవరమువచ్చితిని. అప్పుడు రాయవరపు రామ మూర్తి మెట్రిక్యులేషను తరగతిలో చదువుచుండెను. అతనికి గణి తము నేను చెప్పలేకపోయినను, దేశచరిత్రము, తెలుగు చెప్పగలిగి నందున నన్ను రామమూర్తియు, నతని తండ్రిగారును పూటకూళ్ళ యింటికి వెళ్ళవద్దనియు తమయింటనే యుండవలసినదనియు, బల వంతపెట్టి నన్ను నిలిపిరి. నేనందు కంగీకరించి వారియింటనుంటిని.

ఆ సంవత్సరమున, మా సమాజ నాటకమొకటి చూడవలె నని, కిర్లంపూడి జమీందారులైన యినుగంటి బుచ్చితమ్మయ్య గారును, వారితమ్ములైన చిన్నారాయణంగారును, రాజమహేంద్రవర మేదో పనిమీదవచ్చి, తమమిత్రులైన చెరుకుమిల్లి వెంకట్రామయ్య గారిద్వారా తమ కుతూహలము మాకు తెలియజేసిరి. పూర్వముం డిన తాటాకు నాటకశాల తీసివేయబడెను. మునుపటివలె వారము వారము సమాజమువారు నాటకములాడుట మానిరి. అప్పుడు పట్ట ణములో నాటకశాలలు లేనందున వీరేశలింగముపంతులుగారు గట్టిం చిన టౌనుహాలులోనే నాటకములు జరుగుచుండెడివి. కిర్లంపూడి జమీందారుల నిమిత్తము మా సమాజమువారు నేను రచియించిన

"ద్రౌపదీపరిణయ నాటకమును" టౌనుహాలులో ప్రయోగించిరి. జమీందారు లిద్దరును నాటకముజూచి సంతోషించిరి. సామాజికులు చక్కగ నటనము జేసిరి.

ఆ సంవత్సరము సమాజమును కాకినాడ తీసికొనిపోవలెనని నాయుడుగారు సంకల్పించి, యాయన కాకినాడ వెళ్ళి, యుప్పుటేటి యొడ్డున నొకపాక వేయించిరి. ఇందుకు "సింగితపు అబ్బాయి"గారు సాయము జేసిరి. ఇచ్చట సింగితపు అబ్బాయిగారిని గురించి కొన్ని మాటలు వ్రాయవలెను. అబ్బాయిగారు మాధ్వులు. బ్రాహ్మణులు. గొప్పవస్తాదు. అప్పటికి యేబది సంవత్సరములు వయసుదాటియుండును. వస్తాదగుటచేత పట్టణములోనున్న యువకులు, స్వేచ్ఛావిహారులు, వెంకివాండ్రు మొదలగువారు వీరిచుట్టూ జేరుచుండిరి. ఇందన్ని వర్ణములవారు నుండిరి. ఈయన వైద్యముగూడ జేయుచుండెడివాడు. అందుచేత పట్టణములో మిక్కిలి పలుకుబడి యుండెను, వైద్యమువల్ల కొంతధనముగూడ వచ్చుచుండెను. ఎవరివిూదనైన నాగ్రహము వచ్చినప్పుడు, తన శిష్యులను వెంటబెట్టుకొని యబ్బాయిగారు, విరోధుల బుర్రలు కఱ్ఱలతో బగులగొట్టి, తనకోపము దీర్చుకొనుచుండెడివాడు. మేజస్ట్రీటులు, పోలీసువారు, వైశ్యశిఖామణులు వీరిచే వైద్యము చేయించుకొనుచుండుటచే, నబ్బాయిగారికి వారివలన నేవిధమైన భయము లేదు. ఈ బాహుబలశాలి యొకసారి యొకచోరనుగూడ గొట్టెనని వాడుకగలదు. అప్పుడుగూడ వారికేవిధమైన నష్టము గలుగలేదు. కాకినాడలో స్థాపింపబడిన నాటకసమాజమునకీయన మేనేజరుగ నుండిరి. వీరును, వీరి శిష్యులును పగులగొట్టిన బుర్రలు లెక్కలేదని చెప్పుదురు. వీరి శిష్యులలో బ్రాహ్మణులుగూడ పెక్కండ్రు గలరు. వారి పేరుజెప్పిన కాకినాడలో నెల్లవారికి భయము కలిగెడిది. వారు బహిరంగముగ రాచబాటలలో తలలు పగులగొట్టినను, వారికి వ్యతిరేకముగ నొక్కడైనను సాక్ష్యము వచ్చెడివాడుగాడు. తమ నాటకములు నిరాటంకముగ జరుగుటకు హనుమంతరావు నాయుడుగారు కాకినాడ వెళ్ళి యబ్బాయిగారి దర్శనముచేసి, వారిదయ సంపాదించి, పాకవేయించిరి. పాక సిద్ధమైనను నాటకములు 1892 వ సంవత్సరము జనవరిలోగాని ప్రారంభము

గా ప్రేమ. మొట్టమొదట సామాజికులు పారిజాతాపహరణ నాటకము ప్రయోగించిరి. కాకినాడకు నేనుగూడ వెళ్ళితిని. ప్రకాశముగారి యభినయ కౌశలముచేత పారిజాతాపహరణ నాటకము మిక్కిలి రక్తికట్టెను. పట్టణములో సామాజికులకు మంచిపేరు వచ్చెను. ప్రకాశముగా రెక్కడ నాటకము ప్రదర్శించినను వారికి మంచిపేరు వచ్చుచుండెను. రాజమహేంద్రవరములో నాటకము ప్రయోగించినప్పుడు పర్లాకిమిడి నివాసియైన శ్యామసుందర రాజగురువను నొక యోగ్యయువకుడు తత్కాలమున బి. ఏ. తరగతి జదువుచుండెను. ఆయన పలుమారు మా నాటకములకు వచ్చి చూచి మెచ్చి ప్రకాశమునకు "రంగనక్షత్ర" మని (Star of the Stage) బిరుదు నిచ్చెను. రాజగురువుగారు మిక్కిలి తెలివిగలవారు. సజ్జనుడు. విద్య ముగించిన తరువాత నతడు స్వస్థలమునకు వెళ్ళి యచట మునిసిపలుసభ కధ్యక్షుడయ్యెను. విద్యార్థిగనున్నప్పుడే యాత డింగ్లీషులో జక్కగ మాట్లాడుచు వ్యాసములు వ్రాయుచు వచ్చెను. దేశస్థుల దురదృష్టముచేత నితడు వయసు ముదరకముందే మృత్యుదేవత నోటబడెను.

ఇంక మాసమాజమువారు కాకినాడలో నెట్లుమెలగిరో చెప్పవలయు. సింగితపు అబ్బాయిగారికిని, నాయుడుగారికిని, జరిగిన స్నేహము చిరకాలము నడచినదిగాదు. అబ్బాయిగారు మిక్కిలి యమాయకులేగాని, శిష్యులు చెప్పెడి కొండెములవల్ల, నాయన మనస్సు జెడిపోవుచుండెడిది. మాసామాజికులు నాటకములుప్రయోగించినప్పుడు అబ్బాయిగారి శిష్యులు గొందరువచ్చి యుచితముగ టిక్కెట్లనిమ్మని బాధించుచుండెడివారు. అట్లు ప్రతి నాటకమునకు యిచ్చుటకు వీలులేకపోయినది. ఆ శిష్యులలో గొందరు దుండగులు, పాకకడకుబోయి యొకరాత్రి కావలియున్నవానిని బెదరించి, మా సామాజికులలో కోపల్లె శేషగిరిరావను నాతనిని గట్టిగ కర్రతో శిరస్సుపై గొట్టిరి. అతడు పడిపోయెను. నెత్తురు గారజొచ్చెను. వెంటనే యాతనిని బసలోనికి దీసికొనివచ్చి కట్టుగట్టజొచ్చిరి. ఆరాత్రి అబ్బాయిగారును, వారి శిష్యులును మాబసముందు జేసినయల్లరి వర్ణింపనలవిగాదు. తలుపులుమూసుకొని మా సామాజికులు లోపల నుండ, అబ్బాయిగారు పెద్దపెద్ద కేకలు వేయుచుండిరి. శిష్యులు

తలుపులమీద రాళ్లు విసరుచుండిరి. ఆరాత్రి నేను వాసుపల్లి లక్ష్మీ
నారాయణగారి యింట నుంటిని. బసలోనున్న సామాజికులకును,
మాకును, సంబంధము లేకపోయినది. అంతగోడవ జరుగుచున్నను
వినుచు పొరుగుననున్న పెద్దమనుష్యులు, వీధిలో వెళ్ళెడి పెద్దమను
ష్యులుగాని, యిది యేమని వారిని మందలింపలేకపోయిరి. అబ్బాయి
గారి పేరు చెప్పిన జనులకంతభయము. ఆరాత్రి యెట్లెటో తెల్లవా
రెను. మా సామాజికులు తరువాత జాగ్రత్తగనే యుండిరి. అంతట
నుండి అబ్బాయిగారిశిష్యులు నాటకమున కుచితముగ టిక్కెట్లనిమ్మని
యడుగుట మానిరి.

రామానుజయ్య చనిపోయినతరువాత, మాసమాజమునకు,
బందరునుండి, రాజగోపాలమని యొక గాయకుడు, సూత్రధారిగ
వచ్చెను. ఇతనిపాట జనరంజకముగ నుండినందున, సమాజమునకు
రామానుజయ్య లేని వెలితి దీరెను. అంత హనుమంతరావునాయుడు
గారు, పాఠశాలలో నుపాధ్యాయుడగుటచే, రాజమహేంద్రవరము
వెళ్ళిరి. మానాటకములు బాగున్నవని పేరువచ్చుటచే డబ్బు బాగుగ
వచ్చుచుండెను. గతసంవత్సరము మా కమలాపురములో వచ్చిన
నష్టము దీనిలో గూడివచ్చునని మాకు ధైర్యము గలిగెను. అంతట
సంక్రాంతిపండగ వచ్చెను. ఆ పండుగలో నానగరమున రాత్రులు
గొప్ప యుత్సవములు జరుగును. ఆ యుత్సవములను జూడవలెనని
సామాజికులలో గొందరికి కుతూహలముదయించెను. అబ్బాయిగారి
పక్షమువారేమైన హానిజేయుదురేమోయని సందేహముగలిగెను.
పెత్తనమంతయు నామీదవిడచి నాయుడుగారు వెళ్ళినందున, యా
రాత్రి యుత్సవముజూచుటకు వెళ్ళవద్దని, నేను మా సామాజికులతో
జెప్పితిని. పట్టణములో నబ్బాయిగారికి విరోధులైన గొందరు మనుష్యు
లుండిరి. వారు గూడ సమయమువచ్చినప్పుడు బుర్రలుపగులగొట్ట
గలవారే. అప్పుడప్పు డబ్బాయిగారికిని వారికిని యుద్ధములు జరుగు
చుండెడివి. తలలు పగులుచుండెడివి. అబ్బాయిగారి విరోధులలో
నొకడు మాకడకువచ్చి, యుత్సవము జూడదలచినపక్షమున, మేము
మిమ్ము వెంటబెట్టుకొనిపోయి, సురక్షితముగ దీసుకొనివత్తుమని జెప్పిరి.
అయినను వారిసలహానే నంగీకరింపలేదు. కాని మా సామాజికులు

పడుచుదనపు గర్వముచేతను, వారి సహాయముగలదను ధైర్యము
చేతను నుత్సవముచూడవలెనను కుతూహలముచేతను, రాత్రి భోజ
నానంతరమున వెళ్ళదలచిరి. పిళ్ళారిసెట్టి రామకృష్ణమ్మనాయుడుగారు
తాతయ్యనాయుడు, గోపాలకృష్ణరావు, టంగుటూరి ప్రకాశము నను
వారు నలుగురును, అబ్బాయిగారి విరోధులతోఁగలసి యుత్సవము
లోనికి వెళ్ళిరి. తమకు వ్యతిరేకముగనున్న వారు గట్టిగ నభయమిచ్చి
మా వాండ్రనుత్సవమునకు దీసికొనిపోవుచున్న సంగతి యబ్బాయి
గారికి దెలిసెను. రాత్రి రమారమి పదిగంటల కబ్బాయిగారు వారి
శిష్యులును, దుడ్డుకర్రలను బుచ్చుకొని, తమకు వ్యతిరేకముగనున్న
ప్రతివిరోధులను, నాటకసామాజికులనుగూడ శిక్షింపవలచి, బయ
లుదేరిరి. మా సామాజికులు దేవాలయమువద్ద నున్న మా బస
నుండి మసీదువద్దకు వెళ్లినప్పటికే, యబ్బాయిగారి మూక వారి
వెనుకవచ్చి వారిం దాకిరి. గోపాలకృష్ణారావునకు నెంటనే బుర్ర
పగిలిపోయెను. ఇల్లు వెడలిన యరగంటలోనే, యతడు రక్తధారతో
నింటికి మరలివచ్చెను. నాగుండె జెదరిపోయెను. ప్రకాశము, రామ
కృష్ణమ్మ, తాతయ్యనాయుడు, నేమైరో తెలియ లేదు. నేను పోలీసు
వారికి వర్తమానము జేసితిని. ఒకరిద్దరు పోలీసు జవానులు వచ్చిరి.
అందులో నొకడు యూరపియను సార్జెంటు. ఆయన నావలన వాఙ్మూ
లముతీసికొని వెళ్ళిరి. మా తక్కిన సామాజికులను కొట్టిచంపిరో,
యేమైరోయని, నాకు బెంగగలిగెను. ఇంటనున్న సామాజికులు
ఖిన్నులై యుండిరి. రాత్రియంతయు మాకు నిద్రలేదు. ఆ రాత్రి
నేనును, నాచుట్టునున్నవారును, పడిన చిత్తక్షోభమింతయని చెప్ప
వీలులేదు. నాలుగు గంటలైన తరువాత, ప్రకాశము, తాతయ్య
నాయుడు, రామకృష్ణమ్మవచ్చి వారివారి కథలు చెప్పిరి. తాతయ్య
నాయుడు తలకొక కుచ్చు పాగజుట్టుకొని, యబ్బాయిగారి గుంపులో
గలసిపోయెనట. అతడు తమవాడేయనుకొని వారాతనిజోలికిపో లేదట.
రామకృష్ణమ్మ యెట్లైటో దెబ్బలుతినకుండ నిల్లుజేరెను. ప్రకాశమును
దుండగీడైన యనమండ్రి కొండయ్యయను నతడు తరుముకొని
వెళ్లెను. ప్రకాశమొక మార్వాడీకొట్టులో దూరబోయెనట. అర్ధ
రాత్రివేళ వీడెవడో దొంగవాడు, కొట్టులో దూరుచున్నాడనుకొని,

కొట్టుటలోనికి రానీయక పోవుటకు మా ర్వాకీ ప్రయత్నము జేసెనట. ప్రకాశ మతి సాహసుడగుటచే, తలుపు గెంటుకొని లోపలికిపోయి తలుపుబిగించి కిటికీదగ్గర నిలిచియుండెనట. కొండయ్య పొడుగుపాటి కర్రదీసికొని, కిటికీలోనుండి పొడిచెనట. అందుచేత ప్రకాశమునకు కొండయ్య మొగము పరిచితమయ్యెను. ఈ ఘోరకృత్యమైన తరువాత గూడ మేము నాటకములు వేసితిమి. ప్రొద్దుపోయి నాటకశాలకు పోయినపక్షమున శతృభయముండునని పిసాలుపెట్టగనే భోజనములు పెట్టించి నాటకమున్ననాడు సామాజికులను నాటకశాలకు నేను పంపు చుంటిని. వారిని సాయంకాలము మీరాకుకు వెళ్ళనీయకుంటిని. మును పటివలె నాటకములకు మాకు సొమ్ము వచ్చుట మానెను. అబ్బాయి గారిజట్టు నాటకసామాజికులను కొట్టవచ్చునియు, నాసమయమున ప్రేక్షకులకుగూడ దెబ్బలు తగులవచ్చుననియు, నూరిలో నొకచెప్ప వాడుకపడెను. అందుచేత జనులు విశేషముగ నాటకముజూచుటకు మునుపటివలె వచ్చుటమానిరి. డానిచే రాబడితగ్గెను. రాబడి మందగించగానే, యుత్సాహము మందగించెను. ఎట్టెటో కొన్ని నాటకములు 1892 వ సంవత్సరము ఫిబ్రవరి మొదటివారమువరకు ప్రయోగించి, మరల రాజమహేంద్రవరము ప్రయాణముగట్టితిమి.

ఫిబ్రవరి 15 వ తారీకున మేము రాజమహేంద్రవరము జేరి తిమి. నాకప్పు డుద్యోగములేదు గనుక, నేను తీరికగలిగి కాకినాడలో నుండగలిగితిని. నాయుడుగా రుద్యోగములో నుండుటచే, నారక్కడ నుండక నడుమనడుమ నాటకములకు కాకినాడ వచ్చుచుండిరి. నాటక సమాజమునకు మేనేజరుగానైన త్రియంబకరావు నాయుడు గారు గత సంవత్సరమం దమలాపురముగాని, యీ యేడు కాకినాడ గాని, రాలేదు. ఈవిధముగ నెన్నో చిక్కులు పడినను, కాకినాడలో మొత్తముమీద సమాజమునకు నష్టము రాలేదు.

కాకినాడలోజరిగిన యీయల్లరియొక్క ప్రతిఫలము రాజ మహేంద్రవరములో కనబడెను. ప్రకాశమునకు కాకినాడలో జరిగిన చిక్కులు త్వరగ మరపురాలేదు. సమయము వచ్చినప్పుడు కాకి నాడవారిమీద పగదీర్చుకొనవలెనని యతని మనసులో నుండెను. మానాటకసమాజమువారు తీరికయున్నపుడు కంభమువారి వీధి

నొక యరుగుమీఁద కలసికొని మాటలాడుకొనుచుండెడివారు. 1892 సంవత్సరము జూను నెలలో నొకనాఁడు మేమందరము నా యరుగుమీఁద గూరుచుండి మాటలాడుచుంటిమి. కాకినాడనుండి కొండయ్య యేదో పనిమీఁద రాజమహేంద్రవరమువచ్చి పెద్దబజారువీధికి వెళ్ళుచుండెను. అరుగుమీఁదనున్న ప్రకాశమున కతఁడు కనబడెను. వెంటనే ప్రకాశము "కొండయ్య వచ్చినాఁడు, కొండయ్య వచ్చినాఁడ"ని కేకవేసి కఱ్ఱదీసికొని బయలుదేరెను. అరుగుమీఁదనున్న మిత్రులు కొందరు ప్రకాశము వెంటవెళ్ళిరి. కొండయ్య, వీరు వెళ్ళునప్పటి కిన్నీసుపేట వెళ్ళి వీరిని జూచి యొక యింటిలో దాఁగుకొనెను. అతని చేష్టలు గనిపెట్టుట కొకకుఱ్ఱవాని నచట ప్రకాశము నియమించెను. ప్రకాశము వెంట మాదిరెడ్డి చలపతిరావుండెను. మా యార్యను పాఠశాలలో చలపతిరావు గొంతకాలము జదువుకొనెను. చదువుకొనునప్పు డుపాధ్యాయుల యెడ దుర్వినయ మెన్నఁడు జూపలేదు. తోడిబాలురతో వివాదములునులేవు, మిక్కిలి యణకువ గలిగి యుండెడివాఁడు.

ఆనాఁడుసాయంకాల మారుగంటలకు కాకినాడ నివాసియైన బోడా రాజుగారను, వైశ్యశిఖామణియు, నాతని గుమాస్తాయైన యనమండ్ర కొండయ్యయు, కాకినాడ బోవుటకై యొక యొంటెద్దు బండి నెక్కి ధవళేశ్వరము వెళ్లుచుండిరి. అప్పుడు రైలుదారి లేదు. గనుక కాకినాడ వెళ్లువారు ధవళేశ్వరము బోయి, యక్కడ పడవ నెక్కవలెను. అట్లు వారు వెళ్ళుదురను సంగతి ప్రకాశమునకు తనచే నియమింపబడిన బాలుఁడు చెప్పెను. వెంటనే యతఁడు చలపతిరావును వెంటబెట్టుకొని యిన్నీసుపేట బోయెనె. వీరు వెళ్ళునప్పటికి వారిబండి కాలేజివద్ద కరిగెను. ప్రకాశము, చలపతిరావు బండి యొద్దకుబోయిరి. చలపతిరావు బండికడ్డముగ నిలచి, బండియెద్దును విప్పి, బండివానిని దింపి, బండి వెనుకప్రక్కకు నెత్తివేసెను. ముందుగ రాజుగారిపెట్టెయు, పెట్టెమీఁద రాజుగారును, రాజుగారిమీఁద కొండయ్యయు, బడిరట. ప్రకాశమేమిసాహసము జేయునోయని వానిని వారించుటకు యొకవైపునుండి హనుమంతురావునాయుఁడు గారును, మరియొకవైపునుండి నేనును వెళ్లితిమి. అప్పటికి చీకటి

బడినందున నావెంట న్యాపతి బిందుమాధవరావను నామిత్రుని దీసి కొనిపోతిని. మేము పోతగట్టుమీదుగ కాలేజి వెనుకకు బోవునప్పటికి "చచ్చిపోయినానుబాబో!" యని కొండయ్య కేకలు వినబడెను క్రిందబడిన కొండయ్యజుట్టుబట్టుకొని చలపతిరావో, ప్రకాశమో, కర్రతో బుర్ర పగులగొట్టిరి. నెత్తురు గారుచుండెను. ఆనాడు శని వారము. ఇన్నీసుపేటలో సంత. చుట్టుప్రక్కల గ్రామములనుండి సంతకువచ్చిన జనులు వేలకొలది మరల వారివారి గ్రామములకు బోవుచుండిరి. కాకినాడ యేదోపనిమీదవచ్చిన కొరళ్ళ సుబ్బారాయుడుగారును, నరసాపురమునుండి వచ్చిన యాత్మూరి రామయ్యగారను వైశ్యశిఖామణియు, కాకినాడ వెళ్ళుచుండిరి. రాజమహేంద్రవర నివాసియైన దుగ్గిరాల కాశీవిశ్వనాథముగారను వైశ్యశిఖామణి యాలకట్టుతోటలో నున్న తన యాముదాలఫాక్టరీనుండి వచ్చుచు, గుర్రపుబండి దిగి యీగొడవజూచుట కాగెను. ఈ గొడవ యొక్క క్షణములో జరిగిపోయెను. ప్రకాశము బోడారాజుగారిజోలికి బోలేదు.

వేలకొలది జనులున్నను, ప్రకాశముగారి నెవ్వరు నాప సాహసింపరైరి. వెంటనే ప్రకాశము, చలపతిరావు కాలేజికడనున్న తీగలు దాటి, కాలేజి యావరణమునబడి, తరువాత రెండవప్రక్కనున్న తీగలుదాటి, గోదావరికి బోయి, కాలుచేతులు గడుగుకొని, యింటికి బోయిరి. నా ప్రయత్నమేమియు సాగుటకు వీలులేకపోవుటచే, నేను నామిత్రుని వెంటబెట్టుకొని జరిగినపనికి విచారించుచు రాయవరపు వారియింటికి వచ్చితిని. కొండయ్య మృతినొందినాడని గ్రామములో వాడుకలుపడెను. మా నాటకసామాజిక శత్రువులు గోరంతలు కొండంతలుజేసి చెప్పుకొన నారంభించిరి. హనుమంతరావునాయుడుగారా వార్తవిని, పుత్రప్రాయుడైన ప్రకాశమున కేమికీడు మూడునో యని భీతిల్లి, బెంగగొని పరుగుపరుగున మాయింటికివచ్చి "కొండయ్య చనిపోయినాడట, ప్రకాశమున కేమి ప్రమాదమువచ్చునో!" యని పలికి, కన్నుల నీరుపెట్టుకొనిరి. ప్రకాశమునకు విరోధులైన కొందరు రాజమహేంద్రవర వాసులు గొండయ్య మొగమెన్న డెరుగకపోయినను, వానియెడల నత్యంతాభిమానము గలిగి యాసుపత్రిలో జేర్చిరి. డాక్టరులు వానికి మరణభయము లేదని జెప్పి, చికిత్స జేయనారంభిం

చిరి. పదియేను దినములనాటికి కొండయ్యగాయము మానగా నారో గ్యవంతుడై, కొందరి సలహామీద మేజస్ట్రేటుకచేరీలో, నున్నవారిని లేనివారిని గలపి చార్జియిచ్చెను. ఎనమండుగురిని ముద్దాయిలుగ చేర్చెను. 1. ప్రకాశము, 2. చలపతిరావు, 3. హనుమంతరావు నాయుడుగారు, 4. తాతయ్యనాయుడు, 5. ఉదయ నారాయణరావు నాయుడు, 6. వాలి వేంకటరత్నము, 7. దుగ్గి గోపాలకృష్ణారావు, 8. న్యాపతి బిందుమాధవరావు. ఇందులో మొదటి యిద్దరుతప్ప తక్కినవారెవ్వరు నాటిగొడవలో జోక్యము గలుగజేసుకొన్నవారు కారు. వాలి వెంకటరత్నము మా సామాజికుడైనగాడు. అతడు రాజమహేంద్రవరము పోలీసుస్టేషనులో కానిస్టేబులు. ఆతడు నాటక సామాజికులలో గొందరికి మిత్రుడు. కొండయ్య తన ఛార్జీ దాఖలు చేయుటకు, నడుపుటకు, వాస్టుదొరగారిని డెబ్బదిరూపాయలిచ్చి న్యాయవాదిగ బెట్టుకొనెను. వాస్టుదొరగారాంగ్లేయుడు. రాజమహేంద్రవరములో ప్లీడరుగ నుండెడివాడు. అప్పుడు తహసీలుదారుగారికి మేజస్ట్రేటుయొక్క యధికారముండెను. కాని యాయన గ్రామాంతరము వెళ్ళుటచే కొండయ్య తన ఛార్జీని సిరస్తాదారు మేజస్ట్రేటయిన తాడూరి లక్ష్మీనరసింహారావుగారివద్ద దాఖలుచేసెను. మా నాటక సమాజములో దుండగులు, పోగరుబోతులు నున్నారని కొందరి కభిప్రాయముండెను. ఆ వాడుక నిజమని నమ్మి సిరస్తదారుగారికి ముద్దాయిలకు శిక్షవేయవలెనని యుండెనని వాడుక పుట్టెను. కొండయ్య తనకు సాక్షులుగ నాత్మూరి రామయ్యగారిని, కొరళ్ళ సుబ్బారాయుడుగారిని, దుగ్గిరాల కాశీవిశ్వనాథముగారిని, కాకినాడ వాసులైన మరియిద్దరు విశ్వబ్రాహ్మణులను వేసెను. ఆత్మూరి రామయ్యగారు వైశ్యశిఖామణులు, లక్షాధిపతులు, నరసాపురవాసులు కొరళ్ళ సుబ్బారాయుడుగారు వైశ్యులే; ఆయన చిరకాలము డెప్యూటికలెక్టరుపని జేసి యంతకుముందే పనిచాలించుకొన్నవారు. దుగ్గిరాల కాశీవిశ్వనాథముగారు రాజమహేంద్రవరవాసులైన గొప్ప గృహస్థులు, వర్తకులు.

ఒకనాడా యభియోగము విచారణకు వచ్చెను. విచారణము ప్రారంభము గాకమునుపు, కొందరు పెద్దమనుష్యులు కొండయ్య

కును ముద్దాయిలకును రాజీనామా మాట్లాడిరి. షరతు లేమనగ,
కాకినాడనుండి యుబ్బాయిగారి శిష్యులెవరు రాజమహేంద్రవరము
వచ్చినను రాజమహేంద్రవర హిందూనాటక సమాజమువారు వారి
జోలికి పోగూడదు – రాజమహేంద్రవరపు వారెవరు కాకినాడ వెళ్ళి
నను వారు వీరిజోలికి రాగూడదు. ఈషరతులు కొండయ్య కిష్టము
లేకపోయెను. కాని ముద్దాయిపక్షమువారు వచ్చుటచేరి కొంతసాక్ష్యము
దిగవేసిరి. మేజస్ట్రేటుగారు విచారణకు నారంభించిరి. ఆదినమున శ్రీ
కొరళ్ళ సుబ్బారాయుడుగారు రాలేదు. ఆత్మూరి రామయ్యగారు
రాలేదు. కాకినాడనుండి సమనులు పుచ్చుకొని విశ్వబ్రాహ్మణులు
యిరువురు వచ్చిరి. ఈ పట్టణమువారే యగుటచే శ్రీ కాశీ విశ్వనా
థముగారు వచ్చిరి. ముందుగ మేజస్ట్రేటుగారు కొండయ్య వాఙ్మూ
లము పుచ్చుకొనిరి. అతడు తన ఫిర్యాదు స్థిరపరచుకొనుటకు తన్ను
కొట్టినవారిని, కొట్టనివారినిగూడ కలిపి చెప్పెను. కాశీ విశ్వనాథము
గారిని బోనెక్కింపగ, నాడున చెప్పినమాటల సారాంశమిది: "నేను
నా యాముదాల ఫ్యాక్టరీనుండి వచ్చుచుంటిని. నాటకశాలవద్ద గొడవ
జరుగుచుండెను. చాల జనులుండిరి. ఎవరో యెవరినో కొట్టుచుం
డిరి." "ప్రకాశముగారు, చలపతిరావుగారు కొట్టిరా?" యని యడు
గగ, "చీకటిపడినది నేను పెద్దవాడను. కన్నులు గనబడలేదు. ఎవరు
కొట్టినారో చెప్పలేను." అని చెప్పెను. కాకినాడనుండి వచ్చిన విశ్వ
బ్రాహ్మణులుగూడ, "చీకటిపడినది గనుక కొట్టినవారెవరో గుర్తుపట్ట
లేను." అని చెప్పిరి. అంతట కొండయ్య సాక్ష్యము పోవుచున్నదని
భయపడి నా ఫిర్యాదును వదలుకొనుచున్నానని మేజస్ట్రేటువద్ద
శెలవుపొంది తాను దాఖలుచేసిన యభియోగమును వదలుకొనెను.
అంతట మేజస్ట్రేటుగారు ముద్దాయిలను విడుదలజేసిరి. ప్రకాశముగారి
నాటకకళాకౌశలము, పట్టుదల, బుద్ధివిశేషము, సాహసము మొద
లైన లక్షణములు వెనుకనే వివరింపబడినవి.

ఇటీవల మంత్రిగ నున్నప్పుడుగూడ వారి పట్టుదల యసాధా
రణముగ నుండెను. పువ్వుపుట్టగనే వాసన తెలియునన్నమాట నిజ
ముగదా! 1891 వ సంవత్సరము డిశంబరులో జరిగిన ప్రథమశాస్త్ర
పరీక్షలో మన ప్రకాశముగారు కృతార్థులైరి. ఈ క్రిందివారు వారి

సహాధ్యాయులు. ఈ నడుమ గవర్నరుపనిజేసిన, సర్ కూర్మా వెంక టరెడ్డినాయుడుగారు, చెన్నపురి హైకోర్టులో గొప్ప న్యాయవాదిగ పనిజేసి మంచిపేరు గణించి కీర్తిశేషులైన పేరి నారాయణమూర్తి గారు, కొంతకాలము జిల్లాకలెక్టరు జేసిన బజరుల్లా సాహేబుగారు, చాలకాలము డెప్యూటి కలెక్టరుగ పనిజేసి ప్రస్తుతము పించను పుచ్చుకొనుచున్న వింజమూరి వెంకన్నపంతులుగారు యింక ననే కులు గలరు. ప్రకాశముగారు బి. యె. తరగతిలో జేరలేదు.

మెట్రికు్యలేషను పరీక్షయందు కృతార్థుడనై నదిమొదలుకొని ప్రథమశాస్త్రపరీక్షకు ప్రయివేటుగ జదువవలెనని నాకు సంకల్పము గలిగినది. ప్రవేశపరీక్షయందు కృతార్థుడనైన నాలుగేళ్ళకు, విద్యార్థి ప్రథమ శాస్త్రపరీక్షకు ప్రయివేటుగ రావచ్చునని యప్పటి నిబంధ నలలోనుండెను. అందుచేత నేను 1891 వ సంవత్సరమున ప్రథమ శాస్త్రపరీక్షకు జదువవలెనని ప్రకాశముగారితో గలసి కొన్ని పాఠ ములు జదివితిని. కాని ఆసంవత్సరమున సెప్టెంబరునెలలో నన్ను పరీక్షకు రానిమ్మని నేను దరఖాస్తుపెట్టగా, చెన్నపురి విశ్వవిద్యా లయాధికారులు "నీ వీసంవత్సరము రాగూడదు. కావలసిన పక్షమున ముందు సంవత్సరము రావచ్చు" నని నాకు లేఖపంపిరి. అప్పటికి నేనూరకుండి, మరుసటిసంవత్సరము వెళ్ళవచ్చునని యువ్విళ్ళూరు చుంటిని.

1892 వ సంవత్సరప్రారంభమున నా "నలచరిత్ర" నాటకమున నైదవయంకము వ్రాసి పూర్తిజేసితిని. అంతకుముందు నాలుగంక ములుమాత్రమే వ్రాసితిని. ఆసంవత్సరము రెండవభాగమున, "నల" నాటకము టౌనుహాలులో ప్రయోగింపబడెను. దుర్గి గోపాలకృష్ణా రావుగారు నలపాత్రము, ప్రకాశము దమయంతి పాత్రము ధరించిరి. ఆసంవత్సరము ప్రకాశము మొదటితరగతి (Ist Grade) న్యాయవాది పరీక్షకు దరఖాస్తు చేసెను. కాని వయసు తక్కువగనున్నదని దర ఖాస్తు నిరాకరింపబడెను. నేనుద్యోగములేకయే 1892 వ సంవత్స రము జూనువరకు నుంటిని. ఆసంవత్సర మిన్నీసుపేట మిడిలుస్కూ లుకు ప్రధానోపాధ్యాయులైన శ్రీ సత్యవోలు లక్ష్మీపతిగారు పని మానుకొనిరి. ఆపని శ్రీ హనుమంతరావునాయుడుగారి కీయబడెను.

అంపుచేత, నిన్నీసుపేట మిడిలుస్కూలులో నొక పని ఖాళీవ
య్యెను. పాఠశాలా పరిపాలకసంఘమునకప్పుడు కాలేజీలో నుపా
ధ్యాయులైన శ్రీ స్కాటుదొరగారు కార్యదర్శిగనుండిరి. హనుమంత
రావునాయుడుగారి ప్రేరణముచేత నేనాపనికి దరఖాస్తుపెట్టి స్కాటు
దొరగారిని దర్శించితిని. ఆయన కూరగాయలబేరమువలె బేరమాడి,
నెలకు పండ్రెండురూపాయలు జీతమేర్పరచి, నన్నాపాఠశాలలో
మూడవయుపాధ్యాయుడుగ నియమించిరి. మరేదియు గతిలేదుగనుక
మిక్కిలి తక్కువజీతమైనను నేను దానికొడంబడి పనిచేయసాగితిని.
ప్రధానోపాధ్యాయులైన నాయుడుగారు నాకు మిత్రులేగనుక నాకు
దినములు సుఖముగనే వెళ్ళినవి. కాని నాకు ప్రథమ శాస్త్రపరీక్షకు
జదువవలెనన్నపిచ్చి పోలేదు. తలలో నాకేదైన తలంపుపుట్టినపక్ష
మున నది నెరవేరినదాక పోదు. నాసామర్థ్యమేమో నేనెరుగక,
నేనాపరీక్షకు జదువనారంభించితిని. గణితభాగములో ట్రిగ్నామెటరీ
గాని, యాల్జిబ్రాగాని నాకురాదు. రేఖాగణితములో గొంతజదివితి
నని మొండిధైర్యముతో దరఖాస్తుచేసితిని. ఇంగ్లీషు, తెలుగు, గ్రీకు
దేశచరిత్రము, రోముచరిత్రము, నింగ్లాండు దేశచరిత్రము, శరీర
శాస్త్రము, తర్కము, (Logic) గణితశాస్త్రమునప్పుడు చదువవల
సిన పాఠములు. గణితశాస్త్రములోదప్ప తక్కినవాటిలో కొంతప్రజ్ఞ
సంపాదించితిని. కాని నాపరీక్ష బ్రహ్మాండముగ భగ్నమయిపోయెను.
ఆసంవత్సరము శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారు తెలుగులో
పరీక్షాధికారులైరి. తెలుగులో నాకు చాల మార్కులు వచ్చెనని
తరువాత వారు నాతో చెప్పిరి. ప్రయోజనమేమి ? దరఖాస్తుపెట్టిన
సొమ్ముదండుగ. నాశ్రమవ్యర్థము. కాని మరల జదువవలెనని కోరిక
మాత్రము నాకు గలుగలేదు. అది నాకు తగదని నేనప్పుడు తెలిసి
కొంటిని.

1891 సంవత్సరమున నేనొకసారి నా మిత్రులైన నెప్పలి శేష
గిరిరావుగారి కోరికమీద ధవళేశ్వరములో నతనిబసలో నష్టావ
ధానముజేసితిని. ఆసభకు ధవళేశ్వర పురప్రముఖులలో ననేకులు
వచ్చిరి. ఆకాలమున ధవళేశ్వరములో నొక సంస్కృతపాఠశాలబెట్టి
విద్యార్థులకు నన్నదానము, విద్యాదానముగూడ జేయుచున్న

శ్రీచర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారివద్ద విద్యార్థులైయుండిన తిరుపతి వేంకటేశ్వర కవులుగూడ నాసభకువచ్చిరి. గంటలు లెక్కపెట్టుట, పుష్పగణనము, మొదలైనవిగూడ జరిగెను. అష్టావధానము జయప్రదముగ జరిగినదని చెప్పవచ్చును. ఆసంవత్సరమే రాజమహేంద్రవరము కాలేజీలో నా మిత్రులైన కొందరు విద్యార్థుల ప్రేరణముచేత నొక యష్టావధానము జేసితిని. ఎనమండుగురికి గవిత్వముమాత్రమే చెప్పితిని. తక్కినపనులు జరుగలేదు. నా మిత్రుడైన వక్కలంక కామేశ్వరరావుగారి మేడమీద మరియొకమా రష్టావధానము జేసితిని. ఇది యైనతరువాత నేనట్లు చేయుచున్నానని విని, నామిత్రులైన యాచంట సుందరరామయ్యగారు నన్ను బిలిచి, యష్టావధానము జేయుటవలన మెదడు పాడవుననియు, దానివలన దేహారోగ్యముగూడ చెడుననియు, సంతకంటె గ్రంథరచనము మేలనియు చెప్పి యష్టావధానములు విరమింపుమని సలహానిచ్చిరి. ఆసలహా నామనస్సునకు నచ్చుటచేత నాటనుండి యష్టావధాన ప్రయత్నము మానుకొంటిని.

నా శిష్యుడైన రాయసము రామమూర్తియొక్క మామగారు పారుపల్లి లక్ష్మీనారాయణగారు తన రెండవయల్లుడైన నిమిషకవి భాస్కరరావు మరణముచేత దుఃఖసాగర నిమగ్నులైరి. కాబట్టి యాయనకు నేను యిరువదియైదు పద్యములుగల యొక పరామర్శ లేఖ వ్రాసి పంపితిని. ఆ పద్యములిప్పుడు దొరకవు.

నాటకసమాజము రాజమహేంద్రవరమునుండి యమలాపురము వెళ్ళువరకు, నేనును, ప్రకాశముగారును "ఏమండి?" యనుకొనుచుంటిమి. ప్రకాశముగారి రూప, బుద్ధి విశేషము మొదలయినవి నాకు మిక్కిలి సంతోషప్రదములుగ నుండినందున నాతనియెడల నాకు మిక్కిలి యిష్టము గుదిరెను. ఆయన మెట్రిక్యులేషను పరీక్షలో కృతార్థుడైన దినమున నేను రెండు రూపాయిలు ఖర్చుపెట్టి చీనా మిఠాయి దెప్పించి, మిత్రులకు పంచిపెట్టించితిని. మేమిరువురము నమలాపురము వెళ్ళినతరువాత స్నేహమధికమగుటచే "ఏమండి?" యని పిలుచుకొనుటమాని, "ఏమిరా?" యని పిలుచుకొనుట ప్రారంభించితిమి. ఒకనాడు హనుమంతరావు నాయుడుగారు, ప్రకాశము

గారు తక్కిన సామాజికులందరు కలసి జనార్దనస్వామి తిరునాళ్ళకు నడచి, ధవళేశ్వరము వెళ్ళితిమి. ఆనాడు ప్రకాశముమీద నేనొక పద్యము జెప్పితిని. ఆనాటి నా కవిత్వ మెట్లుండెనో చదువరులు గ్రహించుటకై యాపద్యము నిందుదహరించుచున్నాను.

సీ॥ ఈగవ్రాలినగాని వేగజారెడునట్లు
మస్వంపు కురులను దువ్వినాడు
వరలలాటమునందు తిరుచూర్ణ రేఖను
ముద్దుగా రెండుభంగి దిద్దినాడు
అరుణపల్లవమట్లు కరమురంజిల్లు చెం
గావి వస్త్రంబును గట్టినాడు
చార లంగీరఖాను జక్కగా ధరియించి
వలెవాటు కండువ వైచినాడు
గీ॥ చెవులసందున గిరిజాలు చిందులాడ
మొగముమీదను జిరునవ్వు మొలకలెత్త
టంగుటూరి ప్రకాశము రంగుమెరయ
ధవళగిరి తీర్థమునకును దరలివచ్చె.

ప్రకాశమునకును, నాకును మైత్రి క్రమక్రమముగ హెచ్చెను. ఇప్పటికిని మేము మిత్రులమే. అతడు చెన్నపురిలోనున్నను, నేను రాజమహేంద్రవరములోనున్నను మాహృదయములు సమీపముననే యున్నవి. ఆయన మంత్రిగానుండి రాజమహేంద్రవరము వచ్చినప్పుడు నన్ను జూచుట కాయన మాబసకు వచ్చిరి. అప్పుడు వారిని గౌరవించుటకు జరిగిన మహాసభకు పౌరులు నన్నధ్యక్షునిగ నేర్పరచిరి.

పూర్వము 1890వ సంవత్సరప్రాంతమున మానాటక సమాజ సభ్యులందరము జేరి యొకనాడు సాయంకాలము ముచ్చటలాడుచుంటిమి. అప్పుడు హనుమంతరావునాయుడుగారు పకోడీలు తెప్పించి మాకందరకు పంచిపెట్టిరి. అవి తినుచుండగ ప్రకాశమో, మరి యెవ్వరో నన్నుజూచి "మీరు పకోడీలమీద పద్యములు చెప్పండి. పద్యమున కొక పకోడి బహుమాన మిచ్చెదము" అనిబలికిరి. ఆమాటలువిని నేను "కవులకక్షర లక్షలిచ్చెడి కాలము గతించినది!

పద్యమునకు పకోడీ నిచ్చెదు దుర్దినములు వచ్చిన”వని ప్రత్యుత్తర మిచ్చి, వెంటనే యాశు కవిత్వముగ గొన్ని పద్యములు జెప్పితిని. జ్ఞాపకమున్నంతవరకు వాని నిచట వ్రాసెదను.

క॥ వనితల పలుకులయందున
నిమిషలోకమున నున్న దమృత మటంచున్
జనులనుటెగాని లేదట
కనుగొన నీయందమృతము గలదు పకోడీ! 1

క॥ ఆ కమ్మదనము నాకుచి
యా కరకర యా ఘుమఘుమ యా పొంకములా
రాకలు పోకలు వడువులు
నీకే దగు నెందు లేవు నిజముపకోడీ! 2

క॥ నీకరకర నాదంబులు
మాకర్ణామృతములు నీదు మహితాకృతియే
మాకనుల చందమామగ
నే కొనియాడెదను సుమ్ము నిన్ను పకోడీ! 3

క॥ ఎందుకు పరమాన్నంబులు
ఎందుకు పలుపిండివంట లెల్లను హా! నీ
ముందర దిగదుడుపున కని
యందును సందియము గలుగదరయు పకోడీ! 4

క॥ ఆరామానుజు డా గతి
పోరున మూర్ఛిల్ల దెచ్చెమును సంజీవిన్
మారుతి యెరుగడు గాక యు
య్యారె నిను గొనిన బ్రతుకడటనె పకోడీ! 5

క॥ పురహరుడు నిన్ను దిను నెడ
గరుగదె యొక వన్నె నలుపు గళమున మరిచం
దురుడున్ దినిన కళంకము
గరుగక యిన్నాళ్ళు నుండగలదె పకోడీ!

క॥ కోడిని దినుటకు సెలవున్
వేడిరి మున్ను బ్రాహ్మణులు వేధ నతండున్

కోడి వలదా బదులు ప
కోడిం దిను మనుచు జెప్పె కూర్మి పకోడీ! 7

మరియుం నొన్ని గలవు గాని, యవిజ్ఞాపకములేవు. ఈవిధ ముగ సామిజికులు నాచుట్టుజేరి వినోదించుచుండెడివారు.

1893 సంవత్సర ప్రారంభమున మా గురుపాదులగు వీరేశ లింగముగారికి దొరతనమువారు, వారు చేసిన ఘనకార్యములకు వారికి రావుబహదూర్ బిరుదము నిచ్చిరి. శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారు మున్నగు ప్రముఖులు దొరతనమువారిచే బిరుదు హొంది నందులకు వీరేశలింగముగారిని జనవరి నెలలోనే సన్మానింపదలచి, మహాసభ టౌనుహాలులో జేసిరి. ఆ సభలో ననేకులు వీరేశలింగము గారిని గురించి ప్రశంసించుచు నాంగ్లేయ భాషలోను, తెలుగు భాష లోను నుపన్యసించిరి. వీరేశలింగముగారియెడ నాకు మొదటినుండియు మిక్కిలి భక్తిగలదు. అందుచేత నే నా సమయమున "నవరత్నము" లని పేరుబెట్టి తొమ్మిది పద్యములు రచించి సభలో జదివితిని. సభా సదులు మిక్కిలి సంతసించిరి. ఆ పద్యములు "చింతామణి"పత్రికలో ప్రకటింపబడినవి. కాని నా దగ్గరలేవు. 1893 వ సంవత్సరముననే వీరేశలింగము పంతులుగారికిని, యేలూరి లక్ష్మీనరసింహముగారికిని జరుగుచుండిన యభియోగములు తుదముట్టినవి. ఏలూరు లక్ష్మీనర సింహముగారు "వివేకవర్ధని" పత్రికలో వీరేశలింగముగారు దను మీాద నేదో నిందాస్పదముగ వ్రాసిరని జాయింటు మేజస్ట్రీటువద్ద నొక ఛార్జి యిచ్చి, తమకు పరువునష్టము జరిగినదని మూడువేల రూపాయలు పరిహారముగ యిప్పింపుమని జిల్లాకోర్టులో లక్ష్మీనరసిం హముగారు వ్యాజ్యము గూడ వేసిరి. జాయింటు మేజస్ట్రీటుగారు విచారణచేసి, యీ రెండు క్రిమినలు ఛార్జీలు కొట్టివేసిరి. వాటివిచా రణ కాలమున నే నుత్సాహ పూరితుడనై మేజస్ట్రీటుగారి కచేరికి వెళ్లుచుండెడివాడను. అప్పటి జిల్లాజడ్జిగారైన రాసుదొరగారు విచా రణజేసి పరువునష్టముక్రింద యేలూరి లక్ష్మీనరసింహముగారికి నొక యణా నిప్పించిరి. ఈ తీర్పు 1893 వ సంవత్సరములో జరిగెను. ఆ తీర్పు జరిగిననాడు నేను జిల్లాకోర్టుకు వెళ్ళి స్వయముగ తీర్పుమాట కనుగొని వచ్చితిని. ఏలూరి లక్ష్మీనరసింహముగారి పక్షమున మహా

రాజశ్రీ నిడమర్తి జలదుర్గప్రసాదరాయుడుగారు వాదించిరి. వీరేశ లింగముగారి పక్షమున మహారాజశ్రీ న్యాపతి సుబ్బారావు పంతులు గారు గట్టిగపట్టుబట్టి పనిజేసిరి. రాజమహేంద్రవరములో నున్న వారే గాక, జిల్లాలోనున్న పెద్దమనుష్యులనేకులు వచ్చి యీ పక్షముననో, ఆ పక్షముననో, సాక్ష్యములిచ్చిరి.

ఆ దినములలో మా పట్టణమున రెండుపక్షము లేర్పడినవి. వీరేశలింగముగారి పక్షము కొందరు, లక్ష్మీనరసింహముగారిపక్షము కొందరు. మా నాటకసమాజములోనున్న యనేకులు లక్ష్మీనరసింహముగారి పక్షమే. నేనే వీరేశలింగపక్షమున నుండెడివాడను. కాని మాలోమాకు వివాదములులేవు. హనుమంతరావునాయుడుగారు వీరేశలింగముగారికి వ్యతిరేకముగ లక్ష్మీనరసింహముగారి పక్షమున సాక్ష్యమిచ్చిరి. నేను మనసులో నిరంతరము వీరేశలింగముగారికే విజయమును కోరుచుంటిని. కాని నాకు లక్ష్మీనరసింహముగారితోను పరిచయముగలదు. అప్పుడప్పుడు నేను వారి యింటికిగూడ హనుమంతరావునాయుడుగారితో కలసి పోవుచుండెడివాడను. లక్ష్మీనరసింహముగారియందును గొన్ని ప్రశంసనీయమైన గుణములుండెడివి. ఆయన యాపద్బాంధవుడనియు, సర్వజనమిత్రుడనియు, సులభుడనియు చెప్పుకొనుచుండెడివారు.

ఆ సంవత్సరమున చెన్నపుర శాసన నిర్మాణసభ విపులము చేయబడెను. పూర్వము శాసన నిర్మాణసభలో దొరతనమువారి చేత జేర్కొనబడినవారే సభ్యులుగ నుండెడివారు. శాసన నిర్మాణ సభలలో జనులచేత నెన్నుకొనబడిన సభ్యులే యెక్కువగ నుండవలె నని పార్లమెంటు మహాసభలో క్రాసు ప్రభువుగారు (Lord Cross) బిల్లు ప్రవేశపెట్టి పార్లమెంటువారి యంగీకారము బడసిరి. హిందూ దేశములోనున్న శాసన నిర్మాణసభ లన్నియు దానింబట్టి పెద్దవి చేయబడెను. చెన్నపురి శాసన నిర్మాణసభగూడ యట్లే పెద్దదిచేయ బడెను. దక్షిణమండలముల పక్షమున నేడుగురు సభ్యులు, నుత్తర మండలముల పక్షమున నేడుగురును, నెన్నుకొనబడవలయునని శాసన మేర్పడెను. ఉత్తరమండలములపక్షమున మహారాజశ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగారు సభ్యులుగ నిలువబడిరి. ఎవరిని

సభకు నెన్నుకొనదగునని రాజమహేంద్రిపురవాసు లొక సభచేసిరి. ఆ విషయమై చర్చించుటకు టౌనుహాలులో నొక సభజరిగెను. మా యూరిలో గొప్ప గృహస్థులై డిస్ట్రిక్టుమునసబు పనిజేసి పింఛను బుచ్చుకొనియున్న "బుచ్చి అబ్బాయినాయుడు" అను నామాంతరముగల నామినేని అశహసింగరరావు నాయుడుగారిని శాసనసభకు బంపదగునని కొందరు వాదించిరి. న్యాపతి సుబ్బారావుపంతులుగారిని పంపవలెనని కొందరు వాదించిరి. న్యాపతి సుబ్బారావుపంతులుగారి పక్షమున నున్న వారందరు నొక కాగితముమీద వ్రాల్జేసి యిరాయు నిలిపినదని జెప్పిరి. అలాగునసే బుచ్చబ్బాయినాయుడుగారి విషయముసకూడ వ్రాల్జేసిరి. సభాసదులలో నిరామమంచికంటి యధికము నాయుడుగారికి వోట్లు వేసిరి. సుబ్బారావుపంతులుగారి కేమవరొకరు వోట్లు వేసిరి. మా నాటకసామాజికులందరు సుబ్బారావు పంతులుగారికి వ్యతిరేకమైనను, నేనుమాత్రము నిశ్చయముగ నెళ్ళి పంతులుగారికి వోటు చేసితిని. సుబ్బారావుపంతులుగారే సర్వవిధముల చేత శాసన నిర్మాణసభకు తగిన సభ్యులని నాయభిప్రాయము. ఉత్తరమండలములలోనున్న మ్యునిసిపాలిటీలపక్షమున నొక సభ్యుడును డిస్ట్రిక్టుబోర్డుల పక్షమున నొక సభ్యుడును, శాసన నిర్మాణసభకు నెన్నుకొనబడవలెనని నారతనమువారిశాసనము. ఆఎన్నికలు కృష్ణా జిల్లా కలెక్టరు వారి యాధిపత్యమున బెజవాడలో 1893 సంవత్సర మాగష్టులోజరిగెను. ఉత్తరమండలముల మ్యునిసిపాలిటీల పక్షమున శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగారును, డిస్ట్రిక్టుబోర్డుల పక్షమున బళ్ళారి నివాసులైన శ్రీ సభాపతి మొదలియారుగారు నెన్నుకొనబడిరి. శ్రీ పంతులుగారు రాజమహేంద్రవర నివాసులగుటచే మొట్టమొదట శాసన నిర్మాణసభ కెన్నుకొనబడినవారు మా పురవాసులే గదా యని పుర ప్రముఖులందరు పంతులుగారిని సన్మానించుటకై టౌనుహాలులో నొక మహాసభ జేసిరి. చాలమంది పెద్దలు పంతులుగారు దేశమునకు జేసిన సేవను, వారి గుణములను మెచ్చుచు నాంగ్లేయమునను, నాంధ్రమునను, నుపన్యసించిరి. అప్పుడు నేను కొన్ని పద్యములు వారిమీద వ్రాసి సభలో చదివితిని. అవి "చింతామణి" యను మాసపత్రికలో ప్రచురింపబడినవిగాని, యిప్పుడు నాకడ లేవు.

శ్రీ పంతులుగారియెడ నాకు మిక్కిలి గౌరవము గలదు. కారణ మేమన, వారి దేశసేవయు వారి సుగుణసంపదయు నామనస్సు నాకర్షించినవి. వారి యాంధ్రభాషాభిమానము ప్రశంసనీయము. 1891వ సంవత్సరమున వారు "చింతామణి" యను తెలుగు మాస పత్రికను దాని వ్యయమంతయు వారే భరించి, దానిలో నెన్నో ప్రాచీన కవులు వ్రాసిన ప్రబంధములు ప్రచురించుటయేగాక, నవీన కవుల గ్రంథములు గూడ ప్రకటించుచు వచ్చిరి. అపూర్వమై యమూల్యమై యతిమనోహరమై, చిరకాలమునుండి గుప్తమైయున్న "ప్రభావతీప్రద్యుమ్న"మను పింగళి సూరకవి విరచిత మహాప్రబంధము మొట్టమొదట "చింతామణి" లోనే ప్రచురింపబడినది. ఇదిగాక మొల్లరామాయణము" "పాంచాలీ పరిణయము" విజ్ఞానేశ్వరము" "చిత్రభారతము" "నారాయణకవి పంచతంత్రము" "రామాభ్యుదయము" మొదలగు ప్రశస్తకావ్యములు గూడ నీ "చింతామణి" మాసపత్రికలోనే మొట్టమొదట ప్రకటింపబడినవి. ఇవిగాక నవీన కవులు రచించినవిగూడ నిందే ప్రచురింపబడినవి. 1893 సంవత్సరమున సుబ్బారావు పంతులుగారు పాశ్చాత్య దేశపద్ధతిని మన భాషలో గూడ నాఖ్యాయికలను (నవలలు) వ్రాయింపదలచి, పోటీపరీక్షలు బెట్టి, వారి స్వధనములోనుండి బహుమానములనీయనారంభించిరి. ఈయుత్కృష్టకార్యము వలననే మనదేశములో క్రొత్తనవలలెన్నో తలయెత్తినవి. 1893వ సంవత్సరమున మూడునవలలు మాత్రమే పోటీపరీక్షకు వచ్చెను. అందులో రెండింటికి మాత్రము బహుమానములీయబడెను. మొదట నవల వ్రాసినవారికి డెబ్బదియైదు రూపాయలను, రెండవ నవల వ్రాసినవారి కేబది రూపాయలును, పంతులుగారుబహుమానమిచ్చిరి. బహుమానధనము స్వల్పముగనుండుటచేత మంచి నవలలురాలేదని యభిప్రాయపడి పంతులుగారు మరుసటి సంవత్సరమునుండి ప్రథమ గణ్యమైన నవలకు నూటఇరువదియైదు రూపాయలును, ద్వితీయముగ గణింపబడిన దానికి డెబ్బదియైదు రూపాయలు బహుమానముగ నిచ్చునట్లు ప్రకటించిరి. అందుచేత నేను 1894వ సంవత్సరమున నవలల పోటీపరీక్షకు నిలిచితిని. ఆ సంవత్సరమున నేను "రామచంద్రవిజయ" మను నవలను వ్రాసి

పంపితిని, ఆసంవత్సరమున నవలల గుణాగణముల పరీక్షించుటకు శ్రీ వావి లాల వాసుదేవ శాస్త్రిగారిని, శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు గారిని, జిల్లాకోర్టున్యాయవాదియైన యాచంట సుందర రామయ్యగారిని, నియమించిరి. ఆసంవత్సరమున పోటీపరీక్షకు పదునాలుగునవలలు వచ్చి నవి. వాటి నెల్ల శ్రమపడి చదివి పరీక్షకులు తమనిర్ణయములనిచ్చిరి. గోటేటి కనకరాజుగారు "వివేకవిజయ" మని యొక నవలను వ్రాసి పంపిరి. మరియు ననేకులు బంపిరి. శ్రీ వావిల వాసుదేవశాస్త్రి గారును, యాచంట సుందరరామయ్యగారును, నేను వ్రాసిన "రామ చంద్ర విజయము" ప్రథమగణ్యమని యభిప్రాయపడిరి. కనక రాజుగారు వ్రాసిపంపిన "వివేకవిజయము" ప్రథమగణ్యమని వీరేశ లింగము గారభిప్రాయపడిరి. ఎవరి అభిప్రాయము త్రోసివేయుటకు వీలులేక సుబ్బారావు పంతులుగారు మొదటి నవల కేర్పడిన 125/- రూపాయలును రెండవదాని కేర్పడిన 75 రూపాయలును కలిపి మొత్తము రెండువందలరూపాయలు మొదటినవల రెండవనవలయను రెంటిని సమానముజేసి కనకరాజుగారికి నూరు రూపాయలును, నాకు నూరు రూపాయలను యిచ్చి "తుని తగవు" మాదిరిగ చేసిరి.

"రామచంద్ర విజయ" మే నా నవలలలో మొట్టమొదటిది. అంతకు ముందు నాటకములేగాని నేను నవలలు రచియింపలేదు. సుబ్బారావుపంతులుగారి ప్రోత్సాహముచేత నేను క్రొత్తపుంతత్రొక్కి తిని. హనుమంతురావు నాయుడుగారి ప్రోత్సాహము లేకపోయిన యెడల నేను త్వరగనాటకములు వ్రాయలేకపోదును. సుబ్బారావు పంతులుగారి ప్రోత్సాహములేకపోయిన యెడల నేను నవలలప్పుడు వ్రాయలేకపోదును. నవలలు వ్రాయుటకు మాకప్పుడు వీరేశలింగము గారు వ్రాసిన "రాజశేఖరచరిత్ర" మను నవలయే యాదర్శకము. ఆనవలను నేనామూలాగ్రముగజదివి, నవలలు రచియించు పద్ధతి తెలిసి కొని, "రామచంద్రవిజయము" వ్రాసితిని. పోటీపరీక్షలో నెగ్గినవలలు "చింతామణి" పత్రికలోనే ప్రతి మాసము ప్రకటింపబడుచు వచ్చెను. ముద్రణము పూర్తియైన తరువాత నవలలు వ్రాసినవారికి 500 ప్రతులు సుబ్బారావు పంతులు గారుచితముగ నిచ్చుచుండిరి. ఈవిధముగ సుబ్బారావు పంతులుగారు భాషాసేవ విశేషము జేసిరి.

ఆంధ్రదేశమున హరికథా చక్రవర్తియని చెప్పదగిన సంగీతసాహిత్య విశారదులగు ఆదిభట్ల నారాయణదాసుగారు రాజమహేంద్రవరము వచ్చినప్పుడు, వారిచేత హరికథలు చెప్పించుచువచ్చిరి. సంగీత శాస్త్రవేత్తలగు పండితులెవరు వచ్చినను శ్రీ పంతులుగారే సభలు గావించి సన్మానించి వారి నాదరించుచు వచ్చిరి. మహావక్త లెవరు వచ్చినను వారిచేత నానావిషయముల గురించి యుపన్యాసము లిప్పించి, పురవాసుల నానందింపజేయుటలో, సుబ్బారావు పంతులు గారు మొట్టమొదటివారని జెప్పవచ్చును.

ఈవిధముగ భాషాసేవ జేయుటగాక పంతులుగారు రాజకీయముగ గూడ విశేషదేశసేవ జేసిరి. శాసననిర్మాణసభలో జేరి వారుజేసిన దేశసేవను గురించి యప్పటి చెన్నపురి గవర్నరుగానైన వెన్‌లక్ ప్రభువుగారు పర్లాకిమిడిలో నొకసభలో మన పంతులుగారిని మిక్కిలి కొనియాడిరని చెప్పుటకంటె మరియేమియు నే వ్రాయనక్కర లేదు. ఉత్తరమండలమున పదునొకండు జిల్లాలు గలవు. ఆజిల్లాల కష్టనిష్ఠురములన్నియు దెలుసుకొని దొరతనమువారికి విన్నవించవలసినభారము పంతులుగారిపై బడెను. కావున దేహశ్రమము నాలోచింపక, ధనవ్యయము గణింపక, పంతులుగారన్ని మండలముల యందు ప్రయాణముజేసిరి. సుబ్బారావుపంతులుగారు పండిత పక్షపాతి. పత్రికా ప్రకటనాదుల యందభిరుచియెక్కువ. ఇంగ్లాండు దేశమున గొన్నిచోట్ల, మహాకవులయొక్కయు నాటక ప్రణేతల యొక్కయు గ్రంథములనుండి రసవంతములయిన భాగములను, సమర్థులైనవారు సభలలో జదివి, జనులను రంజింప జేసెడు నాచారమొకటి గలదట. అట్టివానిపేరు "పెన్నీరీడింగ్సు"(Penny Readings) పెన్నీ యనగ అణా. అందువల్ల స్వల్పముగ పోగుచేసి సత్కార్యములకై వినయోగింతురట. ఆంధ్రమహాకవుల గ్రంథములనుండి, రసవంతమైన భాగములను జదివించి, జనులను రంజింపచేయవలెనని, పంతులుగారు మనదేశమున గూడనట్టివి, టిక్కెట్టు లేకుండ బెట్టించిరి. కానియవి చిరకాలము నడచినవిగావు. నేను భాగవతములోని వామన ఘట్టమునుండి కొన్నిపద్యములు యీసభలో జదివి పాలుగొంటిని.

——

# స్వీయచరిత్రము

## ఆరవ ప్రకరణము

### వివాహము

1893 సంవత్సరమనఁగ విజయసంవత్సరమున నాకు వివాహమయ్యెను. అప్పటికి నాకిరువదియారవయేఁడు. మన దేశములో జమవ్రు కొన్న బాలురకు సాధారణముగ నిరువదియేండ్లు లోపుగనే వివాహములగుట యాచారము. నేనింగ్లీషులో మెట్రిక్యులేషన్ పరీక్షయందు కృతార్థుడనై యాంధ్రమున గొంత పరిశ్రమజేసి, కవిత్వము చెప్పుచుండినను, నాకిరువదియేండ్లు లోపుగ వివాహముగాలేదు. కారణమేమన, నాకు కొంచెముగనో గొప్పగనో దృష్టిదోషముండుటచేత, నేనంధుడనని నాబంధువర్గములో నొకప్రవాదము పుట్టెను! అది కేవల మబద్ధముగాదు. పగలు చదువుటకు వ్రాయుటకు సంచరించుటకు నాకాటంకము లేకపోయినను, రాత్రులు నాకు చిన్ననాటినుండియు కన్నులు కనబడకుండెనన్నమాట నిజము. ఇది యెరిగియే, నాబంధువులుగూడ, నావివాహము విషయమై గట్టిప్రయత్నము జేయలేదు. ఎట్టకేలకు, నేను వివాహములేక ఘోటకబ్రహ్మచారినై యుండుట యిష్టములేక, మాతల్లిదండ్రులు శ్లాఘాపాత్రముగాని యొక వివాహమునాకు జేసిరి.

తణుకు తాలూకా కాకరపఱ్ఱు గ్రామములో, మా మేనమామగారికి సన్నిహితజ్ఞాతియైన యొక గృహస్థుండెను. ఆయన పేరు పురాణపండ వెంకటదీక్షితులుగారు, ఆయన వైదికవృత్తిచే జీవించుచుండిరి. ఆయన గట్టి స్వాధ్యాయవేత్త. షోడశకర్మలు ననర్గళముగ జేయింపగల సమర్థుడు. గొప్ప కుటుంబములలో మెప్పు పొందిన పురోహితుడు. ఆయన మూడవ కుమార్తెకప్పటికి వివాహము కావలసియుండెను. ఆయన కొక్కఁడే కుమారుడు. అతనికి గూడ వివాహము గాలేదు. అతని వివాహ విషయమునగూడ వాని తలిదండ్రులును, మా తలిదండ్రులవలెనే, బెంగగొనియుండిరి. మా యింట మా మూడవ చెల్లెలైన రమణమ్మకు వివాహము కాలేదు. కాబట్టి మా బంధువులలో కొందఱు, నా వివాహవిషయమున పూను

కొని, నా చెల్లెలైన రమణమ్మకు పురాణపండ వెంకటదీక్షితులుగారి కుమారుడైన వెంకన్నకును, వెంకన్న చెల్లెలైన వెంకాయమ్మను నాకును యిచ్చి వివాహముచేయుటకు నిశ్చయించిరి. ఇటువంటి ఫిరాయింపు వివాహము చేసికొనుట నా కిష్టములేదు. వీటికే ''కుండ మార్పుల పెండ్లిండ్ల''ని లోకులందురు. ఇవి మనదేశములో జనులచే నంత గౌరవముగ జూడబడవు. ఏలయన, యుభయపక్షములవారు గతిలేక చేసికొను వివాహములగుటచే శ్లాఘాపాత్రములుగావు. ఈ వివాహము నా కిష్టములేదని నేను మావాండ్రకు పలుమారు నొక్కి చెప్పితిని. కాని మా తలిదండ్రులు దుఃఖపడినందున నా పట్టుదల నేనువదలి, యొడంబడవలసివచ్చెను. ఇందులో నొక మరతుగూడ గలదు. మా చెల్లెలి వివాహము చిన్నతిరుపతిలో జేయుటకు, మా తలిదండ్రులు చిన్ననాడామెకు జబ్బుజేసినప్పుడు మ్రొక్కుకొనినందున వివాహములు రెండును తిరుపతిలోనే జరుగవలసివచ్చెను. ఖర్చుపెట్టి తిరుపతి వెళ్ళుటకు మా మామగారొప్పుకొనరైరి. కాబట్టి యుభయుల ఖర్చులు మేమే భరింపవలసివచ్చెను. నా శిష్యుడైన రాయువరపు రామమూర్తి తండ్రియైన యప్పారావుగారు నే నడుగకయే నా వివాహమునకై రు. 200/-లు ఇచ్చిరి. నేను మరొకచోట నూరురూపాయ లప్పుచేసి, మొత్తము మూడువందల రూపాయలు మా తండ్రిగారికి బంపితిని.

మేము వీరవాసరమునుండి పాలకొలనువచ్చి, తిరుపతివరకు నొక నావ గుత్తజేసికొని బయలుదేరి, కాకరపఱ్ఱు గ్రామమువచ్చి మా యత్తవారి నందెక్కించుకొని నడుమనడుమ గ్రామములలో దిగి వంటలుజేసి భోజనములు జేయుచు, మెలమెల్లగ భీమడోలు జేరితిమి. మా మేనమామగారైన మల్లయ్యశాస్త్రిగారు, తమ జ్యేష్ఠ కుమారుడైన భద్రయ్యశాస్త్రికి, ద్వారకా తిరుమలలో నుపనయనము జేయదలచి, సకుటుంబముగ వచ్చిరి. మేము చేబ్రోలువరకు నావమీదవెళ్ళి, యచ్చట రైలెక్కి భీమడోలు వెళ్ళితిమి. మొట్టమొదట మన జిల్లాలలో 1893 సంవత్సర మాగస్టులోనే రైలుబండి నడచెను. నేను రైలుబండి యెక్కుట కదియే మొదటిసారి. ఈ యినుపదారి 1890 లో ప్రారంభింపబడి 1893 లో ముగింపబడెను.

దీనికి మొట్టమొదట తూర్పు తీరపుటినుపదారి (East coost Railway) యని పేరు పెట్టబడెను. తరువాత దీనిపేరు మారెను. మొదట దొరతనమువారే దీనిని నిర్మించిరిగాని, పిదప గొన్ని కంపెనీలకు దీని నిచ్చివేసిరి.

మేము తిరుపతి వెళ్ళినతరువాత, ఐదురోజుల వివాహము వచ్చు, నాకు శలవు దొరకలేదని, మాయత్తవారితో జెప్పితిని. ఒక్క-నాటి వివాహము వారికిష్టములేక "సెలవు దొరకినప్పుడే మరల వివాహము జేసికొనవచ్చును పోదము పదండి" యని వారు స్థిరము జెప్పిరి. ఆ పరిస్థితులలో నది యసాధ్యమగుటచే, ఐదురోజుల వివాహమునకే, మాతండ్రిగారు ఒడంబడిరి. పడవఖర్చులేగాక భోజనాదులకైన ఖర్చులు గూడ మావే. ఏదోవిధముగ ఐదుదినములు వివాహము లయ్యెను. నాభార్య కప్పటికి పదిసంవత్సరముల వయస్సు. నా వివాహమునకు ముందు నా కొక చిత్రపరీక్ష జరిగెను. నాయత్తమామ లొకనాడు, రాయవరపువారి వీధి గుమ్మములో నిలిచియుండి, లోపలనుండి నన్ను రమ్మని వర్తమానమంపిరి. ఎందుకని నేను వీధిలోనికివచ్చి యడుగగా, మేము కార్యాంతరము మీద నీ యూరు వచ్చితిమి. మాకు జాబు వ్రాసిపెట్టవలెనని, వారు నన్నడిగిరి. నేను లోపలకుబోయి, కాగితము కలము సిరాబుడ్డి తెచ్చి, వారు చెప్పినట్లు జాబువ్రాసి వారికిచ్చితిని. పగలైనను, నేను స్వేచ్ఛగాసంచరింపగలనో లేనో, వ్రాయగలనో లేనో యని పరీక్షించుటకు, వారు వచ్చిరని నేనభిప్రాయపడితిని. నా వ్రాతతో వారు పరితుష్టులై వెడలిపోయి, ముహూర్తము పెట్టించిరి. తిరుపతినుండియే నేను మా పాఠశాలాధికారులకు సెలవు నిమిత్తము వ్రాసికొంటిని. అప్పుడు నేను తిరుపతి క్షేత్రమును గూర్చియు, వెంకటేశ్వరస్వామిని గూర్చియు, గొన్ని పద్యములు రచించితిని. జ్ఞాపకమున్న వాని నిచట నుదహరించెదను.

సీ॥ ఆలబోతులదెచ్చి యచ్చుబోసెడివారు
నిలువుదోపుల నిచ్చి నిలుచువారు
డిబ్బీలయందున డబ్బువేసెడువారు
సాష్టాంగదండముల్ సలుపువారు

వడుగులు పెండ్లిండ్లు వరుస జేసెడివారు
చెలువుగా భజనలు చేయువారు
వెంకటేశ్వర ! యంచు వినుతి జేసెడివారు
తివిరి ప్రదక్షిణల్ తిరుగువారు
సీ॥ ముడుపుల సమర్పణము జేసి మ్రొక్కువారు
కొండపై నెక్కజాలక కుందువారు
ఈశ్వరప్రసాదమును భక్షించువారు
కలిగి కలకలలాడె దేవళము నేడు.

చం. పురములు మంచిగ్రామములు పుణ్యనదుల్ గలుగంగ సింహసూ
కరముఖదుష్టజంతువులు గల్గి భయంకర ఘోరపన్నగో
త్కరయుతమైన యీ విపుల కాననమందున నిల్వనేలనీ
చరణము లాశ్రయించు జనసంఘము కష్టమునొందదే యిలన్.

చం. చెలగి వరాహరూపమును సింగపురూపునుదాల్చి తొల్లి కా
నల జరియించి యుండుట వనంబులపై గడుబ్రీతి నీమదిన్
గలుగగబోలు నయ్యదియె కారణమేమొ మహావనంబులన్
మలలను నుండువాంఛ యతిమాత్రముగా నుదయించి యుంటకున్

చం. ముడుపుల నీయకున్న యతిమూర్ఖుల బెత్తముతోడగొట్టి నీ
ముడుపుల దెచ్చికొందువని భూజనులాడెదరట్టి నీవు నీ
గుడి నడిరేయి జొచ్చి ధనకోశము మ్రుచ్చిలు దొంగవాండ్రనీ
వడపకపోతివయ్య మహత్వమె ? చెప్పుము వెంకటేశ్వరా !

తే. సీ. తొల్లి బీబినాంచారియన్ తురకపడతి
పెండ్లియాడితివని బుధుల్ జెప్పవింటు
వర్ణసంకరుడగు నీకు వందనంబు
బ్రాహ్మణాదులు చేయుట పాడియగునె.

నా వివాహము గాకమునుపు, 1893 వ సంవత్సరము జూను నెలలో, నా శిష్యుడైన రాయవరపు రామమూర్తికి బునస్సంధాన మగుటచే, నేనుగూడ వారితో కాకినాడ పట్టణము బోయి పదునైదు దినములుంటిని. ఆ సమయమున, రామమూర్తి మామగారైన పారుపల్లి లక్ష్మీనారాయణగారితో నే గాక, వారి చెలియలి భర్తయైన శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారితో గూడ నాకు విశేషపరి

చయభాగ్యము గలిగెను. శ్రీరామమూర్తిపంతులుగారు మనయాంధ్రులకు చిరపరిచితులు. ఆంధ్రభాషాసేవ విశేషముగ జేసిన వారు. కవి జీవితములను పేర నాంధ్రమహాకవుల జీవితములు తెలుగున మొట్టమొదట వ్రాసిన మహనీయులు వీరే! వీరి తరువాతనే కందుకూరి వీరేశలింగం పంతులుగారు నేర్పుతో నాంధ్రకవుల చరిత్రము వ్రాసిరి. శ్రీరామమూర్తిపంతులుగారు గూడ కవిజీవితములను విశేషవిషయములను జేర్చి తిరిగి విపులముగ నిటీవల వ్రాసిరి. ఈయన మిక్కిలి శాంతమూర్తి. వీరును, వీరిబావగారైన పాటుపల్లి లక్ష్మీనారాయణ గారును గలసి తెలుగులో "రాజయోగి" యను నొక వారపత్రిక నడపిరి. వారి యిరువురి పరిచయము గలిగినందుకు నేను మిక్కిలి సంతసించితిని. నాటనుండి నేను, శ్రీరామమూర్తిగారి కుటుంబమునకును, పాటుపల్లివారి కుటుంబమునకును, మిక్కిలి హితమిత్రుడనైతిని.

1891వ సంవత్సరముననే శ్రీ రఘుపతి వెంకటరత్నమునాయుడుగారు, రాజమహేంద్రవరము దయచేసి, సంఘ పారిశుధ్యమును గూర్చి యాంగ్లేయభాషలో నొక మహోపన్యాస వర్షము గురిపించిరి. వేశ్యాంగనలను, మనవారు కులటలుగ జేసి సంఘము నపవిత్రము జేసిరనియు, వారికి గూడ వివాహములు జేసి, సంసారులను జేయుట యుక్తమనియు, వివాహోత్సవములయందును, దేవతోత్సవముల యందును, వేశ్యలను బిలిచి నృత్యగానములు జేయించుట యనుచితమనియు, వారి యుపన్యాసములలో నొక్కిచెప్పిరి. ఆభావగాంభీర్యమేమని కొనియాడుదును! ఆశబ్దసౌష్ఠవ మేమని వర్ణింతును! ఆవాగ్వేగమేమని సన్నుతింతును. ఆయుపన్యాసము విను నప్పుడు సభాసదులు సమ్మోహితులవలె బరవశులైరి. నేనానందసముద్రమున నోలలాడితిని. రాజమహేంద్రవర కళాశాలా ప్రధానాచార్యులును గురువులకు గురువులైన పూజ్యపాదులు మెట్కాఫ్ దొరగారు, నాడాసభ కధ్యక్షతవహించి, నాయుడుగారి యుపన్యాసమును మిక్కిలి మెచ్చుకొనిరి.

ఆసంవత్సరాంతమున నాయుద్యోగము పోయెను. ఏమన, రాజమహేంద్రవరములో నదివరకున్న పాఠశాలలన్నియు గలిపి, యేక పాఠశాలగ 1888వ సంవత్సరమున చేసియుండిరని నేనిదివరకు

వ్రాసియుంటిని. అయినను, నవాబు దేవిడీలో మహారాష్ట్రోన్నత పాఠశాలయని యొకబడి బయలుదేరెను. పూర్వము శ్రీ యేలూరి లక్ష్మీనరసింహముగారిచేత స్థాపింపబడిన యాస్తికపాఠశాలలో, కొంత కాలము సహోపాధ్యాయుడుగ పనిజేసిన, ముత్తుస్వామిశాస్త్రి గారు మహారాష్ట్ర పాఠశాల స్థాపించిరి. అదిగాక బి. యే. పరీక్షలో గృతార్థుడైన ద్రోణంరాజు రామకృష్ణా రావను నొకయువకుడు, మరియొక పాఠశాలను స్థాపించెను. మహారాష్ట్ర పాఠశాల యొకటి యున్నది గనుక, జనులు పరిహాసమునకు దీనిని పిండారి పాఠశాల యనుచు వచ్చిరి. ఈపాఠశాలలు విద్యాశాఖవారి యనుమతిని బొందినవిగావు. ఐనను కొందరు బాలకులీ పాఠశాలకు బోవుచుండిరి. పోటీ పాఠశాలలు రాజమహేంద్రవరములో లేకుండ జేయవలెనని, మెట్కాఫ్ దొరగారు చేసిన ప్రయత్నము విఫలమగుచుండెను. ఈస్థితిని గనిపెట్టి మెట్కాఫ్ గారొక క్రొత్తపుంత త్రొక్కిరి. చెన్నపురి రాజధానిలోనున్న యిరువదిరెండు జిల్లాలకు, బోధ నాభ్యసన కళాశాల, చెన్నపురి దగ్గరనున్న సైదాపేటలో మాత్రమే యుండెను. దానిపే రుపాధ్యాయకళాశాల (Teacher'sCollege) బోధ నాభ్యసనము చేయదలచు వారుత్తరమున గంజాము నుండియైన, సైదాపేటబోవలసినదే. రాజమహేంద్రవరమునుండి రాయసం వెంకట శివుడుగారును, సత్యరాజు మృత్యుంజయరావుగారును, బి. యే. పరీక్షయందుదేరి, బోధనాభ్యసనము కొరకు సైదాపేటబోయిరి. వీరిద్దరు నాసహాధ్యాయులే. గంజాము విశాఖపట్టణ జిల్లాలనుండి సైదాపేటకు బోవుట మిక్కిలి కష్టసాధ్యమయినపని. విశేషించి యాకాలమున రైలుబండిసౌకర్యములులేవు. ఈకష్టముల నివారించుట కును, నున్నతపాఠశాల విద్య సరిగ జరుపుటకును, దొరతనమువారే సమస్తలని యాలోచించి, మెట్కాఫ్ దొరగారు రాజమహేంద్రవర ములో నొకట్రయినింగు కళాశాల స్థాపింపవలసినదనియు, నందులో నొక నున్నత పాఠశాల గూడ స్థాపింపవలసిన దనియు, నాకాలపు విద్యాశాఖాధికారియైన "డంకన్" దొరగారికి వ్రాసిరి. ఆసలహా బాగున్నదని డంకన్ దొరగారు దొరతనమువారికి వ్రాసిరి. ఆసలహా దొరతనము వారంగీకరించి 1894 సంవత్సరము జనవరిలో రాజ

మహేంద్రవరమున దొరతనము వారొక ట్రెయినింగు కళాశాలను స్థాపించిరి. బి. యే. లకు యల్. టి. తరగతియు ప్రథమ శాస్త్ర పరీక్షయందు తేరినవారికొక తరగతియు మెట్రిక్యులేషను యందు తేరినవారికొక తరగతియు, బోధనాభ్యాసన కళాశాలలో నెలకొల్పబడెను. అంతకుమున్ను చిరకాలమునుండి పనిచేయుచున్న నార్మల్ స్కూలుగూడ, నీకళాశాలకే చేర్పబడెను. ఇందు ప్రైమరీ పరీక్షయందు దేరిన వారికిని. లోవర్ సెకండరీలో జేరిన వారికిని, బోధనాభ్యాసనము నేర్పబడు చుండెను. మొత్తముమీద నీ క్రొత్త కళాశాలలో, యల్. టి. మొదలుకొని ప్రైమరీవరకు, బోధనాభ్యాసనము నిమిత్తమై యైదుతరగతు లేర్పఱుపబడినవి. అదివరకు రాజమహేంద్రవరములో బనిచేయుచున్న రాజమహేంద్రి ప్రకోన్నత పాఠశాలయు, దానిశాఖలుగనున్న యిన్నీసుపేట మధ్యమ పాఠశాలయు, నగరమధ్యమ పాఠశాలయు (Town Middle School) పరిపాలక సంఘమువారు తీసివేసి బోధనాభ్యాసన కళాశాలకిచ్చివేసిరి. రాజమహేంద్రవర పాఠశాలా పరిపాలక సంఘమువారు కష్టపడి సంపాదించి యారువేల రూపాయలు రొక్కమును, నగర మధ్యమ పాఠశాలాభవనమును, (Town Middle School Building) నగరమధ్యమున నున్నతపాఠశాల కట్టుటకై సంపాదించిన విశాలస్థలమునుగూడ దొరతనము వారికిచ్చివేసిరి.

నేను పనిచేయుచున్న యిన్నీసుపేట పాఠశాల దొరతనము వారికిచ్చివేసినందున నాయుద్యోగముపోయెను. కాబట్టి 1894వ సంవత్సరము జనవరి మొదలుకొని నేనుద్యోగము లేక నిరర్థకముగ కాలము జరుపవలసివచ్చెను. అట్లు జూన్ నెలవరకు ధనసంపాదనము లేక నిరుద్యోగినై నేనుంటిని. 1893 వ సంవత్సరము డిశంబరులో జరిగిన మెట్రిక్యులేషను పరీక్షలో రాయవరపు రామమూర్తి కృతార్థుడై 1894 వ సంవత్సము జనవరిలో ప్రథమశాస్త్ర పరీక్ష తరగతిలో జేరెను. తెలుగు, దేశచరిత్రము మొదలయిన పాఠములలో నేను వారియింటనుండి, యతనికి సాయముజేయుటచే, నతడు నా యెడల మిక్కిలి భక్తిగలవాడై నాకుద్యోగ మున్నప్పుడు లేనప్పుడు గూడ నన్ను వేరొకచోటికి బోనీయక, మిక్కిలి

దయతో నాదరించుచుండెను. నిరుద్యోగినై యుండుట నాకిష్టములేక నేనా సంవత్సరమున బోధనాభ్యసనము బొందుట మంచిదని తలంచితిని. బోధనాభ్యసన కళాశాలలో, నా మిత్రుడైన మరంగంటి కృష్ణమాచార్యులుగారు లేఖకుడుగా నుండి, నాకు తగినసహాయ్యము జేసెను. ఏదో విధముగ నేను సెకండరీ ట్రెయినింగు తరగతిలో జేరితిని. ఇప్పుడున్న ట్రయినింగు కళాశాలాభవన మప్పటికి నిర్మింపబడలేదు. కాబట్టి యల్. టి. తరగతియు దాని తరువాత తరగతియు, దొరతనమువారి కళాశాలలోనే పెట్టిరి. అవిగాక యున్నత పాఠశాల తరగతులుగూడ కొన్ని యచ్చటనే యుండెను. ప్రస్తుతము న్యాపతి సుబ్బారావుగారి భవనమున్నచోట, గొన్ని తరగతులుండెను. కొన్ని తరగతు లద్దె యింటిలో నుండెను. మెట్కాఫ్ దొరగారే మునుపటి కళాశాలకును, యీ బోధనాభ్యసన కళాశాలకును గూడ, ప్రధానాచార్యులైరి. విద్యాశాఖలో చిరకాల ముపాధ్యాయులై యెంతో యనుభవము గలిగి, "నడచుచున్న నిఘంటువు" (walking Encyclopaedia) యను బిరుదము నొందిన శ్రీ తంజావూరు సుబ్బారావు పంతులుగారు, వైసుప్రిన్సిపాలుగ నియమింపబడిరి. మొదటి సంవత్సరము యల్. టి. తరగతిలో శ్రీ వల్లూరి నరసింహారాయుడుగారు చేరిరి. ఈ క్రొత్త కళాశాల నిర్మింపబడిన తరువాత సెకండరీగ్రేడ్ తరగతిలో పదిమంది చేరిరి. అందు నేనొకడను, మా తరగతులపై బూర్వము నాసహాధ్యాయుడు నామిత్రుడునైన సత్యరాజు మృత్యుంజయరావుగా రధికారిగ నుండుటచే నేను కొంత సుఖపడితిని.

ఇన్నీసుపేటపాఠశాలలో నే నుపాధ్యాయుడుగ నున్నకాలమున, నా యొద్ద జదువుకున్న శిష్యులలో కొందరిపేళ్లుచెప్పెదను. నిడమర్తి వెంకటాద్రియయ్యగారు, పెద్దాడ సుందరశివరావుగారు, ఓరుగంటి సుబ్బారావుగారు, వీరు న్యాయవాదులై సుప్రసిద్ధులైరి. నేను బోధనాభ్యసన కళాశాలలో నున్నప్పుడు న్యాపతి కామేశ్వరరావుగారు నా యొద్ద జదివిరి. ఆ సంవత్సరమున జిల్లాకోర్టులో శ్రీ పిఠాపుర సంస్థానపు టభియోగము విచారణచేయబడుచుండెను. పిఠాపురపు రాజుగారి దత్తుడుగారు, శ్రీ గంగాధరరామారావుగారి యౌరస పుత్రులైన యిప్పటి పిఠాపురము మహారాజాగారు బాలురైయుండగ

సంస్థానము తనకే రావలయునని యభియోగము దెచ్చిరి. వర్తీను గారి పక్షమున రాయబహదూర్ పునప్పాక మానందా చార్యుల వారు, చెన్నపురినుండి న్యాయవాదిగ వచ్చిరి. మహారాజావారి తరఫున సుబ్రహ్మణ్యమయ్యరుగారును, భాష్యమయ్యంగారును వకీళ్లుగ వచ్చిరి.

మా నాటకసమాజమువారు మ॥రా॥రా॥శ్రీ ఆనందాచార్యుల వారి గౌరవార్థ మొకనాటకము ప్రదర్శింపవలచి, వారి నాహ్వానము జేసిరి. ఆహ్వానము నిరాకరింపక యానందాచార్యులవారు మా సమాజమువారి కోరెక దీర్చిరి. అప్పుడు నా గయోపాఖ్యాననాటకమే పురమందిరమున (Town Hall) ప్రదర్శింపబడెను. మద్ది గోపాలకృష్ణా రావు కృష్ణపాత్రయు, హనుమంతరావు నాయుడుగారు గయుని పాత్రయు, ప్రకాశముగారు చిత్రరేఖార్జునపాత్రలు, ధరించి చక్కగ నభినయించిరి. ఆనందాచార్యులవారును సభాసదులును మిక్కిలి సంతసించిరి. ఆచార్యులవారు నాటకాంతమున నటుల యభినయ మును మెచ్చుకొనుచు, ఇంగ్లీషులో చిన్నయుపన్యాసము జేసిరి. ఆనందాచార్యులవారు సరసులు, ఆంధ్ర గీర్వాణ భాషాభిమానులు. నవద్వీప పండితులు. వీరికి "విద్యా వినోది" యని బిరుద మిచ్చిరి. "వైజయంతి"యను తెలుగుమాసపత్రికను వీరు ప్రకటించుచుండిరి. ఈయన మిక్కిలి బండితపక్షపాతి. బళ్ళారిలో ధర్మవరము కృష్ణమా చార్యులవారు స్థాపించిన నాటకసమాజము వారు చెన్నపురి వెళ్ళి నాటకము లాడినప్పు డాచార్యుల వారు బహు విధముల వారికి ప్రోత్సాహము గలిగించిరి. వచననాటకములే యెక్కువగ ప్రయో గించెడు మా సమాజము చెన్నపురి వచ్చిన జనులు మెచ్చుకొం దురా యని మా నాయుడుగా రాచార్యులవారి నడిగిరి. నాటకమున కభినయము హావభావములు ప్రధానములుగాని, సంగీతము కాదని వారు స్పష్టముగ జెప్పిరి. నాటకసమాజమున కాచార్యులుగా రప్పుడు రు 116 లు బహుమానమిచ్చిరి. నాటకమైన తరువాత నే నానందా చార్యులవారి దర్శనముజేసి, వారిపరిచయభాగ్యము సంపాదించితిని. నా నాటకరచనము వారు మెచ్చుకొనిరి. వారి కుమారుడైన శ్రీని వాసాచార్యులవారు గూడ మా నాటక సమాజ ప్రదర్శన మొకటి

చూడగోరగా, సామాజికులు, నవాబుదేవిడీలో నేను రచియించిన "నల" నాటకము ప్రదర్శించిరి. శ్రీనివాసాచార్యులుగారు కూడ నాంధ్ర భాషాభిమానులే. తెలుగున వారు రెండో మూడో గ్రంథములుగూడ రచించిరి. వారు కూడ నాటకమును మెచ్చుకొనిరి. అప్పుడు మన్నె గోపాలకృష్ణారావు "నల" పాత్రమును, ప్రకాశముగారు "దమయంతి" పాత్రమును ధరించిరి.

ఆ సంవత్సరము శ్రావణమాసములో వీరవాసరములోనున్న మా యిల్లు పరశురామప్రీతి యయ్యెను. మా తల్లితండ్రులు పక్కనున్న మరియొకరి యింటికి చేరిరి. మాయిల్లు మా తండ్రిగారు కట్టి యప్పటికి నలువది సంవత్సరము లయినవి. ఈ గృహదహనము చేత మా తండ్రిగారు బెంగపెట్టుకొనిరి. ఆ సమయముననే, మా రెండవ బావమరిదియైన రామస్వామిగారి యన్నగారు వెంకటప్పయ్యగారు కాలధర్మమొందిరి. వారిని పరామర్శ చేయుటకును, మా తల్లిదండ్రుల చూచివచ్చుటకును నేను వీరవాసరము బోయితిని. అక్కడనుండి నరసాపురము బోయి మా చెలియలు పున్నమ్మను, బావగారిని జూచి రాజమహేంద్రవరము వచ్చితిని.

ఆ సంవత్సరమున జాతీయమహాసభ (All India National Congress) చెన్నపట్టణములో జరుప నిశ్చయింపబడెను. నా కన్నులొకసారి చెన్నపురిలోని నేత్రవైద్యులచేత పరీక్ష జేయించుకొనవలెనని, చిరకాలమునుండి నాకొక కోరిక యుండెను. "ఏకక్రియాద్వ్యర్థకరీ" యను సామెతనుబట్టి నేనా సంవత్సరమున చెన్నపురి బోయిన పక్షమున, నేత్రపరీక్ష జేయించుకొనుటయే గాక, కాంగ్రెసు మహాసభ గూడ జూడవచ్చునని, నేను చెన్నపురి పోవ నిశ్చయించుకొంటిని. నా మిత్రులైన తల్లాప్రగడ చలపతిరావుగారును, చేబియ్యపు వేంకటరామయ్యగారును, బి. ఏ. పరీక్ష నిమిత్తమై చెన్నపురి బోవుచుండగా వారితో గలసి 1894 వ సంవత్సరము డిశంబరులో నేను గూడ చెన్నపురి బోయితిని. అప్పుడచ్చట నామిత్రుడైన శ్రీ పోలవరము జమీందారుగారు కొచ్చెర్లకోట రామచంద్ర వెంకటకృష్ణారావుగారు, పరశువాకమను పేటలో కాపురముండిరి. నేను వారిని జూడబోవగా, వారు దయతో నన్ను వారి యింటనే యుండుమని

బలవంతపెట్టి, నా నేత్ర పరీక్ష గూడ జేయింతుమని సెలవిచ్చిరి. అందుచేత నేను వారియింటనే బసచేసి యుంటిని. ఆ దినములలో నా మిత్రుడైన రెబ్బాప్రగడ పాపయ్యగారు కూడ వచ్చుటనే యుండి, నాకు సహాయ్యము జేయుచుండిరి. జమీందారుగారు నన్ను మిక్కిలి దయతో నాదరించిరి. వారు జనవరి నెలలో నొకనాడు నన్ను వెంట బెట్టుకొని నేత్ర వైద్యశాలకు గొనిపోయి యచ్చటి వైద్యులలో ప్రధానులై సుప్రసిద్ధులైన "పోపు" దొరగారికి నన్ను జూపిరి. ఆయన యొక గదిలోనికి నన్ను దీసికొనిపోయి కన్నులు పరీక్షించి, యెన్నో సులోచనములు నా కన్నులకు దగిలించిరి సులోచనము లేవియు నాకు సరిపడలేదు. నా నేత్రరోగ మంతకంతకు వృద్ధి కాదనియు, నది నివారణ కాదనియు వారు జెప్పిరి.

నేను కాంగ్రెసు మహాసభకు వెళ్ళితిని. అప్పుడే మహా వక్తయైన సురేంద్రనాథబెనర్జీగారి యొక్కయు, దేశాభరణమైన మదన మోహన మాలవ్యాగారి యొక్కయు, నితర వక్తల యొక్కయు, మహోపన్యాసములు విని ధన్యుడనైతిని. ఆ దినములలో నిచ్చట నుండి సరాసరి చెన్నపురికి రైలు దారి లేదు. అది తయారగుచుండెను. కాబట్టి మేము బెజవాడ వెళ్లి దక్షిణ మహారాష్ట్ర ధూమశకటము (S. M. R) మీాద, నందియాల, గుంతకల్లు ప్రదేశములమీాదుగ, జెన్నపురి జేరితిమి. చెన్నపురినుండి తిరిగి వచ్చునప్పుడు గూడ నదే మార్గము. అది చుట్టుదారి బండి మెల్లగ నడచును. కాబట్టి ప్రయాణీకులకు విసుగు గలుగును. ఈ బండికూడ లేనప్పుడు ప్రాత గోదావరిమండల వాసులు, చెన్నపురి వెళ్ళవలసి వచ్చినప్పుడు, కాకినాడ వెళ్లి పొగయోడనెక్కి, మూడవనాడు చెన్నపురిలో దిగుచుండిరి. మొత్తముమీాద నేను చెన్నపురిలో నెల పదియేనుదినములుండి శ్రీ పోలవరము జమీాందారుగారి గుఱ్ఱపు బండిమీాద, దర్శనీయము లైన స్థలములు జూచి. తిరిగి రాజమహేంద్రవరము వచ్చితిని. శీతాకాలపు సెలవులతరువాత మా కళాశాల తెరచిననాడు నేను రాలేక, సెలవునిమిత్తము చెన్నపురినుండి దరఖాస్తు పంపితిని. నా మిత్రుడైన మరంగంటి కృష్ణమాచార్యుల వారి సహాయ్యముచేత, నాకు సెలవు దొరకుటయే గాక సెలవు దినములలో జీతము గూడ దొరికినది.

అప్పుడు బోధనాభ్యసనము చేయువారికి, నెలకు పది రూపాయలు చొప్పున దొరతనమువా రిచ్చెడివారు. పట్టపరీక్షా సిద్ధులకు నెలకు పదునైదు రూపాయలును, ప్రథమశాస్త్ర పరీక్షా సిద్ధులకు నెలకు పండ్రెండు రూపాయలు నిచ్చుచుండెడివారు. ఇప్పటివలె బోధనాభ్యసనము పొందువారు, స్వగృహమునుండి సొమ్ము తెచ్చుకొనవలసిన యవసర ముండెడిదిగాదు. ఎట్లెటో నాబోధనాభ్యసనము 1895వ సంవత్సరము మార్చి నెలతో ముగిసినది.

ఆ కాలమున రాజమహేంద్రవరమున కంతకు బోధనాభ్యసన కళాశాల యొక్కటే పాఠశాలగ నుండెను, మొదటి ఫారము జదువుకొను బాలుడు మొదలుకొని, బి. యే. జదువుకొనువాడు వరకు, నిన్నిసుపేటకే వెళ్ళవలసి వచ్చెను. ఆర్యాపురము నుండియు, జాన్ పేట నుండియు, ప్రాతయూరి నుండియు జిన్న తరగతులలో జదువు బిడ్డలు నడువలేక జాల శ్రమపడుచుండిరి.

అందుచేత రెండవపాఠశాల యొకటి యుండుట యవసరమని పురవాసులకు దోచెను. అప్పుడు రాజమహేంద్రవరపు మ్యునిసిపలు సభాధ్యక్షులుగ, శ్రీ నిడమర్తి జలదుర్గ ప్రసాదరాయుడుగా రుండిరి. వారు పురజనుల మనవుల నాలకించి, బాలుర కష్టసుఖలు గుర్తించి, ప్రాతయూరిలో నొక మ్యునిసిపల్ లోవర్ సెకండరీ పాఠశాల స్థాపించుట యవసరమని తలంచి, మ్యునిసిపల్ సభలో బెట్టి, యీ విషయమంగీకరింపజేసి, 1895వ సంవత్సర మేప్రియల్ యొకటవతారీఖునుండి, మ్యునిసిపల్ మిడిలుస్కూ లొకటి స్థాపించిరి. ఇప్పుడు టౌనుహాలు కెదురుగనున్న భవనము దొరతనము వారికి జెందియుండి నందున, వారి యనుజ్ఞ బొంది పాఠశాల యందు స్థాపింపబడెను. అప్పుడు దుర్గయ్య గారి మ్యునిసిపల్ సంఘాధ్యక్ష పదవి తాత్కాలికముగ నాగిపోయినందున మరల నెన్నిక జరుగు వరకు, యేలూరి లక్ష్మీనరసింహముగా రధ్యక్ష పదవిలో నుండిరి. ఈ పాఠశాలకు గావలసిన యుపాధ్యాయుల యుద్యోగము లన్నియు నాయనయే యిచ్చిరి. వల్లూరి నరసింహరాయుడు గారు మొట్టమొదట ప్రధానోపాధ్యాయులుగ నేర్పరుపబడిరి. రెండవ యుపాధ్యాయుడుగ హనుమంతరావు నాయుడుగా రేర్పరుపబడిరి. మూడవ యుపాధ్యాయుడుగ నే నేర్పరు

పబడితిని. నాకు నెల కప్పుడు రు. 20/- లు జీతము. పండితులుగ శ్రీ మల్లంపల్లి వీరయ్యశాస్త్రిగారును, కస్తూరి వేంకటరామశాస్త్రి గారును, చావలి సోమనాథశాస్త్రిగారును గూడ నియమింపబడిరి.

మా తండ్రిగారు వీరవాసరములో నొక పెంకుటిల్లు మిక్కిలి శ్రమపడి కట్టిరి. నేనుకూడ **వారికి కొంత ధనసహాయము** చేసితిని కాని, గృహ ప్రవేశమునకు నేను వెళ్ళజాలనైతిని. కారణ మేమన గృహప్రవేశము మే నెలలో జరిగెను. అప్పుడు కాలువలు కట్టివేయ బడి యుండును. పడవ లుండవు. నడచియో బండ్లమీదనో మా గ్రామము పోవలెను. అట్లుచేయ లేక నేను గృహప్రవేశమునకు పోజా లనైతిని. కాని జూన్ నెలలో నొకసారి మా తలిదండ్రుల దర్శనము చేసివచ్చితిని. ఆ నెలలోనే మొట్టమొదటి గోదావరీ మండల సభ కాకినాడలో జరిగెను. అప్పుడు గోదావరిజిల్లా విభజింపబడ లేదు. ఆ సభకు శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగా రధ్యక్షత వహించిరి. మొదటనుండియు నాకు సభలకుబోవుట యిష్టము, అది రాజకీయ సభయైనను, నాకు రాజకీయ విషయములలో నప్పటి కేవిధమయిన ప్రవేశము లేకపోయినను నేనా సభకు బోయితిని. **మూడవనాడు** నేను పదునాలుగు పద్యములు రచించి సభలో జదివితిని, పద్యము చదివినప్పుడెల్ల సభాసదులు చప్పట్లు గొట్టి యానందించుచుండిరి. ఆ పద్యములతో నా పేరు గోదావరీ మండలమం దంతట వెల్లడియ య్యెను, నా పద్యములు చాల బాగున్నవని సాధారణముగ నెవరి కవిత్వమును మెచ్చని వీరేశలింగము పంతులుగారు గూడ మెచ్చిరి. ఆ పద్యము లివి.

సీ. తుహినాద్రి మొదలు సేతువుదాక రాజ్యంబు
జరిపె నీ యాంగ్లేయ దొరతనంబె
జాతిమతాచార సర్వస్వతంత్రముల్
నొసఁగె నీయాంగ్లేయ దొరతనంబె
పిండారిదండుల పేరైన లేకుండ
దోలె నీయాంగ్లేయ దొరతనంబె
నెప్పుడో చట్టముల్ నిర్మించి క్లేశముల్
తొలచె నీయాంగ్లేయ దొరతనంబె

తే. గీ. ప్రజలు లోపముల్ జూప నాగ్రహము లేక
కరుణజూపు నీయాంగ్లేయ దొరతనంబె
ఇట్టి యాంగ్లేయ దొరతనం బేలుగాక
ధర్మమతితోడ నాచంద్రతారకంబు. 1

సీ. దీప్తిమంతంబైన దీపంబుతోడ గ్రీ
నీడ యొక్కింత గన్పించునట్లు
కమ్మకమ్మనితావి గుమ్మన వెదజల్లు
నల గులాబికి ముండులలమినట్లు
సర్వజనానంద సంధానకరుడైన
చందమామను గందు జెందునట్లు
జీవనాధారమై చెలగు చల్లనివాన
బెడిదంపు పిడుగుల నడరినట్లు

తే. గీ. లుత్తమంబగునట్టి యీ హూణరాజ్య
మందు గనుపించు లోపంబు లరసిజూడ
తన్నివారణార్థముగాదె ధన్యులార
గౌతమీమండలసభ సంకల్పమయ్యె. 2

సీ. హిందూమహాజన హృదయసీమలయందు
ప్రబలియుండెడు రాజభక్తి యొకటి
ద్రవ్యంబు ప్రాణంబు ధారబోయించు న
మానుష దేశాభిమాన మొకటి
నిష్కారణంబుగ నిరపరాధులు చెందు
శ్రమలజూడగ బుట్టు జాలియొకటి
ప్రతిమనుష్యుడు ధాత్రి భగవంతుడంచు వి
విధభూత సహాయ్యవిధియు నొకటి

తే. గీ. యనెడు నాలుగు మూలంబు లగుచునుండ
గౌతమీ మండలసభ సంకల్పమయ్యె
నఖిలజన సౌఖ్యదాయకమగుచు నిదియె
ధరణివర్ధిల్లు నాచంద్రతారకంబు. 3

సీ. పాలింపబడువారి బాలించువారల
: నూటిగల్పెడు సంధిమాత్రమనగ

ప్రభువులపాల గన్పడు లోపముల జూ
పదగినట్టి నిలువు టద్దంబనంగ
మాఘ శాసనముల న్మాత్స్యంబులనుబొంచి
యలయించిపట్టెడు వలయనంగ
బ్రాభవమ్మునుదాల్చి ప్రార్థించుటకు మూర్తి
వంతమౌ వర రాజభక్తియనగ

తే. గీ. ప్రజలకెల్లను గన్నుల పండువగుచు
జగతి దేశీయసభ కొక్క శాఖయగుచు
ప్రబలు రగువారల ప్రయత్న ఫలమునగుచు
వలగు నిమ్మహాజనసభ ఖ్యాతిమీఱ. 4

సీ. పన్నుగట్టుటయందు ప్రభువులౌ హూణుల
కేనాటకైనను దృష్టిలేదు
ఉద్యోగములు చేయు నున్నత్తులకు గార్య
నిర్వాహమందున నియతిలేదు
బహుపరీక్షల దేరి ప్రజ్ఞాఢ్యులగు మీకు
రవ్వంతయేని ధైర్యంబులేదు
మితిలేని తమ చెడ్డగతినెల్లఁ దగ విన్న
వింపఁగ రయితుకు విద్యలేదు

తే. గీ. తెలుఁగు తెలియంగ దొరలకుఁ దెలివిలేదు
దీనదశఁ బాపగలయట్టి దిక్కులేదు
కటకటా! యెట్టులున్నదో కాపులదశ
సుగుణధనులార జనులార చూడరయ్య. 5

సీ. నేల దున్నుదమన్న జాలతరముపన్ను
నీరు గావలెనన్న నీటిపన్ను
వాణిజ్యమొనరింప వచ్చుబడికి పన్ను
సరకులమ్ముదమన్న సంతపన్ను
కర్రలమ్ముదమన్నఁ గలప కింకొకపన్ను
పట్టణంబుల మున్సిపాలుపన్ను
పారిపోవుదమన్న బండికాసీల్‌పన్ను
కొంపమ్ముకొన్నచో స్టాంపుపన్ను

తే. గీ. ఉన్న మట్టుకు తినకుండ నుప్పుపన్ను
ననెడు పన్నులె దిగదీసె జనులనెల్ల
కటకటా! యెట్టులున్నదో కాపులదశ
సుగుణధనులార జనులార చూడరయ్య. 6

సీ. అధికారభూతంబు లడుగు లంచములిచ్చి
పరిపరి విధములౌ పన్నులిచ్చి
మునసబు కరణాల మురుపులన్నియు నిచ్చి
కోసి నూర్చినవారి కూలినిచ్చి
కచ్చేరి బంట్రోతు గముల కీనామిచ్చి
పాలేళ్ళకును గొంత పంటనిచ్చి
యజమానునకు బంట నర్ధభాగంబిచ్చి
పైకమిచ్చినవాని వడ్డినిచ్చి

తే. గీ. గడ్డిమాత్రమె మిగిలించు గాపువాడు
సేద్యమున దాను పశులు భక్షించుకొరకు
కటకటా! యెట్టులున్నదో గాపులదశ
సుగుణధనులార జనులార చూడరయ్య. 7

సీ. గృహములందుండు దరిద్రదేవతనిల్చె
గొప్పసంసారముల్ గుల్లలయ్యె
జక్కని భూములు సారహీనములయ్యె
వివిధవస్తుధరలు వృద్ధిఁబొందె
మునుపటివెల్ల మొదలంట నడుగంటె
మానాభిమానముల్ మాయమయ్యె
లక్షాధిపతులెల్ల భిక్షాధిపతులైరి
కనుపించు నేటేట కాటకములు

తే. గీ. అంతకంతకు ఋణబాధ లధికమయ్యె
దొరలకుం బ్రజలమీదను గరుణదప్పె
కటకటా! యెట్టులున్నదో కాపులదశ
సుగుణధనులార జనులార జూడరయ్య. 8

సీ. అధికారులకు దైన్యమంత వెల్లడిసేయు
దేశస్థులకు మైత్రి దిట్టపరచు

నఖిలజాతులవారి కైకమత్యముఁగొల్పు
రాజ్యాంగ విషయవార్తలను దెల్పు
జనులలోనుండు నజ్ఞానమంతయుఁ బాపు
వినయాదిగుణముల విధముఁజూపు
ప్రభువులపైఁగల్గు భక్తిని ప్రకటించు
సాహస ధైర్యముల్ సంఘటించు
తే. గీ. గౌతమీమండల సభ నిక్కముగ మనకుఁ
గాన జనులార యుక్తమౌ కాలమందె
ధరణి నిమ్మహాజనసభ స్థిరముగాఁగ
జాలుపడరయ్య వినరయ్య పలుకరయ్య... 9

సీ. వ్యవసాయ మొనరించి వివిధనష్టములొంది
కడగండ్ల బడు పంటకాపులార
త్రాణ లేకున్నను వాణిజ్య మొనరించి
పన్నులిచ్చుకొనునో వైశ్యులార
యభిమాన ధనులంచు నఖిలదేశములందు
ప్రఖ్యాతిగన్న యో రాజులార
విద్యలన్నియు నేర్చి యుద్యోగములు లేక
విసికి వేసారునో విప్రులార
తే. గీ. ప్రాతపగలున్న నవిమాని ప్రీతిబూని
తనుధనములిచ్చి సభల కండయను వచ్చి
పాటుపడరయ్య వినరయ్య పలుకరయ్య
శ్రద్ధగనరయ్య సభలను జయపరయ్య. 10

సీ. మొగమోటమనుమాట దిగనాసి దొరలతో
జనులకై వాదించు సాహసుండ
యతి కార్యదీక్షచే నల గవర్నరుచేత
మెప్పునైకొన్న యమేయగుణుడ
కార్యవాదమె కాని ఖస్థవాదము లేక
సఫలకార్యుండవైన శాంతిధనుడ
ప్రజల కష్టములనెల్ల బాపినంగాని ని
ద్రయినబోవని యో దయార్ద్రహృదయ

తే. గీ. చెలిమినీసభ దొరలకు దెలుపవయ్య
కినుక లేకుండ గరుణ గల్గింపవయ్య
యోసభాగ్రాసనాధీశ యో సుశీల
సుగుణ సముదాయ న్యాపతి సుబ్బరాయ. 11

సీ. చలువపందిళ్ళఁ గౌశలముతో నిర్మించి,
భోజన సదుపాయముల నొనర్చి
రవి రశ్మి సొరనట్టి రమ్యహర్మ్యములిచ్చి
సభయెంతొ శీఘ్రతో జరుగఁజేయు
విబుధుడౌ బాదము వేంకటరత్నాఖ్యు
తద్బంధుగణముల స్తవమొనర్చి
వరమండల సభా ప్రపంచనిర్మాత కా
రణులగుచు బహుజన ప్రణుతులగుచు

తే. గీ. ప్రబలు గంజాము వెంకటరత్న విభుని
ప్రవిమలుని శేషగిరిరావు పద్మనాభు
పేరరాజు ముఖ్యులనెల్ల వినుతి జేసి
వందనంబుల జేతు మీ కందరకును. 12

ఉ. భూజనవందితంబు పరిపూర్ణ మనోరథ దాయకంబునై
రాజిలు నిమ్మహాసభ కరంబనుకూలత గాకినాడ నీ
యోజను మన్మథాబ్దమున నొప్పెగదా యిక సభ్యులార ! మా
రాజమహేంద్రపట్టణము రంగు ముదంబున ముందటేటికిన్. 13

తే. గీ. గౌతమీమండల సభకు ఖ్యాతిమెరయ
పూర్ణభక్తి సమర్పించె పుష్పమాల
వసుధ వీరవాసర పురవాసియైన
చిలకమర్తి లక్ష్మీనరసింహమూర్తి. 14

మూడవనాడు రాత్రి భోజనసమయమందు న్యాపతి సుబ్బారావుపంతులుగారు, కృత్తివెంటి పేరాజుపంతులుగారు, గంజాము వేంకటరత్నముగారు, బాదం వెంకటరత్నంగారు, మొదలగువారు నాచేత నాపద్యములు మరల మరల జదివించి, యానందించిరి. నాలుగవనాడు నేను రాజమహేంద్రవరము వెళ్ళుచుండగా, కాకినాడ వీధులలో గొందరు మనుష్యులు నన్ను వ్రేలితో చూపి, "నిన్న

పద్యములు జదివినవారు వీరే" యని, యెంతోమందితో చెప్పుకొనిరి. ఆపద్యములు హరికథలలోఁగూడ హరిదాసులు పాడఁజొచ్చిరి. అవి జనరంజకముగ నున్నవనుట కదియే తార్కాణము. నాపద్యములు విని, నా మిత్రులైన పిళ్ళారిసెట్టి నారాయణరావునాయుడుగారు, నాతో నిట్లనిరి. "ఇటువంటి పద్యములు, మీరు వొంతెనమువారిని శ్లాఘించుచు చెప్పినపక్షమున, మీకు రావుబహద్దూరు బిరుదము తప్పక నిచ్చియుందురు." ఈనారాయణరావునాయుడుగారు బి.యల్. పరీక్షయందు కృతార్థులై కొంతకాలము న్యాయవాదియై, పిదప డిస్ట్రిక్టుమునసబుగాను, సబుజడ్జిగాను పనిజేసి, నెల్లూరులో జిల్లాజడ్జిగ పనిచేసి, పింఛను పుచ్చుకొని, కొలది సంవత్సరములక్రిందట కాలధర్మ మొందిరి.

ఈ పద్యములు మిక్కిలి మనోహరముగ నున్నవని తోచినందున (శ్రీ) న్యాపతి సుబ్బారావుపంతులుగారు, వీనిని విజయనగరము పంపి నచ్చటి కళాశాలలో నాంగ్లేయభాషా పండితులయిన, (శ్రీ) గురజాడ అప్పారావు పంతులుగారిచేత నింగ్లీషుపద్యములుగ వ్రాయించిరి. తెలుగు పద్యములు నింగ్లీషుపద్యములు గూడ, మండలసభా వృత్తాంతముల తెలియజేయు రిపోర్టులో (Godavary District conference Report) నచ్చువేయబడినవి. ఈ పద్యములు జూచి మా తండ్రిగారు పరమానందమునొంది, తనకు బరిచితులైన మాయూరి కాపులను జేర్చి, యివి జదివి వినిపించుచుండెడివారు.



# స్వీయచరిత్రము

## ఏకపంచాశత్ప్రకరణము

## పితృమరణము

అయినను క్రొత్తయిల్లు కట్టుకొన్న సంతోషమును మేము చిరకాల మనుభవింపలేదు. నిద్రాహారములు లేక మా తండ్రిగారు స్వగృహ నిర్మాణమునకు మండువేసంగిలో దిరిగి శ్రమపడుటచేత, దేహములో జబ్బు చేసినది. ఆ సంవత్సరములోనే యాయనకు గ్రహణి ప్రవేశించెను. ఆయన మొదటినుండియు మిక్కిలి సుకుమారి. ప్రతిదినము పగలు పదిగంటలకును, రాత్రి యెనిమిదిగంటలకును, భోజనముచేసెడివారు. గృహనిర్మాణ సందర్భములో వేళపట్టునకు భోజనముచేయుటకు వీలులేకపోయెను. ఎండలో దిరుగవలసి వచ్చెను. క్రమక్రమముగ రోగమెక్కువయ్యెను. నేను రాజమహేంద్రవరములో నుంటిని. మా తండ్రిగారు, నాకు తన దేహస్థితిని గురించి జాబువ్రాసి, సెలవుపుచ్చుకొని నన్ను రమ్మని వ్రాసిరి. ఆయన కోరిక ననుసరించి నేను సెలవుపెట్టి యింటికి పోతిని. మా తండ్రిగారికి రక్తగ్రహణి క్రమక్రమముగా హెచ్చెను. నీరసమెక్కువయ్యెను. అన్నద్వేషము గలిగెను. ఆ యూరిలోనే వైద్యముచేయించితిని. అది గచ్చాకు పుచ్చాకు వైద్యమేగాని, శాస్త్రబద్ధమైన వైద్యముకాదు. ఎట్టకేలకు మా తండ్రిగారు మన్మథసంవత్సర భాద్రపద శుద్ధమంచు, ఏకాదశీ శుక్రవారమునాటి యుదయమున స్వగృహములో మృతినొందిరి. అనగా, 30–8–1895 తేదీని మానాయనగారు మరణించిరి. మా తండ్రిగారు మరణించునప్పటికి మా బంధువులెవరును లేరు. శ్మశానమునుండి వచ్చి మేమే వండుకొనవలసిన ప్రక్కర లేకుండ, మా కుటుంబమునకు చిరకాలమిత్రులైన నియోగుల కుటుంబమునుండి యొక వృద్ధవితంతువు వచ్చి, మాకు వంటచేసిపెట్టి, సహాయ్యము చేసెను. ఆమె సహాయ్యము మేమెన్నడును మరువజాలము. క్రమక్రమముగ మా బంధువులందరును వచ్చిరి. ఆ సంవత్సరము, మా తండ్రిగారు పోయిన పదిదినములలోనే, గొప్ప గాలివానపట్టెను. మా మేనమామగారు మా జనకుని మరణవార్తనువిని, యా వాన

లోనే తడియుచు, రెండుగోదావరులుదాటి, యమలాపురమునుండి తొమ్మిదవనాటికి బహు శ్రమలుపడి మా నివాసమును వచ్చితిమి. మేము ఋగ్వేదులమగుటచే, నాశ్వలాయనసూత్ర ప్రకారము మా తండ్రిగారికి నుత్తరక్రియలు జరుపవలసియుండెను. కాని ఋగ్వేద మంత్రము చెప్పవచ్చు బ్రాహ్మణుడు చుట్టుపక్కల నెక్కడను దొరక కుండుట, యజుర్వేదమంత్రముచేతనే, తొమ్మిదవనాడు కర్మ ప్రారం భించి చేయవలసివచ్చెను. ద్వాదశాహస్సులు పూర్తియైన తరువాత, నేను పదమూడవనాడు రాజమహేంద్రవరమునకు వెళ్లి, తిరిగి పాఠశా లలో పనిచేయ నారంభించితిని.

మా పాఠశాలాధికారులు జీతము నష్టముమీద నాకు సెల విచ్చిరి. నేనును, మా తమ్ముడును కలసి మాసికము పెట్టవలసియుం డినను, నేను రాజమహేంద్రవరములోను, నా సోదరుడు స్వగ్రామ ములోను నుండుటచేత, ప్రతిమాసికము కలసిపెట్టుటకు వీలులేకపో యెను. మాసికముల నిమిత్తము మొదట్లో మా తమ్ముడు రాజమ హేంద్రవరము వచ్చుచుండెను. సెలవు దొరికినప్పుడు నేను స్వగ్రా మమునకు వెళ్ళుచుంటిని. ఒకప్పుడు నెవరినో బ్రతిమాలి, వంటచేయిం చుకొని, రాజమహేంద్రవరములో నేను మాసికము పెట్టుచుంటిని. కర్మలమీద నా కంత నమ్మకము లేదు. కాని మా తల్లికిని, మేన మామగారికిని, బంధువులకును, నా మీద నాగ్రహము వచ్చునేమో యని యథావిధిగా జరిపితిని. అప్పటికే నా యభిప్రాయములలో గొంతమార్పు గలిగెను.

వీరేశలింగముగారిమీద నాకు గౌరవ మెక్కువయ్యెను. 1893వ సంవత్సరము మొదలుకొని, రాజమహేంద్రవర ప్రార్థనసమాజ వార్షికోత్సవములయందు, నా కభిరుచి మెండుగ గలిగెను. ఆ దిన ములలో బ్రతి సంవత్సరము సంవత్సరాదినాడు, ప్రార్థనసమాజ వార్షికోత్సవముల సందర్భమున, వీరేశలింగముపంతులుగారు టవును హాలులో నొక సభచేసి, యమూల్యమైన యొక ధర్మోపన్యాసము చదువుచుండిరి. ఆ సభకు నేను పోయి, యుపన్యాసము శ్రద్ధగ విను చుంటిని. ఏటేట సంవత్సరాది వెళ్ళిన తరువాత, మూడవదినము ననో, నాలుగవ దినముననో, వీరేశలింగముగారు సాయంకాలమున,

సారంగధర మెట్టమీదికి వెళ్లి ప్రార్థనము చేయుచుండెడివారు. వారి వెంట ప్రార్థన సామాజికులు, కళాశాలా విద్యార్థులు గలసి రమారమి యేబది యిరువదిమంది మెట్టమీదికి వెళ్ళుచుండెడివారు. వీరేశలింగముగారు కాలినడకమీదనే వెళ్ళెడివారు. శిష్యులు నట్లే నడచి వెళ్ళెడువారు. నేను కూడ నాయుత్సవములకు నడచిపోయెడివాడను. రాత్రి యెనిమిదిగంటలైనతరువాత మెట్టదిగి, వీరేశలింగముగారును, శిష్యులును నడచియే ప్రార్థనగీతములు పాడుకొనుచు, పట్టణముచేరి స్వగృహములకు పోవుచుండెడివారు. సారంగధరుని మెట్టమీద ప్రార్థనమైనతరువాత, మిఠాయి, పకోడీలు మొదలగు నుపాహారములు పంచిపెట్టెడివారు.

ఈ సందర్భమున నా ప్రియమిత్రులైన రెబ్బాప్రగడ పాపయ్యగారిని స్మరింపవలయును. పాపయ్యగారు, పోలవరం జమీందారుగారి సంస్థానములో నుద్యోగముచేయుచు, ప్రార్థనసమాజ వార్షికోత్సవమునకు తప్పక వచ్చుచుండెడివారు. వచ్చి, వీరేశలింగముగారికి శ్రమలేకుండ, కార్యభారము పైవైచుకొని, పురమందిరమున చక్కని తోరణములు, పూలమాలలు కట్టించి, సభల కేర్పాటుచేసెడివారు. సంవత్సరాదినాడు ప్రార్థనసమాజ పక్షమున పేదలకు జరుగు సంతర్పణలో పాల్గొని వంటలుచేయించి, పేదలకు తాను స్వయముగ వడ్డించి, యా కార్యము జయప్రదముగ జరిపి, ప్రార్థన సమయములలో స్వయముగ తంబుర చేతపట్టుకొని, శ్రుతివేసి, తక్కిన సామాజికులతోపాటు తాముకూడ గీతములు పాడుచుండెడివారు. అదిగాకుండ, సారంగధర మెట్టమీదికి గావలసిన మిఠాయి మొదలగు భక్ష్యములను, రెండుబిందెల నీళ్ళను, నీళ్ళు త్రాగుటకు కొన్నిపాత్రలను, రెండు మూడు దీపములను, బండిమీద వేయించుకొని మెట్టమీదకు వచ్చి, ప్రార్థనానంతరమున భక్ష్యములను వచ్చినవారికి స్వయముగ పంచిపెట్టి, మా కందరకు సంతోషము కలుగజేయుచుండెడివారు. పాపయ్యగారు మొదటినుండియు ప్రార్థనసమాజమున సభ్యులు. ఆ సమాజమన్న వారికి మిక్కిలి ప్రీతి. వీరేశలింగముగారు తలపెట్టిన సత్కార్యములన్నిటిలోను, పాపయ్యగారు తోడ్పడుచుండెడివారు. పాపయ్యగారు వీరేశలింగముగారిని దైవము

వలె చూచుచుండెడివారు. పాపయ్యగారు విద్యార్థియైననాటనుండియు వీరేశలింగముగారిమీద మిక్కిలి భక్తి. పాపయ్యగారు పరోపకారమన్న ముందంజ వేసెడివారు. ఒకరికి మేలుచేయుట వారికి మిక్కిలి యిష్టము.

1894 వ సంవత్సరమున సారంగధర మెట్టమీదికి వల్లూరి నరసింహారాయుడుగారు కూడ వచ్చి, బ్రహ్మమతమునుగూర్చి, యింగ్లీషులో గంభీరమైన యుపన్యాసమిచ్చిరి. నేనును, నచ్చటనున్న సభాసదులును, వారి భావములను, వాగ్ధోరణిని విని, చాలసంతోషించి, బ్రహ్మమత వ్యాప్తికాయన జీవితము ధారవోయుదురని భావించితిమి. కాని, కాలక్రమమున వారు గొప్పపదవులలోనికి వెళ్ళినకొలది, వారి యభిప్రాయములు మారజొచ్చెను. వారు బందరులో కృష్ణామండల విద్యాధికారిగ పనిచేసి, యుపకారవేతనము పుచ్చుకొని, రాజమహేంద్రవరమునకు వచ్చి, స్థిరముగ నచ్చట నివాస మేర్పరచుకొన్న తరువాత, మున్ను విగ్రహారాధనముమీద నెంతమాత్రము నిష్టములేని నరసింహారాయుడుగారు, ప్రతిదినము సాయంకాలమున, నిన్నీసుపేటనుండి నడచి మార్కండేయస్వామి వారి యాలయమునకుబోయి, ప్రదోషకాలమున నీశ్వరసందర్శనము చేయునంతటి పూర్వాచారపరాయణులుగ మారిరి. వారు 1941 వ సంవత్సరముననే కాలధర్మమునొందిరి. పరమేశ్వరుడు వారి యాత్మకు శాంతి ప్రసాదించుగాక.

1895 వ సంవత్సరమున జరిగిన ప్రార్థనసమాజ వార్షికోత్సవములో నేనును కొంత పాల్గొంటిని. పరిశుద్ధజీవనమను విషయమును గూర్చి నేనొక ధర్మోపన్యాసమును వ్రాసి, దానిని సారంగధరుని మెట్టమీద, నా శిష్యుడైన దుగ్గిరాల గోపాలకృష్ణారావుచేత జదివించితిని. శ్రోతలు నా యుపన్యాసము మిక్కిలి బాగున్నదని మెచ్చిరి. ఆ యుపన్యాసము కాకినాడలో ప్రకటింపబడుచున్న "రాజయోగి" యను వారపత్రికలో ప్రకటింపబడెను. దాని ప్రతి నాయొద్ద లేకపోవుటచే, నిప్పుడది దుర్లభము. నాయొద్ద నొక చెడ్డయలవాటు గలదు. నేను వ్రాసిన పద్యముల నొక పుస్తకముమీద వ్రాసి దాచియుంచెడు నభ్యాసము నాకు లేదు. అది యొక దురభ్యాసమేగాని, శ్లాఘ్యమైన

పనిగాదు. ఇట్టి యశ్రద్ధచేతనే, నేను వ్రాసిన పద్యములెన్నో యుండి నను, నాదగ్గర వాటి ప్రతులు లేకపోవుట తటస్థించెను. నా మిత్రు డైన వడ్డాది సుబ్బారాయుడుగారికి, స్వరచిత పద్యములన్నిటి నొక పుస్తకము మీద వ్రాసి, జాగ్రత్తపెట్టెడు మంచి యలవాటు గలదు. అందుచేతనే వారు తాము రచియించిన చాటుపద్యముల నన్నిటిని "చాటుపద్య మణిమంజరి" యని పేరుపెట్టి, యొకసంపుటముగ ప్రకటింపగలిగిరి, అట్టి యలవాటు నాకు లేనందుకు నేడు నేను విచారించుచున్నాను. విచారించిన ప్రయోజనమేమి ?

ఆ సంవత్సరము గూడ న్యాపతి సుబ్బారావు పంతులుగారు, నవలలు వ్రాసిన వారికి బహుమానము లిచ్చెదమని ప్రకటించిరి గాని, నే నా యేడు నవల వ్రాయలేదు.

మ్యునిసిపల్ స్కూలులో నే నుపాధ్యాయుడనని వ్రాసితిని గదా ! నెలకు నాకిరువదిరూపాయలు జీతము. మా తండ్రిగారున్న ప్పుడు నాజీతము వారికి నెలనెలకు పంపుచుంటిని. మా తండ్రిగారు పోయినతరువాత, వీరవాసరములోనున్న మా కుటుంబ వ్యయము నకై మా తమ్ముని పేర నెలనెలకు సొమ్ము పంపుచుంటిని. 1895 వ సంవత్సరము డిశంబరు నెలలో, శీతకాలపు సెలవులకు, వీరవాసరము వెళ్ళదలచితిని. అప్పుడు నా మిత్రుడైన చిత్రపు వెంకటనరసింహా రావుగారియొద్ద, వీరవాసరములో మా తండ్రిగారు చేసిన యొక యప్పు తీర్చుకొనుటకై రెండువందల యేబదిరూపాయలు ఋణము చేసితిని. ఈ ఋణమునుగూర్చి యొకమాట వ్రాయవలయును. వీర వాసరములో తాడేపల్లివారని యొక నియోగికుటుంబముండెను. ఆకుటుంబమున జ్యేష్ఠుడు తాడేపల్లి రామయ్యగారు. ఆయన లోకలు ఫండులో నోవరుసీరు ఆయన మకాము తాడేపల్లిగూడెమువద్దనున్న యనంతపల్లి. ఆయనయొద్ద మా తండ్రిగారు కొంత ఋణముచేసిరి. 1886 వ సంవత్సర ప్రారంభమున మా తండ్రిగారు నూటయేబది రూపాయలు తీసికొని యనంతపల్లి వెళ్ళి రామయ్యగారి కిచ్చిరి. ఆయన యేదో పనితొందరమీద నుండుటచేతను, వారికి మా తండ్రి గారికి మిక్కిలి స్నేహమగుటచేతను, మా తండ్రిగారు దస్తావేజుమీద చెల్లు వ్రాయించలేదు. తరువాత నొక సంవత్సరమునకు రామయ్య

గారు గుఱ్ఱముమీదనుండి పడి యకస్మాత్తుగ మృతినొందిరి. వారి కుటుంబము వీరవాసరమువచ్చి స్వగృహమున కాపురముండెను. కొన్ని వ్యవహార సందర్భములచేత, వారికిని మా కుటుంబమునకును విరోధము సంభవించెను. అందుచేత రామయ్యగారి భార్య తనకు మా తండ్రిగారిచ్చిన వసూలు మినహాయించుకొండ, యావత్తు సొమ్మునకు మా తండ్రిగారిమీద నరసాపురము కోర్టులో దావా చేసెను. మేము వసూలు యిచ్చినట్లు లిఖితపూర్వమైన సాక్ష్యము లేనందున, మునసబుగారు యావత్తు సొమ్మునకు మా తండ్రిగారి మీద డిక్రీ యిచ్చిరి. ఆ ఋణము తీర్చుటకై మా తండ్రిగారు మా బంధువునియొద్ద మాభూమి నొకటి తనఖాపెట్టి బదులు తెచ్చిరి. అది 1895 సంవత్సరము డిశంబరు నాటికి వడ్డీతో రెండువందల యేబదిరూపాయలయ్యెను. ఆ ఋణము తీర్చుటకే నేను చిత్రపు నరసింహారావువద్ద బదులుపుచ్చుకొంటిని. ఆ యప్పు నేను మెల మెల్లగా తీర్చుకొంటిని. నరసింహారావుగారియొద్ద తెచ్చిన సొమ్ముతో భూమి తనఖా వదలించి భూమి మా తమ్ముని స్వాధీనము చేసితిని.

ఆ సంవత్సర ప్రారంభమున మా రెండవచెల్లెలైన యచ్చమ్మ కాపురమునకు వెళ్లెను. డిశంబరునాటికామె గర్భవతియయ్యెను. మా బావమరది రామస్వామిగారు గత సంవత్సరము నాటికే మెట్రిక్యు లేషను ప్యాసై, యప్పుడు కొత్తపేట బోర్డుస్కూలులో నుపాధ్యాయుడుగ నుండి శీతకాలపు సెలవులకు మా యింటికి వచ్చెను. ఆ సెలవుదినము లలో, దేవుని యారాధింపులో భోగముమేళములనుపెట్టి యారాధిం చుట గర్హించుచు, నేను కొన్నిపద్యములను వ్రాసితిని. తక్కిన నా చాటుధారాపద్యములవలెనే, యివికూడ ముగ్ధ్యములు. అవి కొన్నిపత్రికలలో పడినవిగాని యాపత్రికలు నేను జాగ్రత్తపెట్టలేదు. శీతకాలపు సెలవుల తరువాత, నేను రాజమహేంద్రవరము వెళ్లితిని. 1896 వ సంవత్సరము ఫిబ్రవరి తొమ్మిదవతేదిని వీరవాసరములో మా రెండవచెల్లెలు ప్రసవించినది. ఆడపిల్ల పుట్టెను. ప్రస్తుతము రాజమహేంద్రవరములో దొరతనమువారి బాలికాపాఠశాలలో నాంధ్రపండితురాలుగానున్న, రావూరి వెంకటసుబ్బమ్మగారే యీ ప్రథమపుత్రిక.

ఆ సంవత్సరమున (1896) న్యాపతి సుబ్బారావు పంతులు గారు నవలలకు బహుమాన మిచ్చెదమని తిరిగి ప్రకటించినందున నే నాసంవత్సరమున "హేమలత" యను నవల వ్రాసి పంపితిని. ఇది చరిత్రాత్మకమైన నవల. పూర్వము తెలుగు నవలలకు వీరేశలింగముగారి ''రాజశేఖర చరిత్రయే" మార్గదర్శకముగ నుండెను. అది చరిత్రాత్మకమైన నవల కాదు. అది సాంఘికమైన నవల. దానిని చదివియే నేను రామచంద్రవిజయమును వ్రాసితిని. చరిత్రాత్మకమైన నవల వ్రాయవలెనని సంకల్పము నాకు గలుగగా, నప్పుడు పూర్వము ''మెడోసు టెయిలర"ను దొరగారు వ్రాసిన నవలలలో టిప్పుసుల్తాను, తార, చాందుబీబి యను నవలలను నా మిత్రుడైన యొక యువకునిచే జదివించుకొని వింటిని. అది విన్నతరువాత చరిత్రాత్మకమైన నవల వ్రాయువిధము నాకు దెలిసినది. అనంతరమున నేను "హేమలత" వ్రాసితిని. ఆ సంవత్సరమునగూడ పోటీకి పది నవలలు వచ్చెను. వీరేశలింగముగారు, వడ్డాది సుబ్బారాయుడుగారు, ఆచంట సుందరరామయ్యగారు నను ముువ్వురు, నవలల గుణాగుణముల నెన్నుటకు పరీక్షకులుగా నియమింపబడిరి. అభిప్రాయభేదంబులు లేకుండ నీసారి పరీక్షకులు ముువ్వురు నా "హేమలత" ప్రథమగణ్యమని తీర్పుచెప్పిరి. ఆ కారణమున సుబ్బారావుపంతులుగారు మొదటి బహుమానమునకు నియమింపబడిన నూట యిరువదియైదు రూపాయలు నాకిచ్చిరి. దీనితో నేను మంచి నవలలు వ్రాయగలనని కొంతపేరు వచ్చెను.

ఆ సంవత్సరమున రెండవ గోదావరీ మండలసభ రాజమహేంద్రవరమున జరిగెను, టవునుహాలుకు తూర్పుదిక్కున నున్న రెండుదొడ్లు కలిపి సభనిమిత్తము పెద్ద పాకవేసిరి. సభ యీ పాకలో సమావేశమైనది. కడపలో న్యాయవాదియు, చెన్నపురిశాసననిర్మాణసభలో సభ్యుడు నైన, శ్రీ జంబులింగము మొదలియారుగారు, సభ కధ్యక్షత వహించిరి. టవునుహాలులో తూర్పుప్రక్కనున్నగది, మహారాజశ్రీ నాళం కామరాజుగారివద్ద కొంతస్థలము, వీరేశలింగముగారు పుచ్చుకొని యీ సంవత్సరమే కట్టించిరి. కట్టినది మొదలిప్పటివరకు బిలియర్డ్సు బల్ల యీ గదిలోనే యున్నది. అప్పుడే కట్టి

టుచేత సభకు వచ్చిన ప్రతినిధుల కందుపాహారములు మొదలగునవి యీయబడెను. సభ మూడుదినములు చక్కగా జరుపబడెను. ప్రాతగోదావరి జిల్లానుండి ప్రతినిధులు విశేషముగ వచ్చిరి. వెనుకటి సంవత్సరపు సభలో వలెనే, నేనీ సంవత్సరపు సభలోగూడ, కొన్ని పద్యములు వ్రాసి చదివితిని. ఈ పద్యములు ప్రస్తుతము నావద్ద లేవు గాని, యివి గతసంవత్సర పద్యములంత చక్కగ లేవని, నామిత్రులు కొందర భిప్రాయపడిరి. ఆ దినములలో రాజకీయసభతోపాటు, మండల సంఘసంస్కరణసభకూడ, జరుపుచుండెడివి. ఈ సంఘ సంస్కరణసభకు మహారాజశ్రీ దురిసేటి శేషగిరిరావు పంతులుగా రధ్యక్షతవహించిరి. ఈ సంఘసంస్కరణ సభలో నేనుకూడ పాలు గొంటిని. మహారాజశ్రీ దాసు శ్రీరాములుపంతులు స్త్రీవిద్యను గురించి, యా సభలో గంభీరమైన యుపన్యాసమిచ్చిరి.

ఆ సంవత్సరమున దుర్ముఖి సంవత్సర పుష్కరము జరిగెను. యాత్రికులకొరకు దొరతనమువారు, కోటిలింగాలవద్ద తాటియాకుల పందెళ్ళు, పాకలు వేయించి, వసతులేర్పరచిరి. ధర్మవరసంస్థానపు ప్రొప్రయిటరులు, మిక్కిలి యుదారశీలురు నయిన శ్రీ కంచుమర్తి సీతారామచంద్రరావు జమీందారుగారు, యాత్రికుల సౌకర్యముల నిమిత్తము, నూతినీళ్లు కుళాయిగొట్టములద్వారా తెప్పించు నేర్పాటు చేసిరి. పుష్కరనగరములో, మంచి మంచి శాటలు వేయించుటలో, వీరు దొరతనమువారికి మిక్కిలి తోడ్పడిరి. ఆ పుష్కరములో వారు మిక్కిలి శ్రమపడిరనుట యతిశయోక్తికాదు. ఇంతియేకాదు. జనోపయోగమైన ప్రతికార్యమునందును శ్రీ రామచంద్రరావుగారు మేను దాచుకొనక, బహు శ్రమపడి పనిచేసి, రాజమహేంద్రవరమునకు మంచి యశస్సు సంపాదించెడివారు. వీరు సంఘసంస్కరణ ప్రియులు. వీరేశలింగముగారియెడల మిక్కిలి భయభక్తులు గలిగి యుండెడివారు. ఆ కారణముచేతనే, వీరేశలింగముగారు తువునహాలుకు ధర్మకర్తల నేర్పరచునప్పుడు, శ్రీ కంచుమర్తి రామచంద్రరావుగారిని యావజ్జీవ ధర్మకర్తగ నేర్పరచిరి. ఆ పుష్కరమునకు గూడ నానాదేశములనుండి యాత్రికులు వేలకొలది వచ్చిరి. ఆ కాలమున రాజమహేంద్రవరములో, "ఎల్ఫిన్‌స్టన్" దొరగారు సబుకలె

క్రమగ నుండిరి. ఈయన తక్కిన యుద్యోగస్థుల వంటివారు కారు. మానవసేవా పరాయణులు, పరోపకార తత్పరులు. ఈయన, గోదావరి రేవులలో జనులు పడిపోకుండ, కర్రదూలములతో మెట్లుకట్టించి జారిపడకుండ రేవులలో దూలములుపాతించి, బహు సౌకర్యములు గావించిరి. పుష్కరములో విషూచి జాడ్యములుకూడ బయలు దేరెను. ఈ దొరగారు స్వయముగాపోయి పరిశుభ్రము చేయించి, విషూచిజాడ్య పీడితులకు మందులిప్పించి, యెన్ని విధములచేతనో ప్రజల కృతజ్ఞతకు పాత్రులైరి.

ఆ సంవత్సరమున మా పురప్రముఖులలో నొకరైన (శ్రీ) చల్లపల్లి రంగయ్య పంతులుగారు, మ్యునిసిపల్ సభ్యులుగనుండి, దొరగారు ప్రజాక్షేమముకొరకు చేసినపనియెల్ల గుర్తించి, వారిని గౌరవించుటకొక సభ గావించి, వారిమీద కొన్ని పద్యములు రచింపుమని నన్ను గోరి, నాచేత గొన్ని పద్యములు చేయించి, యాసభలో నెవరిచేతనో చదివించి సంతసించిరి. విన్నవారందరు పద్యములు చాల చక్కగా నున్నవని నన్ను శ్లాఘించిరి. రంగయ్య పంతులుగారా పద్యముల నచ్చువేయించి జనులకు పంచిపెట్టించిరి. రంగయ్య పంతులుగారు, డిస్ట్రిక్టు మునసబుపనిచేసి, పింఛను పుచ్చుకొని, కొంతకాలము మ్యునిసిపల్ సభ్యులుగాను, కొంతకాలము తాలూకాబోర్డున కుపాధ్యక్షులుగను, పనిచేసిరి. మునసబుగనున్న కాలమున, వీరు లంచమన్న దెరుగక, మిక్కిలి న్యాయముగ బ్రవర్తించి ఖ్యాతి గడించిరి. ఈయన 1906 వ సంవత్సరమునస్వగృహములో కాలధర్మమునొందిరి. ఈయన మోడేకుర్రులో వేదసంస్కృత పాఠశాల నొకటి స్థాపించి, పండితులకు జీతములిచ్చి, చనిపోవువరకు పాఠశాల నడపిరి. ఆకారణమున వీరు వందనీయులు.

1896 వ సంవత్సరమున సెప్టెంబరు నెలలో రాజమహేంద్రవరమున నొక గొప్పమార్పు జరిగెను. దొరతనమువారి కళాశాలలో ప్రథానాచార్యులుగ నుండిన మెట్కాఫ్ దొరగారు పింఛను పుచ్చుకొని సీమకు వెళ్ళిరి. ఆయన 1876 వ సంవత్సరము డిశంబరు నెలలో రాజమహేంద్రవరము వచ్చిరి. వారు వచ్చునప్పటికి రాజమహేంద్రవర విద్యాశాల యున్నత పాఠశాలగ నుండెను. అప్పుడు దానికి

శ్రీ చంగల్వల కుప్పుస్వామి శాస్త్రిగారు ప్రధానోపాధ్యాయులుగ నుండిరి. మెట్కాఫ్‌గారు మొట్టమొదట ప్రధానోపాధ్యాయులుగ వచ్చి క్రమక్రమముగ దానినే పెద్ద కళాశాల చేసిరి. బోధనాభ్యసన కళాశాల కూడ స్థాపించిరి. ఆంధ్ర మండలమునకు ముఖ్యముగ నుత్తర సర్కారులకు, మెట్కాఫ్ దొరగారు విద్యావిషయమున చేసిన మహోపకారము తరతరములవరకు మరువదగినది కాదు. పేదవిద్యార్థులకు విద్యాభ్యసనము నిమిత్తము గొప్పనిధి నేర్పరుచేసి, యీ నిధి నుండి విద్యార్థులకు సొమ్మిచ్చి, యెందరో పేదవిద్యార్థులను పట్ట పరీక్షా సిద్ధుల జేసెను. ఆయన రాజమహేంద్రవరమున నిరువది సంవత్సరములు (అనగా 1876 - 1896) వరకు కళాశాలా ప్రధానాచార్యులుగ పనిచేసిరి. అక్కడనుండి యొక్కసారియైన బదిలీకాలేదు. గోదావరి యన్నను రాజమహేంద్రవరమన్నను వారియందు మిక్కిలి ప్రీతి. వారు పింఛను పుచ్చుకొని, సీమ వెళ్లినతరువాత, లండను నగరమున నొక భవనము నిర్మించుకొని, దానికి "గోదావరీ భవనము" (Godavari House) అని పేరుపెట్టిరి. వారికి రాజమహేంద్రవరముమీఁద గల ప్రీతికిదే గొప్ప యుదాహరణము. 1896 వ సంవత్సరము యేప్రియలు నెలలో, వీరు రాజమహేంద్రవరము విడిచి వెళ్ళినప్పుడు, వారి గౌరవార్థము వారి ప్రాతశిష్యులు, క్రొత్త శిష్యులు, పురప్రముఖులు గలసి గొప్ప యుత్సవము చేసిరి. కళాశాలాభవనము మొదలు మ్యూజియమువరకు నెన్నో పందిళ్ళు వేయబడెను. తోరణములు కట్టబడెను. కాగితపు బుట్టలు వ్రేలాడవేయబడెను. శిష్యులును, పురప్రముఖులును మెట్కాఫ్ దంపతులను, గుఱ్ఱపుబండిమీఁద గూర్చుండబెట్టి, జేజేధ్వనులతో మంగళవాద్యములతో నూరేగించిరి. ఆమహోత్సవము గవర్నరులకు గూడ జరుగదనుట యతిశయోక్తిగాదు. అది హృదయమునుండి వచ్చిన కృతజ్ఞతాపూర్వక ప్రేమ. సాయంకాలము మ్యూజియమావరణలో గొప్పసభ జరిగెను. ఆ సభ కప్పుడు జిల్లాజడ్జిగ నుండిన ముకంజీ దొరగారధ్యక్షతవహించిరి. పురప్రముఖులనేకులు, దొరగారియోగ్యతను గూర్చియు, సామర్థ్యమునుగూర్చియు వారాంధ్రదేశమునకు చేసిన మహోపకారమును గూర్చియు, బహువిధముల ప్రశంసించిరి. అప్పుడు శ్రీ నడ్డాది సుబ్బారాయుడుగారు

కొన్ని పద్యములు రచించి చదివిరి. దొరగారియెడల నాకుగల భక్తి తెలియ జేయుటకై నేనును గొన్ని పద్యములు రచియించి సభలో చదివితిని. నా పద్యములకన్నను సుబ్బరాయుడుగారి పద్యములెక్కువ మనోహరములుగ నుండెను.

ఆ సంవత్సరము జూను నెలలో, మా మునిసిపల్‌స్కూలుకు ప్రధానోపాధ్యాయులైన వల్లూరి నరసింహనాయుడుగారు, పనిమాను కొని, యెక్కువ జీతమువిూద శ్రీకాకుళము వెళ్లిరి. ఆయనస్థానమం దప్పటి మ్యునిసిపల్ సభాధ్యక్షులైన నిడమర్తి జలదుర్గప్రసాదరాయు డుగారు, పట్టపరీక్షాసిద్ధులైన చేబియ్యము వేంకటరామయ్యగారిని, ప్రధానోపాధ్యాయులుగ నియమించిరి. ఆయన బోధనాభ్యసనము నొందినవారుగారు. ఈ వేంకటరామయ్యగారు పూర్వము హనుమం తరావునాయుడుగారివద్ద చదువుకొన్న శిష్యుడు. నాకు మిక్కిలి మిత్రుడు. నాకేగాదు, వేంకటరామయ్యగారు సర్వజనమిత్రుడు. ఎంతో మంచివాడు. ఆయనగూడ శ్రీ రాయవరపు అప్పారావుగారి యింటనే గాపురముండెను. నేనును రాయవరపువారి యింటనే యుం డుటచేత మా యిరువురకును మైత్రి హెచ్చెను.

ఈ సంవత్సరమున (1896) మాకుటుంబమున కొక కష్టము గలిగెను. మాతండ్రిగారి సంవత్సరీకమునకు నేను వీరవాసరము వెళ్లి తిని. ఆ సంవత్సరీకములో మూడవరోజున జాబుపట్టుకొని యొకమను ష్యుడు వచ్చెను. నా పెదచెల్లెలి పెనిమిటియైన యద్దంకి వేంకట రామయ్యగారికి జబ్బుగనున్నదనియు, వెంటనే యందరు బయలు దేరి రావలసినదనియు, మా చెల్లెలు వ్రాయించిన జాబది. జాబు లోని విషయములు తెలిసినవెంటనే మా కందరకు గుండెలలో రాయిపడెను. త్వరగ భోజనములు ముగించి, యానాటి మధ్యా హ్నమే బయలుదేరి, విచారపూరితములైన హృదయములతో నెట్టెటో సాయంకాలమునకు, నరసాపురము జేరితిమి. మా చెల్లెలు పూర్ణమ్మ మిక్కిలి బెంగపెట్టుకొని యుండెను. కీడులో మేలన్నట్లు మా పినతల్లియు, నామె పెనిమిటియైన ముల్లంగి వెంకయ్యగారును సంవత్సరీకముల నిమిత్తము మాలమూరునుండి వీరవాసరము వచ్చినం దున, వారుగూడ మాతో నరసాపురమువచ్చిరి. మా బావగారిస్థితి

మేము వెళ్ళినప్పటి కెంతమాత్రము బాగులేదు. జ్వరము తీవ్రముగ
గాయుచుండెను. రాత్రిలు నిద్రలేదు. లేచినప్పుడు కన్నులు దిరుగు
చుండెను. ఆజబ్బుజూచి నేను భయపడి, యింగ్లీషుమందు నిప్పింప
వలెనని, నాకు రాజమహేంద్రవరములో మిక్కిలి పరిచితుడై
యుప్పుడు నరసాపురములో డాక్టరుగ నుండిన పజాన్ సాహేబుగారిని
జూచి, మాబావగారికి మందిమ్మని కోరితిని. ఆ సాహేబుగారు
మిక్కిలి మంచివారగుటచే, మా బసకువచ్చి రోగినిజూచి. మందిచ్చె
దనని చెప్పిరి. కాని యామందు మా బావగారి నోటబడలేదు. మా
పినతండ్రి కాయుర్వేదవైద్యముమీదనేగాని యింగ్లీషువైద్యముమీద
విశ్వాసములేనందున, నామాట సాగనియ్యక, యుతడు పుస్తకాలా
నుండి మాటలునేర్చిన యొక తెనుగువైద్యుని బిలిచి మందిప్పింప
నాగెను. కాని మందుదారి మందుదేయయ్యెను. రోగముదారి రోగ
ముదేయయ్యెను. మా పినతండ్రి మాకు ధైర్యము చెప్పసాగెను.
రోగము నానాటికి హెచ్చెను. మాబావగారికి సంధించెను. మొదట
రాత్రియే పేలిజొచ్చెను. కాని పిదప పగలుకూడ పేలిజొచ్చెను.
వైద్యులు లంఘనముగట్టుటచే నీరసము హెచ్చెను. జ్వరాతిసారము
బుట్టెను. నేను భయపడి నా మేనమామగారికి జాబువ్రాసితిని.
ఆయన అమలాపురమునుండి, కష్టపడి నరసాపురమువచ్చిరి. ఆయన
రాకతో మాకు కొంత ధైర్యముగలిగెను. ఆదినములలో నామనసు
విచారాక్రాంతమైనపుడు, పూర్వము నాగురువులై యుప్పుడచ్చట
న్యాయవాదులుగనుండిన, వలివేటి భాస్కరశాస్త్రిగారింటికి నేను
తరుచుగ బోయి, వారిసలహాను బుచ్చుకొనుచుంటిని. అప్పుడు నా
మిత్రులైన కూచి నరసింహముగారు, బొయిలకు పాఠశాలకు ప్రధా
నోపాధ్యాయులుగనుండినందున, వారికడకుకూడ నప్పుడప్పుడు బోవు
చుంటిని. అప్పుడు వారు రామకృష్ణపరమహంసగారి ధర్మోపదేశము
లను పద్యములుగ రచియించుచుండి, నాకు వాటిని వినిపించుచుం
డెడివారు. మరియు నామిత్రులైన కొవ్వలి వేంకటశివరావుగారికడ
కును, అడ్డంకి ముఖ్యప్రాణరావుగారి యింటికినిబోయి మనశ్శాంతి
నొందుచుంటిని. మా దురదృష్టము పండినందున, మా బావగారు,
దుర్ముఖిసంవత్సర భాద్రపద బహుళ చతుర్థి శనివారమునాటి యుద

యమున, లోకాంతర్గతులైరి. మాబావగారికి సంతానము లేనందున, మా చెల్లెలిమీద కర్తవ్యముబెట్టి, మాతమ్ముడు కృష్ణమూర్తియే కర్మచేసెను. ఆదినము 1896 వ సంవత్సరము సెప్టెంబరు, 24 తేదీ యని నాకు జ్ఞాపకము. మాబావగారు కాపురమున్నది యుద్దెయిల్లగుటచే, మాబందుగులందరు కర్మ, వీరవాసరములో చేయింపనిశ్చయము జేసిరి. ఈవిధముగ మాతండ్రిగారి వియోగముచేత గలిగిన దుఃఖవ్రణము మనసున మానకమునుపే, సంవత్సరముననే పిడుగు వలె ఘోరదుఃఖము మాకుటుంబముపైబడెను. సంవత్సరమునుండి వైధవ్యదుఃఖమనుభవించుచున్న తల్లికి, మరింత దుఃఖహేతువైన, వైధవ్యభారముచే గ్రుంగిన కూతురు తోడయ్యెను. మావాండ్రినందర వీరవాసరము బొమ్మని యేర్పాట్లుజేసి, నాకు సెలవు లేనందున, నేనొకటవ యక్టోబరునాటికి, రాజమహేంద్రవరము వెళ్ళి పనిలోజేరితిని. కాని నామనసు కొన్నాళ్ళవరకు దుఃఖపూరితమై యుండెను. ఆసంవత్సరము నవలలలో నాకు మొదటి బహుమానమువచ్చిన దన్న సంతోషము లేకపోయెను. నాకువచ్చిన "హేమలతా" బహుమానము నుండి, కొంతసొమ్ముతో . చిత్రపు నరసింహారావుగారి యొద్ద నేజేసిన ఋణములో గొంత దీర్చితిని. మాబావగారు చాల భూమి సంపాదించిరిగాని వానిలో జిరాయితీలెక్కువ, చెల్లించవలసిన పన్నులుగూడ నెక్కువే. ఆయన చనిపోవునప్పటికి కొంతఋణము కూడ నుండెను. మాపినతండ్రిగారు దుఃఖములోనున్న మాకుటుంబమునువిడిచి వెంటనేవెళ్ళక, భార్యాసమేతముగ కొంతకాలము వీరవాసరములో మాయింటనుండిరి. ఆయన సాయమున, మాతమ్ముడు మాబావగారి భూములు కొన్ని విక్రయించి, ఋణములు కొన్ని తీర్చెను.

1896 వ సంవత్సరము డిశంబరు నెలలో శీతకాలపు సెలవులలో నేను వీరవాసరము వెళ్ళితిని. భర్తృవియోగ దుఃఖమున మిక్కిలి గుందుచున్న మా సోదరి నోదార్చుటకే, నేను వీరవాసరము వెళ్ళుటకు ముఖ్యకారణము. ఆసెలవు దినములు వ్యర్థముగ గడుపకుండ నేను "హిందూదేశపు వీరవనితలు" (Heroines of India) అను నింగ్లీషు గ్రంథమును, నాతోగూడ రాజమహేంద్రవరమునుండి పట్టుకొని

వెళ్లి, నా చిన్న బావమరదియైన మధునాపంతుల రామస్వామిచేత.
చదివించుకొని వింటిని. అది యింగ్లీషులో మన్మథనాథ దత్తుగారిచే
వ్రాయబడిన గ్రంథము. అందనేక కథలుగలవు. వానిలో సంయుక్తా
దేవి కథకూడ నుండెను. ఆకథ రసవంతమై నామనసు నాకర్షించుట
చేత, దానిని నేను తెనుగులో నొక చిన్న పద్యకావ్యముగ వ్రాయ
వలయునని, సంకల్పించితిని. మా పాఠశాలకు మఱుసటి సంవత్స
రము జనవరి 17 తేదీవరకు సెలవు లుండుటచే, నేనాదినములలో
"పృథ్వీరాజీయ"మని పేరుపెట్టి సంయుక్తాదేవి కథలో రమారమి
నూరు పద్యములు వ్రాసితిని. ఆదినములలో ఘేరము జగన్నాథముగా
రనువారు, మా గ్రామమునకు రెవిన్యూ యినస్పెక్టరుగ నుండిరి.
ఆయన మిక్కిలి మంచివారు. గతసంవత్సరము మా తండ్రిగారు చని
పోయినపుడు వారు మాకెంతో సాయము జేసిరి. మొక్కపాటి సుబ్బా
రాయుడుగారు, ఘేరము జగన్నాథముగారికి మేనల్లుడు నల్లుడు
గూడను. అప్పుడు సుబ్బారాయుడుగారు, సెలవు దినములలో మేన
మామగారింటికి వచ్చిరి. ప్రతిసంవత్సరమాయన మేనమామగారిం
టికి వచ్చుచుండుటచే, సుబ్బారాయుడుగారికిని, మా తమ్మునకును
స్నేహమాయెను. ఆ మైత్రిచే వారు మాతమ్మునిజూచుట కప్పుడప్పుడు
వచ్చుచుండుటచే, నాకుగూడ వారితో బరిచయమయ్యెను. ఆంధ్ర
సారస్వతమునందు సుబ్బరాయుడుగారికి మిక్కిలి యభిరుచిగలదు.
వారు (శ్రీ) రఘుపతి వేంకటరత్నమునాయుడుగారి శిష్యులగుటచే
నాంగ్లేయభాషలోగూడ మంచి పాండిత్యము గలదు.

సుబ్బారాయుడుగారు నా "పృథ్వీరాజీయము"లోనిపద్యములు,
నేను వ్రాయుచున్న కాలములోనే విని సంతసించి, వ్రాయుమని
నన్ను ప్రోత్సాహపరచుచు వచ్చిరి. సుబ్బారాయుడుగారు, పిఠాపుర
ములో మహారాజుగారియొద్ద నాంతరంగిక కార్యదర్శి (Private
Secretary) గాను, పిమ్మట మంత్రిగాను, పనిచేసినప్పుడుకూడ నన్ను
గలసికొన్నపుడు, ప్రేమాతిశయములు గలిగి యాదరించి, గౌరవించి,
"పృథ్వీరాజీయము" మిక్కిలి బాగున్నదనియు, దానిని సమాప్తము
చేసి ప్రకటింపకపోవుట తప్పనియు, నాతో నెన్నిసారులో చెప్పిరి.
1899 వ సంవత్సరమునాటికి నేను "పృథ్వీరాజీయము"లో రెండా

శ్వాసములు వ్రాసితిని. ఆ పద్యములు రెండువందలయ్యెను. ఆగ్రంథ మంతయు నేనొక పుస్తకములో నెక్కించి తాళములేని యొకపెట్టెలో బెట్టితిని. అది పనికిమాలిన పుస్తకమనుకొని, నా పెద్దమేనకోడలు రావూరి వెంకటసుబ్బమ్మ చింపివేసెను. "పృథ్వీరాజీయ" మావిధముగ నామావశేషమయ్యెను. తిరిగి నేను దానిని వ్రాయుటకు ప్రయత్నింపలేదు. అందులోని పద్యములు కొన్ని మనోహరములుగానే యుండెను. పుస్తకము నాశనమైనను దానిమీద ప్రేమ నాకిప్పటికిని పోలేదు. మృతినొందిన బాంధవునికై విచారించుట యెట్టిదో, నాశనమైన పుస్తకమునకై విచారించుట యట్టిదేకదా ?

1897 వ సంవత్సరమున గూడ న్యాపతి సుబ్బారావు పంతులుగారు, మేలైన నవలలు వ్రాసినవారికి బహుమానములను మునుపటివలెనే ఇచ్చెదమని ప్రకటించిరి. ఆ సంవత్సరము నే నూరకుండక ''అహల్యాబాయి'' యను నవలను వ్రాసి పంపితిని. గ్రంథపరీక్షకులు వీరేశలింగముగారు, ఆచంట సుందరరామయ్యగారును. ఆ సంవత్సరము పోటీపరీక్షకు నవల లెన్నివచ్చెనో నాకు జ్ఞాపకము లేదు. గాని, వచ్చిన నవలలన్నిటిలో నా "యహల్యాబాయి"కే మొట్టమొదటి బహుమానము వచ్చెను. లక్ష్మీనరసింహముగారు నవల వ్రాసిపంపిన సంవత్సరము, వారికేగాని మరియెవరికిని బహుమానము రాదని, లోకములో నొక వాడుకపడెను. నవలల పోటీపరీక్ష యా సంవత్సరముతో సమాప్తమయ్యెను. ఈ నవలలు వ్రాయుటవలన నాకు ధనలాభమేగాక సాధారణపు నవలలు చరిత్రాత్మకమైన నవలలు వ్రాయుటకు శక్తియు నుత్సాహమును గలిగెను. పోటీపరీక్ష సమాప్తమని నేననుటకు గారణమేమన, చింతామణీ పత్రికా ప్రకటనముచేతను, నంము గద్యపద్య గ్రంథములనేకములు ప్రకటించుట చేతను, నవలలకు బహుమానము లిచ్చుటచేతను, సుబ్బరావుపంతులు గారికి చాల ధనము వ్యయమయ్యెను. ఆ వ్యయమున కాయన విచారించలేదు. పత్రికా ప్రకటనమున నాయనకు మిక్కిలి సహాయభూతులైన వీరేశలింగముగా రాసంవత్సరము చెన్నపురికి బోదలచుటచే, చింతామణీ పత్రిక యప్పటినుండి చెన్నపట్టణములోనే ప్రకటింపబడుననియు, నవలలు వ్రాసెడివారు పంపవచ్చుననియు, మేలైన

నవలలకు మునుపటివలె ధనబహుమానము లీయబడవనియు, గ్రంథకర్తలకు కొన్ని ప్రతులు అచ్చువేసి యివ్వబడుననియు, సుబ్బారావు పంతులుగారు ప్రకటించిరి. అందుచేత నేనప్పటినుండియు పోటీకి నవలలు పంపుట మానితిని.

1896 వ సంవత్సరం డిశెంబరులో వీరేశలింగముగారు తంజావూరు నగరమునకు నముద్రితాంధ్ర గ్రంథములను సంపాదించుటకై వెళ్ళిరి. ఆ పురమును తెలుగునాయకులు పరిపాలించినప్పుడు యమూల్యమైన యాంధ్రగ్రంథ భాండార మొకటి సంపాదించియుంచిరి. మన దేశములో నెచ్చటను దొరకని యాంధ్రగ్రంథము లనేకములచ్చట దొరకుచు వచ్చెను. నాచనసోముడు రచియించిన "యుత్తరహరివంశ"మను మహాకావ్యము, తెనుగుదేశమున నెవరెంత ప్రయత్నించినను దొరకినదికాదు. వీరేశలింగముగారు తంజావూరి గ్రంథభాండారములోని పుస్తకముల జాబితా తెప్పించిచూడగా, నందులో నాచనసోముని యుత్తరహరివంశముయొక్క వ్రాతప్రతి యొకటి యున్నట్లు కనబడెను. ఆ గ్రంథము నశించిపోయినదని చింతించుచున్న వీరేశలింగముగారికి, యిదొక పెన్నిధి దొరకినట్లయ్యెను. వెంటనే వారు వ్యయప్రయాసములకు లోనై తంజావూరుపోయి, యప్పుడచ్చట మండల న్యాయాధిపతిగ నుండిన "హామ్నెటు" (Hamnet) దొరగారి సహాయ్యమున, నెవరిచేతనో "యుత్తరహరివంశము"న కొక ప్రతి వ్రాయించి, తెప్పించి, తమ వివేకవర్ధనీ ముద్రాక్షరశాలలో దానిని ప్రకటింప నారంభించిరి. నాచనసోముని కవిత్వము, కవిత్రయము వారి పాకముకంటెను మిన్నగనుండుననని "శబ్దరత్నాకర" నిర్మాతలైన బహుజనపల్లి సీతారామాచార్యులుగారును, వీరేశలింగముగారును వ్రాయుటచేతను, నాచనసోముడు మూడవకన్ను దాచివచ్చిన శివుడే యని పూర్వము చిన్నయసూరిగారు మెచ్చుటచేతను, సోముని కవిత్వ మెంత బాగుండునో చూడవలెనన్న కుతూహలము మిక్కుటమగుట చేతను, గ్రంథము ప్రకటింపబడినదాక వేచియుండుటకు నా కోపిక లేక, నే నొక చిన్న దొంగతనము చేసితిని. చేసినపాపము చెప్పిన పోవునని మనలో నొక సామెతగలదు. దానింబట్టి నా తప్పు నేనొప్పుకొనుచున్నాను. పాఠక మహాశయులు నన్ను క్షమింతురుగాక.

ఆ దినములలో వివేకవర్ధనీ ముద్రాక్షరశాలకు నా మిత్రుడైన కోపల్లె శేషగిరిరావు పరివర్తకుడు (Manager) గ నుండెను. నేనాతని నాశ్రయించి యొక్కొక ఫారము (ఎనిమిదిపుటలు) యచ్చుపడగనే, వీరేశలింగముగారికి తెలియకుండ, శేషగిరిరావు నడిగి తెచ్చుకుని యింటివద్ద నెవరిచేతనో చదివించుకొని విని, ముఖ్యమైన పద్యములు కొన్ని వల్లించితిని. గ్రంథ ముద్రణము సమాప్తమైన తరువాత వీరేశలింగముగారు నా కొక పుస్తకమును బహుమాన మిచ్చిరి. అప్పుడు నేను నా కదివరకే దానిలోని పద్యములు పెక్కువచ్చునని వారితో చెప్పితిని. ఎట్లు వచ్చునని నన్ను వారడిగిరి. నేను దాచక వారి కార్యస్థానమున నే జేసిన దొంగతనము వారి యెదుట నొప్పుకొని క్షమింపుమని యడిగితిని. వారు కోపపడక నవ్వి యూరకుండిరి. ఆ మహాత్ముని భాషాభిమానముచేతనే, మున్ను నశియించినదని చెప్పుకొన్న యుత్తరహరివంశము, మన యాంధ్ర సారస్వతమున కలంకారమై ప్రకటింపబడెడు భాగ్యము గలిగెను. వీరేశలింగము గారు మన యాంధ్రమండలములకు జేసిన మహోపకారములలో నిది యొకటి. నా చేసిన దొంగతన మిది యొకటియే కాదు. మరియొకటి కూడ గలదు. అది వడ్డాది సుబ్బారాయుడుగారి "వేణీసంహారము" విషయమున, నేను రాజమహేంద్రవరము వచ్చిన క్రొత్తలో నొక నాడు సుబ్బారాయుడుగారి యింటికి వెళ్ళి వారుచదువుచుండగ "వేణీ సంహారము"లో కొంతభాగము వింటిని. ఆ దినములలో సుబ్బారా యుడుగారు ''హిందూ నాటకోజ్జీవక సమాజ''మని యొక నాటక సమాజమును స్థాపించి నాటకము లాడించుచుండిరి. వారొకసారి ''వేణీసంహారము''ను నాడిరి. ఆనాడు కనుపర్తి శ్రీరాములు గారశ్వత్థామ పాత్రను, వడ్డాది సుబ్బారాయుడుగారు ధర్మరాజు పాత్రను, సుసర్ల శ్రీనివాసరావుగారు ద్రౌపది పాత్రను, సుసర్ల అనంతరావు గారు దుర్యోధనుడు పాత్రను ధరించిరి. ఆనాడు నే నా నాటకము నకు వెళ్ళితిని. శాంతరసము కరుణరసము నుట్టిపడునట్లు సుబ్బారా యుడుగారు ధర్మరాజుపాత్ర నభినయించిరి. ఇదియేగాదు, సుబ్బా రాయుడుగా రొకమారు తమ నాటకములో నశ్వత్థామపాత్రనుగూడ ధరించిరి. అశ్వత్థామ పాత్ర ధరించినపుడు వీరరౌద్రరసములును—

ధర్మరాజుగ నున్నప్పుడు శాంతికరుణారసములను, నానావిధ ప్రేక్షకులు మరువరు. నేనుజూచిన "వేణీసంహార" నాటకప్రదర్శనములో నాటకాంతమున గ్రంథములో లేని యొక దండకముతో శ్రీకృష్ణుని స్తవముచేసిరి. ఆ దండకము ముక్కుతిమ్మన చేసిన "పారిజాతాపహరణము"లోనిది. పద్యములు చదువుటలోను, దండకములు చదువుటలోను, మిక్కిలి నేర్పుగల సుబ్బారాయుడుగారి నోటనుండి విని నప్పుడు నా యొడలు పరవశమయినది.

మరునాటి యుదయమున నేను బజారునకు బోయి "పారిజాత" ప్రబంధమును మూడణాలిచ్చి కొని యెనుబది పంక్తులలోనున్న యా దండకమును నే నొక్కపూటలో వల్లించితిని. వల్లించి యేబది సంవత్సరము లయినను నాకది యిప్పటికిని పూర్తిగ జ్ఞాపకమున్నది. నా శరీరదౌర్బల్యము లెన్ని యున్నను భగవంతుడు నాకు బరిపూర్ణకటాక్షముతో జ్ఞాపకశక్తి మెండుగనిచ్చెను. సుబ్బారాయుడుగారు, తమ "వేణీసంహార" నాటకమును, వీరేశలింగముగారి వివేకవర్ధనీ ముద్రాక్షరశాలలో నచ్చొత్తించిరి. గ్రంథమంతయు నచ్చుపడి వచ్చినదాక, కనిపెట్టుకొని యుండుటకు నా కోపిక లేక, ముద్రణములో నుండగనే, యచ్చుపడిన కాగితము లోకమిత్రుని చేత రహస్యముగ దెప్పించి, పద్యములు ముందే వల్లించితిని. "వేణీసంహారము"లోని పద్యములన్నియు నాకిప్పటికిని జ్ఞాపకమున్నవి. "వేణీసంహార"మన్న నాకు మిక్కిలి ప్రీతి. ఆ యొక్క పుస్తకము మీదనేగాదు. సుబ్బారాయుడుగారి గ్రంథములన్నియుగూడ నాకు ప్రియములే.

నాకుగల యేకసంథాగ్రహణశక్తినిబట్టి నాకు సుబ్బారాయుడుగారు, "ఛాయాగ్రహణ యంత్రమ"ని (కెమేరా) పేరుపెట్టిరి. సాధారణముగ నెవరైన పద్యమొకసారి చదివిన పక్షమున, నాకది వెంటనే కంఠస్థమయ్యెడిది. 1897 వ సంవత్సరమున నే నొకనాటి మధ్యాహ్నము సుబ్బారాయుడుగారి యింటికి బోతిని. ఆ సమయముననే, నిడమర్తి దుర్గయ్యగారును, బోడపాటి రామలింగేశ్వరప్పగారును, వేలూరి వేంకటాద్రియయ్యగారును, సుబ్బారాయుడుగారింటికే వచ్చిరి. అప్పుడు సుబ్బారాయుడుగారు "లక్ష్మీనరసింహముగా రేకసంథాగ్రాహి" యని వారితో చెప్పిరి. పరీక్షించుటకు నేనే నొక గ్రంథము

తెచ్చి యొక పద్యము చదువుమని, వారు వసురాయనితో చెప్పిరి. వెంటనే వసురాయుడు లోనికిబోయి కళాపూర్ణోదయము దెచ్చి యందులోని యీక్రింది పద్యమును గంభీరముగ నొక్కసారే చదివెను.

శా॥ గంధర్వుండవు జాతియెంచగ శుభాకారంబు చంద్రత్రపా
సంధాన క్షమమద్వితీయుడ వికన్ సంగీతసాహిత్య ధౌ
రంధర్యంబున సజ్జనుండ వసురప్రద్వేషి భక్తుండవున్
బంధంబొక్కటిగల్గె శాపమనగ న్నాయన్న నీకుణ్ దుదిన్.

ఈ పద్యమును నేను వెంటనే మరల చదివితిని. సుబ్బారాయుడుగారి మాట నిజమేయని వారు మువ్వురు సంతసించి వెడలిపోయిరి. సుబ్బా రాయుడుగారి నోటనుండి "వేణీసంహారము" నేను మొదట విన్నపుడు వారిమీద నీ క్రింది వెర్రిమొర్రి పద్యము నల్లితిని. చిన్ననాటి నా కవిత్వమున కిది యొక యుదాహరణము కావచ్చును.

కం॥ వేణీసంహారంబును
వాణీధవతుల్యుడైన వసురాయుడుతా
నాణెముగా తెనిగించెను
ప్రాణంబులు లేచివచ్చు పద్యము విన్నన్.

1897 వ సంవత్సరమున విక్టోరియారాజ్ఞిగారికి గొప్ప యుత్సవము జరిగెను. దానిపేరు వజ్రోత్సవము (Diamond Jubilee) మహారాజ్ఞిగారు సామ్రాజ్య మరువదియేండ్లు పాలించినందుకీ యుత్సవము జరుపబడినది. పాశ్చాత్యుల సాంప్రదాయమునుబట్టి, యేబదియేండ్లు పరిపాలించిన రాజునకుగాని, రాణికిగాని, సువర్ణోత్సవమని (Golden Jubilee) ప్రజలు చేయుదురు. అరువదియేండ్లు పాలించిన వారికి వజ్రోత్సవము (Diamond Jubilee) చేయుదురు. విక్టోరియారాణిగారు 1837 సంవత్సరమున సింహాసన మెక్కినందున 1897 సంవత్సరమున కరువదియేండ్లు పరిపాలనము పూర్తియైనది. కాబట్టి యింగ్లాండులోను, సామ్రాజ్యమంతటను గొప్ప యుత్సవములు జరిగెను. రాజమహేంద్రి వరములోగూడ గొప్ప యుత్సవములు జరిగెను. ఆ యుత్సవ సందర్భమున పురమందిరములో (Town Hall) నొక పెద్దసభ జరిగెను. ఆ సభకు గోదావరి జిల్లాకలెక్టరుగారగు "బ్రాడి" దొరగారధ్యక్షత వహించిరి. ఆ సమయమున శ్రీ న్యాపతి సుబ్బరావుపంతులుగారు, శ్రీ మాదిరెడ్డి

వేంకటరత్నమునాయుడుగారు, కడుమహారాణి విక్టోరియాకాలముననే పెద్దలు శ్రీ విక్టోరియారాణిగారి పరిపాలనమును గురించి ప్రశంసించుచు మాటలాడిరి. అప్పుడు నే నీక్రింది పద్యములు రచియించి సభలో చదివితిని.

సీ. "ఏ మహాదేవి మహీపాలనము మాట
ప్రసక్తి ప్రసక్తి గోపాల
యే జగద్వందిత యేల్బడి మనకు
చిరతరానందంపు చిత్తజల్లు
బహుపుత్రపౌత్రలాభసుఖాప్తిగన్న, యే
గరితమిన్న కడుపు కంపపెరడు
కటకలమర్త్యారాతికోటి కేసరి జడు
ఘోరిభాంకరణంబు పిల్లపిడుగు
యే నృపార్చితవిజయుల క్రీమటన క
ఖండభరతఖండంబు రంగస్థలంబు
అమహనాహాన విక్టోరియాభిధాన
శ్రీమహిత నిత్యకళ్యాణి సీమరాణి" 1

సీ. "ప్రినాప్రుసే"ల్సను విమలశారదచంద్రుఁ
గడుపున్నట్లుగ మున్నుగాంచె నిన్నె
విపులశాఖలనొప్పు విమలసంతాన
కల్పమహీజముల కాలవాల మెన్నె
విబుధకోటిని బ్రోచు విశ్రుతకృపయను
నమృతంబు పుట్టినిల్లయ్యె నెన్నె
విమతక్షమాపాల వితతిఁగాల్చెడు కోప
బడబాగ్నిశిఖల కాణాచ మెన్నె
ధవళశారీరరుచులతోఁ దనరు నెన్నె
యమ్మహావిష్ణు విడిదియిల్లయ్యె నెన్నె
యట్టి విక్టోరియారాజ్ఞియను నెపు నింపు
పాలకడలి మమ్మోల్లాల్చె యేలుగాత. 2

సీ. పూవునొవ్వకయుండఁ బువుదేనియలుగ్రోలి
ముదమొందు నాడుతుమ్మెదయనంగఁ

బవలు రేల్వికసించి చవులూరు విరిదేనె
పెదఁజల్లు ధవళారవిందమనఁగ
నాశ్రితావళి 'హాయి' యనఁ జల్లఁదనమిచ్చి
యమరు నేడాకుల యనఁటియనఁగఁ
జిరకాలముననుండి చివుకు లేశము లేక
మహిఁనిల్చు పెనుచేవ మ్రానసంగ
ప్రజలమనసు నొవ్వకయుండఁ బన్నుఁగొనుచుఁ
జాలకృపఁజిమ్ము సంతానసప్తకమ్ము
గలిగి వస్తిహాయనపూర్తి గలిమిమించు
శ్రీమహిత నిత్యకళ్యాణి సీమరాణి. 3

సీ. ఉరుసత్యకీర్తి నీ వుదయమందినతోనె
యాప్యుల శ్రమలన్ని యస్తమించె
నఖిలైకజనని నీ వడుగుపెట్టఁగ దుష్ట
కువలయాధిపకోటి కూలబడియె
నమలచారిత్ర నీ వభివృద్ధినొంద మా
జాతి వైషమ్యముల్ క్షయమునొందె
గుణరత్ననిధినీవు కువలయం బలరింప
మనుజుల సుముఖపద్మములు విచ్చె
దేవి నీకు సంతతిగల్గ దేశమెల్ల
నొల్లదోపుడులందున నొడ్డువోయె
నీదు చిత్రచారిత్ర వర్ణింపఁదరమె
గుణమణికదంబ ధన్యవిక్టోరియాంబ. 4

సీ. నదులు ద్రవ్యకయుండ నాల్గుదిక్కుల, నఖా
తము సాగరమె కందకముగాఁగ
గడలిలేచిన కొండగమిఁబోలు నోడల
గుంపుపెట్టని చుట్టుకోటగాఁగఁ
బాలింపఁబడునట్టి ప్రజయెల్లనుచిత, యో
చనఁజెప్పఁగల మంత్రిజనముగాఁగఁ
బుడమి యీనినపోల్కి పొలములందంద, గ
న్పట్టు రక్కసిబొగ్గు పంటగాఁగఁ

జిత్రసాధనంబులతోడ ధాత్రిలోనఁ
గ్రాలునేసీమ యట్టి యింగ్లాండుసీమ
నిప్పుడేలుచున్న వరాలకుప్ప వీవు
గుణమణికదంబ ధన్య విక్టోరియాంబ. 5

సీ. సూర్యతాపములేని చోటులున్నవిగాని
నీ ప్రతాపములేని నెలవులేదు
శశిమూర్తి చొరనట్టి స్థలము లున్నవిగాని
నీకీర్తియెఱుఁగని నెలవులేదు
వర్షధారలులేని వసుధలున్నవిగాని
నీదయారసమేదు నెలవులేదు
ఈశ్వరాఖ్యవినని యిమ్ములున్నవిగాని
నీ పేరు వినరాని నెలవులేదు
అవుర యఖలదక్షిణోత్తరధృవములందు
దీవులందును గనుమూల దేవులందు,
గడలి మధ్యమందాఫ్రికాఖండమందుఁ
జెల్లుగద నీదునేల్బడి సీమరాణి. 6

సీ. రామచంద్రుఁడు మహారాజయ్యెనేగాని
చక్రవర్తిసమాఖ్య జరుగదయ్యె
నల యుధిష్ఠిరుఁడు రాజాధిరాజగుఁగాని
సార్వభౌమత నొందఁజాలఁడయ్యె
చక్రవర్తిగ హరిశ్చంద్రుఁడుండెనెకాని
యతనికి నీభోగ మబ్బదయ్యె
నలుఁడు భూవలయంబు గెలిచి యేలెనుగాని
యొక్కసామంతున కొరిగియుండె
మహితగుణజాల యిక వేయుమాటలేల
భరతఖండంబునేలిన ప్రభువులందు
నీకు నుపమింపఁదగినట్టి నృపుఁడు లేఁడు
గుణమణికదంబ ధన్య విక్టోరియాంబ. 7

సీ. మూఁడుపూటల ఢిల్లీపురికైనఁ జనవచ్చు
గంగ దాటఁగవచ్చుఁ గాలినడక

వాన కురియకున్నఁ బైరుచేయఁగవచ్చుఁ
గరువు లక్ష్యములేక గడుపవచ్చుఁ
గాశికాపురవార్త గడియలో వినవచ్చు
నైతు రాజునెదిర్చి బ్రతుకవచ్చుఁ
గడ మాల బండితాగ్రణియైనఁగావచ్చు
నడవి నొంటరిగ స్త్రీ యరుగవచ్చు
దేవి పొగబండ్లవల్ల వంతెనలవల్లఁ
గాలువలవల్ల నీ మహాకరుణవల్ల
తంతివార్తలవల్లను సమత్వంబువల్ల
పాఠశాలలవల్ల నీ పనుపువల్ల. 8

సీ. కత్తి చేఁగొనివచ్చు కఠినాత్మునకు జంకి
నంగదండము బెట్టు ప్రాతదప్పె
ధనకాంక్ష నొంతు పీకనుగోయు ఖలుచేత
నడవి బాంధులు చచ్చు నార్తిదప్పెఁ
బ్రతినిమేషము మాకు రాచపీనుఁగులకుఁ
బన్ను లీవలెనన్న భయముతప్పె
నడవి ద్రోపుడు సేయు నధమాధమునియింట
బానిసతనమూను బాట్లుతప్పె
పాడుపిండారిదండులు మాడుకతన
మాయదారి పాశకసులు మ్రగ్గుకతన
దుష్టనృపులు మన్నెపుదొరల్ త్రుంగకతనఁ
గడుపుచల్లఁగ మమునీవు గాచుకతన. 9

సీ. నిలువెల్లఁ బ్రవహించు నీ దయారసమట్లె
పంటకాల్వలుపారు పల్లెలందు
నదుల వాహినుల నీయాన కట్టినయట్లు
యానకట్టులు ప్రవాహములఁ గట్టు
నెడలేక యెప్పుడు కడుపుపండెడునట్లె
పుష్కలంబుగఁ బండు భూములెల్ల
నీకీర్తికన్యక నిలుచు గేహములట్లె
పాఠశాలలుమించుఁ బట్టణములఁ

చల్లఁదనమెంత శమమెంత సౌఖ్యమెంత
సాహసియెంత వైభవమెంత సంపదెంత
సేమమెంత నీ పోల్చుడిచేతఁ గాంత
శ్రీమహిత నిత్యకళ్యాణి సీమరాణి. 10

సీ. నీ మహాపతిభక్తి నీ దేశపాలనా
ప్రబలశక్తికి వింతపడ్డ నెల్ల
నీ మహాభూతికి నీ గర్వరాహిత్య
మును జూచి వా నేఁ బ్రాంతఁబోదు
నీ కాంతిశ్రేణికి నీ సూర్యకేళులు
మిసమిసల్ వసకొత్తి మెఱుఁగుపెట్టు
నీ ప్రతాపముఁ గని నీ ఘనశాస్త్రవి
ద్యాప్రవేశంబు విస్మయముంచ
కీర్తికినిమూర్తి దానలక్ష్మికభిమాన
లక్ష్మివొంటొంటికిచ్చు నలంక్రియలను
పరమె కొనియాడ నిన్ను నన్యాదికైన
గుణములకునంబ ధన్య విక్టోరియాంబ. 11

సీ. కృపఁజూపి నిను సేవ కుపకార మొనరించు
చుట్టమేదన నిన్నె చూపవలయుఁ
బసచెప్పఁగఁతుచె స్త్రీకాచెడి దయా
సింధువేదన నిన్నె చెప్పవలయుఁ
బక్షపాతము లేక ప్రజలనేలు సతీమ
తల్లియేదన నిన్నె దలఁపవలయు
నిఖిలవిద్యలయందు నెరజాణయగు కల్కి
మిన్నయేదన నిన్నె యెన్నవలయు
నరపతివ్రతాతిలక మే గరితమిన్న
యనిన నెంబనె నిన్నె జేర్కొనఁగవలయు
రాణివన నీవె జనబహుప్రాణ మీవె
శ్రీమహిత నిత్యకళ్యాణి సీమరాణి. 12

సీ. ఆంగ్లేయ హిందూమహాసేన నడిపించు
సేనాధిపతి నీదు చిన్నకొడుకు

బర్మానియా దేశ చక్రవర్తియగుచు
ఖ్యాతుఁడైనాఁడు నీకూఁతుబిడ్డ
జనలోకవినుత రష్యాదేశచక్రవ
ర్తినియయ్యె నొక చిన్ని మనుమరాలు
సార్వభౌములు మహాచక్రవర్తులు కిరీ
టాధిపుల్ నీదు వియ్యంకులెల్లఁ
జుట్టములు, స్నేహితులు, మహాక్షోణివిభులు,
దేవి నీదువైభవ మే మదృష్టమేమి
జన్మమహిమయేమి కడుపు చలువ యేమి
గుణమణికదంబ ధన్య విక్టోరియాంబ. 13

సీ. కలియుగంబున నిట్టి ఘనతతో నెనుబది
వత్సరంబులదాక బ్రతుకుటరిది
బ్రతుకబోలునుగాని రాజ్యభారమునందె
షష్ఠిహాయనపూర్తి జరుపుటరిది
జరుపనొప్పునుగాని జనసమ్మతంబైన
యుత్తమపాలన ముండుటరిది
యుండవచ్చునుగాని నిండు వేడుకతోడ
సిరియు సంతతి యిట్లు చేరుటరిది
యరుదులన్నియు నీయందె యమరియుంట
బ్రతుకు వేయేండ్లు శాశ్వతైశ్వర్యవృద్ధి
నేలు వేయేండ్లు మాదేశ మిట్లె నీవు
గుణమణికదంబ ధన్య విక్టోరియాంబ. 14

తే. గీ. ప్రేమ జ్యూబిలీరిడింగురూఁకు పక్ష
మున రచించి యర్పించె నీ పుష్పమాలఁ
బ్రబల విక్టోరియా చక్రవర్తినికిని
చిలకమర్తి లక్ష్మీనరసింహమూర్తి. 15

ఈ సభ ముగిసిన పిమ్మట మ్యూజియము కెదురుగనున్న స్థలములో విచిత్రమైన బాణచంచా కాల్పబడెను. నా పద్యములా సంవత్సరము జూన్ నెల 22 వ తేదీ చింతామణి పత్రికలో ప్రకటింపబడెను. కందుకూరి వీరేశలింగముపంతులుగారు, విక్టోరియారాణి

చరిత్రమును పద్యములుగా వ్రాసి "చింతామణి" పత్రికలో నే ప్రకటిం
చిరి. నా పద్యములు చూచినతోడనే నన్ను శ్లాఘించుచు నాంధ్ర
దేశమున నానాభాగములనుండి బహూకరణ లేఖలు నాకువచ్చినవి.
"అముద్రితగ్రంథచింతామణి" పత్రికాధిపతులగు పూండ్ల రామకృ
ష్ణయ్యగారు, నన్నును నా కవిత్వమును మెచ్చుకొనుచు నెల్లూరు
నుండి యొకలేఖ వ్రాసిరి. అట్లే విజయనగరమునుండి శ్రీ నిడద
వోలు సుందరం పంతులుగారు జూబిలీసంవత్సరమున, మన యాంధ్ర
దేశమున రచియింపబడిన పద్యములన్నిటికంటె నా పద్యములు రస
వత్తరముగ నున్నవని నాకొకలేఖ వ్రాసిరి. ఈ విధముగనే యనంత
పురముజిల్లాలోని పెనుగొండ యాసుపత్రిలో వైద్యులుగనున్న వా
నారద్ధిచెట్టిగారు ప్రశంసాపూర్వకముగ నొకజాబు నాకు వ్రాసిరి.
ఆనాటి తెలుగుపత్రికలన్నియు నన్నుఁ ప్రశంసించెను.

ఆ సంవత్సరము సెప్టెంబరు నెలలో మా పాఠశాలలో ప్రథా
నోపాధ్యాయులుగనుండిన శ్రీ చేబియ్యము వేంకటరామయ్యగారు
పనిమానుకొని, కల్లాకలెక్టరు కచేరిలో నొకసుమాస్తాపదవి సంపా
దించి, కాకినాడ వెళ్ళిరి. ఆయన స్థానమందు మొదటి సహోపా
ధ్యాయులుగనుండిన శ్రీ ఇనూనేని హనుమంతరావునాయుడుగారిని,
మ్యునిసిపల్ సభాధ్యక్షులైన నిడమర్తి జలదుర్గప్రసాదరాయుడుగారు
నియమించిరి. నాయుడుగారి స్థానమందు నాకు చిరమిత్రులైన ధరణి
ప్రగడ శివరావుగారు నియమింపబడిరి. నాయుడుగారు నాకు మొదటి
నుండియు పరమమిత్రులగుటచేతను, శివరావుగారు గూడ నాకు సహా
ధ్యాయులును పూర్వమిత్రులు నగుటచేతను, నాకు సంతోషము కలి
గెను. నా యుద్యోగము మాత్రము మెరుగుపొందుటలేక కనుబొమ్మ
మీద వెంట్రుకవలె, యథాప్రకారముగ నున్నదని నా మిత్రులు
గొందరువిచారించిరి. ఆపాఠశాలలో నేను రెండవసహోపాధ్యాయు
డనుగదా! మొదటి సహోపాధ్యాయుని పదవి ఖాళీవచ్చినప్పుడు
దానికొరకు నేనెంత మాత్రము ప్రయత్నము చేయలేదు. చేసినను
నాకది లభింపదని నే నెరుగుదును. ఏలయన నుపాధ్యాయ యోగ్యతా
పరీక్షలో లిఖితభాగమునందు నేను మొదటి తరగతిలో కృతార్థుడ
నయితిని. కాని ప్రాక్టికలు పరీక్షకు బోయి సంపూర్ణయోగ్యత నే

నప్పటికి సంపాదింపలేదు. అదియొక కారణము. నాకు దృష్టిదోషము గలదని యధికారులభిప్రాయపడి నాకియ్యరని యనుమానము. కాని నా దృష్టిదోషము నా యుపాధ్యాయపదవి కెంతమాత్రము నష్టము రాలేదు. ప్రతి తరగతిలోను నలువది పిల్లలుండినను, నేను పాఠము చెప్పునప్పుడుమాత్రము గోలయు నల్లరియు లేకుండ తరగతి నిశ్శబ్దముగానే యుండుచువచ్చెను. ఒకటి, రెండు, మూడు ఫారములకు నేనింగ్లీషులో దేశచరిత్రమును, భూగోళమును బోధించుటయేగాక, మొదటిఫారమునకు, రెండవఫారమునకు నింగ్లీషుగూడ జెప్పుచుంటిని. నా బోధనాశక్తి మిక్కిలి బాగుండెనని విద్యార్థులలో నాకు మంచి పేరుండెడిది. ఈ విషయమై యప్పటి నా శిష్యులును నేటి పురప్రముఖులునైన శ్రీ కందుల వీరరాఘవస్వామిగారు, డాక్టరు కాటుమూరి వీరభద్రస్వామిగారు, డాక్టరు పాలకోడేటి గురుమూర్తిగారు, మాడిరెడ్డి పురుషోత్తమనాయుడుగారు మొదలగువారు చెప్పగలరు. దేశచరిత్ర, భూగోళబోధనములలో నేనధికప్రజ్ఞావంతుడననియు, నొక్కనాడు నేను బోధించెడి పక్షమున బాలురు చదువనక్కఱ లేకయే పాఠములు వచ్చెడివని, నాకు బ్రతిష్ఠగలదు. పాఠకమహాశయులు దీని నాత్మస్తుతిగ గ్రహింపకుందురుగాక !

1897 వ సంవత్సరమున రాజమహేంద్రవరమున గొప్ప విశేషమొకటి జరిగెను. ఈ పురనివాసియు, మహాకవియు, మహాపండితుడు, సంఘసంస్కర్తయు, పురమందిరప్రదాతయు, స్త్రీ పునర్వివాహ సంస్థాపనాచార్యుడు, స్త్రీ విద్యాభిమానియు, శతాధికగ్రంథకర్తయు నైన రావుబహదూరు శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారు, రాజధానియైన చెన్నపట్టణములో వితంతు శరణాలయమును స్థాపించి, సంఘసంస్కరణ విషయమున విశేషకృషి సలుపవలెనను సంకల్పముతో, రాజమహేంద్రవర నివాసముమాని డిశంబరు నెలలో సకుటుంబముగ చెన్నపురికి పోయిరి. వారు రమారమి యిరువది సంవత్సరములు రాజమహేంద్రవర కళాశాలలో నాంధ్రాధ్యాపకులుగ నుండుటంజేసి, కళాశాలావిద్యార్థులు నుపాధ్యాయులు గలసి, కళాశాలలో నొక మహాసభజేసి, వారిని సన్మానించి వీడుకోలు నొసంగిరి. ఆ సభకు పురప్రముఖులలో నొకరును న్యాయవాదులును

పూర్వము వీరేశలింగముగారికి శిష్యులు శ్రీ ఆచంట సుందరరామయ్యగారధ్యక్షత వహించిరి. ఆ సభలో నప్పుడు బి. యే. తరగతిలో చదువుచున్నట్టియు, సరస కవితా విశారదులైనట్టియు "రుక్మిణీపరిణయ" "శ్రీరామవిజయా"ది నాటకములు రచించినట్టియు, శ్రీ కోపల్లె వెంకటరమణారావుగారు కొన్ని పద్యములు వ్రాసి చదివిరి. నేనును కొన్ని పద్యములువ్రాసి సభలో చదివితిని. మరికొందరు కొన్ని పద్యములువ్రాసి చదివిరి. ఇదియేగాక శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగారు, మరికొందరు పురప్రముఖులును గలసి టవునుహాలులో నొక గొప్ప సభజేసి, వీరేశలింగముగారిని సన్మానించిరి. మరియు శ్రీ కంచుమర్తి రామచంద్రరావుగారిచేత స్థాపింపబడిన "విద్యాభిమానినీ" సమాజమువారుగూడ సభజేసి, యాంధ్రాభ్యుదయ పితామహులైన వీరేశలింగముగారిని గౌరవించిరి. అప్పుడు శ్రీ కొట్టి రాఘవయ్యగారు మనోహరములైన పద్యములు వీరేశలింగముగారిమీద రచించి చదివి సభాసదులను రంజింపజేసిరి. వీరేశలింగముగారు 1889 లో తమ సొంతడబ్బుతో టవునుహాలు కట్టుట ప్రారంభించి 1890 లో ముగించిరి. అప్పుడు కళాశాలలో ప్రథమ మహోపాధ్యాయుడుగ నుండిన శ్రీ నాగోజీరావు పంతులుగారు, పురమందిర ప్రవేశ మహోత్సవ సందర్భములో జరిగిన మహాసభ కధ్యక్షులైరి. నాడు కళాశాలలో ప్రకృతిశాస్త్ర పండితులైన పండిత రంగాచార్యుల వారాంగ్లభాషలో బహుజన స్తవనీయమైన యుపన్యాసమును వీరేశలింగముగారినిగూర్చి యిచ్చిరి. నాటనుండియు మా పురమందిరము ప్రజల నిమిత్తమే యుపయోగపడుచుండినను, వీరేశలింగముగారు దానిని ధర్మపత్రమువ్రాసి ధర్మకర్తల కప్పగింపలేదు. ఈ 1897 వ సంవత్సరము డిశంబరు నెలలో చెన్నపురికి వెళ్ళకమునుపు వీరేశలింగముగారు పురమందిర పరిపాలనము నిమిత్తము, ధర్మశాసన మొకటి వ్రాసి, పదముగ్గురు ధర్మకర్తల నేర్పరచి, వారికది యప్పగించిరి. అధర్మకర్తల సంఘమునకు న్యాపతి సుబ్బారావుపంతులుగా రధ్యక్షులుగను, చిత్రపు వేంకటాచలముగారు కార్యదర్శిగను నియమింపబడిరి. వీరేశలింగముగారు కష్టార్జితమైన సొంతసొమ్ముతో దీనిని కట్టించిరి. ఆంధ్రదేశమున వెలసిన పురమందిరములలో నిదియే

మొదటిదియని, రాజమహేంద్రిపురవాసులము సగర్వముగ సంతో షించుచున్నాము. వీరేశలింగముగారు చెన్నపురికి బోకమునుపు, నేను వారి దర్శనము చేయఁబోవగ, వారు రచియించిన ప్రతి పుస్తకము యొక్కయు నొక్కొక ప్రతి నాకు బహుమానముగ నిచ్చిరి. వీరేశ లింగముగారి యుద్యోగము, కళాశాలలో (శ్రీ) వడ్డాది సుబ్బారాయు డుగారి కగునని, చాలమంది తలంచిరిగాని యట్లుగాక మరియొకరి కయ్యెను.

(శ్రీ) పోలవరము జమీందారుగారు, చెన్నపురిలో నివాస ముండిరనియు, నేను 1894 వ సంవత్సరము డిశంబరు నెలలో చెన్న పురికి వెళ్ళినప్పుడు నన్ను వారియింటనే నిలిపి నాకన్నులకు వైద్యము చేయించిరనియు, వ్రాసితినిగదా! 1896 వ సంవత్సర ప్రాంతమున జమీందారుగారికి చెన్నపట్టణములో మిక్కిలి జబ్బుచేసెను. వారికి నోటనుండి రక్తము పడజొచ్చెను. ఆ రోగము నివారించుటకై సీమకు బోదలచిరి. ఆవార్తవిని పూర్వము వారికి రాజమహేంద్రివరములో గురువై, మిత్రుడై యేలూరులో నప్పుడు న్యాయవాదిగా నుండిన సోమంచి భీమశంకరముగారు, సీమకు వెళ్ళినచో జమీందారుగారు చెడిపోదురని భయపడి, వెంటనే చెన్నపురిబోయి, విదేశప్రయా ణము నష్టదాయకమని వారికి బోధించి నచ్చజెప్పి, ప్రయాణము మానిపించి యేలూరు తీసుకొనివచ్చి, తమకు విశ్వాసపాత్రుడును, దమ కుటుంబ వైద్యుడునైన నారాయణదాసుగారను నొక బొందిలీ వద్ద, మందిప్పింప జొచ్చిరి. నారాయణదాసుగారు పూర్వము మిఠా యివర్తకుడనియు నానాట వైద్యము నేర్చుకొని గొప్ప పేరు సంపా దించెననియు, నారోజులలో చెప్పుకొనిరి. ఏలూరువచ్చిన తరువాత జమీందారుగారికి క్రమముగా కొంత యారోగ్యము గలుగజొచ్చెను. వారక్కడ మందుపుచ్చుకొనుచున్నారని విని, వారినొకసారి జూచు టకు నేనేలూరు బోతిని. వారికి నామీద మొదటనుండియు మెండుగ నభిమానముండెనుగాని, యాదినములలో నా ప్రసంగములు విని తనివిజెందక, నాపై ద్విగుణీకృతాభిమానము గలిగి, నేను పాఠశా లకు బోవలసియుండుటచే ఖర్చులిచ్చి పంపి, నన్ను ప్రతి వారము రమ్మని యానతిచ్చిరి. అట్లు నేను 1898 వ సంవత్సరము మార్చి

యేప్రిల్ నెలలలో ప్రతివారము నేలూరు బోవుచుంటిని. జమీాందారుగారు నారాకకు మిక్కిలి సంతసించుచుండిరి. ఆయన పనరుపేటలో నొకయిల్లు ప్రత్యేకముగ నద్దెకు పుచ్చుకొని భార్యాసమేతముగా నందు నివసించుచుండిరి. వారి వెంట కొందరు మిత్రులు పరిజనులు గూడ నుండిరి. భీమశంకరముగారు జమీాందారుగారికి తరుచుగ దర్శన మిచ్చుచుండిరి. ఆట్లు నేను నేలూరుబోయెడి దినములలో నొకనాటి సాయంకాలమున జమీాందారుగారు స్వరపుబండిమిాద షికారుబయలుదేరి, నన్నుగూడ వారి ప్రక్కను గూర్చుండబెట్టుకొనిరి. బండికి వెనుకప్రక్కను వారి మిత్రులైన బ్రాహ్మణులిద్దరు తుపాకులను చేత ధరించి గూర్చుండి మాతో షికారువచ్చిరి. అట్లు తుపాకులను ధరించి మా వెంట వచ్చుట నాకిష్టములేకపోయెను. ఏలూరులో నదివరకే జమీాందారుగారిమిాదను, వారి మిత్రులమిాదను చెడ్డవాడుక లెన్నో యుండెను. కారణమేమన జమీాందారుగారి భార్య యుండగనే, యొక దాసీ కన్యను పిలిపించి, వారికి వేరేయింట గాపురముంచి, ప్రతిదినము మధ్యాహ్నము మూడు నాలుగుగంటల నడుమ నామె యింటికిబోయి, యయిదారు గంటలకు వచ్చెడివారు. అదిగాక వారి యాప్తమిత్రులలో గొందరు మద్యపానలోలు రుండిరి. అందుచే వారి కప్రతిష్ఠ యెక్కువయ్యెను. ఆనాడు మేము షికారునుండి మరలియింటికి వచ్చిన తరువాత, భోజనములు చేసిన పిదప, వారిని నేనీవిధముగ మందలించితిని. "అయ్యా! జమీాందారుగారు! మీారు గొప్ప గృహస్థులు, ప్రభువులు, బి. యే. వరకు జదువుకున్నవారు. ఇది మీాకు సుప్రతిష్ఠ రావలసిన దినములు. అది లేదు సరిగదా, మీాకప్రతిష్ఠ లోకములో నెక్కువగ నున్నది. దీనికి గారణము మీా యాప్తులలో గొందరు విద్యావిహీనులు, మద్యపాన ప్రియులు, సత్ప్రవర్తనము లేనివారు. గ్రామములోనికి నేను వెళ్ళినప్పుడు కొందరు పెద్ద మనుష్యులు మిమ్ములను గురించి యనేక చిత్రవిచిత్ర ప్రశ్నలు నన్నడుగుచుందురు. వాటికి నేను సమాధానము చెప్పలేకపోవుచున్నాను. ఈ మిత్రులను మీారు విడచిన గాని మీాకు సుప్రతిష్ఠరాదు. నేటి సాయంకాలము మనము షికారు వెళ్లినప్పుడు మీా మిత్రులిరువురు తుపాకులనుపుచ్చుకొని బండివెనుక గూర్చుండి యుండిరిగదా? మీా రది గనిపెట్టిరి

గదా ? మన మందరము బ్రాహ్మణులముగదా ? చేతులలో మనకు తుపాకులెందుకు ? మనము వేటగాండ్రమా ? ఇటువంటి పనులను బట్టియే లోకములో నెన్నియో యపవాదములు మీపైబడుచున్నవి. మీరెన్నో విషయములలో లోకమున కెంతో మేలుచేయవలసియు న్నారు. నేడు నేనిట్లు మీతో చెప్పినందుకు నాపై నాగ్రహింపక మీ మిత్రులను పరిత్యజించి మంచిత్రోవకు రండు" ఇట్లు నేను మనవి జేసిన తరువాత వారు గొంత పశ్చాత్తాపము నొంది నాతో నిట్లనిరి. "లక్ష్మీనరసింహముగారు ! నేనీ నిర్భాగ్యులను చేరదీయుట తప్పు. వీరివల్లనే నాకు మిక్కిలి యపకీర్తి వచ్చుచున్నది. ఈనిర్భాగ్యుల సహవాసము మానివేసి, యే మంచిపని మీరుచేయమన్నను చేసె దను" ఈ సంభాషణము మాకిరువురకు జరుగునపుడు మిత్రులెవ్వ రును మాచెంత లేరు. ఇది మిక్కిలి రహస్యముగ జరిగినది.

సుబ్బారావుపంతులుగారు స్థాపించిన "చింతామణి" మాసప త్రిక వీరేశలింగముగారితో చెన్నపురి వెళ్ళిపోయినందున, నాంధ్రదే శమున నొక మంచి మాసపత్రిక యుండవలెనని నే నభిప్రాయపడి, యొక తెలుగు మాసపత్రిక నెలకొల్పవలసినదని నేను వారికి సలహా జెప్పితిని. అది వారు మంచిదేయని యంగీకరించిరి. మేమిరువుర మాలోచించి మాసపత్రికకు "సరస్వతి" యని పేరుబెట్టితిమి. అది రాజమహేంద్రవరములోనే యచ్చుపడునట్లును, దానికి జమీందారు గారు సంపాదకులుగ నుండునట్లును, నేను సహాయసంపాదకుడుగనుండి పత్రిక నడుపునట్లును, మాలో మేము నిర్ణయించుకుంటిమి. ఈపత్రికా ప్రవర్తనము నాలుగు మూడు మాసములు బోయిన తరువాత చేయ దలచుకొంటిమి. ఏలూరులో నుండగనే గుంటూరులో జరుగదలచిన కృష్ణామండల సభకు రావలసినదని (ఆ రోజులలో ఇప్పటి కృష్ణా, గుంటూరుజిల్లా లొకేజిల్లాగా యుండెడివి) జమీందారుగారి కాహ్వా నము వచ్చెను. మరియు విజయనగరములో జరుగదలచిన విశాఖప ట్టణమండల సభకును, పసలపూడిలో జరుగనున్న నాలుగవ గోదావరీ మండలసభకునుగూడ రావలసినదని జమీందారుగారి కాహ్వానములు వచ్చెను.

# స్వీయచరిత్రము

## ఎనిమిదవ ప్రకరణము

## మండల సభా యాత్రలు

ఈ మూడు సభలకును గూడ నధ్యక్షుడను కావలెనని జమీందారు గారి కుత్సాహముపుట్టి, నన్నుగూడ తమతో రమ్మని పిలిచిరి. సభలకు పోవుట నాకు మిక్కిలి యిష్టముగనుక వెంటనే నేనంగీకరించితిని. భీమశంకరముగారుకూడ లోకసేవా పరాయణులు గనుక జమీందారుగారు పిలువగనే యంగీకరించిరి. అట్లు నిశ్చయించుకొని జమీందారుగారు, భీమశంకరముగారు, నేను మండలసభా యాత్రలకు బయలుదేరితిమి. కృష్ణామండలసభ గుంటూరులో మే నెలలో జరిగెను. రాజకీయ సభకును, సంఘసంస్కరణసభకునుగూడ నప్పుడు బందరు కళాశాలలో నుపాధ్యాయులుగనుండిన మహావక్తయైన శ్రీ రఘుపతి వేంకటరత్నము నాయుడుగారే యధ్యక్షత వహించిరి. జమీందారుగారితో కలసి శంకరముగారును, నేనును రైలులో రెండవతరగతిలోనే ప్రయాణము చేసితిమి. గుంటూరు చేరినతరువాత సన్మానసంఘమువారు మమ్ము మువ్వురను మిక్కిలి గౌరవించిరి. సభలలో వేదికమీద నధ్యక్షుని వెనుకనే మా మువ్వురకు కూర్చుండుట కాసనములు వేసిరి. మా బసకు [illegible] నొక బంగాళా ప్రత్యేకముగ నిచ్చిరి. జమీందారుగారితో వంట బ్రాహ్మణులు, సేవకులు వచ్చుటచేతను, సన్మానసంఘమువారు మాకు కొరతలేక నన్నివస్తువులను బంపుటచేతను గుంటూరులో దినములు మేము మిక్కిలి సుఖముగ గడపితిమి. సన్మానసంఘాధ్యక్షులు శ్రీ పసుపులేటి వేంకటకృష్ణమ్మ నాయుడుగారు; వీరు వేంకటరత్నము నాయుడు గారికి చిరమిత్రులు, సహాధ్యాయులుగూడనని వింటిని. వేంకటరత్నము నాయుడుగారి వాగ్ధోరణియు, విజ్ఞానమును లోకవిదితములుగదా! ప్రథమదినమున శ్రీ వేంకటరత్నము నాయుడుగారు తమ వక్తృత్వమునకును, విజ్ఞానమునకును దగినట్లు నాంగ్లేయభాషలో గంభీరోపన్యాసమిచ్చిరి. అప్పుడు చెన్నపురిలో న్యాయవాదిగనున్న పురాణం నాగభూషణంగారుకూడ సభకు దయచేసిరి. వారు బందరులో సుప్ర

సిద్ధన్యాయవాదులును, దొరతనమువారి వకీలునునైన పురాణం వెంక టప్పయ్యగారి తమ్ములు. ఆసభకు బాపట్ల, పల్నాడు, రేపల్లె, గుర జాల మొదలగు సీమలనుండి యింగ్లీషు తెలియని రయితులు చాల మంది వచ్చియుండుటచే నాయుడుగారి యుపన్యాససారము వారికి తెలియఁజేయుటకై నాగభూషణముగారు స్పష్టముగ సరియైన తెలు గున జెప్పిరి. వారి ధారణాశక్తికి, నుపన్యాస ప్రౌఢిమకు సభాసదులు మిక్కిలి యాశ్చర్యము, సంతోషము నొందిరి.

సభాదినములలో రెండవనాఁడో మూఁడవనాఁడో విశేషమొ కటి జరిగెను. ఆంగ్లేయసామ్రాజ్యభారము చిరకాలము వహించిన ప్రధానమంత్రియు, విక్టోరియా మహారాజ్ఞిగారికి మిక్కిలి గౌరవనీ యుఁడు, సర్వలోకమాన్యుఁడు, మిక్కిలి మేధావియునైన "గ్లాడ్‌స్టను" దొరగారు లండనులో మృతినొందెనట్లు మధ్యాహ్నమొక తంతివార్త వచ్చెను. మృతజీవుడు, మహామంత్రియునైన యా మహాత్ముని గౌర వార్థమై మండలసభ యొకయరగంటసేపు నిలుపుచేయబడెను. అప్పుడు జమీందారుగారు నన్ను బిలిచి, సభ తిరిగి సమావేశ మగులోపుగ గ్లాడ్‌స్టనుగారిమీద గొన్ని పద్యములు చెప్పుమని నన్ను గోరిరి. వారి కోరిక నేను నిరాకరింపక, వెంటనే నామనసులోనే, నయిదో యారో పద్యములు రచించి కాగితముమీద వ్రాయక మనసులో నిలుపుకొని ధారణచేసి సభ తిరిగి సమావేశమైనప్పుడు జదివితిని. సభాసదులు సంతోషించిరనియే నా నమ్మకము. వెనుకటివాటివలెనే నివిగూడ మృగ్యములు. నాలుగవనాడు మండల సంఘసంస్కరణసభ జరిగెను. నాయుడుగారు సహజముగ సంఘసంస్కరణ ప్రియులగుటచే, నాటి సభ రాజకీయసభకంటె నెక్కుడు జయప్రదముగ జరిగెను. సభానం తరమున జమీందారుగారు, శంకరముగారు, నేనును సభాప్రముఖుల యొద్ద సెలవుగైకొని గుంటూరువిడిచి మరల నెలూరు వచ్చితిమి. అక్కడనుండి విశాఖపుర మండలసభ నిమిత్తము విజయనగరము ప్రయాణమై వెళ్ళితిమి. ఆ విజయనగర సభకు సుప్రసిద్ధ రాజ్యాంగ వేత్తయు, కాకినాడలో సుప్రసిద్ధ న్యాయవాదియు దేశసేవాపరాయ ణుడు, నైన (శ్రీ) గంజాము వేంకటరత్నముపంతులుగా రధ్యక్షులైరి. సభాధ్యక్షుని, సభకు నరుదెంచిన జమీందారుగారిని, వారితోగూడ

నరుదెంచిన మమ్మును సన్మానించుటకై రైలుస్టేషనునకు విజయనగర ప్రముఖులనేకు లరుదెంచిరి. మాకు బస నిమిత్తము శ్రీ పూసపాటి వెంకటపతిరాజుగారి సౌధమునిచ్చిరి. అక్కడగూడ రెండవనాడో, మూడవనాడో శ్రీ గంజాము వేంకటరత్నముగారి ప్రోత్సాహముచేత నేను గ్లాడుస్టనుగారి మీద నదివరకే రచించిన పద్యములు సభలో జదివి మెప్పువడసితిని. అప్పుడు శ్రీ గురజాడ శ్రీరామమూర్తిపంతులుగారు విజయనగర సంస్థానములో నేదో యుద్యోగములోనుండి, ప్రతిదినము మా జమీందారుగారిని జూడవచ్చి, యొకనాడు జమీందారుగారికిని మాకును విందుజేసిరి. వారు దేశచరిత్రయును మిక్కిలి కృషిచేసిన మహనీయులు. ఆదినములలోనే విజయనగర కళాశాలా ప్రధానాచార్యులైన శ్రీ కిళాంబి రామానుజాచార్యులుగారితోడను, నచటనే కళాశాలలో పండితులైన శ్రీ గురజాడ అప్పారావుగారితోడను నాకు పరిచయమయ్యెను. విజయనగర ప్రభువులైన శ్రీ మదానంద గజపతిమహారాజుగారు గతసంవత్సరమందే కీర్తిశేషులగుటచే వారి దర్శనమునకై నేను ప్రయత్నింప నవసరము లేకపోయెను.

తిరిగి వచ్చునప్పుడు మేము విశాఖపట్టణములో ప్రయాణము నిలుపుచేసి "కాకుమంచివారి హవేలి" యను పేరుగల కసింకోట జమీందారుగారి మేడలో బసచేసితిమి. అప్పుడక్కడ పోరతనము వారి వకీలుగనున్న మహారాజశ్రీ బలిజేపల్లి సూర్యనారాయణశాస్త్రిగారి యింట భోజనములు చేయుచుంటిమి. అప్పుడు కసింకోట జమీందారుగారు విశాఖపట్టణములో నుండిరి. వారికి మతి చలించెను. ఈ ప్రయాణములో మా జమీందారుగారి వెంట గొంత పరివారము వచ్చెను. మతి చలించిన కసింకోట జమీందారుగారు, పోలవరము జమీందారుగారి పరివారములో నొక యువకుని "దూర్ జావ్ బాంఛోత్"ని యొక్క చెంపకాయ కొట్టెను. దైవానుగ్రహమున నీ యపూర్వబహుమానము నాకు జరుగనందుకు సంతసించుచు, ప్రాణముల నరచేత బెట్టుకొని తక్కిన దినముల నెట్లెటో గడపితిని.

ఏలూరులో నా యుపదేశములు విన్నది మొదలుకొని శ్రీ పోలవరము జమీందారుగారు నాయెడల భయభక్తులుగలిగి ప్రవర్తించుచుండిరి. ఇందుకొక యుదాహరణ జెప్పెదను. తరచుగ మేము బలి

క్షేపల్లి సూర్యనారాయణశాస్త్రిగారి యింట భుజించుచున్నను, మా జమీందారుగా రప్పుడప్పుడు నక్కడకు రాక, మరికొందరు మిత్రుల యిండ్ల భుజించుచుండిరి. ఆ మిత్రుల పేళ్లు నేనెరుగను. ఒకనాటి రేయి మా జమీందారుగారు మాతో భోజనమునకు రాక, మహారాజశ్రీ అంకితము జగ్గారావుగారి యింట విందారగించుచుండిరట! రాజమహేంద్రవరమునుండి కార్యాంతరముమీద నక్కడకు వచ్చిన నా ప్రియమిత్రుడు చెరువు సోమరాజులుగారు జగ్గారావుగారి దర్శనమునకై పోయిరి. ఆ జమీందారుగారు జగ్గారావుగారి యింట విందారగించుట నా రాత్రి జూచెను. వెంటనే మా జమీందారుగారా మిత్రుని జూచి లేచి యెదురువచ్చి, "అయ్యా నే నిక్కడ భోజనము చేయుచున్నానని లక్ష్మీనరసింహముగారికి మాత్రము చెప్పవద్దు!" అని బ్రతిమాలెనట! "చిత్తము" అని నా మిత్రుడు జమీందారుగారి యొద్దను, జగ్గారావుగారి యొద్దను, సెలవు గైకొని బసకుబోయి వెంటనేగాక తరువాత కొన్నాళ్ళకు నన్ను గలసికొని "మీయెడ జమీందారుగారికి మిక్కిలి భయమే!" యని పలికెను. నేను మిక్కిలి పేదవాడను. తక్కువ విద్యగలవాడను. వారాగర్భశ్రీమంతులు. బి. యే ప్యాసయిన విద్యావంతులు. అల్పుడనైన నాయెడ భయమెందుకుండునని నేనంటిని. వెంటనే నా మిత్రుడు నాటిరేయి విశాఖపట్టణములో జగ్గారావుగారి యింట జరిగిన విషయము నాకు చెప్పెను. నేనాశ్చర్యపడితిని.

విశాఖపట్టణమునుండి మేము కసింకోట వెళ్లితిమి. కసింకోట జమీందారుగారి బంధువులైన వక్కలంక జోగారావుగారు, మా జమీందారుగారిని సపరివారముగ నాహ్వానించి గౌరవించి వారి మేడలె మాకు బసగ నిచ్చిరి. అప్పుడు కసింకోట జమీందారుగారు మైనరుగనుండి చెన్నపురిలో జదువుకొనుచుండిరి. మూడుదినములు మేమచ్చట సుఖముగ గడపితిమి. విశాఖపట్టణములోనుండగ నాకు మా జమీందారుగారివల్ల శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మగారి పరిచయమును, అంకితము జగ్గారావుగారి పరిచయమును విశాఖపట్టణ కళాశాలాధ్యక్షులైన, పి. టి. శ్రీనివాసయ్యంగారిపరిచయము గలిగెను. అప్పటికి మిక్కిలి వృద్ధులును, బ్రహ్మసమాజ మతాభిమానులును,

మహర్షి దేవేంద్రనాథటాగూరుగారికిని, బ్రహ్మసంఘ కేశవచంద్రసేను గారికి మిత్రులునైన శ్రీ రాజానోడే నారాయణగజపతిరావు బహా దూరువారి దర్శనమునకు నన్ను వెంటబెట్టుకొని మాజమీందారుగారు వెళ్ళిరి. అప్పుడు నాకు వారి దర్శనముచేయు భాగ్యముగలిగెను. కసిం కోటలోనున్న కాలమున నేనొకమిత్రుని సాయముదీసికొని యనకా పల్లి బోతిని. అక్కడ మునిసిపల్ మధ్యమపాఠశాలకు నామిత్రులైన బులుసు పాపయ్యశాస్త్రి ప్రధానోపాధ్యాయులుగ నుండిరి. వారి పరి చయ మదివరకు లేదుగాని, పేరు మాత్రము విని వారిని చూడబోతిని. పాపయ్యశాస్త్రిగారు మెట్రిక్యులేషను పరీక్షయందు కృతార్థులై, యుపాధ్యాయులై, యాంధ్రభాషా పాండిత్యముగలిగి, కొన్ని గ్రంథ ములుకూడ రచియించిరి. వారు రచించిన "భాస్కర విలాస" మను నవల మిక్కిలి రసవంతమైయున్నది.

కసింకోటనుండి మేము బయలుదేరి, పసలపూడిలో జరుగ బోవు నాలుగవ గోదావరీమండలసభకు బోతిమి. ఆ యేడా మండల సభకు శ్రీ కృత్తివెంటి పేరాజుపంతులుగారధ్యక్షులైరి. పేరాజు గారు గాకినాడలో గొప్ప న్యాయవాదులు. కొన్నిసారులచ్చటిముని సిపల్ సభ కధ్యక్షులైరి. ఇటీవల వారు చెన్నపురి శాసనసభలో సభ్యులై ప్రజాపక్షమున వారు శ్లాఘ్యముగ పనిజేసిరి. పసలపూడిలో వారు మూడుదినములు సభకధ్యక్షతవహించి జయప్రదముగ జరి పించిరి. కడపటిదినమున నేను ఐదుపద్యములను సభమీాద రచియించి చదివితిని. ఆపద్యములివి :

సీ॥ మనసులో మిము మేము మరువగోరినను మీా
మంచి యాదరణంబు మరువ నీదు
వేడ్కతో మీాయూరు విడువగోరినను మీా
పిండివంటల రుచుల్ విడువనీవు
మా యింటిపై భ్రాంతి మాకు బారినను మీా
పచ్చని పందిళ్ళు పారనీవు
త్వరితంబ యిటనుండి దాటగోరినను మీా
తేటతెల్లని నీరు దాట నీదు

తే॥ గీ॥ అనుగులకు మనుగుల నొసగి యహహా మమ్ము
గారవింపరె వియ్యాలవారినట్లు
సకల సన్మానసంఘపు సభ్యులార
అందుకొనరయ్య నేజేయు వందనములు. 1

సీ॥ కనులపండువుగాగ గాకినాడపురాన
మన్మథాబ్దమున జన్మంబునొందె
రాజమహేంద్రిమునందు బ్రిబలి విద్దెము జేసి
యుల్లనల్లన దప్పటడుగులిడియె
నెల్లూరు పురమందు బాలలీలదలిర్ప
నొక్కింత లేచి కాలూనినడచె
పసలపూడిని నేడు బసితనమ్మును బాసి
జిలిబిలి ముద్దుపల్కులను నేర్చె
తే॥ గీ॥ గౌతమీమండల సభాఖ్యకన్యయింక
పాలబెదతనము పాలబడకయుండ
జంటిబిష్టచేష్టలు దీని నంటకుండ
కాచుకొనెడి భారముమీది కాపులార !

మ॥ మితభాషిత్వము కార్యసాధకత గాంభీర్యంబు సౌశీల్య ము
న్నతచిత్తంబును శాంతభావము గడున్ బాటించి శుంభద్గుణా
న్వితుడై యీసభ నిర్వహించెగద మా పేర్రాజుపంతుల్ నమ
స్కృతులన్నల్పెదగాక యీతనికి నక్షీణప్రమోదంబునన్. 3

గీ॥ అస్తమించును శ్రీమలన్ని యస్తమించు
నధములగువారి యధికార మస్తమించు
నన్ని చెడుగులు నని తెల్ప నస్తమించె
జలజమిత్రుండు లెండిక సభ్యులార. 4

గీ॥ తోచు మీమీద దయయెల్ల దొరలకనగ
దోచువారల కిక తేటయోచనలన
దోచె జాబిల్లి పాండురద్యుతులతోడ
రండు నిండువేడుకతోడ రయితులార. 5

ఈసభ రామచంద్రపురం తాలూకా పసలపూడి గ్రామములో 1898 సంవత్సరము మే నెల 26, 27, 28 తేదీలలో జరిగెను. ఈసభలు

ముగిసిన తరువాత జమీందారుగారు కాకినాడయును, శంకరముగారు యేలూరును, నేను రాజమహేంద్రవరమును వెళ్ళితిమి.

ఉపాధ్యాయవృత్తికి నేను సగము యోగ్యత సంపాదించితిని గాని, ప్రాక్టికల్ పరీక్షకు వెళ్ళి కృతార్థుడగానందున సంపూర్ణ యోగ్యత లభింపలేదని, యా కొరత తీర్చుకొమ్మని, నాచేత నట్టి పరీక్షకు దరఖాస్తు చే యింపవలసినదని, మునిసిపలు సభాధ్యక్షునకు విద్యాశాఖాధికారులు వ్రాసిరట. ఆ వ్రాత ననుసరించి మునిసిపలు సభాధ్యక్షులైన నిడమర్తి జలదుర్గప్రసాదరాయుడుగారు, మా పాఠశాలా ప్రధానోపాధ్యాయులైన హనుమంతరావు నాయుడుగారికి వ్రాసిరి. ఆయన దరఖాస్తుపెట్టుమని నాకు నాయుడుగారు లిఖితపూర్వకముగ నుత్తరువు చేసిరి. ఆ పరీక్షకు దరఖాస్తుచేసిన యెడల పాఠశాలా పరీక్షాధికారి యెదుట నల్లబల్లమీద యొక బొమ్మ వ్రాయవలెను. యొక లెక్క చేయవలెను. పటము గీయవలెను. చక్కగ వరవడి పెట్టవలెను. ఏదో యొకతరగతికి పాఠము చెప్పవలెను. పాఠము బోధించుట నాకు సులభమేగాని తక్కినపనులలో నాకంత ప్రవీణతలేదు. ఆకారణమున నేనా పరీక్షకు కట్టదలచుకొనలేదు. కట్టనియెడల విద్యాశాఖాధికారు లూరకుండరు. ఎట్లయిన నుద్యోగమునకు భంగమువచ్చునని నాకు తోచినందున, నేనే యుద్యోగము మానుకొనుట మంచిదని విడుదలపత్రము (Resignation) దాఖలుచేసితిని. వెంటనే నన్ను పాఠశాలనుండి విడుదలచేసిరి. మొత్తముమీద నేను మ్యునిసిపల్ పాఠశాలలో మూడు సంవత్సరముల నాలుగుమాసములు పనిచేసితిని. అదివరకే శ్రీ పోలవరము జమీందారుగారు, పనిమానివేసి "సరస్వతీ" మాసపత్రిక నడుపుచుండవలసినదనియు, నెలకు ముప్పదిరూపాయలు వేతనమిచ్చెదననియు, పలుమారులు చెప్పిరి. ఆ ధైర్యముచేత నేను పని మానుకొన్నపుడు నాభవిష్యజ్జీవన మెట్లు జరుగునని నాకు విచారము కలుగలేదు. నేను శ్రీ న్యాపతి సుబ్బరావుపంతులుగారి పక్షమువాడనగుటచే మ్యునిసిపల్ సభాధ్యక్షులైన శ్రీ నిడమర్తి జలదుర్గ ప్రసాదరాయుడుగారు నాపని తీసివేసిరని నిష్కారణముగ కొందరభిప్రాయపడి నాతోగూడ నట్లుజెప్పిరి. అది నిజముకాదని నేను వాదించితిని. జలదుర్గ ప్రసాదరాయుడుగారికి నామీద కోపములేదు. కోపముండుటకు హేతువులేదు.

వారలువంటి యనుచితకార్యములు చేయువారు గారు. విద్యాశాఖా ధికారులుచేసిన తొందరచేత వారు పరీక్షకు దరఖాస్తుచేయుమని నాకు హెచ్చరిక నిచ్చిరే కాని, మరియొక కారణ మేమియు లేదు. ఎన్నోసారులు నేను వారి దర్శనము చేసితిని. నన్ను వారు సగౌరవముగానే జూచుచువచ్చిరి. వారియెడల నాకు గౌరవము గలదు.

ఆ సంవత్సరమున నేనొకనాఁడొకమిత్రుని యింటికిపోవుచుండగ దారిలోనున్న కుక్కను త్రొక్కితిని. వెంటనే యొడలునొచ్చుటచేత నది నన్ను గఱచెను. కుక్కకాటన్న నాకు మిక్కిలి భయము. ఏలయన కొంతకాలముక్రిందట రాయవరపు అప్పారావుగారియింటనే కాపురమున్న గూడా చంద్రయ్యగారి రెండవ కుమారుడు కుక్కకాటువలన దారుణమైన మరణమునొందెను. కుక్కకరచిన నెలదినముల కాబాలుఁడు జ్వరపీడితుఁడయ్యెను. అంతట జలభయరోగమంకురించెను. నీరు ముట్టలేఁడు, చూడలేఁడు, త్రాగలేఁడు, నీరుచూచిన భయముచే నెగిరిపడెడివాఁడు. నోట చొంగలు ప్రవాహముగ కారెను. వైద్యులు సహాయమేమియు చేయలేకపోయిరి. తుదకు బాలుఁడు మృతినొందెను. అతనిగుడ్డలు, పండుకొన్న చాపలుగూడ వైద్యులు దహనము చేయించిరి. ఆబాలకుఁడు ప్రస్తుత మమలాపురములో సుప్రసిద్ధ న్యాయవాదిగనున్న గూడా హరిశ్చంద్రుడుగారి రెండవయన్నగారు. చేబియ్యము వెంకటరామయ్యగారి రెండవబావమరది. ఆబాలుని ఘోరమరణము జూచినదిమొదలు కుక్కకాటన్న నాకు మిక్కిలి భీతిగనుండెను. అప్పుడు కూనూరులోగాని, మరెక్కడనుగాని కుక్కకాటుకు మందిచ్చెడి స్థలములులేవు. నామిత్రులైన దామెర్ల రమణారావుగారు రాజమహేంద్రవరములో సుప్రసిద్ధవైద్యులుగ నుండిరి. ఆయన నాతో నిట్లనియెను. "పిచ్చికుక్కకాటుకు మందులేదు. అది పిచ్చికుక్కకానిపక్షమున మీకేమియు భయము లేదు. పిచ్చికుక్కయైనపక్షమున దానికి ప్రతిక్రియలేదు." ఆమాటలువిని నేనయిదు రూపాయలు చేతపుచ్చుకొని జిల్లాసర్జనుగారి దర్శనముచేసి సలహా నడిగితిని. వారు నాకు చాలధైర్యముచెప్పిరి. అంతటితో సంతుష్టి చెందక నా స్నేహితులిరువురను వెంటబెట్టుకొని వెలుగుబంద గ్రామము వెళ్ళితిని. ఆయూరి మునసబు పిచ్చికుక్కకాటుకు మందిచ్చునని విని

యచ్చుటకు బోతిని. ఆమునసబు నాయొద్ద నొకరూపాయపుచ్చుకొని నూనెలోకలిపి యేదోమందిచ్చెను. అదిపుచ్చుకొనుటయే చాలకష్ట మయ్యెను. పుచ్చుకొన్న వెనుక తల విశేషముగ దిరిగి వమనములు వెళ్లెను. ఒక బ్రాహ్మణునియింట నెట్లో చారుకూడుతిని సాయం కాలమున కంటికివచ్చితిని. రెండవ మోతాదుమందుగూడ మునస బిచ్చెను. కాని నేనామందు పుచ్చుకొనుటకంటె మరణమే మేలని దైవముమీద భారమువేసి పుచ్చుకొనుట మానితిని, దైవానుగ్రహ మున నది పిచ్చికుక్క కాకపోయెను.

1898 వ సంవత్సర మాగస్టులో నాభార్య కాపురమునకు వచ్చెను. ఆదినములలోనే "సరస్వతీ" పత్రికాప్రకటనమునుగూర్చి నేను ప్రయత్నించితిని. కందుకూరి వీరేశలింగముపంతులుగారు చెన్నపురి వెళ్ళినప్పుడు చిత్రపు నరసింహారావుగారికి తమ వివేకవర్ధనీ ముద్రాక్షరశాలను విక్రయించిరి. అప్పటినుండియు నరసింహారావు గారే దానిని నడుపుచుండిరి. ఆ ముద్రాక్షరశాలలోనే నేను "సర స్వతీ" పత్రికను ముద్రించి ప్రకటింప నారంభించితిని. ఖర్చులును, నాజీతమును, జమీందారుగారే పంపుచుండిరి. పత్రికలో మొట్ట మొదట శ్రీ దాసు శ్రీరాములుగారు తెనిగించిన "మాలతీ మాధవ" నాటకమును, తాడూరి లక్ష్మీనరసింహారావుగారు తెనిగించిన "యున్మత్తరాఘవము"ను, మారనకవి రచించిన "మార్కండేయ పురాణము"ను బ్రచురింప నారంభించితిని. "సౌందర్యతిలక" యను నవలను నేను వ్రాయనారంభించి, నెలనెలకు కొన్నిపుటలు వ్రాసి ప్రకటింప నారంభించితిని. పత్రిక బాగున్నదని పేరువచ్చెను. మారన రచియించిన "మార్కండేయ పురాణము" యొక్క వ్రాతప్రతిలో గొన్ని తప్పులుండుటచే బ్రహ్మశ్రీ యాకొండి వ్యాసమూర్తి శాస్త్రి గారు తప్పులు సవరించి శుద్ధప్రతి వ్రాసి నెలనెలకు గొంతభాగము నా కిచ్చుచుండిరి. ఈపని చేసినందుకు జమీందారుగారు వారికి కొంత ధనసహాయము చేయుచుండిరి.

ఈ సంవత్సరమున (1898) నా రెండవచెల్లెలైన యచ్చమ్మకు రెండవ కుమార్తె కలిగెను. ఈ పురుడుగూడ వీరవాసరములోనే జరి గెను. మా తండ్రిగారియొక్కయు, బావగారియొక్కయు శ్రాద్ధ

మా పితామహులకు నాకుం గొంత ఋణమగుటచేత నే నావిషయము జమీందారుగారితో మనవి చేసితిని. ఆఋణము దీర్చుకొనుటకు జమీందారుగారికి నామీద దయకలిగి, యారువందల రూపాయ లొక్కసారి యుచితముగ నాకిచ్చిరి. వారికి నేను మిక్కిలి కృతజ్ఞుడను. ఇదిగాక, నే నుద్యోగము మానినప్పటినుండియు నాకు వారు నెలకు ముప్పదిరూపాయల చొప్పున నిచ్చుచుండిరి, కాకినాడ వెళ్ళినప్పుడు జమీందారుగారియింట బసచేయుచు వచ్చితినిగాని నా కచ్చోట నుండుట మిక్కిలి కష్టముగ దోచెను. ఏమన, వారు తమ యుంపుడుకత్తెను తాము నివసించుయింటనే యొకగదిలో బెట్టిరి. అది నా కెంతమాత్రము గిట్టదు. నేను వీధిలోకి వెళ్ళినప్పుడు "మీ జమీందారుగారు తమ యుంపుడుకత్తె నింటిలోనే యుంచిరట నిజమేనా?" యని నన్ను కొంతమంది యడుగజొచ్చిరి. "లే"దని నా కబద్ధమాడుట కిష్టము లేదు. "ఔ"నని చెప్పిన పక్షమున జమీందారుగారి గుట్టు బయలుపెట్టినవాడ నగుదును. ఈ సందేహములో బడి నామనసు మిక్కిలి పరితపింపజొచ్చెను.

ఆ సంవత్సరమున దేశీయమహాసభ ఇండియన్ నేషనల్ కాంగ్రెసు చెన్నపట్టణములో జరుగునని ప్రకటింపబడెను. సన్మాన సంఘమునకు చెన్నపురివాసులు శ్రీ న్యాపతి సుబ్బరావుపంతులుగారి నధ్యక్షులుగ నియమించిరి. అది సుబ్బరావుపంతులుగారిని గౌరవించుటయేగాక, యాంధ్రదేశమంతను గౌరవించినట్లుగ భావించి, నే నా సభకు బోవ నిశ్చయించుకొంటిని. జమీందారుగారు నా యభిప్రాయము దెలిసికొని, నన్నుగూడ చెన్నపట్టణము రమ్మనిరి. వడ్డాది సుబ్బరాయుడుగారినిగూడ రమ్మనిరి. మునుపు సభలకు వెళ్ళినప్పుడు రెండవతరగతి టిక్కెట్టు యిప్పించిరిగాని యీపర్యాయము నాకును సుబ్బరాయుడుగారికిని యింటరు తరగతి టిక్కెట్టుల నిప్పించిరి. అప్పటికి బెజవాడనుండి చెన్నపురికి సరాసరి రైలుబండి పోవుటలేదు. బెజవాడనుండి గూడూరు రేణిగుంటలమీదుగ ప్రయాణముచేసి వెళ్ళితిమి. పూర్వము నేను వెళ్ళినపుడు జమీందారుగారు పరుసువాకములో నుండిరి. ఈపర్యాయము తిరువళ్ళిక్కేణిలో వీరరాఘవ మొదలివీధిలో బసచేసిరి. అది పెద్దమేడ. జమీందారుగారును, వారి

ప్రియురాలును మేడమీద బసచేసిరి. నాకును, వడ్డాది సుబ్బారాయుడు గారికిని క్రిందిభాగములో బసనిచ్చిరి. ఇది మాకు న్యూనతయని నేనేగాక సుబ్బారాయుడుగారుకూడ భావించిరి. ప్రారంభమున జమీందారుగారు తమ ప్రియురాలిని స్వగృహమందు బెట్టినప్పుడే నాకట్టిపని సహజముగ నసహ్యమగుటచే నాకును, జమీందారుగారి కిని సఖ్యము చిరకాలము పొసగదని భావించి, సాధ్యమైనంత శీఘ్రకాలములో వారి సంబంధము వదలుకొనుట మంచిదని నేను నిశ్చయించుకొంటిని. ఈ నిశ్చయముతో నేను చెన్నపురికి వెళ్ళక మునుపే నా పోషణము నిమిత్తమొక పాఠశాల స్థాపింపవలెనని నాకు సంకల్పము గలిగెను. కలుగగనే యొకరిద్దరు మిత్రులయొద్ద రెండు వందల రూపాయలు బదులు పుచ్చుకొని పాఠశాలకు గావలసిన కూర్చుండుబల్లలు, కుర్చీలు, నల్లబల్లలు మొదలైనవి చేయించ నారంభించితిని. పాఠశాలకొరకు బజారులోనున్న, వాడ్రేవు జమీం దారుగారి గాడేఖానా మాటలాడితిని. అప్పుడు పోలవరము జమీం దారుగారుకూడ బావమరదిగారైన వాడ్రేవు కృష్ణారావు జమీందారు గారి యింట నుండినందున నా పాఠశాలనిమిత్తము నేకోరిన గాడే ఖానా నా కద్దెకిమ్మని, మా జమీందారుగారు బావగారితో సిఫా రసు చేసిరి.

ఆ సంవత్సరము చెన్నపురిలో జరిగిన దేశీయ మహాసభ (ఇం డియన్ నేషనల్ కాంగ్రెసు) కానందమోహనబోసు గారధ్యక్షు లైరి. సన్మాన సంఘాధ్యక్షులైన శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులు గారి స్వాగతోపన్యాసము శ్రవణానందముగ వింటిని. ఆనందమో హన బోసుగారి యుపన్యాసము వర్ణించుటకు వాచామగోచరముగ నుండెను. ఆ కంఠమాధుర్యము వర్ణనాతీతముగ నుండెను. ఆ భావ గాంభీర్య మసాధారణము. సభ ముగిసినతరువాత నేను రాజమహేం ద్రవరమువచ్చి, యచటనుంచి పీఠవాసరము వెళ్లితిని.

# స్వీయ చరిత్రము

## తొమ్మిదవ ప్రకరణము

### పాఠశాలా స్థాపనము

సంక్రాంతిపండుగ వెళ్ళువరకు వీరవాసరములోనుండి 1899 జనవరి 17 వ తేదీని పాఠశాల స్థాపింపవలెనని, వీరవాసరమునుండి యీ నెల 15 వ తేదీని బయలుదేరి కొంతబండిమీదను, కొంతనడచియు, నెట్టెటో తాడేపల్లిగూడెముచేరి, రైలెక్కి 16 వ తేది సాయంకాలమునకు రాజమహేంద్రవరము చేరితిని. జనవరి 17 వ తేదీని సరిగ 10 గంటలకు ప్రాథమికపాఠశాల స్థాపించితిని. ఆకొండి వ్యాసశాస్త్రిగారు దానిలో మొట్టమొదటి యుపాధ్యాయుడు. నాలుగవ తరగతివరకు బాలురు క్రమక్రమముగ, జేరనారంభించిరి. అప్పటివిద్యాశాఖాధికారియైన రఘునాథాచార్యులుగారు పాఠశాలకు దయచేసి, చూచియొప్పుకొనిరి. 1 వ ఫారము, 2 వ ఫారము, గూడ పెట్టదలచితినిగాని, తగినంతమంది బాలురుచేరలేదు. "సరస్వతీ" పత్రిక యథాప్రకారముగ రాజమహేంద్రవరములో నాచే ప్రకటింపబడుచుండెను. దృష్టిదోషముచేత నేను చక్కగ వ్రాయలేనుగనుక పత్రికనిమిత్తమొక గుమాస్తానిమ్మని జమీందారుగారిపేర వ్రాసితిని. మీయిష్టము వచ్చిన గుమాస్తాను వేసుకొమ్మని వారు నాకు జవాబు వ్రాసిరి. కొత్తపల్లి సూర్యారావుగారిని నేను గుమాస్తాగ నియమించుకొంటిని. సూర్యారావుగారు వట్టి గుమాస్తాకాడు. ఆయన కాంధ్రభాషాపరిచయముకలదు. గద్యపద్యకావ్యములు కొన్ని వారు వ్రాసినారు. ఆయన లేఖరిగనుండి నాకు మిక్కిలి సహాయముచేసినారు. అచ్చుపడినకాగితములు (ప్రూపులు) తప్పులులేకుండ దిద్దుచుండెడివాడు. నా "సౌందర్యతిలక" నేను భాగభాగములుగ వ్రాసినప్పుడు, శుద్ధప్రతి వ్రాయుచుండెడివాడు. జమాఖర్చుల లెక్కలు సరిగ నుంచెడివాడు. ఇట్లు 1899 వ సంవత్సరమున నాపత్రికయు, నాపాఠశాలయు జూను నెల తుదవరకు నడుపబడెను.

1899 వ సంవత్సరము జూలై నెలలో మా జమీందారుగారికి తమ నివాసస్థానమైన కాకినాడలోనే "సరస్వతీ" పత్రికను ముద్రించి

ప్రకటింపవలెనని బుద్ధిపుట్టెను. వెంటనే కాగితములతోను, జమా ఖర్చు లెక్కలతోను నన్ను కాకినాడరమ్మని నాకు జాబువ్రాసిరి. నేను కాకినాడ వెళ్ళుట కిష్టములేక, కాగితములు, నిలువయున్న సొమ్ము, జమాఖర్చులెక్కలు మొదలయినవన్నియు సూర్యారావు గారిచేతికిచ్చి ముందుగనాయనను కాకినాడబంపితిని. తరువాత నేను వెళ్ళితిని. అప్పుడు మాకిరువురకును మిత్రులైన సోమంచి భీమశంకరముగారక్కడనుండిరి. నేను పాఠశాల స్థాపించితిని. కావున నేను కాకినాడ వచ్చినపక్షమున నదిచెడిపోవుననియు, నందుచేత నేను కాకినాడ రాజాలననియు, ముందుగ శంకరముగారికి నా యభిప్రాయము తెలియచేసి యీ విషయమును, జమీందారుగారికి నచ్చ చెప్పవలసినదని శంకరముగారిని కోరితిని. ఆయన జమీందారుగారితో చెప్పిరిగాని, నేను కాకినాడ రానందుకు నామీద జమీందారు గారికి మిక్కిలి కోపమువచ్చెను. పాఠశాల యేల స్థాపించవలెనని వారు నన్నడిగిరి. పాఠశాలపోయిననుసరే నేను వారియొద్ద నుండవలెనని వారికోరిక. పాఠశాల పెట్టుకొనుటకు జమీందారుగారు వారి బావగారితో స్థలమిమ్మని సిఫార్సుచేసిరనియు, నేను రహస్యముగ స్థాపింపలేదనియు పాఠశాలాస్థాపన వారెరిగిన విషయమేయనియు, నేనది విడువజాలననియు చెప్పితిని. అదియునుగాక, యీసంవత్సర ప్రారంభమున భీమశంకరముగారు తమకుమార్తెను, బుర్రా రాజలింగశాస్త్రిగారి రెండవ కుమారుడు తమకు మేనల్లుడునైన బుర్రా దేవేంద్రనాథునకిచ్చి వివాహము చేసిరి. ఆ వివాహమునకు జమీందారుగారును, నేనును మరికొందరు మిత్రులును వెళ్ళితిమి. "సరస్వతీ" పత్రిక కాకినాడలో ప్రకటింపవలెనని జమీందారు గారు నాతో నప్పుడైనను చెప్పలేదు. ఆసంగతి నేను జమీందారు గారికి జ్ఞాపకముచేసితిని. ఎన్నిచెప్పినను వారికి మనసు తిరుగలేదు. నేను కాకినాడవచ్చువరకు నెలనెలకు నాకు వారిచ్చు ముప్పదిరూపాయలజీతము నిలుపుచేసితిమని శంకరముగారిద్వారా నాకు తెలియచేసిరి. అందుకు సిద్ధమై నేను కాకినాడనుండి రాజమహేంద్రవరము వచ్చితిని. దీనితో నాకును, జమీందారుగారికిని శాశ్వతవియోగము సంభవించెను.

నే నప్పటినుండియు గాలి జీవనము చేయవలసిన వాడ నైతిని. జూలైనుండి నా పాఠశాలలో నొకటి రెండు పాఠములు (Ist and IInd forms) కొంచెము వృద్ధిపొందెను. పాఠశాలకువచ్చు రాబడితో నేనుపాధ్యాయులకు వేతనములిచ్చి, యింటి కద్దెయిచ్చి, కొంచెము నేను వాడుకొనుచుంటిని. తాలూకాబోర్డుల ప్రెసిడెంటులు కొందరు నా గ్రంథములను వారి పాఠశాలలకు కొనుచుండిరి. బాలికాపాఠశాలా పరీక్షకులుగూడ బాలికల బహుమానముల నిమిత్తమై నా పుస్తకములను గొనుచుండిరి. ఆ సంవత్సరమున నిట్లు కొంత ప్రోత్సాహము కలుగుటచే, నేను దినములు సుఖముగ గడుపగలిగితిని. ఎట్టెటో 1899 వ సంవత్సరము గడచిపోయెను. 1899 వ సంవత్సరము డిశంబరులోనే, నా మూడవచెల్లెలైన రమణమ్మ కాపురమునకు వెళ్లెను.

1900 వ సంవత్సర ప్రారంభమున మా పాఠశాలకు దగిన యుపాధ్యాయు నొక్కని ప్రధానాధ్యాపకునిగ నియమించి, మధ్యమ పాఠశాలగ దానిని జేయదలపెట్టితిని. అందుకు సెకండరీగ్రేడు ట్రయినింగయినవారు కావలసివచ్చిరి. అట్టివారికొరకు వెదకుచుండగ, నక్కా కొండలరాయుడుగారని బ్రాహ్మణేతర యువకుడువచ్చి తన కుద్యోగమిమ్మని నన్నడిగెను. నెలకు నిరువదియైదు రూపాయలు జీతముమీద నతనిని మాపాఠశాలకు ప్రధానోపాధ్యాయునిగ నియమించితిని. నియమించిన కొలదిదినములకే నా మిత్రులైన కుందూరి వేంకటరత్నముగారు నాకడకువచ్చి "నేను మీ పాఠశాలలో పని చేయవలెనని యున్నదయ్యా!" యని పలికిరి. ఏ సందేహమును లేక "సరే రమ్మని" చెప్పి నెల కిరువదియైదు రూపాయలు జీతముమీద సహాయోపాధ్యాయునిగ వేంకటరత్నముగారిని నియమించితిని. వేంకటరత్నముగా రంతకుముందు రాజమహేంద్రవరములో క్రయిస్తవమిషనువారి పాఠశాలలో నుపాధ్యాయులుగఁ బనిచేయుచుండిరి. వారు బోధనాభ్యసనము నొందిరి. కాని యా పరీక్షయందు కృతార్థుడు కాలేదు. అందుచేతనో, మరెందుచేతనో, వా రాపాఠశాల వదలి మాకడకు వచ్చిరి. వేంకటరత్నముగారు మధ్యమ పాఠశాలా బాలురకు విద్యగరపుటలో మిక్కిలి సమర్థులు. ఆర్యను పాఠశాలలో

పూర్వము నేమిరువురముకలసి పనిచేసితిమి. కావున వారి సామ ర్థ్యము నే నెరుగుదును. అందుచేత వారిరాక నాకు మిక్కిలి సంతోష దాయకముగ నుండెను. కాని ప్రధానోపాధ్యాయుడయిన కొండల రాయుడుగారికిని, వేంకటరత్నము గారికిని నెంతమాత్రము సరిపడ లేదు. వారిరువురకును సామరస్యము కుదర్పలేకపోయినందున శ్రీ కొండలరాయుడుగారు నా పాఠశాలలో పని మానుకొని, కాకి నాడ వెళ్ళిరి. అందుచేత కొన్నిపాఠములు నేనుకూడ చెప్పుచుంటిని. అజ్జరపు పార్వతీశముగారని యొకరు నా పాఠశాలలో నొకపూటయు, మరియొక పాఠశాలలో రెండవ పూటయు పనిచేయుటకు కుదిరిరి. ఆకొండి వ్యాసశాస్త్రిగారు పండితులయ్యెను, లోవరు సెకండరీ పరీ క్షలో కృతార్థులగుటచే మా పాఠశాలనుండి ట్రయినింగుకు వెళ్ళిరి. వారిస్థానమున కోడూరి దక్షిణామూర్తిశాస్త్రిగారిని నియమించితిని. ప్రాథమిక పాఠశాలశాఖకు నరసింహదేవర వెంకటరమణయ్యగారు ప్రధానోపాధ్యాయులుగ నుండిరి. క్రింది తరగతులకు మరియిద్దరిని సహాయులుగ నియమించితిని.

"సరస్వతీ" పత్రిక కాకినాడలోనే ప్రకటింపబడుచుండెను. ప్రతిమాసము "సౌందర్యతిలక" యను నవలలో కొంతభాగముద్రాసి కాకినాడ బంపుచుంటిని. గోదావరినదిమీద వంతెన 1897 వ సంవ త్సరమున వాల్టను దొరగారిచే ప్రారంభింపబడి, 1900 వ సంవత్సర ములో పూర్తియై, యక్టోబరు నెలలో పొగబండ్లు నడచుటకు వీలు పడెను. నేనును మిత్రులతో కొవ్వూరు వెళ్ళి వంతెనమీద మొట్ట మొదట నడచిన రైలుబండిపై నెక్కి రాజమహేంద్రవరము వచ్చి తిని. ఇది యొక గొప్ప కార్యముగాదు. కాని యట్లు వంతెనపై నడ చిన మొట్టమొదటిబండి నెక్కుటకు కుతూహలపడితినని చెప్పుటకు మాత్రమే. 1899 డిశంబరు నాటికి నా "సౌందర్యతిలక"లో మొదటి భాగము పూర్తియయ్యెను. 1900 వ సంవత్సరము డిశంబరునాటికి రెండవభాగము పూర్తియై గ్రంథము సమాప్తమయ్యెను.

ఈ సంవత్సరమున (1900) వేసవికాలములో నా రెండవ చెల్లెలైన యచ్చమ్మకు మూడవ కుమార్తె పుట్టెను. మా కుటుం బము వీరవాసరమునుండి రాజమహేంద్రవరము వచ్చినందున రాయ

వరపువారి యింటి ప్రక్కనే యొక చిన్నయిల్లద్దెకు పుచ్చుకొని కాపురముంటిని. 1901 వ సంవత్సరమున నా పాఠశాలలో నేను మూడవఫారము పెట్టితిని. ఇక్కడనే పెద్దకష్టము. ఏలయన దానిని లోవరు సెకండరీ పాఠశాలగ జేసి విద్యాశాఖవారి సమ్మతిని బడయ వలయునని నా యాశయము. ప్రధానోపాధ్యాయుడు కనీసము ప్రవేశ పరీక్షాసిద్ధుడై బోధనాభ్యసనము నంది యా పరీక్షయందు సంపూర్ణ ముగ కృతార్థుడై యుండవలెను. వేంకటరత్నముగారు ప్రవేశపరీక్షా సిద్ధుడై, బోధనాభ్యసనము నందెను. గాని తత్పరీక్షయందు కృతా ర్థుడు గా లేడు. కాబట్టి ప్రధానోపాధ్యాయుడుగ నుండుట కప్పటి కతని కర్హత లేదు. పాఠశాలనుండి యతనిని దీసివేసి, సంపూర్ణ యో గ్యతగల మరియొకరిని నియమించుకొమ్మని కొందరు నాకు సలహా చెప్పిరి. కాని వేంకటరత్నముగారు నాకు చిరమిత్రుడగుటచేతను, సమర్థు డగుటచేతను, నా కాయనను దీసివేయుట కిష్టము లేకపోయి నది. ఇక నాపాఠశాల విద్యాశాఖవారి యనుమతిని బడయుటెట్లని నే నాలోచింప దొడగితిని.

ఆలోచనచేయుచు నేనొకనాడు నా మిత్రుడైన దామెర్ల రమ ణారావుగారి యింటికిపోయి కూర్చుండగ, నచ్చటికి నాకును, రమ ణారావుగారికిని మిత్రుడైన సత్యవోలు లక్ష్మీపతిగారక్కడకువచ్చిరి. నా పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడుగ నుండదగిన వారెవ్వరును దొరకలేదని ప్రసంగవశమున నేను వారితో చెప్పగ "నేను పనికి వత్తునా ?" యని లక్ష్మీపతిగారు నన్నడిగిరి. ఆయన పరిహాసమున కట్లనెనేమోయని నేను మొదట భావించితిని. ఏలయన, ఆయన యెక్కడ ? నా పాఠశాలయెక్కడ ? ఆయన జమీందారుల యల్లుడు. ఆయన పెద్దయల్లుడు జమీందారు. మిగుల భాగ్యవంతుడు. ఇంటి యద్దెలవల్లను, భూములవల్లను లక్ష్మీపతిగారికి, విశేషముగ రాబడి వచ్చుచుండెను. ఆయన వయసున నాకన్న పెద్దవాడు, గొప్పకుటుం బమున బుట్టిన గొప్ప గృహస్థుడు. ఆయన ప్రథమశాస్త్ర పరీక్ష యందు కృతార్థుడై కొన్నాళ్లు నరసాపురము టెయిలరు హైస్కూలు లోను, పిమ్మట రాజమహేంద్రవరమునందలి పాఠశాలలలోను సహా యోపాధ్యాయుడుగను, ప్రధానోపాధ్యాయుడుగను పనిచేసి పదిసంవ

త్సరముల క్రిందట పని మానుకొని యింటిదగ్గర నేయుండి విశ్రాంతి సుఖమనుభవించుచున్న భోగి. వారికిదగిన జీతము పుచ్చుకొన్నపక్షమున నేనీయజాలను. పుచ్చుకొనకుండ పనిచేయవలెనుటకు నాకు నోరాకలేదు. ప్రధానోపాధ్యాయులుగ నుండుట కాయన కన్నివిధముల యోగ్యతగలదు. "నేను పనికివత్తునా?" యని యాయన మరల నన్నడిగిరి. "ఇప్పటి నిబంధనల ప్రకారము మీరు తప్పక పనికివత్తురు" రని బదులు చెప్పితిని. "అట్లయిన నేను రేపటినుండి పనికివత్తు"నని వారు బదులుచెప్పిరి. "చిత్తము నా కింతకంటె యుపకారముగలదా?" యని పలికి నమస్కారము చేసితిని. లక్ష్మీపతిగారనగా నాడిన మాటకును, జేసెడి చేతకును భేదము జూపెడివారుగారు. ఆడినమాటకు నిలువబడి దానిప్రకారము పని యాచరించెడివారే. ఆయన మాపాఠశాల కుపాధ్యాయులుగ వత్తురని విన్నవారందరాశ్చర్యపడిరి. కొందరు నమ్మలేదు. లక్ష్మీపతిగారి గుణశీల మెరిగినవారు తప్పకవత్తురని నమ్మిరి. జీతమక్కరలేకుండ పనిచేయుదుమని వారు నాతో సెలవిచ్చిరి. మరునాడు పదిగంటలకు భోజనముచేసి, జీతముపుచ్చుకొని పనిచేయు నుద్యోగస్థునివలెనే కోటు తొడిగికొని, తలపాగ జెట్టుకొని మా పాఠశాలకువచ్చి తరగతులన్నియు జూచి మూడవఫారమున కింగ్లీషు తాము చెప్పెదమని చెప్పిరి. ఆప్రకారము కుందూరు వెంకటరత్నముగారు కాలపట్టిక (టైం టేబుల్) వ్రాసిరి.

మూడుఫారములకు ముగ్గురుపాధ్యాయు లుండవలెనని మరియొకరిని సహోపాధ్యాయునిగ నియమించితిని. ఆ దినములలో మహమ్మద్ ఆజమ్‌సాహేబుగారు గోదావరీమండలమునకు సహాయ పరీక్షాధికారిగ (అసిస్టెంట్ ఇనెస్పెక్టర్ ఆఫ్ స్కూల్స్) నియమింపబడిరి. ఆయనయు, లక్ష్మీపతిగారును పూర్వము సహాధ్యాయులు. ఆ కాలమున శ్రీ గరికపాటి సుబ్బారాయుడుగారు ఉత్తరసర్కారులలోని పాఠశాలలకు ప్రధాన పరీక్షాధికారిగనుండిరి. ఆయనయు లక్ష్మీపతిగారికి మిత్రులే. నేను మహమ్మద్ ఆజమ్ సాహెబుగారి దర్శనము చేసి, మా పాఠశాలను జూచి విద్యాశాఖవారి సమ్మతిని బడయునట్లు చేయుమని కోరి, దరఖాస్తును పంపితిని. మధ్యమ పాఠశాల, విద్యాశాఖవారి యనుమతి బడయుటకై సాముకసరతుల పరికరము

లాంతరులతో మెండుగ గావలయును. పేరలలుబారు, తోలుమూసిన కర్రిగుజ్జము, హారిజంటలుబారు, కొన్ని జతల డంబుల్సు, నురి స్తంభములవలెనుండు రింగులు, టిర్రిపీజు మొదలైన పరికరములు కావలెను. ప్రాథమిక పాఠశాలకు నాకాసంవత్సరము కొంతగ్రాంటు వచ్చెను. ఆ సొమ్ము వినియోగించి యీ పరికరములు చేయించితిని. పాఠశాల లోని విద్యాబోధ మెటులున్నను, పై జెప్పిన పరికరములును, సాముకసరతులు నేర్పెడి పంతులును, నొకపాకీదొడ్డి నుండినగాని యాదినములలో పాఠశాల విద్యాశాఖవారి యనుమతిని బడసెడిదిగాదు. ఈవన వెంకటాద్రియయ్యయను నతనిని నేను సాముకసరతుల యుపాధ్యాయునిగ నియమించితిని. మహమ్మదాజముసాహేబుగారు వచ్చి పాఠశాలనుజూచి యిది యంగీకృత పాఠశాలలో చేర్పవచ్చునని పై యధికారులకు సిఫారసుచేసిరి. గరికపాటి సుబ్బారాయుడుగారు కూడ మా పాఠశాలను జూచి, డైరెక్టరుగారికి సిఫారసు చేయుదుమని చెప్పిరి. ఆ దినములలో శ్రీ గరికపాటి సుబ్బారాయుడుగారి యొద్ద చెరుకూరి లక్ష్మీనరసింహముగారని యొకబ్రాహ్మణుడు ప్రధానలేఖరిగ (హెడ్ క్లార్కు) నుండెను. ఆయనకును నాకును కొంతకాలమునుండి మైత్రికలసెను. అందుచేత వారుగూడ నా పాఠశాల విషయమున ననుకూలముగ పనిచేసిరి. ఇక్కడ యధికారులు సిఫారసు చేసిరిగాని, యంగీకరింపబడినట్లు చెన్నపురినుండి యుత్తరువులు నాకు రాలేదు. ఇట్లు 1901 వ సంవత్సరములో మొదటి యారుమాసములు గడచెను.

ఆ సంవత్సరమున ఫిబ్రివరినెలలో, ననగా శార్వరి సంవత్సర మాఘ మాసమున, మా తమ్ముడు కృష్ణమూర్తికి వివాహమయ్యెను. నా మేనమామగారైన పురాణపండ మల్లయ్యశాస్త్రిగారికి ముగ్గురు కుమాళ్లు, నొక కుమార్తెయు. ఆ కుమార్తె కప్పుడు పదునొకండు సంవత్సరములు వయసు. నా మేనమామగారికి మామీద మొదటి నుండియు మిక్కిలి యభిమానమని యిదివరకే వ్రాసితిని. ఆ యభిమానముచేతనే వారు మా తమ్మునకు తమ బాలిక నిచ్చి వివాహము జేసిరి. అప్పుడు మా తమ్ముడు ముప్పదియేండ్ల వయసువాడు. అంతకాలమువరకు నేల పెండిలి కాలేదని సందేహము తోపవచ్చును.

మొదటినుండియు నతడు రోగపీడితుడగుటచే, మా తండ్రిగారతనికి పెండ్లి చేయలేదు. అదిగాక, మేనరికము చేసికోవలెనని మా తల్లికి, పినతల్లులకు గట్టిపట్టు కలదు. తన కూతురును మా తమ్మునకేయిచ్చి వివాహము చేయవలెనని మా తల్లియు, పినతల్లులు మా మేనమామగారిని నొక్కి యడిగిరి. దానికతఁ వచ్చినప్పు డాలోచింతములెండని యాయన సమాధానము చెప్పుచు వచ్చిరి. ఎట్టకేల కా బాలికకు వివాహపు వయసు వచ్చెను. తోబుట్టువుమీదగల ప్రేమచేత మల్లయ్యశాస్త్రిగారు, మా తమ్ముడు వయసుమీరినవాడయినను, విద్యావిశేషము లేనివాడయినను, మిక్కిలి భాగ్యవంతుడు గాకపోయినను, గుణవతియు విద్యావతియునైన తన కూతును, రామలక్ష్మమ్మను మా తమ్మున కిచ్చి వివాహముచేయుట ప్రశంసనీయమైన కార్యమని మా బంధువులు శాస్త్రిగారి మిత్రులును సంతోషించిరి. ఆ వివాహము వీరవాసరమునకు మిక్కిలి సమీపమందున్న సత్యవపురి గ్రామములో మల్లయ్యశాస్త్రిగారి బావమరదియైన చిలకమర్తి వెంకయ్యగారి యింట జరిగెను. నేను నాలుగువందలరూపాయలు ఋణము జేసి, పిల్లకు రెండువందలరూపాయలు నగలుపెట్టి, రెండువందల రూపాయలు ఖర్చుపెట్టి, రాజమహేంద్రవరమునుండి బాణసంచ తెప్పించి, శాస్త్రిగారి దర్జాకు తగినట్లు పెండ్లిచేసితిని. అప్పటికి నా భార్య మెడలో బంగారపు పట్టెడయినను లేదు. తక్కినవాటిమాట చెప్పనేల ?

1901 వ సంవత్సరము వేసవికాలపుసెలవుల యనంతరమున మా పాఠశాలను తెరచితిమి. ఎప్పటివలెనే లక్ష్మీపతిగారు పాఠశాలకువచ్చి పనిచేయనాగిరి. విద్యలోను, వయసులోను, స్థితిలోను లక్ష్మీపతిగారికంటె నేను తక్కువవాడనైనను, స్వగృహమందు హాయిగ సుఖింపక యీ మహాత్ముడు "కుంజరయూథంబు దోమ కుత్తుకజొచ్చెన్." యన్నట్లు చిల్లిగవ్వయైనను నావల్ల జీతమపేక్షింపకుండ స్వార్థత్యాగముజేసి, తనకాలము నానిమిత్త ముపయోగించి నందుకును నేను పాఠశాలాధికారిగను, నాచేతిక్రింద లక్ష్మీపతిగారు దాఖేదారుగ నున్నందుకు నాలో నేనే సిగ్గుపడుచుండెడివాడను. ప్రతిదినము లక్ష్మీపతిగారు పనిచేయు విధానమిట్లుండెను; పగలు పది

గంటల కాయన భోజనముచేసి, దుస్తులు వేసుకొని, పండ్రెండు గంటల లోపుగ పాఠశాలకు వచ్చెడివారు. అప్పటికి నేను భోజనము జేసి, బసికిపోయి, యుపాధ్యాయులు కూరుచుండుట కేర్పడిన గదిలో (కామన్ రూమ్) కూర్చుండువాడను. లక్ష్మీపతిగారును నేనును పాఠ శాలా విషయముల గూర్చియు, మరి యితరవిషయములగూర్చియు, ముచ్చటించుకొనుచుండెడివారము. ఒంటిగంట మొదలు రెండు గంటలవరకు వెంకటరత్నముగారు మొదలగు తక్కిన యుపాధ్యా యులు మమ్ము కలుసుకొనుచుండెడివారు. రెండుగంటలు కాగానే, యెవరి తరగతికి వారు వెళ్ళుచుండెడివారు. లక్ష్మీపతిగారుకూడ మూడవఫారముకు వెళ్ళి సాయంకాల మైదుగంటలవరకు, నిమిష మైన వ్యర్థముచేయకుండ, వంచిన నడు మెత్తకుండ, మిక్కిలి శ్రద్ధతో పాఠములు చెప్పుచుండెడివారు. ఆయన యాకారము మిక్కిలి గాంభీర్యముగ నుండెడిది. దట్టమైన మీసకట్టు, మొగమున కెంపో యందము తెచ్చినది. ఆయన యాకారము విద్యార్థులకే గాక, సహోపాధ్యాయులకు కూడ భయంకరముగ నుండెడిది. ఆయనపేరు సింహస్వప్నము. దర్శనము సింహదర్శనము. ఇట్లను టచే నాయన యెంతమాత్రము క్రూరుడుగాడు. ఆయన మాట కఠి నముగాని, హృదయము మిక్కిలి మెత్తనిది. ఆయనది జాలిగుండె యను టతిశయోక్తిగాదు. ఆయనయొద్ద బదులుపుచ్చుకొన్నవారు మిక్కిలి ధన్యులు. కొందరికి వడ్డి తగ్గించియు, కొందరికి వడ్డి పూర్తిగ మానియు, కొందరి కసలులోనే తగ్గించియు, ఋణము దీసికొన్న వారికి లక్ష్మీపతిగారు మిక్కిలి యుపకారము చేయుచుండెడివారు. ఒకవిద్యార్థి బొంబయిలో పారిశ్రామికపాఠశాలలో చదువుకొనుటకై నావద్దకు వచ్చి లక్ష్మీపతిగారికి సిఫార్సుచేయమని కోరగా, నేనట్లు చేసితిని. ఆ విద్యార్థి కాయన నూటయేబదిరూపాయ లొక్కమా రుచితముగ నిచ్చిరి. ఈ విద్యార్థి కొక్కనికేగాదు. ఇటువంటి విద్యా ర్థుల కనేకుల కాయన సహాయముచేసెను. దసరా మొదలగు సెలవు దినములలో జీతము పుచ్చుకొనునట్టి యుపాధ్యాయులు బడివంక జూడకపోయినను, లక్ష్మీపతిగారు మట్టుకు పరీక్షకుబోవు విద్యార్థుల తరగతిని మధ్యాహ్నము రమ్మని రెండు మొదలయిదుగంటలువరకు

శాలురకు కావలసిన పాఠములు చెప్పుచుండెడివారు. ఇంతటి సంపన్న గృహస్థుడేమి! పాఠశాలలో నుచితముగ బనిచేయుట యేమి! యని సందేహముగోచి, విద్యాశాఖాధికారు లకస్మాత్తుగ నడుమ నడుమ వచ్చి లక్ష్మీపతిగారు బడికి వచ్చినారో లేదో యని చూచుచుండెడి వారు. వారెప్పుడు వచ్చినను లక్ష్మీపతిగారు బడిలో ప్రత్యక్షముగ గనబడుచుండుటచే, లక్ష్మీపతిగారు పేరునకుమాత్రి ముపాధ్యాయ త్వము చేయుచుండుట లేదు. మనస్ఫూర్తిగనే చేయుచున్నారని యధి కారులు నమ్మి పోవుచుండిరి.

1901 వ సంవత్సరము ప్లవసంవత్సరము. ఆ సంవత్సరమున నధికమాసము వచ్చెను. శ్రావణ మధికమా? ఆషాఢ మధికమా? యను ప్రశ్న వచ్చెను. ఆంధ్రదేశమున నానాభాగములనుండి జ్యోతి శ్శాస్త్రపండితులు చాలమంది వచ్చి రాజమహేంద్రవరములో సభ లుచేసి చర్చించిరి. నేను శ్రావణపక్షము వహించి, యా సభలలో పాలుగొంటిని.

ఈ 1901 వ సంవత్సరమున మా పాఠశాలకు దగిన ప్రధానో పాధ్యాయుడుగ లక్ష్మీపతిగారు లభించుటచే, లోవరు సెకండరి పాఠ శాలగ విద్యాశాఖవారి యనుమతి బడసెను. అది మిక్కిలి కష్టము మీద నయ్యెను. ఎట్లు కష్టమనగా, గోదావరిమండల విద్యాశాఖాధి కారియైన మహమ్మదాజముసాహెబుగారికిని, నాకును గొంత మన స్పర్ధ గలిగెను. కారణము మిక్కిలి చిన్నది. మా పాఠశాల స్థాపింపక మునుపు మెరకవీధి తెలగాలైన ముత్తంగి రామకృష్ణయ్యగారు పాఠ శాల నొక దానిని స్థాపించిరి. దాని పేరు "టవును" స్కూలు. స్థాపిం పబడిన కొలదికాలముననే రామకృష్ణయ్యగారు మృతినొందిరి. ఆయన కుమారుడు జగ్గారావుగారు దానిని నడుపుచుండిరి. రెండు పాఠశాలలును ప్రాతయూరులోనే యుండుటచేత జగ్గారావుగారి బడియు, మా బడియు పోటీమీద పనిచేయుచుండెను. ఇట్లుండగ, 1901 వ సంవత్సర మధ్యమున మండల విద్యాశాఖాధికారియైన సాహెబుగారు మా పాఠశాల పరీక్షింపవలసివచ్చెను. ఆ పరీక్ష సందర్భమున మా పాఠశాల పరీక్ష నిమిత్తము జగ్గారావుగారి పాఠశాలకు పంపుమని సాహెబుగారు నా కొక తాఖీదు బంపిరి. విద్యాశాఖాధి

కారులు నిబంధనల ప్రకారము పాఠశాల యెక్కడనున్నదో యక్క
డకే బోయి పరీక్షింపవలెనుగాని మరియొకచోటునకు రమ్మనగూడదు.
అట్టి నిబంధన లుండినప్పటికి సాహేబుగారు నిరంకుశాధికారముగల
నవాబువలె నా పాఠశాలను మరియొక చోటునకు బంపుమనివ్రాసిరి.
అది నిబంధనలకు విరుద్ధమేగాక, మాకు పోటీగ పనిచేయుచున్న పాఠ
శాలకు బంపుట యాత్మగౌరవమునకు భంగమని నాకు దోచెను.
అట్లు బంపుట నా కిష్టము లేదనియు, నవసరమైన పక్షమున మరియొక
చోటునకైన బంపెదనుగాని యీ "టవును"స్కూలునకు మాత్రము
బంపననియు, వారి హుకుమునకు జవాబువ్రాసి బంపితిని. ఆ జవాబు
చూచుకొనగానే సాహేబుగారికి నాపై ఆగ్రహమువచ్చెను. కారణ
మేమన, తాను గొప్ప మండలాధిపతిననియు, పాఠశాలను స్థాపించిన
వారు మండల విద్యాధికారుల నిగ్రహానుగ్రహములకు పాత్రులై
యుండవలసిన యధమాధములనియు, నధికారుల హుకుములకు విరు
ద్ధముగ వ్రాయగూడదనియు, సాహేబుగారి యభిప్రాయము. వారితో
సమానాధికారులో, వారికంటె పై యధికారులో వారికి లిఖితపూ
ర్వకమైన జాబులు వ్రాయవలెనుగాని మిక్కిలి యల్పులయిన ప్రాథ
మిక పాఠశాలా పరిపాలకులు లిఖితపూర్వకమైన సమాధానము
పంపకూడదనియు, తెలియపరచవలసిన విషయ మున్నపక్షమున
ఖుద్దున వెళ్ళి మనవి చేసుకొనవలెననియు వారి యభిప్రాయము.
ఖుద్దున వారితో నేను మనవిచేసికొనకపోవుట నాది తప్పట! నా
వంటి యల్పుడు వారివంటి ప్రభువులకు జవాబువ్రాయుట యవ
మానకరమట! వ్రాసిన కాగితమునకు జవాబువ్రాయుట తప్పని
నాకు తోచలేదు. అదివరకు సాహేబుగారికి నామీద యిష్టముగ
నుండెను. వారి యింటికి నేను తరుచుగ వెళ్ళుచుండెడివాడను. వారు
మిక్కిలి ప్రసన్నులై నాతో మాటలాడుచుండెడివారు. గత సంవత్స
రమున వా రజీర్ణవ్యాధివలన బాధపడినప్పుడు నేను వెళ్ళి తరుచుగ
వారి క్షేమ మరయుచుంటిని. అరయుటయేగాక, తగిన వైద్యుని తీసి
కొనిరమ్మని వారు నన్ను కోరినపుడు, నా మిత్రుడును, ఘనవైద్యుడు
నైన డాక్టర్ వెంకటరమణారావుగారిని దీసికొనిపోయి వారికి
వైద్యము చేయించితిని. అది యుచితవైద్యముగాదు. సాహేబుగారు

రమణారావుగారికి తగిన బహుమానము జేశిరి. మొత్తముమీద మే మిరువురము మిత్రులమేయని చెప్పవచ్చును. నా కాపితము వెళ్ళిన తరువాత మా మిత్రత్వము శత్రుత్వముక్రింద మారెను. వారికి నాపై నాగ్రహము కలిగినదని విని నేను వారి యింటికిబోయి వారి దర్శనము జేసితిని. వారు మునుపటివలెనే ప్రీతిపూర్వకముగమాట లాడక, కఠినముగ మాటలాడజొచ్చిరి. నా యభిప్రాయము ఖుల్లున వెళ్ళి వారికెందుకు మనవిచేసుకోలేదని వారు నన్నడిగిరి. అది తప్పని నేతలంపలేదనియు, మేము మాటిమాటికి యధికారుల యిండ్లకు బండ్లుచేసుకొని పోవుటకు సంపన్నులముకామనియు, వినయముగ మనవి చేసితిని. నా మాటలు వారిని శాంతిపరచుటకుమారు మరింత కోపోద్దీపితుని జేసెను. ఎట్లైటో నేను వారికడ సెలవుపుచ్చికొని యిం టికి బోతిని.

ఆ మరునాటినుండి సాహేబుగారు మితిమీరిన కక్ష సాధింప జొచ్చిరి. అందు మొదటిదేమనగా నాపాఠశాలను నాశుజేయుట. నాపాఠశాలలో నేదైన తప్పులున్నవేమో కనుగొని, విద్యాశాఖాధి కారులకు వ్రాసి యది యంగీకారము బడయకుండచేయవలెనని వారి సంకల్పము. ఆ సలకల్పముతో వారు ముందుగా మాకు తెలి యచేయకుండా పాఠశాలకు హఠాత్తుగ నెన్నోసారులుపోయి చూచు చుండిరి. వారు పాఠశాలకు పోయినప్పుడెల్ల లక్ష్మీపతిగా రచ్చట నుం డుటచేతను, పేర్కొనదగిన తప్పులేమియు గనపడక పోవుటచేతను, మున్ను తానుజేసిన యనుకూలమైన సిఫార్సున కెంతమాత్రము విరుద్ధ ముగ వ్రాయుటకు వీలులేక వారూరకుండిరి. కాని వారు దానితో సంతుష్టి జెందక తరుచుగ నామిత్రులకడకుపోయి నేను మహాదుష్టుడ ననియు, స్నేహపాతుడను గాననియు, యేమేమోజెప్పి వారి మనసు లను కళంకితములు చేయసాగిరి. నాస్వభావమెరిగినవారు సాహేబు గారి మాటలను సరకుచేయరైరి.

నా స్నేహితులు నన్నెప్పటివలె నాదరించుటచేత తనమాటలు పనిచేయలేదని సాహేబుగారికి నామీదకోపము ద్విగుణీకృతమయ్యెను. తన్ను నే నవమానము జేసితినని నామీద దోషారోపణముజేసి, జేబులో నొక పిస్తోలు పెట్టుకొని నేనొంటిగ దొరికినప్పుడు దానితో

కాల్చి చంపెదనని నామిత్రులైన దామెర్ల వెంకటరమణారావు గారితో చెప్పిరట. ఆప్రతిజ్ఞ విని నే నెంతమాత్రము భయపడలేదు. నేను పట్టణములో నెప్పటివలెనే నాపనులమీద తిరుగుచుంటిని. వేయేల! ఆకోపావేశమున వారు మైమరచి పిచ్చివానివలె సంచరింప జొచ్చిరి. పైనుండివచ్చిన కాగితములుకాని, క్రిందివారి వద్దనుండి వచ్చెడి కాగితములుగాని, వారు జూచుట మానిరి. జవాబులనిచ్చుట మానిరి. గుమాస్తాలచే వ్రాయబడిన కాగితములమీద సంతకములు చేయుటమానిరి. కార్యస్థానము నిద్రపోవుచుండెను. ఈస్థితినిగ్రహించి దొరతనమువారు సాహేబుగారిని కొన్ని మాసములు బర్తరపు (సస్పెంష్) చేసిరి.

ఆ కాలమున రాజమహేంద్రవరములో నొక విశేషము జరిగెను. ప్రథమ శాస్త్రపరీక్షకు షేక్స్పియరు మహాకవి రచియించిన "జూలియస్‌సీజ"రను నింగ్లీషు నాటకము పఠనీయగ్రంథముగ నిర్ణయింపబడెను. అప్పటి కళాశాలా ప్రధానాచార్యులైన స్టోనుదొరగారు నాటకమును విద్యార్థులకు నేర్పి వారిచే నాడించిరి. కళాశాలయే రంగస్థలము. అప్పుడు సాహేబుగారొక పెద్దమనుష్యునియొద్ద నాటకమునకు భోగముదానిని తీసికొని రావచ్చునా యని యడిగిరట, కూడదని యాపెద్దమనిషి బదులుచెప్పగా దొరసానులు వచ్చుట లేదా? భోగముదేల రాకూడదని సాహేబుగారు మరల ప్రశ్నించిరట! ఆవార్తలా పెద్దమనుష్యుడు పూసగ్రుచ్చినట్లు దొరగారితో చెప్పగా, దొరగారికి సాహేబుగారిమీద నెంతో నాగ్రహము గలిగెను. దానిఫలిత మేమనగా సాహేబుగారు, నాటకమునకు టిక్కెట్టు కొన్నప్పటికిని సాహేబుగారిని లోపలికి రానీయవద్దని చెప్పి కళాశాల ముఖద్వారమువద్ద పోలీసువారిని దొరగారు కావలిబెట్టిరి. శ్రీ మోచర్ల రామచంద్రరావుగారును, మహమ్మదాజము సాహేబుగారును నాటకము చూచుటకై గుఱ్ఱపుబండి నెక్కి వచ్చిరి. పోలీసువారు దొరగారి యాజ్ఞను విన్నవించిరి. వెంటనే సాహేబుగారు నాగుర్రపు బండిమీదనే యింటికిపోయిరి. సాహేబుగారు దొరసానులను భోగముదానితో సమానము చేసిరని దొరగారు కోపించి యిట్లుచేసిరి. అయిదేసి రూపాయలు టిక్కెట్టు కొనుక్కొని నేనును, లక్ష్మీపతిగారును

నాటకమునకు పోయి చూచితిమి. నాటకము బాగుండెను. బంగారెడ్డి గారు నాటకములో "ఆంటోనీ" పాత్రను ధరించి మిక్కిలి హృదయంగమముగ నభినయించిరి. సాహేబుగారి స్థానమందు నూతనముగా గోదావరి మండల విద్యాశాఖాధికారి (అసిస్టెంట్ ఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్స్)గా బరంపురం నివాసులైన భట్టుగారిని బంపిరి. వారు పరమ సాధువులు. మాననీయులు. ఆయన పనిలో బ్రవేశించిన తరువాత మా పాఠశాలకు స్వయముగవచ్చి పరీక్షనడిపిరి. ఈ విషయమున నే నాత్మగౌరవమును నిలుపుకొంటినని నామిత్రులు సంతోషించిరి.

1901 వ సంవత్సరము జూను నెలలో నాలుగవ గోదావరి మండలసభ యమలాపురములో జరిగెను. సభా ప్రతినిధులు గూరుచుండుటకు గావలసినన్ని బల్లలమలాపురములో నొరకనందున, నా పాఠశాలలోని బల్లలను కొన్నింటిని, నేను రహదారి పడవమీద వేసి యమలాపురము బంపితిని. ఆ సభకు నేనుకూడ పోయి యా మూడుదినములు నా మేనమామయైన మల్లయ్యశాస్త్రిగారి యింట బసచేసితిని. గంజాము మండలములో నున్న శ్రీకాకుళము మునిసిపాలిటీ కథ్యక్షులైన శ్రీ తిమ్మరాజు శివరావుపంతులుగా రధ్యక్షత వహించిరి. శ్రీ గంజాము వేంకటరత్నము పంతులుగారు కూడ సభకు వచ్చియుండిరి. వారి ప్రోత్సాహముమీద నేనొక తీర్మానము మీద మాటలాడి సభలో పాల్గొంటిని. గోదావరీమండలసభ మొట్ట మొదట కాకినాడలో న్యాపతి సుబ్బారావుపంతులుగారి యధ్యక్షత క్రింద జరిగెను. రెండవసభ 1896 వ సంవత్సరమున రాజమహేంద్రవరమున శ్రీ జంబులింగ మొదలియారుగారి యధ్యక్షతక్రింద జరిగెను. 1897 వ సంవత్సరమున నేలూరు పట్టణమున శ్రీ రెంటాల వెంకటసుబ్బారావుగారి యాధిపత్యమున మూడవసభ జరిగెను. ఆ సభకు నే బోవలేదు. 1898 వ సంవత్సరమున పసలపూడిలో శ్రీ కృత్తివెంటి పేరాజుగారి యధ్యక్షతక్రింద జరిగినట్లు యిదివరకే వ్రాసితిని. 1899 వ సంవత్సరమునను, 1900 వ సంవత్సరమునను మండలసభ మాయమై యెక్కడను జరుగలేదు. ఎట్టకేలకో యైదవ సభ యమలాపురములో జరిగెను. ఆ సభలో నేను కొన్ని పద్యములు

చదివితిని. అవి "దేశోపకారి" పత్రికలో ప్రకటింపబడెను. ఆ పత్రికను మహారాజశ్రీ సత్యరాజు సీతారామయ్యగారు యేలూరులో నడిపిరి.

నా పాఠశాల విద్యాశాఖవారి సమ్మతిని బడయుటకై గడచిన యేప్రియలు నెలలోనే దరఖాస్తుచేసినను నధికారులు దాని నంగీకరించినట్లు జూలైవరకు నుత్తరువు రాలేదు. లోవరు సెకండరీ పరీక్షకు దరఖాస్తు చేయవలసిన విద్యార్థులు యాగస్టులోనే దరఖాస్తులను తెప్పక పంపవలెను. ఎంతకాలమునకును నుత్తరువులు రాకపోవుటచే నే నాగస్టు నెలలో మా పాఠశాలను గురించి నుత్తరువులు పంపుమని డైరెక్టరుగారికి తంతివార్త నిచ్చితిని. పాఠశాల నంగీకరించితిమని తంతిమూలముగనే నాకు జవాబువచ్చెను. తరువాత కొన్నినాళ్ళకు డైరెక్టరుగారి కార్యస్థానమునుండి క్రమముగ లిఖితపూర్వకమైన సమాధానము వచ్చెను. ఈవిధముగ నాపాఠశాల 1901 వ సంవత్సరము విద్యాశాఖవారి యనుమతిని బడసి వర్ధిల్లెను. మా పాఠశాలను గురించి యిక్కడ నొకమాట వ్రాసెదను. దీనిపేరు "హిందూలోవరు సెకండరీ పాఠశాల". స్థాపించిన నేను పేదవాడ నగుటచే, మా పాఠశాలగూడ పేదగనే యుండెను. చాలమంది పేదవిద్యార్థులు మా పాఠశాలలో చేరిరి. కొందరు విద్యార్థులు జీతమీయకుండను, కొందరు సగముజీత మిచ్చుకొనుచును, చదువుకొనుచుండిరి. మొత్తము మీద మా పాఠశాలలో విద్యాభ్యాసముచేయు బాలురలో నూటికేబదిమంది జీతమీయకుండ చదువుకొనువారే. "మంగలివానిని జూచి యెద్దు కాలు కుంటిన"దన్న మాట నిజము. నెలకు వేయిరూపాయిలు సంపాదించుచున్న న్యాయవాది నాకిట్లు వర్తమాన మంపెను. "మాయింట నాభార్య మేనల్లుడొకడున్నాడు. అతనికి ధర్మార్థముగ నే నన్నము బెట్టుచున్నాను. మీరు జీతములేకుండ చదువుచెప్పుడు," పరమలోభియైన యా న్యాయవాదియొక్క స్థితియు, గుణము నే నెరుగుదును; కావున వారికోరిక నిరాకరించితిని. ఇదిగాక మరియొక యుదాహరణ గలదు. చిరకాలము తహసీలుదారు పనిచేసి, లంచములు విశేషము పుచ్చుకొని, చాల ధనమార్జించి, యిప్పుడు నెలకు నూరురూపాయలు పింఛనుదీసికొనుచున్న యొక గొప్ప గృహస్థుడు

లక్ష్మీపతిగారికడకు బోయి తన భార్య తమ్ముడు మిక్కిలి పేదవాడ
నియు, వానికి జననీ జనకులు లేరనియు, వానికి తానుచితముగ
నన్నము బెట్టుచున్నాననియు, కావున వానికి నుచితముగ చదువు
చెప్పవలసినదనియు కోరెను. లక్ష్మీపతిగారు "నాపెత్తనమేమియు
లేదు. జీతమువిషయమున నంతయు లక్ష్మీనరసింహముగారిదే" యని
చెప్పి తప్పించుకొనిరి. ఆగృహస్థుడు నాకడకు వచ్చి నన్ను పీడకొని విన
లేదు. సత్రమున్న పక్షమున భాగ్యవంతులుగాని, ప్రాడ్వివాకుల
యింటనున్న పక్షమున డబ్బులు ఖర్చగునని తెలిగ అన్నమువారికిడక
సత్రములోనే భుజించిన ట్లుచితముగ చదువుచెప్పెడివారున్న పక్ష
మున సంసన్నులు సయితము తమబంధువులకు నుచితముగ చదువు
చెప్పుమని సిఫారసు చేయునట్టి నీచదశ మనదేశములో నింకను పోలేదు.
నెలకు నూరురూపాయలు జీతముపుచ్చుకొనదగిన ప్రధానోపాధ్యా
యుడు మాపాఠశాలలో నుచితముగ పనిచేయుచున్నను, మిగిలిన
యుపాధ్యాయులకు నెలనెలకు నీయవలసిన జీతము వసూలగుట
కష్టముగ నుండెను. ఇక్కడ నాటకసమాజమును గురించి కొన్ని
మాటలను వ్రాయవలెను.

రాజమహేంద్రవర హిందూనాటక సమాజమును 1889 వ
సంవత్సరమున (శ్రీ) ఇమానేని హనుమంతరావు నాయుడుగారు స్థాపిం
చిరనియు, నాయుడుగారు టంగుటూరి ప్రకాశముగారు, మున్నగు
వారు ముఖ్యనటులుగ నుండిరనియు నీవరకే వ్రాసితిని. ఆ సమా
జము 1894 వ సందత్సరమువరకు నాటకములాడి నాట్యకళను
పోషించి పేరువడసెను. అది మొదలుకొని, 1901 వ సంవత్సరము
వరకాసమాజమువారు నాటకములను ప్రయోగింపలేదు. హను
మంతరావు నాయుడుగారి కోరిక ననుసరించి నేను వారికి కొన్ని
నాటకములను రచియించి యిచ్చితిని. వారు పెక్కుమారులు నా నాట
కములను ప్రయోగించి మెప్పువడసిరి.

# స్వీయచరిత్రము

## పదవప్రకరణము

## నాటకసమాజ పునరుద్ధరణము

నాటకసమాజమును మరల నుద్ధరింపవలెనని హనుమంతరావు నాయుడుగారికిని, నయినవోలు తాతయ్యనాయుడుగారికిని, నుత్సాహము పుట్టెను. హనుమంతరావునాయుడుగారి కప్పటికి రమారమి డెబదిసంవత్సరము లుండినను, వయసు హెచ్చినకొలది నాటకములమీది యుత్సాహము హెచ్చెనేగాని మందగింపలేదు. ఆ యుత్సాహాగ్ని సమిధలువేసి ప్రజ్వలింపచేసెనేగాని తాతయ్యనాయుడుగా రార్పలేదు. ఆ యుత్సాహము పురస్కరించుకొని, హనుమంతరావునాయుడుగారు, నాటకసమాజమును మరల నుద్ధరించిరి. మొట్టమొదట నా "పారిజాతాపహరణ" నాటకమును, నవాబుదేవిడీలో ప్రయోగించిరి. అప్పటికి ప్రకాశముగారు మునిసిపల్ సభ్యుడుగాను, న్యాయవాదిగను నుండుటచే నాటకములలో పాల్గొనుట మానిరి. కృత్తివెంటి నాగేశ్వరరావు, గాడిచర్ల రామమూర్తి, స్త్రీపాత్రలు ధరింప నారంభించిరి. రాజమహేంద్రవరములోని కొందరు మహమ్మదీయయువకులు, సమాజముగచేరి, హిందూస్తానీ నాటకములాడదలచి, యిన్నీసుపేటలోని కుమ్మరిగుంటయొద్ద నొక పాకవేసి, కొన్ని నాటకములు మాత్రమే ప్రయోగించి, మానివేసి, తమ పర్ణశాల నమ్మజూపిరి. అప్పుడు హనుమంతరావునాయుడుగారు, నూరు రూపాయల కాపాక క్రయమునకు దీసికొని, తాతయ్యనాయుడుగారి సహాయముచేత, నే డెనిమిది సంవత్సరములనుండి గాఢనిద్రపోవుచున్న నాటకసమాజ కుంభకర్ణుని విశ్వప్రయత్నముమీద మేలుకొలిపిరి. హనుమంతరావునాయుడుగారు, మ్యునిసిపలు పాఠశాలలో ప్రధానోపాధ్యాయులుగ నున్నందున పైయధికారు లేమందురోయని, సమాజకార్యములన్నియు తానే చక్కబెట్టుచున్నను, బహిరంగముగ తానే మేనేజరుగ నుండుట కిష్టములేక, తన ప్రియమిత్రుడనై, యొకరి తాబేదారుడుగాక, స్వతంత్రుడనైన, నన్ను బిలిచి సమాజమునకు ప్రెసిడెంటుగాను, మేనేజరుగాను నుండుమని కోరిరి. నాటక

సమాజమన్న నాకు మిక్కిలి కుతూహలమే గావున వారికోరిక నే నంగీకరించితిని. మునుపటి కుమ్మరిగుంట యిప్పుడు లేదు. మా నాటకపుపాకయున్న స్థలము బోధనాభ్యసన కళాశాల (ట్రెయినింగ్ కాలేజీ) యావరణలో గలిపివేయబడినది. కుళ్ళునీళ్ళ గుంటయైన కుమ్మరిగుంట పూడ్చివేయబడినది. ఆ తాటియాకుల పాకలో మా సమాజమువా రనేకనాటకములను ప్రయోగించిరి. హనుమంతరావు నాయుడుగారి యుత్సాహమునకు, శ్రీ సత్యవోలు గున్నేశ్వరరావు గారును, కృత్తివెంటి నాగేశ్వరరావుగారును తోడుపడిరి. సమాజమునకు నేను ప్రెసిడెంటుగాను, గున్నేశ్వరరావుగారు వైసుప్రెసిడెంటుగాను నేర్పడితిమి. సమాజమువారు వచననాటకములేగాక, పద్యనాటకములుగూడ, నభినయింప నారంభించిరి. సమాజమువారు నా నాటకములేగాక యితర నాటకములుగూడ నాడనారంభించిరి. ఇతరనాటకము లివి. వీరేశలింగముగారి "శాకుంతలము", "రత్నావళి", "చమత్కార రత్నావళి", "సత్యహరిశ్చంద్ర" నాటకము; వడ్డాది సుబ్బారాయుడుగారి "వేణీసంహారము", "విక్రమోర్వశీయము"; ధర్మవరము రామకృష్ణమాచార్యులవారి "చిత్రనళీయము" మొదలైనవి. నా నాటకములు "గయోపాఖ్యానము", "పారిజాతాపహరణము", "శ్రీరామజననము", "ద్రౌపదీ పరిణయము", "నలనాటకము", "సీతాకళ్యాణము" మొదలైనవి. అప్పటికి "ప్రసన్నయాదవ" నాటకమును నేను వ్రాసియుండలేదు గనుక దానిపేరు చెప్పలేదు. ఈపర్యాయము పద్యములు చదువనేర్చిన యువకు లనేకులు మాసమాజములో చేరుటచే, మేము సరసమైన పద్యగద్యాత్మక నాటకములుగూడ ప్రదర్శింపగలిగితిమి. వచనభాగములో బాగుగ నభినయింపగలవారు శ్రీ హనుమంతరావునాయుడు గారు, సయినవోలు తాతయ్యనాయుడుగారు. పద్యభాగములో నేర్పుతో నభినయింపగలవారు, దుగ్గి గోపాలకృష్ణారావుగారు. ఈయన జిల్లాకోర్టులో గుమాస్తాగా నుండెడివారు. రెండవవారు నేతి సుబ్బయ్యగారు. ఈయన మ్యునిసిపల్ పాఠశాలలో నుపాధ్యాయుడుగ నుండెడివారు. మూడవవారు పరిటాల వీరన్నగారు. ఇతనికి నుద్యోగమేమియు లేదు. ఈనాముదారు "రంగతిలక" మని చెప్ప

వచ్చును. వీరరసప్రధానములగు పాత్రల నభినయింపవలసివచ్చి నప్పు డితనికితడే సాటి. "వేణీసంహార"ములో నశ్వత్థామపాత్రయు, "గయోపాఖ్యానము"లో నర్జునపాత్రయు, "ప్రసన్నయాదవము"లో నరకాసురుని పాత్రయు నీత డభినయించినప్పుడే చూడవలెను. దుర్గి గోపాలకృష్ణరావుగారు "వేణీసంహారము"లో ధర్మరాజుపాత్రను, "హరిశ్చంద్ర"లో హరిశ్చంద్రపాత్రయును, "ప్రసన్నయాదవ", "గయోపాఖ్యాన"ములలో శ్రీకృష్ణపాత్రయు, "చిత్రనళీయము"లో నలపాత్రయు మిక్కిలి సొగసుగ నభినయించి ప్రేక్షకులను రంజింప జేసెడివారు. నేతి సుబ్బయ్యగారు మిక్కిలి శ్రావ్యముగ పద్యములు జదివి "వేణీసంహారము"లో దుర్యోధనపాత్రయును, "గయోపాఖ్యానము"లో గయునిపాత్రను, "శాకుంతలము"లో దుష్యంతునిపాత్రను, "విక్రమోర్వశీయము"లో రాజుపాత్రను, శ్లాఘాపాత్రముగ నభినయించి సభాసదుల మెప్పు బడసెడువాడు. గయోపాఖ్యానములో పద్యములు చేర్చకమునుపు, హనుమంతరావునాయుడుగారే గయుని పాత్ర ధరించెడివారు. "వేణీసంహారము"లో సుందరకునిపాత్ర ధరించి యా భాగము మహాద్భుతముగ నభినయించి, సభాసదులయొక్కయు, గ్రంథకర్తయైన శ్రీ వడ్డాది సుబ్బారాయుడుగారియొక్కయు, స్తోత్రములకు బాత్రులైరి. వీరుగాక తాతయ్యనాయుడుగారినిగూడ ప్రశంసింపవలెను. హనుమంతరావునాయుడుగారు పెద్దలై సుందరకునిపాత్ర ధరించుట మానినతరువాత, తాతయ్యనాయుడుగారా పాత్రను ధరించి, గ్రంథమంతయు నొక్కతప్పులేకుండ వల్లించి, హనుమంతరావునాయుడుగారెంత బాగుగ నొప్పించిరో యంత బాగుగ వీరును నొప్పించిరి. హాస్యరసప్రధానములగు పాత్రల నటించుటలో తాతయ్యనాయుడుగా రద్వితీయుడు. ఇతడు "చిత్రనళీయము"లో నెరుకలరాజై, "హరిశ్చంద్ర"లో వీరబాహుడై, "గయోపాఖ్యానము"లో కౌశికుడై, "పారిజాతాపహరణము"లో కైరవుడై చక్కగ నభినయించి సభాసదులను కడుపుబ్బ నవ్వించుచుండెడివాడు. నాటకభారమంతయు నతనిమీదనే యుండెడిదనుట సత్యమునకు దూరము గాదు. ఇతడు విద్యావంతుడుగాడు. కొంతకాలము ప్రాథమికపాఠశాలలలో నుపాధ్యాయుడు, పిమ్మట కొంతకాలము సాముకసరత్తుల

నేర్పెడి నుపాధ్యాయుడు. కాని గట్టిపట్టుదలయు శ్రద్ధయు గలవాడు. సామాజికులందరకు నిష్టుడై తలలో నాలుకవలె నుండెడివాడు. ఈవరకు చెప్పిన నటులుగాక, మన సమాజములో సరిపల్లె కామేశ్వరరావుగారు, ధరణిప్రగడ వెంకటశివరావుగారు, సత్యవోలు గున్నేశ్వరరావుగారి తమ్ముడు బంగారురాజుగారు, చెరువు సోమయాజులుగారు, చంద్రపాటి సుబ్రహ్మణ్యముగారు మొదలగువారుగూడ తమ కుచితములైన పాత్రలను ధరించెడివారు. 1902 వ సంవత్సరములో తురుమెళ్ళ వెంకటసుబ్బారావుగారుగూడ మా సమాజములో చేరి కొన్ని స్త్రీ పాత్రలను ధరించెడివారు. ఆయన కొంతకాలము మా పాఠశాలలో నుపాధ్యాయుడుగగూడ పనిచేసెను. వీరుగాక సత్యవోలు లక్ష్మీపతిగారు, చెరుకుమిల్లి వేంకటరామయ్యగారు, చిత్రపు వెంకట నరసింహారావుగారు, చల్లపల్లి బ్రహ్మాజీరావుగారు, మోచర్ల సుందర రామయ్యగారు, రాయసము రామమూర్తిగారు మొదలగువారు పాత్రలను ధరింపకయే సమాజములో సభ్యులుగనుండి, సమాజ కార్యనిర్వహణమందు నాకును గున్నేశ్వరరావుగారికిని, మిక్కిలి తోడ్పడుచుండిరి. వారమున కొక నాటకము ప్రయోగించుచుంటిమి. ఆ సంవత్సరమున వర్షాకాలములో, సురభినాటకసమాజమువారు, రాజమహేంద్రవరమువచ్చి, మెరకవీధిలో నొకదొడ్డిలో డేరావేసి, కొన్ని నాటకము లాడిరి. ఆ సమాజములో స్త్రీలు స్త్రీ పాత్రలను, నొకప్పుడు పురుషపాత్రలనుగూడ ధరించి, రూపకములను ప్రదర్శించుటచే, వారి నాటకములు జనుల నాకర్షించెను. మాపై గిట్టనివారు కొందరు సురభినాటకములను, మా నాటకములనుపోల్చి పత్రికలలో మాపై దూషణపూర్వకములైన విమర్శలను చేయజొచ్చిరి. వాటిని మేము సరకుజేయక మా దారిని మేము నాటకము లాడుచుంటిమి. మా నాటకములో బెడదకోట రమణయ్యగారను నతడు హాస్యము చెప్పుచుండెడివాడు. ఈయన హాస్యము జనరంజకముగాను సరసముగాను నుండెడిది.

ఈయన ప్రియిమరీ పరీక్షయందు కృతార్థుడై, మా పాఠశాల నుండి బోధనాభ్యసన పాఠశాలకుబోయి, ట్రెయినింగయి, మ్యునిసిపలువారి పరిపాలనలోనున్న ప్రాథమిక పాఠశాలలో నొకదానియం

దుపాధ్యాయుడై, వీరభద్రపురములో నిల్లువాకిలి సంపాదించుకొని నిటీవల మృతినొందెను.

మా నాటకసమాజమువారు ప్రయోగించిన నాటకములకు ప్రేక్షకులవలన సొమ్ము విశేషముగనే వచ్చుచుండెడిది. మొదట గున్నేశ్వరరావుగారు, తెరలువేయించుటకును దుస్తులు, సామానులను తయారుచేయించుటకును వేయిరూపాయలు పెట్టుబడిపెట్టి నాటకమువలన వచ్చు రాబడితో వారిఋణమును క్రమక్రమముగ వాయిదాలమీద తీర్చుకొనిరి. మా సమాజమునకు సత్యవోలు గున్నేశ్వరరావుగారును, సత్యవోలు లక్ష్మీపతిగారును రెండు కల్పవృక్షముల వలె నుండిరి.

సమాజము వృద్ధిలోనుండగా మేము మరియొక ప్రదేశమునకు వెళ్ళి నాటకములాడవలెనని మాకు కుతూహలము పుట్టినది. ఆ యుబలాటము చేత మేము 1901 వ సంవత్సర మక్టోబరు నెలలో పయనమై నరసాపురము వెళ్ళితిమి. ఒక రహదారి పడవ రాకపోకల కిరువదియైదు రూపాయలకు గుదుర్చుకొని, రమారమి యిరువదియైదు సామాజికులను తీసికొని నేను పోయితిని. హనుమంతరావునాయుడు గారు, సత్యవోలు లక్ష్మీపతిగారును మా వెంటవచ్చిరి. నరసాపురములో పెద్దకాలువ యొద్దనున్న లోకలుఫండు సత్రములో బసచేసితిమి. వంటచేయుటకై ఒక వంటబ్రాహ్మణుని గుదుర్చుకొంటిమి. యంబికుమన్నారుకో నెలకుత్తరముగనున్న దేవిడీస్థలములోనున్న పాక మాకు దొరికెను. అక్కడ రెండు నాటకములాడితిమి. మొదటిది నా "పారిజాతాపహరణ" నాటకము. రెండవది "గయోపాఖ్యానము". నాటకములు రక్తికట్టెనుగాని, నే మనుకున్నంత విశేషధనము రా లేదు. రెండునాటకములకు మొత్తంమీద నూట యేబది రూపాయలు వచ్చెను. ఆసొమ్ము ఖర్చులకే సరిపోయెనుగాని మా కేమియు మిగుల లేదు.

ఆ సంవత్సరము డిశంబరు నెలలో గుంటూరు ప్రథమ నాటక సమాజమువారు మాపురమువచ్చి, మా నాటకపాక యద్దెకు పుచ్చుకొని నాళమువారి సత్రములో బసచేసి, కొన్ని నాటకములు ప్రయోగించిరి. వారి ప్రదర్శనములు ప్రజానురంజకములై దర్శనీయములై

యుండెను. వారు "శాకుంతలము", "వేణీసంహారము", "చిత్రనళీయము", "సారంగధర" నాటకము, "సునందినీ పరిణయము" మొదలగునవి ప్రయోగించిరి. హరిప్రసాదరావుగారు కథానాయక పాత్రను, హనుమంతరావుగారను మాఘ్వయునకుచు కథానాయిక పాత్రను ధరించి, యెల్లవారల మెప్పును వడసిరి. ఈసమాజమువారు మున్నొకనారి 1884 వ సంవత్సరము డిశంబరులో వచ్చి, వచన నాటకములు ప్రయోగించి పురజనులచేత గౌరవింపబడి వెళ్ళిరి. ఈపర్యాయము నీరు పద్యగర్భితములైన మహానాటకములను మిక్కిలి నిపుణతతో ప్రయోగించి ప్రఖ్యాతిగాంచి వెళ్ళిరి. వారిలో హరిప్రసాదరావుగారు సుప్రసిద్ధ నటులు. గానవిశారదులు. వారిచేతనే యీ సమాజమునకు మిక్కిలి పేరువచ్చెను.

మా నాటకసమాజమువారు నాటకములాడుట వట్టి సరదాకొరకే గాదు. కొంత పరోపకారము చేయుచుండిరనుట సత్యోక్తిగాదు. కొందరి విద్యార్థులకు జీతములిచ్చి మేము చదువు చెప్పించుచుంటిమి. కొందరు పాత్రధారులకు జీతములిచ్చి వారిని పోషించుచుంటిమి. ఒకరిద్దరికి వివాహములు చేసితిమి. బెజవాడకోట రమణయ్యగారి గృహనిర్మాణమునకు కొంత సహాయము చేసితిమి. హరికథా కాలక్షేపమునందు మిక్కిలి ప్రసిద్ధికెక్కిన అనంతరామభాగవతారు, రాజమహేంద్రవరము రాగా వారిని, మా నాటకశాల కాహ్వానించి, యొకనాటి మధ్యాహ్నమున వారిచే హరికథ చెప్పించి వారికి నూటపదియారు రూపాయలను బహుమానముగ నిచ్చితిమి. ఆంధ్రదేశ గాయకులలో మేటియై, మిక్కిలి నిపుణతతో ఫిడేలు వాయించి, దేశప్రఖ్యాతిగాంచిన కోటయ్యదేవరగారిని రప్పించి, మా నాటకశాలలో నొక పాటకచేరీచేయించి, వారికి నూటపదియారురూపాయలను బహుమానమిచ్చి, గౌరవించితిమి. బిపినుచంద్రపాలుగారు రాజమహేంద్రవరము వచ్చినపుడు, వారి యుద్యమమునకు తోడ్పడదలచి, మా నాటకశాలలో "వేణీసంహార" నాటకము ప్రయోగించి, దానివలన వచ్చిన సొమ్ము నూటయేబదిరూపాయలు నేనే స్వయముగ దీసికొని, పాలుగారి బసకుపోయి వారికాసొమ్ము సమర్పించితిని. పాలుగారు కృతజ్ఞతాపూర్వకముగ నాసొమ్ము నందుకొని "దీనివలన నా

ప్రయాణము మరికొంతదూరము సాగును" అని యింగ్లీషులో పలికిరి. ఒకసారి, నాటకశాలలో సామాజికుల యానందముకొరకు, దాసరిభాగవతులచే, భాగవతము కట్టించి, సముచితముగ వారిని సమ్మానించితిమి. నాటకశాలలో నప్పుడప్పుడు, విందులు గావించుకొని వినోదించుచుండెడివారము. ఆత్మగౌరవముగూడ సామాజికులు కాపాడుకొనుచుండెడివారు. అల్లరి జరుగకుండ జాగ్రత్తపెట్టెదమను వంకమీద, పోలీసుజవానులు టిక్కెట్లులేకుండ నాటకశాలలో ప్రవేశించి, నాటకములు చూచుచుండెడివారు. మంచినాటకము లాడినప్పుడు నాటకశాల జనముతో మిక్కిలి క్రిక్కిరిసియుండెడిది. అట్టి సమయమున పోలీసువారు కొంతస్థల మాక్రమించుటచే, టిక్కెట్లు కొని నాటకము చూడవచ్చినవారు స్థలములేక వెడలిపోవుచుండిరి. ఇందువలన మాకు కొంతనష్టము వచ్చుచుండెడిది. ఇది కనిపెట్టి, మా సభ్యులలో నొకడు, నాటకశాలలో బ్రవేశించిన పోలీసుభటుల నెంబర్లు వ్రాసుకొని, యా నెంబర్లను ప్రకటనార్థ మొకపత్రికకు పంపెను. అవి పత్రికలో బ్రకటింపబడగానే పైయధికారులు వారిని గట్టిగ మందలించిరి. నాటనుండి మా నాటకశాలమీదికి మా యూరి పోలీసుల దండయాత్రలు తగ్గెను.

తాటియాకుల పాకలో నాటకములు వేయుటచేత నెప్పుడైన నగ్నిప్రమాదము గలుగునేమోయని, మా మనసులో భయము గలుగుచుండెను. శ్రీ సత్యవోలు లక్ష్మీపతిగారు మా కాభయమును దీర్చిరి. ఇన్నీసుపేటలో, నాగులచెరువు వీధిని, లక్ష్మీపతిగారికి రమారమి 2,000 గజములు వైశాల్యముగల ఖాళీస్థలముగలదు. మా నాటకసమాజము నిమిత్తము లక్ష్మీపతిగా రాస్థలమున, పెంకుటినాటకశాల నొకదానిని గట్టించి మాకిచ్చిరి. నెలకు యిరువదిరూపాయ లద్దెక్రింద మేము వారికిచ్చునట్లు లక్ష్మీపతిగారు నిర్ణయించిరి. మేము లక్ష్మీపతిగారి కొక్క నెల యద్దెనైన సరిగ నిచ్చినట్టి పాపమున బోలేదు. డబ్బున్నప్పు డిచ్చెడివారము. లేనప్పు డూరకుండెడివారము. ఆ భవనమునకు లక్ష్మీపతిగారు రమారమి రెండువేలరూపాయలు ఖర్చుపెట్టిరి. వారికి మావలన వడ్డీయైన గిట్టలేదు. అద్దె ముట్టకపోయినను లక్ష్మీపతిగారు సమాజములో నొక సభ్యుడగుటచే,

దానిమీఁది యభిమానముచేత, మమ్ము నొక్కి యడ్డినఁగలేము. ఈభవనము 1902 వ సం॥రమున ప్రారంభింపబడి 1903 వ సంవత్సరమున ముగింపబడెను. ఆ గృహప్రవేశమహోత్సవమును జరుపుటకు రావుబహదూరు కందుకూరి వీరేశలింగముగారి నడిగితిని. ఆ పంతులు గారు వచ్చుటకు వీలులేక, యీ కార్యము నెరవేర్చుటకై శ్రీ కనుపర్తి శ్రీరాములుగారిని బంపిరి. వారువచ్చి యీకార్యమును నెరవేర్చిరి. నాటనుండి మేము మా భవనమును సమాజమున్నంతకాలము సొంతభవనముగానే భావించి మెలఁగితిమి.

నాకు మొదటినుండియు నేనో కొన్ని పాఠశాలలు పెట్టవలెనని మిక్కిలి కుతూహలముగ నుండెను. ఆ కుతూహలముచేతను, నాకు కొంత లాభముండునను నాశచేతను, హిందూ లోవరు సెకండరీ పాఠశాలను స్థాపించితిని. నా కుతూహలము పరిపూర్ణముగ నెరవేరనందున, నేనున్నతపాఠశాలగూడ స్థాపింపదలచితిని. ఇట్లు పాఠశాలలు స్థాపించుటవలన దేశమునకు రెండు లాభములు గలుగునని నా యభిప్రాయము. చిన్నదో పెద్దదో పది యుద్యోగము లుండును గనుక, పదిమంది కుద్యోగములు దొరకిన, మన దేశములో మిక్కిలి ప్రబలముగనున్న నిరుద్యోగసమస్య కొంతవరకు సాధింపబడును. గవర్నమెంటువారి పాఠశాలలోను, బోర్డుమునిసిపల్ పాఠశాలలలోను, విద్యార్థుల కుచితముగ విద్యగరపు నాచారము దినములలో నంతరించినందున, నిరుపేద బాలకులు మా పాఠశాలలలో జదువుకొని బాగుపడవచ్చును. గ్రాంటు మొదలగువానివలన స్థాపకుల కే స్వల్పలాభమైన గలుగవచ్చును. ఈ యుద్దేశములు మూఁడును మనస్సున మల్లడిగొన, నేను మధ్యమపాఠశాల స్థాపించి, దానితో సంతుష్టి జెందక యున్నత పాఠశాల స్థాపింపవలెనని 1902 వ సంవత్సర ప్రారంభమున నాల్గవఫారము (IVth Form) బెట్టితిని. ఆతరగతి నా లోవర సెకండరీపాఠశాలా భవనమున బెట్టక, నా పాఠశాలాభవనము యొక్క దొడ్డిగుమ్మమున కెదురుగనున్న మహమ్మదీయుల కచేరీ సావిడి యద్దెకు పుచ్చుకొని, యాతరగతి నందు నెలకొల్పితిని. బాలకులు ప్రోత్సాహకరముగానే చేరిరి. గత సంవత్సరమున మా పాఠశాలనుండి లోవరు సెకండరీ పరీక్షకుబోయి కృతార్థులైనవారు

కొందరు, వారుగాక పైవారు కొందరు, మా క్రొత్తతరగతిలో చేరి, నా ప్రూనిక నెరవేర్చిరి. చాలకాలమునుండి నాకు మిత్రుడును, సంఘసంస్కరణాది విషయములలో నాతో నేకీభవించువాడును, సజ్జనుడునునైన రామా ప్రగడ వేంకటరామయ్యగారి నా తరగతి కుపాధ్యాయుడుగ, నెలకు ముప్పదిరూపాయలు జీతముమీద, నియోగించితిని. ఆయన యప్పటి ప్రథమశాస్త్ర (F. A.) పరీక్షయందు కృతార్థులై, గతసంవత్సరమందు బోధనాభ్యసన కళాశాలలో బోధనవిధానమును నేర్చుకొని, యుపాధ్యాయపదవికి యోగ్యతను సంపాదించిన యువకుడు. ప్రకృతిశాస్త్ర మైచ్ఛికముగ దీసికొని పట్టపరీక్షకు కొంత కాలము చదివిన బుద్ధిశాలి. నాల్గవతరగతి కాయన ప్రకృతిశాస్త్రమును గణితమును బోధించుచుండెడివాడు. ఆయనకన్న వయసు చేతను ననుభవముచేతను లక్ష్మీపతిగారు పెద్దలగుటచే, నాల్గవతరగతి కింగ్లీషుపాఠము బోధింపుమని లక్ష్మీపతిగారిని గోరితిని. వారు నా కోరికను నిరాకరింపక యట్లుచేసిరి.

ఈ క్రొత్తతరగతి నెలకొల్పుటచే నాకు గొన్ని క్రొత్తచిక్కులు సంభవించినవి. ఉన్నతపాఠశాల యొకటి బట్టణమున బయలుదేరిన యెడల బోధనాభ్యసన కళాశాలకు నష్టము కలుగునని, కళాశాలా ప్రధానోపాధ్యాయులకును సహోపాధ్యాయులకును భయము. అప్పటి కళాశాలాధ్యక్షులు మార్కుహంటరు దొరగారు తమ యభిప్రాయమును, నా దుత్తర సర్కారుల పాఠశాలల పరీక్షాధికారియైన విలియమ్సుపిళ్లగారికి వ్రాసిరి. పిళ్లగారు దాక్షిణాత్యులు. క్రైస్తవులు. నా పాఠశాలకంటె ముందే మా పట్టణమున మిషనువారొక యున్నతపాఠశాల స్థాపించిరి. వారు నాలుగైదారు ఫారముల నొక్కసారే స్థాపించిరి. బోధనాభ్యసన కళాశాలలోని, యున్నతపాఠశాలలో గల విద్యార్థులు, చాలమంది సర్టిఫికేటులను దీసికొనకుండపోయి, మిషను పాఠశాలలో చేరిరి. అందువలన దొరతనమువారి పాఠశాలకు కొంత నష్టము కలిగెను. మా పాఠశాలలో నాల్గవతరగతియొక్కటే స్థాపించితిని కావున, దొరతనమువారి పాఠశాలకు, మా పాఠశాలవలన నష్టము కలుగలేదు. అయినను హంటరుదొరగారు మా మీదగాని, మిషనువారిమీదగాని గట్టిగ వ్రాయకపోవుటచేతను, విలియమ్సు పిళ్ళగారికి

మిమనువారిమీద భక్తి యుండుటచేతను, పిళ్ళగారు మా మీద చేసి నంత ఘోరము మిమనువారిమీద చేసినట్లు కనబడదు. వారి కోపము నకు నేనెంత మాత్రము లెక్కసేయక యెప్పటిలాగున నడుపుచుంటిని. నా పాఠశాలలోని నాలుగవ ఫారము దీసివేయవలసినదనియు, నట్లు దీసివేయనియెడల నా లోవరు సెకండరి పాఠశాలకు మునుపిచ్చిన సమ్మతిని లాగివేయించెదననియు, బెదిరించుచు మా పిళ్ళగారు నాకు వ్రాయించుచు వచ్చిరి. ఆ బెదిరింపులను నేను లెక్కసేయక నాల్గవ ఫారము జరుపుచునే యుంటిని. మా పాఠశాలలో నేనా సంవత్సరము రాయవరపు రామమూర్తిగారిని, తురుమెళ్ళ వెంకట సుబ్బారావుగా రిని కూడ నుపాధ్యాయులుగ నియమించితిని. కొందరు బాలురా సం వత్సర మధికముగ చేరుటచే వీరి నిద్దరిని నియోగింపవలసి వచ్చెను.

ఆ సంవత్సరమున (శుభకృత్, 1902) నామామగారు పురా ణపండ వెంకటదీక్షితులుగారు తణుకు తాలూకా కాకరపఱ్ఱు గ్రామ ములో మృతినొందిరి. నా భార్యను ముందుగ నక్కడకుబంపి, బంధు పరామర్శకై పిమ్మట నే నాయూరుబోయి, పండ్రెండవదినములు ముగి యగానే మరల రాజమహేంద్రవరము వెళ్ళితిని.

హిందూదేశము యొక్క రాజకీయములను, నాయకులు చర్చించి, దొరతనమువారికి విన్నవించుటకై దేశీయమహాసభ (ఇండి యన్ నేషనల్ కాంగ్రెస్) పుట్టినదిగదా! చెన్నరాష్ట్రము, బొంబా యిరాష్ట్రము, పంజాబురాష్ట్రము, అలహాబాదురాష్ట్రము, బంగాళా రాష్ట్రము మున్నగు భాగముల సమస్యలు విచారించుటకై యాయా రాష్ట్రముల సభ లేర్పడెను. ప్రతిరాష్ట్ర సభయు నేడాదికొకసారి యేదోయొక ముఖ్యపట్టణములో సమావేశమగు చుండును. చెన్న రాష్ట్ర మహాసభగూడ నేదోయొక పట్టణములో సమావేశమై వ్యవ హరించుచుండును. 1902 వ సంవత్సరమున మన చెన్నరాష్ట్ర సభ, జూను నెలలో కాకినాడ పట్టణమున సమావేశమయ్యెను. సుప్రసిద్ధ న్యాయవాదులు, దేశసేవకులునైన, కృత్తివెంటి పేర్రాజుపంతులుగారు సన్మాన సంఘాధ్యక్షులైరి. హిందూపత్రికా సంస్థాపకులును, రాజ్యాంగ వ్యవహారవేత్తలునైన, జి. సుబ్రహ్మణ్యమయ్యరుగారు రాజకీయసభ కధ్యక్షులైరి. ఆ సభకు రాజమహేంద్రవరమునుండి

నేనును, నామిత్రుడు రాయవరపు రామమూర్తియు, వెళ్ళితిమి. ఆ సభ మూడుదినములు జరిగెను. నాల్గవ దినమున రాష్ట్రీయసంఘసంస్కరణసభ జరిగెను. చెన్నపురినుండి వచ్చి, రావుబహదూరు కందుకూరి వీరేశలింగముపంతులుగారు, సంస్కరణ సభాధ్యక్షత వహించిరి. ఈసభ జరిగిన పిదప మహారాజశ్రీ దుగ్గిరాల వెంకట సూర్యప్రకాశరావుగారు వీరేశలింగముగారి కొకనాటిరాత్రి విందుచేసిరి. శ్రీ ప్రకాశరావుగారు సంస్కరణ ప్రియులు. వీరేశలింగముగారి యెడ మిక్కిలి భక్తిగలవారు. ఆయన పట్టపరీక్షాసిద్ధులై జిల్లాకలెక్టరుగారి కచేరీలో నుద్యోగములో నుండిరి. ఆయన నిర్భయముగ వీరేశలింగముగారితో భోజనము చేయుచుండెడివారు. ఈయన తమకాలమును వ్యర్థపరుపక, హిందూదేశ సంబంధమైన యార్థిక, సాంఘిక సమస్యలను నాలోచించి, వాటిలో ప్రజ్ఞ సంపాదించినవారు. మన ప్రాంతములనుండి శాసననిర్మాణసభలకు సభ్యులై వెళ్ళిన మహాపురుషులకు, ప్రకాశరావుగారనేక సమస్యలలో, నమూల్యములైన సహాలనిచ్చెడివారు. ఈయన మహావక్త. ఏ సమస్యనుగూర్చియైన గంటలకొలది కంచుమ్రోగినట్లు వాగ్ధోరణిగలిగి, నుపన్యసింపగలరు. ఈయన పెందలకడ పింఛనుపుచ్చుకొని తనకాలము దేశసేవక్రింద నుపయోగపరచుచున్నారు. మండలపక్షమున ప్రకాశరావుగారు ప్రతినిధులై శాసననిర్మాణసభకు సభ్యులై వెళ్ళిన నెంతో బాగుండును. అట్లొకసారియైన జరుగకపోవుట మిక్కిలి శోచనీయము. వీరేశలింగముగారికి చేసినవిందునకు, ప్రకాశరావుగారు నన్నును, రాయవరపు రామమూర్తినిగూడ నాహ్వానించినందున, మేమిరువురము విందునకు బోయి వీరేశలింగముగారి పంక్తిని భోజనము చేసితిమి. వీరేశలింగముగారిపంక్తిని భోజనముచేయుటకు నాకిదియే మొదటిసారిగాదు. వీరేశలింగముగారు చెన్నపురికి వెళ్ళకమునుపే వారు రాజమహేంద్రవరములో నుండగానే, నేనును రామమూర్తియు వారి పంక్తిని భోజనముచేసితిమి. కాకినాడలో జరిగిన విందునకు బోవలదని నన్నును, రామమూర్తిని, రాజమహేంద్రవరమునుండి వచ్చిన ప్రతినిధులు కొందరు సలహాచెప్పిరిగాని, వారిసలహా నిరాకరించి మేము విందునకు బోతిమి. దీనివలన నేనొక గొప్పవీరుడనని చెప్పుటకుగాదు.

సంస్కరణమునం దభిమానము, మహాసంస్కర్తలయెడ గౌరవ మును గలదని చెప్పుటకే యీ స్వల్పవిషయము వ్రాసితిని.

రాజమహేంద్రవరమునుండి కాకినాడకు నేను బోనందుకు శ్రీ పోలవరము జమీందారుగారికి నామీద నుదయించిన కోపమప్పటికి మూడుసంవత్సరములైనను, లేశమైన డింపడలేదు. 1902 వ సంవత్సరము వేసవికాలపు సెలవులలో మాసమాజమువారికి కాకినాడలో నాటకములు ప్రయోగింపవలెనని కుతూహలముకలిగెను. నాకు మిత్రులును, మాసమాజసభ్యులునైన, శ్రీ చెరుకుమల్లి వేంకటరామయ్యగారికి కాకినాడలో చాలమంది మిత్రులుగలరు. ఆకారణమున మానాటక ప్రయోగములకొరకు దగుప్రయత్నము చేయవలసినదని, నేను వెంకటరామయ్యగారిని కాకినాడ పంపితిని. వెంకటరామయ్యగారు కాకినాడవెళ్ళి యొకగొప్ప గృహస్థుని కలుసుకొని, మాసమాజమువారి సంకల్పముచెప్పి, మాకు సహాయముచేయుమని కోరిరి. మహాపురుషుడైన యాగొప్ప గృహస్థుడు, శ్రీ పోలవరము జమీందారుగారితో మాసమాజము సంకల్పము నెరిగించిరట, వెంటనే జమీందారుగారు దానికి లక్ష్మీనరసింహముగా రధ్యక్షులుగ నున్నారుగనుక, దానికి నే నేవిధమైన సహాయ్యమును చేయకపోవుటయేగాక వారి కపకారము చేసెదనని యామిత్రునితో పలికిరట. ఆ గృహస్థు డావాక్యములను వెంకటరామయ్యగారి కెరింగించిరి. వెంకటరామయ్యగారు జమీందారుగారి మాటలకు మిక్కిలి విస్మయమంది, నిరుత్సాహులై రాజమహేంద్రవరమువచ్చి, మాకా వార్త నెరింగించిరి. నాటకసమాజములో సుందరులు, సుకుమారులునైన యనేక బాలకులు గలరు. వారి కేయపాయము వచ్చునోయని కాకినాడ ప్రయాణము మానితిని.

"సరస్వతీ" పత్రికకు నేను ప్రతిమాసము భాగములుగ "సౌందర్యతిలక" వ్రాసి పంపుచుంటిని. జమీందారుగారు గ్రంథము రెండుభాగములుగ ముద్రింపించిరి. కాని వారు నాకు కొన్ని ప్రతులైనను నియ్యలేదు. నేను నా మిత్రునియొద్ద కొంత ఋణముజేసి, జమీందారుగారియొద్ద పుస్తకములన్నియు, క్రయమునకు దీసికొంటిని. ఇంతతో వారి యాగ్రహ మడగలేదు. శ్రీ పేరి నారాయణ

మూర్తిగారు బి. యల్. పరీక్షలో కృతార్థులై కాకినాడలో న్యాయ వాదిగ కొంతకాలము పనిచేసిరి. జమీందారుగారు వారిచేత నొక రిజస్టరునోటీసు నిప్పించిరి. అందులోని విషయములివి. 1898 వ సంవత్సరమున "సరస్వతీ" పత్రిక స్థాపించినకాలమున నా కుచితముగ వారునూరు రూపాయలనిచ్చి, ఆ రూపాయలను నాకు బదులిచ్చినట్లును, త్వరలో నాసొమ్ము తీర్చనియెడల నామీద దావా చేయఁబూనినట్లును, నారాయణమూర్తిగారు నోటీసులో వ్రాసిరి. ఆజాబునకు వెంటనే ప్రత్యుత్తరమిచ్చితిని. అందులోని విషయములివి. జమీందారుగారు నా కారునందల రూపాయలిచ్చినమాట నిజమే. కాని వారు నా కాసొమ్ము నుచితముగ నిచ్చిరేగాని, బదులివ్వలేదు. "సరస్వతీ" పత్రిక స్థాపించి మేమిరువురము దానిని నడుపునట్లు నిశ్చయించుకొంటిమి. నా యుద్యోగము జమీందారుగారు మాన్పించి నాకున్న ఋణములు దీర్చుకొనుటకై నా కాసొమ్ము నుచితముగనిచ్చిరి. బదులిచ్చినపక్షమున నోటో పత్రమో నుండియుండును. నిజస్థితియిది. తరువాత మీ చిత్తమువచ్చినట్లు చేయుడు. నా జాబు చేరినతరువాత జమీందారుగారు నారాయణమూర్తిగారు కూడ మిన్నకుండిరి. దావాచేయుటకు సాహసింపరైరి.

వీరేశలింగముగారు చెన్నపురి వెళ్ళినతరువాత రాజమహేంద్రవరములో వితంతువివాహములు మందగించెను. వివాహములు మిక్కిలి సకృత్తుగ జరుగుచుండెను. ఆవిషయమైన యుత్సాహము నాకును, శ్రీ కుందూరు వేంకటరత్నముగారికిని, రామాప్రగడ వేంకటరామయ్యగారికిని, గొంతవరకు నిలిచియున్నందున, మే మావిషయమై శక్యమైనంతవరకు నించుక ప్రయత్నము చేయుచుంటిమి. ఆదినములలో శ్రీ పెద్దాడ సాంబశివరావుగారును, దొరతనమువారి కళాశాలలో నుపాధ్యాయులైన అరవపల్లి సుబ్బారావుగారును, ప్రణుతా్ర్తి హరయ్యరుగారును, రవంత ప్రోత్సాహము గలిగించుచుండిరి. వారందరిలోను సంఘసంస్కరణ విషయమున మా కరవపల్లి సుబ్బారావుగారే ముఖ్యులు. సుబ్బారావుగారికి సంఘసంస్కరణముపై నంతఃకరణశుద్ధియైన యభిమానముగలదు. మేమా సంవత్సరము (1902) మూడు వితంతు వివాహములు జరిపితిమి. అందు

మొదటిది నాళ్ళచెరువు కృష్ణారావుగారి వివాహము. ఈయన కృష్ణ వేణమ్మయను నొక వితంతువును వివాహమాడెను. కృష్ణారావుగా రంతకు మున్నొక వితంతువునే పెండ్లియాడిరి. ఆమె చనిపోవుటచేత రెండవసారికూడ వితంతువునే పెండ్లియాడిరి. రెండవవివాహము తీరము వెంకటేశ్వర్లుగారిది. ఈయన వైదికబ్రాహ్మణుడు. అబ్బ రాజువారి యాడుపడుచైన శేషమ్మయను నియోగి వితంతువును, కంచూరు వెంకటరత్నముగారును నేను ప్రయత్నించి పెండ్లిచేసితిమి. ఈ వెంకటేశ్వర్లుగారు, చాలకాలము పోలీసుద్యోగములు తెనాలిలో చేసి విశ్రమించి గౌరవముగ జీవించిరి. మూడవది భట్ట్రొలు శర భయ్యగారిది. ఈ శరభయ్యగారు రాజేశ్వరియను వితంతువును పెండ్లి యాడిరి. భార్యాభర్తలిరువురును నియోగులు. ఉన్నవ లక్ష్మీనారా యణగారు బందరునుండి యీ వధూవరులను తీసికొనివచ్చిరి. శర భయ్యగారు రమారమి పదునెనిమిది సంవత్సరముల వయసుకల వారు. రాజేశ్వరమ్మ పదమూడు సంవత్సరముల వయసుకల బాలిక. ఈ వివాహము మేము మా మిత్రుడైన తెనుకు చలపతిరావుగారి యింట చేసితిమి. ఈపెండ్లికి చాలమంది వచ్చిరి. వివాహమైన తరు వాత (శ్రీ) అరవపల్లి సుబ్బారావుగారు వివాహమును మెచ్చుకొనుచు నింగ్లీషులో నుపన్యసించిరి. ప్రఖ్యాతశాస్త్రి హరయ్యగారు, వెన్నాడ సాంబశివరావుగారుకూడ వచ్చిరి. పెండ్లియైన మునునాటిరాత్రి యూరే గింపుకూడ జరిగెను. కాని యీ వివాహము దంపతులకు సుఖప్రదము గాక దుఃఖప్రదమయ్యెను. భార్యాభర్తలకు మనసులు కలియలేదు. కాపురము పొత్తు చేయవలెనని వీరేశలింగముగారు మొదలగువారు బహుప్రయత్నములు చేసిరిగాని సాగలేదు. తుదకు శరభయ్యగారు భార్యను వదలివేసి దేశాంతరము వెళ్ళిరి. ఈ దంపతులకొక కుమా రుడు కలిగెను. రాజేశ్వరమ్మ ప్రవేశపరీక్షయందు కృతార్థురాలై, బోధనాభ్యాసమునొంది, దొరతనమువారి బాలికాపాఠశాలలో పని చేసి, ప్రస్తుతము విశాఖపట్టణములో నెలకు నూరురూపాయలు జీతము తెచ్చుకొనుచు తన కుమారునికి విద్య చెప్పించుకొనుచున్నది.

1902 వ సంవత్సరమున నేను, నా మిత్రుడైన తల్లాప్రగడ చల పతిరావుగారి కుమారుడైన నరసింహారావు వివాహమునకు, బాపట్ల

వెళ్ళితిని. దేశరాజు కృష్ణయ్యగారి కుమారుడైన నరసింహారావున కిచ్చిరి. ఆ సమయమున నాకు దేశరాజు కృష్ణయ్యగారితోను, వారి యన్నగారైన సీతారామారావుగారితోను, పరిచయ మయ్యెను. సంఘసంస్కరణమందు మహావీరుడైన దేశరాజు పెదబాపయ్య గారితో, నా కచ్చటనే ప్రథమ పరిచయమయ్యెను. ఈ పరిచయము నా కాయనతో, నాయన జీవితాంతమువరకు మైత్రియై వర్థిల్లెను. ఆ సంవత్సరమున నేను నా మిత్రుడైన చెరుకుమిల్లి వేంకటరామయ్య గారి తిమ్ముడు అనంతరావు వివాహమునకు ర్యాలిగ్రామము వెళ్ళి తిని. ఆ వివాహమునకు భోగముమేళము పెట్టబడెను. వివాహము నకు వెళ్ళినను మేళమునకు నే నొక్కసారియైన వెళ్ళలేదు. తుదకు వేశ్యల పాటకచేరీకైనను రమ్మని వేంకట్రామయ్యగారు నన్ను బ్రతి మాలిరి. కాని నేను దానికిని వెళ్ళలేదు. అంతకు ముందే నేను వేశ్యల యాటపాటలకు పోనని ప్రమాణపత్రముమీద సంతకముచేసి వీరేశలింగముగారి కిచ్చితిని. కావున నేను నాట్యమునకుగాని, గాన మునకుగాని వెళ్ళలేదు. ఆ వివాహ దినములలో నేను వెంపటి వెం కటశాస్త్రిగారను నొక పండితునితో స్నేహముచేసి వారితో కాల క్షేపము చేసితిని. ఈ నియమము నేను యావజ్జీవము పాటించుచు న్నాను. ఇందుకు మరియొక యుదాహరణము చెప్పెదను. రాజా తిమ్మలపల్లి రామారావుగారి కుమారుడు, వరదారావుగారు సబు జడ్జిగ రాజమహేంద్రవరము వచ్చిరి. ఆయన సంగీతప్రియుడు. చెన్న పురమందు "ధన" మను వేశ్యాంగన గానకళయందు మిక్కిలి పేరు గాంచెను. ఆమె యేదో కారణమున రాజమహేంద్రవరము వచ్చెను. ఆమెచేత నొక పాటకచేరీ చేయించవలెనని వరదారావుగారికి సంక ల్పము కలిగెను. ఆ కచేరీ పెట్టుకొనుటకు మా నాటకశాల నిమ్మని నాకు వర్తమానమంపిరి. నే నీయజాలననియు మా సామాజికులలో నధిక సంఖ్యాకులిచ్చిన పక్షమున నే నడ్డుపెట్టననియు, నేను వారికి జవాబు పంపి సామాజికుల సభ పెట్టి వారి యభిప్రాయ మడిగితిని. అధికసంఖ్యాకులు శాల నిచ్చుట కొడంబడిరి. మరునాడు ధనము యొక్క పాటకచేరీ జరిగెను. నా నియమము ననుసరించి నే నా కచే రీకి బోలేదు. (శ్రీ) కొక్కొండ వేంకటరత్నము గారా సభకు హాజరై

"ఖనము" మీద నొకపద్యము రచించిరట! ఇదియేగాక మరి రెండు దాహరణలు చెప్పెదను నా మిత్రులైన చెరుకుమిల్లి వెంకటరామయ్యగారు, తన కడగొట్టు తమ్ముడైన వేంకటరావున కుపనయనము చేసి, యీ మహోత్సవమునకు చెన్నపురినుండి "కోయంబత్తూరు తాయి" యను గానకళావిశారదయైన వేశ్యాంగనను పిలిపించి యామెచే నొక పాటకచేరీ పెట్టించి, మిత్రులతోపాటు నన్నుగూడ నాహ్వానించిరి. కాని నే నాసభకు బోలేదు. మా గ్రామమున సుప్రసిద్ధ న్యాయవాదులైన ములుకుట్ల యచ్యుతరామయ్యగారు, తన రెండవకుమార్తె వివాహమునకు, మదరాసునుండి "యేనాదిపిల్ల"లను యిద్దరు వేశ్యాంగనలను పిలిపించి వారిచే పాటకచేరీలు పెట్టించి యూరందరిని పిలిచిరి. అచ్యుతరామయ్యగారికిని, నాకును విశేష పరిచయమున్నను, నే నొక్క కచేరీకైనను పోలేదు. వారును మరి యితరులును నానియమములను మన్నించి నాపై నాగ్రహము బూనలేదు.



# స్వీయచరిత్రము

## పదునెకండవ ప్రకరణము

### ఉన్నతపాఠశాలాస్థాపనము.

పాఠశాలా సంస్థాపనమీఁది కుతూహలము నాకింకను సడల కుండుటచే, 1903 వ సంవత్సరము జనవరిలో, నా యున్నత పాఠశాలను సంపూర్ణము చేయవలెనని, మునుపటి నాలుగవఫారముకు మీఁదుగ నయిదవఫారమును నారవఫారమునుగూడ స్థాపించి, పూర్ణమైన యున్నతపాఠశాలగ జేసితిని. ఇదివరకు పనిజేయుచున్న రామాప్రగడ వెంకటరామయ్యగారికి తోడుగ, నున్నతపాఠశాలనిమిత్తము, మఱియిద్ద ఱుపాధ్యాయులను నియమించితిని. అందు మొదటివాఁడు నిగమర్తి కోదండరామస్వామిగారు; ఈయన పట్టపరీక్షాసిద్ధుఁడు. బోధనాభ్యసనముగూడ బొందినవాఁడు. రెండవవాఁడు తనికెళ్ళ పూర్ణయ్యగారు, ఈయన పట్టపరీక్షయందు సిద్ధులైరిగాని, బోధనాభ్యసనము బడయలేదు. ఇక్కడకు మా యున్నతపాఠశాలలోని మూఁడు తరగతులకు ముగ్గురుపాధ్యాయు లేర్పడిరి. కష్టపడి లాగుకొనివచ్చిన పక్షమున నెప్పటికైన మా యున్నతపాఠశాల దొరతనమువారి యంగీకారమును బడయకపోదని యూసించి, పైతరగతులుగూడ పెట్టితిని. నాలుగవఫారమున్నచోట దక్కినతరగతులకు స్థలము లేక పోవుటచే, నున్నతపాఠశాలనంతను మఱియొకచోట బెట్టితిని. మ్యూజియమున కెదుటనున్న పోలీసుకవాతు భూమిలో నొకమూలగానున్న బంగాళాలో కొంతభాగ మద్దెకు పుచ్చుకొని, పాఠశాలనందు నెలకొల్పితిని. అందు మూఁడు పెద్దగదు లున్నందున మూఁడుతరగతులకు స్థలము సరిపోయెను. మా మధ్యమపాఠశాలలోని పండితులు మధ్యాహ్న మున్నతపాఠశాలలోను, నుదయమున మధ్యమపాఠశాలలోను పనిచేయునట్లు నిర్ణయించితిని. నడుమనడుమ నేనుబోయి పాఠశాలను చూచుచుంటిని. మూఁడుతరగతులలోను బాలురు దిట్టముగ జేరిరి. గాని మధ్యమపాఠశాలలో నున్నట్టే జీతములీయకుండ చదువు వారిసంఖ్య యెక్కువయుండుటచే, నాకు ధనలాభము గలుగలేదు. దాని ఖర్చులు దానికి సరిపోవుటయే కష్టమయ్యెను. పైగా నూరు

రూపాయలు ఖర్చుపెట్టి ప్రకృతిశాస్త్రపు పనిముట్లను (సైన్సు ఏపరేటస్) తెప్పించితిని. పాఠశాల సర్వవిధముల చక్కగనే జరుగుచుండెనుగాని, విద్యాశాఖవారి యనుగ్రహము మాత్రము దానిమీద బడలేదు. విలియమ్సు పిళ్ళగారికి మా పాఠశాలపై నాగ్రహము క్రమక్రమముగ హెచ్చుచుండెను. నాపై వారికేమియు ద్వేషము లేదు. పట్టణమున మరియొక యున్నతపాఠశాల యున్నపక్షమున బోధనాభ్యసన కళాశాలకు నష్టమని హెంటరు దొరగారితో నేకీభవించి పిళ్ళగారుగూడ మామీద దాడి వెడలజొచ్చిరి.

ఆ సంవత్సర ప్రారంభమున (1903) సంస్కృతవిద్యాప్రవీణులైన బ్రహ్మశ్రీ ప్రయాగ వెంకటరామశాస్త్రిగారికిని, నాకును మైత్రి ప్రారంభమయ్యెను. ఆయన తెలగాణ్యబ్రాహ్మణులు. తణుకు తాలూకాలోని తామరాడగ్రామ నివాసులు. నాయొద్దకు వచ్చునప్పటికే వారు సంస్కృతకావ్యములనేగాక, వ్యాకరణశాస్త్రమును గట్టిగ బఠించిరి. నాకడకు వచ్చునప్పటికి వారికి రమారమి యిరువది సంవత్సరములుండెను. ఆయన యేదైన నుద్యోగముకొరకు వచ్చిరి. వారికి దగిన యుద్యోగము నాకడ నప్పుడేదియు లేకపోయెను. నా పాఠశాలలో నదివరకే నిరువురు పండితు లుండిరి. కాని యంతచిన్నతనములో నంతనిశితమైన పాండిత్యము సంపాదించిన యీ బాలపండితుని వదలిపెట్టుటకు నా కిష్టము లేకపోయెను. అందుచే నాదగ్గరనే వారి నుండుమనికోరి, పూటకూళ్ళయింట ప్రవేశింపుమనిచెప్పి, నెలకారురూపాయలు చొప్పున నేను వారి కొకసంవత్సర మిచ్చితిని.

ఆ దినములలో నేను వారివల్ల భవభూతి ప్రణీతమైన "ఉత్తర రామ చరిత" నాటకమును వింటిని. ఆ సంవత్సరమున నేను పూర్వమున్న చిన్నయిల్లు వదలిపెట్టి, రాయవరపువారి యింటికి సమీపముననున్న దుర్భా సూర్యనారాయణగారి యింట గాపురముంటిని. అది పెద్దయిల్లగుటచే, నా సంసారమునకు సరిపోయెను. నా మూడవ చెల్లెలైన రమణమ్మ యప్పటికి గర్భవతియై మాయింటికి వచ్చెను. మా రెండవచెల్లెలైన యన్నపూర్ణమ్మ మూడవనాడు ... మహేంద్రవరములోనే బుట్టిన రాజేశ్వరి యను పిల్ల కడుపులో బల్ల పెరిగి కొన్ని మాసములు బాధపడి యెన్ని చికిత్సలు చేయించినను నారోగ్యస్థితిని

బొందక 1903 వ సంవత్సరము మేనెల 11 తేది మధ్యాహ్నము మా యింటికడ మృతినొందెను. ఆ బాలికకు మృతినొందునప్పటికి రెండుసంవత్సరములు వయసు.

1903 వ సంవత్సర ప్రారంభమున జరిగిన విషయ మొకటి వ్రాయమరచితిని. ఆ విషయమిది. గుంటూరుపట్టణమున విశ్వనాథ య్యరుగారను జిల్లామునసబుగారుండిరి. ఆయన సంఘసంస్కరణ ప్రియుడు. వితంతువివాహ పక్షపాతి. వితంతు వివాహములనుగూర్చి లోకమున జనసమ్మతి బడయుటకై కొన్ని యుపన్యాసముల నిప్పింప దలచి, రాజమహేంద్రవరమున అరవపల్లి సుబ్బారావుగారికిని, టంగుటూరి శ్రీరాములుగారికిని నాకును, గుంటూరువచ్చి యుపన్యాసము లిమ్మని యాహ్వానముల నంపిరి. మేము మువ్వురము గుంటూరు వెళ్ళితిమి. అరవపల్లి సుబ్బారావుగారును, టంగుటూరి శ్రీరాములు గారును నిం గ్లీషులో నుపన్యసించిరి. నేను తెనుగులో నుపన్యసించి తిని. మేము విశ్వనాథయ్యరుగారి యింటనే బసచేసితిమి. మరునాడు బయలుదేరి రాజమహేంద్రవరము వచ్చితిమి.

1903 వ సంవత్సరము జూను నెలలో నారవ గోదావరీమండ లసభ పెనుమంట్రలో గోస్తనీనదియొడ్డున జరిగెను. 1899–1900 సంవ త్సరములలో నీసభ జరుగనేలేదు. 1902 వ సంవత్సరమున నెక్క డను జరుగలేదు. తణుకు తాలూకాలోని యాలమూరుగ్రామ నివా సులును, దేశాభిమానులును నైన పెనుమెత్స సుబ్బరాజుగారు సభ నాహ్వానముచేసి, యాలమూరులో దగిన స్థలము లేనందున పెను మంట్ర వంతెనకు, నాలమూరునకు నడుమనున్న గోస్తనీనదియొడ్డున పందెళ్ళు వేయించి సభలు జరిపించిరి. ఆ సభకు శ్రీ గంజాము వేంకటరత్నముగారు రధ్యక్షత వహించిరి. గోదావరీమండలసభ లా సభతో నంతమొందినవనియే చెప్పవచ్చును. ఏలయన, నా సభలు చాలకాలమువరకు మరల జరుగలేదు. మండల సభాదేవత తన్నే చీటపిలిచి యాదరించువారు లేరని బెంగపెట్టుకొని చిక్కి శల్యమై పెనుమంట్ర వంతెనమీాద నెక్కి గోస్తనీనదిలోబడి యాత్మహత్య జేసికొన్నదని నా యభిప్రాయము. ఆ సభనిమిత్తము బల్లలు మొద లైనవి పడవమీాద పంపించితిని. కాని నేనుమాత్రము సభకు వెళ్ళ

లేదు. ఏమన, మా మూడవ చెల్లెలు రమణమ్మకు నవమాసములు నిండెను. ఆమె నేనింటలేనప్పుడు ప్రసవించినచో మా వాండ్రు చిక్కుపడుదురని నేను సభకు వెళ్ళుట మానితిని. ఆ సంవత్సరమున మా మేనమామగారు మల్లయ్యశాస్త్రిగారు కొన్ని మాసములు సెలవు పుచ్చుకొని జూలై యాగష్టు నెలలలో, భార్యాసమేతముగ వచ్చి మా యింట నుండిరి. జూలై నెల మూడవ తేదీని మా చెల్లెలు రమణమ్మ ప్రసవించి మగశిశువును గనెను. ఆ పురిటింటిలో నామెకు మిక్కిలి జబ్బుచేసెను. ఆమె జీవించునా, లేదా యని మా కందరకు సందేహము కలిగెను. నా ప్రియమిత్రులగు దామెర్ల వెంకటరమణా రావుగారు శ్రద్ధతో వైద్యముచేసి యామెను బ్రతికించిరి. ఇప్పుడే కాదు దామెర్ల వెంకటరమణరావుగారు వైద్యమారంభించినది మొదలుకొని 1931 వ సంవత్సరమున వారు మరణించువరకు మిక్కిలి ప్రేమతోను శ్రద్ధతోను మా యింట నుచితముగ వైద్యముచేసిరి. ఆయనకు నేను మిక్కిలి కృతజ్ఞుడను.

ప్రయాగ వేంకటరామశాస్త్రిగారు రాజమహేంద్రవరములో నున్న కాలమున ప్రతిదినము వారు నాకడకు వచ్చుచుండెడివారు. అటువంటి పండితుడు నాకు లభించినప్పుడు నే నాయనవలన లాభము పొందవలెనని బాణమహాకవిచే సంస్కృతమున రచియింపబడిన "కాదంబరి" యను వచనమహాకావ్యమును వారి సహాయమున నే నాంధ్రీకరింప నారంభించితిని. ఆ సంవత్సరము నవంబరు నెలనాటికి నేను రమారమి నూరుపుటలు తెనిగించితిని. "కాదంబరీ రసజ్ఞానా మాహారోపి న రోచతే" కాదంబరి రస మెరిగినవారికి ఆహారముకూడ రుచింపదని దీని యర్థము. "కాదంబరి" యనగా, కాదంబరీ మహా కావ్యమేగాక, "కల్లు"నిగూడ యర్థము. ఆ సంవత్సరమున దేశీయ మహాసభను (ఇండియన్ నేషనల్ కాంగ్రెసు) చెన్నపట్టణమున లాల్ మోహనఘోషుగారి యాధిపత్యమున జరుపుటకు నిశ్చయింపబడినది. ఘోషుగారు సురేంద్రనాథ బెనర్జీవలెనే మహావక్తలు. అదివరకు నే నెప్పుడు ఘోషుగారి వాగ్ధోరణి విననందున, నే నాసభకు బోవ నిశ్చయించితిని. నేను నా మిత్రులైన చెరుకుమిల్లి వెంకటరామయ్యగారితో గలసి చెన్నపట్టణము వెళ్ళితిని. ఆ బండిలోనే

రాజమహేంద్రవర గ్రామనివాసులును, మా కిరువురకు మిత్రులు, హుకుంపేట జమీందారుగారునైన శ్రీ రాజా హోతా వీరభద్రయ్య గారు గూడ సపరివారముగ చెన్నపట్టణము వచ్చిరి. మే మందరము శ్రీ కొరళ్ల సుబ్బారాయుడుగారి యింట బస చేసితిమి. కొరళ్ళ సుబ్బారాయుడుగారు వైశ్యశిఖామణులు. చిరకాలము డెప్యూటి కలెక్టరుపనిచేసి, వృద్ధులై పనిమానుకొని, చెన్నపట్టణములో విశ్రాంతి సుఖ మనుభవించుచుండిరి. సుబ్బారాయుడుగారి కుమారుడు వెంకట లింగముగారు, బి. యల్., పరీక్షయందు కృతార్థులై హైకోర్టు న్యాయవాదిగ నుండిరి. చెరుకుమిల్లి వెంకటరామయ్యగారికిని, వెంక టలింగముగారికిని చిరకాలమైత్రి కలదు. కొరళ్ళవారికి చెన్నపట్టణ మందలి యెళుంబూరు (ఎగ్మూరు) యనుపేటలో గొప్ప స్థలము గలదు. ఆ స్థలములో రెండు బంగాళాలు గలవు. ఒక బంగాళాలో కొరళ్ళవారు కాపురముండిరి. రెండవ బంగాళా శ్రీ వీరభద్రయ్య గారికి నివాసముకొర కిచ్చిరి. వీరభద్రయ్యగారు వంటబ్రాహ్మణుని, సేవకులను తీసుకొనివచ్చుటచేత మమ్ముగూడ వేరేబస చేయనీయక వారి కందాలోనే చేర్చికొని మాయెడ మిక్కిలి గౌరవాదరణములు గలిగియుండిరి. ఆ సంవత్సరము డిశంబరు నెలలో మహావర్షములు గురిసెను. ప్రతిసంవత్సరము డిశంబరు నెలలోనే వానలు కురియును. కాని యీ సంవత్సరము దేవేంద్రుడు పుష్కలావర్తక మేఘములను విచ్చలవిడిగ లోకముమీద విడిచినాడో యన్నట్లు, ఘోరముగ వానలు దిమ్మరించెను. లాల్ మోహనఘోషుగారి ప్రారంభోపన్యా సము వినవలెనని మిక్కిలి యుబలాటము పడితినిగాని పడిశముపట్టి వారి గొంతు చెడిపోవుటచేత నాకేగాక వేలకొలది ప్రతినిధులకు, ప్రేక్షకులకు నెంతో యాశాభంగము గలిగినది. హిందూదేశ నాయ కులలో నగ్రగణ్యులని చెప్పదగిన ఫిరోజిషా మెహతాగా రాసభకు వచ్చి, మిక్కిలి చమత్కార సంభాషణలతో లాలుమోహన ఘోషుగా రధ్యక్షత వహించవలెనని తీర్మాన ముపపాదించిరి. అది వరకు నేను మెహతాగారి ప్రసంగ మెప్పుడును వినలేదు. అదే మొదటిసారి యగుటచేతనో, వారి ప్రసంగము మిక్కిలి రసవంత మగుటచేతనో, నేనెక్కువ యానందించితిని.

చెన్నపురి పోకమునుపే నేమొక వితంతువివాహము చేయించితిమి. మా నాటకసమాజములో సభ్యుఁడును, మా పాఠశాలలో నుపాధ్యాయుఁడు నైన తిరుమెళ్ళ వెంకటసుబ్బారావుగా రొక వైష్ణవ వితంతుబాలికను వివాహమాడిరి. ఆ బాలిక తండ్రియైన వృద్ధవైష్ణవుఁడు వితంతువైన తన పుత్రికను వివాహనిమిత్తము రాజమహేంద్రవరము తీసికొనివచ్చెను. ఆయనను నేము ప్రోత్సాహపఱిచితిమి. ఆ వితంతువును వివాహమాడుటకు సుబ్బారావుగారుకూడ నంగీకరించిరి. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు భార్యను వెంటబెట్టుకొని ఈ వివాహము జరుపుటకై చెన్నపురినుండి రాజమహేంద్రవరము వచ్చిరి. ఆ వివాహము చాల వైభవముతో జరిగెను. కళాశాలలోని యుపాధ్యాయులు, విద్యార్థులు, పురప్రముఖులు చాల మంది వచ్చిరి. వివాహము తాలూకాకచేరికి వెనుకనున్న దూపంటి లింగరాజుగారియింట జరిగెను. ఆరాత్రి విందుజరిగెను. ఆ విందునకు నేనును రాయసము రామమూర్తియుపోయి భుజించితిమి. మా వంటి సంస్కరణప్రియులేగాక మమ్ము నిరంతర మాక్షేపించుచున్న వైదికశిఖామణులయొక్కయు, సభాపతులయొక్కయు కొడుకులుగూడ గొందఱువచ్చి యావిందులో పాలుగొని వధూవరుల పంక్తిని భుజించిరి. భోజనముచేసినవారిపేళ్ళు పత్రికలోపడెను. తమ బిడ్డలే యావిందులో పాలుగొనుటచే, దొంగను తేలుకుట్టినట్లు పూర్వాచారపరాయణులు మన్నేమియు చేయలేక యూరకుండిరి.

చెన్నపురి బోకమునుపే నా యున్నతపాఠశాలవిషయమున నే నొకపని చేసితిని. మా యున్నతపాఠశాల దీసివేయుమని విలియమ్సుపిళ్ళగారు మాకు మాటిమాటికి శ్రీముఖము పంపుచుండుటచే, డైరెక్టరుగారికికూడ వారు నా విషయమై వ్రాసియుందురని నమ్మకముతో నేను డైరెక్టరుగారిపేర జాబువ్రాసితిని. నేను పాఠశాల విద్యాశాఖవారి యనుమతిని బడయునని, యున్నతపాఠశాలను నిర్వహించితినిగాని బోధనాభ్యసనకళాశాలకు నష్టముకలిగించు నుద్దేశముతో గాదనియు, మంచి యుద్దేశముతో పాఠశాల నిర్వహింపబడుటచే బాలకు లనేకులు చేరిరనియు, నా కారణమున మా పాఠశాల నంగీకరింపవలసినదనియు, నంగీకరింపనిపక్షమున దానిని సంవత్సర

మధ్యమున దీసివేయుమని యాజ్ఞాపించవద్దనియు, యట్లాజ్ఞాపించినచో బాలకులవిద్య చెడిపోవుననియు, మీ రంగీకరింపనిపక్షమున నేనే సంవత్సరాంతమున దీసివేయుదుననియు వినయముతో వ్రాసితిని. డైరెక్టరుగారు పాఠశాల యంగీకరింపబడదనియు సంవత్సరమధ్యమున దీసివేయనక్కరలేదనియు, సంవత్సరాంతమువరకు నవకాశమిచ్చితి మనియు, నాకు జవాబిచ్చిరి. ఐనను "యత్నముచేయుటవలన దోష. ములేదను యాసక్తియుండుటచేత మరల నొక ప్రయత్నముచేసి తిని. కాంగ్రెసునిమిత్తె మా సంవత్సరము సత్యవోలు లక్ష్మీపతిగారు గూడ చెన్నపురి వచ్చుటచే వారిని తోడ్కొని స్కాటుదొరగారిని జూడబోతిని. అప్పుడు స్కాటుదొరగారు డైరెక్టరుగారికి సొంతసహా యుడు (Personal Assistant) గా నుండిరి. వారితో జెప్పినయెడల గొంత సహాయముండునేమోయని నేననుకొంటినిగాని, లాభము. లేకపోయెను. స్కాటుదొరగారు పూర్వము రాజమహేంద్రవర కళా శాలలో నుపాధ్యాయులుగనుండి, యచ్చటి పాఠశాలా పరిపాలక సంఘమునకు చాలకాలము కార్యదర్శిగనుండిరి. నేనును, లక్ష్మీపతి గారును వారిచేతిక్రింద నుపాధ్యాయులుగ పనిచేసితిమి. అందుచేత మమ్ము స్కాటుదొరగా రెరుగుదురు. ఎరిగియుండిననేమి? వారు మా పాఠశాల కేవిధమైన యుపకారమును చేయలేకపోయిరి. తరు. వాత నేను వీరేశలింగముగారి దర్శనముచేసి, నా యున్నతపాఠశాల దీసికొమ్మని వారినడిగితిని. అంతకుముందు పదిసంవత్సరములక్రిందట రాజమహేంద్రవరములో నొక యాస్తికపాఠశాల స్థాపింపవలెనని వీరేశలింగముగారు సంకల్పించిరి. అది యప్పుడు నెరవేరలేదు. నా పాఠశాలను దీసికొని యా సంకల్పము నెరవేర్చుకోవచ్చునని నేను వారికి మనవిచేసితిని. కాని వా రందు కొడంబడలేదు. పిమ్మట నేను వారితో "కాదంబరి" తెనిగించుచున్నానని చెప్పగా, నటువంటి పుస్తకములు లోకులు చదువరనియు శ్లేషలతోను, దీర్ఘ సమాసములతోను, నిండిన "కాదంబరి" వంటి కఠినకావ్యములను విశ్వవిద్యాపీఠమువారు పాఠ్యపుస్తకముగ నిర్ణయింపరనియు, కాబట్టి "కాదంబరి" నాంధ్రీకరించుట మానవలసినదనియు, నాకు వారు

సలహాచెప్పిరి. ఆహితోపదేశమును నేను విని రాజమహేంద్రవరము వచ్చినతరువాత "కాదంబరి" తెనిగించుట మానితిని.

1903 వ సంవత్సరమున కాంగ్రెసు మహాసభ జరుగలేదు. నిరంతర వర్షపాతమున సన్మానసంఘమువారు కాంగ్రెసు మహాసభ జరుపుటకు నిర్మించిన తాటియాకుల పాక కూలిపోయెను. వక్తలు ప్రసంగించుట ప్రారంభించినప్పుడు ప్రతినిధులు వాన దెబ్బ తాగలేక లేచి నిలువబడిరి. పెద్ద గోలయ్యెను. ఇనుప యూపిరితిత్తులు, కంచు కంఠము గల మహావక్తయని పేరుబడిన బాబు సురేంద్రనాథ బెనర్జీ కూడ మేఘగర్జనలవంటి గంభీరభాషణములతో శాంతి నెలకొల్ప యత్నించినను, వ్యర్థమయ్యెను. మూడు దినముల సభలు విఘ్నభగ్నములయ్యెను. ఆ యావరణములోనున్న బంగాళా వసారాలో నాలుగవ నాడు సభాధ్యక్షులు, ప్రతినిధులు సమావేశమై తీర్మానములు కొందరుగ చదివి మసిబూసి మారేడుకాయ చేసినట్లు సభయైనదనిపించిరి. లాల్ మోహనఘోష్‌గారి యుపన్యాసము వినుటకు మాకవకాశమే లేకపోయెను.

దేశీయమహాసభ ముగిసినతరువాత యావద్భారతవర్ష సంఘ సంస్కరణ మహాసభ జరిగెను. ఇది క్రైస్తవకళాశాలా భవనమున జరిగెను. ఆ సభకు బళ్లారినివాసులు, చెన్నపుర శాసననిర్మాణ సభాసభ్యులు నైన ఆనరబుల్ కోలాచలము వేంకటరావు పంతులుగా రధ్యక్షత వహించిరి. బొంబాయి హైకోర్టున్యాయమూర్తియు, సంఘ సంస్కరణ ప్రియుడునైన నారాయణగణేశ చందావర్కరుగారు సంఘసంస్కరణ సభ జరుపుటకు బొంబాయినుండి ప్రత్యేకముగ వచ్చి సభకు హాజరైరి. సభ కొంతవరకు ప్రశాంతముగానే జరిగెను. పాఠశాలలో మతవిద్య నేర్పవలసినదని యెవరో యొక తీర్మానము ప్రవేశపెట్టిరి. ఈ తీర్మానముతో గోల ప్రారంభమయ్యెను. కొందరు దీని కనుకూలురు, కొందరు ప్రతికూలురు. క్రైస్తవకళాశాలలో ప్రకృతిశాస్త్ర పండితుడైన లక్ష్మీనరసునాయుడుగారు మతవిద్యకు ప్రతికూలురైనవారికి నాయకుడు. ఈయన మతమున బౌద్ధుడు. ఇంచుమించుగ నాస్తికుడని చెప్పవచ్చును. గొప్ప వక్త. సుప్రసిద్ధుడు. ఆ తీర్మానమును ప్రవేశపెట్టగానే లక్ష్మీనరసునాయుడుగారు కోపించి,

శ్రోతృ లొక్కన తాచువలెలేచి, తీర్మానమును ప్రతిఘటించిరి. గొప్ప గొడవ యయ్యెను. ఎట్టకేలకు చందావర్కరుగారు తీర్మానమును ప్రవేశపెట్టనీయక శాంతి నెలకొల్పిరి. ఏదోవిధముగ సభ సమాప్తమయ్యెను. కోలాచలము వేంకటరావుగారా సంవత్సరమున నింగ్లాండు దేశము పోయివచ్చుటచేత వారికీపదవి యొసగబడినదని ప్రజలు చెప్పుకొనిరి, ఆ నాడు గూడ వర్షము గురిసెను. బాటలన్నియు జలమయము లగుటచే బట్టబండ్లలోనికి నీరెక్కుటయు, నందుకూర్చున్నవారి కాళ్ళు మోకాళ్ళవరకు తడసిపోవుటయు సంభవించెను.

1904 వ సంవత్సరమున యొకటవ తేదీని విక్టోరియా పురమందిరమున నొక గొప్పసభ జరిగెను. ఆ సభలో "హిందూసంఘ" మొకదానిని స్థాపింపవలెనని తీర్మానింపబడెను. ఆ సభకు ప్రధాన న్యాయమూర్తిగ బనిచేయుచున్న సర్ సుబ్రహ్మణ్యమయ్యరుగా రధ్యక్షత వహించిరి. అని బిసెంటమ్మగారు మాటాడిరి. రంగాచార్య పండితులు మున్నగు మహాప్రముఖులు హిందూమత ముద్ధరింపవలెనని యింగ్లీషున గంభీరోపన్యాసము లిచ్చిరి. ఈసభ సంఘసంస్కరణ సభకు వ్యతిరేకముగా బెట్టలేదని సభాధ్యక్షులును, రంగాచార్యపండితుడును స్పష్టముగ చెప్పిరిగాని, నిజముగ సంఘసంస్కరణోద్యమము నణచివేయవలెననియే యీసభ స్థాపింపబడినదని ప్రేక్షకులు భావించిరి. అప్పటికి శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగారి యభిప్రాయములు గొంత మార్పుచెందెను. హిందూమతోద్ధరణముపై వారి కెక్కువ యభిమానము గలిగెను. రాజమహేంద్రవరములో "హిందూ సమాజము"ను స్థాపించి వారు భగవద్గీతా బహుమానములు పెట్టిరి. న్యాపతి సుబ్బారావుపంతులుగారికి సుబ్రహ్మణ్యమయ్యరుగారితోను, రంగాచారిగారితోను నధికస్నేహముగలదు. వారి ప్రేరణముచేతనే చెన్నపురములోని "హిందూసంఘము" స్థాపింపబడినదని యానాటివారు బహిరంగముగ చెప్పుకొనసాగిరి. ఆసంఘపక్షమున నింగ్లీషులో నొక వారపత్రిక నెలకొల్పి, దాని వ్యయములన్ని సుబ్బారావు పంతులుగారే భరించి, కొంతకాలము నడపిరని లోకమున యొకవాడుక పుట్టెను. ఆ వర్షాకాలములో శ్రీ హోతా వీరభద్రయ్యగారు చెరుకుమిల్లి వేంకటరామయ్యగారికని, నాకును

నెట్టి యిబ్బందిలేకుండ సకల సౌకర్యములుచేసి రాజమహేంద్రవరము తిరిగి వెళ్ళినప్పుడు రైలుఖర్చులుగూడ వారే భరించి మమ్మాదరించుటచే వారికి మేమెంతయు కృతజ్ఞులము.

రాజమహేంద్రవరములోని నా యున్నతపాఠశాలకు దొరతనమువారి యనుమతి బడయలేకపోతినని నేనిదివరకే వ్రాసితిని. ప్రక్కనే మిషనువారి యున్నతపాఠశాల, నిబంధనలకు వ్యతిరేకముగ బాలకులను చేర్చుకొన్నను విద్యాశాఖవారి యనుమతినిబడసి వర్ధిల్లుచుండెను. మిషను పాఠశాలయొక్క పరిపాలకుడు అమెరికా దేశీయుడైన తెల్లవాడు. విశేషించి క్రైస్తవగురువులు. నేను నల్లవాడను. హిందువుడను. విద్యానిబంధనలప్రకారము నేను పాఠశాల నడుపుచున్నను, నా పాఠశాలగతి వేరయ్యెను. చెన్నపురినుండి రాజమహేంద్రవరమువచ్చి, నేను నా యున్నతపాఠశాలను తీసివేసి, విలియమ్సు పిళ్ళెగారి కావార్త దెలిపితిని. వారు సంతోషించి నాకిట్లు సలహా జెప్పిరి. నీ వీపాఠశాలవిషయమై యింతేసని చేయనేల? మాన్యులైన దొరగారు తెలుగువాచకములు వ్రాయించి విశేషధన మార్జించుచున్నారు. నీవు స్వయముగ వాచకములు వ్రాసి ధనములార్జింపగూడదని నాకు హితోపదేశముచేసిరి. కుందూరి వేంకటరత్నముగారుగూడ నప్పుడు పిళ్ళెగారివద్దకు వచ్చిరి. అటుపిమ్మట మా పాఠశాలలో నాలుగవఫారములోను నైదవఫారములోను జదివిన బాలకులగతి జూడవలసివచ్చెను. మా పాఠశాలలోని యుపాధ్యాయులా తరగతిలోని బాలకులకు సంవత్సరాంత పరీక్షలు యథావిధిగా జరిపి కృతార్థులైనవారియొక్కయు, కృతార్థులుగానివారియొక్కయు పట్టికవ్రాసి సిద్ధముగ నుంచిరి. వారిని బోధనాభ్యాసకళాపాఠశాలలోని పై తరగతులలో జేర్పింపవలెనని యుద్దేశించి నేనొకనాడు కుందూరు వేంకటరత్నముగారిని వెంటబెట్టుకొని యా కళాశాలాప్రధానాచార్యులైన మార్కు హంటరుదొరగారి యింటికిబోయి వారి దర్శనముచేసి నేను పాఠశాలను దీసివేసితిననియు, మా పరీక్షలలో కృతార్థులైన బాలకులను మీ కళాశాలలోని పై తరగతులలో చేర్చుకొనవలసినదనియు, కోరితిని. అట్లే చేయుదుమని వారు వాగ్దానముచేసి నన్ను పంపిరి. మా బాలురు తప్పక చేర్చుకొనబడుదు

రనువమ్మికతో మా బాలకులను కళాశాలలో నుపాధ్యాయులైన తంజావూరు సుబ్బారావు పంతులుగారి యొద్దకు బంపితిని. ఆ పంతులుగారు మా పరీక్షలు సరియైనవిగావనిచెప్పి, మా బాలకులను చేర్చుకొనక కొన్నిదివములు త్రిప్పిరి. తుట్టతుదకు బాలకులు విసిగి హంటరుదొరగారియొద్దకుబోయి వారితో చెప్పుకొనిరి. వెంటనే హంటరుదొరగారు బాలకుల చదువు చెడిపోవుచున్నదని జాలిపడి నేను పంపిన పట్టికప్రకారము బాలకులందరిని చేర్చుకొనవలెనని యుత్తరువుచేసిరి. ఆ యుత్తరువు ననుసరించి తంజావూరు సుబ్బారావుపంతులుగారు మా బాలకులందరిని చేర్చుకొనిరి. ఇప్పటికి మా యున్నతపాఠశాల వృత్తాంతము ముగిసెను. ఉపాధ్యాయుల జీతములనిమిత్తము నే నజ్జరపు వీరయ్యగారివద్ద మూటయేబదిరూపాయ లప్పుచేసి యుపాధ్యాయుల జీతము లిచ్చివేసి, యీ సంవత్సరమువచ్చిన నాలుగువందల రూపాయల గ్రాంటునుండి యీ యప్పు దీర్చితిని.

పాఠశాలా సంస్థాపనమీద వాంఛ నా కప్పటికిని బోలేదు. మొట్టమొదట నా నివాసస్థానము వీరవాసరముగదా! అది భీమవరము తాలూకాలో జేరినది. భీమవరములో బోర్డు మిడిలుస్కూలొకటి యుండెను. భీమవరములోగాని, యీ తాలూకాలో మరియొక గ్రామములోగాని, యున్నతపాఠశాలలేదు. ఆ తాలూకాలోని విద్యార్థు లున్నతపాఠశాలలో చదువవలసి వచ్చినప్పుడు నరసాపురము వెళ్ళి జదువవలసియుండెను. ఆ తాలూకా విద్యార్థుల కా కొరత తీర్పవలసిన భాగ్యవంతులు తీర్పక మిన్నకుండిరి. కావున భీమవరములో నొక యున్నతపాఠశాల స్థాపింపవలెనని నాకు తోచినది. నా కా తలంపు గలిగినతోడనే 1904వ సంవత్సరము జనవరిలో భీమవరము వెళ్ళి యున్నతపాఠశాలా స్థాపనమును గురించి కొంతమంది పెద్దమనుష్యులతో మాటలాడితిని. వారు ప్రోత్సాహకరముగానే మాట్లాడిరి. మాటలేగాని, సొమ్ముమాటలు వారిచ్చువారుగారు. అయినను నాలుగవఫారము నయిదవఫారము నను రెండు తరగతులతో నున్నతపాఠశాల స్థాపించితిని. స్థాపించి రాజమహేంద్రవరము వెళ్ళి పిల్లలు కూర్చుండు బల్లలు మొదలైన సామానులు భీమవరము పంపితిని. ఈ సామానులు పంపినపిదప ప్రకృతిశాస్త్ర

పరికరములను గూడ బంపితిని. రసాయనశాస్త్రము (కెమిస్ట్రి) నైచ్ఛి
కముగ దీసికొని పట్టపరీక్షాసిద్ధుడైన వంగల వెంకటనారాయణగారిని
ప్రధానోపాధ్యాయుడుగాను, శ్రీ రాయసం వెంకటశివుడుగారి
తమ్ముడైన కృష్ణమూర్తిగారిని సహాయోపాధ్యాయుడుగాను, వెలగ
దుర్రు గ్రామవాసియైన నరసింహదేవర శేషయ్యశాస్త్రిగారిని నాం
ధ్రోపాధ్యాయుడుగాను, నియమించితిని. ఆ కాలమున భీమవరములో
లక్ష్మీనరసింహాచార్యులుగారని యొక జిల్లా మునసబుగారుండిరి.
ఆయన కోర్టులోనున్న న్యాయవాదుల కంతె శ్రద్ధ లేకపోయినను,
మా పాఠశాలా విషయమున మునసబుగారికి కొంత శ్రద్ధయుండెను.
పాఠశాలలో జదువుకొనుటకు విశేషముగ బాలురు చేరకపోయినను
రెండుతరగతులలోను తగినంతమంది విద్యార్థు లుండిరి. విద్యార్థు
లిచ్చెడి జీతములతో పాఠశాలావ్యయములు సరిపోవుచుండెను.
ప్రధానోపాధ్యాయులైన వంగల వెంకటనారాయణగారు చాల తెలివి
గలవారేగాని, యొకవిధమైన తిక్కమనుష్యుడు. ఆయన కీ
యుద్యోగ మిచ్చినప్పుడు నా కీసంగతి తెలియలేదు. ఆ తిక్క క్రమ
క్రమముగా హెచ్చెను. వెంకటనారాయణగారు విద్యార్థులిచ్చెడి
జీతములు సరిగా వసూలుచేయకపోవుటయు, వసూలుచేసిన సొమ్ము
నకు సరిగా లెక్కలుంచకపోవుటయు, మొదలైన లక్షణములు కన
బడెను. అక్కడ పెద్దమనుష్యులతో వెంకటనారాయణగారికి సంబం
ధములేదు. పాఠశాల నభివృద్ధిచేయుట కాయన యేమియు ప్రయ
త్నముచేయ లేదు. సహాయోపాధ్యాయులతో నైకమత్యములేదు.
విద్యార్థుల కాయనమీద భక్తిప్రపత్తులులేవు. పాఠశాల చెడిపోవు
నట్లు కనబడెను. ఈ విషయములన్నియు నా కెప్పటికప్పుడు దెలి
యుచువచ్చెను. ఈవిధముగ పాఠశాల మూడుమాసములు జరిగెను.
ఏప్రియలు నెలలో నాకువచ్చిన రిపోర్టులనుబట్టి వెంకటనారాయణగా
రా పాఠశాలలో నుండినపక్షమున నది తప్పక చెడిపోవునని నాకు
భయముగలిగెను. అందుచేత నేను మేనెల యొకటవతారీఖునుండి
మీరు మా పాఠశాలలో పనిచేయనక్కరలేదు. మిమ్ములను తీసివేసి
తినని వెంకటనారాయణగారి కుత్తరము వ్రాసితిని. ఈ విషయమై
లక్ష్మీనరసింహాచార్యులవారికిగూడ నే నుత్తరము వ్రాసితిని. నా జాబు

చేరినమీఁదట నాచార్యులుగారు, "వెంకటనారాయణగారు మీ పాఠ
శాలలో మూఁడుమాసములు పనిచేసిరి. కావున హఠాత్తుగ వారిని
తీసివేయుట ధర్మముగాదు. ఒకనెలజీతమైన నిచ్చిన బాగుండు"నని
నాకు వ్రాసిరి. వారి సలహా బాగున్నదని నాకు తోఁచినందున
వెంకటనారాయణగారి కొకనెలజీత మేబదిరూపాయలిచ్చి పంపివేసి
తిని. మే, జూను నెలలు వేసవికాలమగుటచే నా దినములలో మఱి
యొక యుపాధ్యాయు డవసరము లేదని నియమింపలేదు. సెలవుల
యనంతరమున శ్రీనివాసాచార్యులుగారనెడు నొక వైష్ణవయువ
కుని ప్రధానోపాధ్యాయునిగ నియమించితిని. ఈ యాచార్యులుగారు
పూర్వము నేను రాజమహేంద్రవరములో మునిసిపలుస్కూలులో
బనిచేసినకాలమున నా యొద్ద జదువుకొనిరి. జూలై నెల మొదలు
కొని డిశంబరునెలవఱకు మా భీమవరము పాఠశాల చక్కఁగనే జరి
గెను. మెట్రిక్యులేషను తరగతిగూడ ముందుసంవత్సరము స్థాపించి
విద్యాశాఖవారి యనుమతి బడయవలెనని నా కభిలాషగలదు. కాని
కొంతమూలధనమో సొంతభవనమో యుండినగాని విద్యాశాఖవారు
పాఠశాల నంగీకరింపరని తెలిసినందునను, భీమవరపురప్రముఖులకు
స్వగ్రామములోని పాఠశాలను వృద్ధిపరచవలెనన్న యభిలాష లేక
పోవుటచేతను 1904 వ సంవత్సరాంతమున భీమవరము పాఠశాల
నెత్తివేసితిని. పాఠశాలా సంస్థాపనయందు నాకుగల కుతూహలము
దీనితో కొంతవఱ కడఁగెను.

రాజమహేంద్రవరములోని మా హిందూ లోవరు సెకండరీ
పాఠశాల, లక్ష్మీపతిగారి యాధిపత్యమున సరిగ జరుగుచుండెను.
మా పాఠశాలలో సంస్కృత పండితుడుగానున్న యాకుండి వ్యాస
శాస్త్రిగారు మిషనువారి పాఠశాలలో నొక యుద్యోగము దొరకగా
నక్కడకు వెళ్ళిరి. అక్కడ జీతమెక్కువగుటచేత వారిని వెంటనే
యక్కడకు బంపితిని. వారిస్థానే వేదుల సూర్యనారాయణశాస్త్రి
గారిని నియమించితిని. ఈయనగూడ కాకరపఱ్ఱు గ్రామవాసియే.
ఈ సంవత్సరమున (1904) నేను మున్ను తెనిగించిన "పార్వతీ పరి
ణయ" నాటకము ప్రథమశాస్త్రపరీక్షకు పాఠ్యగ్రంథముగ చెన్న
పురి విశ్వవిద్యాలయమువారు నిర్ణయించిరి. ఈ గ్రంథమును నేను

1899 వ సంవత్సరము శ్రీ కోమూరి దక్షిణామూర్తిశాస్త్రిగారి సహాయమున నాంధ్రీకరించితిని. నేను చెన్నపట్టణములో నున్నప్పుడు శ్రీ సమర్త్తి రంగయ్యశెట్టిగారి దర్శనముచేసితిని. నా మిత్రులైన నాళము పద్మనాభముగారు నన్ను వెంటకొనిపోయి శెట్టిగారి దర్శనము చేయించిరి. చెన్నపురి విశ్వవిద్యాలయములో నాంధ్రగ్రంథములు పరీక్షకు పెట్టుటకై యుపసంఘమునకు రంగయ్యశెట్టిగా రధ్యక్షులు. ఆంధ్ర గ్రంథ నిర్ణయమునకుగల యధికారమంతయు నాయనదే. నా గ్రంథము నిర్ణయించుటలో వీరేశలింగముగారి ప్రోత్సాహముకూడ నున్నదని నా నమ్మకము.

ఈ సంవత్సరము జరిగిన విషయములలో నా స్వవిషయము కొంత వ్రాయవలెను. ఆసంవత్సర మేప్రియల్ నెలలో మా పాఠశాలలో జదువుకొనుచున్న మంత్రిప్రగడ రామచంద్రరావను బాలుడు గోదావరిలో నీదులాడి మృతినొందెను. ఈవిధముగ నేకేట చిన్నవాండ్రు ప్రాయకముగ గోదావరిలో నీదులాడి మృతినొందుచుందురు. ఈ మంత్రిప్రగడవారి బాలుడు కందూరి వేంకటరత్నముగారికి బంధువును, నాకు మిత్రుడు, నైన మంచిరాజు పాపారావుగారికి మేనల్లుడు, నల్లుడుంగూడ. ఆవార్త మాకు దెలిసిన వెంటనే, నేనును, వేంకటరత్నముగారును నార్యాపురములోని గోదావరి రేవునకుబోతిమి. బాలకుని శవము బయటపడియుండెను. మృతినొందిన బాలకుడు పదునైదు సంవత్సరముల వయస్సుగలవాడు. పెండ్లియైనది. మంత్రిప్రగడ రామకోటిగారి భార్య కాతడు దత్తుడు. ఈతని మరణము వలన మూడు కుటుంబములకు ఘోరవిపత్తు సంభవించెను. కన్నవారికుటుంబ మొకటి, పిల్లనిచ్చినవారి కుటుంబ మొకటి, పెంచుకున్నవారి కుటుంబ మొకటి. మూడు కుటుంబములు మహాదుఃఖసముద్రములో మునిగియుండగా శవవాహకులు వచ్చి మూడువరాలిమ్మని, నాలుగు వరాలిమ్మని బేరమాడ జొచ్చిరి. వెంకటరత్నముగారికిని, నాకును వాహకుల కాఠిన్యము చూడగా మిక్కిలి కోపమువచ్చినది. అప్పుడు వాహకులతో నేమిట్లంటిమి. "శవమును మీరు మోయని పక్షమున మేమే మోసుకొనిపోయెదము. మేము పూనుకొంటిమా మీకొక్క దమ్మిడి ముట్టదు." ఆపలుకులువిని శవవాహకు లెనిమిది రూపాయల

కంగీకరించిరి. ఏలయన మాసత్త్వ వారికి దెలియును, మేము మాటలు చెప్పక నిజముగా శవమును మోయుదుమని వారెరుగుదురు. రాజమహేంద్రవరములో మిత్రులయిండ్లలో మరణములు వచ్చి నప్పు డాశవములను, ననాథశవములను మోయవలెనని ప్రతిజ్ఞ పట్టి కుందూరు వెంకటరత్నముగారు, నేనును, చెరువు సోమయాజులు గారును, చిలుకూరి వీరభద్రరావుగారును, మరికొందరు మిత్రులును జట్టుగ నేర్పడితిమి. అందుచే మమ్ముజూచిన శవవాహకులకు భయ ముగ నుండెడిది. కన్నులులేనివాడుగదా ? నీతడెట్లు శవములుమోసె నని పాఠకులకు సందేహము దోపవచ్చును. అప్పటికి నాదృష్టిబాగుం డెను. సమస్థులైనవారిని ముందునిలిపి, వెనుకప్రక్క నేనుండువాడను. ఈవిధముగ నేనయిదారు శవములు మోసితిని.

---

# స్వీయచరిత్రము

## పంచత్రింశత్ప్రకరణము

### స్వగృహకష్టములు

మా రెండవ చెల్లెలైన యచ్చమ్మ గర్భవతియై పురిటి నిమిత్తము మా యింటికి 1904 వ సంవత్సర మేప్రియలు నెలలో వచ్చెను. ఆమె భర్త మధునాపంతుల రామస్వామి యా దినములలో పూళ్ళలోని బోర్డు లోవరు సెకండరీ పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడుగ నుండెను. వేసవికాలపు సెలవుల నిమిత్తము పాఠశాల కట్టివేసి యతడు మే నెల 4 వ తేదీని మా యింటికి వచ్చెను. మా చెల్లెలు, నిద్దరుకూతుళ్లు మా యింటి కదివరకే వచ్చియుండిరి. అతడు వచ్చినది మొదలు తలనొప్పియనియు, కన్నులు లాగుచున్నవనియు, చెప్పుచు నలతగానుండెను. భోజనము చేయుచునేయుండెను గాని సుఖముగా నుండుట లేదు. దామెర్ల వెంకటరమణారావుగారి వద్ద మందిప్పించుచుంటిని. అతడే స్వయముగా వెళ్ళి మందు తెచ్చుకొనుచుండెను. స్వల్పముగా జ్వరము తగులుచుండెను. మే నెల 13వ తేదీ నాటికి జ్వర మెక్కువయ్యెను. పదునైదవ తేదీనాడు సంధించెను. మే నెల 16 వ తేదీనాడు రాత్రి మా బావమరది మధునాపంతుల రామస్వామి మృతినొందెను. పుత్రసంతాన మప్పటికి లేకపోవుటచే, మా తమ్ముడు కృష్ణమూర్తి యతని కుత్తరక్రియలు చేసెను. మా చెల్లెలు యచ్చమ్మ నిండుచూలాలు. ఆమె పెద్దకుమార్తె కెనిమిదవయేడు, రెండవకుమార్తె కారవయేడు. రామస్వామివద్ద ధన మేమియు లేదు. ఉద్యోగమువల్లనే జీవనము చేయుచుండెను. అతని కన్నగారొక రుండిరిగాని, యతడు నీరవాసరములో వైదికవృత్తివల్ల జీవించుచుండెను. వీరిని పోషించు సామర్థ్య మతనికి లేదు. రామస్వామి కిల్లు వాకిలిగాని, పొలముగాని లేదు. ఓరియంటల్ కంపెనీలో వేయి రూపాయలకు మా భీమా మాత్రముండెను. ఈ స్థితిలో వారి కుటుంబము నా పాలబడెను. దైవముమీద భారమువైచి నేను నా కుటుంబరక్షణము చేయబూనితిని. మా బావమరది చనిపోయిన యిరువదియవ దినమున మా చెల్లెలు యచ్చమ్మ మగశిశువును గనెను. మగ

శిశువు గలిగెనన్న సంతోషము గృహమందెవ్వరికి లేకపోయెను. మా భావమరది తన కాడుపిల్లలేగాని మగపిల్లలు లేరని విచారించుచుండెను. అతడు బ్రతికియున్నయెడల నీ పుత్రోదయమునకు మిక్కిలి సంతోషించియుండును. గోరుచుట్టుమీద రోకటిపోటన్నట్లు మా భావమరది యన్నయైన శివరామయ్యగారు తమ్ముని మరణవార్తవిని, మమ్ము జూచుటకువచ్చి జ్వరముదగిలి బాధపడెను. అతడు జీవించునా, లేదా యని మాకు పెద్ద సందేహము కలిగెను. ఎట్టకేలకాతడు జ్వరవిముక్తుడై వీరవాసరము చేరెను.

ఆ సంవత్సరమున (1904) తణుకులో దొడ్డిపట్ల వెంకటరత్నముగారు మొదలైన ప్రముఖులుచేరి యొక యున్నతపాఠశాల స్థాపించి, యందు నా మేనమామగారైన మల్లయ్యశాస్త్రిగారి నాంధ్రోపాధ్యాయులుగ నియమించిరి. మల్లయ్యశాస్త్రిగా రధివర కమలాపురము జోస్టుహైస్కూలులో బనిచేసి, కొంతకాలము సెలవుదీసికొని, తణుకులోని యున్నతపాఠశాలలో జేరిరి. ఈ సంవత్సరముననే మా తమ్ముని భార్య గాపురమునకు వచ్చెను. ఈ కార్యమునకు గావలసిన ధనమంతయు నేనే వ్యయముచేసితిని. కార్యమయినది మొదలుకొని మా తమ్ముడు వీరవాసరములోనే భార్యతోగూడ గాపురముండెను. ఈ సంవత్సరములోనే (శ్రీ) కందుకూరి వీరేశలింగముగారు పింఛను పుచ్చుకొని చెన్నపురినుండి రాజమహేంద్రవరము వచ్చిరి. వీరేశలింగముగారి యుద్యోగము విషయములో నిచ్చట నొక మాట వ్రాయవలెను. వారు 1897 వ సంవత్సరమున, రెండు సంవత్సరములు సెలవుదీసికొని రాజమహేంద్రవరమునుండి చెన్నపురి వెళ్ళిరని యిదివరకే వ్రాసియుంటిని. సెలవు సమాప్తముకాగానే డైరెక్టరుగారు, ప్రెసిడెన్సీ కళాశాలలో నాంధ్రోపాధ్యాయులుగనున్న మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నము పంతులుగారిని రాజమహేంద్రవర కళాశాలకు మార్చి వీరేశలింగముగారిని ప్రెసిడెన్సీ కళాశాలలో నాంధ్రోపాధ్యాయులుగ వేసిరి. వేంకటరత్నము పంతులుగారు చిరకాలము చెన్నపురిలో నుండుటచే, నిచ్చటకు వచ్చుటకు నిష్టములేకపోయినను తప్పినదిగాదు. వీరేశలింగముగారు 1904 వ సంవత్సరమువరకు నచట పనిచేసి పింఛను పుచ్చుకొని

వితంతుశరణాలయము స్థాపింపనలెనని రాజమహేంద్రవరము వచ్చిరి. వారి రాక వారిశిష్యులమైన మా జోంట్లకు మిక్కిలి సంతోషదాయకముగా నుండెను. వారు వచ్చి "సత్యవాదిని" యను వారపత్రికను స్థాపించి నడపింపజొచ్చిరి. దానికి రామాప్రగడ వేంకటరామయ్యగారి నధిపతిగా నేర్పరచిరి.

ఈ పత్రికలో విశేషముగ సంఘసంస్కరణవిషయములే ప్రకటింపబడుచుండెను. అప్పుడప్పుడా పత్రికకు నేనుగూడ వ్రాయుచుంటిని. 1905 వ సంవత్సరమున తణుకులో న్యాయవాదిగనున్న జల్లాప్రగడ సూర్యనారాయణగారు "సువర్ణ లేఖ" యను మాసపత్రికను ప్రకటింపజొచ్చిరి. ఆపత్రికకును, "సత్యవాదిని"కిని మత సాంఘిక విషయములలో నభిప్రాయభేదములు గలిగెను. దురదృష్టవశమున నేనా వివాదములలో దగులుకొంటిని. అది నా బుద్ధిపూర్వకముగ చేసిన దైనను పిమ్మట విచారించితిని. అది యెట్టిదనిన, తణుకులో పెమ్మరాజు సీతారామయ్యగారని యొక న్యాయవాది యుండెను. ఆయన సంస్కృతసారస్వత జ్ఞానముగలవారు. ఆంధ్రరచనలకుగూడ నలవాటు పడినవారు. ఆయనకు నాకు వివాదముగలిగెను. గోకేటి కనకరాజుగారని యొక న్యాయవాది నరసాపురములో నుండిరి. ఆయన భగవద్గీతావిషయమై దెనుగులో నొక వ్యాసము వ్రాసిరి. ఆ వ్యాసముక్రింద కనకరాజుగారు "కె" యని సంతకము చేసిరి. కనకరాజను పేరున కింగ్లీషులో మొదటియక్షరము "కె." పెమ్మరాజు సీతారామయ్యగారు కనకరాజుగారి వ్యాసముమీద "సువర్ణ లేఖ"లో తెనుగున విమర్శనము వ్రాయుచు ఈ కనకరాజుగా రనుటకు మారుగ "ఈకె" గారు, "ఈకె" గారని పలుమారు లుదహరించిరి. "ఈకె" యనగా "పెంట్రుక" యని యర్థమున్నది గనుక, కనకరాజుగారిని "వెంట్రుకగా"డని యర్థము వచ్చునట్లు శ్లేషలో దనకుగల పాండిత్యము జూపుటకై నిందాగర్భముగ వ్రాసిరి. అది జదివినప్పుడు నా కెంతో కోపమువచ్చినది. సీతారామయ్యగారు నన్నేమియు దూషింపకపోయినను, మిక్కిలి యనుచితమైన యా వ్రాత నాకు గోపము తెప్పించినది. ఏలయన, (శ్రీ) కనకరాజుగారు సజ్జనుడు. నాకు జిరపరిచితుడు. ఆంగ్లవిద్యాపారంగతుడు. సంఘ

సంస్కరణాభిమాని. వీరేశలింగముగారికి ముఖ్యశిష్యులలో నొకడు. రాజమహేంద్రవర కళాశాలలో జదువుకొనుచున్నప్పుడు శ్రీ వీరేశలింగముగారు స్థాపించిన "సత్యసంవర్ధనీ" పత్రికను మహారాజశ్రీ రాయసం వెంకటశివుడుగారు, గోటేటి కనకరాజుగారు, సత్యరాజు మృత్యుంజయరావుగారు మొదలగువా రింగ్లీషున, నాంధ్రమున వ్యాసములు వ్రాసి యా పత్రికానిర్వహణమున వీరేశలింగముగారికి మిక్కిలి తోడుపడుచుండెడివారు. సంఘసంస్కరణమున వీరు మువ్వురు మనఃపూర్వకమైనవిశ్వాసముగలవారగుటచే, వీరేశలింగము గారి దయకు, గౌరవమునకు పాత్రులైరి. ఆ కారణమున నాకును కనకరాజుగారియెడ గౌరవము. ఆ గౌరవనీయుని నిష్కారణముగ సీతారామయ్యగారు తూలనాడిరని నా మనసునకు నొప్పి కలిగినందున, సీతారామయ్యగారి విమర్శనకు నుత్తరము వ్రాసి దానిని "సత్యవాదిని" లో ప్రకటించితిని. అందు పెమ్మరాజు సీతారామయ్యగా రనుటకు మారుగ సంస్కృతవ్యాకరణ సాంప్రదాయానుసారముగ వారి నామమునకు నేను ప్రత్యాహారము చేసితిని. "ప్రత్యాహార" మనగా నామము పూర్తిగా చెప్పక మొదటి యక్షరమును, జివర యక్షరమును జెప్పుట. ఆ సాంప్రదాయమునుబట్టి పెమ్మరాజు సీతారామయ్యగా రనగా మొదటియక్షరమైన "పె" యనుదానిని, కడపట యక్షరమైన "య్య" యనుదానిని గలిపి "పెయ్య" యని నేను సీతారామయ్యగారి పేరు వచ్చినప్పుడెల్ల నా వ్యాసములో వాడితిని. కనకరాజుగారికి "ఈకె" యని సీతారామయ్యగారు వాడుటచే, వారికిగూడ నేను హాస్యాస్పదమైన పేరు పెట్టవలెనని నే నట్లు వ్రాసితినిగాని, మరియొక కారణముగాదు. కాని యిట్లు వ్రాసినందుకు తరువాత నాలో నేను మిక్కిలి పశ్చాత్తాపపడితిని. ఏలయన, సీతారామయ్యగారు నాకు బాల్యమిత్రుడు. వీరవాసరములో జదువుకొన్నప్పుడు నే మిరువుర మొక్కతరగతిలో జదివిన సహాధ్యాయులము. తరువాత నే మిరువురము చెరియొక పాఠశాలలో జదివినను మిత్రులుగనే యుంటిమి. పిమ్మట రాజమహేంద్రవరములో జదువుకొనుటకు వారును వచ్చిరి. నేనును వచ్చితిని. వారు కళాశాలలో బి. ఏ. వరకు జదువుకొనిరి. నే నంతవరకు జదువుకొనకపోయినను, నే

మచ్చటగూడ పరస్పరగౌరవమును, ప్రేమయు గలిగి, తరచు కలుసుకొని ముచ్చటలాడుచుండెడివారము. వారు విద్యార్థి దశనుండియు పూర్వాచారపరాయణులు. నేను సంఘసంస్కరణ ప్రియుడను. వీరేశలింగముగారి యనుచరుడను. నా కొకరి కెన్నడు రానట్టియు నాకు శాలసభ్యులైనట్టియు, పెద్దమనుష్యునితో నేనే కయ్యమునకు కాలు దువ్వి పోరాటము పెట్టుకొంటినని, విషాదమునొంది నా వ్యాసమునకు సీతారామయ్యగారు ప్రత్యుత్తరము వ్రాసినను నేను దానికి బదులువ్రాయక, యేదోకారణమున బుట్టిన స్వల్పవివాదము ప్రజ్వలింపచేయక, యడచి యార్పివేయుట సత్పురుషునకు లక్షణమని, నేనే నాకు బుద్ధి చెప్పుకొని యూరకొంటిని.

సంఘసంస్కరణమునకై ప్రత్యేకము పాటుబడుచున్న "సత్యవాదిని"కిని, శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారిచే స్థాపింపబడి. కాకినాడలో నడుపబడుచున్న "ఆర్యమతబోధిని" యను పూర్వాచారపరాయణ పత్రికకును గూడ ప్రత్యాక్షేపములు గలిగెను. బ్రహ్మయ్యశాస్త్రిగారు తమ పత్రికలో వీరేశలింగముగారి యభిప్రాయములను ఖండించుచు వచ్చిరి. వీరేశలింగముగారు "సత్యవాదిని"లో బ్రహ్మయ్యశాస్త్రిగారి యభిప్రాయములను ఖండించుచువచ్చిరి. విమర్శనములను పేరేగాని, యవి పరస్పరనిందలు. సంఘసంస్కరణమును వారు, పూర్వాచారమును వీరు దూషించుచుండిరి. ఇందు వీరేశలింగముగారు కొన్ని మనోహరములైన హాస్య సంజీవనులు గూడ వ్రాయుచుండిరి. వీరేశలింగముగారి హాస్యరసము మిక్కిలి రసవంతముగ నుండెడిదని వేరే చెప్పనక్కరలేదు. వీరేశలింగముగారేగాదు, నేనుగూడ "సత్యవాదిని"లో బ్రహ్మయ్యశాస్త్రిగారి మీద గొన్ని వ్రాతలు వ్రాసితిని. అందులో గొన్ని యనుచితములైన వ్రాతలుగూడ గలవు. వయఃపరిణామమునందిన యీకాలమున నా నాటి వెకిలివ్రాతలు దలచుకొన్న యెడల నాలో నాకే సిగ్గగుచుండును. వీరేశలింగముపంతులుగారు చెన్నపురినుండి వచ్చిన తరువాత వారు తమ గ్రంథములన్నింటిని సంపుటములుగ నే ముద్రాక్షరశాలలో ముద్రించి ప్రకటించిరో, యా చింతామణీ ముద్రాక్షరశాలను శ్రీ సత్యలోలు గున్నేశ్వరరావుగారికి విక్రయించిరి. ఆముద్రా

యంత్రమునుగొని గున్నేశ్వరరావుగారు దానిలో "ఆంధ్రకేసరి" యను తెనుగు వారపత్రికను నెలకొల్పి ప్రకటింపజొచ్చిరి. ఆ పత్రికకు సమర్థులై, "ఆంధ్రుల చరిత్రము" మొదలైన మహాగ్రంథములు వ్రాసిన శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారిని గున్నేశ్వరరావుగారు పత్రికా సంపాదకులుగ నియమించిరి.

1904 వ సంవత్సరమున కాకినాడలోనున్న శ్రీ పిఠాపురము రాజుగారి కళాశాలలో ప్రధానాచార్య పదవి కాళీయయ్యెను. ఆపదవికి, వి. శ్రీనివాసశాస్త్రిగారును, రఘుపతి వేంకటరత్నము నాయుడుగారును దరఖాస్తు చేసిరి. వేంకటరత్నమునాయుడుగారు సంఘసంస్కరణ ప్రియులును, బ్రహ్మసమాజ ప్రియులునగుటచే, వారికే ప్రధానాచార్య పదవి నొసగినచో బాలకులందరును పూర్వాచారమును విడిచి బ్రహ్మమతస్థులై చెడిపోదురని దురభిప్రాయపడి కాకినాడ పురప్రముఖులు కొందరును, కళాశాలా పరిపాలక సంఘములో కొందరును నాయుడుగారి కా పదవి నియ్యక శ్రీనివాసశాస్త్రిగారి కిచ్చుట మేలని తలంచిరి. ఈవార్త వీరేశలింగముగారు విని, రాజమహేంద్రవరమునుండి కాకినాడ వెళ్ళి, నాయుడుగారి నిమిత్తమై ప్రయత్నము చేసిరి. మా పురప్రముఖులైన శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారు శ్రీనివాసశాస్త్రిగారి నిమిత్తము ప్రయత్నము చేసిరి. అదృష్టవశమున నెట్టకేల కా పదవి నాయుడుగారికే యయ్యెను. ఆ పదవిలోచేరి పనిచేయుటకు నాయుడుగారు సికిందరాబాదునుండి బయలుదేరి కాకినాడ వెళ్ళుచుండిరి. ఆ వార్త దెలిసిన పిదప శ్రీ ధారవాడ కృష్ణారావుపంతులుగారును, నేనును గలపి యాలోచించి నాయుడుగారి కొక యభినందన పత్రిక సమర్పించుట సముచితమని నిశ్చయించితిమి. ఆ నిశ్చయము ననుసరించి శ్రీ ధారవాడ కృష్ణారావుగారే యింగ్లీషున నొక యభినందన పత్రమును సిద్ధపరచిరి. కృష్ణారావుగారు, నేనును రాజమహేంద్రవరము రైలుస్టేషనునకు వెళ్ళి, పొగబండిలో రెండవ తరగతియందున్న నాయుడుగారిని దర్శించి, యొక సారి దిగిరమ్మని కోరి ప్లాటుఫారముమీద గుర్చివేయించి యందు వారిని గూర్చుండబెట్టితిమి. అభినందనపత్రమును కృష్ణా

-రావుగారే చదివి సమర్పించిరి. నేమియువురు నేగాక మరికొందరు మిత్రులుగూడ నచటనుండిరి. వారి పేరులు మరచితిని.

శ్రీ వీరేశలింగము పంతులుగారు చెన్నపురినుండివచ్చి, ప్రాతయూరిలో నున్న స్వగృహములో ప్రవేశించి, "వితంతుశరణాలయము"ను మొట్టమొదట వారి యింటనే స్థాపించి, దాని కనుబంధముగా నొక బాలికా పాఠశాల నెలకొల్పిరి. ఇందుచేత "శరణాలయము"లోని బాలికలకేగాక చుట్టుప్రక్కల బాలికలకుగూడ విద్యాభ్యాసము చేయుట కనువుపడెను. వీరేశలింగముగారియెడ భక్తిగల గృహస్థులనేకులు తమ బాలికలను మునుపువారు చదువుచున్న నొక తనమువారి బాలికాపాఠశాలనుండి తీసివేసి నూతనముగా స్థాపింపబడిన వీరేశలింగముగారి పాఠశాలకు బంప నారంభించిరి. అందు ముఖ్యులు శ్రీ కనుపర్తి శ్రీరాములుగారు, చిత్రపు నరసింహారావుగారు, సత్యవోలు లక్ష్మీపతిగారు, దామెర్ల వెంకటరమణారావుగారు, కొట్టు రాఘవయ్యగారు మొదలగు మరికతిపయ పెద్దలుగూడ తమ బాలికలను పంపినట్లు నాకు జ్ఞాపకము. నేనును నా రెండవ చెల్లెలు కూతుల నిద్దరిని పంతులుగారి పాఠశాలకే బంపితిని. రాయసపు రామమూర్తిగారు గూడ తమ మరదండ్రను వారిపాఠశాలకే పంపిరి. వీరేశలింగము పంతులుగారు తమ బాలికాపాఠశాలకు తగిన యుపాధ్యాయుల నేర్పరచి, నింగ్లీషు తామే స్వయముగ బోధించుచుండిరి. పంతులుగారు కొన్ని తరగతులను తమ మేడమీదను, మరికొన్ని తరగతులను నడుగుభాగము నందుంచి నల్లబల్లలు, కూర్చుండు బల్లలు, దేశపటములు సమకూర్చి, యుపాధ్యాయుల జీతములు మొదలైన వ్యయములు దామే భరించి, పాఠశాలను సక్రమముగ నడుప జొచ్చిరి.

ఈ సంవత్సరమున (1905) మాకుటుంబమున కొక గొప్ప విపత్తు సంభవించెను. గత సంవత్సరమున క్రోధి (1904) నా రెండవ చెల్లెలైన యచ్చమ్మ పెనిమిటి మధురాపంతుల రామస్వామి వేసవి సెలవులలో నన్ను జూడవచ్చి జ్వరపీడితుడై మాయింటనే, మే నెల 16 వ తేదీని మృతినొందెననియు, నతడు పోవునప్పటికి యతనిభార్య నా రెండవ చెల్లెలు గర్భవతియై యుండెననియు, యతను బోయిన

నిరువదియవనాఁడు జూను నెల 4 తేదీని నామె మగశిశువును గనె ననియు నిదివరకే వ్రాసితిని. మగదిక్కులేని నా చెల్లెల కాబాలుఁడు కన్నుల పండువగువాఁడై భర్తపోయిన దుఃఖముకొంత శమింపజేయు చుండెను. సాయంకాలము నేను నాటకశాలనుండి యింటికి వచ్చి బాలునొకసారి యెత్తుకొని ముద్దాడునప్పటికి నాయాయాసమంతయు దీరి నా మనస్సు ప్రసన్నమై యుండెడిది. తల్లిదండ్రు లిద్దరు పచ్చని వాండ్రగుటచేత బాలుఁడు సువర్ణచ్ఛాయ గలిగి పెద్ద కన్నులు గలిగి, పున్నమచంద్రునివంటి మొగముగలిగి మాతల్లికి తనతల్లికి మహా నందకరుఁడై యుల్లాసము నొసఁగఁగా బెరుగుచుండెను. వాఁడు బ్రతికిన బాలునని నేను వానికి సరిగా నామధేయమైనా జేయలేదు. సంతాన విహీనుఁడనైన నాకు జనక విహీనుఁడైన యాబాలుఁడు పెరిగి పుత్ర ప్రాయుఁడై యేసుగడమై యుండునని పంచప్రాణములు వానిమీఁదనే పెట్టుకొని, పాలదాదులనుపెట్టి పాలిప్పించి, బాలు నెల్లవిధముల సంరక్షించుచుంటిని.

1905 వ సంవత్సరము జూన్ నెల 4 వ తేదీని వానికి జన్మ దినోత్సవము జేసితిని. అంతలో నెక్కడనుండి వచ్చెనో, జూన్ నెల 10 వ తేదీని యీ బాలునకు జ్వరము విరేచనములు పట్టుకొనెను. జూన్ నెల 11 వ తేదీని మధ్యాహ్నము విద్యాభిమానినీ సమాజ పక్షమున మహామహోపాధ్యాయ శ్రీ కొక్కొండ వేంకటరత్నము-పంతులుగారి యాధిపత్యమున, శ్రీ కంచుమర్తి రామచంద్రరావుగారి యింటియొద్ద జరిగిన సభలో నేను "వసుచరిత్ర"ను గురించి యుపన్యాసమిచ్చి సాయంకాల మింటికి వచ్చునప్పటికి బాలునకు రోగము కొంచెము తగ్గినట్లు కనఁబడినది. నా మిత్రులైన దామెర్ల వెంకటరమణారావుగారే సానుభూతితో మందిచ్చుచుండిరి. కాని, 12 వ తేదీనుండి జ్వరము, దాహము నెక్కువయ్యెను. పదునాలుగవ తేదీన రోగము భయంకరముకాఁగా రాత్రియంతయు బాలునకును, మాకును నిద్రలేకపోయెను. జూను 15 వ తేదీ మధ్యాహ్నము మూఁడుగంటలకు బాలుఁడు మృతినొందెను. పోవునప్పటికి నా బాలునకు సంవత్సరము మీఁద పదిదినములు వయస్సు. భగవంతుని యాశయమేమో కించిజ్ఞులమైన మన మూహింపలేము గదా? ఈ యర్భకు డేల పుట్టవలెను?

యేల యకాలమున మృతినొందవలెను ? పూర్వజన్మపాపము బాలు
నిదా ! తల్లిదా ! మాదియా ! ఎవరిదో తెలియదుగదా ! తల్లిదే
యైన పక్షమున యామె యేపాపము చేసినందుల కీపుత్రశోకము
సంభవించెనో తెలియదు. ఈ బాలుని మరణముతోనే నా యాశాలతాభం
గంబెను. నా మనోరథములు మంటగలసెను. బాలుడు మరణించి
నప్పుడు దుఃఖవశమున నేను మైమరచితిని. జగమంధకార బంధుర
మయ్యెను. దుఃఖపడిన సుఖయోగము లేదని నే నెఱిగియు, దుఃఖము
చాలకాలమువరకు నేనడచుకొనలేకపోతిని. క్రమక్రమముగా నీ
మనోవ్రణము కాలము గతించినకొద్ది నివారణమయ్యెను. ఆ
దృశ్యము నే నిప్పుడు దలచుకొన్న నా మనసు దుఃఖపూరితమై నా
కన్నులు నీరుగ్రమ్ముచున్నవి. దుఃఖజాడ్యముల బాపుటకు భగవంతు
డొక్కఁడే పరమ చికిత్సకుడు గదా! అతనినే నమ్మి కాలక్షేపము
జేయుచుంటిని.

రాజమహేంద్రవరము మ్యునిసిపల్ సభకు 1892 వ సంవత్స
రము మొదలుకొని 1901 వ సంవత్సరము వరకు గల తొమ్మిది సంవ
త్సరములు నిడమర్తి జలమన్నప్రసాదరాయుడుగా రధ్యక్షులై యుం
డిరి. వారి తరువాత శ్రీ మోచర్ల రామచంద్రరావుగా రధ్యక్షులైరి.

---

# స్వీయచరిత్రము

## పదమూడవ ప్రకరణము

### ప్రకాశముగారి సీమప్రయాణము.

1903 వ సంవత్సరమున టంగుటూరి ప్రకాశముగా రధ్యక్షులై యొక సంవత్సరమైనతరువాత, ననగా 1904 వ సంవత్సరము నవంబరు నెలలో, బారిస్టరు పరీక్షకు జదువుటకై యింగ్లాండు వెళ్ళిరి. విదేశ ప్రయాణము నాకిష్టమే గనుక, వెళ్లుమని నేనుగూడ ప్రకాశముగారిని కొంత ప్రోత్సహించితిని. వారు కొంతకాలము సీమలోనుండి, 1905వ సంవత్సరమున జూలై 16 వ తారీఖున రాజమహేంద్రవరము వచ్చిరి. సాహసించి విదేశప్రయాణము చేసినందుకు ప్రకాశముగారిని సంఘములో స్వేచ్ఛగా జేర్చుకొనుట యుక్తమని నాకు దోచినందున ప్రకాశముగారి కొక విందుచేయుమని నా ప్రియమిత్రుడైన తల్లాప్రగడ చలపతిరావుగారిని నేను మిక్కిలి ప్రోత్సాహపరచితిని. నామాట త్రోసివేయక, చలపతిరావుగారు తన మేనల్లుడైన రాయవరపు రామమూర్తిగారి యింట ప్రకాశముగారికి విందుచేసిరి. చలపతిరావుగారును, నేనును గలసి వెళ్ళి కొందరు మిత్రుల నా విందునకు బిలిచితిమి. వచ్చినవారిలో నీ క్రింది పెద్దమనుష్యులుండిరి. ధారవాడ వెంకటకృష్ణారావుగారు, సారంగు భీమశంకరరావుగారు, కనుపర్తి శ్రీరాములుగారు, దామెర్ల వెంకటరమణారావుగారు, సత్యవోలు గున్నేశ్వరరావుగారు, టంగుటూరి శ్రీరాములుగారు, టంగుటూరి ప్రకాశముగారు, చెరువు సోమయాజులుగారు, రాయవరపు రామమూర్తిగారు, నేను మరికొందరు మిత్రులును. విందునకు వచ్చినవారి పేళ్లు నిర్భయముగా "సత్యవాదినీ" పత్రికలో ప్రకటించిరి. ప్రకటింపబడినతోడనే పట్టణములో గొప్ప సంక్షోభము బయలుదేరెను. ఊరట్టుడికినట్టుడికెను. సీమ వెళ్ళినవారితో భుజించుట మహాపాతకమని యభిప్రాయపడి సభాపతులు మొదలగు వైదికశిఖామణులు సంఘమర్యాద గాపాడుకొనుటకు మార్కండేయస్వామి వారి యాలయములో గొప్ప సభ జేసిరి. అప్పుడు గవర్నమెంటు వారి న్యాయవాదిగనున్న మహారాజశ్రీ చిత్రపు వేంకటాచలము

పంతులుగారు సభ కధ్యక్షత వహించిరి. ప్రకాశముగారు సీమకు
వెళ్ళిన విషయమును, వారికి చలపతిరావుగారు చేసిన విందువిషయ
మును సభాపతు లభినవవిరూపాక్ష మఠాధిపతులైన శ్రీ శంకరాచా
ర్యస్వాములవారికి తెలియపరచిరి. అప్పుడు కొత్తపాలవరగ్రామ నివా
సియై పూర్వాశ్రమమున యనమండ్ర నరసింహశాస్త్రిగారను పండి
తులు పీఠాధిపతులుగానుండిరి. ఆ స్వాములవారు వెంటనే సీమవెళ్ళి
నందుకు ప్రకాశముగారికిని, విందుచేసినందుకు చలపతిరావుగారికిని,
వెలిబత్రికలు బంపి, విందులో పాల్గొన్న మాసంస్కారికి ముందుగ
నాంక్షపత్రికలు బంపక, "మీరు ప్రకాశముగారికి చలపతిరావుగారు
చేసిన విందులో పాల్గొన్నారట నిజమా?" యని ప్రశ్న వేయుచు
శ్రీముఖముల బంపిరి. అట్టి శ్రీముఖముల నందుకొన్నవారిలో నే
నొకండను. ఆ జాబు చేరినతోడనే నేను వారికి ప్రత్యుత్తరమంపితిని.
వారికి "శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య" యను బిరుద
ములతో జాబులు వ్రాయవలెను. నేనా బిరుదము లేమియు వ్రాయక,
"అభినవవిరూపాక్ష మఠాధిపతులైన శంకరాచార్య స్వాములవారికి"
నని పైనను, లోపలను వ్రాసి, "నమస్కారములు"నను మాటలుగూడ
వ్రాయక, ప్రకాశముగారికి చలపతిరావుగారు చేసిన విందులో నేను
ప్రకాశముగారి పంక్తిని భోజనము చేసితినని ప్రత్యుత్తర మిచ్చితిని.
నా జవాబు స్వాములవారికి కొంత పెంకితనముగానున్నట్లు కనబడెను.
తరువాత నొకనాడు నా మేనమామగారైన మల్లయ్యశాస్త్రిగా రొక
చోట స్వాములవారిని కలుసుకొనిరట. అప్పుడు స్వాములవారు నా
మేనమామగారితో రాజమహేంద్రవర ప్రసంగములు తెచ్చి "శాస్త్రి
గారూ! మీ మేనల్లుడు గురుధిక్కారము చేయుచున్నాడు! మేమేమైన
చేసినపక్షమున మీకు కష్టముగా నుండునని మేమాలోచించుచు
న్నాము." అనిరి. ఆ మాటలు విని మల్లయ్యశాస్త్రిగారు, "నా మన
సున కేమియు నొప్పియుండదు. మీ యిష్టము వచ్చినట్లు చేయు"డని
చెప్పిరట. స్వాములవారు నాకుగాని, గున్నేశ్వరరావుగారికి గాని,
యాంక్షపత్రికలు పంపలేదు. మేము వారిమీద నభియోగము తెత్తు
మని భయమున నూరకుండిరని జనులు చెప్పుకొనిరి.

పూర్వము వితంతువివాహములు ప్రారంభమైనపుడు వెనుకటి శంకరాచార్య స్వాములవారు మహారాజశ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహ శ్రేష్ఠిగారికి వితంతువివాహములలో జోక్యము గలుగజేసుకొన్నందుకు నొక యాంక్షపత్రిక బంపిరి. అంతట లక్ష్మీనరసింహశ్రేష్ఠిగారు స్వాములవారి మీద నభియోగముదెచ్చి హైకోర్టుదాకపోరి, స్వాములవారికి రెండువందల రూపాయల జరిమానా వేయించిరి. మఠాధిపతుల కా దెబ్బ యిప్పటికిని జ్ఞాపకమున్నది. అందుచేతనే స్వాములవారు మా కాంక్షపత్రిక బంపుటకు సందేహించిరి. మఠాధిపతులైన స్వాములవారన్న నా కెంతమాత్రము గౌరవములేదు. పండితులు కొందరు కష్టపడి పీఠములెక్కి లోకమందరు తమ శిష్యులని విశ్రమింపక భిక్షలని పేరుపెట్టుకొని సోమరిపోతులై నేతి పిండివంటలతో ప్రతిదినమును భోజనముచేసి, పట్టుపాన్పుల మీద పండుకొనుచు, యేనుగులు, పల్లకులు, గుఱ్ఱములు మొదలైన సిబ్బందిని వెంటబెట్టుకొని యూరూర దిరుగుచు నానాబాధలుపెట్టి యింటింటికి రూపాయి చొప్పున వసూలుచేయు ధనమంతయు దుర్వ్యయము చేయుచుందురు. వారు భిక్షానంతరమున "భగవద్గీతల"లో నొక యధ్యాయముగాని, యొక "యుపనిషత్తు"గాని యొక "బ్రహ్మసూత్రము"గాని బోధించిన పాపమున నెప్పుడుబోరు.

స్వాములవారిలో గొందరికి పుస్తకముల పేరులే యెఱుగరు. ఒక పీఠాధిపతి ధనము చాల ప్రోగుచేసి, కుమాళ్ళకు పెంకుటిళ్లు గట్టించి, భూములుగొని యిచ్చిరి. మఱియొక పీఠాధిపతి పీఠముకొరకు పూర్వపు పీఠాధిపతులు సంపాదించిన పీఠపు నగలను వెండి దీపస్తంభములను విక్రయించి, తన యుంపుడుకత్తెయైన వేశ్యాంగన కిచ్చిరట. పీఠాధిపతులయొద్ద నిరంతరము నొన్ని యాంక్షపత్రికలు కొన్ని శుద్ధపత్రికలు నిలువయుండును. ఎవరిమీదనైన గోపమువచ్చినప్పుడు స్వాములవా రొక యాంక్షపత్రికనుదీసి, వానిమీద ప్రయోగించి, తమకు వారు తగినంత లంచమిచ్చినప్పుడు శుద్ధపత్రిక నొక దానిని ప్రసాదించుచుందురు. ఇటువంటి పీఠము లెంత త్వరలో నాశనమైన నంత త్వరలో దేశము బాగుపడునని నా యభిప్రాయము. ఇటువంటి పీఠములు జనులపై నధికారము గలిగియుండవలెనని "మనుస్మృతి"లో

గాని, గలియుగము నిమిత్తమై నుద్దేశింపబడిన "పరాశరస్మృతి"లో గాని, "యాపస్తంబసూత్రముల"లోగాని, "గౌతమసూత్రముల"లో గాని, "భారతా"ది మహాగ్రంథములలోగాని చెప్పబడలేదు. ఈ పీఠ మధికార ప్రియులగు విద్యారణ్యాది మహాపురుషులచే స్థాపింపబడి గతానుగతికముగ వచ్చుచున్నది. కొన్ని మఠములకు సంవత్సరము నకు వేలకొలది రూకలు రాబడివచ్చు నగ్రహారములు గలవు. ఈ పీఠాధిపతులు నిరంకుశాధికారులు. దేశాభివృద్ధి కరములైన కార్య ములు వీరికి గిట్టవు. ప్రకాశముగారి సీమ ప్రయాణముగూర్చి యుప న్యసించుచు నేనిట్లు చెప్పితిని. "ఏదేని నేరముజేసిన వానికి ధనదండ నము విధించి, దారా పుత్రాదులను విడచి, కారాగృహములో నుం డునట్లధికారులు విధింతురుగదా? విద్య నిమిత్తము విదేశముల కరి గినవాడు మూడు సంవత్సరములు విదేశములో నుండవలెనుగదా! అదే ద్వీపాంతరవాస శిక్షగా గ్రహింపుడు! ఆ మూడేండ్లలో పదివేల రూపాయలయిన ఖర్చుబడునుగదా! ఆ పదివేలు జరిమానా విధింప బడినట్లు గ్రహింపుడు! పరదేశవాసముచేసిన పాపమున కింత కంటె నెక్కుడు శిక్ష యెందుకు? విదేశ ప్రయాణము చేసిన వీరుడు తనకు తానే విధించుకొన్న శిక్ష యిది! స్వయంకృతాపరాధమునకీ స్వయం కృత శిక్ష చాలు. ఇది దేశోపకారకమైన కార్యము కనుక దీనికై యాగ్రహింపకుడు."

1905 వ సంవత్సరము ప్రారంభమున శ్రీకృష్ణ నరకాసురుల యుద్ధమును గురించి యొక నాటకమును వ్రాయదలచి, "ప్రసన్న యాదవ" మని దానికి పేరుపెట్టి, జనవరి నెలలో మొదటి యంకము వ్రాసితిని. ఆ సంవత్సరము నాటకము ముగించలేదు. నేను రాజ మహేంద్రవరములోను, భీమవరములోను, పాఠశాలలు స్థాపించుట చేతను, నేనుపాధ్యాయుడుగ నుండక పోవుటచేతను నాకు గొంత ఋణము పెరిగినది. ఆ ఋణవిమోచనార్థమై యొక యేర్పాటు చేయ తలసివచ్చెను. సత్యవోలు గున్నేశ్వరరావు నాటకప్రియుడు. విశే షించి మానాటకసమాజమున కుపాధ్యక్షుడు. ఆ సమాజమునకు నేనధ్యక్షుడనగుటచే నేమిరువురము సాయంకాలము కలుసుకొను చుండువారము. నా నాటకములను మాసమాజమువారు పలుమారు

రంగస్థలమున ప్రదర్శించుచుండిరి. అవి జనరంజకముగ నుండుటచే బరంపురము నుండియు, మరికొన్ని యితరస్థలములనుండియు నానాటకములకు వ్రాతప్రతులు వ్రాసిపంపమని హనుమంతరావు నాయుడు గారికిని, తాతయ్యనాయుడు గారికిని వారి బంధుమిత్రుల వద్దనుండి జాబులువచ్చెను. వ్రాతప్రతులు వ్రాసి పంపుటకు వారు బద్ధకించి యూరకుండిరి. అందుచేత నానాటకముల నచ్చువేయించవలసినదని నామిత్రులు కొందరు నాకు సలహాచెప్పిరి. అచ్చువేయించవలెనని నాకును కోరిక యుండెనుగాని, నాయొద్ద ధనములేదు. పూర్వమెప్పుడో వ్రాసిన నాటకములను సవరింపకుండ నచ్చువేయుట బాగుండదని నాకుదోచెను. సవరించుటకు దగిన యవకాశము లేకపోయెను. ఇట్లుండగ, సత్యవోలు గున్నేశ్వరరావుగారు నాకొక యుపాయము చెప్పిరి. నేను రచియించిన నాటకములలో "సీతాకళ్యాణము" "పారిజాతాపహరణము", "ద్రౌపదీ పరిణయము", "గయోపాఖ్యానము" నను నాలుగు నాటకములు తన కైదుసంవత్సరములు గుత్తకీయవలసినదనియు, నాయయిదు సంవత్సరములలో నాపుస్తకముల నచ్చువేయించుకొని లాభనష్టముల ననుభవించెదననియు, నందుకు ప్రతిఫలముగా నాకు నాలుగు నాటకములకు నాయన వేయిరూపాయల నిచ్చెదమనియు, వర్తమాన మంపిరి. ఆయుపాయము నాకు నచ్చెను. ఈ సొమ్మువలన నా పుస్తకము లచ్చుపడుటయేగాక నాఋణముగూడ దీరిపోవునని సంతోషించి, నేను వారి సలహానంగీకరించి, వారితో నొక యొడంబడిక చేసికొని ద్రవ్యము పుచ్చుకొంటిని. నాటకములు సవరింపకుండ నచ్చువేయుట నాకిష్టములేదు. అందుచేత, నేనొక గుమాస్తాను నియమించుకొంటిని. ఆగుమాస్తా సత్యవోలు అప్పారావుగారు. అప్పారావుగారికిని, గున్నేశ్వరరావుగారికిని నింటిపేరొకటేగాని వారు జ్ఞాతులుమాత్రముగారు. సత్యవోలు అప్పారావుగారు నేను మ్యునిసిపలు స్కూలులో నుపాధ్యాయుడుగ నున్న కాలమున నా స్కూలులో చదువుకొనుటచే కొంతకాలము నాకు శిష్యుడు. వీరిని గుమాస్తాగ నేర్పాటు చేసుకొన్న పిమ్మట నేను మొదట "పారిజాతా పహరణ" నాటకమును సవరింప నారంభించితిని. సవరించుట [illegible]వగా నందు పూర్వము పద్యములు లేని పాత్రలకు పద్యములు

పెట్టుటయు, వద్దనయున్న పాత్రలకు నెక్కువ పెట్టుటయు, మును పున్న భాగములు కొన్ని తీసివేసి క్రొత్తభాగములు చేర్చుటయు,నని నాయభిప్రాయము. ఈ విధముగ నేను "పారిజాతాపహరణ" నాటకమును సవరించి, 1905 వ సంవత్సరాంతమునకు ముద్రణమునకు సిద్ధముచేసి నేను గున్నేశ్వరరావుగారి కిచ్చితిని. చింతామణి ముద్రాక్షరశాల గున్నేశ్వరరావుగారి చేతిలోనుండుటచేత, వారు దానిని సాధ్యమైనంత త్వరగ ముద్రించిరి. నాలుగు నాటకములలో నొక నాటకమును గున్నేశ్వరరావుగారికిచ్చితిని. గావున మూడు నాటకములు వారికీయవలసినభారము నామీదనుండెను. "పారిజాతాపహరణ" నాటక మచ్చుపడి ప్రచురింపబడిన వెంటనే యది ప్రచారణము బడయజొచ్చెను.

ఆ నాటకమునందు శృంగారరసముతోపాటు హాస్యరసము గూడ విశేషముగానుండెను. "సీతాకళ్యాణము"ను, "ద్రౌపదీ పరిణయము"ను, సవరించుటకును శుద్ధప్రతి వ్రాయించుటకును నేను కొంత జాగుచేసినందున, "సీతాకళ్యాణము"నకు బదులుగా నా రచించిన "ప్రసన్నయాదవ" నాటకమును తనకిమ్మని అడిగినందున 1906 వ సంవత్సరము జూను నెలనాటికి నేనా "ప్రసన్నయాదవ" నాటకమును సమాప్తముచేసి వారికిచ్చితిని. ఆ కారణమున "సీతాకళ్యాణ" నాటకమును నేను సవరింపవలసిన యవసరము లేకపోయెను. 1909 వ సంవత్సరము వరకును "గయోపాఖ్యానము"ను సవరించుటకు నా కవకాశము లేకపోయినందున, నా సంవత్సరము సవరించి నేను దానిని వారికిచ్చితిని. "పారిజాతాపహరణము", "ప్రసన్నయాదవము", "గయోపాఖ్యానము" అను మూడు నాటకములు వారచ్చువేయించి విక్రయించినందున నాకు వారిచ్చిన సొమ్ము, అసలీ ఫాయిదాలకు చేరుటయేగాక, కొంతలాభము వచ్చుటచే "ద్రౌపదీ పరిణయ" నాటకమును సవరించి యిమ్మని నన్ను వారు త్వరపెట్టలేదు. నాటికీ, నేటికీ నేను వారికా నాటకము నీయలేదు. పాపము గున్నేశ్వరరావుగారుగూడ 1925 వ సంవత్సరములో మృతినొందిరి. అదిగాక, గున్నేశ్వరరావుగారు స్థాపించిన "ఆంధ్రకేసరి" పత్రికకు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు సంపాదకులై, సమర్థముగా నడు

వ్రాయుచున్నను నేనుగూడ కొన్నిసంవత్సరములు గంభీరములై జనులకు రుచికరములైన వ్యాసములువ్రాసి యిచ్చుచుంటిని. అది మనసులో నుంచుకొని సన్మిశ్రిరావృగారు నేను నాలుగవ నాటకము నీయక పోయితిని. నన్నేవిధముగను భాషింపక యూరకుండిరని నా నమ్మకము.

నా పెత్తనములోనున్న రాజమహేంద్రవర "హిందూనాటక సమాజము"ను గురించి సింహావలోకనముగా కొన్ని విషయము లిచ్చుట వ్రాయుటకతప్పదు. హనుమంతరావు నాయుడుగారు మా సమాజమునకు ముఖ్యప్రాణమేయని చెప్పుట యతిశయోక్తిగాదు. 1902 వ సంవత్సర మేప్రియలు నెలలో వారికి వాతముచేత కాళ్లు పడి పోయెను. ఇంటిలో నేకటయేగాని వారు నడుచుటలేదుగదా! నిలువ బడుటకైన యోపిక లేకపోయెను. మ్యునిసిపలు పాఠశాలకు ప్రధా నోపాధ్యాయులుగ పనిచేయలేక సెలవు పుచ్చుకొనిరి. ఆ సంవత్స రము జూను నెలలో మా మ్యునిసిపలు సెక్రిటరీగా నున్న దామరాజు బసవరాజుగారు మృతినొందిరి. ఆ యుద్యోగమును మునిసిపలు సభ వారు హనుమంతరావు నాయుడుగారికిచ్చిరి. కాళ్ళు పడిపోవుటచే వారా యుద్యోగములో వెంటనే చేరలేకపోయిరి. రాజమహేంద్ర వరములోని డాక్టరులును, చెన్నపురిలోని డాక్టరులును, నాయుడు గారి కెన్నడును కాళ్ళురావని నిర్ధారణచేసిరి. ఆ నిర్ధారణమునుబట్టి గవర్నమెంటువారు నాయుడుగారికి సెక్రిటరీపదవి నీయగూడదని ఖండితముగ వ్రాసిరి. అప్పుడు టంగుటూరి ప్రకాశముగారును, పిళ్ళారిసెట్టి నారాయణరావు నాయుడుగారును హనుమంతరావు నాయుడుగారిని వస్తాకుబంపిరి. వాతముచేత పడిపోయిన కాలుచేతు లను, దెబ్బలుతగిలి విరిగిపోయిన కాలుచేతులను, నావునేతితో కట్లు కట్టి కుదుర్చుటలో వస్తాకు నివాసులైన కఠారి రామరాజుగారు, సూరపురాజుగారునను క్షత్రియ ప్రముఖులు నిరుపమాన ప్రజ్ఞావం తులు. వీరిసహాయమున కాలుచేతులు విరిగినవార నేకులు యథా ప్రకారముగ కరచరణాద్యంగములు కలిగి సుఖపడుచున్నారు. మా జిల్లా జడ్జియైన థారంటను దొరగారి కొకప్పుడు చేయివిరుగగా వారు కట్టుకట్టి, యాచేతిని చక్కజేసి, దొరగారి కృతజ్ఞతకు బాత్రులైరి.

హనుమంతరావు నాయుడుగారు కొన్ని మాసములు [illegible]లోనుండి కట్లు కట్టించుకొని, సంపూర్ణారోగ్యమును గలిగి, 1903 వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో మ్యునిసిపలు పాఠశాలలో నెప్పటియట్లు పని చేయసాగిరి. ప్రతిదినము నాటక సామాజికులందరు నాటకశాలకు పోయి కుర్చీలమీదను, బల్లలమీదను గూర్చుండి హాయిగా గాలము గడుపుచుండెడివారు. ఆదినములలో మాకు నాటకశాలయే యిల్లును సాలు. నాటకశాలయే స్వర్గము. జబ్బుగానున్న దినములలో నాయుడుగారు నాటకములలో వేషములు వేయకపోవుటయే గాక, సాయంకాల మందరితోపాటు నాటకశాలకు రాకపోవుటచే మా నాటక సమాజము వారి సహవాస సౌఖ్యము గోలుపోయి వారి ప్రసంగములు విను భాగ్యము లేక ''సింగములేని యడవి''వలె శోభావిహీనమై యుండెను. వారువచ్చి మరల నుద్యోగములో చేరినతరువాత నాటకములలో వేషములు వేయుట మానిరిగాని సాయంకాలమున మా నాటకశాలకువచ్చి, మాముచ్చటలలో పాల్గొని, మా కానందము కలుగచేయుచుండిరి.

నా పెత్తనములో నున్నప్పుడు నాటకశాలను నిత్యవసంతముగా జేయుటకై మిక్కిలి ప్రయత్నించితిని. నీతిని నిలుపుటకు, సమాజము యొక్క గౌరవమును స్వాతంత్ర్యమును గాపాడుటకు, నేను శక్యమైనంతవరకు ప్రయత్నము చేసితిని. మా సమాజములో సామర్థ్యముగల స్త్రీ వేషధారులు లేకపోవుటచే నేను ముప్పిడి జగ్గరాజను నతనిని స్త్రీ వేషధారణమునకై నెల కిరువది రూపాయలు జీతమిచ్చి పిఠాపురము నుండి పిలిపించితిని, అతను బ్రాహ్మణేతరుడు. అయినను స్ఫురద్రూపి. స్వచ్ఛమైన యుచ్చారణ గలవాడు. అభినయించుటలో మిక్కిలి నేర్పుగలవాడు. శ్రావ్యమైన కంఠముగలిగి, హృదయంగమముగ పద్యములు పాడగలవాడు. ఈతని రాకచే మా నాటకసమాజమునకు గొప్ప పేరు గలిగెను. నాయికపాత్రల నన్నింటిని నతడే ధరించి ప్రేక్షకుల పొగడ్తల నందెడువాడు. ఒకసారి మా నాటకసమాజములో ముఖ్యపాత్రలను ధరించు యువకులిద్దరు భంగుతో గలసిన క్షీరమును త్రాగి, యసందర్భముగాను, నప్రస్తుతముగాను నొక నాటి మధ్యాహ్నము సమాజభవనములో మాటలాడ జొచ్చిరి. వెంటనే వారిని

నేను మా సమాజమునుండి తీసివేసి యావలకు బంపివేసితిని. మరి-
రెండు దినములతరువాత వారు పశ్చాత్తాపమునొంది నా కడకువచ్చి,
చేసినతప్పు నొప్పుకొని క్షమింపుమనికోరి, మరల సమాజములో జేర్చు
కొమ్మని వేడిరి. అప్పుడు నేను వారిని క్షమించి మరల చేర్చుకొంటిని.
అట్టి తెలివితక్కువ పనుల మరల నెన్నడు చేయక వారు జాగ్రత్తగా
నుండిరి. మా సమాజమువారు తహసీలుదారుగారు మొదలగు నుద్యో
గస్థుల కెన్నడును జడియ లేదు. అధికారులకు భయపడి టిక్కెట్లు నుచి
తముగ నీయ లేదు. ఒక యధికారి భార్య యుచితముగ టిక్కెట్లు బం
పుమని వారి సేవకుని మా కడకు బంపెను. రాత్రి యెనిమిది గంటల
కక్కడ దొరకునని టిక్కెట్లుగనిచూపి, సత్యవోలు లక్ష్మీపతిగారు
సమాధానముచెప్పి వచ్చిన వానిని బంపివేసిరి. ఒక మేజస్ట్రేటుగారు
మా సమాజముకడ రాత్రి డప్పులను వాయించు మంగలవాండ్రు
చుట్టుపట్టులవాండ్రకు నిద్రాభంగము గలుగచేయుచున్నారని పోలీ
సువారిచేత దమకోర్టులో యభియోగము దెప్పించుకొని తామే వారికి
జరిమానాల విధించిరి. అప్పుడు నేమూరకుండక జాయింటు మేజ
స్ట్రేటుగారియొద్ద నప్పీలుజేసితిమి. ఆ దొరగారు మా మీద దేబడిన
యభియోగమును మరల విచారణచేయుమని తహసీలుదారుగారియొ
ద్దకు బంపిరి. తహసీలుదారుగారు విచారణ ప్రారంభించిరి. అప్పుడు
మాపక్షమున నేతి వెంకటసోమయాజులుగారు, పిళ్ళారిసెట్టి నారాయ
ణరావునాయుడుగారు, కనుపర్తి శ్రీరాములుగారును న్యాయవాదులై,
తాలూకా కచేరికివచ్చి వాదించిరి. పోలీసువారి పక్షమున సుబ్బారెడ్డి
గారను పోలీసు యినస్పెక్టరుగారు వాదించిరి. తహసీలుదారుగారు
మాపై వచ్చిన యభియోగమును కొట్టివేసి, మంగలివాండ్రకు పడిన
జరిమానాలు రద్దుచేసి, సొమ్ము వాపసుచేయించిరి. ఇది చిన్నయంశ
మైనను, మా సమాజమువారాత్మ గౌరవమును, స్వాతంత్ర్యమును
గాపాడుకొనుట కెట్లు ప్రవర్తించిరో తెలుపుటకై యీ విషయము
వ్రాయవలసివచ్చెను.

1906 వ సంవత్సర ప్రారంభమున జనవరి నెలలో నేను "మనో
రమ" యను మాసపత్రిక ప్రకటింపనారంభించితిని. దానిని శ్రీ
గున్నేశ్వరరావుగారి చింతామణీ ముద్రాక్షరశాలలో ముద్రింపించి

తిని. ఈపత్రికలో నేను "ప్రసన్నయాదవ" నాటకమును నెలకొక యంకముచొప్పున ప్రకటించి జూను నెలనాటి కయిదంకములుముగిం చితిని. ఈపత్రికయొక్క ప్రథమసంచిక చేరినతోడనే నామిత్రులైన జయంతి రామయ్యపంతులుగారు "మీ కవిత్వము గానమువలె నా కానందము కలిగించుచున్నది" అని జాబు వ్రాసిరి. కూచి నరసిం హముగారు "తేనెవలె రుచించుచున్నది" అని నన్ను బహూకరిం చుచు వ్రాసిరి. ఈ నాటకముగాక, "మనోరమ" పత్రికలో "రాజ స్థాన కథావళి" యను గ్రంథమును, "మహాపురుషుల జీవచరిత్రము లను" గ్రంథమును, "వినోదములు"ను, "కర్పూరమంజరి" యను నవలను భాగభాగములుగ బ్రకటింపజొచ్చితిని. "రాజస్థానకథావళి" Todd's of Annals of Rajasthan యను నింగ్లీషుగ్రంథమునుండి తెని గింపబడినది. ఈ గ్రంథము రెండు భాగములుగలది. మొదటిభాగము 1906 లోను, రెండవభాగము 1907 లోను ప్రకటింపబడినవి. "మహా పురుషుల జీవితచరిత్రము" మూడుభాగములుగలది. అందు మొదటి భాగము రాజా రామమోహనరాయలు మొదలగు బంగాళాదేశపు మహాపురుషుల జీవచరిత్రలు గలది. ఇది 1906 లో ప్రతి మహాపురు షుని పటముతోసహా భాగభాగములుగ ప్రకటించితిని. రెండవభా గము బొంబాయిరాజధానిలోని మహాపురుషుల జీవచరిత్రలు కలిగి యున్నది. ఇది 1907 లో వారివారి పటములతో ప్రకటింపబడెను. పటములు సంపాదించుటకై నెలకు పదిరూపాయలు చొప్పున నాకు వ్యయమగుచుండెను. మూడవభాగము చెన్నపురిలోని నాయకుల చరిత్రలతో నిండియున్నది. "కర్పూరమంజరి"లోని మొదటిభాగము 1906 లో ముగించితిని. ఈ పత్రికకు మొదటిసంవత్సరములోనే తగి నంత ప్రోత్సాహము కలిగెను.

ఈ సంవత్సరము రాజమహేంద్రవరములో నొకవిశేషము జరిగెను. శ్రీ శంకరాచార్యస్వాములవారు టంగుటూరి ప్రకాశము గారితో భోజనము చేసినవారికి వెలిపత్రికలు బంపుటకై ప్రయత్న ముచేయుచుండిరి. వారు రాజమహేంద్రవరమువచ్చి శంకరమఠ ములో బసచేసిరి. ఆంక్షపత్రిక లుపసంహరింపుమని వారిని వినయ ముతో వేడుకొనుటకై పురజనులొక యేకాదశినాడు మధ్యాహ్నము

మార్కండేయులవారి యాలయములో నొక సభచేసిరి. ఆ సభకు శ్రీ స్వాములవారి నాహ్వానము చేసిరి. శ్రీ స్వాములవారు దను యేనుగునెక్కి సభకు వచ్చిరి. గౌరవముగా వారిని మంటపముమీఁద నొక కుర్చీమీఁద కూర్చుండఁబెట్టిరి. పౌరులు వారికిరుప్రక్కల పాదములకడ మంటపముమీఁద క్రింద కూరుచుండిరి. తక్కిన పౌరులు మంటపమునకు, గర్భాలయమునకు నడుమనున్న కాళీస్థలములో కూరుచుండిరి. అప్పుడు మాపురములో రెండవతరగతి (2nd grade) న్యాయవాదియైన గుండవరపు రామమూర్తిగారు లేచి, స్వాములవారి కెదురుగా నిలిచి, చేతులు జోడించి యిట్లని విన్నవించిరి. "స్వామీ! సరదానిమిత్తము సీమకు వెళ్ళలేదు. విద్యాభ్యాసమునకు వెళ్ళిరి. వారు దుస్సాంకర్యము చేయుటకై వెళ్ళలేదు. వారు మంచిపనిచేయుటచే మావారు కొందరాయనతో భోజనముచేసి సంఘములో జేర్చుకొనిరి. కాబట్టి ప్రకాశముగారిని, వారితో భోజనముచేసినవారిని, వెలివేయక క్షమింపవలెనని నా ప్రార్థన." అని గుండవరపు రామమూర్తిగారు పలుకుచుండగా నాయనమాటలు సహింపక పూర్వాచారపరాయణుఁడైన యొకశాస్త్రి సభలో నుచ్చరింపరాని కఠినోక్తుల నుచ్చరించి, రామమూర్తిగారి నధిక్షేపించెను. ఆయన దుర్భాషలు సభవారికందరకు మహాగ్రహ కారణములయ్యెను. వెంటనే సభాసదులు, "ఛీ, ఛీ, ఛీ," యని కేకలు వేసిరి. గొడవపుట్టెను. సభలో కూర్చున్న వారందరు దిగ్గున లేచిరి. కొట్టుకొందురేమోయని భయము కలిగెను. స్వాములవారా శాస్త్రిని మందలింపలేక, సభాజనులు తమమీఁదఁబడి తన్ను కొట్టుదురేమోయని భయపడి కుర్చీమీఁదనుండి లేచి పాదుకలు దొడుగుకొని యాలయముయొక్క దొడ్డిగుమ్మముదారిని గోదావరియొడ్డునకు గబగబ నడచిపోయి, శంకరమఠము చేరిరి. వారి పీఠశిష్యులు కొంతమంది వెంటనుండిరి. మొదట వారెక్కివచ్చిన యేనుగు దేవాలయముయొక్క సింహద్వారముకడనే వీధిలోనుండెను. స్వాములవారు వెళ్ళగానే సభాసదులు చెల్లాచెదరై, నానాముఖముల బోయిరి. స్వాములవారు మఠముచేరి, మహాకుపితులై గొంతెత్తి రాజమహేంద్రపురమును, పురవాసులను శపించుచు, దన్ను కొట్టుటకే యాసభకు దన్ను రప్పిం

చిరని యనుమానపడి సూచింపనారంభించిరి. అది నిక్కి మరభ్రా యనే గాని, యింత సత్యమేమియులేదు. సభాసమావేశము చేసిన వారును, సభకు వచ్చిన గుంటూరు రామమూర్తిగారు మొదలైన వారును, విదేశప్రయాణము చేసినవారిని వెలివేయుంటే సంఘములో చేర్చుకొన్నారని స్వాములవారిని వేడుకొనుటకే యిద్దరు ధర్మబుద్ధితో సభకువచ్చిరి. గాని స్వాములవారిని ప్రార్థించుటకే గాక, కొట్టు టకుగాని, రాలేదని నేను స్పష్టముగ చెప్పగలను. అంతయు, నేనా సభలో గుంటూరు రామమూర్తిగారి ప్రక్కనే యుంటిని. పూర్వాచారపరాయ ష్ఠులు వీరేశలింగముగారు వితంతువివాహములు చేసినప్పుడు రాజ మహేంద్రవర కళాశాలావిద్యార్థులు తమశిష్యులను కొట్టుకొందురని మహోత్సాహముగ బట్టణమునుండి రాత్రివేళ వెడలిపోయిరి. అట్టి యిప్పుడు గూడ యీ స్వాములవారు భయపడి కోపోద్రేకులైరి. కాని వారు భయపడుట కెంతమాత్రము కారణము లేదు. శ్రీ చిలుకూరి వీర భద్రరావుగారు తమ "ఆంధ్రకేసరి"లో నిరపేక్షమైన వ్యాఖ్యానము చేయుచు, నేనును తెల్లవారింపగా జరిగిపోయినట్లు వ్రాసి ప్రకటించిరి. దీనివలన స్వాములవారు గుణాభిమానముగాని సాహసముగాని లేనివా రని చెప్పుటకే!

టంగుటూరి ప్రకాశముగారు గత సంవత్సరమునందే, యనగా 1905 వ సంవత్సరమునందే, రెండవసారి సీమకు వెళ్ళిరి. 1906 వ సంవత్సర ప్రారంభమున దేశిరాజు పెదబాపయ్యగారు తమ యంతః కరణ శుద్ధిగా నడచుకొనవలచి, బ్రాహ్మణమతము విడిచి యజ్ఞోప వీతము దీసివైచి యనుష్ఠానిక బ్రాహ్మమతస్థులైరి. కందుకూరి వీరేశ లింగము పంతులుగారు మొదటినుండియు మనసులో బ్రాహ్మమతావ లంబులేగాని, యజ్ఞోపవీతము దీసివేయలేదు. బాపయ్యగారా పని చేసినతోడనే వీరేశలింగముగారు గూడ యజ్ఞోపవీతమును పరిత్యజించి యనుష్ఠానిక బ్రాహ్మమతస్థులైరి. ఈ పని జరిగినతోడనే నగరములో గొప్ప సంక్షోభము బయలుదేరెను. విద్యార్థులందరు వీరేశలింగము గారివలెనే జందెములు తెంచివైచి బ్రాహ్మమతస్థులగుదురని ప్రజ లకు భయము గలిగెను. వీరేశలింగముగారి మార్గము ననుసరింప గూడదని చెప్పుటకై పురమందిరములో నొక పౌరమహాసభ జరిగెను.

ఆ సభకు మహారాజశ్రీ గంటి లక్ష్మన్నగారధ్యక్షులైరి. అడవి కొలను కనకరాజుగారు లేచి, సభలో వీరేశలింగముగారు తమ కరు వది సంవత్సరములు వచ్చినతరువాత వృద్ధులై యజ్ఞోపవీతము పరి త్యజించిరి గనుక విద్యార్థులు చిన్నతనమునందా పని చేయఁగూడ దనియు, చిరకాలానుభవము గలిగినమీఁద నవసరమైన పక్షమున నట్టుచేయవచ్చుననియు, గంభీరముగా నుపన్యసించిరి. సభాధ్యక్షులు గూడ వీరేశలింగముగారి మతమును ఖండించిరి. అత్తిలి సూర్యనారా యణగారును నేనును వీరేశలింగముగారు చేసిన కార్యమును సమ ర్థించుచు నుపన్యసించితిమి. సభ వరుసగా మూఁడుదినములుజరిగెను. ఆ పక్షమున గొందరు, నీ పక్షమున గొందరు మాటాడిరేగాని పర్య వసానము తేలలేదు. దేశరాజు పెదబాపయ్యగారు వయసున చిన్న వారయ్యు సంస్కరణ విషయమున వృద్ధులై మహావీరుడయ్యెను. కళాశాలలో దన యుద్యోగమునకు భంగము వచ్చినను, నార్బతు నాటు కంపెనీలో దన సొమ్ము పోయినను, తన మామగారైన దావు లూరి యుమామహేశ్వరరావుగారితోను, గొప్ప యుద్యోగస్థులైన తన పినతండ్రులతోను, వియోగము సంభవించినను, వంట కెవడు దొరకకపోయినను, తానే స్వయముగా వంటచేసి తండ్రిగారి శ్రాద్ధ మును బ్రహ్మమత ప్రకారము జరిపిరి.

ఆ సంవత్సరమున నా మేనమామగారు తణుకులో నూతన ముగా స్థాపింపబడిన యున్నతపాఠశాలలో నాంధ్రోపాధ్యాయులై పనిచేయుచుండిరి. మాతల్లి తన సోదరుడైన మల్లయశాస్త్రిగారిని జూచుటకు తణుకు వెళ్ళి యచట జబ్బుపడెను. బ్రతుకుమీఁద యాస యూ మెకు బోయినందున, జ్యేష్ఠ కుమారుడనైన నాకడకే తన్ను బంపుమని తన సోదరునిగోరెను. మల్లయశాస్త్రిగారు నాకడ కామెను బంపిరి. రాజమహేంద్రవరము తాలూకాబోర్డువారు మా మేన మామగారికి సెలవీయనందున శాస్త్రిగారమలాపురము వెళ్ళవలసి వచ్చెను. అందుచేత, మాతల్లిని విడుచుట కిష్టములేకపోయినను విధి లేక 1906 వ సంవత్సరము జూను నెలలో నామెను నాకడకుబంపి శాస్త్రిగా రమలాపురము వెళ్ళిరి. మాతమ్ముడు కృష్ణమూర్తి మా తల్లిని నాకడకు దోడ్కొనివచ్చెను. అప్పుడు నాకు మిక్కిలి జబ్బుగా

నుండెను. నాకు కదలుట కోపికలేక మాతల్లిని సురక్షితముగా దోడ్కొనిరమ్మని నా మిత్రులైన తాతయ్యనాయుని కందర్ప తిమ్మ రాజును బయనముచేసి విజయేశ్వరము బంపితిని. మా తమ్ముడును, వారిపుత్రుడును, మాయమ్మను పడవమీద నాకడకు తోడ్కొని వచ్చిరి. నేను గుర్జిలము సుబ్బారావుగారిచేతను, డాక్టర్ వెంకట రమణారావుగారిచేతను, దగుచికిత్స చేయించితిని. గాని యది ప్రయో జనకారి గాలేదు. అంతకంత కామెకు రోగమధికమై యున్న ద్వేషము గలిగెను. గ్రామ పురోహితుడైన యొక వైదిక శిఖామణి నాకడకు వచ్చి ప్రకాశముగారి పంక్తిని నేను భోజనము చేసినందున నేను కర్మచేయుట కష్టమగునుగానని చెప్పి నన్ను ప్రాయశ్చిత్తము చేయిం చుకొమ్మని గోరిరి. నేనందుల కొప్పుకొనక, వారికోరిక నిరాకరించి బంపివేసితిని. ఎట్టకేలకు మాతల్లి పరాభవ సంవత్సరమందు నాషాఢ శుద్ధమున నేకాదశీ దినమున పగలు పదిగంటలకు మృతినొందెను. అదియేమిచిత్రమోగాని, మా పితామహుడును, మా తండ్రిగారును, మా రెండవ చెల్లెలైన యుచ్చమ్మయు, నా మేనమామ మల్లయ్య శాస్త్రిగారును, మాతల్లివలె యేకాదశినాడే పరమపదించిరి. అందు వలన మావాండ్రందరు పుణ్యాత్ములనియు, నితర తిథులలోబోయిన వారందరు పాపాత్ములనియు, చెప్పుట నాయభిప్రాయముగాదు. నా కట్టి పిచ్చినమ్మకము లేదు. ఏతిథినిబోయినను పోయినవారి సుకృత మునుబట్టి వారికి సద్గతికలుగునని నా నమ్మకము. మాయింట శునక మొకటిగూడ నేకాదశినాడేపోయెను. అదియొక యదృచ్ఛ (Accident) గాని సుకృతవిశేషముగాదు. నా మాతృమరణము నాకమిత సంతా పము కలిగించెను. ఆమె మంచియిల్లాలని వీరవాసరములో మిక్కిలి పేరుబడెను. చిన్ననాట నామె భర్తగారిచేతను, తనయుత్తగారిచేతను, మిక్కిలిశ్రమపడెను. నేను నరసాపురములో జదువుకొనునప్పుడు నా నిమిత్తముగూడ మిక్కిలి శ్రమపడెను. ఆమె ఋణమెన్నడును నేను దీర్చుకొనజాలను. పునర్జన్మమున్నపక్షమున నేను మరల నామె గర్భముననే జన్మింపవలెనని నాకోరిక. అటువంటి యుత్తమమాత కడుపున బుట్టుట దుర్లభము. ఆమె ఖండవల్లిలో జన్మమొంది, వీరవాసరములో గాపురముచేసి, రాజమహేంద్రవరములో గాలధర్మమొందెను. అప్పుడు

నేను జబ్బుగానుండుటచే నామెకు యథావిధిగా నంత్యక్రియలు చేయ
జాలనైతిని. మాతమ్ముఁడు కృష్ణమూర్తియే దాదాపుగా కర్మనంతను
చేసెను. నేను ప్రకాశముగారింట భోజనము చేసితినను సందేహము
లేక, బ్రహ్మశ్రీ వాజపేయయాజుల రామయ్యగారను శ్రోత్రియ
బ్రాహ్మణుడు మా వది ఋగ్వేదమగుటచే నాశ్వలాయన సూత్రప్రకా
రము కర్మ యథావిధిగా జేయించెను. పండ్రెండవదినమున మా
యింట జరిగిన సంతర్పణములో నేసందేహమును లేక నూరుమంది
బ్రాహ్మణులు భోజనములు చేసిరి.

మా తల్లి పోయిన పదమూడవ దినమున నేను మా దొడ్డిలో
తల యంటుకొనుచుండగా కంపకూరు వీరేశలింగముగారు, కం
దూరు వేంకటరత్నముగారు, రామాప్రగడ వేంకటరామయ్యగారు
ముగ్గురును గలసి మా యింటికివచ్చి తమరాక నాకు దెలుపుమని
మా యింటిలోని మనుష్యునిచేత లోపలకు వర్తమానమంపిరి. శరీ
రమునిండ రాసుకున్న నూనెతో సగమునలుచుకున్న పిండితో వారి
దర్శనము చేయుటకు వీథి సావడిలోనికి వచ్చి, పంతులుగారికి నమస్క
రించి, యేలవచ్చితిరని యడిగి వారి సన్నిధిని గూరుచుంటిని. అప్పుడు
పంతులుగారిట్లనిరి. నేను "వితంతుశరణాలయము"ను "నిమ్నజాతుల
బాలబాలికా శరణాలయము"ను, "పతితస్త్రీ శరణాలయము"ను
స్థాపించవలచుకున్నాను. ఈ మూడు సంస్థలలోను పనిచేయు యువ
కులు నాకు కావలెను. వారికి వేఱేవేఱే జీతము లిచ్చుట కష్టము.
అందుచే నేనొక యాస్తిక పాఠశాల స్థాపించి దానిలో పనిచేయు
నుపాధ్యాయులచేత నీ ధర్మసంస్థలలో పనిచేయింపవలెనని నా
తలంపు. కాబట్టి మీ హిందూలోవరు సెకండరీ పాఠశాల నాకిచ్చిన
పక్షమున దాని నున్నతపాఠశాలగా జేసి యందలి యుపాధ్యాయుల
చేత నీ ధర్మసంస్థలు నడపించెదను. మీ కీ పాఠశాలవలన కొంత
లాభము వచ్చుచున్నపక్షమున మీకు నెల కేదో కొంత విరాళ
మిచ్చెదను" ఆ పలుకులు వినగానే క్షణకాలమైన నేనాలోచింపక
వెంటనే యిట్లు ప్రత్యుత్తరమిచ్చితిని.

"అయ్యా! ఈ పాఠశాలవలన నాకు లాభమువచ్చుటలేదు.
పాఠశాలలోనున్న సమస్త పరికరములతోడను మీకు నేను పరమ

సంతోషముతో నా పాఠశాల నిచ్చెదను. నెల నెలకుగాని, సంవత్సరములకుగాని, మీరు నాకేమియు ధన మీయనక్కర లేదు". నామాటలు విని వీరేశలింగముపంతులుగారు మిక్కిలి సంతోషించి వెడలిపోయిరి. కాని వారు వెంటనే పాఠశాలను స్వాధీనము చేసుకొనలేదు. ఏలయన, వీరేశలింగముపంతులుగా రా సంవత్సర మొక గొడవలో బడిరి. డి. శ్యామరావను నొక మహారాష్ట్రయువకుడు మా నాటక సమాజములో సామాజికుడుగా నుండెను. అతడు హనుమంతరావు గారి దయవలన మునిసిపలు పాఠశాలలో నొక చిన్న యుపాధ్యాయ పదవి సంపాదించెను. తరువాత నతడా పనిమాని "హిందూసమాజాభివర్ధని" యను తెనుగుపత్రిక నొకటి నెలకొల్పి నడుపజొచ్చెను. న్యాపతి సుబ్బరావు పంతులుగారు స్థాపించిన "హిందూ సమాజము"తో దీని కెట్టిసంబంధము లేదు. శ్యామరావుగారు తమ పత్రికలో నీక్రిందివిధముగా వ్రాసిరి. "ఒక పట్టణములో నొక పుణ్యజనుడు వితంతువులకు విద్యాబుద్ధులు చెప్పి వారిని బాగుచేయుటకై వితంతు శరణాలయము స్థాపించి కొందరు వితంతువులను చేర్చి పోషించుచుండెను. నొక యరవవాడు స్త్రీవేషము వేసుకొని యా శరణాలయములో ప్రవేశించి వితంతువులను పాడుచేయుచుండెను." ఇది శ్యామరావుగారి వ్రాతయొక్క సారముగాని యచ్ఛముగా నీమాటలేగావు. ఇది పూర్వాచారపరాయణుల ప్రేరణముచేతనో, తెలివితక్కువతనో శ్యామరావుగారు వీరేశలింగముగారిని వారి శరణాలయమును నుద్దేశించి శరణాలయమున కప్రతిష్ఠ తెచ్చుటకు వ్రాసిన వ్రాతయని స్పష్టమగుచున్నది. పుణ్యజనుడనుమాటమీద శ్లేషగలదు. పుణ్యజనుడనగా రాక్షసు డొకయర్థము, సత్పురుషు డొకయర్థము. శ్యామరావుగారు వీరేశలింగముగారి విషయమై రాక్షసార్థము ప్రయోగించిరిగాని, మంచియర్థముకాదు. నే నెరిగినంతవరకు "వితంతుశరణాలయము"లో నెన్నడు నరవవాడు స్త్రీవేషముతో ప్రవేశింపలేదు. అది వట్టి యబద్ధకల్పనము. శ్యామరావుగారి యొక్కయు, వారి సహకారులయొక్కయు, నూహా ప్రపంచములోనే యట్టికార్యము జరిగియుండును గాని ప్రపంచములో నెక్కడను జరిగియుండదు. అది దురుద్దేశముతో వ్రాయబడిన వ్రాత.

అది చదివి కోపించి వీరేశలింగము పంతులుగారు మా పట్టణములో జాయింటు మేజస్ట్రీటుగానున్న బ్రేడువుడ్డు దొరగారియొద్ద శ్యామా రావుగారిమీద నొక యభియోగము (క్రిమినల్ ఛార్జి)ను దెచ్చిరి. అది విచారణకు వచ్చెను. విచారణ కొన్నిమాసములు పట్టెను. వీరేశలింగముగారి పక్షమున ధారవాడ కృష్ణారావుగారును, టంగుటూరి శ్రీరాములుగారును కనుపర్తి శ్రీరాములుగారును, న్యాయవాదులుగా పనిచేసిరి. శ్యామారావుగారి పక్షమున సారంగు భీమశంకరరావుగారును తంజావూరు రఘునాధరావు. గారును న్యాయవాదులుగా పనిచేసిరి. వీరేశలింగముగారి పక్షమున చిత్రపు వేంకటాచలము పంతులుగారును సత్యనోలు లక్ష్మీపతిగారు మొదలగు ప్రముఖులు సాక్ష్యమిచ్చిరి. వాయిదా జరిగిన ప్రతిదినమున నేను పనికట్టుకొని దొరగారి కచేరీకిబోయి న్యాయ వాదుల ప్రక్కను కూర్చుండి, వారు మరచిన సంగతులను జ్ఞాపకముచేయుచు నాకుతోచిన సలహాలను చెప్పుచుంటిని. మేజస్ట్రీటు గారు వీరేశలింగముగారి యొక్కయు, వారి పక్షమున వచ్చినవారి యొక్కయు, సాక్ష్యమునమ్మి శ్యామారావుగారికి పదునెనిమిది మాసములు కారాగృహవాసశిక్ష మూడునందల రూపాయలు జరిమానయు విధించిరి. వీరేశలింగముగారా కఠినశిక్షవిని విస్మయమును, విచారమును పొందిరి. ఏదో స్వల్పముగ జరిమానా విధింపబడునని వీరేశలింగముగారు తలంచిరిగాని, యింత కఠినముగ శిక్ష విధింపబడునని వారు తలంపలేదు. కనుక వారు మిక్కిలి జాలిపడిరి. శ్యామారావుగా రప్పీలుచేసిరి. మండల న్యాయాధిపతియైన పార్థసారధి అయ్యంగారు కొంత కారాగృహవాసశిక్షను, కొంత జరిమానాను తగ్గించి శేషించినది ఖాయపరచిరి.

వీరేశలింగముగారు సంపూర్ణమైన బ్రహ్మసమాజ మతస్థులగుటచే, వారటమీద హిందూ ధర్మశాస్త్రప్రకారము వితంతువివాహములు చేయరని యంతకుమున్ను వితంతు వివాహములు చేసి కొన్న వారభిప్రాయపడి వీరేశలింగము పంతులుగా రదివరకుచేసిన స్త్రీ పునర్వివాహము లుగ్గడించుటకు పంతులుగారికొక వీడ్కోలు నొసంగి గౌరవింపదలచి యిన్నీసుపేటలో నొక సభచేసిరి. ఆసభకు

నన్నే, యీ వితంతు వివాహములు చేసికొన్న వారధ్యక్షులుగా గోరిరి. నే నధ్యక్షుడనై వీరేశలింగము పంతులుగారును, రాజ్యలక్ష్మమ్మగారును వితంతువివాహ సంస్కరణవిషయమై యెన్నెన్ని శ్రమలుపడిరో, యెట్టి ఘనకార్యములుచేసిరో యవియెల్ల నుగ్గడించి వారి కంఠములో ప్రాణముండగ స్త్రీ పునర్వివాహ సంస్కరణమును వదలిపెట్టరని చెప్పితిని.



# స్వీయ చరిత్రము

## పదునాల్గవ ప్రకరణము

### హితకారిణీ సమాజ స్థాపనము

1906 వ సంవత్సరముననే హితకారిణీ సమాజమును స్థాపించి యీ సమాజపక్షమున నా దగ్గర పుచ్చుకొన్న పాఠశాల నున్నత పాఠశాలగా జేయదలచి, యీ విషయమై డైరెక్టరుగారితో నుత్తర ప్రత్యుత్తరములు జరుపుమని నన్నును సత్యవోలు లక్ష్మీపతిగారిని పాఠశాలోప సంఘమునకు కార్యసచివులుగ పంతులుగారు నియమించిరి. నేమిరువురమును మరుచటిసంవత్సరము నాలుగవఫారము పెట్టుట కనుజ్ఞ నిమ్మని, డైరెక్టరు గారికి వ్రాసితిమి. అప్పుడు బోధనాభ్యసన కళాశాలకు మల్లాది వేంకటరత్నముగారు ప్రిన్సిపాలుగ నుండిరి. మా పాఠశాలా విషయమై హంటరు దొరగారికేమియు నాక్షేపణ లేకుండ జేసికొనుటకై యొకనాటి సాయంకాలము వీరేశలింగముగారును, లక్ష్మీపతిగారును, నేనును హంటరుగారి యింటికి బోతిమి. మల్లాది వేంకటరత్నముగారు గూడ నప్పుడచ్చట నుండిరి. మా పాఠశాల నున్నతపాఠశాల జేసినచో, తమ కళాశాల లోని యున్నతపాఠశాలకు నష్టము కలుగునని వేంకటరత్నముగారు బహువిధములైన యాక్షేపణములు జెప్పిరి. అవి యన్నియు హంటరు గారి చెవి కెక్కినవి. మా పాఠశాలాస్థాపనము దొరగారికి గూడ నిష్టములేదని వారి సంభాషణముల బట్టియే మేము గ్రహించి, రాత్రి తొమ్మిది గంటలకు దొరగారివద్ద సెలవుదీసికొని యింటికి బోయితిమి. దొరగారు మా పాఠశాలను గురించి డైరెక్టరుగారికి వ్యతిరేకముగానే వ్రాసియుందురు. అందుచేత మరుచటి సంవత్సరము నాలుగవ ఫారము పెట్టుటకు డైరెక్టరుగా రంగీకరింపలేదు. ఈ విధముగ నెట్లెటో 1906 వ సంవత్సరము గడచెను.

1907 వ సంవత్సర ప్రారంభమున నొకనాడు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు వీరేశలింగముగారియొద్దకు బోయి "వితంతు వివాహములు శాస్త్రీయములా? అశాస్త్రీయములా? చేయదగినవా? చేయగూడనివా? యను విషయమును గురించి చర్చచేయవలసి

యున్నది ; అట్టి సభకు మీరధ్యక్షులుగా నుండవలసిన"దని గోరిరి. అప్పుడు వీరేశలింగముగారు "పాతిక సంవత్సరములనుండి వితంతు వివాహములు జరుగుచున్నవి ; అనేకము లైనవి. ఇప్పు డాచర్చ యన వసరము. నే నా సభ కధ్యక్షుడుగ నుండను. కావలసిన పక్షమున చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి నధ్యక్షులుగ కోరుకొను'' డని చెప్పి, శాస్త్రిగారిని బంపిరట ! ఇట్లు తమకు శాస్త్రిగారికి సంభాషణ జరిగినదని, వీరేశలింగముగారు నాతో చెప్పిరి. పిమ్మట కృష్ణమూర్తి శాస్త్రిగారు సభ నేర్పాటుచేసి, యా సభకు నన్నధ్యక్షులుగ నేర్పా టుచేసి, వితంతువివాహోద్యమము ఖండించుటకు బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారిని బిలిపించిరి. సభ హిందూసమాజమందిర మున జరిగెను. హిందూసమాజమనగా నిప్పటి భవనము గాదు. న్యాపతి సుబ్బారావుపంతులుగారి ఇంటికిచేరి యుత్తరభాగమున నొక గొప్ప సావడి గలదు. హిందూసమాజము, మునుపందులో నుండె డిది. అందుచే దానిని హిందూసమాజమందిరమంటిని. ఒకనాటి సాయంకాలమున సభ ప్రారంభమయ్యెను. ప్రేక్షకులతో భవనమం తయు నిండెను. కళాశాలా విద్యార్థులు, మా నాటక సామాజికులు, చాలమంది పౌరులు, సభకు విజయము చేసిరి. సత్యవోలు గున్నే శ్వరరావుగారు, సత్యవోలు లక్ష్మీపతిగారు, చెరుకుమిల్లి వేంకట రామయ్యగారు నా చుట్టును గూర్చుండిరి. బ్రహ్మయ్యశాస్త్రిగారికిని నాకును సమావేశము గలుగుట మా పురజనులు మిక్కిలి యాశ్చర్య ముగ భావించిరి. ఏలయన వారు పూర్వాచార పరాయణులలో నగ్రగణ్యులు. నేను సంఘసంస్కరణ ప్రియుడను. బ్రహ్మయ్య శాస్త్రిగారు ముందుగ వితంతు వివాహములు చేయగూడదనివని యుక్తులచేత సాధింతునని, యుపన్యాస మారంభించిరి. శాస్త్రవిష యమున మరియొకనాడు ప్రసంగింతుమని సెలవిచ్చిరి. ఆ సాయం కాల మంతయు యుక్తులతోడనే వితంతువివాహములను ఖండించిరి. రమారమి యొక గంటసేపు వారు మాటాడిరి. నడుమ నడుమ సభాసదులు వారి కడ్డుతగులుచూ వచ్చిరి. వా రుపన్యసించిన పిదప వారు చెప్పిన యుక్తులకు జవాబు చెప్పుమని సభాసదులు నన్ను గోరిరి. అంతట నేను లేచి బ్రహ్మయ్యశాస్త్రిగారి యుక్తులను నా

యుక్తులచేత ఖండించితిని. మరుచటివారము వచ్చి శాస్త్రవిషయమై ప్రసంగింతుమని చెప్పి, బ్రహ్మయ్యశాస్త్రిగారు వెడలిపోయిరి. తరువాత వా రెన్నడువచ్చి యీ విషయమై యుపన్యసింపలేదు.

ఇన్నీసుపేటలో నొక పోస్టాఫీసు కలదుగదా! 1907 వ సంవత్సరమున, దామోజీపురపు నారాయణరావుగారక్కడ పోస్టుమాస్టరుగా నుండిరి. వారు జాతముచేత మాధ్వబ్రాహ్మణులు. కాని తరువాత, ననుష్ఠానిక బ్రాహ్మమతస్థులైరి. వారి తల్లిగారియొక్కయో, తండ్రిగారియొక్కయో శ్రాద్ధమురాగా, నారాయణరావుగారు శ్రాద్ధము బ్రాహ్మమతము ప్రకారముచేసి, యాసందర్భమున మిత్రులకొక విందుచేసిరి. ఆవిందున సర్వమతములవారు పాల్గొనిరి. నేనును, వీరేశలింగముగారును, టంగుటూరి శ్రీరాములుగారును వెళ్ళి యావిందులో భుజించితిమి. అందు వైశ్యులు గొందరు, బ్రాహ్మణేతరులు గొందరు పాల్గొనిరి. నానామతములవారితో విందారగించుట నా కదియే మొదటిసారి. వంట బ్రాహ్మణుడే చేసెను. భోజనము చేసినవారి నామములు పత్రికలో పడెను. అదివరకు, ప్రకాశముగారి పంక్తిని భోజనము చేసినందులకే, మా పట్టణములోని పూర్వాచారపరాయణులు మామీద మిరియాలు కారాలు నూరుచుండిరి. ఈ విందుతో వారికి మామీద నమితాగ్రహము వచ్చినది. టంగుటూరి శ్రీరాములుగారు రాయవరపు రామమూర్తిగారి తోడియల్లుడగుటచే, రామమూర్తి యింటనే గాపురముండిరి. ఇంతలో రామమూర్తిగారి మూడవమరదలి వివాహము వచ్చెను. ఆమెను పాలెపు శరభరాజుగారి కిచ్చుటకు నిశ్చయింపబడెను. నేను రాయవరపువారి కుటుంబములోనివాడనేయని లోకులు తలచుటచేతను, శ్రీరాములుగారు రామమూర్తిగారికి దగ్గరబంధువగుటచేతను, నే మిరువురము వివాహములో సంబంధము కలుగచేసుకొందుమని లోకులెరిగి, పురవాసులు రామమూర్తిగారిని కొన్ని చిక్కులుపెట్టిరి. వంటబ్రాహ్మణులు నాద్వారా బయానాపుచ్చుకొని మరల గనబడలేదు. వంట బ్రాహ్మణులు దొరకుటయే దుర్లభమయ్యెను. ఎట్టకేలకు నేను, మా సత్యవోలు లక్ష్మీపతిగారి యల్లుడైన శ్రీ రాజా వాడ్రేవు వెంకట కృష్ణారావుగారి దర్శనమునకు వెళ్ళి పెండ్లికి వంటబ్రాహ్మణులు

కుదురలేదని చెప్పితిని. ఆయన వంగలపూడి జమీందారుగారు. వారు వాడ్రేవువారి సత్రమనుపేర నొకసత్రమును జరుపుచుండిరి. ఆ జమీందారుగారు లక్ష్మీపతిగారిద్వారా నాకును రామమూర్తికిని మిత్రులు. ఈ సంగతివిని జమీందారుగారు తమ సత్రములోని వంట బ్రాహ్మణుని తీసికొనివెళ్ళుమని చెప్పిరి. సత్యవోలు గున్నేశ్వర రావుగారుగూడ తమ యింటనున్న వంటబ్రాహ్మణుని మా కెరు విచ్చిరి. మరియొక బ్రాహ్మణుడు కావలసివచ్చెను. అయ్యల సోమ యాజు లప్పన్న యను బ్రాహ్మణు డనేకసంవత్సరములనుండి రామ మూర్తిగారియింట వంటబ్రాహ్మణుడుగనుండి యప్పటికి మానివేసి, దుర్భవారి సత్రములో వంటకు గుదిరెను. అప్పటి కాసత్రములో శ్రీ శంకరాచార్య స్వాములవారు బసచేసియుండిరి. మమ్ము వెలి వేయదలచిన స్వాములవారు మండపేటవెళ్ళి యచట విశూచిజాడ్య ముదగిలి యచటనే మృతినొందిరి. ఆ పీఠమున వారిస్థానమున ద్వైవష్ట చక్రవర్తులని బిరుదుపొందిన శ్రీ రాణీనృసింహాచయనులుగా రధిష్ఠిం చిరి. వారు రాజమహేంద్రవరమువచ్చి దుర్భవారి సత్రమున బస చేసి, యాసత్రపు వంటబ్రాహ్మణుడైన యప్పన్నను రాయసవరపువా రింటికి వెళ్ళవద్దని యాజ్ఞాపించిరి. అప్పన్న రాయసవరపువారియెడ మిక్కిలి కృతజ్ఞుడగుటచే స్వాములవారియాజ్ఞ నిరాకరించి, తన యుద్యోగము పోయినను సరేయని తెగించి, రాయసవరపువారింటికి వచ్చి, యైదుదినములు వంటకు సాహాయ్యముజేసెను.

1907 వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో శ్రీ పిఠాపురము మహారాజావారికి పిఠాపురములో పట్టాభిషేకము జరిగెను. జిల్లాల లోని పెద్దమనుష్యులను చాలమందిని బిలిచిరి. వీరేశలింగముగారికిని, నాకును "సత్యవాదినీ" పత్రికాధిపతులగుటచే రామాప్రగడ వేంకట రామయ్యగారికిని నాహ్వానములు వచ్చెను. వీరేశలింగముగారును, రాజ్యలక్ష్మమ్మగారును, వేంకటరామయ్యగారును, నేనును మా పాఠ శాలలో సాముకసరత్తుల యుపాధ్యాయుడైన మల్లుభొట్ల వెంకయ్యను దీసికొని పిఠాపురము వెళ్ళితిమి. అప్పుడు పిఠాపురములో మహమ్మ దిబ్రహీముసాహేబుగారు దివానుగాను, బుద్ధవరపు కామరాజుగా రసిస్టెంటు దివానుగాను, మొక్కపాటి సుబ్బారాయుడుగారు మహా

రాజావారి కాంతరంగిక కార్యదర్శి (Private Secretary) గాను నుండిరి. వీరేశలింగముగారికిని, నాకును ప్రత్యేకముగ నొకబసనిచ్చి, యొక వంటబ్రాహ్మణుని వప్పగించిరి. పట్టాభిషేకసంబర్భమునకై చేయబడిన మిఠాయి మొదలైన పిండివంటలు మాకు ప్రతిదినము పంపబడెను. దివానుగారు, అసిస్టెంటు దివానుగారు, ఆంతరంగిక కార్యదర్శిగారుగూడ వచ్చి, మాక్షేమమరయుచుండిరి. కోటలో దర్బారుజరిగెను. దేవులపల్లి సోదరు లష్టావధానముజేసిరి. పట్టాభిషేక మహోత్సవము మిక్కిలి వైభవముగా జరిగెను. మూడుదినములు మేము పిఠాపురములో నుండి పిమ్మట రాజమహేంద్రవరము వెళ్ళితిమి. నా మేనమామగారైన మల్లయశాస్త్రిగారు 1906 వ సంవత్సరము చివరభాగములోనే పిఠాపురములో మహారాజావారిచేత స్థాపింపబడిన యున్నతపాఠశాలలో నాంధ్రపండితులైయుండిరి. నేనక్కడ నున్న దినములలో వారిదర్శనముచేసితిని.

పిఠాపురమునుండి వచ్చినతరువాత వీరేశలింగముగారు తల్లిగారి యొక్కయు, తండ్రిగారి యొక్కయు, శ్రాద్ధములు బ్రహ్మసమాజ మతప్రకారము జేసిరి. అంతకుముందే వీరేశలింగముగారు చల్లపల్లి రంగయ్యగారియొద్ద నొక పెద్ద తోటకొని, ప్రాతయూరిలో నున్న తమ యిల్లు విడిచి, యా తోటలో గాపురముండిరి. వితంతు శరణాలయమును, దానికి సంబంధించిన పాఠశాలను గూడ తోటలోనికి మార్చిరి. ఆ శ్రాద్ధ సందర్భమున వీరేశలింగము గారొక విందుచేసిరి. ఆ విందున కన్నివర్ణములవారిని వారు పిలిచిరి. నేను కూడ వెళ్లి భుజించితిని.

ఆ సంవత్సరము మార్చి నెలలో శ్రీ రఘుపతి వెంకటరత్నము నాయుడుగారొక సంఘసంస్కరణ సభను, మతసంస్కరణ సభను కాకినాడలో జరిపిరి. సంఘసంస్కరణ సభకు, సబుజడ్జిగనున్న వారణాసి సుబ్రహ్మణ్యముగా నధ్యక్షత వహించిరి. బంగాళాదేశమునుండి పండిత శివనాథశాస్త్రిగారువచ్చి, మతసంస్కరణసభ కధ్యక్షతవహించిరి. సంఘసంస్కరణసభలో ధారవాడ కృష్ణారావుగా రింగ్లీషులోను, నేను దెనుగులోను మాటాడితిమి. శివనాథశాస్త్రిగారు మిక్కిలి గంభీరమైన యుపన్యాసమిచ్చిరి. ఆయన మాటలు నా చెవిలో, నిప్పు

టికిని ఖంగుమని వినబడుచున్నట్లే యున్నవి. "బడిలో భూమి గుండ్ర ముగ నున్నదనియు, ఇంటివద్ద భూమి నలుచదరముగ నున్నదనియు చెప్పిన సిద్ధాంతము పోవలెను. అది పనికిరాదు," వారింగ్లీషున చెప్పెడి మాటలివి. (Round at School and Flat at Home theory must go away) సభలలో సంఘసంస్కర్తలమని చెప్పి, యింటియొద్ద పూర్వాచార పరాయణులై యుండుట తగదని దీని యభిప్రాయము. ఆ సభకు పిఠాపురము మహారాజావారు దయచేసిరి. వారి బంగా ళాలో మొట్టమొదటిపర్యాయము వారిదర్శనము జేసితిని.

1905 వ సంవత్సరమున బంగాళాదేశము రెండుభాగములుగా విభజింపబడెను. అందుచేత బంగాళీలు తమకు ఘోరమైన యన్యా యము జరిగినదని దుఃఖించి భూమ్యాకాశములు పగులునట్లు దేశ మున గొప్ప సంక్షోభము కలిగించిరి. హిందూదేశములో నన్ని జాతులవారు నన్నిభాగములవారు బంగాళీలయెడ సానుభూతిగలిగి, తమతమ దేశములలో గొప్ప సభలుచేసి దొరతనమువారి చర్యను ఖండించిరి. ఈవిషయమున నాంధ్రులు వెనుకబడియుండ లేదు. రాజ మహేంద్రవరములోగూడ గొన్ని సభలు జరిగెను. ఆసభలలో నేను గూడ పలుమారు లుపన్యసించితిని. ఈ గొడవ 1905, 1906 సంవ త్సరములలో జరిగెను. ఈవిషయమును పురస్కరించుకొని పూర్వము బ్రహ్మమత ప్రచారకుడుగవచ్చిన బిపినుచంద్రపాలుగారు చెన్నపురి రాజధానిలో రాజకీయోపన్యాసము లీయదలచి, కలకత్తానుండి బయలుదేరి బరంపురము, విశాఖపట్టణములమీదుగ రాజమహేంద్ర వరము వచ్చిరి. వారువచ్చి మొట్టమొదట యిన్నీసుపేటలో నుపన్య సించిరి. అప్పటినుండియు యీ భాగమునకు "పాలు-చౌక"ని పేరు వచ్చెను. బిపినుచంద్రపాలుగారు దొరతనమువారు హిందూదేశమును పరిపాలించుచున్న పద్ధతులను ప్రబలముగా ఖండించుచు టవునుహాలు యొక్క యావరణములో నయిదుదినములు వరుసగా ప్రతిదినమును సాయంకాలమున నింగ్లీషులో గంభీరముగా నుపన్యసించిరి. శ్రీకృష్ణుని గానమువిని, మోడులు చిగురించినట్లు రాళ్లు స్రవించినట్లు బిపిను చంద్రపాలుగారి యుపన్యాసములు విని జను లుద్రేకపూరితులైరి. కొన్నిసార్లు కంచుమర్తి రామచంద్రరావుగారును కొన్నిసార్లు టంగు

టూరి శ్రీరాములుగారును పాలుగారి సభలలో నధ్యక్షత వహించిరి. పాలుగారి యుపన్యాసముల కింగ్లీషురాని జనులు వేనకువేలు వచ్చుటచే, పాలుగారి యుపన్యాససారమును తమకు తెనుగులో చెప్పుడని, సభాసదులు నన్ను గోరిరి. సభలు జనులతో క్రిక్కిరిసియుండెను. జనులకోరిక ననుసరించి నేను పాలుగారి యుపన్యాసములను వారు చెప్పునప్పుడే మనసులో ధారణముచేసికొని, వారి యుపన్యాసాంతమున నొకటియు మరువకుండ సభాసదులకు తెనుగులో విన్నవించెడివాడను. కట్టకడపటిదినమున సభలో కూర్చుండి నామనసులో యూహించుకొని యీ క్రిందిపద్యమును బహిరంగముగ కట్టకడపట జదివితిని.

తే॥ గీ॥ భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ,
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి.

ఈ పద్యమును విని సభాసదులు సంతోషపారవశ్యమున బ్రహ్మాండము పగులునట్లు చప్పట్లుగొట్టిరి. సభాంతమున ననేకులు నాకడకువచ్చి పద్యమును మరల మరల చదివించుకొని, విని, కంఠపాఠము చేసిరి. ఈ పద్య మన్నిపత్రికలలోను పడెను. ఈ పద్యమెట్లు వ్రాకివెళ్ళినదోగాని క్రిష్ణానది వంతెన గోడలమీద పెన్సిళ్ళతో వ్రాయబడెను. దానిని చదివినవారు స్వయముగ నాతో చెప్పిరి. ఇది యాంధ్రదేశమంతట వ్యాపించెను. నా గోదావరీమండల సభాపద్యములతోపాటు, నీ పద్యముగూడ హరికథలలో కెక్కెను. మా నాటకసమాజపక్షమున శ్రీ పాలుగారిని గౌరవింపదలచి వేణీసంహారనాటక మాడించి, దానివలన వచ్చిన నూటయేబదిరూపాయలు సొమ్ము దీసికొనివెళ్ళి నేను స్వయముగా పాలుగారికి సమర్పించితిని. ఆయన సంతోషపడి నాకు వందనము లర్పించిరి.

1907 వ సంవత్సరము వేసవికాలపు సెలవులలో మా రెండవ చెల్లెలు అచ్చమ్మ తన కూతులనిద్దరిని తోడ్కొని బెజవాడ వెళ్ళి, వేసవి వెళ్ళినదాక తన యాడుపడుచుగారింటనుండెను. కారణమేమన మేము గాపురమున్నయిల్లు దనకచ్చివచ్చినదిగాదని యామె

యభిప్రాయపడెను. ఎట్లన మే మాయింట ప్రవేశించిన సంవత్సరమే యనగా 1903 మే నెలలో యామె కడపటికూతురు చనిపోయెను. మరుచటి సంవత్సర మనగా 1904 లో నామెభర్త రామస్వామియే చనిపోయెను. ఆ మరుచటిసంవత్సర మనగా 1905 వ సంవత్సరము జూను నెలలో నామె గారాబుకొడుకు మృతినొందెను. ఆ మరుచటి సంవత్సరము 1906 జూలై మాసములో మాతల్లి చనిపోయెను. పైన చెప్పబడినవారిలో గొందరు మృతినొందినప్పుడు నక్షత్రము మంచిదిగాకపోవుటచే నిల్లు రెండు మూడు మాసములు విడిచిపెట్టి వేరొకచోట గాపురముండుమని మా యిరుగుపొరుగువారు సలహా జెప్పిరి. ప్రకృతిలోనున్న నక్షత్రములన్నియు మంచివేయనియు, మంచినక్షత్రములు కొన్నియు, దుష్టనక్షత్రములు కొన్నియు లేవనియు, ప్రజలు దుష్టనక్షత్రములని జెప్పెడి నక్షత్రములలో చనిపోయి నందున నేకీడు లేదనియు, నిల్లు మొదలైనవి వదలివేయుట తెలివితక్కువయనియు నానమ్మకము. అందుచేత, నెవరు చెప్పినను నే నా యిల్లు వదలలేదు. ఇది నా మూర్ఖ్యమని నా కుటుంబములోనివారు దలంచిరి. కడచినసంవత్సరములందువలెనే యీ సంవత్సరమందు గూడ తనకో, తనబిడ్డలకో నేకీడో మూడునని తనబిడ్డలను వెంట బెట్టుకొని నాచెల్లెలు అచ్చమ్మ బెజవాడ వెళ్లెను. కాని నేను మరి యొకకారణమున 1907 వ సంవత్సరము వేసవికాలములో దుర్భవారి యిల్లు వదలిపెట్టవలసివచ్చెను. ఆ యింటి యజమానుడైన దుర్భ సూర్యనారాయణగారు స్వగృహమున నివసింపదలచి నన్ను వెళ్ళి పొమ్మని చెప్పుటచే, నేను రాయవరపువారి యింట నద్దెకు ప్రవేశించితిని. ఆ యింటిలో నే నద్దెకు ప్రవేశించినను స్వగృహమువంటిదే. ఇందువల్ల మా చెలియలు కోరికదీరెను. ఆమె వేసవికాలము వెళ్ళిన తరువాత బిడ్డలను దోడ్కొని రాజమహేంద్రవరము వచ్చెను. వీరేశ లింగముగారు తమపాఠశాలను కోటలోనికి మార్చినందున నేను నా మేనగోడండ్రను మునుపటియట్లు దొరతనమువారి బాలికాపాఠ శాలకే బంపజొచ్చితిని.

ఆ సంవత్సరమున (1907) చెన్నరాష్ట్ర రాజకీయసభ (Madras Provincial Political Conference) విశాఖపట్టణములో జరు

పుటకు నిశ్చయింపబడెను. ఆసభకు శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగా రధ్యక్షులైరి. ఆనరుబుల్ బయ్యా నరసింహేశ్వరశర్మగారు సన్మానసంఘాధ్యక్షులైరి. రాజమహేంద్రవరమునుండి యీ సభకు గంటి లక్ష్మన్నగారు, ధారవాడ కృష్ణారావుగారు మొదలైన న్యాయవాదులును, చిత్రపు నరసింహారావుగారును, నేనును మరికొందరు పురజనులును వెళ్ళితిమి. మాకు కసింకోట జమీందారుగారిదైన శ్రీ కారుమంచివారి హవేలీలో బసయిచ్చిరి. శ్రీ చిర్రావూరి యజ్ఞేశ్వరచింతామణి గారా సభా కార్యనిర్వహణమునందు సుబ్బారావు పంతులుగారికి తోడుపడిరి. అప్పుడే నాకు శ్రీ చింతామణిగారితో పరిచయమయ్యెను. అధ్యక్షులైన సుబ్బారావు పంతులుగారి ప్రారంభోపన్యాసము తత్కాలానుసారముగ మిక్కిలి తీవ్రమై యుత్సాహజనకముగ నుండెను. ఆకాలమున జనులలో నతివాదులు మితవాదులను రెండు కక్షలుండెను. స్వరాజ్యము, స్వదేశవస్త్రము, స్వజాతీయవిద్య కావలెనని వాదించువారు బాలగంగాధర తిలకుగారును వారి యనుచరులును నతివాదు లనబడిరి. దొరతనమువారి పక్షమందేయుండి జాతీయవిద్య, స్వదేశవస్త్రము నక్కరలేదనువారు మితవాదులనబడిరి. న్యాపతి సుబ్బారావు పంతులుగారు మొత్తముమీద మితవాదులేయైనను వారి యుపన్యాస తీవ్రతనుబట్టి "మదరాసు మెయిలు" పత్రిక వారి నతివాదులలో జేర్చెను. ఆ సంవత్సరము (1907) మేనెల 9 వ తేదీని పంజాబు దొరతనమువారు దేశాభిమానియు, మహాపురుషుడు నైన లాలా లజపతిరాయిగారిని బట్టుకొని, నిష్కారణముగా బర్మాకు గొంపోయి, మాండలే నగరములో ఖయిదు జేసిరి. అందుచేత భరతఖండమున నాసేతుహిమాచల పర్యంతము సంక్షోభతరంగ మొకటి వ్యాపించెను. విశాఖపట్టణసభలో మొట్టమొదటి తీర్మానము లజపతిరాయిగారిని దొరతనమువా రక్రమముగా బంధించినందులకు దొరతనమువారి చర్యను ఖండించుటకై యేర్పడెను. ఆ తీర్మానమును గురించి కర్నూలునుండి వచ్చిన సి. శ్రీనివాసరావుగా రింగ్లీషులోను, నేను దెలుగులోను మాట్లాడితిమి. నా సంభాషణమును విని శ్రీనివాసరావుగారు నా చేయిపట్టుకొని, యుత్తేజకకరమైన మీ యుపన్యాసమువిని నేను సంతసించితిని.

అని నాంగ్లభాషలో పలికి నన్ను హెచ్చరించిరి. వారన్నమాటలివి. "I heard your soul Stirring Speach with pleasure". తరువాత పురాణం వెంకటప్పయ్యగారు గూడ నన్ను జూచి, నా యుపన్యాసము మిక్కిలి బాగున్నదని పరామర్శ జేసిరి. లజపతిరాయిగారి ప్రవాసమును గురించి నే నీ క్రిందిపద్యమును రాజమహేంద్రవరములో నుండగనే రచియించితిని.

మ॥ చెరశాలల్ పృథుచంద్రశాలలెయగుక్ చేదోయి కీలించు న
య్యరదండల్ విరిదండలయ్యెడును హేయంబైన చోడంబలే
పరమాన్నంబగు. మోట కంబళులుదాల్పక్ పట్టుసెల్లాలగుక్
స్థిరుడై యే నరుడాత్మ దేశమును భక్తింగొల్చునవ్వానికిక్.

తే॥ గీ॥ భరతఖండంబె యొక గొప్ప బందెఖాన
అందులోనున్న ఖయిదీలు హిందుజనులు
ఒక్కగదినుండి మార్చి వేరొక్కగదిని
బెట్టుటేగాక చెరయుంచు వేరెగలదె.

ఈ చెన్నరాష్ట్ర మహాసభ విశాఖపట్టణమందు మిక్కిలి వైభవముగాను జయప్రదముగాను జరిగెను. అది నరసింహేశ్వరశర్మగారి నిరంతరాయ కృషివల్లనే యట్లు జరిగెను. సభాంతమున సుబ్బారావు పంతులుగారు సమాప్తి వాక్యములు చెప్పుచు శ్రీ చింతామణిగారు రాత్రి పగలు నిద్రలేక సభకు సేవచేసి తమకు సహాయము జేసినందులకు మిక్కిలి యుగ్గడించిరి. నాలుగవదినమున సంఘసంస్కరణసభ యయ్యెను. ఆ సభయొక్క సన్మానసంఘమునకు విశాఖపట్టణ కళాశాలా ప్రథానాచార్యులైన పి. టి. శ్రీనివాసయ్యంగా రధ్యక్షులైరి. అక్కడ సబుజడ్జిగనున్న వారణాసి సుబ్రహ్మణ్యం పంతులుగారు సంఘసంస్కరణ మహాసభాధ్యక్షులైరి. పి. టి. శ్రీనివాసయ్యంగారు విద్యావంతులేగాని వారి కాదినములలో సుప్రతిష్ఠ లేదు. అట్టి పురుషుడు సంఘసంస్కరణ సన్మానసంఘాధ్యక్షుడగుట నా కిష్టము లేదు. ఆకారణమున నేనా సభకు బోనని పట్టుపట్టి కూర్చుంటిని. చిత్రపు వేంకట నరసింహారావుగారును, ధారవాడ వెంకటకృష్ణారావుగారును నామార్గమునే యనుసరించి సభకు బోరైరి. నరసింహేశ్వర శర్మగారు మమ్ము సభకురమ్మని వర్తమానము లంపిరి. కాని మేము

మా పట్టు విడువలేదు. ఆసభకు హాజరుకాకయే మేము మువ్వురము మెయిలుబండిమీద నచటనుండి రాజమహేంద్రవరము వచ్చితిమి.

ఆకాలమున యేట్సుదొరగారు ఉత్తరమండలములకు పాఠశాలా పరీక్షాధికారులుగా నుండిరి. నేను రాజకీయసభలలో దరుచుగా మాట్లాడుచుండుటచే దొరగారు రావార్తవిని తన చేతిక్రింద బనిచేయు చున్న డెప్యూటీ యినస్పెక్టరుగారితో నిట్లనియెనట. "లక్ష్మీనరసింహముగారి బడికి మన మీ సంవత్సరము బరీక్షకు పోనక్కరలేదు. ఆయన యతివాది యగుటచే దన పాఠశాలను మనము బరీక్షించుట కొప్పుకొనడు." ఈ మాటలు డిప్యూటి యినస్పెక్టరుగారు నాతో చెప్పిరి. నేనట్లు చేయువాడనుకానని వారితో చెప్పి పిమ్మట నేను యేట్సు దొరగారిని జూడబోతిని. ఆయన నన్ను సగౌరవముగా నాదరించిరి. పరీక్షనిమిత్తము మా పాఠశాల కెప్పుడువత్తురని దొర గారిని నేనడిగితిని. ఆయన నా యందేమియు దోషారోపణచేయక కొలదిదినములలో వత్తుననిచెప్పి బంపిరి. పిమ్మట కొన్నాళ్ళకు వారు మా పాఠశాలకు దయచేసి యెప్పటియట్ల బరీక్షించిరి. మా పాఠశాల దమకిమ్మని వీరేశలింగముగారు సంవత్సరముక్రిందట నన్నడిగిరి. గాని, యంతవరకు మాబడి వారు స్వాధీనము చేసికొనలేదు. మును పటియట్ల నేనే నడుపుచు జీతములు మొదలైనవి నేనే యిచ్చుకొను చుంటిని. 1907 వ సంవప్సరము జూను మాసాంతమునకు నుపాధ్యాయుల జీతములు నే నీయవలసియుంటిని. నాయొద్ద డబ్బులేదు. వీరేశలింగముగారు బడిని స్వాధీనము జేసుకొనలేదు. గనుక, పాఠశాలను దీసివేయవలసినదని కొందరు మిత్రులు నాకు సలహాజెప్పిరి. ఆసలహా నాకు రుచింపకపోవుటచే నేను నూఱురూపాయలు బదులు తెచ్చి యుపాధ్యాయుల జీతములిచ్చి యెప్పటియట్ల పాఠశాల నడుపుచుంటిని. అప్పుడు శ్రీ హితకారిణీ సమాజ కార్యదర్శిగా శ్రీ కారుమూరి వీరభద్రస్వామిగారుండిరి. ఈయన వైశ్యుడు. పట్టపరీక్షాసిద్ధుడు. మా మునిసిపాలిటీకి సెక్రటరీగాగూడ నుండెను. 1907 వ సంవత్సరము సెప్టెంబరు 16 వ తేదీని వీరభద్రస్వామిగారు మా పాఠశాలకువచ్చి వీరేశలింగముగారు హితకారిణీ సమాజపక్షమున మా పాఠశాలను తమ కప్పగించవలసినట్లు చెప్పిరని నాతో చెప్పిరి. వీర

భద్రస్వామిగారికి వప్పగించవలసినదని వీరేశలింగముగారు నాకొక జాబుగూడ వ్రాసిరి. ఆజాబు ననుసరించి నేను మా పాఠశాలను వీరభద్రస్వామిగారి కప్పగించి వారివల్ల రసీదు పుచ్చుకొంటిని. అప్పటినుండి యుపాధ్యాయుల జీతములు మొదలైనవి వీరేశలింగము గారే యిచ్చి పాఠశాలను నడుపుచుండిరి. లక్ష్మీపతిగారాసంవత్సరమే మాబడిలో పనిచేయుట మానిరి. నాకు వారికి గల మైత్రిచేత నాబడిలో జీతములేకుండ బనిచేసిరి గాని, మరియొకరియొద్ద పనిచేయుట వారి కిష్టములేదు. అప్పటికి కుందూరు వెంకటరత్నముగారు ప్రధానోపాధ్యాయులుగా నుండుటకు దగిన యర్హత సంపాదించి నందున వారే ప్రధానోపాధ్యాయులుగా నుండిరి. ముందు సంవత్సరము నాలుగవఫారము బెట్టి యున్నత పాఠశాలకు సెలవిమ్మని హితకారిణీ సమాజమువారు డైరెక్టరుగారికి వ్రాసిరి. సర్కారువారు సెలవిచ్చినందున, 1908 వ సంవత్సరము జనవరి నెలలో నాలుగవ ఫారము బెట్టి యున్నతపాఠశాల జేసిరి. ఆ యున్నతపాఠశాలకు జయంతి గంగన్నగారు మొట్టమొదటి ప్రధానోపాధ్యాయులైరి.

ఇక్కడ మా నాటకసమాజచరిత్ర కొంచెము వ్రాయవలెను. ఈ నాటకసమాజమున సభ్యులై యుండుటకంటె తామే సమాజమును స్వాధీనము చేసికొని పెత్తనము వహించి నాటకము లాడించి తామే లాభనష్టము లనుభవించవలెనను కోరిక సత్యవోలు గున్నేశ్వరరావుగారికిని, కృత్తివెంటి నాగేశ్వరరావుగారికిని పుట్టెను. వారు తమ యభిప్రాయమును నాకును సమాజములోని ముఖ్యులకును నెరింగించిరి. సమాజమున కప్పటికి గొంతఋణముండెను. ఆ ఋణము దీర్చి తత్ప్రతిఫలముగా, మా తెరలు కొయ్యసామానులు తదితర పరికరములు దీసుకొని, వారు నాటకసమాజమును తమయధీనము చేసుకొని నడుపుకోవచ్చునని మేమంటిమి. ఆ ప్రకారముగా వారిరువురు సమాజమును స్వాధీనముజేసుకొని నాటకములాడింపజొచ్చిరి. కొంతకాలము జరుగునప్పటికి వారికువురకును సరిపడలేదు. అందుచేత నాగేశ్వరరావుగారు హిందూనాటకసమాజమను పేరుతో, నొక నాటకసమాజమును స్థాపించి, మునుపు నే మాడుచున్న లక్ష్మీపతిగారి నాటకశాలలోనే నాటకము లాడింపజొచ్చిరి. గున్నేశ్వరరావు

గారు చింతామణీ నాటకసమాజమను పేర మరియొకసమాజము స్థాపించి, చిత్రపు వెంకటనరసింహారావుగారి దొడ్డి యద్దెకుపుచ్చుకొని చింతామణీ నాటకశాలయను నొకభవనము గట్టించిరి. ఆభవనమునందు ప్రవేశోత్సవము నన్ను జరుపుమని, గున్నేశ్వరరావుగారు గోరగా, నేనా ప్రవేశోత్సవముజరిపితిని. గున్నేశ్వరరావుగారును, నాగేశ్వరరావుగారును విడిపోయినతరువాత గున్నేశ్వరరావుగారు తమ నాటకసమాజమును విజయనగరము తీసికొనిపోయి నాటకము లాడించి మెప్పువడసిరి. నాగేశ్వరరావుగారు తమ సమాజమును చెన్నపురి దీసికొనిపోయి నాటకము లాడించి చెన్ననగరాంధ్రుల స్తోత్రములకు పాత్రులైరి. ఆనరుబుల్ బయ్యా నరసింహేశ్వరశర్మగారు చెన్నపురియాంధ్రులపక్షమున నొక యభినందనపత్రమును నాగేశ్వరరావుగారికిచ్చి గౌరవించిరి. ఆదినములలో శ్రీ జయంతి రామయ్యపంతులుగారు చెన్నపురిలో ప్రెసిడెన్సీ మేజస్ట్రేటుగా నుండిరి. వారు నాకు జాబు వ్రాయుచు, నందు, నా "గయోపాఖ్యాన" "ప్రసన్నయాదవ" నాటకముల ప్రయోగములను శ్లాఘించుచు కడపట నిట్లు వ్రాసిరి. "You would have received a grand ovation if you had come here. I attended the darma." మీరిక్కడకువచ్చి నాటకమునకు హాజరయినపక్షమున మీకు గొప్ప సన్మానము జరిగియుండును. అని పైమాటల యభిప్రాయము. చెన్నపురి నుండి వచ్చినతరువాత నాగేశ్వరరావుగారు రూకలు ఖర్చుపెట్టి, మంచి తెరలను జగన్మోహనమైన దృశ్యములను సిద్ధముచేయించి సమాజమును యేలూరుపురము దీసికొనిపోయిరి. అక్కడ కొన్ని నాటకము లాడినతరువాత నెవరో యోర్వలేక యర్ధరాత్రమున తాటియాకులపాకకు నిప్పంటించిరి. సామాజికులు ప్రాణములు దక్కించుకొని బయటబడుటే కష్టమయ్యెను. ఎన్నిసంవత్సరములో యెన్నో రూకలు ఖర్చుపెట్టి, తయారుచేసిన, యాంధ్రరంగస్థలమొక్కరాత్రిలో భస్మావశేషమయ్యెను. చింతామణీ నాటకసమాజముగూడ క్రమక్రమముగా నంతరించెను. ఇది మా నాటకసమాజముయొక్క చరిత్రము. నే స్థాపించిన పాఠశాలయొక్క చరిత్రము నిదివరకే ముగించితినిగదా!

1907 వ సంవత్సరమున హిందూదేశములో ననేక స్థలము లలో స్వదేశవస్తూపయోగము, విదేశవస్తు బహిష్కారము, స్వరాజ్య సంస్థాపనము, జాతీయ విద్యావ్యాపకము నను విషయములను గురించి గొప్ప యాందోళనము జరిగెను. అన్నిటికంటె ముఖ్యముగా జాతీయపాఠశాలా సంస్థాపనమును గురించి యెక్కువ కృషిచేయ బడెను. సత్యవోలు గున్నేశ్వరరావుగారు స్థాపించిన "ఆంధ్రకేసరి" పత్రిక వారమువారము పైవిషయములతో నిండి ప్రకటింపబడుచుం డెను. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగా రాపత్రికకు సంపాదకులైనను, అత్తిలి సూర్యనారాయణగారును నేనును మిక్కిలి యుత్సాహపూరి తములైన వ్యాసములు మిక్కిలి శ్రద్ధతో వ్రాయుచుంటిమి. జాతీయ పాఠశాల స్థాపించుటకు రాజమహేంద్రవరములో నెన్నో సభలు జరి గెను. ప్రాతయూరులోను, యిన్నీసుపేటలోను, టవునుహాలులోను బహుసభలు జరిగెను. శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారికిగూడ జాతీయ పాఠశాలా సంస్థాపనముమీద మిక్కిలి యుత్సాహము కలి గెను. అనేక సభలలో వారధ్యక్షత వహించిరి. నేను బహుసభ లలో మాటాడితిని. ఆ సంవత్సరము దీపావళినాడు జాతీయపాఠ శాలా స్థాపనము కొరకు, విద్యార్థులు వీధివీధులు దిరిగి సొమ్ము వసూలుచేసిరి. నే నప్పుడు మూడవవార్డులో కాపురముంటిని. ఇప్పు డది మూడవవార్డు కాదు. నా వార్డులో నేను సొమ్ము ప్రోగుచేయు టకై యేర్పడితిని. తక్కిన వార్డులలో కంటె నా వార్డులో వర్తకు లెక్కువ యుండుటచేతనో, మరి యేకారణముచేతనో నా వార్డులో సొమ్మధికముగా వసూలయ్యెను. నేను కాపురమున్న ప్రక్కవీధిని వేశ్యాంగనలు నివసించుచుండిరి. అందొక వేశ్య తన యింటికిదక్క దక్కినయిండ్లకు నేను భిక్షాటనమునకై బోవుట చూచి తన గుమ్మ ములో నిలిచియుండి, "మా లోపలకువచ్చి యడిగిన పక్షమున నేను గూడ చందా నిచ్చెదను" అని పలికెను. నే నందుకు భయపడలేదు. వెనుకంజ నిడలేదు. వేశ్యాంగన యిండ్లకు బోవుట నా నియమము లకు విరుద్ధమైనను దేశసేవ నిమిత్తమై పనిచేయుచుంటిని. గావున

వేశ్యాగృహప్రవేశము తప్పుగాదని నాకు తోచినది. ఆ సమయమున నాకు జ్ఞానవాసిష్ఠములోని యీ క్రింది శ్లోకము జ్ఞప్తికి వచ్చెను.

శ్లో॥ మనఃకృతం కృతంరామ
న శరీర కృతం కృతం
యేనైవా లింగితా కాంతా
తేనైవా లింగితా సుతా ॥

యని వసిష్ఠుడు రాముని కుపదేశించెను. దీని భావమిది. "ఓ రామ! మనసార చేసినపనియే పనిగాని, వట్టి శరీరముతో చేసినపని పనిగాదు. పురుషుడు యే శరీరముతోనైతే తన ప్రియురాలిని కౌగిలించుకొనునో యా శరీరముతోనే తన కూతును గూడ కౌగలించుకొనుచున్నాడు. పురుషుడు కాముకుడై తన ప్రియురాలిని గౌగిలించుకొనును. పుత్రప్రేమచేత గారాబు కూతును గౌగలించుకొనును. కౌగలించుకొను శరీర మొకటియే గాని, యుద్దేశ్యములు వేరు. అని తలపోసి నేనా వేశ్యాగృహమునకు నా వెంటనున్న విద్యార్థులతో వెళ్ళి యామె చేసిన స్వల్పధన సహాయము స్వీకరించితిని. ఇట్టి యనుభవము నాకు రెండుసారులు గలిగెను. మొత్తముమీద మరుచటి సంవత్సరము జాతీయ పాఠశాలా సంస్థాపనము చేయుటకై సుబ్బరావు పంతులుగారు నిశ్చయించిరి. ఆ పాఠశాలను పరిపాలించుట కొక సంఘ మేర్పడెను. దానికి శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారే యధ్యక్షులైరి. కలపవర్తకులైన పందిరి వీరన్నగారు న్యాయవాదులైన గంటి లక్ష్మన్నగారు, దుప్పూరి వీరభద్రయ్యగారు, దామెర్ల వెంకటరమణారావుగారు మొదలగు నితర గృహస్థులు సంఘములో సభ్యులైరి. మొదట నేను నందులో నుంటిని. 1907 వ సంవత్సరము డిశంబరులో పాఠశాలా స్థాపనము గురించి యాలోచించుటకు యీసంఘము టవునుహాలులో మేడమీద సమావేశమయ్యెను. స్థాపింపబోవు పాఠశాలలో మతవిద్య యుండవలెనా? కూడదా? యను ప్రశ్న చర్చకువచ్చెను. మతవిద్య యన్నిటికంటె ముఖ్యమైనదనియు, నది లేకపోవుటచేతనే, దొరతనమువారి పాఠశాలలోని విద్యార్థులు నాస్తికులై, చెడిపోవుచున్నారనియు, గాన మతవిద్య యుండవలెననియు సుబ్బరావుపంతులుగారు వాదించిరి. జాతీయ

పాఠశాలలో తురకలు చేరవచ్చును; క్రైస్తవులు చేరవచ్చును; శైవులు చదువవచ్చును; వైష్ణవులు చదువవచ్చును; నానా మతస్థులు చదువ వచ్చును. ఒక మతస్థునిసిద్ధాంతములు మరియొకమతస్థులకు సరిపడవు. కాబట్టి మతవిద్య పరస్పర వైషమ్యములు కలిగించును, గావున. అది యుండకూడదని, నేను వాదించితిని. నా మాటలు సుబ్బారావు పంతులుగారికి నచ్చలేదు. ఇట్లు విరుద్ధాభిప్రాయములు గలవారు పరి పాలక సంఘములోనుండిన పాఠశాల యెట్లు జరుగునని సుబ్బారావు పంతులుగారనిరి. "అట్లయిన నేనీ సంఘములోనుండను మానివేయు దున"ని, వెంటనేలేచి, సభనుండి వెడలిపోతిని. సాధారణముగ నేను సుబ్బారావుపంతులుగారియెడ భక్తిగలవాడనేగాని దుర్వినయముగల వాడనుగాను. సభలోనేదేని ధర్మసమస్య వచ్చినప్పుడు ప్రతిసభ్యుడు నిర్భయముగ దన యభిప్రాయము వెలిబుచ్చుట ధర్మము గావున నేనట్లు నిస్సందేహముగ నా యభిప్రాయము వెలిబుచ్చితిని.

1908 వ సంవత్సరము జనవరిలో రాజమహేంద్రవరములో జాతీయపాఠశాల స్థాపింపబడెను. అది మొట్టమొదట న్యాయపతి సుబ్బా రావుపంతులుగారి యింటిప్రక్కనున్న భవనములో స్థాపింపబడెను. ఆ భవనము పంతులుగారిదే. పాఠశాల స్థాపింపబడినదినమున, నా యుత్సవమును జూచుటకై రమ్మని పట్టణములోని పెద్దమనుష్యుల కనే కుల కాహ్వానములువచ్చెను. నాకుగూడ నాహ్వానము వచ్చెను. కాని నేనా యుత్సవమునకు వెళ్ళలేదు. పాఠశాల స్థాపింపబడెను. దక్షిణ దేశస్థుడైన వెంకటరమణ సరస్వతి యనువారు ప్రధానోపాధ్యాయు లుగా నియమింపబడిరి. గజవల్లి రామచంద్రరావుగారు, పెన్నేటి సత్య నారాయణగారు మొదలగువారు స్వల్ప వేతనములమీద సహాయోపా ధ్యాయులుగానుండి, పనిచేయుచుండిరి. వెంకటరమణ సరస్వతిగారు పట్టపరీక్షాసిద్ధులు, మిక్కిలి తెలివిగలవారు. కాని స్వతంత్రశీలురు, ఒకరి యధికారమునకు లోబడియుండువారు గారు.

# స్వీయ చరిత్రము

## పదునైదవ ప్రకరణము

## ముద్రాయంత్ర స్థాపనము

నేను "మనోరమ" యను మాసపత్రికను 1906 వ సంవత్సరములో ప్రారంభించి, చింతామణీ ముద్రాక్షరశాలలో ముద్రింపించి నడుపుచుంటిని. ఇతరుల ముద్రాక్షరశాలలో నచ్చువేయించుటవలన కొన్ని నష్టములుగలవు. ఏలయన, వా రితరుల పనులొప్పుకొని మా పనులు వెనుక బెట్టుటగలదు. అదిగాక "ఆంధ్రకేసరీ"పత్రిక చింతామణీ ముద్రాయంత్రములోనే యచ్చుపడుచుండెను. కాబట్టి పనివారికి పని యెక్కువగ నుండెను. అందుచేత, నా కొకస్వంత ముద్రాయంత్రముండిన, బాగుండునని తోచినందున, నేనా విషయమై ప్రయత్నము చేయజొచ్చితిని. చిత్రపు నరసింహారావుగారు తాను వీరేశలింగముగారియొద్ద కొన్న వివేకవర్ధనీ ముద్రాక్షరశాలలో కొంతభాగము తానుంచుకొని పెద్దభాగము నమ్మివేయ దలంచుచుండెను. అది నేను కొనదలంచితిని. నాకు సొమ్ము కావలసి యుండెను. నాకు మొదటి నుండియు మిత్రులైన శ్రీ కంచుమర్తి రామచంద్రరావుగారు నేను ముద్రాయంత్రము కొన్న పక్షమున ధన సహాయము చేయుదుమని చాల కాలమునుండి చెప్పుచుండిరి. ఆయన నాయెడ మిక్కిలి ప్రేమ కలిగి కొంతధనము నాకు బదులిచ్చిరి. ఆ ధనము చాలనందున వేరొకచోట నేను మరల ప్రయత్నము చేసితిని. కస్తూరి రామారావు గారని యుదారశీలుడైన యొక యువకుడు రాజమహేంద్రవరములో గాపురముండెను. ఆయన శ్రీ దొడ్డమపేట జమీందారిణిగారైన శ్రీ వాడ్రేవు రంగనాయకమ్మగారికి దౌహిత్రుడు. ప్రస్తుతము దొడ్డమపేట జమీందారైన శ్రీ వాడ్రేవు విశ్వసుందరరావుగారికి జనకసోదరుడు. శ్రీ కస్తూరి నరసింహారావుగారికి రామారావుగారు జ్యేష్ఠకుమారుడు. రామారావుగారి తమ్ముడైన విశ్వసుందరరావుగారిని రంగనాయకమ్మ గారు పెంచుకొనిరి. రంగనాయకమ్మగారికి రాజమహేంద్రవరములో నొక యిల్లుగలదు. ఆ గృహమం దొకభాగమున కస్తూరి రామారావుగారును, రెండవభాగమున నా గుమాస్తాయైన సత్యానోలు అప్పా

రావుగారును కాపురముండిరి. నేను వేయిరూపాయిలు బదులిమ్మని రామారావుగారి నడిగితిని. అప్పారావుగారుగూడ నీ సంగతి రామారావుగారితో చెప్పిరి. రామారావుగారియొద్ద నప్పుడు ధనములేదు. ఎవరిచేతనైన దన కప్పునిప్పించిన యెడల నాకాధనము బదులిచ్చెద నని చెప్పిరి. అప్పుడు నేను కందుకూరి వీరేశలింగముగారి యొద్దకు బోయి, నాకు రామారావుగారు సహాయము చేయుదురు గావున రామారావుగారికి వేయిరూపాయిలు బదులిమ్మని వారిని కోరితిని. నా కోరికను త్రోసివేయక వీరేశలింగముగారు రామారావుగారికి నోటు మీద బదులిచ్చిరి. రామారావుగారును నాచేత నోటు వ్రాయించుకొని నాకు బదులిచ్చిరి. నరసింహారావుగారి యొద్ద గొన్న ముద్రాయంత్రముగాక, యప్పుడు, చెన్నపట్టణములోనున్న కొట్టు రాఘవయ్యగారియొక్కయు, తురిమెళ్ళ వెంకటసుబ్బారావుగారియొక్కయు సహాయమున మరియొక చిన్నయంత్రమును గూడ తెప్పించితిని. ఈ ముద్రాక్షరశాలకు నేను "మనోరమా" ముద్రాక్షరశాలయను పేరు పెట్టి సత్యవోలు లక్ష్మీపతిగారి యల్లుడుగారైన శ్రీ రాజా వెంకట కృష్ణారావు బహదూరువారియొద్ద, బజారులో వారికున్న మేడలో కొంతభాగము నద్దెకు దీసికొని, నా ముద్రాక్షరశాల నందులో పెట్టితిని. చెన్నపురినుండి వచ్చిన యంత్రము నాకంతగా నుపయోగపడ లేదు. నా మిత్రులు పొరబాటుచేత బనికిరాని ముద్రాయంత్రము గొనిరని, నేను నా మిత్రులు నభిప్రాయపడితిమి. ఈ ముద్రాక్షరశాలలోనే నా "మనోరమ" యచ్చుపడి, బయలువెడలుచుండెను. చిత్రపు నరసింహారావుగారు నేనద్దెకు పుచ్చుకొన్న మేడలోనే తన నిమిత్తమై యుంచుకున్న చిన్నముద్రాయంత్రమునుగూడ పెట్టి, నాకు బాడిగె నిచ్చుచుండిరి. రెండుకత్తు లొకయొరలో నిముడనట్లు రెండుముద్రాయంత్రము లొకయింటిలో నిముడుట కష్టముగదా! వారి ముద్రాయంత్రములో పనిచేయువారును, నా ముద్రాయంత్రములో పనిచేయువారును దరుచుగా వివాదపడుచుండిరి. ఆ వివాదములు దీర్చుట కష్టముగానుండెను. నరసింహారావుగారును నేనును మిత్రుల మగుటచే నేదో విధముగా మే మిరువురము సఖ్యపడి కాలము త్రోసివేయుచుంటిమి.

నా రెండవ చెల్లెలైన యచ్చమ్మయొక్క పెద్దకూతురైన వెంకటసుబ్బమ్మకు వివాహయోగ్యమైన వయస్సు ప్రాప్తించెను. ఆమె కప్పుడు పండ్రెండు సంవత్సరములు నిండినవి. వివాహము తప్పక చేయవలసివచ్చెను. వరుని నిమిత్తమై వెదకితిమి. మా చెల్లెలు భర్తయైన రామస్వామిగారి యప్పగారికి నలుగురు కుమాళ్లుండిరి. వారి యింటిపేరు రావూరివారు. వారు గుంటూరుజిల్లాలోని రేపల్లె తాలూకాలోని బలుసులపాలెములో నివసించుచు, నప్పుడప్పుడు, బెజవాడలోగూడ నివసించుచుండిరి. మా బావగారి మేనల్లురలో సర్వజ్యేష్ఠుడు రావూరి రామకృష్ణయ్య. రామస్వామిగారు తెనుకులో నుద్యోగములో నున్నప్పుడు, రామకృష్ణయ్యను గొంతకాలము తనవెంట గొంపోయి చదువు చెప్పించి, తన పెద్దకూతును వానికిచ్చి వివాహము చేయవలెనని, సంకల్పము గలిగియుండెను. రామస్వామిగారు పనిచేయుచోట నెక్కువ తరగతి లేనందున రామకృష్ణయ్య చదువు నిమిత్తము 1902 వ సంవత్సరములో రాజమహేంద్రవరమువచ్చి మా యింటనేయుండి నే స్థాపించిన యున్నతపాఠశాలలో మొదట నాలుగవ ఫారము చదివి, మరుచటి సంవత్సర మయిదవఫారము చదివి, నా యున్నతపాఠశాల దీసివేసిన తరువాత, ట్రయినింగు కాలేజీలో మెట్రిక్యులేషను తరగతిలో చేరెను. అతడు పిమ్మట బెజవాడకుబోయి, యచట మిషనువారి పాఠశాలలో జదివి, మెట్రిక్యులేషను పరీక్షలో గృతార్థుడై, 1907 వ సంవత్సరమున మరల రాజమహేంద్రవరము వచ్చి ప్రథమశాస్త్ర తరగతిలో చేరెను.

ఆసంవత్సరమున విద్యార్థులు బిపిన్‌చంద్రపాల్ గారియుపన్యాసములవలన యుద్రేకపూరితులై వందేమాతరం బిళ్ళలను మెడలలో ధరించి కళాశాలకు బోయిరి. ఆ బిళ్ళలు ధరింపవద్దని ప్రధానాచార్యులైన మార్కు హంటరుదొరగారు పట్టుపట్టినను విద్యార్థులు వినక తిరుగుబాటు చేసినందున దొరగారు విద్యార్థులను కళాశాల నుండి దీసివేసిరి. మారామకృష్ణయ్యగూడ ప్రథమశాస్త్ర తరగతిలో జేరి దేశాభిమాన ప్రేరితుడై కళాశాలనుండి వెడలివచ్చెను. అతడు తరువాత పైతరగతులు చదువుకొనలేదు. అయినను రామకృష్ణయ్య బుద్ధిమంతుడు. దృఢకాయుడు. సౌమ్యుడు. పెద్దలయందు వినయ

విధేయతగలవాడు. మంచి నడతగలవాడు. తన్నెరిగినవారికందరకు దలలో నాలుకవలె నుండెడివాడు. అతనితండ్రి విశేష భాగ్యవంతుడు గాకపోయినను గొంత భూవసతిగలవాడు. ఆ స్థితినిజూచిగాక రామ కృష్ణయ్య సుగుణసంపత్తినిజూచి నేను నా పెద్దమేనగోడలైన వెంకట సుబ్బమ్మను రామకృష్ణయ్య కిచ్చి వివాహముచేయ నిశ్చయించు కొంటిని. నాచెల్లెండ్రు నా తమ్ముడుగూడ నీ విషయమున నాతో నేకీభవించిరి. ఈ కార్యమువలన నా బావమరది రామస్వామియొక్క సంకల్పముగూడ నెరవేరునని నేను సంతసించితిని. మా నిశ్చయమును రామకృష్ణయ్య తల్లిదండ్రులకు దెలియ పరచితిని. వారును సంత సించి తరలి వచ్చిరి. ప్లవంగ సంవత్సర ఫాల్గున మాసమున వివాహ మయ్యెను. నేనిదివరలో కొంతకాలము గాపురమున్న దుర్భవారి యిల్లు విడిదిగానిప్పించితిని. రాయవరపువారింట వివాహమయ్యెను. రామస్వామిగారి యన్నగారైన శివరామయ్యగారును భార్యయు పీటలమీద కూర్చుండి కన్యాప్రదానము జేసిరి. వివాహ మైదుదిన ములు నిర్విఘ్నముగా జరిగెను. ఒకనాడొక వైణికునిచేత గానసభ చేయించితిని.' ఆ సభకప్పుడు మండల న్యాయాధిపతియైన పార్థసారథి అయ్యంగారును చాలమంది పురప్రముఖులును వచ్చిరి. కాకినాడ నుండి, నామిత్రులైన, రఘుపతి వేంకట రత్నమునాయుడుగారును, బుర్రా సూర్యప్రకాశరావు గారును గూడ వివాహమునకు దయ చేసిరి. వివాహ వ్యయమంతయు నేనే భరించితిని. నా మేనమామ గారైన మల్లయ్యశాస్త్రి గారు గూడ సకుటుంబముగ దయచేసి యైదు దినములు నుండిరి.

1908వ సంవత్సర మేప్రియలు నెలలో కీలకసంవత్సర ఫాల్గుణ శుద్ధత్రయోదశినాడు కందుకూరి వీరేశలింగముగారు పుట్టిన దినము. ఆనాటి కాయన కరువదియేండ్లు నిండెను. కాబట్టి వారానాడు షష్ఠి పూర్తిమహోత్సవము చేసికొని పురప్రముఖుల నాహ్వానించిరి. మం డల న్యాయాధిపతి (District Judge) యైన పార్థసారథి అయ్యంగారు, శ్రీ కంచుమర్తి రామచంద్రరావుగారు, గోపిసెట్టి నారాయణస్వామి నాయుడుగారు మొదలగు ప్రముఖులు దయచేసిరి. నేనును వెళ్ళితిని.

నారాయణస్వామి నాయుడుగారు వీరేశలింగము గారికి శాలువలు గప్పిరి.

ఆసంవత్సరము బందరులో నొక ప్రార్థన సమాజ మందిరము గట్టబడెను. తత్ప్రవేశ మహోత్సవమునకై వీరేశలింగము గారిని మమ్మును బిలిచిరి. వీరేశలింగముగారు, రాజ్యలక్ష్మమ్మగారు, నేను, చిలుకూరి వీరభద్రరావుగారు, రామాప్రగడ వెంకట రామయ్య గారును వెళ్ళితిమి. గుంటూరునుండి, యున్నవ లక్ష్మీనారాయణ గారును బందరు దయచేసిరి. రెండవనాడో మూడవనాడో వీరేశలింగముగారు ముందుగ నొక యుపన్యాస మిచ్చిరి. తరువాత నేనొక యుపన్యాస మిచ్చితిని. ఆయుపన్యాసములకు శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిగారు, భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు, వల్లూరి సూర్యనారాయణరావుగారు మొదలగు పెద్దలు దయచేసిరి. నా యుపన్యాసము మిక్కిలి బాగున్నదని నామిత్రులు నన్ను శ్లాఘించిరి. బుద్దిరాజు పావకేశ్వర రావుగారు నాకడకు వచ్చి తమ నివాసస్థానమైన నరసాపురములో నిటువంటి యుపన్యాస మొకటి చేయవలసిన దని గోరిరి. పిమ్మట గొన్ని మాసములకు నేను నరసాపురము వెళ్ళితిని. కాని పావకేశ్వరరావుగారు గ్రామములో లేకపోయిరి. ఐనను నేను వారింటనే బసచేసి పురములో నొకచోట యుపన్యాసమిచ్చి వచ్చితిని.

1908 వ సంవత్సరమున కీలకసంవత్సరము గోదావరి పుష్కరము. నానాదేశములనుండి యాత్రికులు వచ్చిరి. గవర్నమెంటు వారు వచ్చిన ప్రజల సౌకర్యార్థము కోటిలింగాలవద్ద పాకలు వేయించిరి. శ్రీ కంచుమర్తి రామచంద్రరావుగారును, మునిసిపలు సంఘాధ్యక్షులైన గంటి వేంకటరామయ్యగారును ప్రజలకొరకై పాటుపడిరి. గంటి వేంకట్రామయ్యగారికి దొరతనమువారు రావుసాహేబు బిరుదు నిచ్చిరి. ఈ పుష్కరమున నా బంధువులు నన్ను బలవంతపెట్టినను తీర్థవిధి నేను బెట్టలేదు. గోదావరిలో నొకనాడైనను స్నానముచేయలేదు. ఈ పనులవలన నాకుగాని నా పితృదేవతలకు గాని మోక్షము లేదని నా నమ్మకము.

1908 వ సంవత్సరము మే నెలలో కృష్ణామండల రాజకీయ సభ తెనాలిలో జరిగెను. ఆ సభకు మహారాజశ్రీ కొండా వేంక

టప్పయ్యగా రధ్యక్షులైరి. ఆ సభ యైనతరువాత నాలుగవదినమున మండలసంఘ సంస్కరణసభ జరిగెను. ఈ సభయొక్క సన్మాన సంఘమునకు బొప్పూడి వెంకటప్పయ్యగా రధ్యక్షులైరి. సంఘసంస్కరణమహాసభకు నధ్యక్షత వహించవలసినదని నన్ను వారు కోరిరి. అప్పటికి నాకు నలువదియొకటవ యేడు. నాకును, దేశమునకును, సంఘసంస్కరణమున గురుదేవులని చెప్పదగిన వీరేశలింగముగారును, రఘుపతి వేంకటరత్నమునాయుడుగారు నుండ నా విద్యచేగాని వయసుచేగాని, లోకానుభవముచేగాని వారి కెంతమాత్రము నాటిరాని నేనేమి యీ మహాకార్యము నిర్వహించుచేమి యని మొదట సందేహించితిని. గాని, చిట్టచివరకు నా రాజమహేంద్రవర మిత్రుల ప్రోత్సాహముచేతను తెనాలివారి బలవంతముచేతను నేనొప్పుకొంటిని. రాజకీయమండలసభ జరుగుచుండగా నేనును తెనాలి వెళ్ళితిని. బొప్పూడి వెంకటప్పయ్యగారు రైలుస్టేషనుకడకు వచ్చి, నన్ను సగౌరవముగ గుఱ్ఱపుబండిమీద నెక్కించి గ్రామములోనికి తీసుకొని వెళ్ళి యొక న్యాయవాదియింట నాకు బస నేర్పాటుచేసిరి. నేనును, నా వెంట వచ్చిన శిష్యుడును, నక్కడనున్న దినములలో సుఖముగనే కాలక్షేపము జేసితిమి. సంఘసంస్కరణసభ ప్రారంభమయ్యెను. వేదికమీద కొండా వెంకటప్పయ్యగారు, వల్లూరి సూర్యనారాయణ రావుగారు, ముట్నూరి కృష్ణారావుగారు, శిడింబి హనుమంతరావుపంతులుగారు మున్నగు నామిత్రులు కృష్ణామండలప్రముఖులు గూర్చుండిరి. సభ మహాజనులతో నిండిపోయెను. సభ యుదయమున నేప్రారంభమయ్యెను. సన్మానసంఘాధ్యక్షుని యుపన్యాసమును, నా యుపన్యాసమును ప్రొద్దుటనే జరిగెను. నా యుపన్యాసమును నేను వ్రాసి చదువలేదు. మొదటినుండి చివరవరకు, వాగ్ధోరణిగనే చెప్పితిని. నడుమ సభాసదులు కొట్టుచున్న చప్పటులచేత నా యుపన్యాసము జనాకర్షముగా నున్నదని నేనభిప్రాయపడితిని. మధ్యాహ్నము వివిధవిషయములగురించి తీర్మానములు చేయబడెను. నా చరమోపన్యాసముగూడ ప్రారంభోపన్యాసమువలెనే గంభీరముగ నున్నదని,నామిత్రులు నన్ను బహూకరించిరి.

ఆ సంవత్సరమున నా "మనోరమ" పత్రిక విషయమున నొక విశేషము జరిగెను. విశాఖపట్టణవాసులైన సెట్టి లక్ష్మీనరసింహము గారు నా పత్రికలో విమర్శించుటకు "రసికాభిలాషము"ను నొక పద్య ప్రబంధమును నాకు బంపిరి. అది యచ్చుపడిన చిన్నప్రబంధము. ఆ గ్రంథమున కుపోద్ఘాతము వ్రాయుచు తమకా గ్రంథము సింహాచలములో నొక వైష్ణవ స్వామి యింట ప్రాచీనగ్రంథములు తిరుగ వేయుచుండగా నీ గ్రంథముయొక్క తాటియాకుల ప్రతి దొరకి నట్లును, పూర్వకాలమది శ్రీనాథ మహాకవిచే రచియింపబడి యచ్చు పడక మూలబడియుండినట్లును సెట్టి లక్ష్మీనరసింహముగారు వ్రాసిరి. ఆ గ్రంథము నేను చదివించుకొని వింటిని. విన్నప్పుడు దాని శైలిని బట్టియు, శబ్దప్రయోగముల బట్టియు, వర్ణనలం బట్టియు నది ప్రాచీన గ్రంథముగాదనియు, దానిని శ్రీనాథుడు రచియింపలేదనియు, శృంగారరసప్రియుడైన యధునాతన రసికుడెవడో దానిని రచియించి జనాదరణమును బడయుటకై శ్రీనాథునిపేరు పెట్టెననియు, నే నభిప్రాయపడితిని. ఈ యభిప్రాయమునే నేను నా "మనోరమ"పత్రికలో వెల్లడించితిని. అది చదువుకొని, సెట్టి లక్ష్మీనరసింహముగారు నా మీద నాగ్రహము వహించి, నా విమర్శనమున కుత్తరముగా నొక చిన్నగ్రంథమునే వ్రాసి ప్రకటించి, నాకు బంపిరి. "రసికాభిలాషము"ను శ్రీనాథుడే వ్రాసినాడని స్థిరపరచుట కాయన యేవేవో హేతువులు చూపుటయేగాక, నేను గ్రుడ్డివాడననియు, నందుచేత సత్యము గనిపెట్టలేకపోతిననియు, కొన్ని యప్రస్తుత దూషణవాక్యములు వ్రాసిరి. నేను గ్రుడ్డివాడనన్నమాట నిజమేగాని సత్యము గని పెట్టలేనంత గ్రుడ్డివాడనుగాను. ఈ గ్రంథ రచనముయొక్క రహస్యము గ్రుడ్డివానికిగూడ గరతలామలకముగ దెలియునట్లే యుండెను. సెట్టి లక్ష్మీనరసింహముగారు పట్టపరీక్షాసిద్ధులు. తెలుగులో మంచి పాండిత్యముగలవారు. సరసమైన గవిత్వము చెప్పగలవారు. అట్టివా రిట్టివ్రాతలు వ్రాసినందుకు మిక్కిలి యాశ్చర్యపడితిని.

ఆ కీలక పుష్కరాంతమున, శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవ వర్మ గారు సకుటుంబముగా గోదావరీస్నానము చేయుటకై విజయముచేసి, గోదావరీ రైలుస్టేషనునకు సమీపమందున్న రెడ్లమువారి బంగా

ళాలో బసచేసిరి. నిగర్వచూడామణియైన యీ మహాపురుషుడు తన కుటుంబమును రెడ్డమువారి బంగాళాలో దింపి మాయిల్లు వాకబుచేసి యచ్చటకు సమీపమందే యున్నదని తెలుసుకొని యారాత్రి రమారమీ తొమ్మిదిగంటలప్పుడు సందుగొందులలోనున్న నా బసకు వచ్చిరి. నేను మిక్కిలి యాశ్చర్యపడితిని. కొంతసేపు మేమిరువురము బహువిషయముల గురించి ప్రసంగించితిమి. ఆ ప్రసంగములో వారు "రసికాభిలాషము" శ్రీనాథుడు వ్రాసినది గాదనియు, నది నవీనులు వ్రాసినదనియు చెప్పి సత్యము గనిపెట్టినందుకు వారాశ్చర్యపడుచు నన్ను బహూకరించిరి. వీరుగాక మరియొకరుగూడ నీ విషయమును ధ్రువపరిచిరి. విశాఖపట్టణవాసియైన బొడ్డు రామయ్యగారను వైశ్య శిఖామణి యొకరు గలరు. ఆయన సెట్టి లక్ష్మీనరసింహముగారిక ముఖ్యమిత్రులు. ఆయన రాజమహేంద్రవరములో నొక పుస్తకముల దుకాణము పెట్టి, వ్యాపారముచేయుచు నప్పుడప్పుడు నన్ను రాజమహేంద్రవరములో గలుసుగొనుచుండెను. ఆయన ప్రసంగవశమున నాతో నొకసారి యిట్లు చెప్పిరి. "రసికాభిలాషము శ్రీనాథుడు వ్రాసినదిగాదు. దానిని మామిత్రుడు సెట్టి లక్ష్మీనరసింహముగారు స్వయముగ మాయెదుటనే వ్రాసిరి. మీరెట్లు గనిపెట్టిరోగాని సత్యము గనిపెట్టిరి". ఈ మాటలు విన్నతరువాత నేను జేసిన విమర్శనము యదార్థముగదాయని నాకు మనశ్శాంతి గలిగినది. విక్రమదేవ వర్మగారును, బొడ్డు రామయ్యగారును, సెట్టి లక్ష్మీనరసింహముగారును మిక్కిలి మిత్రులు గాబట్టి యీ రహస్యము వారికి దెలిసియుండును.

రమేశచంద్రదత్తుగారని యొకానొక బంగాళీ మహాపురుషుడుండెనని చదువరులెరుగుదురు. ఆయన బంగాళీ భాషలోను, నాంగ్లేయ భాషలోను నెన్నో గ్రంథములు రచియించిరి. ఆయన యాంగ్లేయ భాషలో 'Lake of Palms' అను నవలను వ్రాసిరి. "తాళ్ళచెరువ"ని దాని యర్థము. ఆ గ్రంథమును నేను చదివించుకొని వింటిని. అది చదివినవారికి బంగాళీల యాచార వ్యవహారములు దెలియును. ఆ గ్రంథమును తెలిగించిన బాగుండునని నాకు దోచినది. అది రసవంతమైన నవల. అప్పుడు దత్తుగారు బరోడా సంస్థానములో రెవిన్యూ మంత్రిగా నుండిరి. ఆగ్రంథము నాంధ్రీకరించుటకు నా కనుజ్ఞ నిమ్మని

వారిపేర నేను వ్రాసితిని. వా రా మహోపదవిలోనుండియు గ్రంథము నాంధ్రీకరించుటకు సెల వొసంగుచు నాకు జవాబు వ్రాసిరి. ఆ గ్రంథమును నేను దెలుగుజేసి, "తాళ్ళచెరువ"ని పేరుపెట్టిన బాగుండదని "సుధాశరచ్చంద్ర"మని పేరుపెట్టి ప్రకటించితిని. అది రెండుభాగములుగ నున్నది. చెన్నపురి విశ్వవిద్యాపీఠమువారు దాని నొకసారి ప్రథమశాస్త్రపరీక్షకు పఠనీయగ్రంథముగ గూడ బెట్టిరి.

నా పెద్దమేనకోడలు పెనిమిటియైన రావూరి రామకృష్ణయ్య కళాశాలనుండి వెడలగొట్టబడినతరువాత, విద్యాభ్యాసము మానివేసి, దేశాభిమాన ప్రేరితుడై, స్వదేశవస్త్రములను విక్రయించుటకై, గ్రామముల వెంట దిరుగ నారంభించెను. వివాహమైనది మొదలుకొని, యతడు కొన్ని మాసము లా విధముగా దిరిగెను. సింహళద్వీపము రాజధానియైన కొలంబో నగరములో మెట్రిక్యులేషను పరీక్షయందు కృతార్థులైనవారు న్యాయవాది పరీక్షకు చదువుకొనవచ్చునని యతనితో నెవరో చెప్పిరట. ఆ మాట నమ్మి యతడు సింహళద్వీపమునకు బోయెను. అచ్చటకు వెళ్ళిన తరువాత యతనికి జబ్బుచేసెను. తనకు జబ్బుగానున్నట్లతడే నాకొక తంతివార్త పంపెను. ఆ తంతివార్త చూడగానే, మా యాడవాండ్రకును, నాకును గుండెలు చెదరిపోయెను. కొలంబోనగరము వెళ్లుటకు వీలు లేదు. వెళ్ళకపోవుటకు వీలు లేదు. ఏమిచేయుదమని నే నాలోచించుచుండగా, మూడవనాడు రామకృష్ణయ్య యొద్దనుండియే జాబు వచ్చెను. దానితో నందరి గుండెలు కుదుటపడెను. నాలుగైదు దినముల తరువాత రామకృష్ణయ్యయే కొలంబోనుండి వచ్చి మా కానందము నొనగూర్చెను.

కందుకూరి వీరేశలింగముగారికి కనుపర్తి యోగానందముగారని, యొక మిత్రుడుండెడివారు. ఆయన కుమార్తె సుందరమ్మగారు బాల్యమున వితంతువయ్యెను. ఆమె వివాహము నిమిత్తము విద్య నిమిత్తము వీరేశలింగముగారి వితంతు శరణాలయములో చేరెను. సుందరమ్మగారు వీరేశలింగముగారికి మిత్రుని పుత్రికయగుటయేగాక, సుగుణసంపదలచేతగూడ వీరేశలింగముగారికి రాజ్యలక్ష్మమ్మగారికి ముక్కిలి ప్రియపుత్రికవలె నుండెను. ఆ దంపతుల కామెయెడ గాఢ ప్రేమయేగాక, గౌరవముగూడ నుండెను. ఆమెను శ్రీ కామరాజు

హనుమంతరావుగారికిచ్చి వివాహము చేయవలెనని యా దంపతుల సంకల్పము. హనుమంతరావుగారు దేశరాజు పెదబాపయ్యగారి సవతి తల్లికి సోదరుడు. సుగుణసంపదలగ యువకుడు. విశేషించి బందరులో శ్రీ రఘుపతి వేంకటరత్నము నాయుడుగారి యొద్ద చదువుకొని. యాయన సిద్ధాంతములను జీర్ణముచేసుకొన్న శిష్యుడు. చిన్నతనము నందే బంధుమిత్రులను వదలుకొని, బాపయ్యగారివలెనే, యనుష్ఠానిక బ్రహ్మమతస్థుడైన కార్యశూరుడు. ఆయన ప్రవేశపరీక్షయందు కృతార్థుడయ్యెను. సుందరమ్మగారుకూడ ప్రవేశపరీక్షయందు కృతార్థురాలైన విద్యావతి. వారికిద్దరికి బ్రాహ్మమత పద్ధతి ప్రకారము వివాహము చేయవలెనని వీరేశలింగముగారి యాశయము. వీరేశలింగముగారు బ్రహ్మమతము పుచ్చుకొన్న తరువాత, బ్రహ్మధర్మ ప్రకారమిదియే మొదటి వివాహమగునని మేమందరము భావించితిమి. కాని యొక యంతరాయము వచ్చెను. హనుమంతరావుగారు బోధనాభ్యాసన కళాశాలలోచేరి, యావిద్య పూర్తికాకుండగనే, జాతీయోద్రేకమువల్ల, చదువుమాని, కళాశాల వదలిపెట్టిరి. వీరేశలింగముగారి కావని యిష్టములేదు. బిపినుచంద్రపాలుగారి యుపన్యాసములు వీరేశలింగముగారి కసలే సరిపడలేదు. ఆయన పూర్వకాలపు వాడగుటచే నాంగ్లేయ ప్రభుత్వమునకు విరుద్ధమైన మాటలుగాని చర్యలుగాని, వారి కిష్టము లేదు. హనుమంతరావుగారు ప్రిన్సిపాలుగారి యాజ్ఞను దిరస్కరించి నందున వీరేశలింగముగారి కాయనమీద ననిష్టము గలిగెను. కాబట్టి వీరేశలింగముగారు హనుమంతరావుగారి వివాహమునకు కొన్ని షరతు లేర్పరచిరి. హనుమంతరావుగారు సుందరమ్మగారి యిష్టము లేకుండ తన యింటి కేయతిథిని తీసుకొని రాకూడదు. వందేమాతరము గొడవలలో జోక్యము కలుగచేసికొనకూడదు. ధనవ్యయ మామె యిష్టము ప్రకారము జరుగవలెను. ఇదిగాక మరి కొన్ని షరతులుండెనని నాకు జ్ఞాపకము. ఒకనాడు హనుమంతరావుగారు మాయింటికి వచ్చినప్పుడు వివాహ మేమైనదని యడిగితిని. వీరేశలింగముగారు తనవివాహము విషయమై కొన్ని షరతులుపెట్టిరని పైషరతులు చెప్పిరి. అప్పుడు నేనిట్లంటిని. "ఇదివరకు వీరేశలింగముగా రెన్నడు షరతుల మీద వివాహములు చేయలేదు. షరతులతో జరిగిన వివాహము

వలన సంసారము పొత్తుపడదు. కాపురము సరిగా పొసగదు. అట్టి వివాహము చేసుకొనుట కంటె మానుకొనుట మేలు." ఈ పలుకులు వీరేశలింగముగారికి తెలిసెను. ఆయనకు నామీద కోపము వచ్చెను. పూర్వము మాయింటికి దరుచుగా వచ్చెడివా రప్పటినుండి తరుచుగ వచ్చుట మానిరి. కాని వారికి నామీద విశ్వాసముపోలేదు. ప్రథమ బ్రహ్మవివాహము హనుమంతరావుగారికిగాక పులవర్తి సుబ్బారావుకు చేసిరి. ఈ సుబ్బారావు మొదట వీరేశలింగముగారు చేసిన వితంతు వివాహములలో, నొక వితంతువును పెండ్లియాడిన పులవర్తి శేషయ్య గారి కుమారుడు. సుబ్బారావు తలిదండ్రులు చిన్నప్పుడే మృతినొందు టచే వీరేశలింగముగారా బాలకునిదెచ్చి పెంచి పెద్దవానిని జేసిరి. అతనికి వివాహయోగ్యమైన వయసు వచ్చుటచే వీరేశలింగముగారు శరణాలయములోని యొక వితంతు బాలికనుదెచ్చి సుబ్బారావునకు బ్రహ్మమత పద్ధతి ప్రకారము వివాహము చేసిరి. అందుచేత నదియే మొదటి బ్రాహ్మ వివాహమయ్యెను. మరతుల వివాహము విషయమై వీరేశ లింగముగారికిని హనుమంతరావుగారికిని నభిప్రాయభేదము గలుగు టచే, హనుమంతరావుగారి వివాహ మప్పటికి నిలుపుచేయబడి, పిమ్మట కొంతకాలమున కయ్యెను. నా మూలమున పరస్పరానురాగముగల యీ దంపతుల వివాహము నిలుపుచేయబడినదని, వివాహమగువరకు నేను విచారించితిని. పిమ్మట నామనసు శాంతించెను. సుందరమ్మగా రిప్పుడు గవర్నమెంటువారి బాలికా పాఠశాలలలో తొంబది రూపాయి లమీద పనిచేయుచున్నారు. ఆమెకు సిరియు, సంతతియు కొడుకులు కూతులుగలిగి, మనుమలు మనుమరాండ్రుగలిగి, భర్తతో హాయిగ గాపురము చేయుచున్నారు. సుందరమ్మగారి సంసారము దోసపాదు వలె కలకలలాడుచు, వర్ధిల్లుచున్నది.

హితకారిణీసమాజము 1906 వ సంవత్సరములో స్థాపింపబడి నను, 1908 వ సంవత్సరమువరకు పంతులుగారు దానిని రిజిస్టరుచేయిం చలేదు. ఆంధ్ర సంస్కర్తలు, బ్రహ్మమతస్థులు, వీరేశలింగముగారిని పంతులుగారని వ్యవహరించుచుందురు. రఘుపతి వెంకటరత్నము నాయుడుగారిని నాయుడుగారని వ్యవహరించుచుందురు. నేనును నట్లే వ్యవహరించుచున్నాను. 1908 వ సంవత్సరము మార్చి నెలలో దేశ

-రాజు పెద్దబాపయ్యగారు చెన్నపురములో మృతినొందిరి. మేమందరము మిక్కిలి దుఃఖితులమైతిమి. బాపయ్యగారిమీద నెన్నో యాశలు పెట్టు కొన్న వీరేశలింగముగారి యాశలడుగంటినవి. ఆంధ్రబ్రహ్మసంఘము నకు, సంఘసంస్కరణమునకును దీరని వెలితి వాటిల్లినది. బాపయ్య గారివంటి యుత్తమపురుషుని ఛాయాపటము టవునుహాలులోనుండవగిన దని, వీరేశలింగముగారు బాపయ్యగారి చిత్రపటమును సిద్ధముచేయించి రాజమహేంద్రవరపురమందిరములో బెట్టించిరి. దానిని బహిష్కా- రణ చేయించుటకై గొప్పవారి నెవరినైన బిలుపింతురని మేమను కొనుచుండగా నన్ను బిలిచి పంతులుగారు "మీరే బాపయ్యగారి పట మును బహిర్గతము చేయు"డని చెప్పిరి. అట్టి మహాకార్యమునకు నేను దగినవాడను కానని పంతులుగారితో నేనెంత చెప్పినను వినక, యా భారమును నా మీదనే వైచిరి. ఆపనికై పంతులుగా రొకనాటి సాయంకాలము టవునుహాలులో సభ చేయించిరి. ఆ సభలో బాప య్యగారి పటము బహిర్గతము చేయుమని వీరేశలింగముపంతులుగారు స్వయముగా నన్ను గోరిరి. విధిలేక నేనాపని చేసితిని. మిత్రులనే కులు బాపయ్యగారి గుణగణములను గొనియాడిరి. బాపయ్యగారి మీద నెనిమిది పద్యములను రచియించి చదివి పటము బహిర్గతము చేసితిని. ఆ పద్యములివి.

మ॥ అకటా! పోయితె దేశరాజు కులదీపాంకురమా! సద్గుణ
ప్రకరా! బ్రహ్మసమాజ మందిర మహాభారోద్వహస్తంభమా
సకలార్యస్తవనీయవర్తన! సదాచారప్రియా! ధీవరా!
యకలంకాత్మక! సత్యవాక్యరత! బాపయ్యా! సుహృద్రత్నమా! 1

శా॥ అన్నా! యెక్కడదాపురించెనొకొ నీ కా పాడురోగంబయో
ఎన్నో మందులు ద్రిమ్మింగి చేసితివిగా యెన్నాళ్ళొ పథ్యంబుల
ల్లున్నం డప్పెనె మృత్యు వింత పని ముంముందన్సుఖంబెట్లగున్
బన్నంబే యగుగాని నీకు తుద బాపయ్యా! సుహృద్రత్నమా! 2

శా॥ వంటన్ జేయగ సేవకుండును లభింపన్ రాని వేళన్ వొయిన్
మంటంజేసి స్వహస్తపాకివయి నీమంబున్ గడున్ ముందుకున్
గెంటం జూచితిగాని యేదొ మిషచిక్కెం జాలునంచూరకో
వంటే జాలును మాటలేటికిక బాపయ్యా! సుహృద్రత్నమా! 3

మ॥ నిను బైవారలు క్రిందికంపి యవమానింపం దృణప్రాయ మీ
పని నాకంచెద నాత్మగౌరవము నే పాటించి ముమ్మాటికిన్
ధనమే పావనమంచు నెంచకయ విద్యాసాగరుండట్టులా
పని మాన్కొంటివి దేశరాజు పెదబాపయ్యా! సుహృద్రత్నమా! 4

మ॥ పినతండ్రుల్గలమూగువారు సిసలం బెంపొందె మీ మిత్రులున్
ధనవంతుల్మరి మామగారు తహసీల్దారుండు నీ కోరు మా
త్రన సాయంబవలీల గూర్తు రయినన్ రవ్వంతయున్ గోర నె
వ్వని సాయంబును దేశరాజు పెదబాపయ్యా! సుహృద్రత్నమా! 5

శా॥ నీ సౌజన్యముజూచి నీమవయసున్నీ నీమముంజూచియున్
నీ సామర్థ్యము జూచి దేహగతమౌ నీ రోగముంజూచి హా!
యీ సన్మార్గుఁను మాకు దక్కడని నాడే పీడుకొన్నారుగా
యా సన్మిత్రులు దేశరాజు పెదబాపయ్యా! సుహృద్రత్నమా! 6

మ॥ మదికిన్నచ్చినయట్టి ధర్మమును నమ్మన్నమ్మ దానిన్ మహా
పదప్రాప్తించిన నాచరింపను మనోవాక్కాయకర్మంబులం
దెది సత్యంబగు దానినే నెరప నీకే చెల్లునయ్యా గుణా
స్పద! సద్వర్తన దేశరాజు పెదబాపయ్యా! సుహృద్రత్నమా! 7

శా॥ ఎంతో శాంతము బూడిదయ్యె చదువెంతో నేలపాలయ్యె నెం
తెంతో మంచితనంబు దగ్ధమయి పోయెం జెల్లె నెంతో గుణం
బెంతో యీశ్వరభక్తి బొగ్గులయిపోయెన్ నాడు నీతో శ్మశా
నాంతర్భూముల నెంత నష్టమిది బాపయ్యా! సుహృద్రత్నమా! 8

మ॥ పరమాత్ముండు గుణైకలుబ్ధుఁడయినన్ భవ్యాత్ములున్ సత్క్రియా
నిరతుల్సద్గతి నొంతురంట నిజమేనిన్ సార్వకాలంబు నీ
శ్వర పాదద్వయ సేవకుండవగుటం బ్రాపించు నీ యాత్మ కీ
శ్వర సాన్నిధ్యము దేశరాజు పెదబాపయ్యా! సుహృద్రత్నమా! 9

ఈ పద్యములు "సత్యవాదిని" పత్రికలో ప్రకటింపబడెను. పంతులుగారు నా మీద విశ్వాసముగలిగి యుండిరనుట కిదియొక యుదాహరణము. ఒకసారి వారు నన్ను బిలిచి తోటలోని వితంతు శరణాలయమును సరిగా నడుపుటకు నుపదర్శి (Manager) ను నెవరి నైన వెదకవలెనంటి యగ్గ, "మీకు దృష్టి బాగుండినయెడల నేనా పనికి మిమ్ము నియోగించియుందు"నని పలికిరి. ఇదిగాక వారు చెరువు

సోమరాజులుగారికిని, రాయసవరపు రామమూర్తిగారికిని కొంత ధన మప్పియదలచి, యీ సొమ్ము నాయొద్దనుంచి పంతులుగారు భార్యను దీసికొని, బెంగుళూరు వెళ్ళిరి. ఈ సొమ్ము మొత్తము మూడువేల రూపాయలు. పంతులుగారి యాజ్ఞప్రకారము నా యీ పురుషుల కా సొమ్ము బదుళ్ళిచ్చి వారు నాతో చెప్పినప్రకారము వారి యాస్తులు తనఖాలు వ్రాయించి, దస్తావేజులు రిజిష్టరు చేయించి, పోస్టులో వీరే శలింగముగారికి బెంగుళూరు బంపితిని. పంతులుగారికి నామీద విశ్వాసము గలదని చెప్పుటకు మీది యుదాహరణములు చాలునని తలంచెదను. పంతులుగారు 1908 వ సంవత్సరము మే నెల రెండవ తేదిని రమారమి యేబదివేల రూపాయిల విలువగల స్థిరచర రూపకమైన సొత్తు నంతను హితకారిణీ సమాజమున కుచితముగ నిచ్చివేసి, దాని పరిపాలనా నిమిత్తము ధర్మకర్తల నేర్పరచి, దానశాసనము రిజిష్టరు చేయించిరి. ఆ ధర్మకర్తలు పదునొకండుగురు. ఆ ధర్మకర్తల సభకు యావజ్జీవము పంతులుగారు తామే యధ్యక్షులుగ నుండుటకును, రఘుపతి వెంకటరత్నము నాయుడుగారు నుపాధ్యక్షులుగ నుండుటకును నిర్ణయించి మరి తొమ్మండుగురు సభ్యుల నేర్పరచిరి. అందు బి. ఏ, పరీక్షలయందు కృతార్థులై న్యాయవాదులలో గొప్ప పేరునొందిన ధారవాడ వెంకటకృష్ణారావుపంతులుగారుండిరి. కనుపర్తి శ్రీరాములుగారుండిరి. అప్పుడు శ్రీ పిఠాపురము మహారాజావారి యాంతరంగిక కార్యదర్శిగ నుండిన మొక్కపాటి సుబ్బారాయుడుగారుండిరి. లక్షాధిపతియై వీరేశలింగముగారి పేర పుస్తకభాండాగార మొకటి నడుపుచున్న నాళము కృష్ణారావుగారుండిరి. రాజమహేంద్రవరములో నిల్లువాకిలిగాని, స్థిరమైన యే యితరాస్తిగాని లేని, నిర్ధనుడగు నన్ను గూడ పంతులుగారు ధర్మకర్తలలో నొకరినిగ జేయుట నాలో నాకే యాశ్చర్యమైనది. అట్లు చేయుటకు పంతులుగారికి నాయెడగల దటీ విశ్వాసము లేగాని మరి యేయితరకారణము లేదు. సమాజ వ్యవహారము లేవి వచ్చినను పంతులుగారు నాతో గూడ నాలోచించుచుండెడివారు.

1909 వ సంవత్సర ప్రారంభమున వీరేశలింగముగారు నాయొద్ద పుచ్చుకొన్న మధ్యమ పాఠశాలలో నయిదవఫారము, నారవఫారము

దెరచి, సంపూర్ణమైన యున్నత పాఠశాలజేసిరి. దానికి "హితకారణి హైస్కూలు" అని పేరుపెట్టిరి. మునుపు మా బడియున్న వా|డేవు వారి గాడేఖానా యిరుకుగా నుండుటచే, (శ్రీ) పంతులుగారి పాఠశాల నిన్నిసుపేటలో వా|డేవు కొండయ్యగారి యింటబెట్టి, యదియు జాల నందున, దొడ్డిలో కొన్ని తాటియాకుల పాకలు వేయించిరి. అప్పుడు మిషనువారి పాఠశాలకు ప్రధానోపాధ్యాయులుగానుండిన ముడియము సీతారామారావుగారిని హితకారిణి పాఠశాలకు పంతులుగారు ప్రధానోపాధ్యాయులుగా నియమించిరి. గత సంవత్సరము ప్రధానోపాధ్యాయులుగా నుండిన జయంతి గంగన్నపంతులుగారు ప్రథమ సహాయోపాధ్యాయులుగ నుండిరి. మిషను స్కూలులోనే పనిచేయుచున్న రామాప్రగడ వెంకటరామయ్యగారు కూడ హితకారిణి హైస్కూలులో నొక సహాయోపాధ్యాయులైరి. మా పాఠశాలలో పనిచేసి పిమ్మట మిషనుస్కూలునకు వెళ్ళిన యాకుండి వ్యాసశాస్త్రిగారిని, నాకు మిత్రులై నాబడిలో ఖాళీలేకపోవుటచే టవునుస్కూలులో పని చేయుచున్న పరియాగ వెంకటరామశాస్త్రిగారిని సంస్కృతాంధ్ర పండితులుగ తప్పక నియోగింపవలసినదని పంతులుగారిని మొట్ట మొదటి నుండియు నేను గోరుచుంటిని. పంతులుగారు నా మాట త్రోసివేయక హితకారిణీ పాఠశాలలో వారిద్దరినే పండితులుగ నేర్పరచిరి. మొదటినుండియు మాబడిలో పనిచేయుచున్న కుందూరు వెంకటరత్నముగారిని కూడ సహాయోపాధ్యాయులుగ దీసికొనిరి. హితకారిణి పాఠశాలా పరిపాలక సంఘములో పంతులుగారు నన్ను గూడ నొక సభ్యుడుగ నేర్పరచిరి. కాని దానికొక యంతరాయము వచ్చెను. నేనాదినములలో సభలలో స్వరాజ్యము విదేశవస్తు బహిష్కారము స్వదేశవస్తూపయోగము కావలెనని యుపన్యాసములిచ్చుచుండుటచే నుత్తరమండలముల యందప్పుడు పాఠశాలా పరీక్షాధికారిగానుండిన "యేట్సు" దొరగారు పంతులుగారిని గలుసుకొని, లక్ష్మీనరసింహముగారు రాజకీయములయం దెక్కువ పాలుగొనుచున్నారు. కావున నతడు మీ పాఠశాలా పరిపాలక సంఘములో సభ్యుడుగ నున్నపక్షమున, మీ పాఠశాల విద్యాశాఖవారి యంగీకారమును బడయుట కష్టమని చెప్పిరట. ఆసంగతి పంతులుగారు నాకు చెప్పి,

యేమిచేయుదుమనిరి. క్షణమైన నాలోచింపక నేనిట్లు ప్రత్యుత్తర మిచ్చితిని. పంతులుగారూ! పాఠశాల వృద్ధిలోనికి వచ్చుటయే ప్రధానముగాని నావంటివాడు సభ్యుడుగనుండుట ప్రధానముగాదు. కాబట్టి నేను మూసివేసెదను. నా స్థానమందు మరియొకరి నేర్పరచు కొనుడని నేను వదలివేసితిని. పిమ్మట నొకటి రెండుసారులు పాఠ శాలా పరిపాలక సంఘములో ఖాళీవచ్చెను. అప్పుడు దానికి ప్రయ త్నముచేయుమని నన్ను కొందరు మిత్రులు గోరిరి. సభ్యుడుగ నుండు మని పంతులుగారు స్వయముగ నన్ను గోరినగాని నే నుండనని చెప్పి తిని. ఈ మాట రఘుపతి వేంకటరత్నమునాయుడుగారితో కూడ చెప్పి తిని. నేను సభ్యుడుగానున్న పక్షమున తమపాఠశాలకు నేదో నష్టము కలుగునని పంతులుగారి మనసులో మరణపర్యంతము నభిప్రాయ మున్నట్లు నాకుదోచెను. అందుచేతనే పంతులుగారు చనిపోయిన తరువాత, నాయుడుగారొక హితకారిణిసభకు వచ్చినప్పుడు, మీరిక నైన మా పాఠశాలా సంఘములో నుందురా? లేదా? యని యడి గిరి. మీ రుండుమన్నారు గనుక నేనుందునని బదులుచెప్పితిని. తరువాత నేను కొన్నిసంవత్సరములు పాఠశాలా సంఘములో సభ్యు డుగ నుంటిని. పంతులుగారు జీవించియుండగానే నాసంఘములో సభ్యుడుగానుండుటకై ప్రయత్నముచేయకపోవుట, వారిమీద కోపము చేతగాదు. నా యునికివలన విద్యాశాలకు నష్టము కలుగునని పంతు లుగారికి నభిప్రాయమున్నది. కనుక వారికా యభిప్రాయము తొలగి వారే నన్ను స్వయముగా గోరినప్పు డుందునని నిశ్చయించుకొం టిని. పంతులుగారు నన్నెప్పుడు కోరలేదు. అందుచేత నేనుండలేదు.

1909 వ సంవత్సరమున మాయింట నొకవిశేషము జరిగెను. మా రెండవ చెల్లెలైన యచ్చమ్మ రెండవకూతురు వెంకటరత్నమ్మ పదునొకండు సంవత్సరములు వయసు కలదయ్యెను. ఆమె వివాహ మునకై తగిన వరుని వెదకుమని మా చెల్లెండ్రు పలుమారు నాతో చెప్పుచువచ్చిరి. పిఠాపురములో కోట రామమూర్తిగారి మూడవ కుమారుడు ప్రవేశపరీక్షయందు కృతార్థుడై, కాకినాడ వెళ్ళి, పిఠా పురము రాజాగారి కళాశాలలో వెంకటరత్నము నాయుడుగారియొద్ద ప్రథమశాస్త్రపరీక్షలో కృతార్థుడైనాడని నాకు దెలిసినది. కోట

రామమూర్తిగారితో మాటలాడి, యీ సంబంధము కుదురునేమో కనుగొనుమని, మా తమ్ముడు కృష్ణమూర్తిని పిఠాపురము పంపితిని. మా తమ్ముడు కోటరామమూర్తిగారితో మాటలాడివచ్చి నాకిట్లు చెప్పెను. మన సంబంధము చేసికొనుట రామమూర్తిగారి కిష్టమే. కట్నము వారి కక్కర లేదట ; పిల్లవాడు, బి. ఏ. పరీక్షలో కృతార్థుడగువరకు చదువు చెప్పించుమని వారు కోరిరి. కట్నముక్రింద, నయిదారువందల రూపాయ లొక్కమారు గుమ్మరింప నక్కర లేదుగదా యని నే నాపరతున కొప్పుకొంటిని. వెంటనే రామమూర్తిగారు తమ కుమారుని మాయింటికి పంపిరి. నే నతనిని 1909 వ సంవత్సరములో బి. ఏ. తరగతిలో చేర్చితిని. అతని కన్నవస్త్రములు, పుస్తకములు నిచ్చుటయేగాక, నెల నెలకు జీతముకట్టవలసినభారము నాపై బడెను. ఈ షరతున కొప్పుకొనుట మాకు తరువాత కొంత బాధకమయ్యెను. ముందది పొడకట్టకపోవుటచే తొందరపడి యొప్పుకొంటిని. అతడు ప్రకృతిశాస్త్ర మభిమానకళగా పుచ్చుకొనెను.

———

# స్వీయచరిత్రము

## పదునారవ ప్రకరణము

### రామమోహన పాఠశాల

ఆ సంవత్సరము (1909) ఫిబ్రవరినెలలో నేనొక సాహస కార్యము చేసితిని. నిమ్నజాతులయెడ నాకు మొదటినుండి సానుభూతి గలదు. వారు పడు కష్టములను గన్నులారజూచియు, చెవులార వినియు, పలుమారు జాలిపడుచుండెడివాడను. జన్మమెత్తినందుకు, నటువంటి దుర్గతిలోనున్న సంఘమునకు నేదేని యుపకారము చేయఁగూడదా యని నా కప్పుడప్పుడు తట్టుచువచ్చెను. వారి విషయమై యేమిచేయఁగలనా ? యని యాలోచింపగా, నాలోచింపగా, ఎట్టకేలకు నొక్క యుపాయము తట్టినది. వారినిమిత్త మొక్క పాఠశాలబెట్టిన బాగుండునని తోఁచినది. రాజమహేంద్రవరమున నిమ్నజాతుల విషయమై పాఠశాలలు లేకపోలేదు. మునిసిపాలిటీవారు పంచముల నిమిత్తమై మూఁడో, నాలుగో పాఠశాలలుబెట్టి నడుపుచుండిరి. అట్టియెడ నా పాఠశాలవలన నేమి యుపయోగముండునని నాలో నాకే ప్రశ్న తోఁచినది. ఆ పాఠశాలలకంటె భిన్నమైన పాఠశాల స్థాపించిన యెడల నుపయోగపడునని నే ననుకొంటిని. ఆ పాఠశాలలలో వట్టి తెనుఁగే కాని యింగ్లీషు చెప్పరు. నా పాఠశాలలో నేనింగ్లీషు చెప్పించినపక్షమున హరిజనబాలురు బాగుపడుదురని గట్టి నమ్మకము నాకు గలిగినది. ఆ నమ్మిక ననుసరించి 1909 ఫిబ్రవరి నెలలో నేను నిమ్నజాతుల కొక పాఠశాల బెట్టితిని. దానికి "రామమోహన పాఠశాల" యని పేరిడితిని. సామాన్య పాఠశాలలకే యిండ్లు దొరకవుగదా ! పంచమ పాఠశాలకెట్లు దొరుకును ! ఇంటి నిమిత్తము నేను ప్రయత్నముచేయఁగా నా మిత్రులైన చెరువు సోమయాజులుగారు నాకు సాయముచేసిరి. రాజమహేంద్రవరములో నార్యాపురమువైపుననున్న గోదావరిగట్టుమీఁద, మా చెరువు సోమయాజులుగారికి కొంత స్థలముండెను. ఆస్థలములో నొకచిన్న పెంకుటి యిల్లుండెను. ఆ యిల్లు మా నిమ్నజాతుల పాఠశాలనిమిత్తముపయోగించుకోవచ్చునని సోమయాజులుగారు నాతో చెప్పిరి.

ఆగృహమున కద్దె నీయనక్కర లేదనిగూడ వారు చెప్పిరి. ఎట్టెటో రెండు మూడు బల్లలు, నొకకుర్చీ, సంపాదించి, యీ గదిలో బెట్టి రామమోహన పాఠశాలను స్థాపించితిని. అందు మూడు నాలుగు తరగతులు మొదట బెట్టితిని. చదువుకొనుటకు బాలురు త్వరగా చేర లేదు. బహుకష్టముమీఁద నలుగు రైదుగురు పిల్లలు చేరిరి. పిల్లలు చేరినతరువాత, నుపాధ్యాయుఁడు దొరుకుట కష్టమయ్యెను. బహు ప్రయత్నములమీఁద అందే సుబ్బారావను యువకుఁడు లభించెను. ఈయన మెరకవీథి తెలగ. ఆయన స్కూలుఫయినలువరకు చదువు కొనెను. ఆయనకు నెలకు పండ్రెండు రూపాయిలు జీతమిచ్చుపద్ధతిని నుపాధ్యాయుఁడుగ నియమించితిని. నాలుగవ తరగతి కత డింగ్లీషు చెప్పునట్లు నే నేర్పాటుచేసితిని. సుబ్బారావుగారు బాలురకు శ్రద్ధ తోను, జాగ్రతతోను పాఠములు చెప్పుచువచ్చిరి. చెరువు సోమ యాజులుగా రిచ్చిన యీ గృహమునందు రామమోహన పాఠశా లను రెండుసంవత్సరములు నడపితిని. సోమయాజులుగారా గృహము నీయకపోయినపక్షమున, నద్దెలేకుండ మరియొక రెవరు నాకట్టి యిల్లు నిచ్చియుండరు. కాబట్టి, సోమయాజులుగారు నాకు మిక్కిలి వంద నీయులు. మరుచటి సంవత్సరమున సుబ్బారావుగారు నా పాఠశాలను విడిచి చదువుకొనుటకు వెళ్ళిరి. ఆయన స్థానమందు మేడా రాజ య్యగారను మరియొక తెలగాను నేను నియమించితిని. ఆయనయు సుబ్బారావుగారివలెనే జాగ్రత్తగ పనిచేసిరి. రెండవ సంవత్సరమున, బాలకులసంఖ్య కొంచె మధికమయ్యెను. చాల బాలకులకు జీతము లేకుండ చదువు చెప్పించుటయేగాక, పలకలను, పుస్తకములనుగూడ నా డబ్బు ఖర్చుపెట్టి వారి కుచితముగ నిచ్చుచుంటిని.

పూర్వము, గోదావరీమండలములోని పశ్చిమభాగమునంతను దొరతనమువారు 1905 వ సంవత్సరమున కృష్ణామండలములో చేర్చిరి. కాబట్టి కొవ్వూరు మొదలుకొని యేలూరువరకు నయిదుతాలూకాలు కృష్ణామండలములో చేరెను. 1909 వ సంవత్సర మేప్రియలు నెలలో కృష్ణామండల రాజకీయసభ భీమవరములో జరుపుట కేర్పాటుచేయ బడెను. ఆహ్వాన సంఘమునకు కొణితివాడ జమీందారుగారైన శ్రీ తామూరి శ్రీరామజగన్నాథరావుగారధ్యక్షులైరి. మహాసభకు

శ్రీ మోచర్ల రామచంద్రరావుగారధ్యక్షులుగ నెన్నుకొనబడిరి. భీమవరముతాలూకాలో జేరిన వీరవాసరము నాస్వగ్రామమగుటచే నేనాసభకుబోవ నిశ్చయించితిని. అది వేసవికాలమగుటచే కాలువలు కట్టివేసిరి. పడవలు నడుచుట లేదు. అప్పటికి భీమవరమునకు రైలుమార్గము లేదు. అందుచేత నేనును, చిలుకూరి వీరభద్రరావుగారును, నాగుమాస్తాయైన జోస్యుల వెంకటేశ్వర్లును తాడేపల్లిగూడెము వరకు రైలుమీద వెళ్ళి, యచ్చటనుండి బండిమీద కొంతదూరము వెళ్ళి, యచ్చటనుండినడచి, నానాశ్రమపడి, సాయంకాలమునకు గరగపఱ్ఱు చేరితిమి. నాప్రాతమిత్రుడైన పాలకోడేటి సుబ్బారావు మాకాతిథ్యమిచ్చి, మమ్మాదరించెను. ఆరాత్రి యచ్చట సుఖనిద్రచేసి, మరునాడుదయమున భీమవరము జేరితిమి. రాజకీయసభ మూడుదినములు జయప్రదముగ జరిగెను. నరసాపుర ప్రముఖులుగూడ గొందరాసభకు దయచేసిరి. రాజకీయసభలో నేను విద్యావిషయమైన తీర్మానముమీద మాటలాడితిని. నాలుగవనాడు సంఘసంస్కరణసభ యయ్యెను. ఆసభకు రావుబహదూరు కందుకూరి వీరేశలింగముగా రధ్యక్షులుగ నెన్నుకొనబడిరి. వీరేశలింగముగారు భార్యాసమేతముగ నంతకుముందురోజుననే వచ్చిరి. సంఘసంస్కరణసభగూడ జయప్రదముగానే జరిగెను. ఆసభలో నేను వితంతువివాహవిషయమైన తీర్మానముమీద మాటలాడితిని. సంఘసంస్కరణసభ జరిగిన తరువాత నా ప్రాతమిత్రుడైన కాళ్ళకూరి నరసింహముగారు నన్ను తమ గ్రామమైన కోపల్లె దీసికొని వెళ్ళిరి. ఆగ్రామములో సంపన్నుడైన యొక క్షత్రియుడుండెను. ఆయన నలువదియకరములభూమిని, భీమవరములో సత్రముపెట్టి, దానికీయదలచెనట. భీమవరవాసులు గొందరు, కోపల్లెవాసులు గొందరు రాజుగారి దర్శనముచేసి "భీమవరములో నున్నత పాఠశాల లేదు; ఈతాలూకాకట్టి పాఠశాలయొకటి యవసరముకాబట్టి, మీరు సత్రమునుమాని భీమవరములో పాఠశాలను స్థాపించి మీరీయదలచిన నలువదియకరములభూమి దానికీయవలసినధి." యని బహువిధముల ప్రార్థించిరట. రాజుగారు వారి మనవి సరకుచేయ లేదట. నాచేత గూడ సలహా చెప్పించినపక్షమున లాభముండునేమోయని కాళ్ళ

కూరి నరసింహముగారు నన్ను దోడుకొనిపోయిరి. భోజనానంతరమున నరసింహముగారును, నేనును రాజుగారి దర్శనమునకు బోతిమి. అచ్చట నెంతో సేపు పాఠశాలాస్థాపన వలన గలుగు లాభములను, సత్రములవలనగలుగు నష్టములను బహువిధములనొక్కి రాజుగారితో చెప్పితిని. రాజుగారిమనసు లేశమైన గరుగలేదు. చిట్టచివరాయన నాకు "ఆలోచించెదనులెండి," యని సమాధానము చెప్పిరి. కాలహరణమేగాని లాభములేదని మేమిరువురము రాజుగారియొద్ద సెలవు దీసికొనిపోయితిమి. వీరేశలింగముగారు భీమవరము విడిచి సకళత్రముగ వారి పెదతండ్రిభార్యను జూచుటకై విస్సాకోడేరు వెళ్ళి యచ్చటనుండి రాజమహేంద్రవరము వెళ్ళిరి. నేను నాస్వగ్రామమైన పీరవాసరము వెళ్ళి మాతమ్మునిపిల్లలనుజూచి యటనుండి రాజమహేంద్రవరము వెళ్ళితిని.

నేను రాజమహేంద్రవరము వెళ్ళునప్పటికి నా నిమిత్తమై యొక సభ గనిపెట్టుకొని యుండెను. న్యాపతి సుబ్బారావు పంతులుగారు 1908 వ సంవత్సరమున జాతీయపాఠశాల స్థాపించి, తత్పరిపాలక సంఘమునకు దానే యధ్యక్షుడై నడుపుచుండెనని యీ వరకే చెప్పితిని గదా! ఆ పాఠశాలకు వెంకటరమణ సరస్వతిగారు ప్రధానోపాధ్యాయులైయుండి, సభాధ్యక్షుని మాట పాటిచేయక స్వతంత్రవృత్తితో నడచుచుండిరి. ఆయనచర్య సుబ్బారావు పంతులుగారికిష్టములేకపోయెను. సుబ్బారావు పంతులుగారు సమస్తవిధముల గౌరవనీయులై, పాఠశాల నిమిత్తము కొంత సొమ్ము ఖర్చుపెట్టినను, వెంకటరమణ సరస్వతిగారు వారి మాటయందు లక్ష్యములేక నడచుటయు, పరిపాలక సంఘములోని సభ్యులు గొందరు సరస్వతిగారి పక్షమే యగుటయు జూచి సుబ్బారావు పంతులుగారు పాఠశాలా సంబంధము వదలుకొని, యీ పాఠశాలను నగరజనుల కప్పగించవలెనని పురమందిరము (Town hall) న నొక బహిరంగ సమావేశము చేసిరి. ఆ సభ రేపు జరుగుననగా నేను పీరవాసరమునుండి రాజమహేంద్రవరము వచ్చితిని. నాటి బహిరంగసభ కధ్యక్షుడుగ నుండుమని సుబ్బారావుపంతులుగారు నన్నే కోరిరి. నేను జాతీయపాఠశాలా పరిపాలక సంఘములో సభ్యుడనైనగాను. నేను గొప్ప న్యాయవాదిని

గాను. వర్తకుడను గాను. ధనికుడను గాను. అట్టివానిని నన్ను సుబ్బారావు పంతులుగారేల సభ కధ్యక్షునిగ నుండుమని కోరిరో స్పష్టముగ దెలియదు. నేను పట్టణములో గొంత పలుకుబడి గలవాడ ననియు నా యుపన్యాసములబట్టియు నా నడతను బట్టియు, నగరవాసులకు నా యెడ గౌరవము గలదనియు, సుబ్బారావుపంతులుగారుతలంచిరి. నేను సభాధ్యక్షుడుగానున్న పక్షమున సభ నెమ్మదిగా జరుగునని తలంచి గాబోలు సుబ్బారావుపంతులుగారు నన్ను గోరియుందురు. సభ జరిగెను. నే నధ్యక్షుడనైతిని. సుబ్బారావు పంతులుగారు మొట్టమొదట లేచి జాతీయపాఠశాల చరిత్రి చెప్పి దానితో సంబంధము కలుగజేసికొనుటకు దమకిష్టములేదని వచించి వదలుకొనిరి. అప్పుడొకరిద్దరు సుబ్బారావు పంతులుగారికి విరుద్ధముగ మాటలాడి కలకలము గలిగించిరి. గాని నేనది వారించి గొడవలేకుండ సభ సమాప్తము చేసితిని. ఆ తరువాత జాతీయపాఠశాల అజ్జరపు వీరయ్యగారి మేడకొట్లలోనికి మార్చబడి, యొక విధముగా సాగుచుండెను. మహారాజశ్రీ గంటి లక్ష్మన్నగారి యొక్కయు, దామెర్ల వెంకటరమణరావుగారి యొక్కయు, సందిరి వీరన్నగారి యొక్కయు ప్రోత్సాహముచేత జాతీయపాఠశాలా పరిపాలకసంఘములో నే నొక సభ్యుడనైతిని. వీరన్నగారు వర్తకులదగ్గర పాఠశాలనిమిత్తము కొన్ని మామూళ్ళు నేర్పరచిరి. గంటి లక్ష్మన్నగారు నెలకు నిరువది రూపాయలు చొప్పున చందానిచ్చి పాఠశాలను బోషింప సాగిరి. దామెర్ల వెంకటరమణరావుగారి బావమరదియైన గాడిచర్ల రామమూర్తిగారు మొదట మునిసిపలు స్కూలులో నుపాధ్యాయుడయ్యు, జాతీయ విద్యాభిమానముచేత నాపని మానుకొని, జాతీయపాఠశాలలో నొక యుపాధ్యాయుడై, వర్తకులయొద్ద సొమ్ము వసూలుచేయుచు, జాతీయ పాఠశాలాభివృద్ధికై యావజ్జీవము పాటుబడెను. అజ్జరపువారి కొట్లలో గూడ వీలుగ లేనందున, జాతీయపాఠశాల రంగిరీజుపేట మొదట నున్న యొక మహమ్మదీయ గృహమునకు మార్చబడెను. ఆరంభములో నున్నట్లది యున్నతపాఠశాలగాక మధ్యమపాఠశాల చేయబడెను. అపరాలకొట్లు మొదలైన కొట్లవద్ద మధ్యమధ్య సభలనుజేసి జాతీయపాఠశాల నిమిత్తమై చందాలను వసూళ్లు చేయుచుండెడి

వాడను. దీనికి గాడిచర్ల రామమూర్తిగారు నాకు సహాయము జేయు చుండిరి. న్యాపతి సుబ్బారావు పంతులుగారు జాతీయపాఠశాలాధ్యక్షు లుగా నున్నకాలముననే, వర్తకు లమావాస్యనాడు కొట్లు గట్టివేసి వ్యాపారముచేయక, విశ్రాంతి సుఖము ననుభవింపజొచ్చిరి. ఆయా చారమే యిప్పటికి జరుగుచున్నది.

1909 వ సంవత్సరములో ద్వితీయభాగమున నాకు గొంత సొమ్ము బదులిమ్మని శ్రీ పిఠాపురము రాజుగారికి నే నొకయుత్తరము వ్రాసికొంటిని. కాని వారు నాకు బదులిచ్చుటకుమారుగా వేయి రూపాయిలు విలువగల యొకచెక్కును బ్యాంకుమీదికి నా కుచిత ముగ నిచ్చిరి. అది నాపేర టపాలో పంపబడెను. ఆ చెక్కును మార్చుకొని సొమ్మును వాడుకొనుట, కొన్ని కారణములచేత నప్పటిపరిస్థితులనుబట్టి నా కిష్టములేకపోయెను. అందుచేత నేనా చెక్కు మార్చుకొనక దిరుగుటపాలో మరల దివాణమువారికి పంపి వేసితిని. ధనము కావలసిన నేను మహారాజావారు దయాపూర్వక ముగ, నుచితముగ బంపిన యీ పెద్దమొత్తమును వినియోగించు కొనక త్రిప్పివేయుటకు గారణ మేమని చదువరులు సంశయింప వచ్చును. అప్పటిదినములలో నా కొక పిచ్చియభిప్రాయముండెను. ఎవరియొద్ద నుచితముగా ధనము గ్రహింపకుండ జీవితముగడపుట సర్వోత్తమమని నా మనసులో నొకతలంపు పుట్టినందున నేనా చెక్కును త్రిప్పివేసితిని. అది నిశ్చయముగా వెర్రియభిప్రాయమే! ఏమన నేనా నీమమును సరిగా బాటింపలేక పలుమారులు ధనముచి తముగా శ్రీ పిఠాపురము మహారాజావారియొద్దను, ధనాఢ్యులైన మరికొందరు మిత్రులయొద్దను స్వీకరింపక తప్పినదిగాదని చెప్పుట కును, ప్రతిజ్ఞాపరిపాలనము చేయలేనందుకు లజ్జపడుచు, నా మనో దౌర్బల్యమును నేనే యొప్పుకొనుచున్నాను. అప్పుడు పిఠాపురము సంస్థానమునకు నుదయగిరి రామారావుగారు దివానుగనుండిరి. ఆసం వత్సరమున రామారావుగారు శ్రీ రాజావారి జన్మదినోత్సవము చేసిరి. అప్పుడు నాకుగూడ నాహ్వానము వచ్చినందున నే నాసభకు బోయి, రాజావారి యుదారగుణాదులగురించి మాటలాడితిని.

ఆ సంవత్సరమున, శ్రీ పోలవరము జమీందారుగారి ప్రథమ భార్యయైన శ్రీమతి బంగారమ్మగారు మిక్కిలి జబ్బుపడి, యొక మరణశాసనమును స్వహస్తముతో వ్రాసిరి. ప్రథమభార్య యను టకు గారణమేమన, జమీందారుగారు బంగారమ్మగారితో గొన్ని యభిప్రాయభేదములు గలిగి, యామెను విడనాడి, 1905 వ సంవత్స రమున మరియొకపిల్లను వివాహమాడిరి. అప్పటినుండియు శ్రీమతి బంగారమ్మగారు పుట్టినింటనే రాజమహేంద్రవరములో శ్రీరాజా వాత్రేవు వేంకటకృష్ణారావుబహద్దరువారి గృహమందే గాలక్షేపము చేయుచు, రోగపడి, మంచిగాలినిమిత్త మాలకాటుకోటలో నివసిం చుచు, నచ్చటనే మరణశాసనమును వ్రాసెను. ఆమె యా శాసన ములో తన స్త్రీ ధనము రమారమి ముప్పదివేలరూపాయిలు రాజ మహేంద్రవరము దొరతనమువారి కళాశాలలో చదువుకొను నియోగి విద్యార్థుల సహాయార్థము వినియోగింపవలసినదని వ్రాసెను. ఆమె దనసొమ్ము ధర్మార్థము వినియోగింపదలచుకొన్నదని దెలిసి, జాతీయ పాఠశాలా పరిపాలకసంఘమువారు తమ పాఠశాలకుగూడ కొంత సొమ్ము నామె నడుగదలచి యాలకాటుకోటకు బోయిరి. అట్లు వెళ్ళినవారు నేనును, దామెర్ల వెంకటరమణరావుగారు, దువ్వూరి వీరభద్రయ్యగారు, పందిరి వీరన్నగారు, గంటి లక్ష్మన్నగారు మొద మొదలైనవారు. ఆమె మా పాఠశాల కేమియు నీయక తలచుకొన్న ప్రకారము నియోగివిద్యార్థుల యుపయోగార్థమే యిచ్చెను. పట్ట పరీక్షాసిద్ధుడై యేడాదికి లక్షరూపాయలు రాబడివచ్చు సంస్థానమున కధిపతియై, చెన్నపురి శాసననిర్మాణసభలో సభ్యుడై, దేశమందు విఖ్యాతిగాంచిన శ్రీ పోలవరము జమీందారుగారికంటె, భర్తచే బరిత్యజింపబడి పుట్టినింట గృశించుచు, వియోగదుఃఖము ననుభవిం చుచు, జీవితశేషము గడపిన యీ బంగారమ్మగారే శ్లాఘాపాత్ర మైనట్టియు, దేశోపకారమైనట్టియు మేలుపనిచేసి వందలకొలది నియోగివిద్యార్థుల పురోభివృద్ధికి హేతుభూతురాలయ్యెను.

1909 వ సంవత్సరమున నేను గద్యోపాఖ్యానమును సవరించి, తొల్లిటి యొడంబడిక ప్రకారము సత్యవోలు గున్నేశ్వరరావుగారి కిచ్చితిని. సవరించుట యనగా చాలవరకు నూతనముగా వ్రాయు

టన్నమాటే. వచనము మునుపటిదేగాని పద్యము లించుమించుగా నన్నియు క్రొత్తవే. అచ్చుపడిన వెంటనే చాలప్రతులు ఖర్చుపడెను. గున్నేశ్వరరావుగా రొక్కొక్క కూర్పున కయిదువేల ప్రతులకుదక్కువ యచ్చు వేయించలేదు. ఈలాగే నా ప్రసన్నయాదవ, పారిజాతాపహరణ నాటకములుగూడ గున్నేశ్వరరావుగా రచ్చువేయించి చాల ప్రతులమ్మికొనిరి. నా నాటకము లన్నిటిలో గయోపాఖ్యానమే జనాకర్షకమైనది. ఆ గ్రంథములు శనగపప్పువలె ఖర్చుపడినవనుట యతిశయోక్తిగాదు. ఇప్పటికి లక్షప్రతులకంటె నధికముగ ఖర్చుపడినవి. గంటి లక్ష్మన్నగా రొకసారి నాతో మాటలాడుచు "Your Gayopakhyanam has record sale" అని వచించిరి. పిఠాపురము దివానుగారైన మొక్కపాటి సుబ్బారాయుడుగారు "Gayopakhyanam is a master peace" అని పలికిరి. గయోపాఖ్యానము శ్రేష్ఠమైన గ్రంథమని దీనిభావము. నా మిత్రులైన పోతుకూచి సుబ్బయ్యగారు స్వగ్రామమయిన తాడేపల్లిగూడెము తాలూకాలోని కన్నాపురము వెళ్లుచు, బండియెక్కి కాలక్షేపమునకు బండివాని నేదైన పాడుమని యడిగిరట. వెంటనే వాడు, "అల్లుడా రమ్మని యాదరమ్మునబిల్వ బంపు మామనుబట్టి జంపగలమె" యన్న పద్యము నెత్తుకొని పాడెనట. సుబ్బయ్యగారు రాజమహేంద్రవరమువచ్చి నన్నొకసారి కలుసుకొని, "అయ్యా! పంతులుగారు, మీ గయోపాఖ్యాన మాబాలగోపాలముచేత సేవింపబడుచున్నదండి" యని బహూకరించిరి. తెనుగుదేశములో గయోపాఖ్యానము ప్రయోగింపని రంగస్థలములేదని నా నమ్మకము. కొన్ని స్థలములలో కొందరు పెద్దమనుష్యులు గయోపాఖ్యాన నాటకవిషయమై పోటీపరీక్షలుబెట్టి, కృష్ణార్జున పాత్రలు పలువురచేత ధరింపచేసి, వారిలో శ్రేష్ఠముగ నభినయించిన వారికి బంగారు పతకములు, మొదలైన బహుమతు లిచ్చుచువచ్చిరి. గయోపాఖ్యాన మచ్చుపడి వచ్చినవెంటనే గున్నేశ్వరరావుగారు, నాగేశ్వరరావుగారు విడిపోకయున్నకాలమున రాజమహేంద్రవరములో మొదటిసారి ప్రయోగించిరి. దానిని చూచుటకు పడమటి గోదావరిజిల్లాలోని చేబ్రోలు, తాడేపల్లిగూడెము ప్రాంతములనుండి గూడ జనులు వచ్చిరట. ఆనాడు నాటకప్రదర్శనమువల్ల పదు

నాలుగువందల రూపాయలు వచ్చెను. ఆ నాటకమునందు జనుల కంత యభిరుచి యేల గలిగెనో? నేనే చెప్పజాలను. జయంతి రామయ్యపంతులుగా రాంధ్రవాఙ్మయమును గురించి యీమధ్యనే యొక వ్యాసము వ్రాసి, యందు గయోపాఖ్యాన నాటకమునుగూర్చి చక్కగ విమర్శించిరి. నా నాటకములలో గయోపాఖ్యానము శ్రేష్ఠ మని ప్రజలభిప్రాయపడుదురు. ప్రసన్నయాదవము శ్రేష్ఠమని నా యభిప్రాయము.

1909 వ సంవత్సరమున "మింటోమార్లే" రాజకీయసంస్కార ణాలు మన దేశమునకు వచ్చెను. అప్పుడు చెన్నరాష్ట్ర పక్షమున న్యాపతి సుబ్బారావు పంతులుగారు గవర్నరుజనరలుగారి శాసన నిర్మాణసభలో సభ్యుడుగ నెన్నుకొనబడిరి. ఆ వార్త యొకనాటి సాయంకాలము టవునుహాలులో నుండగ నాకు దెలిసెను. వెంటనే, నేను సంతోష పారవశ్యమున నా జేబులో రెండు రూపాయలుండగ దీసి మిఠాయి దెప్పించి మిత్రులకు బంచిపెట్టించితిని. రాజకీయ విష యములలో శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగారివల్లను, సాంఘిక విషయములలో వీరేశలింగముగారివల్లను, రాజమహేంద్రవరమునకు హిందూదేశమున గొప్ప పేరు వచ్చెను. అందుచేత వారిరువురియెడ నాకిప్పటికిని భక్తిగౌరవములు గలవు. ఆ మింటోమార్లే సంస్కరణ ములనుబట్టి శ్రీ పోలవరము జమీందారుగారు జమీందార్ల పక్ష మున చెన్నపురి శాసన నిర్మాణసభకు సభ్యుడుగ నుండుటకు ప్రయ త్నించుచున్నట్లు నాతో తంజావూరు రఘునాధరావుగారు చెప్పిరి. అప్పుడు నేను "జమీందారుగా రా పదవికి దగినవారు. నేను గూడ వారికై ప్రయత్నించెదను." అని ప్రత్యుత్తర మిచ్చితిని. ఆ మాటలు రఘునాధరావుగారు జమీందారుగారితో చెప్పిరి. వారికిని నాకును చిరకాలమునుండి మాటలు చూపులు లేకపోయినను వారు పూర్వ వైరమును బాటింపక, నా పేర నొక లేఖ వ్రాసిరి. అందులో వారు నా యుదార శీలమునకు నన్ను మెచ్చిరి.

1909 వ సంవత్సరములో చివరభాగమున మునుపు నడుపు చున్న "మనోరమ" యను మాసపత్రికకు దోడుగా నొక వారపత్రి కను గూడ నెలకొల్పవలయునని నాకు సంకల్పము కలిగెను. సంక

ల్పము గలిగినతోడనే దానికి వలయు ప్రయత్నములు చేయసాగితిని. నాళ్ళచెరువు కృష్ణారావుగారని యొక మాధ్వబ్రాహ్మణుడు రాజమహేంద్రవరములో నప్పుడుండెను. ఆయన, నాయొక్కయు,కుందూరు వేంకటరత్నముగారి యొక్కయు సహాయమున నొక బ్రాహ్మణ వితంతువును వివాహమాడెను. చెన్నపురినుండి వెలువడుచున్న "ఆంధ్ర ప్రకాశిక" యను వారపత్రిక నిర్వహణమున గొంతకాల మాయన బనిచేసిరి. పత్రికాసంస్థాపకులు ఫలానా ముద్రాయంత్రములో పత్రిక యచ్చుపడుచున్నదనియు, ఫలానావారు ప్రకటించుచున్నారనియు, నిర్దరుపురుషులచేత ప్రమాణ పత్రములు దాఖలు చేయించవలెను. నే స్థాపింపదలచిన పత్రిక మనోరమా ముద్రాయంత్రములో ముద్రింపబడును. గనుక ముద్రాపకుడుగ నేను ప్రమాణపత్రము దాఖలుచేసితిని. నాళ్ళచెరువు కృష్ణారావుగారు పత్రికానిర్వహణమందు నాకు దోడుపడుటకై నిరువదియైదు రూపాయలు జీతము నియమించి, పత్రికా ప్రకాశకుడుగా నాయనచేత సబుకలెక్టరుగారి యొద్ద ప్రమాణపత్రము దాఖలు చేయించితిని. అప్పటి నిబంధనల ప్రకారము, రాజమహేంద్రవరము సబుకలెక్టరుగారియొద్ద ప్రమాణ పత్రము దాఖలుచేయుటకు వీలుండుటచేత, నచ్చటనే దాఖలుచేసితిని. ఇప్పుడట్లుగాక జిల్లాకలెక్టరుగారి యొద్దనే దాఖలుచేయవలెను. నా వారపత్రికకు ''దేశమాత'' యని పేరు పెట్టితిని.

1910 వ సంవత్సరము జనవరిలో ప్రమాణపత్రము దాఖలు చేసి, పత్రికా ప్రకటన మారంభించితిని. పత్రికలో ముఖ్యవ్యాసము (Editorial) వృత్తాంతములుగాక వారమునకొక చిత్రకథయు, నొక హాస్యలతయుగూడ ప్రకటింపబడజొచ్చెను. ముద్రాయంత్రములో గొన్ని యక్షరములు, మొదలైన కొన్ని సామానులు కావలసియుండుటచేతను కొంత కాగితము దెప్పించి నిలువయుంచవలసి యుండుట చేతను ద్రవ్యము కొంత కావలసివచ్చెను. చిరకాలమునుండి నాకు పరిచితులై, నాయెడ దయాభిమానములు గలిగి, నన్నాదరించుచున్న శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారికడకు బోయి పత్రికానిర్వాహణార్థము నాకు వేయిరూపాయిలు బదులిమ్మని కోరితిని. వెంటనే వారు సందేహింపక దయాపూర్వకముగ నాకాసొమ్ము బదులిచ్చిరి.

కాని వారికి నేనా సొమ్ముతీర్చి ఋణవిముక్తుడను కాలేకపోతిని. వారు నాచేత మూడు సంవత్సరముల కొకసారి వడ్డీ త్రోసించి, యేదో కొంత మొత్తమునకు నోటు వ్రాయించుకొని, సంతోషించిరే గాని నన్నెన్నడు తొందరపెట్టలేదు. సుబ్బారావు పంతులుగారు నావద్దనుండి సొమ్ము దీసికొనుట కవకాశమున్నను, నామీద దయచేతనో, మరెందుచేతనో, యీ యవకాశమును బురస్కరించుకొని నాయొద్దనుండి సొమ్ము రాబట్టుకొనలేదు. అవకాశమెట్టిదనగ వినుడు. "ఆర్యచరిత"మని యొక గ్రంథముగలదు. అది సంస్కృతములో నున్నది. అందు మన పురాణములనుండియెత్తి కొన్ని కథలు వ్రాయబడినవి. వాల్మీకి ప్రణీతమైన రామాయణములో నిరువదినాలుగు వేల శ్లోకములున్నవి గదా! అందు వర్ణనలు దీసివేసినయెడల వట్టి కథాభాగము రమారమి యేడువందల శ్లోకములుండును. ఆ యేడువందల శ్లోకములు చదివిన పక్షమున రామాయణకథయంతయు బోధపడును. హైకోర్టు న్యాయమూర్తిపదవి నధిష్ఠించి, కీర్తిశేషులైన వి. కృష్ణస్వామి అయ్యరుగారు సంస్కృతభాషాభిమానులై పండితులచేత రామాయణములోని కథాభాగ మేడువందల శ్లోకముల నెత్తి వ్రాయించి, మార్కండేయ పురాణములోని హరిశ్చంద్రకథ, శిబిచక్రవర్తికథ మొదలైనవాటినిగూడ నెత్తి వ్రాయించి, "ఆర్యచరితము"ను పేర నాగరిలిపిలో గ్రంథమును ప్రకటించిరి. సుబ్బారావు పంతులుగారా గ్రంథమును సంపాదించి యందలి రామాయణకథాభాగమును చదివించుకొని విని బాగున్నదని తోచుటచే దాని నాంధ్రీకరింపుమని నన్ను గోరి యాగ్రంథము నాకిచ్చిరి. ఆ రామాయణభాగమును నే నాంధ్రీకరించితిని. అందునిమిత్తము నాకు వారు మూడువందల యేబదిరూపాయిలు బహుమానమిచ్చిరి. దానికి కాప్టెనుహాక్కు సుబ్బారావుపంతులుగారు తమచే స్థాపింపబడిన హిందూసమాజమునకై నాయొద్ద దీసికొనిరి. ఈ మూడువందల యేబదిరూపాయలు నా బాకీలో జమకట్టుకొన్నపక్షమున నేను సంతోషముతో నంగీకరించి యుందును. ఆ పుస్తకమునకు వారు వాల్మీకిరామాయణ సంగ్రహమని పేరుపెట్టి ప్రకటించిరి. వారి పలుకుబడిచేత దానిని వారు హయ్యరు ఎలిమెంటరీగ్రేడు పరీక్షకు పఠనీయగ్రంథముగా

బెట్టించిరి. దానివలన వచ్చిన సొమ్ము వారి సొంతమునకు దీసికొ
నక, హిందూసమాజమునకే యిచ్చివేసిరి. వారి ప్రోత్సాహముచేత
నేను రామాయణ గ్రంథకర్తనుగూడ నైతిని. వారా గ్రంథము
రెండుసారు లచ్చువేయించిరి. ఈలాగే సుబ్బారావు పంతులుగారు
నన్ను భాగవతములోని కథలను వచనముగా వ్రాయుమని కోరిరి.
వారికోరిక ననుసరించి నేను భాగవతములోని ముఖ్యకథలను భాగ
వత కథామంజరియని పేరుపెట్టి, వచనకావ్యముగ రచియించితిని.
అదియు నచ్చులో రమారమి మూడువందల యేబది పుటలైనది.
తన్నిమిత్తము నాకు పంతులుగారు మూడువందల యేబదిరూపాయలు
బహుమానమిచ్చి, దాని కాపీరైటుహక్కును నాచే వారు హిందూ
సమాజమునకే దీసికొనిరి. ఇవిగాక, వారు నాచే ధర్మవిజయమని
మఱియొక గ్రంథము వ్రాయించిరి. దాని చరితము చెప్పెద వినుడు.
చెన్నపురమందు రావుబహదూరు పనప్పాకము ఆనందాచార్యుల
వారని గొప్ప హైకోర్టు న్యాయవాదిగా నుండిరి. ఆయన విద్యా
వినోది. ఆయన మన భారతకథ నింగ్లీషులో సంగ్రహముగ నొక
నవలగ, మిక్కిలి చమత్కారముగ వ్రాసి ప్రకటించిరి. అందలి
యింగ్లీషుశైలి మిక్కిలి సులకనై, హృదయంగమముగా నుండును.
ఆ గ్రంథమునకు వారు "Virtues Triumph' యని పేరుపెట్టిరి. ఆ గ్రం
థమును సుబ్బారావుపంతులుగారు చదివి, మిక్కిలి మనోహరముగా
నున్నదని తలంచి, దాని నాంధ్రీకరింపుమని నాకిచ్చిరి. ధర్మవిజయ
మని దానికి పేరుపెట్టి, నేను వచనముగ నాంధ్రీకరించితిని. తన్నిమి
త్తము వారు నాకు మూడువందలరూపాయల నిచ్చిరి. మొత్తము
మీఁద వారు నాకు మూడు గ్రంథములకు ముట్టచెప్పిరి. ఈ వేయి
రూపాయిలు వారు నా [illegible]క్రింద జమకట్టుకున్నపక్షమున, నాకు
వారు బదులిచ్చిన యసలు వేయిరూపాయిలు తీరియుండును. అట్లు
చేయక, వారు నా కాసొమ్మిచ్చుటచేత, వారి యౌదార్యము భాషాభి
మానము హిందూ సమాజముమీఁద ప్రేమయు వెల్లడియగుచున్నది.
ఈ ధర్మవిజయమను పుస్తకమును సుబ్బారావు పంతులుగా రచ్చు
వేయించి ప్రకటించనేలేదు. వ్రాతప్రతి వారింటనేయున్నది. వారి

కుమారుడైన న్యాపతి కామేశ్వరరావుగారైన నచ్చఁజేయించి, ప్రకటించి, తండ్రిగారి సంకల్పము నెరవేర్తురేమో ? తెలియదు.

మా రెండవ చెల్లెలైన యచ్చమ్మ కిద్దరు కుమార్తెలు గలరనియు నందు పెద్దదియగు సుబ్బమ్మను రామస్వామి మేనల్లుఁడగు రావూరి రామకృష్ణయ్యకిచ్చి, 1908 వ సంవత్సరము వివాహము చేసితిననియు, నిదివరకు వ్రాసితిని. మా చెల్లెలు రెండవకుమార్తెయగు వెంకటరత్నమ్మ పండ్రెండు సంవత్సరముల వయసుగలదయ్యెను. కాబట్టి వివాహము చేయవలసిన యీడు వచ్చినది. పీఠాపురమునుండి కోట శేషగిరిరావను పెండ్లికుమారుని దెచ్చి మాయింట బెట్టుకొని, బి. ఏ. తరగతిలో చేర్చి, చదువు చెప్పించుచుంటినని యిదివరకు వ్రాసియుంటిని. ఆవివాహము 1910 వ సంవత్సరము జూను నెలలో చేసితిని. ఆ వివాహములోనే నా పెద్దమేనకోడలు సుబ్బమ్మకు పునస్సంధానము చేసి గాపురమునకు బంపితిని. రామకృష్ణయ్య స్వదేశీయవస్త్రవ్యాపారము మానివేసి, చెన్నపురిలో వైద్యకళాశాలలో జేరి చదువుకొన నిశ్చయించినందున మా చెల్లెలు అచ్చమ్మను, మేనకోడలిని, రామకృష్ణయ్యను నతని కోరికప్రకారము చెన్నపురికి పంపితిని. ఆ విద్యాభ్యాసమునిమిత్తము గావలసినసొమ్ము తన మిత్రులతో నేర్పాటుచేసుకొని, తెచ్చుకొనెను. గాని నేనతనికి సహాయము చేయలేదు. రామకృష్ణయ్య చెన్నపురిలో నైదుసంవత్సరములు చదివెను. అచట భార్యాసమేతముగా కొంతకాలముమాత్రమే యుండెను. అతఁడు చెన్నపురిలో నొంటిగానున్నకాలమున మా మేనకోడలు మా యింటివద్దనే యుండెను.

కోట శేషగిరిరావు 1909 వ సంవత్సరము జనవరి మొదలుకొని 1910 మే, యేప్రియలు నెలలవరకు జూనియరు బి. ఏ. తరగతిలో జదివెను. 1909 వ సంవత్సరము వరకు విద్యార్థులు కళాశాలలో జనవరిలో జేరుచుండిరి. డిశంబరు నెలలో పరీక్షలగుచుండెను. ఆ సంవత్సరము పూర్వపు నిబంధనలుమారి, క్రొత్తనిబంధనలమలులోనికి వచ్చెను. ఈ నూతన నిబంధనల ప్రకారము కళాశాలలు జనవరిలోగాక జూలైలో తెరువబడుటయు, విద్యార్థులనప్పుడే చేర్చుకొనుటయు, పరీక్షలు మార్చి నెలలో జరుగుటయు, సేప్రియలు,

నే, జూను నెలలో కళాశాలలు మూయబడుటయు సంభవించెను. ఈ నిబంధనలమార్పువలన శేషగిరిరావు బి. ఏ. యొదటితరగతిలో 1909 వ సంవత్సరము మొదలు 1910 వ సంవత్సరము మార్చి మాసాంతమువరకు చదువవలసివచ్చెను. అతని నిమిత్తము కళాశాలలో జీతమెక్కువ కట్టవలసివచ్చెను. కష్టపడి పదిహేను మాసములు జూనియరు తరగతిలో జదివినను శేషగిరిరావా యేడు సంవత్సరాంతము పరీక్షలో తప్పిపోయెను. అందుచేత జూలై నెలలో మరల జూనియరు తరగతిలోనే చేరి యతడు చదువవలసినవాడయ్యెను. ఇందువలన నాకెక్కువచిక్కు సంభవించెను. ఏలయన, శేషగిరిరావునకు భోజనముగాక, బట్టలు, పుస్తకములు, జీతములు నీయవలసినవాడను నేను. వివాహసంబంధములలో గృహస్థుడు తనయల్లునకు ముందుగా నేదో కొంతకట్నము నిశ్చయించుకొని యిచ్చుట మంచిదిగాని, చదువుచెప్పించుటకు వాగ్దానముజేసి వరుని యింటబెట్టుకొనుట మంచిదిగాదు. ఏలయన వరుడు పరీక్షలో గడతేరక తప్పిపోవుచున్న పక్షమున, వాని నిమిత్తము వందలకొలది డబ్బుపోసి, చదువు కొనసాగించుట మిక్కిలి కష్టము. అదిగాక ప్రతిగృహములో నేవో కొన్ని లోపములుండును. ఈ క్రొత్తవరుడు లోపములను గ్రహించి యత్తవారిని లోకువచేయును. అతనిస్వభావము మంచిదైనపక్షమున నత్తవారికి సుఖముగాని యతడు ధూర్తుడైనపక్షమున నత్తవారికి మిక్కిలి చిక్కుకలుగుచుండును. మా శేషగిరిరావు స్వభావముచేత మిక్కిలి కోపదారి. అందుచేత, నేనతనివల్ల మిక్కిలి చిక్కులుపడవలసినవాడనైతిని. అతడు 1910 వ సంవత్సరము జూలై మొదలుకొని 1911 మార్చివరకు, బి. ఏ. జూనియరులో చదివెను. సంవత్సరాంత పరీక్షలో కడతేరి సీనియరుతరగతిలోనికి పోయెను. 1911 జూలై మొదలుకొని 1912 సంవత్సరము మార్చివరకు, బి. ఏ. సీనియరు తరగతిలో జదివెను. అప్పుడు పరీక్షనిమిత్తము యేబదిరూపాయలిచ్చి చెన్నపట్టణ మతనిని బంపవలసివచ్చెను. రెండుసంవత్సరములలో సమాప్తముగావలసిన యతని బి. ఏ. చదువు మొత్తముమీద మూడు సంవత్సరముల మూడుమాసములు పట్టెను. ఆదినములలో నేను ధనవిషయమై మిక్కిలి చిక్కులు పడితిని. నాపుస్తకముల యమ్మకముల

వల్ల రాబడిచేత నేనెట్లెటో కుటుంబమును పోషించుకొనుచుంటిని. నాపుస్తకములు తరుచుగా ట్రెయినింగు పరీక్షలకు విశ్వవిద్యాలయ ముల పరీక్షలకు బఠనీయగ్రంథములుగా నియమింపబడుచువచ్చెను. దానివలన నాకేటేట కొంతధనము వచ్చుచుండెను. అయినను ప్రతి నెలకు సరిగా జీతముగావచ్చునట్టు రాబడిలేదు. కనుక ధనమువచ్చి నప్పుడు పాతయప్పులు తీర్చుకొని యొకవిధముగా, గాలక్షేపము చేయుచుంటిని.

కుటుంబ భారమునకు దోడుగా, నాకు ముద్రాక్షరశాలా నిర్వహణ భారమును, నొక మాసపత్రికను, నొక వారపత్రికను నిర్వహింపవలసిన భారము గూడ నా నెత్తిపై బడెను. అది యటుం డగా నిమ్నజాతుల నిమిత్తము నేను స్థాపించిన రామమోహన పాఠ శాల గూడ నాకొక భారమయ్యెను. ఆ పాఠశాలలో మొదట బాలురు వచ్చుట కష్టమయ్యెను. కాని పిదప బాలకు లెక్కువగ వచ్చుటచేతను, పై తరగతిగూడ నెలకొల్పుటచేతను, చెరువు సోమ యాజులుగారు నా కుచితముగనిచ్చిన గోదావరి యొడ్డుననున్న కొంప విడచి, లక్ష్మీవారపుపేటలో నప్పుడు ఖాళీగానున్న యొక తురకల యిల్లద్దెకు తీసుకొని, రామమోహనపాఠశాల నందులోనికి 1911 వ సంవత్సరములో మార్చితిని. బాలురసంఖ్య యెక్కువగుటచే, మరి యిద్దరుపాధ్యాయుల నేర్పరచవలసి వచ్చెను. ఈ పాఠశాలకు గావ లసిన వ్యయమంతయు నేనే భరించుచుంటిని. అప్పు డాపాఠశాలకు రమారమీ నెలకు ముప్పదిరూపాయలు ఖర్చుపడుచుండెను. పర సహాయము విశేషముగా లేకపోయెను. ఒకసారి నాళము పట్టాభి రామయ్యగారు గొన్ని పలకలు పుస్తకములు దెచ్చి బాలురకిమ్మని నా కిచ్చిరి. వాటిని నేను బాలురకు పంచిపెట్టించితిని. ఒకసారి న్యాపతి సుబ్బారావు పంతులుగారు మా పాఠశాలజూచి సంతోషించి దానికి విరాళముగ నూటయేబది రూపాయలు బంపిరి. ఆ సొమ్ముతో నేను బాలురు కూర్చుండు బల్లలు, నల్లబల్లలు, డస్కుబల్లలు, కుర్చీలు మొదలగు వాటిని చేయించితిని. ఏడాది కొకటిచొప్పున పై తరగతులు పెట్టి రామమోహనపాఠశాలను హాయ్యరు ఎలిమెంటరీపాఠశాలగ జేసి తిని. నాళము కృష్ణారావుగారు "మానవసేవ" యను నొక తెనుగు మాస

పత్రికను స్థాపించి మొదట కొంతకాలము మా ముద్రాక్షరశాలలో దాని నచ్చువేయించి, పిదప దానిని మరియొక ముద్రాక్షరశాలలో నచ్చువేయింప సాగిరి. నా "దేశమాత" పత్రిక వారమునకు రెండు రాయలుసైజు కాగితములమీఁద యచ్చుపడుచుండెను. ప్రతివారము హాస్యలత యుండుటచే, పత్రిక క్రమక్రమముగా జనాకర్షకమయ్యెను. చందాదారు లెక్కువగుటచేతను, కోర్టు మునసబులు గొందరు నామీఁద నభిమానముచేత తమ కోర్టులలోని వేలముల ప్రకటనలు మా పత్రికలో ప్రకటించుటచేతను, "దేశమాత" పత్రిక కొంత లాభకరముగానే యుండెను. డబ్బు తక్కువగ నున్నప్పుడు నా "మనోరమ" మాసపత్రిక కొన్నిమాసము లాపివేయుచుంటిని. "దేశమాత" లో గూడ కృష్ణవేణి మణిమంజరి మొదలైన నవలలను ప్రకటించితిని. హాస్యలతలు సంఘ దురాచారములమీఁదను, రాజకీయ విషయములమీఁదను, మ్యునిసిపలు విషయములమీఁదను, జనాభాలెక్కలు మొదలైనవాటిమీఁదను నాచే వ్రాయఁబడుచుండెను. హాస్యలతలును, చిత్రకథలును, ప్రధానవ్యాసములును నేనే వ్రాయుచుండెడివాఁడను.

1911 వ సంవత్సరమున విశాఖపట్టణ మండల రాజకీయసభ విజయనగరములో జరిగెను. ఆసభకు పార్వతీపుర నివాసులును, సుప్రసిద్ధ న్యాయవాదులునైన ఉపద్రష్ట జగన్నాథశాస్త్రిగా రధ్యక్షులుగ నెన్నుకొనబడిరి. మండల సంఘ సంస్కరణసభ కధ్యక్షులుగా నుండుమని నన్నాహ్వానించిరి. ఈ సభలతోపాటు మండల పారిశ్రామికసభగూడ జరిగెను. ఆసభకు బరంపురము నివాసులు కాంగ్రెసు నాయకులునైన వరాహగిరి జోగయ్యపంతులుగా రధ్యక్షులుగ చేయఁబడిరి. ఏకారణముననో నా మిత్రులైన గంటి లక్ష్మన్న గారుగూడ నచటికి వచ్చిరి. సభలు జయప్రదముగ జరిగెను. నా మిత్రులైన పిళ్ళారిసెట్టి నారాయణరావు నాయుఁడుగా రా దినములలో నచట జిల్లా మునసబుగ నుండిరి. సభలులేని సమయమునందు నేను తరచుగా నాయుడుగారితో గాలక్షేపము చేయుచుంటిని. సంఘసంస్కరణసభలో నే నధ్యక్షకోపన్యాసము యప్పటికప్పుడే చెప్పితిని. కాని ముందుగ వ్రాసి తయారుచేసుకొనలేదు. నే నేసభలో మాట

లాడినను నాకిదియే యలవాటు. నారాయణరావు నాయుడుగారు సంఘసంస్కరణప్రియులగుటచేత, సంఘసంస్కరణసభకు దయచేసి పాలుగొనుటయేగాక నధ్యక్షునకు వందనములు వారే సమర్పించిరి. విజయనగరము మహారాజావారి కళాశాలా ప్రధానాచార్యులైన కిళాంబి రామానుజాచార్యులవారు చల్లగాలికి భీమునిపట్టణము వెళ్ళి, యచ్చటనుండి ప్రత్యేకముగా సంఘసంస్కరణసభకు దయచేసి, యధ్యక్షునకు వందనములు సమర్పించుటలో వారుగూడ పాలు గొనిరి. రామానుజాచార్యులుగారు నాకు వందనములు సమర్పించు నప్పుడు యిట్లనిరి. "I endoise every word that fell from the lips of my friend Mr. Narayanarao" వందన సమర్పణములో నారాయణ రావు నాయుడుగారు నన్ను స్తవముచేసిరి. ఆ స్తవములో ప్రతి మాటయు దన కంగీకారమేయని రామానుజాచార్యులుగారు మాట లాడిన యింగ్లీషుమాటల యర్థము. విజయనగరములోనున్న మూడు దినములు గురజాడ (శ్రీ)రామమూర్తి పంతులుగారియింట బసచేసి తిని. అప్పటికే గురజాడ (శ్రీ)రామమూర్తి పంతులుగారు చనిపో యిరి. వారి జ్యేష్ఠకుమారుడైన దుర్గాప్రసాదరావుగారును, వారి యల్లుడుగారైన కవిపురపు వెంకటరత్నము పంతులుగారును మిక్కిలి గౌరవముతో నాకాతిథ్యమిచ్చిరి. సభలు ముగిసినతరువాత నేను విశాఖపట్టణము వెళ్ళితిని. మా రాజమహేంద్రవర పురనివాసులైన గంటి వెంకటరామయ్యగారు చల్లగాలికొరకు వాల్తేరులో నొక బంగాళా యద్దెకుపుచ్చుకొని యచటనుండిరి. గంటి లక్ష్మన్నగారును, నేనును నాలుగుదినములు వారి కతిథులుగా నుంటిమి. ఆప్రయాణ ములలో నాతోగూడ సహాయముగ గంటి వరహాలను ద్రావిడయువ కుడు వచ్చెను. ఈతడు విశాఖపట్టణమండలవాసియైన ద్రావిడ బాలుడు. 1910 వ సంవత్సరము చివరభాగమున నితడు నాకడకు వచ్చి పనియేదేని నిప్పించుమని నన్నడిగెను. అప్పుడు పనియేమియు నాకడ లేకపోవుటచే, మాయింట భుజించి నాకడనుండుమని చెప్పి తిని. అత డంగీకరించి మాయింటికి గావలసిన బజారుపనులుచేయుచు నన్ను సభలకు టవునుహాలుకు దీసికొనిపోవుట మొదలయిన పనులు చేయుచు, విశ్వాసపాత్రుడై యుండెను.

నాటకసమాజముతో నేను 1908 వ సంవత్సరము మొదలు కొని సంబంధము వదలుకొని, ప్రతిదినము టవునుహాలునకు బోవు చుంటిని. అక్కడ నాకు ముఖ్యమిత్రులయిన దామెర్ల వెంకటరమణారావుగారు, రామాప్రగడ వెంకటరామయ్యగారు, కుందూరు వెంకటరత్నముగారు, వేదురుమూడి రామదాసుపంతులుగారు మొద లగువారు సంభాషించుచుండెడివారు. వీరుగాక న్యాపతి సుబ్బారావు పంతులుగారు, చిత్రపు వెంకటచలముగారు, కంచుమర్తి రామచంద్ర రావుగారు మున్నగువారినిగూడ ప్రతిదినము నేను టవునుహాలులోనే గలుసుకొని మాటలాడుచుండెడివాడను. టవునుహాలులో విక్టోరియా జూబిలీ రీడింగు రూమను పేర నొక పత్రికాపఠన సంఘముండెను. దానికి సుబ్బారావుపంతులుగా రధ్యక్షులు. అందులో నేననేక సంవ త్సరములు సభ్యుడుగా నెన్నుకొనబడుచుంటిని. 1911 వ సంవత్స రము జూలై నెలలో నా "దేశమాత" పత్రిక కొకచిక్కు సంభవిం చెను. పత్రికా నిర్వాహణమందు నాకు సహాయముచేయుటకై నాళ్ళ చెరువు కృష్ణారావుగారిని నెల కిరువదియైదు రూపాయిలమీద నియ మించితిననియు, నతడే పత్రికా ప్రకాశకుడుగా నుండునట్లు కలెక్టరు గారి యొద్ద ప్రమాణపత్రము దాఖలు చేయించితిననియు వ్రాసితిని. వీరేశలింగముగారు నాళ్ళచెరువు కృష్ణారావుగారిని మొదటినుండియు నెరిగియుండుటచే నతడు నమ్మదగిన మనుష్యుడుకాడనియు, మాటి మాటికబద్ధములు చెప్పువాడనియు బలుమారులు నాతో జెప్పిరి. ఆయన చెప్పినమాట నిజమయ్యెను, పత్రికా నిర్వాహణమున నా ప్రియమిత్రుడైన రాయవరపు రామమూర్తిగారు గూడ నాకు తోడు పడుచుండిరి. ముఖ్యవిషయ మేదైన వచ్చినప్పుడు నేను రామమూర్తి గారితో నాలోచించుచుండెడివాడను. కృష్ణారావుగారి కందుచేత మనసులో నీర్ష్య బయలుదేరెను. అందుచేత నతడు పత్రిక కేదైన హాని చేయదలచెను. అతడు జిల్లాకలెక్టరుగారి కడకు బోయి "దేశ మాత" పత్రికలో దొరతనమువారికి వ్యతిరేకమైన విషయములు ప్రకటింపబడుచున్నవనియు, దనకవి గిట్టకపోవుటచే, దాను పత్రికా సంబంధము వదలుకోదలచుకొంటిననియు, దొరగారితో రహస్య ముగ నేరములు చెప్పెను. ధవళేశ్వరము మకాములో కలెక్టరుగా

యుండగా నేను వారిని గలుసుకొని కృష్ణారావుగారు సరిగా బనిచేయుట లేదనియు, పత్రికా ప్రకాశకుడుగా నతనిని తొలగించి నేనే యుందు ననియు వారితో మనవిచేసితిని. అప్పుడు కలెక్టరుగారైన "ఎల్విన్" (Elwin) దొరగారు నాళ్ళ చెరువు కృష్ణారావుగారు నా మీద తమతో జెప్పిన సంగతులు కొన్నిటిని నాకు చెప్పిరి. కృష్ణారావుగా రంతకో బోక "దేశమాత" పత్రికకు దాను ప్రకాశకుడను గానని కలెక్టరు గారికి వ్రాతమూలకమైన యర్జీనిచ్చిరి. క్రొత్త ప్రకాశకుడు కలెక్టరు గారియొద్ద ప్రమాణపత్రము దాఖలుచేసినదాక పత్రిక ప్రకటింప గూడదు. నిబంధనలున్నవి. అందుచేత రెండువారములు పత్రిక నిలుపుచేయబడెను.

నా మిత్రులైన చెరువు సోమయాజులుగారు జిల్లాకలెక్టరుగారిని స్వయముగా నెరుగుదురు. అప్పుడు కలెక్టరుగారు అమలాపురము తాలూకాలో మన్నంపల్లి లాకుదగ్గర మకాము చేసియుండిరి. వారిని దర్శించి నేనే ప్రకాశకుడుగా ప్రమాణపత్రము దాఖలుచేయవలెనని, చెరువు సోమయాజులుగారిని గంటి వరహాలును వెంటబెట్టుకొని, నే నమలాపురము వెళ్ళితిని. పూటకూళ్ళ యింట భుజియించి, యమలాపురము నుండి నేము మన్నంపల్లి జేరునప్పటికి మధ్యాహ్నము మూడుగంటలయ్యెను. నాడు వర్షము గురియుచుండెను. కలెక్టరుగారి కాఫీపాల నిమిత్త మావులను గట్టుమీద చెట్లకు గట్టివేసి, మునసబు కరణములు వానలోనే గట్టుమీద నిలువబడిరి. తహసీలుదారుగారు, మేజస్ట్రేటు గారును నల్లని గొడుగులు వేసుకొని వానలో నిలువబడిరి. కలెక్టరు గారు కాలువలోనున్న యొక పడవలో (Staff Boat) క్షేమముగ గూర్చుండిరి. సోమయాజులుగారు ముందుగ దొరగారియొద్దకు బోయి నేను వచ్చితినని చెప్పి తరువాత నన్ను లోనికి గొంపోయిరి. నేను శ్రమపడి వానలో వచ్చినందుకు కలెక్టరుగారు మిక్కిలి నొచ్చుకొని నా వచ్చినపనిని, "దేశమాత" పత్రికకు నేనే ప్రకాశకుడుగా నుందు నని నేను సంతకముజేసి యిచ్చిన ప్రమాణపత్రము నంగీకరించి, నన్ను త్వరగా పంపివేసిరి. తిరిగి నే నమలాపురము వచ్చునప్పుడు, మార్గమధ్యమున మొల్లేరను గ్రామమున, సోమయాజులుగారిమిత్రులైన యొకగృహస్థుని యింట భోజనము చేసి, యా రాత్రి యచటనే

పంపుకొని, మరునా డుదయమున వారి యింటనే పిండివంటలతో విందారగించి, యమలాపురమునకు బయలుదేరితిమి. బండివాని తెలివితక్కువ వలన త్రోవలో నాబండి బోల్తపడెను. నాకు చిన్న దెబ్బతగిలెను. దానివలన నాకు విశేషము బాధ కలుగలేదు. అమలాపురముచేరి యచట పడవనెక్కి, మూడవనాటికి రాజమహేంద్రవరము చేరితిమి. ఇంతతో నాళ్ళచెరువు కృష్ణారావుగారికిని నాకును సంబంధము విడిపోయెను.

— —

# స్వీయ చరిత్రము

## పదునేడవ ప్రకరణము

## నా బరంపుర ప్రయాణము

వీరేశలింగముగారు, ప్రతి సంవత్సరము వేసవి కాలమున నిచ్చట తీవ్రమైన యెండ భరింపలేక, భార్యాసమేతులై బెంగుళూరు వెళ్ళుచుండెడివారు. 1911 వ సంవత్సరముగూడ నెప్పటియట్టుల నేప్రియలు నెలలో బెంగుళూరు వెళ్ళి, దంపతులు మంచి యారోగ్య స్థితిలో జూలై నెలలో మరల రాజమహేంద్రవరము వచ్చిరి. ఇక్కడ గూడ వారి యారోగ్యము బాగుగనే యుండెను. బరంపురమువచ్చి రెండుమూ డుపన్యాసము లియవలసినదని కొందరు మిత్రులు నా పేర వ్రాసిరి. 1911 వ సంవత్సరము ఆగస్టు 11 వ తారీకున నేను బరంపురము వచ్చెదనని వారిపేర వ్రాసి ప్రయత్నములు చేసికొంటిని. రాజమహేంద్రవరములో నుదయమున యెనిమిది గంటలకు మెయిలుబండిలో బయలుదేరిన పక్షమున సాయంకాలమునకు బరంపురము చేరవచ్చును. అందుచేత నే నాగస్టు 11 వ తేదీ నుదయమున పెందలకడ లేచి కాలకృత్యములు దీర్చుకొని భోజనముజేసి ప్రయాణమునకు సిద్ధముగ నుంటిని. అప్పుడు వీరేశలింగముగారి తోటలో నుండి కామరాజు హనుమంతరావుగారు నాకడకువచ్చి, కడచినరాత్రి వీరేశలింగముగారి భార్య రాజ్యలక్ష్మమ్మగారు హఠాత్తుగ మృతినొందినదని చెప్పిరి. వెంటనే నేను ప్రయాణము మానివేసి యావర్తమానము తంతిమూలముగా బరంపురము మిత్రులకు దెలియపరచి, మరునా డుదయము బయలుదేరి వత్తునని వారికి వ్రాసి, ముద్రాక్షరశాలకు జని, రాజ్యలక్ష్మమ్మగారి యోగ్యతనుగూర్చియు, నామె వితంతువులకు జేసిన సేవనుగూర్చియు, నొక వ్యాసము వ్రాసియిచ్చి యామె విషయమై యొక ప్రత్యేక "దేశమాత" సంచిక ప్రకటింపుమని పని వాండ్రకు నాజ్ఞనిచ్చి, సంచిక తయారయిన తరువాత నాఫీసు మూసి వేయమని చెప్పి నేను వీరేశలింగముగారి తోటకు బోతిని. పిడుగు వంటి యావార్త దెలిసినతోడనే పట్టణములో నానా భాగముల నుండి పురజనులు తోటలోనికి రాజొచ్చిరి. అన్ని వర్ణములవారును,

స్త్రీలును, పురుషులును, ముసలివాండ్రును, పడుచువాండ్రును వంద లకొలఁదిగవచ్చి పంతులుగారిని పరామర్శ చేయఁజొచ్చిరి. వీరేశలింగ ముగారి తోటలో నొక యావీసినందున రాజ్యలక్ష్మమ్మగారు జున్ను వండుకొని తిని పండుకొని, నిద్రలోనే ప్రాణములు విడిచెను. లావు పాటి మనుష్యులు వార్ధక్యములో నాకస్మికముగా గుండె యాగిపోయి చనిపోవుచుందురు. రాజ్యలక్ష్మమ్మగారు లావుగ నుండెడిది. అప్పటి కామెకు రమారమి యెనుబదిసంవత్సరముల వయస్సు. అందుచే హృదయదౌర్బల్యముచేత నాకస్మికముగ మరణించియుండును. ఆమె మేడమీద మృతినొందుటచే శవమును క్రిందికిదింపి కుర్చీలో పండు కొనబెట్టిరి. ఆమె ముఖములో జీవకళ పోలేదనియు, నెప్పటివలె కలకలలాడుచునే యున్నదనియు, జూచినవారు చెప్పిరి. సాయంకా లమున నాలుగుగంటలకు తోటలోనే యొకమూల దహనపరచిరి.

ఆగస్టు 12 వ తారీఖు నుదయమున, నేను నా స్కూలులో నుపాధ్యాయుఁడైన, మల్లుభొట్ల వెంకయ్యను సాయముదీసికొని, బరంపురము వెళ్ళితిని. సభాసన్నాహకులు, బరంపురం రైలుస్టేషనులో నన్నెదురుకొని, యూరిలోనికి దీసికొనివెళ్ళి, యచ్చట న్యాయవాది యైన కోపర్గాము రామమూర్తిగారి యింట నాకు బసయేర్పరచి యచటదింపిరి. రామమూర్తిగారు మిక్కిలి సౌమ్యులు. వారు నన్ను మిక్కిలి దయాగౌరవములతో నాదరించిరి. మరునాడు బరంపురము టౌనుహాలులో గొప్పసభ జరిగెను. ఆ భవనమంతయు జనులతో క్రిక్కిరిసి యుండెను. గ్రంథభాండారము మొదలైన విషయములను గురించి నేను పెద్ద యుపన్యాసము చేసితిని. స్థలమంతయు జనులచే నిండిపోవుటచే, కూరుచుండుటకు చోటులేక, నచట గవర్నమెంటు ప్లీడరుగారైన పిలియము వెంకట్రామయ్యగారుగూడ నొకమూల గూరుచుండి, నాయుపన్యాసము వినిరని, యచట మిత్రులు చెప్పిరి. అచట పూర్వపు గవర్నమెంటు ప్లీడరుగారైన దిగుమర్తి వెంకట రామయ్యగారిని దర్శింప నేనుబోతిని. వారప్పుడు నింటలేరు. కాని తరువాత నేను తమ యింటికి వచ్చినట్లు విని, వారు కడు వృద్ధులైనను నన్ను జూచుటకు కోపర్గాము రామమూర్తిగారి యింటికివచ్చి, జూచిరి. కోపర్గాము రామమూర్తిగారు సంఘసంస్కరణ ప్రియులు.

లోకసేవా పరాయణులు. మూడు దినములు నేను బరంపురములో నుండి తిరిగి రాజమహేంద్రవరము వచ్చితిని.

హితకారిణీ పాఠశాల యిన్నీసుపేటలో నద్దెయింటిలో నెల కొల్పబడెనని యిదివరకే వ్రాసియుంటిని. దానికి స్థిరమైన భవనము గట్టించ వలెనని వీరేశలింగముగారు స్థలముకొరకు పట్టణములో ననేక భాగములు వెదకిరి. ఎట్టకేలకిప్పుడు పాఠశాలయున్న స్థలమే సత్యవోలు గున్నేశ్వరరావుగారియొద్ద క్రయమునకు దీసికొనిరి. మహోదారశీలురైన శ్రీ పిఠాపురము మహారాజావారు, పాఠశాల భవన నిర్మాణము నిమిత్తము వీరేశలింగముగారికి గావలసిన ధనమంతయు నిచ్చిరి. ఆభవన నిర్మితికి రమారమి డెబ్బదివేల రూపాయలు కర్చు పడెను. ఆమహాధనమంతయు మహారాజుగారే యిచ్చిరి. వీరేశలింగ ముగారు మిక్కిలి శ్రమపడి 1911 వ సంవత్సరము నాటికి భవనము తయారుచేయించిరి. అందు ప్రవేశ మహోత్సవము జరుపుటకై, కల కత్తాలోని సిటీకాలేజి ప్రిన్సిపాలుగారైన, హేరంబచంద్రమైత్రగారు దయచేసిరి. 1911 వ సంవత్సరము నవంబరు పదునొకండవ తేదీని మైత్రాగారు పాఠశాలను దెరచి ప్రవేశమహోత్సవము నడపిరి. నేల యీనిన విధముగా జనులు వేలకొలది యీసభకు వచ్చిరి. శ్రీ పిఠాపురము మహారాజావారు, మొక్కపాటి సుబ్బారాయుడుగారు, రఘుపతి వేంకటరత్నము నాయుడుగారు నాలోచించి యీ పాఠశాలకు హితకారిణీ పాఠశాలయన్న పేరు దీసివేసి, వీరేశలింగాస్తికోన్నత పాఠశాల యని పేరు పెట్టదలచి, యీవిషయము మైత్రాగారిచేతనే సభలో వెల్లడి చేయించిరి. నాటినుండియు వీరేశలింగోన్నత పాఠశాల యను పేరుతో నది వర్ధిల్లుచున్నది. ఈపాఠశాలా ప్రవేశమహోత్సవముతో నాకేమియు సంబంధము లేకపోయినను మొట్టమొదట నది నా పాఠశాలయగుటచే నానందవశమున నేనింతవరకు వ్రాసితిని. పేరావిధముగ మార్చదలచుకున్నామని సభలో వెల్లడించకమునుపే నాతో రఘుపతి వెంకటరత్నము నాయుడుగారు రహస్యముగా జెప్పిరి.

1912 వ సంవత్సరమున కృష్ణామండల రాజకీయసభయు, సంఘసంస్కరణ సభయు నిడదవోలులో జరిగెను. కొవ్వూరు బసివి

రెడ్డిగారు సభానిర్వహణకు తగిన యేర్పాటుజేసిరి. వీరవాసర గ్రామికుడనగు నేనును, కృష్ణామండల వాసినే గనుక యాసభకు బోతిని. సంఘసంస్కరణసభకు దాసు మాధవరావుగారధ్యక్షులైరి. స్త్రీ పునర్వివాహ విషయమైన తీర్మానము చర్చకు వచ్చినప్పుడు సభలో నొకడు లేచి కొంత గొడవ జేసెను. ఆవిషయమై మాటలాడుమని సభాధ్యక్షులు నన్ను గోరుటచే, నేను లేచి గంభీరమైన యుపన్యాసము జేసితిని. అంతలో నాసభ నిశ్శబ్దముగా నుండెను, ఆసభలకు నాశుకవిత్వ ప్రవీణులైన కొప్పరపు సోదరులు వచ్చిరి. సభలు ముగిసిన తరువాత నొకనాటి రాత్రి కొప్పరపు సోదరుల యాశుకవిత్వ నైపుణి వినవలెనని కొందరు కుతూహలపడి యొక సభ జేసిరి. ఆసభకు నన్నధ్యక్షునిగా నేర్పరచి, యాశుకవిత్వమునకు నేదేని విషయమిమ్మని, నన్ను సభాసదులు కోరిరి. నేను శకుంతలోపాఖ్యానమును నాశువుగ చెప్పవలసినదని వారిని గోరితిని. ఆ సభలో దాసు మాధవరావుగారు, కొమరరాజు లక్ష్మణరావుగారు, వల్లూరి సూర్యనారాయణ రావుగారు, తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు, మొదలగు వారనేకులుండిరి. కొప్పరపు సోదరులు మూడుగంటల కాలములో, మహా వేగముగ, నాలుగు వందల పద్యములు చెప్పిరి. అందు వనవర్ణనలు, పురవర్ణనలు మొదలగునవిగూడ గలవు. ఆ శక్తి యద్భుతశక్తి యనియు, ననన్యసాధ్యమనియు నేను శ్లాఘించి సభ ముగించితిని. ఆమరునాడు నేను రాజమహేంద్రవరము వెళ్ళితిని.

1910, 1911 వ సంవత్సరములలో నేను రెండుమూడు మంచి పనులు చేసితిని. అవి శ్లాఘ్యములైన ఘనకార్యములు గావుకాని, నా మనసున కధి సంతుష్టి కలుగచేయుటచే మంచికార్యములంటిని. నా మిత్రుడైన గోటేటి కనకరాజుగారు, చెన్నపురి దొరతనమువారికి భాషాంతరీకరణ పండితుడయ్యెను. (Translator to the Government of Madras) ఆ దినములు వందేమాతరము దినములు. బంగాళాదేశ విభాగముచేత, దొరతనమువారికి జనులకు సరిపడని దినములు. పత్రికలన్నియు దాదాపుగా దొరతనమువారికి వ్యతిరేకముగానే వ్రాయుచుండెను. అందుచేత దొరతనము వారొక క్రొత్తపక్కి కనిపెట్టిరి. ఒక వార పత్రికకు సంవత్సరమునకు మూడురూపాయలు చందా

యనుకొనుడు. దొరతనమువారే మూడువేల చందాదారులవల్ల వచ్చెడి ధనము, తొమ్మిదివేల రూపాయలు పత్రికాధిపతికిచ్చి పత్రిక పంపించవలసిన వారిపేర్లు తామే యిచ్చెడివారు. ఈ పద్ధతి బంగాళా దేశములో దొరతనమువారు చేయ నారంభించిరి. ఇట్టి పత్రికలో పత్రికాధిపతి దొరతనమువారి కనుకూల సంగతులేగాని విరుద్ధములైన విషయములు వ్రాయగూడదు. ఇట్టి పత్రికకు (Subsidised Paper) యనిపేరు. కనకరాజుగారు నా మీద దయచేత, తాము దొరతనమువారికి వ్రాసి నా "దేశమాత" పత్రికగూడ నటువంటి పత్రికగా జేయింపవలెనని సంకల్పించి, యది నా కిష్టమో కాదో కనుగొనుమని, మోచర్ల సుందరరామయ్యగారితోను, కందుల శ్రీమన్నారాయణగారితోను చెప్పిరట. వారిరువురు వచ్చి నన్నడిగిరి. పత్రిక నట్లు దొరతనము వారికిచ్చుట నాయాత్మ నమ్ముకొనుట యని భావించి, ధనమునకై బానిసగనుండుట కిష్టము లేక, నాకట్టిపని యిష్టము లేదని వారితో చెప్పితిని. "దరిద్రుడవైన నీవు సంవత్సరమునకు గొన్ని వేల రూపాయలు వచ్చెడి యవకాశము జెడగొట్టుకొనుచున్నా"వని నా మిత్రులు నన్ను చీవాట్లు పెట్టిరి. అయినను వారి యుపదేశములు నా తల కెక్కలేదు. పత్రికా విషయమున నేను స్వతంత్రుడనై కఠినముగా విమర్శింపవలసినప్పుడు విమర్శించుట, శ్లాఘింపవలసినప్పుడు శ్లాఘించుట, మొదలైన యధికారములు కలిగియుండవలెను. కాని యెల్లప్పుడు దొరతనమువారిని శ్లాఘించుట నీచమని తలంచి నేనాలాభమును నిరాకరించితిని. రెండవమంచిపని యేమనగా "మాక్మిలన్ కంపెనీ" (Macmillan Company) యని పుస్తకముల వ్యాపారము జేసెడి పెద్ద కంపెనీగలదు. వారి యేజంటు దొరస్వామయ్యంగారు కాబోలు నాకడకువచ్చి, నాలు గైదు ఫారములకు తెనుగువాచకములు వ్రాసి, తమ కంపెనీకీయవలసినదని నన్నడిగిరి. తగిన సొమ్ము నిప్పించెదనని గూడ చెప్పిరి. వారికి నేనిట్లు సమాధానము చెప్పితిని. "ఆంగ్లేయులు మనదేశములోని గనులవలనను టీ, కాఫీలవల్లను, రైలుబండ్లవల్లను మరి యితర సాధనములవల్లను, ధనమంతయు పట్టుకొని పోవుచున్నారు. తెనుగు దేశములో బుట్టి తెనుగు ముక్కలు నాలుగు వ్రాయనేర్చిన మనము, తెనుగు పుస్తకములవల్ల

వచ్చు లాభ మనుభవించకుండ, నదిగూడ నాంగ్లేయులకే యీవ లెనా ? నేనెన్నడు నింగ్లీషు కంపెనీలకు గ్రంథములు వ్రాసి యివ్వను స్వదేశీయు లెవరేని జేరి యొక కంపెనీ పెట్టిన పక్షమున వారికి వ్రాసి యిచ్చెదను. లేదా నాకు నేనే వ్రాసుకొనెదను." ఆ పలుకులు విని మేనేజరు విస్మయపడి యిట్లనెను. "అయ్యా ! ఈవర కెందరినో పుస్తకములువ్రాసి యిమ్మని యడిగితిని, కాని వారు ప్రతిఫల విషయమై షరతులు పెట్టిరిగాని యీ విధముగా నెవ్వరు మాటలాడ లేదు. మీ యభిప్రాయము నాకు వ్యతిరేకమైనను మిక్కిలి మంచిదే" యని పలికి వెడలిపోయెను.

1912 సంవత్సర ప్రాంతమున గుంటూరు, కృష్ణామండలము లలో నాంధ్రదేశాభిమానము మిక్కుటమై ప్రత్యేక మాంధ్రరాష్ట్ర మాంధ్రులకు గావలెనని, గొప్ప యాందోళనము బయలుదేరెను. ఆ యాందోళనములో బనిజేసినవారిలో ముఖ్యులు కొండా వెంకటప్పయ్యగారు, గొల్లపూడి సీతారామయ్యగారు మున్నగువారు, వారితోపాటు ముట్నూరి కృష్ణారావుగారు, వల్లూరి సూర్యనారాయణరావుగారు మున్నగు బందరు నివాసులుగూడ బనిజేసిరి. వీరు దత్తమండలములకును, మరి యితరాంధ్రదేశభాగములకును బోయి, యాంధ్రరాష్ట్రావశ్యకతను గురించి యుపన్యాసము లీయసాగిరి. ఆసందర్భమున శ్రీ కొండా వెంకటప్పయ్యగారు రాజమహేంద్రవరము వచ్చి, మా యింటనే బసచేసి, నన్ను గౌరవించి రెండు దినము లుండి యాంధ్రోద్యమము గురించి టవునుహాలులో నుపన్యసించిరి. వారి యుద్యమ విషయమై రాజమహేంద్రవర పురప్రముఖులప్పుడు దగిన సానుభూతి జూపలేదు. నామట్టుకు వారి యుద్యమము నచ్చినది. ఆంధ్రోద్యమమును గురించి మహాసభ గుంటూరు మండలములో జరుగుననియు దానికి రావలసినదనియు మా పురజనుల నాహ్వానించి వెడలిపోయిరి.

వీరేశలింగముగారి వితంతు శరణాలయములో మంగమ్మ యను నొక వితంతువుండెను. ఆమెను పోతరాజు ప్రకాశరావను వానికిచ్చి పంతులుగారు వివాహముజేసిరి. అతడు వీరేశలింగపాఠశాలలో రెండవ జవ్మాష్టికు మాష్టరుగానుండెను. ఆ దంపతులు వీరే

శలింగముగారి తోటలోనే కాపురముండిరి. ఆమె మిక్కిలి వినయ
విధేయతలు గలిగి, రాజ్యలక్ష్మమ్మగారు చనిపోయిన తరువాత వీరేశ
లింగముగారి యసహాయస్థితిని జూచియు, దగ్గుచే వారు బాధపడు
చుండుట జూచియు, జాలిపడి వీరేశలింగముగారికి తన శక్తికొలది
నుపచారములు చేయుచుండెను. వర్షాకాలమందు వీరేశలింగముగారికి
దగ్గు హెచ్చుగా వచ్చుచుండుటచే, మంగమ్మ రాత్రులు చేతి
మీదనే పండుకొని, వారికి మందులు మొదలగునవిచ్చి, వారికి
శ్వాసకాసలవలన వచ్చు బాధ కొంత శాంతింపజేయుచుండెను.
ఆ కారణమున వీరేశలింగముగారికి మంగమ్మమీద కొంత యభిమా
నము గలిగెను. పితృపుత్రికా సంబంధము గలిగి వీరేశలింగము
గారును మంగమ్మయును మెలగుచున్నను, వితంతు శరణాలయము
లోని కొందరు వితంతువులును, నచ్చటి కొందరు యువకులును
నీర్ష్యగలవారై పంతులుగారి మీదను, మంగమ్మమీదను నపవాద
ములు బుట్టించిరి. అవి గాలివలె పట్టణములోనికిగూడ ప్రాకెను.
"వినినంతనె వేగపడక వివరింపదగున్" యను నీతివాక్యమును
మరచి వినగానే దానిని వేదవాక్కుగా గొందరు విశ్వసించిరి. "గతా
నుగతికో లోకో నలోకః పారమార్థికః" అను సంస్కృతపు సామెత
ననుసరించి నేను మొదట గొంత సంశయించినవాడనై పిమ్మట
బాల్యము నుండియు వీరేశలింగముగారితో గలసి మెలసి పనిచేసిన
రెబ్బాప్రగడ పాపయ్యగారితోను, కనుపర్తి శ్రీరాములుగారితోను,
శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారితోను నేను మాటలాడి నా
సంశయములను దీర్చుకొని, వీరేశలింగముగారి వయసునుబట్టియు,
దేహారోగ్యమునుబట్టియు, నిష్కళంకమైన వారి పూర్వచారిత్రమును
బట్టియు, నటువంటి యపవాదములు విశ్వసింపగూడదనినియు,
నాంధ్రదేశమునకు మహోపకారము జేసిన యా మహనీయునిమీద
దిక్కులేని యవస్థలో నిటువంటి యపవాదములు వేయుట పాప
హేతువనియు, పట్టి కృతఘ్నతయనియు, నిశ్చయించుకొంటిని.
నా మిత్రులైన దామెర్ల వెంకటరమణారావుగారు మొదలగువారు
లోకములోని వాడుకను నమ్మిరి. టంగుటూరి శ్రీరాములుగారు
న్యాయవాదిగానుండి "కార్లిలియన్" యను పక్షపత్రిక నింగ్లీషులో

నావినములలో ప్రకటించుచుండిరి. అందలి విమర్శనములు మిక్కిలి కఠినములై జనుల మనసులకు మిక్కిలి కష్టములు గలిగించుచుండెను. వీరేశలింగముగారిమీఁది యపవాదములు నమ్మి యీ పత్రికగూడ కఠినవిమర్శన వర్షములు గురిపించెను. ఆ పత్రిక న్యాయపతి సుబ్బారావు పంతులుగారిమీఁదను, వీరేశలింగముగారిమీఁదను, మరి యితర పుర ప్రముఖులమీఁదను ధ్వజమెత్తి నిష్ఠుర విమర్శనములు వ్రాయఁజొచ్చెను. నాళము కృష్ణారావుగారు తెనుగున ప్రకటించుచున్న మాసపత్రికలోఁగూడ నిందాగర్భములైన పద్యములు ప్రకటింపఁబడెను. నాళము కృష్ణారావుగారు, వీరేశలింగముగారియెడ నంతకు పూర్వము మిక్కిలి భక్తులై, వారి పేర వీరేశలింగ పుస్తకభాండాగారమని యొక భాండాగారము పెట్టి నడుపుచుండిరి. అట్టివారుగూడ వీరేశలింగముగారిమీఁద ధ్వజమెత్తిరి. పురజనులు బహువిధములుగా నీవిషయమై ప్రసంగింపఁజొచ్చిరి. వీరేశలింగ పాఠశాలలోని యుపాధ్యాయులే గొందరు వారికి వ్యతిరేకముగా ప్రవర్తింపఁ జొచ్చిరి.

1911 వ సంవత్సరమున శ్రీ జయంతి రామయ్య పంతులుగారు చెన్నపురమున ప్రెసిడెన్సీ మేజస్ట్రేటుగా నుండి, యాంధ్రసారస్వతాభివృద్ధికొరకై "ఆంధ్రసాహిత్య పరిషత్తు"ను పేర నొక సంఘము స్థాపించిరి. దానికి శ్రీ వెంకటగిరి మహారాజాగారు, పిఠాపురము మహారాజాగారు, బొబ్బిలి మహారాజుగారు, వుయ్యూరు రాజాగారు మొదలగు మహాపురుషులు ప్రధానపోషకులై, వేలకొలది ధనమును విరాళముగా నిచ్చిరి. ఆ పరిషత్తుయొక్క ప్రథమవార్షికోత్సవము 1912 సంవత్సరమున చెన్నపురిలో జరిగెను. రెండవ వార్షికోత్సవము జయంతి రామయ్య పంతులుగారును, పిఠాపురము మహారాజుగారును, యీస్టరు సెలవులలో రాజమహేంద్రవరమున జరుపదలఁచిరి. వ్యయమంతయు శ్రీ పిఠాపురము మహారాజావారే భరించిరి. సభానిర్వాహణము జయప్రదముగా జరిపించవలసినదని మొక్కపాటి సుబ్బారాయుడుగారు నాపేర వ్రాసిరి. అందుకు నేను వందనపూర్వకముగా నంగీకరించితిని. పిఠాపురము సంస్థానములో బనిచేయుచున్న యొక రెవిన్యూ యినస్పెక్టరును యిద్దరు జవానులను నాకు సహాయమిచ్చిరి. నేను పట్టణములో దిగుటకు జట్కా

బండి నొకదానిని ప్రత్యేకముగా నుంచుకొమ్మనియు, దానిఖర్చు దానే భరింతుమనియు, మొక్కపాటి సుబ్బారాయుడుగారు వ్రాసి వ్రాసిరి. విశాలముగా నుండుటచే వీరేశలింగము పాఠశాలలో సభ జరిపితిమి. పందిళ్ళు, పాకలు, వంటశాలలు మొదలైనవి వేయించి తిమి. కావలసిన సొమ్మంతయు రాజాగారి రెవిన్యూ యినస్పెక్టరు గారే ఖర్చుపెట్టిరి. వీరేశలింగ పాఠశాల ప్రధానోపాధ్యాయులైన ముదిగొండ సీతారామారావుగారును, సహోపాధ్యాయులైన రామా ప్రగడ వెంకటరామయ్యగారును, నాకు ముఖ్యముగా సహా యులై పందిళ్ళు, పాకలు వేయించి. వంటబ్రాహ్మణులను కుదిర్చి, వంటలు చేయించి, యతిథుల కే గౌరవము లోటులేకుండ జరిపిం చిరి. ఆ సభకు జయంతి రామయ్య పంతులుగారును, నెల్లూరుజిల్లా కలెక్టరుగారైన తల్ల రాఘవయ్యగారును, కొచ్చిను సంస్థానప్రుమంత్రి యైన నెమలి పట్టాభిరామారావుగారును, సెటిలుమెంటు డిపార్టుమెం టులో గొప్ప పదవిలోనున్న ముట్నూరి యాదినారాయణయ్య గారును, వావిలాల వెంకట శివావధానులుగారును, శ్రీ పానుగంటి రామారాయణంగారును, వావిలికొలను సుబ్బారావుగారును, స్వయం పాకియైన వీరభద్ర పాకయాజిగారును మున్నగువా రనేకులు వచ్చిరి. సభ రెండుదినములు జరిగెను. వీరేశలింగము స్కూలు మేడమీద పెద్దహాలులో సభజరిగెను. వావిలాల శివావధానులుగారు ప్రార్థన ములతో సభను ప్రారంభించిరి. శ్రీపానుగంటి రామారాయణంగారు సభ కధ్యక్షత వహించిరి. రెండవదినమున శ్రీ కొక్కొండ వెంకట రత్నము పంతులుగా రధ్యక్షతవహించిరి. దివాకర్ల తిరుపతిశాస్త్రి గారు దేనుగు వాఙ్మయమును గురించి కొన్ని చక్కని పద్యములు చదివిరి. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు మొదలగు పండితు లుప న్యసించిరి. సభ ముగిసినతరువాత రెండవనాడు రాత్రి సభకువచ్చిన యతిథుల వినోదార్థమై రాంజీరావను నతనిచేత వినోదప్రదర్శనము (Magic) జేయించితిని. అది చాల బాగుండెనని ప్రేక్షకులు సంతో షించిరి. వాని కేమైన బహుమతి నిచ్చిన బాగుండునని, సుబ్బారా యుడుగారిపేర వ్రాయగ, వారు రాంజీరావున కిమ్మని పదునైదు రూపాయలు నావద్దకు బంపగా, వానికి నేనవి వెంటనే యిచ్చివేసి

తిని. సభ యన్ని విధముల జయప్రదముగ బరిగినదని జయంతి రామ
య్యగారు సంతోషించిరి. పెత్తనము నామీద పెట్టినందుకు, సభ
నిరంతరాయముగా జరిగినందుకు, నేను ధన్యుడనని సంతోషించితిని.
ఈ సభ 1913 సంవత్సరములో జరిగెను. 1914 వ సంవత్సరములో
నీసభ కాకినాడలో జరుగునట్లు నిశ్చయింపబడెను.

1913 వ సంవత్సరము మే నెలలో మొట్టమొదట యాంధ్ర
మహాసభ, గౌరవనీయులైన బయ్యా నరసింహేశ్వరశర్మగారి యాధి
పత్యమున బాపట్లలో జరిగెను. నేనాసభకు బోయితిని. నాటియాం
ధ్రుల యుత్సాహము నందున ముఖ్యముగా గుంటూరు మండల
వాసుల యుత్సాహమును వర్ణనాతీతము. కొండా వెంకటప్పయ్య
గారు, శనగపల్లి రామస్వామిగుప్తగారు, గొల్లపూడి సీతారామయ్య
గారు మున్నగు దేశభక్తులు, సభాదినమున ప్రాతఃకాలమున స్నాన
ములు చేసి, పట్టువస్త్రములు ధరించి నూరంతయు భజనలు చేయుచు
నూరేగివచ్చి ప్రార్థనలతో సభను ప్రారంభించిరి. సభ రెండు దిన
ములు మిక్కిలి యుత్సాహముతో జరిగెను. రెండవనాడు పవిత్రమైన
యాంధ్రోద్యమమునకు, ధనసహాయముచేయుడని హెచ్చరించుచు,
నే నుపన్యసించితిని. ఆ దినములలో రైలుబండ్లు నడుపువారు కట్టు
కట్టుటచేత బండ్లు సరిగా వచ్చుటలేదు. మూడవనాడు మేము రైలు
స్టేషనులో . నెంతో సేపు కనిపెట్టుకొని యుండగా, ననుభవములేని
క్రొత్తపనివాండ్రు నడుపుచున్న రైలుబండ్లు వచ్చెను. క్రొత్తవారు
నడుపునపు డేమి ప్రమాదము సంభవించునోయను భయముతో
బండినెక్కి, ప్రాణము లరచేతబెట్టుకొని, యెట్టకేలకు మధ్యాహ్నము
నకు రాజమహేంద్రవరము జేరితిమి.

ఆ సంవత్సరము గోదావరీ మండలసభ మరల నుద్ధరింపబడి,
మొదటిసారి కాకినాడలో జరిగెను. దానిని దుగ్గిరాల సూర్యప్రకాశ
రావుగారు పునరుద్ధరించిరి. రాజకీయసభకు గౌరవనీయులైన వి. శ్రీని
వాసశాస్త్రిగా రధ్యక్షత వహించిరి. సంఘ సంస్కరణసభకు బరం
పురము నివాసులైన కోపర్గాము రామమూర్తిగా రధ్యక్షులైరి. నేను
కాకినాడ బోయి యా రెండుసభలలో పాల్గొంటిని. ఆదినములలో
పిఠాపురము మహారాజావారు తెనుగులో సరసమైన పద్యకావ్య

ములు వ్రాసినవారికి బహుమానముల నిచ్చెదమని ప్రకటించిరి. కొన్ని కావ్యము లేటేట వచ్చుచుండెను. ఆ కావ్యములను పరీక్షించుటకు కందుకూరి వీరేశలింగముగారిని, శ్రీ పానుగంటి రామారాయణంగారిని, నన్ను నేర్పరచిరి. మొదట వీరేశలింగముగారికడకు పంపబడుచుండెను. వారు చూచినతరువాత నాకడకు బంపుచుండిరి. నేను చదివినపిమ్మట శ్రీ పానుగంటి రామారాయణంగారికి బంపుచుంటిని. మా ముగ్గురిలో నిద్దరు బాగున్నదని యొప్పుకున్న కావ్యమునకు బహుమతి యొసంగబడుచుండెను. సరసములైన కావ్యములు రాకపోవుటచే క్రమముగా నా పద్ధతి విరమింపబడెను. ఆ సంవత్సరము జూలైలో కందుకూరి వీరేశలింగముగారు తెనుగులో నొక వ్యాసము వ్రాసి, ప్రకటనార్థము నా "దేశమాత" పత్రికకు బంపిరి. దానిని నేను ప్రకటించితిని. ఆ వ్యాసము తన్నుగూర్చి వ్రాసినట్లును, తన ప్రతిష్ఠ కది భంగకరముగా నున్నట్లును దలంచి, టంగుటూరి శ్రీరాములుగారు వీరేశలింగముగారిమీద, జాయింటు మేజస్ట్రీటు నొద్ద పరువునష్టమున కభియోగము (Defamation) తెచ్చిరి. అప్పుడు రాజమహేంద్రవరములో తాడికొండ శీతారామయ్యగారు జాయింటు మేజస్ట్రీటుగా నుండిరి. ఆయనే యీ యభియోగము విచారించిరి. వీరేశలింగముగారి పక్షమున ధారవాడ కృష్ణారావు పంతులుగారును, కనుపర్తి శ్రీరాములుగారును, న్యాయవాదులుగ బనిచేసిరి. టంగుటూరి శ్రీరాములుగారు తన పక్షమున నన్నుగూడ సాక్షిగా వేసికొనిరి. వీరేశలింగముగారు నిర్దోషియని నేను నమ్మువాడననియు నా సాక్ష్యమువలన తమ కేమియు ప్రయోజనము లేదనియు, నేను స్వయముగా శ్రీరాములుగారితో చెప్పితిని. ఇతరులచేతగూడ చెప్పించితిని. అయినను వారు నన్ను విడువలేదు. శ్రీరాములుగారి పక్షమున దామెర్ల వెంకటరమణరావుగారు, చిలుకూరి వీరభద్రరావుగారు మొదలగువారు సాక్ష్యమిచ్చిరి. ఆ సాక్ష్యములు వీరేశలింగముగారికి వ్యతిరేకముగా నుండెను. నా సాక్ష్యము వీరేశలింగముగారి కనుకూలముగా నుండెను. జాయింటు మేజస్ట్రీటుగారా యభియోగమును విచారించి కొట్టివేసిరి. వీరేశలింగముగారు నిర్దోషియని తీర్పులో వ్రాసిరి.

ఆ సంవత్సర మనగా 1913 వ సంవత్సరములో చెన్నపురి గవర్నరుగారి కార్యనిర్వాహకవర్గములో సభ్యులైన, సర్. పి. యస్. శివస్వామయ్యగారు రాజమహేంద్రవరము వచ్చిరి. మా పట్టణమునకు కావలసిన కొన్ని మార్పులను వారియొద్ద విన్నవించుకొనుట కొక విజ్ఞాపనసంఘము (Deputation) యేర్పడెను. ఆ సంఘమునకు న్యాయపతి సుబ్బారావు పంతులుగా రధ్యక్షులు. అనేక పురప్రముఖులందు సభ్యులుగా నుండిరి. నేనుగూడ నం దొక సభ్యుడను. బజారు (Main Road) వెడల్పు చేయుమని నే మందరము వారిని గోరితిమి. పదిలక్షల రూపాయలు దానికి వ్యయమగుననియు, నది యిప్పుడు సాధ్యముగాదనియు చెప్పిరి. నీటికుళాయిలు త్వరగ నేర్పాటుచేయుంతుమని వారు చెప్పిరి. పిమ్మట వీరేశలింగముగారు, టంగుటూరి శ్రీరాములుగారిమీదను, నాళము కృష్ణారావుగారిమీదను, సత్యనోలు అప్పారావుగారిమీదను, నప్పుడు రాజమహేంద్రవరములో జాయింటు మేజస్ట్రీటుగానున్న "బ్రాక్సు వెల్సు" దొరగారియొద్ద పరువునష్టమున కభియోగము దెచ్చిరి. ఏలూరునుండి మోచర్ల రామచంద్రరావుగారు వచ్చి రాజీకి ప్రయత్నముచేయగా, నాళము కృష్ణారావుగారు వారి సలహా వినలేదు. అంతట జాయింటు మేజస్ట్రీటుగారు కేసు విచారణచేసి వీరి ముగ్గురిమీదను నేరస్థాపన (Charge) చేసి, యుత్తర సాక్ష్యము దెచ్చుకొమ్మనిరి. అప్పుడు నాళము కృష్ణారావుగారును, సత్యనోలు అప్పారావుగారును వీరేశలింగముగారికి క్షమార్పణలిచ్చిరి. శ్రీరాములుగారిమీది యభియోగము జరుగుచునే యుండెను. అంతట "బ్రాక్సు వెల్సు" దొరగారు బదిలీకాగా వారిస్థానే "స్టీవార్టు" దొరగారు వచ్చిరి. మొదటినుండియు విచారణ చేయుమని శ్రీరాములుగారు కోరిరి. శ్రీరాములుగారి పక్షమున వారి యన్నగారైన ప్రకాశముగారు వచ్చి వాదించిరి. స్టీవార్టు దొరగారు వీరేశలింగముగారి సాక్ష్యమొక్కటే పుచ్చుకొని కేసు కొట్టివేసిరి.

1914 వ సంవత్సరములో రెండవ గోదావరీమండల సభ రాజమహేంద్రవరములో జరిగెను. దానికి మహారాజశ్రీ మోచర్ల రామచంద్రరావు పంతులుగా రధ్యక్షులైరి. ఆదిపూడి సోమనాథ

రావుగారు సంఘసంస్కరణసభ కధ్యక్షులైరి. ఆ రెండు సభలలో గూడ నేను పాలుగొంటిని. అవి జయప్రదముగానే జరిగెను.

రెండవ యాంధ్రమహాసభ 1914 వ సంవత్సరములోనే బెజవాడలో జరిగెను. దానికి న్యాయపతి సుబ్బారావుపంతులుగా రధ్యక్షులైరి. నే నాసభకు బోయి ప్రాచీనాంధ్రకవులను గురించి మాటలాడితిని. రాజమహేంద్రవరమునుండి వెళ్ళిన ప్రతినిధులు దాసు కేశవరావుగారి యింట బసచేసిరి. కేశవరావుగారు వారి సోదరులును మమ్ము మిక్కిలి యాదరించిరి. ఆ సంవత్సర మకాలవర్షము లెక్కువగ గురిసినందున సభకై యేర్పడిన శాలలో ప్రతినిధులు నిలుచుటకు వీలులేకపోయెను. సభాసదులు నిలువున నీరయిపోయిరి. ఆ ప్రళయవర్షములచేత సభలు దిన్నగ జరుగలేదు. పదిమంది జేరి యొల్లో సభ యైనదనిపించినారు. ఆ దినములలోనే సకలాంధ్రమండల గ్రంథాలయ మహాసభ బెజవాడ టవునుహాలులో జరిగెను. ఆ సభకు న న్నధ్యక్షునిగ సభాసన్నాహకు లేర్పరచిరి. ఆనాడు నా యుపన్యాసము మిక్కిలి బాగున్నదని సభాసదులు గొనియాడిరి. అది గ్రంధాలయ సర్వస్వపత్రికలో ప్రకటింపబడెను. అట్టి యుపన్యాసము స్థిరముగ నుండవలెనని తలంచి ప్రత్యేకపుస్తకముగాగూడ నచ్చువేసిరి. 1914 వ సంవత్సరము జూను నెలలో గుంటూరు మండలసభలు వంగవోలులో జరిగెను. రాజకీయసభకు శ్రీ వింజమూరి భావనాచార్యులుగా రధ్యక్షులైరి. సంఘసంస్కరణసభ కధ్యక్షుడుగా స న్నాహ్వానించిరి. నేనును, నా మిత్రులైన చెరువు సోమయాజులుగారును, రాయవరపు రామమూర్తిగారును గలసివెళ్ళి వంగవోలులో మైనముపాటి నరసింహముగారి యింట బసచేసితిమి. రెండు సభలును చక్కగానే జరిగెను. ఆ సంవత్సరమున నాకు శ్రీ పిఠాపురము మహారాజావారు నా యప్పులు దీర్చుకొనుటకు సహజమైన యౌదార్యముతో, నా కారువేలరూపాయిలు నోటుమీద బదులిచ్చిరి దానితో గొన్ని యప్పులు దీర్చుకొంటిని. అదిగాక యవసరమైన గొన్నిపుస్తకము లచ్చువేయించుటకై మరి పదునైదువందల రూపాయిలు, మరియొక నోటుమీద బదులిచ్చిరి. ఆ సంవత్సరము మొత్తముమీద నాకు రాజాగారు యేడువేల నైదువందల రూపా

యిలు బదులిచ్చిరి. ఆసొమ్ము వారు నా దగ్గర తిరిగి పుచ్చుకొనలేదు. ఇదిగాక మహారాజాగారు పలుమారులు నా పాలిటి చింతామణియై, కల్పవృక్షమై నా కవసరమైనపుడెల్ల వేలకొలది రూపాయిల నిచ్చి నా చిక్కులు బాపి నన్నుద్ధరించిరి. ఇంతకు వారి నిర్హేతుకజాయమానకటాక్షమేగాని, వారికి నేను జేసిన సేవగాని, యుపకారముగాని లేదు. భగవంతుడు వారిలో ప్రవేశించి యసమర్థుడను, వృద్ధుడనునైన నాకు వారిచేత బహూళోపకారములు చేయించెను. మహారాజావారి యౌదార్యమును నే నెన్నటికిని మరువలేను.

1914వ సంవత్సరమున చెన్నపురి గవర్నరుగానుండిన "పెంట్లండు" ప్రభువుగారు రాజమహేంద్రవరము వచ్చిరి. న్యాయపతి సుబ్బారావు పంతులుగారు వారిని దర్శింపగా గవర్నరుగారు ప్రసంగవశమున నీపట్టణమున నంధుడైన కవి యున్నాడట బాగున్నాడాయని యడిగిరట. ఆ వార్త సుబ్బారావు పంతులుగారు టవునుహాలులో నాతోను నామిత్రులతోను చెప్పిరి. నా విషయమై గవర్నరుగారి కెట్లు దెలిసెనని నా మిత్రు లాలోచింప నారంభించిరి. రాజకీయములలో మిక్కిలి తీవ్రములైన యుపన్యాసములిచ్చుటచే పోలీసువారి రిపోర్టులవల్ల దెలిసెనని, కొందరూహించిరి. అదిగాదని కొంద రనిరి.

ఆ సంవత్సరము దెనుగులో గ్రామ్యభాష నుపయోగింపవలెనా గ్రాంథికభాష నుపయోగింపవలెనా యన్న సమస్య మిక్కిలి తీవ్రముగ నుండెను. పిఠాపురము మహారాజావారు గ్రాంథికభాషాభిమానులు. విశాఖపట్టణము వ్యావహారిక భాషా దురంధరుల కాటపట్టు. అక్కడకు వెళ్ళి గ్రాంథిక భాషనుగురించి గట్టి యుపన్యాసము లీయవలసినదని మహారాజావారు ఖర్చులిచ్చి నన్ను, పురాణపండ మల్లయశాస్త్రిగారిని, పానుగంటి లక్ష్మీనరసింహరావుగారిని, కూచి నరసింహముగారిని బంపిరి. అక్కడ భాషావిషయమై గొప్పసభ జరిగెను. గ్రాంథిక భాషావిషయమై మాటలాడుమని నాతో వచ్చినవారు నన్నే వేదిక నెక్కించిరి. నేనొక గంటసేపు నాకు దోచిన యుక్తులు జెప్పి ప్రమాణములు జూపి గ్రాంథికభాషా పారిశస్త్యమును బలపరచుచు నుపన్యసించితిని. ఉపన్యాస మెట్లున్నదో చెప్పజాలనుగాని, నా మనసునకు మిక్కిలి సంతుష్టిగానుండెను. ఆంధ్రసాహిత్య

పరిషత్సభ యీసంవత్సరము (1914) కాకినాడలో జరిగెను. ఆసభకు నేనును బోయితిని. ప్రథమ దినమున కిడాంబి రామానుజాచార్యులుగారు అధ్యక్షత వహించిరి. రెండవనాడు శ్రీ పిఠాపురము మహారాజావారు అధ్యక్షత వహించిరి. ఆసభలో నే నేమియు మాటాడలేదు. బళ్ళారినుండి యీసభకు ప్రతినిధిగ వచ్చిన శంకరలింగము పిళ్ళగారు మరుసటి సంవత్సర మీపరిషను బళ్ళారి రావలసినదని యాహ్వానించిరి.

కర్నూలు మండలమున నందియాలయను నొక చిన్న పట్టణము గలదు. అక్కడ దేశపాండ్య సుబ్బారావుగారని యొక దేశాభిమాని యుండిరి. ఆయనయు నేనును ననేక సభలలో గలిసికొంటిమి. ఒకసారి యాయన నాతో నిట్లనిరి. ''మాపట్టణములో నొకసంఘము గలదు. మేము దానికి వార్షికోత్సవము చేయదలచుకొన్నాము. ఆ సభకు మోచర్ల రామచంద్రరావుగా రధ్యక్షులుగను మీరుపన్యాసకులుగను రావలయును. మీకిద్దరకు ననుకూలమైన సమయములోనే సభ పెట్టుకొందుము'' అందుకు నేనొప్పుకొంటిని. కాని నందియాల వెళ్ళుటకు రామచంద్రరావుగారికిని నాకును నొక్కసమయముకుదురలేదు. కొన్ని మాసములు గడచెను. తుదకు దేశపాండ్య సుబ్బారావుగారు 1914 డిశంబరు మూడవవారములో సభ నేర్పాటుచేసి, యెట్లయినను వీలుచేసుకొని రమ్మని, నాకును రామచంద్రరావుగారికిని వ్రాసిరి. వారి కోరిక ననుసరించి మే మిరువురమును నందియాల వెళ్ళితిమి. అప్పుడు నా సమాప్తుడైన రామరాజు వెంకటరమణశర్మ నాతో వచ్చెను. నందియాలలో వార్షికోత్సవసభ చక్కగా జరిగెను. వారి కోరిక ప్రకారము రామచంద్రరావుగా రధ్యక్షులైరి. నేనుపన్యాసించితిని. దేశపాండ్య సుబ్బారావుగారు మిక్కిలి సంతోషించిరి. రామచంద్రరావుగారును నేనును స్వస్థలములకు వచ్చుటకై బయలుదేరితిమి. అప్పుడు నేను రైలుబండిలో రామచంద్రరావుగారి నిట్లడిగితిని. "అయ్యా! గవర్నరుగారు రాజమహేంద్రవరము వచ్చినప్పుడు నా విషయమై సుబ్బారావుపంతులుగారి నడిగిరట. యెందుకై యుండును? రాజకీయములలో నే నిచ్చిన యుపన్యాసములను బట్టి పోలీసువారు నామీదచేసిన రిపోర్టులు జ్ఞాపకముండుటచేత గవర్నరుగారు

నన్నడిగిరని గొందరనిరి. ఇదినిజమా ?" అందుకు రామచంద్రరావుగారిట్లనిరి. గవర్నరుగారు మీపేరు జ్ఞాపకముంచుకొనుట కది కారణముగాదు. పాఠశాలలలో గ్రామ్యభాష నుపయోగింపవలెనా, గ్రాంథికభాష నుపయోగింపవలెనా యను సమస్య వచ్చినప్పుడు, బయ్యా నరసింహేశ్వరశర్మగారో నేనో, గవర్నరుగారితో సిట్లంటిమి. "రాజమహేంద్రవరములో కందుకూరి వీరేశలింగముగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారను సంఘకవియు గలరు. వారి తెనుగు శైలి సరసముగా నుండును. వారిశైలి నవలంబించుట మంచిది." అట్లు మేము చెప్పుటచేత గవర్నరుగారికి మీపేరు జ్ఞాపక ముండియుండును గాని పోలీసువారి రిపోర్టులవల్లగాదు. ఆ పలుకులు విన్న తరువాత నాకు నిజమైన కారణము తెలిసెను.

---

# స్వీయచరిత్రము

ఏ బ నె ని మి ద వ ప్ర క ర ణ ము

## దేశీయ మహాసభ నిమిత్తము చెన్నపురి ప్రయాణము

ఆ సంవత్సరము (1914) జాతీయమహాసభ (Indian National Congress) చెన్నపురిలో జరుగుట కేర్పాటుచేయబడెను. కలకత్తా నివాసులైన భూపేంద్రనాథబోసుగా రధ్యక్షులైరి. సుబ్బారావు పంతులుగారు మోచర్ల రామచంద్రరావుగారు మొదలైనవారు వెళ్ళిరి. నేనును నా మిత్రులును గూడ నాసభకు వెళ్ళితిమి. ఆ దినములలోనే యావద్భారతఖండాస్తిక మహాసభ చెన్నపురిలో జరిగెను. హేరంబ మైత్రిగారు దాని కధ్యక్షులైరి. నారాయణగణేశ చందావర్కరుగారు, హేమచంద్రసర్కారుగారు, కృష్ణకుమార మైత్రిగారు మున్నగు ప్రముఖులా యాస్తికసభకు వచ్చిరి. వారి యుపన్యాసము లతిమనోహరములై యుండెను. ఆసభలు ప్రతిదినము నాలుగుగంటలకు జరుగుచుండెను. నేను తప్పక వాటికి ప్రతిదినము వెళ్ళుచుంటిని. ఒకనాడుదయమున, నన్నపిళ్లెపేటలోనున్న ప్రార్థనామందిరములో, శ్రీకృష్ణకుమార మైత్రిగా రుపాసన జేసిరి. తెల్లని గడ్డముతో నాయన మహర్షివలె నుండిరి. ఆయన యుపాసనవిని నేను ధన్యుడనైతిని. చందావర్కరుగారి యుపన్యాసములు గంభీరములై హృదయంగమములుగ నుండెను. ఆస్తికసభానంతరమున నొకనాటి రాత్రి ప్రీతిభోజనము జరిగెను. నన్ను గూడ వారాహ్వానించిరి. నేను వెళ్ళి కూరుచుండి నాప్రక్కస్థానములో నెవరుకూర్చుండిరని యడిగితిని. "నేను మీ మిత్రుడను చందావర్కరును" (I am your friend Chandavarkar) అని నాకు చందావర్కరుగారు జవాబు చెప్పిరి.

ఆ కాంగ్రెసు జరుగుచున్న దినములలోనే యాండ్రెసను హాలులో నిమ్నజాతుల యుద్ధరణమును గురించి యొక సభ జరిగెను. ఆ సభ 1914 వ సంవత్సరము డిశంబరు నెల ముప్పదియవ తేదీని జరిగెను. ఆ సభకు బొంబాయి హైకోర్టు న్యాయమూర్తియైన, నారాయణగణేశ చందావర్కరుగా రధ్యక్షులైరి. చెన్నపురి హైకోర్టు న్యాయమూర్తియైన శంకరనాయరుగారు వారి ప్రక్కనే కూరుచుం

డిరి. చెన్నపురి రాజధానిలో నిమ్నజాతుల గురించి యెవ్వరెవ్వ రెచ్చట నేవిధముగా బనిచేయుచున్నారో తెలిసికొనుటకై యీసభ జరిగెను. మళయాళ దేశస్థుడైన నా మిత్రుడొకడు, నేను గూడ నిమ్నజాతులను గురించి పనిచేయుచున్నానని విని, నన్ను గూడ సభలో మాటలాడుమని ప్రోత్సాహపరచెను. నేనా సభకు బోయి తిని. మంగుళూరులో రంగారావుగారును, నితరస్థలములలో పనిచేసిన యితరులును, వారి వారి యనుభవములను చెప్పిరి. నేను గూడ యుపన్యాసవేదిక నెక్కి 1909 లో నేను పంచములకు పాఠశాల పెట్టి నది మొదలుకొని, యప్పటివరకు నా యనుభవముల నింగ్లీషులో నిరు వదినిముషములు చెప్పితిని. చిట్టచివర నేనిట్లంటిని. ("I am a blind man I did this little work I could not do more" (నేను అంధుడను, కొలదిగా కృషిచేసితిని. ఇంతకంటె చేయలేకపోతిని.) అని చెప్పి వేదికనుండి దిగబోవుచుండగా, చందావర్కారుగారు లేచి నా చేయి పట్టుకొని (Shake hand Mr. Narasimham! You are not blind, we are all blind (నరసింహముగారూ! మీరు అంధులుకారు! వాస్త వంలో మేమే గ్రుడ్డివాండ్రము) అని పలికిరి. నేను వేదికదిగి నా స్థానమున గూర్చుంటిని. న్యాయపతి సుబ్బారావు పంతులుగారును, మోచర్ల రామచంద్రరావుగారును చెన్నపురిలో కాస్మపోలిటను క్లబ్బులో బసజేసిరి. నేను వారిద్దరిని చూడబోయి యిట్లంటిని. "గవ ర్నరుగారు రాజమహేంద్రవరము వచ్చినప్పుడు నన్ను దలపెట్టిరి కావున నేను వారి దర్శనము చేసిన బాగుండునా?" యని యడిగి తిని. తప్పక చూడవలసినదే యని వారిరువురును పలికిరి. ఆ సమా వేశము మీరే యేర్పాటుచేయుడని వారిని గోరితిని. వెంటనే రామ చంద్రరావుగారు నాకు గవర్నరుగారితో సమావేశము నేర్పాటు చేయుమని గవర్నరుగారి యాంతరంగిక కార్యదర్శియైన కాటెరెల్ (Cotteral) దొరగారిపేర వ్రాసిరి. వారు డిశంబరు ముప్పదియొకటవ తేదీని మధ్యాహ్నము 12 గంటలకు, నాకు గవర్నరుగారు దర్శన మిచ్చునట్లేర్పాటుచేసి, యీ సంగతి రామచంద్రరావుగారికి దెలియ పరచిరి. రామచంద్రరావుగారు నాకు చెప్పిరి.

డిశంబరు ముప్పదియొకటవ తేదీని, రావుసాహేబు గంటి వెంకటారామయ్యగారు, కాంగ్రెసునకు వచ్చిన రాజమహేంద్రవర మిత్రులకు విందుచేయఁదలచి, నన్నును బిలిచిరి. చెరువు సోమయాజులుగారును నేనును యాదినమున తొమ్మిదిగంటలకే వారియింట నుంటిమి. వెంకటారామయ్యగారేదో పనిమీఁద, వెవటికోబోయి పదునొకండు గంటలవరకు రాలేదు. గవర్నరుగారి దర్శన సమయము దాటిపోవునేమోయని భయపడి, సోమయాజులుగారిని దీసికొని, ప్రక్కనేయున్న బయ్యా నరసింహేశ్వర శర్మగారింటికి వెళ్ళి వారికీ సీవిషయము చెప్పితిని. "మాయింట భోజనము చేసెన పక్షమున నా మోటారుమీఁద గవర్నరుగారి దర్శనమునకు బంపెద"నని శర్మగారు పట్టుబట్టిరి. నేనొప్పుకొని వారింట భోజనము చేసితిని. భోజనానంతరమున నరసింహేశ్వరశర్మగారు మోటారు నిమిత్తముచూడఁగా దానిని నడుపునతఁడు (Driver) ముందుగ చెప్పకబోవుటచే, నింటికి బోయెను. అప్పుడు కాలాతీతమగుచున్నదని నేను తొందరపడుచుండఁగా, గంటి వెంకట్రామయ్యగారువచ్చి, బండినేర్పాటుచేయుదునని మాతో చెప్పి. యాసమయమున నా వీధి వెంబడి గుఱ్ఱపుబండిమీఁద బోవుచున్న టి. రామచంద్రయ్యరుగారి తమ్ముఁడైన టి. కృష్ణస్వామయ్యరుగారి బండినాపి, యీ విషయమంతయుజెప్పి, తమబండి నెకు పీయుమని కోరిరి. ఆయన వెంటనే బండిదిగి దానిని మాకిచ్చిరి. సోమయాజులుగారిని వెంటబెట్టుకొని బండియెక్కితిని. ఆ గుఱ్ఱము మిక్కిలి చురుకైనది. అప్పటికి 11 గంటల 30 నిమిషములయినది. మాబండి గవర్నరుగారి బసకు పోవునప్పటికి పదినిమిషములు తక్కువగా 12 గంటలయ్యెను. మారాక గవర్నరుగారికి తెలియఁపరచుమని క్రిందనున్న గుమాస్తాలతో చెప్పితిని. వారు వెంటనే చీటివ్రాసి పైకి బంపిరి. అనంతరమున గవర్నరుగారి యంగరక్షకుఁడైన యొక దొర నాకడకువచ్చి, నన్ను మేడమీఁదకు దీసికొనివెళ్ళి, యొక సోఫామీఁద గూర్చుండఁబెట్టెను. అవ్వల గవర్నరుగారైన పెంట్లాండు ప్రభువుగారు వచ్చి నాతో కరస్పర్శనముచేసి, నాప్రక్కను గూర్చుండి నాతో మాటలాడ నారంభించిరి. ఆ ప్రసంగములో నా కంటిబబ్బును గురించి యడిగి, నేను నిమ్నజాతులకొరకు బనిచేయుచున్నట్లదివరకే

విన్నారుగనుక దూని విషయమై కొంత ముచ్చటించి, పిమ్మట గ్రామ్య గ్రాంథికభాషా విషయమెత్తి యావిషయమై గవర్నమెంటువారి యుత్తరువులు త్వరలోనే పడుననిచెప్పి సంభాషణలు ముగించి లోనికి బోయి, యొక యింగ్లీషు పుస్తకము దెచ్చి యది నాకిచ్చి యిట్లనిరి. "ఇది యమెరికా దేశస్థురాలైన నొక గ్రుడ్డి మూగ స్త్రీ వ్రాసిన గ్రంథము. దీనిపేరు "ఆప్టిమిజం" (Optimism) ఆమె గొప్ప గ్రంథ కర్త్రి. మన సమావేశము జ్ఞాపకముండుటకు మీకు నేనీపుస్తకము బహుమతిగ నిచ్చుచున్నాను" అని చెప్పి నాకు సెలవిచ్చిరి. అంగ రక్షకుడు నన్నెప్పటియట్ల క్రిందికి గొంపోయి బండి నెక్కించెను. సోమయాజులుగారును నేనును జరిగిన వృత్తాంతమును నరసింహేశ్వర శర్మగారికిని, మిత్రులకును జెప్పి, యచటనుండి జాతీయమహాసభకు బోయి న్యాపతి సుబ్బారావు పంతులుగారిని గలుసుకొని కాంగ్రెసులో మాటలాడవలెనని కుతూహలముగా నున్నది. ఏర్పాటు చేయ గలరాయని యడిగితిని. అట్లేయని వారు సభాధ్యక్షునితో మాట లాడి, దక్షిణాఫ్రికాను గురించిన తీర్మానమును బలపరచుటకై నా పే రుపన్యాసకులపట్టికలో వేయించిరి. ఆ తీర్మానమును బంగాళాదేశ స్థుడు గట్టిగా నింగ్లీషులో ప్రతిపాదించెను. తెనుగున నేను బలపర చితిని. ఆదినము సభలో రమారమి పదివేలమంది యుండిరి. తెనుగు దెలిసినవారు రమారమి నాలుగైదువేలుందురు. నేనుచ్చరించిన ప్రతివాక్యమునకు సభాసదులు సంతోషించి చప్పట్లు గొట్టిరి. నా కంఠధ్వని యన్నిప్రక్కలకు వినబడెను. పదినిముషములు మాటలాడి వేదికదిగి, యాదినముననూడ నిమ్నజాతుల విషయమై యాంధ్రసను హాలులో సభ జరుగునని విని, చెరువు సోమయాజులుగారిని, రాయ వరపు రామమూర్తిని, వెంటబెట్టుకొని యచటకు బోయితిని. ఆదిన మున గవర్నరుగా రాసభ కధ్యక్షులు. నే మువన్యాసవేదిక ప్రక్కనే కూరుచుంటిమి. గవర్నరుగారు వేదిక నెక్కి ప్రక్కనున్న నన్నుజూచి "Hallow! Mr Narasimham, you are here" (హాలో! నరసింహం గారూ మీ రిక్కడున్నారా?) అని వంగి నాకు కరస్పర్శనమిచ్చి, "He is also working for the depressed classes" (ఈయన కూడ నిమ్నజాతులకై కృషి చేయుచున్నారు) యని శంకరునాయరుగారితో

జెప్పిరి. 'ఔను నే నెరుగుదుమనని' శంకరనారాయణగారు బదులు జెప్పిరి. కొన్ని యుపన్యాసము లైనతరువాత సభ ముగిసెను. ఆ మరునాడు 1915 వ సంవత్సరము జనవరి యొకటవ తేది టంగుటూరి ప్రకాశముగారు తమ మిత్రులమైన మా కందరకు విందు జేసిరి. పిమ్మట రెండుమూడు దినములలో చెన్నపురినుండి బయలుదేరి రాజమహేంద్రవరము వచ్చితిమి.

1915 వ సంవత్సరమున నాంధ్రసాహిత్యపరిషత్సభ బళ్లారిలో జరుగుటకు నిశ్చయింపబడినదని యిదివరకే వ్రాసితిని. ఆంధ్రనాటక పితామహుడని పేరుపొందిన ధర్మవరము రామకృష్ణమాచార్యులవారి పేర, బళ్ళారిలో నొకభవనమును గట్టించి, దానిని దెరుచుటకు నన్ను రమ్మని బళ్ళారి పురజనులు ఫిబ్రవరి నెలలో నాహ్వానించిరి. సాహిత్య పరిషత్సభ యేప్రియలు నెలలో జరుగునుగాన నప్పుడువచ్చి యీ పనిచేయుదునని వారికి వ్రాసితిని. వారాపనియంతవరకు నిలుపుచేసిరి. సాహిత్యపరిషత్సభ నిమిత్తము రాజమహేంద్రవరమునుండి నేనును, రాయసంవరపు రామమూర్తియు, గంటి వరహాలును వెంటబెట్టుకొని వెళ్ళితిమి. మాతో బాటు శ్రీరామ నరసింహారావుగారు గూడ వచ్చిరి. గుంటూరు మొదలుకొని గుంటకల్లు వరకును త్రోవలో మాకు విందులుజరిగెను. నరసారావుపేటలో జిల్లామునసబుగానున్న తంజావూరు జగన్నాథరావుగారు మాకు నరసారావుపేట రైల్వే స్టేషనులో భోజనములుపెట్టించిరి. మా రైలుబండి రాత్రి నందియాల చేరునప్పటికి, నచట మిషను హైస్కూలులో నుపాధ్యాయుడుగా నున్న ధారవాడ రామారావుగారు మా రాక విని గృహమందు వంటలు చేయించి, ప్లాటుఫారముమీద మా కందరకు పిండివంటలతో భోజనములు పెట్టిరి. తెల్లవారునప్పటికి బండి గుంతకల్లుచేరెను. అక్కడ మరియొక బండినెక్కి బళ్లారి యుదయము 10 గంటలకు చేరితిమి. చెన్నపురి శాసన నిర్మాణసభలో నప్పుడు సభ్యుడుగానున్న పి. శివరావుగారి యింట నాకు బసనేర్పాటుచేసిరి. వారి మోటారు బండి నాయుపయోగములో నుండెను. సాహిత్యపరిషత్సభ రెండుదినములు జరిగెను. ఆనెగొంది మహారాజుగారైన రంగదేవుల రాయలు గారు సభకధ్యక్షులైరి. ఆరాజుగారు శ్రీ కృష్ణదేవరాయలువారి

వంశస్థులట! ఆనెగొంది తుంగభద్రకావల నిజామురాష్ట్రములో నున్నది. జయంతి రామయ్యగారు, గుమ్మలూరి వెంకటరంగారావు గారు, నెమలి పట్టాభిరామారావుగారు, గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు మున్నగువారనేకు లాసభకు వచ్చిరి. బళ్ళారి "సరస వినోదినీ" నాటకసమాజమువారు మానిమిత్తము రెండు నాటకములు ప్రయోగించిరి. అందొకటి రామరాజు. ఆ నాటకములో శ్రీ తాడిపర్తి రాఘవాచార్యులుగారు పఠానుపాత్రధరించి మిక్కిలి యద్భుతముగా నటించి, నాటకాంతమున విలువగల జరీబనారుసుపట్టుశాలువ యొకటి నాకు బహుమానముగా గప్పిరి. రెండవ నాటకము కృష్ణమాచార్యులవారు రచియించిన పాదుకాపట్టాభిషేకము. అందు రాఘవాచార్యులుగారు దశరథునిపాత్రయు కృష్ణమాచార్యులవారి తమ్ముడైన గోపాలాచార్యులవారు భరతునిపాత్రయు ధరించి మిక్కిలి సొగసుగా నటించిరి. బళ్ళారి జిల్లాబోర్డు ప్రెసిడెంటుగారు గోపాలస్వామి మొదలియారుగారును, బళ్లారి మునిసిపలు సభాధ్యక్షుడు నెగులూరు నారాయణరావుగారును మమ్ము మిక్కిలి గౌరవించిరి. కృష్ణమాచార్యులుగారి పేరగట్టించిన భవనమును నేనొకనాడు దెరచితిని. కోలాచలము వెంకటరావుగారిని, వారి తమ్ముడైన శ్రీనివాసరావు గారిని, బళ్లారిలో దర్శించితిని. ఈ శ్రీనివాసరావుగారు తెనుగులో బహునాటకములువ్రాసిరి. గొప్పన్యాయవాదియైన భీమారావుగారు నాకొకనాడు విందుచేసిరి. పిమ్మట పూర్వము కృష్ణదేవరాయలువారి చేత బాలింపబడి, ప్రస్తుతము పాడుపడియున్న విజయనగరపట్టణమును జూడ వెళ్లితిమి. అది తుంగభద్రాతీరమందున్నది. ఆ పట్టణముజూచుటకు రెండుమూడుదినములుపట్టెను. ఉదయమున పట్టణము జూచి మధ్యాహ్నమునకును, మధ్యాహ్నము పట్టణముజూచి సాయంకాలమునకు తుంగభద్రదాటి మేమానెగొందె వెళ్లుచుంటిమి. ఆ దినములలో శ్రీరంగదేవరాయలువారే వంటలుచేయించి మాకొక యాలయములో భోజనము లేర్పాటుచేయించిరి. బసమాత్రము రంగదేవరాయలువారి కోటలోనే బళ్లారినుండి నెగులూరి నారాయణరావు గారును, శంకరలింగముపిళ్ళగారును, మాతోగూడవచ్చి, మాకా స్థలములన్నియు జూపిరి. శిథిలములైన యా దేవాలయములను, పాడు

పడిన యీభవనములనుజూడ యెంతటి కఠినాత్ములకైనను గన్నుల నీరువచ్చును. ఎంతో వైభవమనుభవించిన యీమహానగరము కాల వశమున నట్టిదురవస్థ పాలగుట మిక్కిలి శోచనీయము. నేను తుంగ భద్రలో స్నానముచేసితిని. పుట్టియను తేప్పవంటి దానినెక్కి తుంగభద్ర దాటితిని. కన్నులున్నవారాదృశ్యములు చూడదగినవి. కొన్ని శిల్ప ములను నేను జేతితో తడవిజూచితిని. మరలివచ్చునప్పుడు"హాస్పేట" పట్టణముగూడ జూచితిమి. పిమ్మట మేము రాజమహేంద్రవరము వచ్చితిమి.

ఆ సంవత్సరము (1915) మే నెలలో నాంధ్రమహాసభ విశాఖ పట్టణములో జరిగెను. శ్రీ పానుగంటి రామారాయణింగారధ్యక్షత వహించిరి. ఆసభకు నేనుబోయి, యది ముగిసినతరువాత, "బొబ్బిలి" లో జరిగెడు గ్రంథాలయసభకు వెళ్లితిని. త్రోవలో నన్ను, యోగి శ్రీనివాసశాస్త్రిగారు గలుసుకొనిరి. బొబ్బిలి ప్రభువైన ఖడంగా గారు, మానిమిత్తము రెండెడ్లబండి, బొబ్బిలి రైలుస్టేషనునకుబంపిరి. ఆ బండి మే మెక్కినతరువాత దారిలో నొక వంతెనమీదనుండి యేటిలోబడుటకు సిద్ధమయ్యెను. అప్పుడు నాగుమల్లి కామరాజు వెంకటరమణశర్మయు, యోగి శ్రీనివాసశాస్త్రిగారును, ముందుగా క్రిందికురికి చక్రములుబట్టుకొని బండిపడకుండనాపిరి. నాకప్పుడొక గండముతప్పెనని సంతసించితిని. పిమ్మట బొబ్బిలిపోయి ఖడంగా గారి భవనములోజరిగిన గ్రంథాలయసభలో, నేను మాటలాడితిని. అచటనుండి నేను ఛత్రపురము వెళ్లితిని. అది గంజాముమండలము నకు రాజధాని. అచట నా రెండవ మేనకోడలైన వేంకటరత్నమ్మ పెనిమిటి కోట శేషగిరిరావచటనున్న జిల్లారిజిస్ట్రారుగారి యాఫీసులో, సబురిజిస్ట్రారు పదవికి, పని నేర్చుకొనుచుండెను. వారియింట రెండు దినములుండి యచ్చటి "యాన్స్లో" (Anslo) హైస్కూలులో నొక యుపన్యాసమిచ్చి, యచట నుండి బరంపురము వెళ్లితిని.

ఆ సంవత్సరము గంజాముమండలసభలు బరంపురములో జరి గెను. రాజకీయసభకు మోచర్ల రామచంద్రరావుగా రధ్యక్షులు. సంఘసంస్కరణ సభ కధ్యక్షుడుగా నన్నాహ్వానించిరి. రాజకీయ సభ ముగిసినతరువాత, నాలుగవదినమున సంఘ సంస్కరణసభ జరి

గెను. ఆదినమున నింతింత యనరాని యెండకాచి నిప్పులు వర్షించి నట్లు గాడ్పులు వీచెను. ఆసభకు నా ప్రాతమిత్రుడైన శ్రీ ంభట్ల వెంకయ్యగారు వచ్చిరి. అప్పుడాయన గోపాలపురములోని కష్టంసు సూపరెంటెండెంటుగా నుండిరి. ఆయన నన్ను గోపాలపురమురమ్మని బలవంతపెట్టిరి. గాది రాఘవరావుపంతులుగారి మోటారు నెరువు పుచ్చుకొని మేము గోపాలపురము వెళ్లితిమి. ఆయూరు సరిహద్దులకు వెళ్ళునప్పటికే చల్లగాలివీచి మాకెంతో చైతన్యము కలిగించెను. ఎండచేమాడిన మా శరీరములు హాయిహాయి యని సుఖయించెను. అక్కడ జేరినతోడనే బ్రహ్మమతమును గురించి నేనొక గంటసే పచటి జనుల కుపన్యసించితిని. ఆరాత్రి యచటనిద్రించి మరునాడు బయలుదేరి రాజమహేంద్రవరము వెళ్ళి, యచటనుండి భీమవరము వెళ్ళి యచట సభలో నొక యుపన్యాసమిచ్చి, యచటనుండి నిడమర్రు గ్రామము వెళ్లి, యచట స్థాపింపబడిన పోతన గ్రంధాలయ వార్షికోత్సవమున సభ కధ్యక్షత వహించితిని. పోతనామాత్యుని పవిత్ర జీవితమును గురించి యుపన్యసించి, యచటనుండి బయలుదేరి పూళ్ళ గ్రామము వెళ్లితిని. అచట సభజేసి మధ్యమ పాఠశాల నొకదానిని స్థాపించుకొమ్మని గ్రామజనులను హెచ్చరించుచు నుపన్యసించి, మరునాడు బయలుదేరి రాజమహేంద్రవరము జేరితిని. నడవేసవికాలములో ఛత్రపురమునుండి ప్రయాణముజేసి యెన్నో గ్రామములు దిరిగినప్పటికి నా దేహారోగ్యము చెడక యెప్పటివలె నుండెను. అప్పటికి నాకు నలుబదియెనిమిదవయేడు నడచుచుండెను. నేను వేళకు మితభోజనముచేయుచు, మితభుక్కునై వేళకు నిద్రించుచు, నెడనెడ నుపాహారములుతినక, కాఫీ, టీలను దాగక తాంబూలమునువేయక, చుట్టకాల్చక. పొడుముపీల్చక, యే దురభ్యాసములులేక కాలక్షేపము చేయుటచే, యప్పుడేగాక డెబ్బదియేడవయేట నిప్పుడుగూడ నాదేహారోగ్యము సరిగానున్నదని చెప్పవచ్చును. ముసలివాండ్రకు వార్ధక్యములో నవసరమైన నల్లమందుసైతము నా కిప్పటికిని నవసరములేదు.

ఆ సంవత్సరము (1915) సెప్టెంబరు నెలలో కాబోలు కవి బ్రహ్మయైన తిక్కనసోమయాజులవారి జయంతి మహోత్సవమును

జనుపదలచి నెల్లూరు పురవాసులు తత్సభకు నధ్యక్షత వహింపుమని సన్నాహ్వానించిరి. నా వదినగారి కుమారుడైన రావూరి సూర్యనారాయణను నా సహాయార్థము దీసికొని, నెల్లూరు వెళ్లితిని. తిక్కన జయంతి మహోత్సవ సభ లక్ష్మీనరసారెడ్డి టవునుహాలులో జరిగెను. అచట గవర్నమెంటు ప్లీడరైన మైదవోలు చంగయ్యగారు మొదలైన ప్రముఖులు దయచేసిరి. విశాలమైన యా పురమందిరము జనులతో నిండిపోయెను. కవి బ్రహ్మయెడ నాకు గల భక్తివిశేషముచేత నేను మహోపన్యాసము చేసితిని. నా ప్రాతగురువైన వేదము వెంకటాచలముగారు నెల్లూరులో నప్పుడు న్యాయవాదులుగా నున్నందున నేను వారి దర్శనము చేసితిని. వారప్పుడు "జంతు" భాషలో గొప్ప కృషి చేయుచుండిరి. అది సంస్కృతమునకు సన్నిహితమైన భాషయని వారు నాకు జెప్పిరి. నెల్లూరు పురవాసులు నేను రెండవ తరగతిలో (2nd Class) ప్రయాణము చేయునట్లు ఖర్చులిచ్చిరి. నాలుగుదినముల తరువాత నెల్లూరునుండి రాజమహేంద్రవరము వచ్చితిని.

ఆ సంవత్సరము 1915 అక్టోబరు నెలలో కర్నూలుజిల్లాసభలు నందియాలలో జరిగెను. రాజకీయసభకు గౌరవనీయులు బయ్యా నరసింహేశ్వరశర్మగా రధ్యక్షత వహించిరి. సంఘసంస్కరణసభ కధ్యక్షుడుగా నన్నాహ్వానించిరి. నేను రావూరి సూర్యనారాయణను దీసికొని నందియాల వెళ్ళితిని. రాజకీయసభలకు గూడ నేను హాజరై నాలుగవనాడు సంఘసంస్కరణసభ కధ్యక్షత వహించితిని. కర్నూలులో జిల్లా మునసబుగానున్న సి.వి. కృష్ణస్వామయ్యరుగారు సభకు దయచేసి, ప్రత్యేకముగా నా యుపన్యాసమును వినుటకే కర్నూలునుండి తాము వచ్చితిమని, నాతో జెప్పిరి. గుత్తినుండి పత్తి కేశవపిళ్ళెగారును, కర్నూలునుండి సబ్నవిస్ నరసింహారావుగారు మొదలగు ప్రముఖులనేకులు సభలకు వచ్చిరి. సభలు జయప్రదముగా జరిగెను. అయిదవదినమున నే నచట బయలుదేరి రాజమహేంద్రవరము వెళ్ళితిని. నా వద్దనున్న పిల్లవాడు జీవనాధారము లేకుండుటచే జెడిపోవునని యెంచి గంటి నరహరినాని మిషనుస్త్రయి స్కూలులో చేరిపించితిని. బోధనాభ్యసనము పూర్తియైనతరువాత నతడు మా యిల్లు విడిచి తన స్వదేశమైన విశాఖపట్టణపు జిల్లా

బోయి, యచట నొక యుపాధ్యాయపదవి సంపాదించుకొని, యాలు బిడ్డలతో సుఖజీవనము చేయుచున్నాడు.

1915 వ సంవత్సరము డిశెంబరు నెలలో నేను హైదరాబాదు (దక్కన్) వెళ్ళవలసివచ్చెను. ఆంధ్రభాషా దేశాభిమానులైన మాడపాటి హనుమంతరావుగారు మొదలైన యచటి యాంధ్రప్రముఖులు శ్రీకృష్ణదేవరాయలపేర నొక గ్రంధభాండాగారము స్థాపించి, దాని వార్షికోత్సవసభ కధ్యక్షుడుగా రమ్మని నన్నాహ్వానించిరి. అప్పుడు నాదగ్గర లేఖకుడుగా నుండిన కాకర్ల కొండయ్యయను నియోగియువకుని వెంటబెట్టుకొని హైదరాబాదు వెళ్ళితిని. అచటి యాంధ్రప్రముఖులు నన్ను మిక్కిలి గౌరవించి, కీర్తిశేషులైన రావిచెట్టు రంగారావుగారి ధర్మపత్నియగు లక్ష్మీనరసమ్మగారియింట, నాకు బస యేర్పాటుచేసిరి. ఆమె యాదరణము మిక్కిలి బాగుండెను. సభ గొప్పగా జరిగెను. సభకు సరోజినీదేవిగారు, సర్. అక్బరు హైదరీగారు మున్నగువారు దయచేసిరి. రావిచెట్టు లక్ష్మీనరసమ్మగారు సభలో నాకు గప్పవలసినదని యొక విలువగల పట్టుశాలువను బంపిరి. ఆ శాలువను సరోజినీదేవిగారు నా మెడలో వైచిరి. సభ ముగిసినతరువాత నే నాయూరిలో రెండుదినములుండి సరోజినీదేవిగారిని, నామె భర్తయగు ముత్యాల గోవిందరాజు నాయుడుగారిని జూచి, పిమ్మట సికిందరాబాదు జనులు నన్నాహ్వానింపగా నే నచటికి బోయితిని. అచ్చట సంస్కృతభాషమీదను, సంఘసంస్కరణమీదను రెండుపన్యాసములిచ్చి, తరువాత స్త్రీలకొరకు ప్రత్యేక మొకసభ గావించి, యందు స్త్రీవిద్యను గురించి యుపన్యసించితిని. ఆసభకు డాక్టరు మల్లనగారి భార్య యధ్యక్షత వహించెను. ఆసభలు ముగించి నేను రాజమహేంద్రవరమువచ్చినతరువాత, పూర్వాచారపరాయణులైన వీరభద్ర పాకయాజిగారు, సికిందరాబాదులో సభలుజేసి యచటిసభలో నే జెప్పిన యభిప్రాయములను ఖండించిరని పత్రికలలో జదివితిని. నే నచటనుండగానే నా యభిప్రాయములను ఖండించిన పక్షమున మిక్కిలి బాగుండును, నుచితముగానుండియుండును.

ఆ సంవత్సరము 1915 అక్టోబరు నెలలో నా రెండవ మేనకోడ లైన వెంకటరత్నమ్మకు జ్యేష్ఠకుమారుడు పుట్టెను. తలిదండ్రులు వానికి నా పేరు పెట్టిరి. ఈ సంవత్సరమున (శ్రీ) పిఠాపురము మహా రాజావారును, వారి దివానుగారైన మొక్కపాటి సుబ్బారాయుడు గారును, కుటుంబములతో రాజమహేంద్రవరము వచ్చిరి. మహారాజు గారు మ్యూజియమువద్దనున్న వారి బంగాళాలో బసచేసిరి. మొక్క పాటి సుబ్బారాయుడుగారి భార్యయైన సోమమ్మగారికిని, నా రెండవ చెల్లెలైన పచ్చమ్మకును చిన్నతనమునుండి వీరవాసరములో మిక్కిలి స్నేహమగుటచే వారు మా యింటనే బసచేసిరి. మహారాజావారు వచ్చుటకుముందు, వారిరాకనుగురించి సుబ్బారాయుడుగారు ముం దుగా నాకు దెలియచేసి, వారు సెంట్రలుజెయిలు, రెండు కళాశా లలు, రామమోహనస్కూలు, టవునుహాలు చూతురుగావున తగిన యేర్పాటులు చేయించవలెనని వ్రాసిరి. దానింబట్టి నేను జెయిలు సూపరెంటెండెంటుగారితోను, కళాశాలల ప్రిన్సిపాలులతోను మాట లాడి యేర్పాటులు చేసితిని. రాజాగారు నన్ను సుబ్బారాయుడుగారిని వెంటబెట్టుకొని సెంట్రలుజెయిలును, రామమోహన స్కూలును జూచిరి. కళాశాలలు వారేబోయి చూచిరి. కంచుమర్తి రామచంద్ర రావుగారు వారికి తోటవిందు మ్యూజియములో జేసిరి. చాలమంది పురప్రముఖులు వచ్చిరి. రాజుగారు వీరేశలింగపాఠశాలనుకూడ జూచిరి. అక్కడ నొకసభ జరుగగా దానికి (శ్రీ) రాజాగా రధ్యక్షత వహించిరి. సభలో విద్యార్థులు వీరేశలింగముగారి ప్రహసన మొకటి ప్రదర్శించి సభాసదులను వినోదపరచిరి. నా రామమోహనపాఠశా లలో నప్పటికి నూరుమంది విద్యార్థులుండిరి. ఏడుగు రుపాధ్యాయు లుండిరి. ఆ సంవత్సరమునుండి (శ్రీ) రాజాగారు మా పాఠశాలకు సహాయముచేయ జొచ్చిరి. ఏటేట రు 500/-లు విరాళమీయ జొచ్చిరి. ఆ పాఠశాలలో నొక హరిజనోపాధ్యాయుని నియమించితిని. అతని పేరు నరసింహారావు. అతనికి నెలకు రు 15/-లు జీత మేర్పర చితిని. అతడు స్కూలుఫైనలు పరీక్షయందు కృతార్థుడయ్యెను. అతని నివాసస్థానము తణుకుతాలూకాలోని పెనుమంట్రగ్రామము. అతడు క్రైస్తవులలో గలియుటకు ప్రయత్నించెను. కారణ మేమన

వారు తన కిరువదియైదు రూపాయిలు జీతమిత్తురని చెప్పెను. మిషను స్కూలు ప్రధానాచార్యులైన పోతుకూచి సుబ్బయ్యగారు నా వద్దకు వచ్చి యిటులజెప్పిరి. "నరసింహారావునకు జీతము చాలదట! మీరు వానికి 25 రూపాయిలు జీతమిచ్చిన మీ పాఠశాలలో నుండునట. క్రైస్తవులలో గలియడట. అయిదురూపాయిలు మీకు దండుగ యైనను వానిని మతాంతరులలో గలియకుండ చేసినఫలము మీకు దక్కును. కావున మీరు దీని కొప్పుకొనుడని నన్ను బ్రతిమాలిరి. హిందూమతాభిమానముచేత వానిని క్రైస్తవులలో జేరకుండ జేయుటకై నేను దాని కొప్పుకొంటిని. కాని కొన్నిమాసము లైనతరువాత నతడు మరియొక క్రైస్తవపాఠశాలలో నుపాధ్యాయుడుగ జేరి క్రైస్తవులలో గలసెను. క్రైస్తవమతగురువుల చేతులలో విశేషము ధనముండును గనుక వారీప్రకారముగ ధనమిచ్చియు, నుద్యోగము లిచ్చియు, నిమ్నజాతులవారిని దమమతములోనికి జేర్చుకొనుచుందురు.

మా ముద్రాక్షరశాల బజారులో, వాడ్రేవువారి మేడలో నుండెను. కొన్ని గారణములచేత మేము దానిని విడువవలసివచ్చెను. ఆర్యపురములో నొకయింటికి మా ముద్రాక్షరశాలను మార్చితిమి. మా ముద్రాక్షరశాలకు మెషీను ముద్రాయంత్రముదెచ్చి, వృద్ధి చేయవలెనని సంకల్పము గలిగెను. నాయొద్ద ధనములేదు. చిత్రపు నరసింహారావుగారు తా నా యంత్రమునకు గావలసినసొమ్ము పెట్టుబడిపెట్టెదననియు, నిద్దరముగలసి పనిచేసుకోవచ్చుననియు చెప్పిరి. దానికి నే నొడంబడితిని. ఆ యంత్రము దెచ్చుటకై నరసింహారావుగారును, సత్యనోలు అప్పారావుగారును చెన్నపురిపోయి కొనితెచ్చిరి. వృద్ధిచెందిన యీ ముద్రాక్షరశాలకు నార్యపురములోని యిల్లు చాలనందున నా కార్యస్థానమును నిన్నీసుపేటలో నేదేని పెద్దభవనమునకు మార్చవలెనని తలంచితిమి. అప్పు డిన్నీసుపేటలో శ్రీ విజయనగరము మహారాజాగారి మేడ కాళీగానుండెను. దానినిమిత్తమై ప్రయత్నముచేయుటకు నేను విజయనగరము వెళ్ళి గురజాడ అప్పారావుగారిని మరికొందరు ముఖ్యులను జూచితిని. వారివల్ల నా కా కార్యసాఫల్యమగునట్లగపడలేదు. అప్పుడు విజయనగర సంస్థానమునకు

మేనేజరుగా ఫౌలరు (Fowler) దొరగారుండిరి. నా మిత్రుడైన చెరువు సోమయాజులుగారికిని, దొరగారికిని గొంత పరిచయముండుటచే దొర గారియొద్దకు బోయి మాటాడి యామేడను మా కద్దెకు నిప్పింపుమని సోమయాజులుగారిని బంపితిని. ఆయన నాకు నిజమైన మిత్రుడగుటచే శ్రమపడి విజయనగరము వెళ్ళి దొరగారితో మాటాడి సంవత్సరము నకు రు. 400 లద్దెచొప్పున మా కిప్పించిరి. అంతట మేము మా కార్యస్థానమును నిన్నీసుపేటలోనికి మార్చితిమి. మా మనోరమా ముద్రాక్షరశాలగాక యాభవనములో చిత్రపు నరసింహారావుగారి సొంతమైన వివేకవర్ధనీ ముద్రాక్షరశాలగూడ నుండెను. దానిలో వారు కోర్టుతీర్పు లచ్చువేయుచుండిరి. ఆపనియొక్క లాభనష్టములు వారివేగాని నాకు సంబంధములేదు. నా "దేశమాత" పత్రిక ప్రక టించెడు దినములలో రాజమహేంద్రవర మ్యునిసిపాలిటి వ్యవహార ములు తృప్తికరముగా లేనందున, దానిని గురించి కఠినవిమర్శనలను ప్రహసనములను వ్రాయుటచేతను, మరికొన్ని యితర విమర్శనములు ప్రకటించుటచేతను, నాకు గొందరు విరోధులు బయలుదేరిరి. విశే షించి వీరేశలింగముగారి పక్షమున నే నుండుటచేత, నాకు పూర్వ పరిచితులైన టంగుటూరి శ్రీరాములుగారితోను నాళము కృష్ణారావు గారితోను మాటలు పోయెను.

నాళము కృష్ణారావుగారు వీరేశలింగముగారిపేర గ్రంధభాండా గారము స్థాపించి దానిని వీరేశలింగముగారి టవునుహాలులో ప్రార్థన మందిరము మేడమీాద బెట్టిరి. ఆ గ్రంథాలయమునకు నే నధ్యక్షుడ నుగా నుంటిని. వీరేశలింగముగారికిని నాళము కృష్ణారావుగారికిని గలిగిన మనస్పర్థలచే గ్రంథాలయమునకు వీరేశలింగముగారిపేరు తీసివేయవలెనని, తత్పరిపాలకవర్గమునకు కృష్ణారావుగారికిని సంక ల్పము గలిగెను. ఒకసారి వా రాప్రయత్నము చేసిరిగాని వారి సంక ల్పము నెరవేరలేదు. సభ్యులలో నధికసంఖ్యాకులు వీరేశలింగము గారి పేరుంచవలెనని కోరిరి. కాని వారు దాని కొక యుపాయ మాలోచించిరి. నేను దాని కధ్యక్షుడుగా నున్నంతకాలము వీరేశ లింగముగారిపేరు తొలగించుటకు వీలులేదనినమ్మి మొదట నన్నధ్య క్షపదవినుండి తొలగించుటకు నిశ్చయించిరి. అది సాధ్యము గాక

పోయినందున వారు మరియొకయెత్తు నెత్తిరి. ఒక్కొక్క గ్రంథాలయ సభ్యుడు సంవత్సరమునకు మూడురూపాయిలు చందా నీయవలెను. ముప్పదిమంది సంవత్సరమున కీయవలసిన చందా రు. 90 లు నాళము కృష్ణారావుగారే యిచ్చి, తమ కనుకూలురైన ముప్పదిమంది క్రొత్తసభ్యులను చేర్చిరట. ప్రాతసభ్యులు గొందరును క్రొత్తసభ్యులు యీ ముప్పదిమంది గలసి గ్రంథాలయసభ చేసి, యధ్యక్షపదవినుండి నన్ను దొలగించి, నాస్థానమున శ్రీ గంటి లక్ష్మన్నగారి నధ్యక్షులుగా నేర్పరచిరి. ఆతరువాత గ్రంథాలయమునకు వీరేశలింగముగారి పేరు దీసివేసి, దానికి "ప్రజా గ్రంథాలయము" (Peoples, Library) అని పేరుపెట్టిరి. ఆకాలమున వడ్డాది సుబ్బారాయుడుగారి బావమరదియైన యద్దంకి సత్యనారాయణ, వసురాయ గ్రంథాలయమనుపేర నొక గ్రంథాలయము స్థాపించి నడుపుచుండెను. కొంత కాలమైనతరువాత ప్రజా గ్రంథాలయమును వసురాయ గ్రంథాలయమును గలిపి "గౌతమీ" గ్రంథాలయమను పేరుపెట్టి మ్యూజియము సమీపమున నొక భవనముగొని యందులో పెట్టిరి. అది యిప్పుడు మిక్కిలి వృద్ధిలో నున్నది. ఆంధ్రదేశములో నట్టి గ్రంథాలయము మరియొకటి లేదు.

1915 వ సంవత్సరములో మాపట్టణములో నొక విశేషము జరిగెను. స్టీవర్టు దొరగారు, టంగుటూరి శ్రీరాములుగారిమీద, వీరేశలింగముగారు తెచ్చిన యభియోగము కొట్టివేసినందున, వీరేశలింగముగారు నీతిబాహ్యుడనియు, టవునుహాలులోనున్న జూబిలీ పఠనమందిరములో నట్టివాడు సభ్యుడుగా నుండతగడని, యీయనను సభ్యునిగా దొలగింపవలెనని యాలోచించి, పఠనమందిరములోనికి యీ క్రింది యారుగురు సభ్యులు నొక యర్జీవ్రాసి, జూబిలీ పఠన మందిర కార్యదర్శిగారి కిచ్చిరి. టంగుటూరి శ్రీరాములుగారు, దామెర్ల వెంకటరమణరావుగారు, వాడ్రేవు శంభులింగముగారు, నాళము కృష్ణారావుగారు, ఎర్రమిల్లి కామరాజుగారు, మాంధాత కామేశ్వరరావుగారు, ఈ యారుగురే యని జ్ఞాపకము. ఇది చాలా కాలమునాటి విషయమగుటచే పొరపాటున్న పక్షమున పాఠకమహాశయులు మన్నింతురు గాక. ఇది మహాసభలో విచారింపవలసిన విష

దము గావున, జ్యూబిలీపఠనమందిర కార్యదర్శి, పఠనమందిర సభ్యుల సభ (General body meeting) గావించెను. అప్పుడు పఠన మందిరములో నూరుమంది సభ్యులుండిరి. ఎనుబదియిద్దరు సభ్యులు హాజరయిరి. వీరేశలింగముగారిమీద నిందారోపణ చేయుటయు వారిని దీసివేయుటయు కృతఘ్నతయనియు, నది యకార్యమనియు నేను గట్టిగా నా సభలో వాదించితిని. దొరతనమువారి కళాశాలలో తత్త్వ శాస్త్ర పండితులైన చక్రవర్తిగారు గూడ వీరేశలింగముగారి పక్ష మున వాదించిరి. అర్జీ నిచ్చినవారిలో సభకు నలుగురు రాలేదు. ఇద్దరు మాత్రము వచ్చిరి. పఠనమందిరములో జారులుండవచ్చును. సురాపానప్రియు లుండవచ్చును. అనృతవాదు లుండవచ్చును. అట్టి వారు మా జ్యూబిలీ పఠనమందిరములో నా కాలమున నుండిరేమో యని నా యభిప్రాయము. అట్టివారు సభ్యులుగా నుండవచ్చును గాని వీరేశలింగముగారివంటి పవిత్రశీలుడు, దేశోపకారి, స్వార్థత్యాగి సభ్యుడుగా నుండగూడదని యర్జీనిచ్చినవారి కెట్లున్నదో నేనూ హింపలేకున్నాను. వీరేశలింగముగారు, రు 7000/-లు ఖర్చుపెట్టి కట్టించిన టవునుహాలునుండి, యాయననే తరిమివేయుటకు సభ్యులు ప్రయత్నించుట మిక్కిలి హాస్యాస్పదముగా నున్నదని పఠనమంది రాధ్యక్షులైన న్యాయపతి సుబ్బారావు పంతులుగారు పలుకుచు వోటు లను దీసికొనిరి. హాజరయిన యెనుబదియిద్దరు సభ్యులలో డెబ్బది యెనమండుగురు వీరేశలింగముగారి కనుకూలముగా వోట్లనిచ్చిరి. ఇద్దరు తటస్థులైరి. ఇద్దరు మాత్రము వీరేశలింగముగారికి వ్యతిరేక ముగా వోటుచేసిరి. దీనిచే వీరేశలింగముగారికి రాజమహేంద్రవర ములో నెంతగౌరవము గలదో పలుకుబడిగలదో తెలిసిపోయెను.

మేము మంచి ముద్రాయంత్రము కొని తెచ్చి యున్నీసు పేటలో మా కార్యస్థానము స్థాపించిన తరువాత, నాకు చిరకాల పరి చితుడును, నా కిరుగుపొరుగువారు నైన నందివాడ విశ్వేశ్వరరావు గారు నా కడకు వచ్చి మా ముద్రాక్షరశాలలో దనకు గూడ నొక భాగమిమ్మని యడిగిరి. దీనిలో లాభముండదు. దీనిలోనికి దిగవద్దని రాయనరపు రామమూర్తి విశ్వేశ్వరరావుగారికి సలహా చెప్పెను. ఈ విషయమై మా భాగస్వామియైన చిత్రపు నరసింహారావుగారితో

నేను చెప్పగా, విశ్వేశ్వరరావుగారిని భాగస్వామిగా జేర్చుకొనగూడ దని నాతో వారు గట్టిగా జెప్పిరి. సొమ్ము పెట్టుబడికిని కార్యనిర్వహణమునకును నౌకరికొకరు సహాయులుగా నుందురుగనుక విశ్వేశ్వరరావుగారిని చేర్చుకొనుట మంచిదని నేనంటిని. ఎట్టకేలకు నరసింహారావుగారు గూడ దమ పట్టువిడిచి విశ్వేశ్వరరావుగారిని మూడవ భాగస్వామిగా చేర్చుకొనిరి. అంతట మేము ముగ్గురము నొక యొడంబడిక వ్రాసుకొని రిజిష్టరు చేయించుకొంటిమి. ఆ యొడంబడికపత్రికారము సొమ్ముపెట్టుబడి నరసింహారావుగారును విశ్వేశ్వరరావుగారును పెట్టవలెను. అచ్చుకూటములో నచ్చుపని నేను దీసుకురావలెను. పనివాండ్రచేత పనిచేయించి యచ్చుకూటమంతయు నరసింహారావుగారు మేనేజమెంటు చేయవలెను, జమాఖర్చు లెక్కలు (Accounts) వ్రాసి సరిగా నుంచుట విశ్వేశ్వరరావుగారిపని. శ్రీ పిఠాపురము మహారాజాగారు తమ సొంతడబ్బు ఖర్చుచేసి వీరేశలింగముగారి గ్రంథములన్నియు సంపుటములుగా నచ్చువేయించి, వీరేశలింగముగారికి బహుమతి నీయదలచిరి. అది పెద్దపని. అవి యచ్చువేయుపని నాకీయవలసినదని రాజాగారికి దరఖాస్తు పెట్టి మొక్కపాటి సుబ్బారాయుడుగారితో గూడ మాటాడితిని. మచ్చునకొక సంపుట మచ్చువేసి పంపుడు. ఆ పనిని జూచి మీ కిచ్చెడి విషయమై యాలోచించెదమని సుబ్బారాయుడుగారు నాకు ప్రత్యుత్తరమిచ్చిరి. అట్లే నే నొక సంపుట మచ్చువేయించి వారికి బంపితిని. దానిని జూచి మహారాజావారు పనికి మెచ్చి, మిగిలిన పనిని మా కిచ్చిరి. మొత్తముమీద మేము తొమ్మిది సంపుటము లచ్చువేసితిమి. నా "మనోరమ"యు నా "దేశమాతది"యు మా యచ్చుకూటములోనే యచ్చుపడుచుండెను. దానికి నేను వేరే సొమ్ము నిచ్చుచుంటిని. నా పత్రికల నిమిత్తము నా గుమాస్తాలనిమిత్తము మేడలో గొంతభాగము నా క్రింద నుంచుకొని, దానికి బాడిగక్రింద సొమ్ము కొంత వేరుగనిచ్చుచుంటిని. నేదెచ్చినపనివల్లను మొత్తముమీద మూడు సంవత్సరములకు నచ్చుకూటమునకు 10 వేల రూపాయలువచ్చెను. వీరేశలింగముగారి పనివల్లనే 7500 రూపాయలు వచ్చెను. ఇంతలో విశ్వేశ్వరరావుగారికి జబ్బుచేసెను. ఆకారణమున వారచ్చుకూటమునకు వచ్చుటయు

లెక్కలు వ్రాయుటయుమానిరి. నరసింహారావుగారి మేనేజమెంటు గూడ తృప్తికరముగా లేకపోయెను. నరసింహారావుగారి సొంత యచ్చు కూటముగూడ నచ్చట నేయుంచుటచే వారు సొంతపనిమీద నెక్కుడు శ్రద్ధ వహించి యుమ్మడిపనిమీద సనతితక్కువ ప్రేమ జూప నారంభించిరి. అప్పుడాయన స్వలాభపరాయణుడయ్యెననుట నిస్సంశయము; జమా ఖర్చులెక్కలు లేకపోవుటచేతను నచ్చుపని సరిగా జరుగకపోవుటచేతను మా ముద్రాక్షరశాల క్రమముగా క్షీణదశకు వచ్చుచుండెను. సొమ్మంతయు విశ్వేశ్వరరావుగారును నరసింహారావుగారును బుచ్చు కొని యిష్టము వచ్చినట్లు ఖర్చుపెట్టి, యచ్చుపడిన వీరేశలింగము గారి సంపుటములలో గొన్నింటికి కట్టలుకట్టించి, కొన్నింటికి కట్టించుట మానిరి. అచ్చుపని పూర్తిచేసి యప్పగించవలసిన భారము నాది గావున కొన్ని సంపుటములకు నా సొంతడబ్బుతో నేనే యట్టలు గట్టించవలసివచ్చెను. విశ్వేశ్వరరావుగారికి నెమ్మదిగానున్నను నచ్చు కూటములో భాగమును మానుకొంటినని మాకు దెలియజేసిరి. నర సింహారావుగారు విశ్వేశ్వరరావుగారు పనివాండ్రకు జీతములిచ్చుట మానిరి. వీరేశలింగముగారి సంపుటములు రాజమహేంద్రవరములో మ్యూజియముకడ రాజాగారి బంగాళాలో పెట్టించవలసినదని యుత్త రువులు వచ్చినందున వాటి నచ్చట చేర్చితిని. హితకారిణీ సమాజ కార్యదర్శియైన రెబ్బాప్రగడ పాపయ్యగారు వీరేశలింగముగారి మర ణానంతరమున రాజాగారి బంగాళాలోని సంపుటములను, వీరేశలింగ ముగారి పాఠశాలలో బెట్టించిరి. పైపని యటుండగా నా "మనోరమ" యు, "దేశమాత"యు నచ్చుపడుటయే కష్టమయ్యెను. అందుచేత నేను 1919 వ సంవత్సరమునుండి నా పత్రికలు రెండును బ్రకటించు టమాని ముద్రాయంత్రములో భాగముగూడ నేను వదలుకొంటిని.

1916 వ సంవత్సరమున నేను రాజమహేంద్రవరము బ్యాం కులో "ఓవరుడ్రాప్టు" (over draft) ఖాతా పెట్టించుమని దరఖాస్తు చేసి కాషియరుగారైన పునుగుపాటి సుబ్బారావుగారితో మాటాడి తిని. సుబ్బారావుగారి యభిమానమువలన సంవత్సరమునకు రెండు వేల రూపాయిలవరకు నప్పుడప్పుడు నేను బ్యాంకులో బదులుపుచ్చు కొనవచ్చునని ఖాతా యేర్పడెను. నా పత్రికలకు గావలసిన కాగి

తములు దెచ్చి నిలువజేసికొనుటకును పత్రికా వ్యాపారము సరిగా జరుపుకొనుటకును నాకు వీలు కలిగెను. కాని బ్యాంకువారి కిద్దరు పురుషులు జామీనుండవలసివచ్చెను. అప్పుడు వీరవాసరములో మాకున్న భూములు మొదలైన యాస్తి నేనును, మా తమ్ముడును గలసి బ్యాంకువారికి హామీ నిచ్చితిమి. ఇక రెండవవారు హామీ నీయవలసివచ్చెను. అప్పుడు నా ప్రియమిత్రులు చిరపరిచితులైన కనుపర్తి శ్రీరాములుగారు దన యావదాస్తియు నా నిమిత్తమై బ్యాంకువారికి హామీనిచ్చిరి. లోకములో నటువంటి మిత్రులుండుట యరిది. ఈ దినములలో మరియొకరి నిమిత్తము తన యావదాస్తిని జామీనిచ్చు సాహసు లెవరుందురు? శ్రీరాములుగారి మంచితనమునకును, పరోపకారబుద్ధికిని, నిది ప్రబలసాక్ష్యముకాదా! వారికి వ్యవహారములో లేశమైనా దండుగలేకుండ బ్యాంకువారికి నేనీయవలసిన సొమ్మంతయు నిచ్చివేసి మా తమ్ముని యొక్కయు, శ్రీరాములుగారి యొక్కయు జామీనులు వదలించి కృతార్థుడ నైతిని.

1916 వ సంవత్సరమున నాంధ్రమహాసభ కాకినాడలో జరిగెను. దానికి మోచర్ల రామచంద్రరావుగా రధ్యక్షులైరి. నేనా సభకు బోయి యేదో విషయమై మాటలాడితిని. ఆ సంవత్సరము నాలుగవ గోదావరీమండలసభ రామచంద్రపురములో జరిగెను. అప్పుడు రాజకీయసభకు నెవ రధ్యక్షులైరో జ్ఞాపకములేదు. సంఘసంస్కరణసభలో నధ్యక్షులు వక్తలు లేరు. సంస్కరణమును గురించి యొక యుపన్యాసమిమ్మని సభాసదులు నన్ను గోరిరి. వారి కోరిక ననుసరించి, సంస్కరణావశ్యకతనుగూర్చి, నే నొక పెద్ద యుపన్యాసమిచ్చితిని. ఆ సంవత్సరమున నెల్లూరులో నాంధ్రగ్రంథాలయ మహాసభ జరిగెను. నేను నెల్లూరుకుబోయి హాజరై యా సభాకార్యక్రమమున పాలుగొంటిని. దాని కధ్యక్షులెవరయిరో జ్ఞాపకము లేదు. నెల్లూరునకు సమీపములో "పొట్లపూడి" యను నొక చిన్న గ్రామము గలదు. అచట నొక చిన్న గ్రంథాలయము గలదు. ఆ గ్రామ నివాసులైన పొణకా పట్టాభిరామరెడ్డిగారు, తమ యూరులోనున్న గ్రంథాలయ వార్షికోత్సవమున నన్నధ్యక్షత వహింపుమని

కోరి నన్ను దీసికొనివెళ్ళిరి. నేనా గ్రామముబోయి మా బంధువుల యింట బసజేసి, గ్రంథాలయ వార్షికోత్సవము జరిపి, పిమ్మట రాజమహేంద్రవరము వచ్చితిని.

---

# స్వీయ చరిత్రము

## పంచత్రింశోపప్రకరణము

### "దేశమాత" పత్రికకు చిక్కు

1917 వ సంవత్సరమున "దేశమాత" పత్రికలో నేను గ్రామములో లేనప్పుడు, దొరతనమువారిని విమర్శించుచు, నొక యాక్షేపణీయమైన వ్యాసము ప్రకటింపబడెను. అందుచేత దొరతనమువారి యుత్తరువుప్రకారము, కాకినాడ జిల్లాకలెక్టరుగారు, మా ముద్రాక్షరశాలమీద వేయిరూపాయిలు ధరావతు నీయమని యాజ్ఞాపించిరి. అప్పుడు భాగస్వాములము ముగ్గురముకూడి, యిమ్మడిమీద మాకు వాడివద్ద యప్పుదెచ్చి, ధరావతు చెల్లించితిమి. మూడు నాలుగేండ్ల తరువాత దొరతనమువారు మా ధరావతు మాకిచ్చివేసినందున మాకువాడియప్పు పూర్తిగ దీర్చివేసితిమి.

1916 వ సంవత్సరాంతమున జాతీయమహాసభ (Indian Natianal Congress) లక్నో పట్టణమున జరిగెను. ఆ సభకుబోయి తిరిగి వచ్చుచు "అనిబిసెంటు'' గారు మా పట్టణములో నొకనాడాగిరి. ఏదే నొక యుపన్యాస మిమ్మని యామెను పురజనులు గోరిరి. అందు కామె సమ్మతించెను. ఆదినములలో మా కృత్తివెంటి నాగేశ్వరరావుగారు నాటకము లాడింపదలెనని, ప్రాతయూరిలో వక్షిపీధిని యొక పెద్ద డేరా వేయించిరి. బిసెంటమ్మగారిసభ యాడేరాలో జరిగెను. ఆసభ కచ్చటజేరిన యువకులు నన్నధ్యక్షునిగ నుండుమని కోరిరి. పెద్దలెందరో నుండగ నేనధ్యక్షునిగ నుండుట భావ్యము గాదని నేను చెప్పినను వినక, సభాసదులు నేనే యుండవలెనని పట్టుపట్టిరి. నక్కయెక్కడ దేవలోకమెక్కడ నన్నట్లు, నేనెక్కడ బిసెంటమ్మ యెక్కడ? ఐనను నేను బిసెంటమ్మను గురించి యింగ్లీషులో

బదునైదు నిమిషములు మాటలాడి, పిమ్మట బిసెంటమ్మను నుపన్యాసము ప్రారంభింపమని కోరితిని. ఆమె యప్పటి రాజకీయ పరిస్థితులను గురించి యొకగంటసేపుపన్యసించి, సభాసదుల నానందాబ్ధి నోలలాడించెను. ఈ తరుణమందేగాదు! గౌరవనీయులైన శ్రీనివాస శాస్త్రిగారు రాజమహేంద్రవరము వచ్చి సభ జేసినప్పుడు, టౌను హాలులో న్యాయపతి సుబ్బారావుగారు నన్నే యధ్యక్షునిగ నియమించిరి. ఒకపర్యాయము స్వామి శ్రద్ధానందగారు రాజమహేంద్రవరము వచ్చి సభ గావింపగా దానికి నేనధ్యక్షుడ నైతిని. బిపిను చంద్రపాలుగారు వచ్చి యుపన్యసించినప్పుడు నన్ను సభాధ్యక్షునిగ నేర్పరచిరి. పండిత సీతానాథ తత్త్వభూషణగారు వచ్చి టవును హాలులో నుపన్యసించినపుడు నన్నే యధ్యక్షునిగ జేసిరి. ఆసమయములందు నేనింగ్లీషులోనే మాటలాడితిని.

1916 వ సంవత్సరమున పునహా నివాసులైన కార్వేపండితులు రాజమహేంద్రవరము వచ్చిరి. వారిని సన్మానించి యతిథులుగ నుంచుకొమ్మని గౌరవనీయులైన శ్రీనివాసశాస్త్రిగారు నాకు వ్రాసెరి. కార్వేగారు వితంతు వివాహము జేసుకొన్న కార్యశూరులు. వితంతు శరణాలయము స్థాపించిన లోకోపకారులు; స్త్రీలకు ప్రత్యేక విశ్వవిద్యాలయము స్థాపించిన మహనీయులు. వారిని సన్మానించి, మా యచ్చుకూటమున్న మేడమీద వారికి బసనిచ్చి, మా యింటనుండి వంటకములు జేయించి తెప్పించి, వారికి బెట్టితిని. పిమ్మట వారు టవునుహాలులో సభచేసి తాము స్థాపింపదలచుకొన్న స్త్రీ విశ్వవిద్యాలయమును గురించి ప్రచారముజేయుచు మాటలాడిరి.

పూర్వము రాజమహేంద్రవరములో విజయనగరము మహారాజావారి బాలికాపాఠశాల యొకటియుండెను. కొంతకాల మైన తరువాత మహారాజాగారు దాని నెత్తివేసిరి. అప్పుడు దొరతనము వారా పాఠశాలను దీసికొని నడుపజొచ్చిరి. ఆ పాఠశాలకు రుక్మిణి అమ్మాళ్ళను నొక ద్రావిడస్త్రీ చిరకాలము ప్రధానోపాధ్యాయురాలుగా నుండెను. 1913 వ సంవత్సర ప్రాంతమున దానిని బాలికలకు ట్రయినింగుస్కూలుగ మార్చి, మిస్ పెద్ది యను నొక యాంగ్లేయస్త్రీని, ప్రధానోపాధ్యాయురాలుగ నియమించిరి. ఆమె పాఠ

శాలా పరిపాలనము తృప్తికరముగ లేకపోయెను. ట్రయినింగు కొరకు వచ్చిన పెద్దస్త్రీలను గూడ దూషించుట, చెంపకాయలు కొట్టుట, బల్లమీద నిలబెట్టుట, మొదలగు కఠినచర్య లామె చేయజొచ్చెను. తాబేదార్లనుగూడ నవమానింపజొచ్చెను. వెనుక ప్రధానోపాధ్యాయురాలుగనున్న రుక్మిణి అమ్మాళుగారు నాకడకు వచ్చి పెద్దిగారి చేష్టలగురించి పలుమారులు మొరపెట్టుకొనెను. అంతట్లో బోక పెద్దిగారు పాఠములు చెప్పక తనగదిలో నెవరితోనో మాటలాడుచు గూరుచుండుచు వచ్చెను. ఈ సంగతులు నాకు దెలియగానే నేను నా "దేశమాత" పత్రికలో నామె చర్యలు కఠినముగా విమర్శించితిని. పెద్దిగారికి మిక్కిలి కోపము వచ్చెను. ఆమె యొకసారి మా యింటికివచ్చి "నే నాంగ్లేయ స్త్రీని, నన్ను మీ రవమానబరచినారు. మీమీద చార్జినిచ్చెదను జాగ్రత" యని పరుషోక్తులు పలికెను. "మీ యిష్టము వచ్చినట్లు జేయుడు. నేనువ్రాసిన సంగతులన్నియు నిజము. వానిని నేను రుజువుచేసెదను." అని నేను నిర్భయముగా సమాధానము చెప్పితిని. ఆమె కోపావేశముతో లేచిపోయెను. నా మీద నామె యభియోగము మాత్రము తేలేదు. ఇది జరిగిన కొన్నాళ్ళకు బాలికా పాఠశాలా పరీక్షాధికారిణియైన "రీనియస్" దొరసానిగారు రాజమహేంద్రవరము వచ్చి యీ వృత్తాంతమంతయు విని, తనకడకు నన్నొకసారి రమ్మని, శ్రీ వల్లూరి నరసింహారాయుడుగారిచేత నాకు వర్తమానమంపెను. ఆ మరునాడు నేనామెను గలుసుకొని మాటలాడితిని. ఆమె నాతో నిట్లనియెను. "బాలికల ట్రయినింగుస్కూలు రాజమహేంద్రవరములో మాని, కాకినాడలో బెట్టవలెనని పైయధికారుల యభిప్రాయము; నేను పట్టుబట్టి పోరాడి యీ యూరిలో బెట్టించితిని. ఈ విధముగా పాఠశాలను గురించి వ్యతిరేకాభిప్రాయములు వెల్లడింబబడిన యెడల నిచ్చట నుండి పాఠశాల యెత్తివేయబడునేమో యని భయపడుచున్నాను. కాబట్టి యికముందు పెద్దిగారేమైన పొరపాటులు చేసిన పక్షమున, ముందుగ మీరు పత్రికలో వ్రాయక, నాకా సంగతులను దెలియపరచిన పక్షమున, నేను వాటిని జక్కపరచెదను." ఆ పలుకులు విని నేను వెడలివచ్చితిని. ఇది జరిగిన కొన్నాళ్ళకు రీనియస్ దొరసాని

గారు, పెద్దిగారిని మరియొక చోటునకు మార్చి, యామె స్థానములో నెదురుమూడి రామదాసుపంతులుగారిని నియమించిరి. అప్పటినుండియు పాలికాపాఠశాల బాగుగ జరుగజొచ్చెను.

1914, 1915 వ సంవత్సరములలో నేను జాతీయపాఠశాలకు (National School) సెక్రటరీగ నుంటిని. ఆ దినములలో నేను మట్టె సుబ్బారావుగారిని ప్రోత్సాహపరచగా, వారు పాఠశాలకు 1000 రూపాయలు విరాళమిచ్చిరి. పందిరి వీరన్నగారు 1000 రూపాయల నిచ్చిరి. గంటి లక్ష్మన్నగారు 1000 రూపాయలు నిచ్చిరి. ఈమూడు వేలును మరికొంత సొమ్మును ప్రోగుచేసి, పాఠశాలా పరిపాలకసంఘమువారు పాఠశాల నిమిత్తము, అమీరుద్దీనుసాహేబుగారితోట క్రయమునకు దీసికొనిరి. ఆ దినములలో గాడిచర్ల రామమూర్తిగారు సహాయకార్యదర్శిగా నుండి చాలపనిజేసిరి. జాతీయపాఠశాల కప్పటికి స్థిరవసతి యేర్పడెను. ఆ తోటలో రెండు బంగళాలు, నూతులు గలవు. జాతీయపాఠశాల ప్రస్తుత మా బంగళాలోనే నెలకొల్పబడి యున్నది.

పగలు చదువుకొను నిమ్నజాతుల పిల్లలకు రామమోహన పాఠశాల యున్నదిగదాయని, పగలు పనిచేసికొని రాత్రి తీరుబడిగా నుండు పెద్దవారలకు రాత్రి యొక పాఠశాల పెట్టితిని. దానికి "వివేకానంద" పాఠశాల యని పేరుబెట్టితిని. దానికొక పంచమునే యుపాధ్యాయునిగ నేర్పరచితిని. రామమోహన పాఠశాలతో బాటు దానిని గూడ నేనే నిర్వహించుచుంటిని. 1916 వ సంవత్సరమున నేను కాపురమున్న యింటివారు యనగా, రాయవరపు రామమూర్తిగారు సకుటుంబముగా నలహాబాదు వెళ్ళిరి. వారితోపాటు నా భార్యయు, మా పెదచెల్లెలు యన్నపూర్ణయు, నుత్తర హిందూస్థానము వెళ్ళి, కాశీ, గయా, ప్రయాగ, ఢిల్లీ, ఆగ్రా మొదలగు మహాస్థలములు జూచివచ్చిరి.

1917 వ సంవత్సరమున నాంధ్రమహాసభ నెల్లూరులో జరిగెను. దానికి దేశభక్త కొండా వెంకటప్పగా రధ్యక్షులైరి. ఆ సభ మిక్కిలి యుత్సాహముతో జరిగెను. నేనా సభకు బోయితిని. దొరతనమువారు మా ముద్రాక్షరశాల విషయమై వేయిరూపాయిలు

ధరావతు పుచ్చుకొన్నందుకు తమ యనిష్టము తెలియజేయుచు నొక తీర్మానము జేసిరి. దొరతనమువారు మా వద్ద బుచ్చుకున్న వేయి రూపాయిలు మా కాంధ్రమహాజనులు యిచ్చివేసిన బాగుండునని సభలో నొకరు ప్రతిపాదించగా భళిభళీయని యా సభానములు చందాలు వేసిరి. కావలసినవి 1000 రూపాయిలైయుండగా చందాలు 1600 రూపాయిలువరకు బడెను. అందరు తరువాత సొమ్ము పంపెం చెదమని చెప్పిరి. కాని తరువాత రమారమి మూడువందల రూపాయిలు మాత్రమే వసూలయ్యెను.

1917 వ సంవత్సరమున అనిబిసెంటమ్మగారు స్వరాజ్యము (Home rule) నిమిత్తము ప్రయత్నముచేయుచు నామె పత్రికయైన "న్యూయిండియా"లో మిక్కిలి తీవ్రప్రచారము చేయసాగెను. ఆమె విమర్శనను సహింపక దొరతనమువా రామెను, నామె మిత్రులైన వాడియాగారిని, అరండేలుగారిని నీలగిరిలో నొక బంగాళాలోనుంచి (Internment) దానినుండి బయటికిపోగూడదని శాసించిరి. అప్పుడు దేశమంతటను గొప్ప సంక్షోభము బయలుదేరెను. ప్రతిస్థలమునందు దొరతనమువారి చర్యను ఖండించుచు సభలుజరిగెను. ఈ దినము లలో తూర్పుగోదావరి జిల్లాకలెక్టరుగారు (వారిపేరు బర్కెటుగారని నాకు జ్ఞాపకము) రాజమహేంద్రవరము వచ్చి యింగ్లీషు క్లబ్బులో బసచేసి, నన్ను దమయొద్దకు రమ్మని వర్తమాన మంపిరి. ఆ మరు నాడు మధ్యాహ్నము నేను వారి దర్శనము చేసితిని. వారు నన్ను జూచి లేచి కరస్పర్శనముచేసి, నాయోగక్షేమమడిగి నా కంటిజబ్బు సంగతి యడిగి కడపట నిట్లనిరి. "బిసెంటమ్మగారిని వారి మిత్రులను నీలగిరిలో కట్టడిలో (Internment) నుంచిరిగదా! ఆవిషయమై దేశ మంతటా సభలు జరుగుచున్నవి. ఈ యూరిలోగూడ సభలు జరుప వచ్చును. మీరు పత్రికలలోను సభలలోను బ్రచారము తీవ్రముగా చేయుదురు. కాబట్టి మీరు జాగ్రత్తగా మాట్లాడవలసినదనియు జాగ్రత్తగ వ్రాయవలసినదనియు, మిమ్ములను హెచ్చరించుచున్నాను. మీవంటి ప్రచారకులకు హెచ్చరిక నీయవలసినదని నాకు దొరతన మువారు వ్రాసిరి". ఆపలుకులు నేను విని "చిత్తము" అని సెలవు గైకొని వచ్చితిని. తరువాత రాజమహేంద్రవరము టవునుహాలులో

సభ జరిగెను. ఎంత తీవ్రముగా నేను మాటలాడవలెనో అంత తీవ్రముగా మాటలాడితిని. నాయుపన్యాస మెప్పుడును మిక్కిలి వేగవంత మగుటచే దానిని పోలీసువారు వ్రాసుకొనలేకపోవుచుండిరి. న్యాపతి సుబ్బారావు పంతులుగారు నన్ను పలుమారులు "మిక్కిలి వేగముగ మాటాడుదురు. మీరు కొంత వేగము తగ్గింపుడ"ని పలుకుచుండెడి వారు.

1917 వ సంవత్సరమున మా మేనల్లుడైన పురాణపండ వెంకటదీక్షితులునకును, నా తమ్ముని కుమారుడైన వెంకటావ్రునకును నేనుపనయనములు జేసితిని. ఆ సంవత్సర మేప్రియలు నెలలో రావు బహదూరు కందుకూరి వీరేశలింగముగారికి జన్మదినమైన పదునారవ యేప్రియలు తారీఖున వారాంధ్రదేశమునకు జేసిన సేవకై వారికి బహిరంగమైన సన్మానము జేయవలెనని శ్రీ రఘుపతి వెంకటరత్నము నాయుడుగారును, మొక్కపాటి సుబ్బారాయుడుగారును సంకల్పించి, యాంగ్లేయభాషలో నొక యభినందన పత్రికనువ్రాసి యచ్చువేయించి, తాము సంతకములుచేసి రాజమహేంద్రి పుర ప్రముఖులచేత సంతకములు చేయించి పిదప నాంధ్రదేశమున ననేక స్థలములకు దానిని టపాలోబంపి, యాంధ్ర ప్రముఖులచేత సంతకములుచేయించి దెప్పింపనలసినదని యాకాగితము నాచేతికిచ్చిరి. దానిని నేను టపాలో విజయనగరము, విశాఖపట్టణము, గుంటూరు, బందరు మొదలైన స్థలములకంపి యాంధ్రమహాపురుషులచేత సంతకములుచేయించి దెప్పించితిని. 1917 వ సంవత్సర మేప్రియలు నెల 16 తారీఖున రాజమహేంద్రవరము టవునుహాలులో పౌరజనమహాసభ జరిగెను. కాకినాడనుండి వెంకటరత్నము నాయుడుగారు మరి కొందరు మిత్రులు సభకు దయచేసిరి. ఆసభకు శ్రీ చిత్రపు వెంకటాచలముగారధ్యక్షత వహించిరి. వల్లూరి సూర్యనారాయణరావు గారాయభినందన పత్రము చదివి వారికిసమర్పించిరి. ఆనాటి రాత్రి శ్రీ వేంకటరత్నము నాయుడుగారికి రైలు దాటిపోయినందున మాయింట బసచేసి నన్ను గౌరవించిరి.

నేను యింపీరియలు బ్యాంకువారిగొద్ద శ్రీ కనుపర్తి శ్రీరాములుగారి యాస్తియు, నా యాస్తియు హామీయిచ్చి యప్పుడప్పుడు

కొంత సొమ్ము బదులుపుచ్చుకొంటినని యీవరకే వ్రాసితిని. ఆ
బదులు మొత్తము రమారమి 2000 రూపాయిలయ్యెను. ఆబాకీ తీర్చ
వలసివచ్చెను. అదిగాక రెండు పత్రికలు నడుపుటచేతను, కొన్ని
పుస్తకము లచ్చువేయించుటచేతను, నాచేత పోషింపబడవలసిన జన
మధికమగుటచేను, మరికొంత ఋణ మధికమయ్యెను. ఈ ఋణములు
తీర్చుటకు నే నొక యుపాయ మూహించితిని. నా పుస్తకములయొక్క
కాపీరైటు హక్కు నైదుసంవత్సరములవరకు 6000 రూపాయిల కెవరి
కైన నిచ్చివేయ దలచితిని. దానిని చెన్నపురవాసులైన శ్రీ వావిళ్ల
వెంకటేశ్వరశాస్త్రిగారు విని యీ సొమ్మిచ్చి యీ హక్కు తాము
పుచ్చుకొనవలెనని నాతో నుత్తరప్రత్యుత్తరములు జరిపిరి. నేనిచ్చు
టకును, వారు పుచ్చుకొనుటకును నేర్పాటులు జరిగెను. అప్పు
డప్పుడు వారు నాకు రమారమి 1700 రూపాయిల నిచ్చిరి. సొమ్మి
చ్చుటలో వారు మిక్కిలి యాలస్యము చేసినందునను నాకు సొమ్ము
మిక్కిలి యవసరమైనందునను వారితో నొడంబడిక రద్దుపరచుకొని
రమ్మని నా గుమాస్తాయైన సత్యవోలు అప్పారావుగారిని చెన్నపురి
ఖర్చులిచ్చి పంపితిని. అతడు వెళ్లి వెంకటేశ్వర శాస్త్రిగారితో
మాటాడి, యొడంబడిక రద్దుపరచి, నా యిష్టమువచ్చినవారికి నే
నిచ్చుకొనునట్లు శాస్త్రిగారివల్ల వ్రాతమూలకమైన సమ్మతి బడసి
తిరిగివచ్చెను. పిమ్మట రాజమహేంద్రవరపుర వర్తకశిఖామణియు నాకు
చిరపరచితుడునైన మట్టె సుబ్బారావుగారు నాయొద్ద నా పుస్తకముల
హక్కు నైదుసంవత్సరములవరకు 8000 రూపాయిలిచ్చి గ్రహింప
దలచినందున వారితో నొడంబడిక జేసికొని దానిని రిజిస్టరుచేయించి
వారివలన యీ సొమ్ము పుచ్చుకొని ముందుగా బ్యాంకువారి బాకీ
తీర్చి హామీ యీయబడిన శ్రీరాములుగారి యాస్తిని, నాయాస్తిని
విడుదలచేసితిని.

1918 వ సంవత్సరము నాకు మిక్కిలి దుఃఖకరమైన సంవత్స
రము. ఏలయన, నా పుస్తకముల కాపీరైటుహక్కు పరాక్రాంత
మైనదిగదా! నా పెద్దమేనకోడలైన రావూరి వెంకటసుబ్బమ్మ భర్త
రామకృష్ణయ్య వైద్య పరీక్షలలో నుత్తీర్ణుడై బెజవాడలో సొంత
వైద్యశాలను బెట్టుకొని యచ్చట గాపురముండి వైద్యముచేయుచు,

గౌరవమును సంపాదించుకొనుచు, సుఖముగా జీవించుచుండెను. ఆ సంవత్సరము బెజవాడలో బొబ్బలమ్మ (Plague) జాడ్యము వ్యాపించియుండెను. దానికి సంబంధించిన టీకాలు వేసుకొనకుండా రామకృష్ణయ్య 'మనకేమిభయము'ని గర్వించి మహామారి తగిలిన రోగులకు చికిత్సజేయ నారంభించెను. ఆ కారణముచేత నతడు తీవ్ర జ్వరపీడితుడై నాలుగుదినములుమాత్రమే బాధపడి 1918 వ మార్చి 30 వ తేదీని కాబోలు బెజవాడలో మృతినొందెను. పాపమప్పటి కతని తల్లిదండ్రులు జీవించియుండిరి. అప్పటి కతనికి రమారమి 10 మాసముల వయసుగల యాడుపిల్ల యుండెను. ఆమె పేరు మీనాక్షి. వైద్యవృత్తిలో నారంభకుడైనందున రామకృష్ణయ్య ధనము సంపాదింపలేదు. గౌరవముగా జీవనముమాత్రము జేయుచుండెను. భార్యయు, బిడ్డయు నసహాయస్థితిలో నుండిరి. రామకృష్ణయ్యకు జబ్బుగానున్నదని విన్నతోడనే, నేను మా పెదచెల్లెలైన యన్నపూర్ణమ్మను బెజవాడ బంపితిని. మా సుబ్బమ్మ తల్లి యచ్చమ్మ నరసన్నపేటలో రెండవకూతురుదగ్గర నుండెను. మాసుబ్బమ్మ కూతురు మీనాక్షి మొదటినుండి దుర్బలశరీరము గలిగి రోగపీడితురాలై యుండెను. రాజమహేంద్రవరము వచ్చినతరువాత మీనాక్షికి జబ్బు హెచ్చెను. అందుచేత నామెను తల్లిని మిషనువారి యాసుపత్రిలో గొంతకాలము చికిత్సనిమిత్త ముంచితిని. అందుచేత నాకు వ్యయప్రయాసము లధికమయ్యెను. ఆసుపత్రిలో నెంతకాల ముంచినను నామెకు రోగము నివారణ కానందున యింటికి గొనివచ్చి మరియొక వైద్యుని చేయించితిని. ఎట్టకేలకు నీశ్వరానుగ్రహమువలన బాలిక జీవించి యారోగ్యవంతురాలయ్యెను. అందులో నాకు మరియొక దుఃఖము పిడుగుపాటివలె సంభవించెను. సుబ్బమ్మ తల్లియు, నా రెండవ చెల్లెలైన యచ్చమ్మ, కూతునకు ధైర్యముచెప్పి గాపాడుచున్న దినములలో నకస్మాత్తుగా జ్వరపీడితురాలై మూడుదినములు బాధపడి నాలుగవదినమున ననగా 1918 వ జూను 18 వ తేదీని జ్యేష్ఠ శుద్ధ యేకాదశినాడు రాత్రి మృతినొందెను. చనిపోవునప్పుడామెకు నాలుక గొణుగుపోయినందున సరిగా మాటాడలేక నన్ను దగ్గరకు బిలిచి, "అన్నయ్యా! ఉబ్బమ్మ, ఉబ్బమ్మ యని వచ్చిరానిమాట

మాటలతో నాకు మేనకోడలు సుబ్బమ్మ నప్పగించెను. పాపము! మా సుబ్బమ్మ యవస్థ మిక్కిలి శోచనీయమై యుండెను. నడివయసులోనుండి పేరు ప్రతిష్ఠలు, ధనము నార్జించుచున్న భర్త పోయెను. కూతురా రోగపీడితురాలు. ధనమా లేదు. రామకృష్ణయ్యకు కూతురేగాని కొడుకులు లేనందున నతని పిత్రార్జితమైన భూమిలో బిడ్డకు భాగములేకపోయెను. మా సుబ్బమ్మ తండ్రి చనిపోయినప్పుడెట్టి నిరాధారస్థితిలో నుండెనో నేడును నట్టి స్థితిలోనే యామె యుండెను. కడుపులోబెట్టుకొని ధైర్యముజెప్పి కాపాడవలసిన యామెతల్లి మృతినొందెను. ఆమెకు సోదరులులేరు. నేనుదప్ప నామెకు దిక్కెవ్వరును లేరు. మాతృవియోగ దుఃఖమునుండి మా సుబ్బమ్మ తేరిన తోడనే యామెకు నేను విద్యాభ్యాసము జేయించుట మంచిదని నాకు దోచెను. అంతకుముందు నా మిత్రులైన దామెర్ల వెంకటరమణారావుగారి కుమార్తెలు, వితంతువులుకాగా, వారికాయన విద్య నేర్పింపజొచ్చెను. ఆ మార్గము మంచిదని నాకు దోచెను. హిందువులలో ధనములేని బాలవితంతువులు, జీవనాధారములేక యన్నవస్త్రములకై యిబ్బందిపడుచు, నే చుట్టముల యింటనో వంటచేసి, హీన కార్యములుజేసి, మిక్కిలి శ్రమపడుచుందురు. విద్య నేర్పించినందున వారి మనసు దుఃఖమునుండి కొంత మరలును. చదువు ముగించిన తరువాత, వితంతువు లేదో యొక గౌరవమైన వృత్తివల్ల జీవింపవచ్చును. అందుచేత నా మేనగోడలికి విద్యాభ్యాసమే గర్తవ్యమని నిశ్చయించి, ముందుగా నాంధ్రప్రవేశము గలిగించుట మంచిదని, చిన్నయసూరి "నీతిచంద్రిక", "మొల్లరామాయణము" వంటి చిన్న పద్యకావ్యములు చెప్పి పిమ్మట మహాకావ్యములు బోధించి, పిమ్మట నుభయభాషాప్రవీణ పరీక్షకు బంపదలచి, సంస్కృతము నారంభించి, మొదట గద్యపద్యాత్మకమైన విక్రమార్క చరిత్ర జెప్పి, యవ్వల "రఘువంశము", "కుమారసంభవము", "మేఘసందేశము", "భారవి" జెప్పితిని. "మాఘకావ్యము"ను మా మేనమామగారైన పురాణపండ మల్లయ్యశాస్త్రిగారియొద్ద నామె జదివెను.

1918వ సంవత్సరము జూను నెలలోనే వీరేశలింగోన్నతపాఠశాల ప్రధానోపాధ్యాయులైన ముడియము సీతారామారావుగారిని,

వెంకటరత్నమునాయుడుగారును, వీరేశలింగముగారును గలసి యాలో చించి, యేకారణముననో యుద్యోగమునుండి తొలగించిరి. దీనికి దగిన కారణములులేవు. పాఠశాల మిక్కిలి యభివృద్ధిలోనుండెను. ఒక్కొక్కతరగతి నాలేసి యేడేసి డివిజనులుగా గూడనుండెను. పాఠశాలకు నష్టములేదు సరిగదా లాభముగూడ వచ్చుచుండెను. ఆయనను దీసివేయుట యన్యాయమని నాకు దోచెను. నేను సీతారామారావుగారి కేమియు సాయముచేయ లేకపోతిని. వారిస్థానమున జయంతి గంగన్నగారు ప్రధానోపాధ్యాయులుగా వచ్చిరి. సీతారామారావుగారిని తీసివేసినందులకు నేను విచారించితిని. గంగన్నగారు వచ్చినందుకునాకు విచారములేదు; వారు వచ్చుట నాకు సంతోషమే. ఏలయన గంగన్నగారు నాకు మిత్రులు, మిక్కిలి సమర్థులు. ఇటువంటి పాఠశాలకు బ్రధానోపాధ్యాయులుగ నుండదగినవారు. దైవానుగ్రహమున సీతారామారావుగారికి దత్తమండలములలో మంచి యుద్యోగము దొరకి వెళ్ళిపోయిరి.

ఆ సంవత్సర మక్టోబరునెలలో, మా మూడవచెల్లెలైన వెంకటరమణమ్మ రెండవకుమారుడగు నానందరావు సంవత్సరము వయసుగల బాలుడు; ముద్దుల మూటగట్టువాడు; నాకు మిక్కిలి ప్రియమగువాడు; దీర్ఘరోగపీడితుడై మృతినొందెను. ఆ సంవత్సరము డిశంబరు నెలలో నాకు మిక్కిలి మిత్రుడును, నాయందత్యంతాభిమానముగల మహనీయుడును, శ్రీ పిఠాపురము మహారాజావారి మంత్రియైన మొక్కపాటి సుబ్బారాయుడుగారు యిన్ఫ్లుయంజా జ్వరముచేత బాధపడి మృతినొందిరి. ఈ మరణము నాకు దుఃఖము గలుగజేసెను. ఆయన మరణవార్త నాకు శ్రీ రఘుపతి వెంకటరత్నమునాయుడుగారు దెలియపరచిరి. నేను వెంటనే పిఠాపురము వెళ్ళి, మహారాజావారిని జూచి, పరామర్శచేసితిని. తరువాత సుబ్బారాయుడుగారి మరణమునకు విషాదమును దెలుపుచు పిఠాపురముపౌరులు సభచేసిరి. ఆ సభకు వేంకటరత్నమునాయుడుగా రధ్యక్షులు. ఆ సభలో పానుగంటి లక్ష్మీనరసింహారావుగారును, నేనును మాటలాడితిమి. సుబ్బారాయుడుగారు మిక్కిలి సమర్థులు, సంస్కృతాంధ్ర

భాషాభిమానులు, పండిత పక్షపాతులు, అలాంటి మంత్రి ప్రభువులకు దొరకుటరిది.

మా ముద్రాక్షరశాల శ్రీ విజయనగరము మహారాజుగారి భవనమున, నిన్నీసుపేటలో నెలకొల్పితిమని యిదివరకే వ్రాసితిని. ఆ భవనము ఖాళీచేయుమని వారు మాకువ్రాసిరి. మాకు దగిన భవనమేమియు దొరుకలేదు. అందుచే మాలో భాగస్వామియైన చిత్రపు నరసింహారావుగారి యిన్నీసుపేట భవనములోనికే మార్చితిమి. ఆ భవనములోనే యొకమూల నరసింహారావుగారి సొంతమైన వివేకవర్ధనీ ముద్రాక్షరశాలగూడ నుండెను. ఇది మాలో మాకు వివాదములకు హేతువయ్యెను. నరసింహారావుగారియొద్ద నెల కారు రూపాయలద్దె నిర్ణయించుకొని. నా "దేశమాత" కార్యస్థానమందు రెండుగదులలో బెట్టితిని.

1918 వ సంవత్సర మక్టోబరు నెలలో, నా జీవితములో నొక గొప్ప విశేషము జరిగెను. లోకారాధ్యుడును, మహాకవీశ్వరుడును నైన రవీంద్రనాధ టాగూరుగారు. కలకత్తానుండి పిఠాపురమువచ్చి, మహారాజావారి కతిథియై కోటలో బసచేసియుండిరి. అప్పుడు నేను పిఠాపురము వెళ్ళి, కవీంద్రుడైన రవీంద్రుని దర్శనముచేసితిని. ఆయన నాతో రమారమి యరగంటసేపు మాటాడిరి. నే రచించిన పద్యములు గొన్ని చదువుమనికోరి యర్థము చెప్పించుకొని వినిరి. మా సమావేశమైనపిదప కోటలో నొకసభ జరిగెను. సుబ్బారాయుడు గారు నన్నాసభ కాహ్వానముజేసిరి. టాగూరుగారు దయచేసి గూర్చుండిరి. ఏదేనొక విషయమును గురించి యుపన్యసింపుడని టాగూరుగారిని కోరవలసినదని, మొక్కపాటి సుబ్బారాయుడుగారు నాతో జెప్పిరి. "ప్రార్థనయొక్క ప్రయోజనమేమి?" అని టాగూరు గారి నింగ్లీషులో నడిగితిని. అంతట ప్రార్థనముయొక్క ప్రయోజనమునుగూర్చి ముప్పదినిమిషములకాలం టాగూరుగా రాంగ్లేయ భాషలో నుపన్యసించిరి. ఉపన్యాసము ప్రారంభమైనతోడనే, రఘుపతి వేంకటరత్నము నాయుడుగారును, మహారాజుగారును దయచేసిరి. టాగూరుగారి కంఠధ్వని మిక్కిలి మధురమై, శ్రావ్యమై యుండెను. ఆ యుపన్యాసము విని సభాసదులు మహానందమునొందిరి. రాజము

హేంద్రవరము రావలసినదని టాగూరుగారిని నేఁ గోరితిని. వచ్చుట
కప్పు డవకాశము లేదని వారు సెలవిచ్చిరి. పిమ్మట నేను రాజమ
హేంద్రవరము వెళ్ళితిని.

నేను వెళ్ళునప్పటికి, గంజాముజిల్లాలోని పలాసా గ్రామము
నుండి యొక పెద్దమనుష్యుఁడువచ్చి, మా యింటివద్ద యుండి పలా
సాలో జరుగు వార్షికోత్సవసభ కధ్యక్షుఁడుగా రమ్మని నన్ను గోరిరి.
నా పెద్దవదినగారి కుమారుఁడైన ద్విభాషి చిన్నయ్య యనునతనిని
వెంటబెట్టుకొని, బయలుదేరి నేను పలాసా వెళ్ళితిని. విశాఖపట్టణము
దాటిన తరువాత, శ్రీకాకుళము ట్రెయినింగుస్కూలు ప్రధానోపా
ధ్యాయుఁడైన, జటప్రోలు సర్వభద్రముగారు నన్ను రైలులో గలసి
కొని, శ్రీకాకుళము రమ్మని నన్ను బలవంతము జేసిరి. తిరిగి వచ్చు
నప్పుడు వత్తునని నేను వాగ్దానముజేసితిని. నేను పలాసా స్టేషనులో
దిగగానే, రవీంద్రనాథటాగూరుగా రాబండిలోనే కలకత్తా వెళ్ళుచు
న్నారని తెలిసినందున, వెంటనే వారు కూరుచున్న మొదటి తరగతి
బండిలోనికెక్కి వారి దర్శనము రెండవసారిచేసి ధన్యుఁడనైతిని.
పిమ్మట పలాసా వెళ్ళి యచట పురజనులు జేసిన వార్షికోత్సవసభ
కధ్యక్షుఁడనై యుపన్యసించితిని. అప్పుడు శ్రీకాకుళములో డిప్యూటీ
కలెక్టరుగానున్న జయంతి రామమూర్తి పంతులుగారా సభకువచ్చి,
శ్రీకాకుళము రమ్మని నన్నుగోరిరి. పలాసాసభయైన మరునాఁడు
రాత్రి యేదోయొక నాటకము పురజనులు ప్రయోగించిరి. పిమ్మట
నేను నరసన్నపేట వెళ్ళితిని. అక్కడ నా రెండవ మేనకోడలి పెని
మిటి కోట శేషగిరిరావు సబురిజిస్ట్రారుగా నుండెను. అచట రెండు
దినములుంటిని. ఆ పురజను లేదో నొక యుపన్యాసమిమ్మని కోరినం
దున, నాయూరి బోర్డుపాఠశాలలో సంఘసంస్కరణమును గురించి
యుపన్యసించితిని. ఆ సభ కాపాఠశాల ప్రధానోపాధ్యాయుఁడును,
శ్రీ జయంతి గంగన్నగారి జ్యేష్ఠసోదరుఁడునైన, బాలకృష్ణమూర్తిగా
రధ్యక్షులుగ నుండిరి. అచటనుండి నేను శ్రీకాకుళముపోయి జట
ప్రోలు సర్వభద్రముగారింట బసచేసి, వారి పాఠశాలలో నొక యుప
న్యాస మిచ్చితిని. పిమ్మట పురజనుల కోరికమీఁద మరియొకచోట
మరియొక యుపన్యాస మిచ్చితిని. ఆసభకు శ్రీ జయంతి రామమూర్తి

పంతులుగా రక్ష్యక్షులుగ నుండిరి. అమరువాడు శ్రీ జయంతి రామ మూర్తి పంతులుగారు మమ్ము తమయింటికి గొనిపోయి, నామెడలో కర్పూరపుదండ వైచి గౌరవించి, గానవిశారదయైన తమకోడలిచేత శ్రావ్యముగ వీణాగానముచేయించిరి. ఆమె మిక్కిలి మనోహరముగా పాడెను. స్త్రీగానము వినదలచినవారు, కులటలగానము వినుటకంటె, శిక్షగా విద్యనేర్చుకున్న సంసారస్త్రీల గానము విని సుఖింపవచ్చునని నేనప్పుడనుకొంటిని. పిమ్మట నా మిత్రుడైన బుర్రా శంకరశాస్త్రి గారియింట నొకపూట విందానగించి యచటనుండి రాజమహేంద్ర వరము వచ్చితిని.

1918 వ సంవత్సరమున నక్టోబరు 23 వ తేదీని గాబోలు శ్రీ పోలవరము జమీందారుగారు కాకినాడలో మృతినొందిరి. అప్పుడు నాకునువారికిని మైత్రి లేకపోయినను, సహాధ్యాయుల మగుటచేతను, కొంతకాలము కలిసిమెలసి యుండుటచేతను, నేను విచారించితిని. ఆయన పోయిన పండ్రెండవ దినమున వారి బావమరదియు, వంగల పూడి సంస్థానాధిపతియునైన, శ్రీరాజా వాడ్రేవు వెంకటకృష్ణా రావు బహదూరువారు, 3 నవంబరు తేదీని రాజమహేంద్రవరములో మృతినొందిరి. ఆయన నాకు మిత్రులగుటచేతను, విశేషించి మా సత్యవోలు లక్ష్మీపతిగారికి పెద్దయల్లుడగుటచేతను, వీరి మరణము నాకు మిక్కిలి విచారహేతువయ్యెను. ఇట్లు బహు బంధుమిత్రుల మరణములతో 1918 వ సంవత్సరము గతించెను.

1919 జనవరిలో మాతమ్మునికి రెండవ కుమారుడు పుట్టెను. వానికి మల్లయశాస్త్రియని పేరు పెట్టిరి. మరి వారము దినములకు అనగా ఫిబ్రవరి మొదటివారములో కోట శేషగిరిరావునకు మా యింటివద్దనే రెండవ కుమారుడు పుట్టెను. ఆపురిటిలో మా మేన కోడలు వెంకటరత్నమ్మకు మశూచికమువచ్చెను. కాని యెట్టకేలకు దైవానుగ్రహమువలన నామెయు బిడ్డయు సుఖముగ స్నానముచేసిరి. ఆపిల్లవానికి సూర్యప్రకాశమని పేరు పెట్టిరి.

ముద్రాక్షరశాలా భాగస్వాములమైన మాకు వివాదములు హెచ్చుటచే, నేను "దేశమాత" పత్రిక ప్రకటించుట యీ ఫిబ్రవరి నుండి మానితిని. నేనీ రెండుపత్రికలు నడుపుటచే నెన్నో గ్రంథ

ములు రచియింపగలిగితిని. ఈ పత్రికా ప్రకటన మాగిపోయిన తరువాత, గ్రంథరచనము మునుపటివలె నాకు సాగలేదు. ఆ సంవత్సర మేప్రియలు నెలలో గోదావరీ మండలసభలు పిఠాపురములో జరిగెను. రాజకీయ సభకు మగ్గిరాల సూర్యప్రకాశరావుగారధ్యక్షులైరి. సంఘసంస్కరణ సభకు నన్నధ్యక్షునిగ నాహ్వానించిరి. సభకధ్యక్ష పదవి నధిష్ఠింపుమని (శ్రీ) రఘుపతి వెంకటరత్నము నాయుడుగారు కోరిరి. అధ్యక్షోపన్యాసము నేనెప్పటియట్లె యాశుధారగా జెప్పితిని గాని వ్రాయలేదు. సభలన్నియు సలక్షణముగనే జరిగెను.

ఆ సంవత్సరము వీరేశలింగముగారు, బెంగుళూరు వెళ్ళుట మాని. యాంధ్రకవుల రెండవభాగము సవరించి వ్రాయుటకై చెన్నపురి వెళ్ళి, కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి నివాసస్థలమైన యెళంబూరు (Egmore)లో "వేదవిలాస" మను గృహమున బసచేసి యా గ్రంథమును సవరించి వ్రాయుచుండిరి. ఆంధ్రకవుల చరిత్రము మొదటి భాగము వలెనే, రెండవ భాగముగూడ, ననేక నూతనాంశములతో బయలువెడలునని మేమువ్విళ్లూరుచుంటిమి. కాని యాంధ్రదేశీయుల దురదృష్టముచేత, నమూల్యమైన యా గ్రంథము పూర్తియగు భాగ్యము పట్టలేదు. అది వ్రాయుచుండగనే వీరేశలింగము పంతులు గారికి జ్వరము తగిలెను. జ్వరము వచ్చిన నాలుగు దినములకే హెచ్చి ప్రాణముమీదికి వచ్చెను.

1919వ సంవత్సరము మేనెల 27వ తేదీ రాత్రి, రావుబహాదూరు కందుకూరి వీరేశలింగముపంతులుగారు, చెన్నపురిలోనే వేదవిలాసమున నాంధ్రుల భాగ్యదోషమున నస్తమించిరి. ఆనాటి పగలు వారు ముద్రితమగుచున్న "కవులచరిత్ర" రెండవభాగములోని యొక కాగితము (Proof) దిద్దుచుండిరట. జబ్బెక్కువైన తరువాత, (శ్రీ) కాశీనాథుని నాగేశ్వరరావుగారు వారికడకుబోయి, మీకేమైన కోరిక లున్నవాయని యడుగగా, లేవని వీరేశలింగముగారు బదులు చెప్పిరట. ఈయన యస్తమించుటచే సంఘసంస్కరణమే కొంతవర కస్తమించినదని చెప్పవచ్చును. వీరేశలింగమువంటి సంఘసంస్కర్త, యటువంటి ధైర్యశాలి, యటువంటి కార్యశూరుడు, నటువంటి స్వార్థత్యాగి, యటువంటి లోకోపకారపరాయణుడు, కొన్ని వందల

సంవత్సరములకుగాని మనదేశమున జన్మింపడని నా దృఢమైన విశ్వాసము. అనేక స్థలములలో వారి మరణమును గురించి సభలు జరిగెను. రాజమహేంద్రవరములోగూడ నొక సభ జరిగెను. రెబ్బాప్రగడ పాపయ్యగారు చెన్నపురి వెళ్లి వీరేశలింగముగారియెముకలను, బూడిదను యొక బస్తాలోవేసి తెచ్చిరి. వీరేశలింగముగారు జీవించియుండగనే భార్య నిమిత్త మొక సమాధి గట్టించి, యామె యెముకలను నందు నిక్షేపించి, తమ నిమిత్త మొక సమాధి గట్టించుకొనిరి. పాపయ్యగారు దెచ్చిన యస్థికలను, బూడిదను వీరేశలింగముగారి సమాధిలో నిక్షేపించుటకై తోటలో నొక సభ జరిగెను. ఆ సభకు శ్రీ రఘుపతి వెంకటరత్నమునాయుడుగారు దయచేసి యా నిక్షేపణ కర్మ జరిపి మహోపన్యాసమిచ్చిరి. అప్పుడు కాళ్ళకూరి నారాయణ రావుగారు జాలిగొలుపునట్లు రసవంతమైన పద్యములు జదివిరి. ఆ దినములలో వీరేశలింగముగారి సంపుటములను ధర తగ్గించి యమ్మిరి. దానివలన కొంతసొమ్ము వచ్చెను.

ఆ సంవత్సరము 1919 వ సెప్టెంబరు నెలలో నేను మా నిరవాసరము వెళ్లితిని. నాకు సంతానములేదు. మా తమ్మునికప్పటికి ముగ్గురు కుమార్తెలు, నిద్దరు కుమారులు నుండిరి. అతడు కుటుంబ భార మీదలేక బాధపడుచుండెను. అందుచేత నేను నీరవాసరములో నున్న నా పిత్రార్జితమైన చరస్థిరాస్థులలో నావంతు సగమును, నా స్వార్జితమైన భూమియు నుచితముగా మా తమ్మునికి దస్తావేజు వ్రాసి యిచ్చి, భీమవరము వెళ్ళి దానిని రిజిష్టరు చేయించి యిచ్చివేసితిని.

ఆ సంవత్సరము డిశంబరు నెలలో చెన్నపురి గవర్నరుగారైన "వెల్లింగ్టను" ప్రభువుగారు రాజమహేంద్రవరమువచ్చి, నా కోరిక మీద నా రామమోహన పాఠశాలకు దయచేసి, చూచి సంతోషించి "Mr. Narasimham! you are turning out good work" ("నరసింహముగారూ మీరు మంచి పనిచేయుచున్నారు") అని నన్ను ప్రశంసించిరి.

1920 వ సంవత్సర ప్రారంభమున శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు రాజమహేంద్రవరము వచ్చి, నా రామమోహనపాఠశాలకు దయచేసి చూచి సంతోషించి, తాము మైసూరురాష్ట్రమున విద్యాశాఖాధికారిగ నున్నప్పుడు, నిమ్నజాత్యుద్ధరణ నిమిత్తమై తాము

చేసిన పనులు గొన్ని జెప్పి, యా పద్ధతుల నిక్కడ నుపయోగింపుమని నాకు సలహాజెప్పిరి. రామలింగారెడ్డిగారికిని నాకును 1898 నుండియు స్నేహము. అప్పుడు వారు విద్యార్థిగనుండి, కంచుమర్తి రామచంద్రరావుగారి యింటనున్న "విద్యాభిమానీ" సమాజములో, పింగళి సూరన్న కవిత్వమును గురించి చక్కగ నుపన్యసించిరి. వారి కాంధ్రభాషయందు మంచి పాండిత్యముగలదు. వారు సీమలో జదువుకున్నను మాతృభాషను మరచిపోలేదు. 1907 వ సంవత్సరము వేసవిలో రాజమహేంద్రవరము వచ్చి, కంచుమర్తి రామచంద్రరావుగారి యింట బసచేసి కొన్నిదినములుండిరి. నేను ప్రతిదినము మధ్యాహ్నము వారిని గలుసుకొనుచుంటిని. నాయందు వారికి నాటినుండి నేటికిని దయాభిమానములు మెండు.

1920 వ సంవత్సరము మొదలుకొని, సహాయనిరాకరణోద్యమము, మన యాంధ్రదేశమున ముఖ్యముగా రాజమహేంద్రవరమున, ప్రబలెను. అనేకులా యాందోళనమున బనిజేసి, చెరశాలలకు బోయిరి. త్రాగుబోతుతనము పనికిరాదని సారాగిడ్డంగుల దగ్గర నుపన్యసించి, డాక్టరు పాలకోడేటి గురుమూర్తిగారు, కంచుల వీరరాఘవస్వామినాయుడుగారు, గజవిల్లి రామచంద్రరావుగారు మొట్టమొదట చెరసాలకు బోయిరి. సహాయనిరాకరణముమీద నాకు సానుభూతి గలదుగాని నే నంధుడనగుటచేతను, రోగపీడితుడనై నా పనులు నేను స్వయముగా జేసికొనలేనివాడనగుటచేతను సాహసించి, కారాగృహమునకు వెళ్ళలేదు. పాల్‌చౌకునందును, శ్రద్ధానంద ఘట్టమునందును నేను బలుమారులు సహాయనిరాకరణమును గురించి యుపన్యసించుచుంటిని. 1920 వ సంవత్సరమున జాతీయవాదుల సభ రాజమహేంద్రవరమున జరిగెను. ఆ సభయొక్క సన్మానసంఘమునకు పౌరులు నన్నధ్యక్షునిగా నేర్పరచిరి. చెన్నపురినుండి (శ్రీ) పేరి నారాయణమూర్తిగారు మహాసభ కధ్యక్షులుగ వచ్చిరి. తత్కాలోచితముగా నేను తీవ్రమైన యుపన్యాసము చేసితిని. సభ (శ్రీ) గున్నేశ్వరరావుగారి చింతామణీ నాటకశాలలో జరిగెను.

నా రెండవ మేనగోడలి పెనిమిటి శేషగిరిరావు నరసన్నపేటలో సబురిజిస్ట్రారుగా నుండెనని, యిదివరలో జెప్పితిని. అతనికి

భీమవరము బదిలీయయ్యెను. అతడు కోపస్వభావుడగుటచే ననేకులు విరోధులగుచుండిరి. భీమవరము తాలూకాలోని యొక క్షత్రియుడు, పత్రము రిజిష్టరు చేయించుకొనుటకు కచ్చేరికి వచ్చి, శేషగిరిరావు మర్యాదచేయనందున మిక్కిలి కోపించి, సబురెజిష్ట్రారు తన్ను లంచ మడిగినట్లు డిప్యూటికలెక్టరు వారియొద్ద నొక యభియోగము దాఖలు చేసెను. శేషగిరిరావు లంచము పుచ్చుకోడని నేను చెప్పను. ఎక్కడనో కొందరుదప్ప తక్కిన సబురిజిష్ట్రారు లందరు సొమ్ము పుచ్చుకొన్నట్టే శేషగిరిరావుగూడ సొమ్ము పుచ్చుకొనుచుండెననియే నా నమ్మకము. ఆ క్షత్రియుడు దెచ్చిన యభియోగము మాత్రము నిజమైనదిగాదు. ద్వేషముచేత జేయఃబడినది. శేషగిరిరావునకు సహాయము చేయుటకై నేను పలుమారులు భీమవరము వెళ్ళితిని. ఒకసారి నామిత్రులైన సోమినకామేశ్వరరావుగారినిగూడ నాతో భీమవరము తీసుకొనివెళ్ళి, శేషగిరిరావు పక్షమున బనిచేయించితిని. డిప్యూటీ కలెక్టరుగారు శేషగిరిరావుమీద నేదో కోపముబూని కక్షవహించి యుండుటచే, కామేశ్వరరావుగారాయన యొద్దనుండి కేసును మరియొక చోటునకు మార్పుచేయించుటకు ప్రయత్నముచేసిరి. పిమ్మట నా మేనమామ కుమారుడైన పురాణపండ కామేశ్వరరావు, శేషగిరిరావు పక్షమున బందరు వెళ్ళి, కేసు మరియొక చోటుకు మార్పుచేయుమని, జిల్లాకలెక్టరుగారి యొద్ద నర్జీపెట్టగా, వెంటనే నరసాపురము సబుకలెక్టరుగారియొద్దకు మార్చిరి. అచట కేసు విచారణకు వచ్చునప్పటికి ఫిర్యాది చనిపోయెను. వారి సాక్షులు కొందరు చనిపోయిరి. ఋజువులేదని సబుకలెక్టరుగారా కేసును కొట్టివేసిరి. పిమ్మట శేషగిరిరావు మొదటితరగతి (First grade) న్యాయవ్యాది పరీక్షకు చదువుకోవలెనని, సంవత్సరము సెలవుపెట్టి కుటుంబమును దీసికొని చెన్నపురి వెళ్ళెను. అక్కడతడు తరగతిలో జేరి చదువుచుండగా జబ్బుజేసెను. అది కొంకి పురుగుజబ్బు. చెన్నపురములో గొప్పవైద్యులున్నను శేషగిరిరావు తగిన శ్రద్ధచేయనందున రోగము హెచ్చెను. పిమ్మట నతడు 1921 వ సంవత్సరము మే 1 వ తేదీ నాటికి రాజమహేంద్రవరము మాయింటికి వచ్చెను. సాధ్యమైనంతవరకు మంచి వైద్యము చేయించితిని. కాని విధినియోగముచేత 1922 వ సంవత్స

రము జూను 10 వ తేదీ శనివారమునాడు రాత్రి మృతినొందెను. అప్పటికి వృద్ధుడైన యతని తండ్రి బ్రతికియుండెను. తల్లి యంతకు ముందే చనిపోయెను. పోవునప్పటికి భార్యయు, నిద్దరు కుమాళ్ళు, సంవత్సరము వయస్సుగలిగిన నొక కుమార్తెయు నుండిరి. కోట రామమూర్తిగారు తమ కోడలిని, మనుమలను పిఠాపురము దీసికొని వెళ్ళిరి. వారక్కడ నాలుగు సంవత్సరము లుండిరి.

ఆంధ్రసాహిత్యపరిషత్సభ 1922 వ సంవత్సరమున పిఠాపురములో శ్రీ మహారాజావారి కోటలో జరిగెను. ఆ సంవత్సరమే శ్రీ పిఠాపురము రాజుగారికి మహారాజ బిరుదము వచ్చెను. ఆపరిషత్సభకు నేను వెళ్ళితిని. ఆ సభయొక్క సన్మానసంఘమునకు మహారాజుగారే యధ్యక్షులు. మహాసభకు శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగా రధ్యక్షులైరి. మహారాజుగారి సన్మానసంఘాధ్యక్షోపన్యాసము వారి భాషాపాండిత్యమును వెల్లడిచేయుచుండెను. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి యధ్యక్షోపన్యాసము మిక్కిలి చమత్కారముగా నుండెను. శ్రీరాజా పానుగంటి రామారాయణింగారును, జయంతి రామయ్యగారును, సభకు దయచేసిరి. సభ మిక్కిలి జయప్రదముగా జరిగెను. అంత వైభవముగా మరి యేపరిషత్సభయు జరుగలేదు. ఆ సంవత్సరము శ్రీరఘుపతి వేంకటరత్నము నాయుడుగారి షష్ఠిపూర్త్యుత్సవము పిఠాపురముకోటలో జరిగెను. అది శ్రీ మహారాజావారే చేయించుటచే నిరుపమానముగా జరిగెను. సభ కోటలో జరిగెను. చెన్నపురినుండి కందసామిశెట్టిగారు వచ్చి సభ కధ్యక్షత వహించిరి. అనేక సమాజములవారు నాయుడుగారి కభినందన పత్రములు సమర్పించిరి. చెన్నపురినుండివచ్చి, చింతగుంట రాఘవరావుగా రింగ్లీషులో, నాయుడుగారినిగురించి ఉపన్యసించిరి. నేను తెనుగులో నుపన్యసించితిని.

నాకు 1911 వ సంవత్సరము మొదలుకొని క్రొత్తరోగము బయలుదేరెను. అండవృద్ధియై నాకు చాలబాధ కలుగుచుండెను. తరుచుగా జ్వరము వచ్చుచుండెను. నడచుటకు మిక్కిలి కష్టముగా నుండెను. అది శస్త్రవైద్యముచేతగాని, నివారణగాదని వైద్యులు చెప్పుటచే, శ్రీ పిఠాపురము మహారాజాగారు మిక్కిలి దయాళువై

శస్త్రవైద్యము జేయింతుమని సెలవిచ్చి, ముందుగ వైద్యులతో మాటాడిరమ్మని, 100 రూపాయిలు నాకిచ్చి, 1922 వ సంవత్సరము నవంబరు నెలలో నన్ను చెన్నపురికి పంపించిరి. మాకు మిక్కిలి మిత్రులైన గంటి లక్ష్మన్నగారు హైకోర్టులో న్యాయవాదిగానున్నందున, వారి బలవంతముచే వారియింటనే భోజనముచేయుచు, మా మేనమామకుమారుడు పురాణపండ కామేశ్వరరావొంటరిగా నుండుటచే, నతనియింట బస చేసి, పదునైదుదినములుంటిని. శస్త్రవైద్యులలో నగ్రగణ్యులైన డాక్టరు రంగాచారిగారిచేత నా శరీరము బరీక్ష చేయించుకొంటిని. ఆయన పరీక్షించి "ప్రస్తుతము మీరు నీరసముగానున్నారు. రెండుమాసముల తరువాత శస్త్రచికిత్సచేసెద" నని శెలవిచ్చి నన్ను బంపిరి.

1922 వ సంవత్సరమున నా మేనకోడలు రావూరి వెంకటసుబ్బమ్మకు మనశ్చాంచల్యము గలిగెను. కలకత్తానుండి మందు దెప్పించి యిచ్చితిని. ఆమెకు రెండుమాసముల తరువాత మనసు కుదుటపడెను. పిమ్మట నామె యెప్పటియట్ల సంస్కృతాంధ్రములు జదువ నారంభించెను. ఒకసారి శ్రీ రఘుపతి వేంకటరత్నము నాయుడుగారును, నేనును గూర్చుండి మాట్లాడుచుండగా వారు నా సంసారస్థితి యడిగిరి. నేనిట్లంటిని. "నెలజీతము నాకు లేకపోవుటచే నాకు మహారాజుగా రెంతధన మిచ్చినను నా గ్రంథములవల్ల నా కెంత ధనము వచ్చినను, నేనిబ్బందిపడుచుచే యుందును. నామీద ననేకు లాధారపడి యున్నారు. గనుక నాకు నెలకు రు. 125 ఖర్చున్నది." పిమ్మట నాయుడుగారు పిఠాపురము వెళ్ళిరి. వారివల్ల నాస్థితి విని కాబోలు శ్రీ పిఠాపురము మహారాజావారు పరమదయాళులై నాకు నెలకు నూటయిరువదియైదు రూపాయిలిచ్చుట కేర్పాటుచేసిరి. మహాదాతయైన యా మహారాజుగారి యౌదార్య మేమని కొనియాడుదును ? నావలన వారి కేవిధమైన ప్రయోజనము లేకపోయినను వృద్ధుడనైన నాకు నా యింటిదగ్గర గూర్చుండబెట్టి యెవ రంత సొమ్మిత్తురు ? ఆ మహారాజుగారి కా మహారాజుగారే సాటి. అట్టి ప్రభువరేణ్యుని మరియొకరిని పేర్కొనగలమా ? ఆ యౌదార్య మాయనకే చెల్లును. ఆయన దానమిచ్చెనా యేనుగుపాడి. అప్పటినుండి నేను

మిక్కిలి సుఖపడజొచ్చితిని. 1923 వ సంవత్సరమున మార్చినెలలో మా తమ్ముడు పెద్దకూతునకు రెండవకూతునకు వివాహములు పిఠాపురములో చేసెను. ఆ వివాహములనిమిత్తమై నాకు శ్రీ మహారాజావారు వేయిరూపాయిల నిచ్చిరి. మరియొకవిధముగా, నేను మరి నాలుగువందల రూపాయిలు సంపాదించి, మొత్తము రు 1400 వివాహముల నిమిత్తమై మా తమ్మున కిచ్చితిని. అప్పటికి నా భార్యకు నగలేమియు లేవు అయినను నామె కోపగింపక వివాహములకు నాతో గూడ పిఠాపురమువచ్చి యైదుదినములు సంతోషముగా గడపెను. నా సగమాస్థియు నా తమ్మునకు నేను వ్రాసి యిచ్చినప్పుడుగూడ నామె గోపింపలేదు. 1906 వ సంవత్సరమున "ఎంపైర్ ఆఫ్ యిండియా" (Empire of India) భీమా కంపెనీలో నేను రు. 2000/-కు భీమా చేయించి నా యనంతర మాసొమ్ము నాభార్య కిచ్చునట్లుగా వ్రాసితిని. ఏటేట డెబ్బదియైనిమిది రూపాయిలు నే నా కంపెనీకి చెల్లించవలయును. అట్లు 1918 వ సంవత్సరము వరకు నేటేట సొమ్ము చెల్లించి యెట్టకేలకు చెల్లింపలేక 1919 వ సంవత్సరములో మానివేసితిని. ఇది వినిగూడ నాభార్య గోపింపలేదు.

1922 వ సంవత్సరమువరకు, నా రామమోహన పాఠశాలను, వివేకానంద పాఠశాలను నెట్లెటో నడపి యీపై నడపలేక గుడివాడ గ్రామ నివాసులును, దేశసేవాపరాయణులును, నిమ్నజాత్యుద్ధరణాసక్తులు నైన శ్రీ గూడూరి రామచంద్రరావుగారి కప్పగించితిని. ఆయన గాంధీగారి శిష్యులు; జాతీయవాదులు. నేను గవర్నమెంటు వారివల్ల యీ పాఠశాలను గురించి గ్రాంటులను పుచ్చుకొనుచుంటిని. రామచంద్రరావుగారికి సర్కారువల్ల గ్రాంటు పుచ్చుకొనుట కిష్టము లేదు. అందుచేత రామచంద్రరావుగారు పాఠశాలలను జాతీయపాఠశాలలగ మార్చి దొరతనమువారి సంబంధము వదలుకొనిరి. ఆ సంబంధము వదలుకొనగానే వెనుకటి పిల్లలు మానివేసిరి. క్రొత్తపిల్లలు చేరలేదు. కొంతకాలమునకు రెండుపాఠశాలలు కృశించి నశించెను. ఇవే గాదు.

రాజమహేంద్రవరములో నిమ్నజాతులకు పాఠశాలలు పెట్టుటకై యొక సంఘ మేర్పడెను. ఆ సంఘమువారు రాజమహేంద్రి

వరము చుట్టుపట్ల 10 స్థలములలో పాఠశాలలు స్థాపించి, చందాల వల్లను గవర్నమెంటు గ్రాంటులవల్లను, వాటిని నడుపుచుండిరి. ఆ సంఘమునకు నేనధ్యక్షుడను. తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు కార్యదర్శి, పాలకోడేటి గురుమూర్తిగారు, జయంతి గంగన్నగారు మొదలగువారు సభ్యులు. వాటిని జాతీయపాఠశాలలగా మార్చి, గ్రాంటులు పుచ్చుకొనుట మానవలెనని, గురుమూర్తిగారొక తీర్మానము నుపపాదించిరి. వద్దని నేను వాదించితిని. నా మాట చెల్లలేదు. సభ్యులు గురుమూర్తిగారి తీర్మానమునే యొప్పుకొనిరి. ఆ పాఠశాలలు క్రమముగ క్షీణించి నశించెను.

నా రామమోహన పాఠశాలలో చదువుకున్న వెంకన్నయను పంచమబాలుడు, మునిసిపలుస్కూలులో జేరి స్కూలుఫయినలు పరీక్ష యందు కృతార్థుడయ్యెను. అతడు తెలివిగలవాడగుటచే నున్నత విద్య చెప్పించిన బాగుండునని రఘుపతి వెంకటరత్నము నాయుడు గారిపేర వ్రాసితిని. వారు మహారాజావారితో మాటలాడి యా బాలుని కాకినాడ కళాశాలలో జేర్పించి, బి. యే. వరకు విద్యచెప్పించిరి. అతడు పట్టపరీక్షాసిద్ధుడై దొరతనమువారి కొలువున ప్రవేశించి యిప్పుడు సేలము జిల్లాలో డిప్యూటీ తహసీలుదారుగనున్నాడు. అతడు తన కుమారునకు లక్ష్మీనరసింహమని నా పేరు పెట్టుకొనెను. ఇతడే గాదు. మార్కండేయులను మరియొక హరిజనుడు తనకుమారునకు నాపేరే పెట్టికొనెను. ఇంతటితో నిమ్నజాతుల విషయమై నేజేసిన పని సమాప్తమయ్యెను.

బంగాళాదేశస్థుడైన రమేశచంద్రదత్తుగారు ఋగ్వేదము బెంగాలీ భాషలోనికి తర్జుమాచేసిరి. అట్లే ఋగ్వేదము నాంధ్రీకరింపవలెనని సంకల్పించితిని. కొందరి మిత్రుల సహాయమున నేను ఋగ్వేదవాఙ్మయమును తెప్పించి, పండితులనుబెట్టి, వారికి జీతములిచ్చి, ఋగ్వేదముచదివి, గుమాస్తానుపెట్టి, రమారమి యొక మండలమును దెనిగించి, కొంత భాగమును ప్రకటించితిని. కాని నేనాప్రయత్నములో సంపూర్ణముగా కృతకృత్యుడనుగా లేకపోతిని. అది ద్రవ్యైకసాధ్యమగుటచే నావంటివానికి సులభముగాదని విడిచిపెట్టితిని.

1924 వ సంవత్సరమున మా మూడవ చెల్లెలు పెనిమిటియైన, పురాణపండ వెంకన్న, తనకుమారునియొక్కయు కుమార్తెయొక్కయు వివాహములవిషయమై నాతో నాలోచించుటకు మాయింటికివచ్చెను. వచ్చిన మూడుదినములలోపుగానే యొకనాటిరాత్రి భోజనముచేసి, యెప్పటివలె నారోగ్యముగానుండి పండుకొని, నిద్రపోయి రాత్రి యొంటిగంటకు మేలుకొని, మంచితీర్థముత్రాగి, వెంటనే స్మారకము దెలియక పడిపోయెను. అది యేమిరోగమో మాకు దెలియ లేదు. డాక్టరు కారుమూరి వీరభద్రస్వామిగారిచేత యింజక్షనుగూడ జేయించితిని. ప్రయోజనము లేకపోయెను. తలలో నేదో రక్తనాళము పగిలిపోయి (Cerebral Hemerage) యుండునని వైద్యులూహించిరి. 1924 వ సంవత్సరము డిశంబరు 4 తేదికి సరియైన రక్తాక్షి సంవత్సర మార్గశిర శుద్ధాష్టమి నాడుదయమున నైదుగంటలకు, స్వర్గస్థుడయ్యెను. అతడు దృఢకాయుడు, మహాబలశాలి. అతనికి జబ్బుచేసి మంచమెక్కినను నారుమాసములు లంఘనములుచేయుటకు సామర్థ్యముగలవాడు, అంతబలశాలి యంత హఠాత్తుగ చనిపోవునని యెవ్వరనుకొనలేదు.

నాకు మిత్రులైన తల్లాప్రగడ చలపతిరావుగారు, రెబ్బాప్రగడ పాపయ్యగారుగూడ, నీ 1924 వ సంవత్సరముననే మృతినొందిరి. నా మూడవ చెల్లెలు కొమార్తెయైన కామేశ్వరికి వివాహము చేయవలసిన యీడువచ్చెను. ఆబిడ్డ 1913 వ సంవత్సరము డిశంబరు నెలలో మాయింటనే జన్మించెను. మా బావమరది మృతినొందుటచే నతని కుటుంబభారము నాపైబడెను. అతనియాస్తి ఋణగ్రస్తమైపోయెను. అతని కుమార్తెకును కుమారునకును వివాహములు నేనే చేయవలసి వచ్చెను. మాకు దగ్గర బంధువుడు పొన్నపల్లి వెంకటలక్ష్మీనరసింహారావు, వీరేశలింగోన్నత పాఠశాలలో స్కూలుఫైనలు పరీక్షయందుత్తీర్ణుడై, పిమ్మట విశాఖపట్టణములోని యింజనీరింగు కళాశాలలో నోవరుసీరు బరీక్షకుజదివి కృతార్థుడై, యీ దినములలో నిజాము రాజ్యమునం దుద్యోగములో నుండెను. నా మూడవ మేనకోడలు కామేశ్వరిని వానికిచ్చి వివాహముచేయ సంకల్పించితిని. నా వదినగారి కుమార్తె యనగా రావూరి సీతయ్యగారి నాలుగవ కుమార్తె

యగు రామాయమ్మను, బాల్యమునుండియు నాభార్య మిక్కిలి గారాబముతో బెంచెను. ఆబాలిక 1912 వ సంవత్సరము నవంబరులో జన్మించెను. నా మేనల్లుడైన పురాణపండ వెంకట దీక్షితులునకు వివాహము చేయదలచితిమి. ఈ రెండు వివాహములు 1925 వ సంవత్సరము మార్చి నెల 14 వ తేదీని నేగాపురమున్న రాయవరపు వారింటనే జేసితిని. ఆ వివాహము రెండవరోజున నాకు మహోదకము గనబడెను. వృద్ధదశలో మహోదకము వచ్చిన బ్రతుకుట కష్టము. అయినను దైవానుగ్రహమున నేను జీవించితిని. అప్పుడు నావద్దనున్న సొమ్ము చాలకపోయెను. నందివాడ విశ్వేశ్వరరావుగారియొద్ద రు. 200/-లు బదులు చేయవలసివచ్చెను. ఆయన నా కిరుగుపొరుగువాడయ్యు, చిరకాలపరిచితుడయ్యు, మున్ను నాయచ్చుకూటములో భాగస్వామియయ్యు, మొగము నెరుగని మారువాడీవలె, నెల యొకటికి నూటికి రు. 1-14-0 లు వడ్డీచొప్పున నోటువ్రాయించుకొని యిచ్చెను. ఆబాకీ తీర్చుటకు నాకు చాలకాలము పట్టెను. చివర కాయన నా మీద వ్యాజ్యము వేసెను. ఎట్లో కష్టపడి చిల్లిగవ్వయైన మానుమని కోరకుండ వారిబాకీ తీర్చితిని.

1923 వ సంవత్సరము డిశంబరు నెలలో కాకినాడ పట్టణమున జాతీయమహాసభ (Indian National Congress) జరిగెను. ఇటువంటి సన్నాహములు చేయుటకు గూడ నాంధ్రులు దగినవారే యని యీ మహాసభవల్ల స్పష్టమయ్యెను. కాకినాడ పురవాసులు లక్షరూపాయలు పోగుచేసి మిక్కిలి జయప్రదముగా సభ జరిపిరి. మహారాజశ్రీ కొండా వెంకటప్పయ్యగారు సన్మానసంఘాధ్యక్షులుగా నేర్పరుపబడిరి. సన్మానసంఘమువారు నన్నాహ్వానించి టిక్కెట్టుపంపిరి. నేను నా పరివారమును, నా బాల్యమిత్రుడైన రాపాక కౌస్తుభముగారి యింట బసచేసితిమి. ఆయన మాకాతిథ్యమిచ్చి గౌరవించెను. మహమ్మదాలీ సాహెబుగారు కాంగ్రెసునకధ్యక్షులు. ఆసభకుబోయి మహామహులైన దేశనాయకుల యుపన్యాసములు వింటిని.

1917 వ సంవత్సరమున వావిళ్ళవారికి నా గ్రంథముల కాపీరైటుహక్కు నైదుసంవత్సరములవరకు నిచ్చుటకై కొంత వ్యవహారము జరిపితిని. వారు నాకు రు 1700 ల నిచ్చి, తక్కినసొమ్ము సరిగ

నీయకపోవుటచే, వారితో వ్యవహారము వదలుకొంటినని, యిది వరకే వ్రాసితిని. ఆ సొమ్ము నేను వారికి తీర్చనందున వావిళ్ళ వారు నా మీద చెన్నపురము హైకోర్టులో వ్యాజ్యము వేసిరి. ఆడిస్ట్రిక్టు రాజమహేంద్రవరము జిల్లాకోర్టుకు పంపబడెను. దేవత శ్రీరామమూర్తిగారు వావిళ్ళవారి పక్షమున న్యాయవాదిగ బనిచేసిరి. రాజమహేంద్రవరము వచ్చినది మొదలు నా యెడ నత్యంతాభిమానము గలిగి, నాకు బలువిధముల తోడుపడుచుండిన, శ్రీ సోమిన కామేశ్వరరావుగారు నా పక్షమున న్యాయవాదిగ బనిచేసిరి. వారుమిక్కిలి పట్టుదలతో పనిచేయకపోయిన పక్షమున నే నా వ్యాజ్యములో మిక్కిలి చిక్కులు పడియుందును. పిమ్మట నేను వావిళ్ళవారికి కొంత రొక్క మిచ్చియు, గొన్ని పుస్తకము లెడిషను లచ్చువేసి కొనుటకు కొంతకాలమువరకు హక్కునిచ్చియు, మొత్తముమీద వారిఋణము పూర్తిగ దీర్చితిని.

1925 వ సంవత్సర మేప్రియలు నెలలో నొక విశేషము జరిగెను. వీరేశలింగముగారి జన్మదినోత్సవము జరుపబడెను. ఆ సభ టవునుహాలులో శ్రీ రాయసము వెంకటశివుడుగారి యధ్యక్షతక్రింద జరిగెను. శ్రీ రఘుపతి వేంకటరత్నము నాయుడుగా రాంగ్లభాషలో నుపన్యసించిరి. అంతకుముందు వీరేశలింగముగారిమీద దోషారోపణజేసి, వారికి మనఃకష్టము గలిగించిన నాళము కృష్ణారావుగారు వీరేశలింగముగారిమీద దాము చేసిన దోషారోపణలకు జింతించుచు, దమ యనుతాపమును, పద్యరూపములుగా వ్రాసి యచ్చువేయించి యా సభలో జదివిరి. అప్పటికైనను వారికి బశ్చాత్తాపము గలిగినందుకు నేనును నాయుడుగారును దక్కిన మిత్రులును సంతసించితిమి.

# స్వీయచరిత్రము

## ఇరువదియవ ప్రకరణము

### షష్ఠిపూర్తి

1926 వ సంవత్సరమున నొకనాటి సాయంకాలమున, నేను టవునుహాలులో గూర్చుండగా నా మిత్రులైన వేమూరి విశ్వనాథ శర్మగారక్కడకువచ్చి, "మీకరువదియేండ్లెప్పటికి నిండు" నని, నన్నడిగిరి. 1927 వ సంవత్సరము సెప్టెంబరు 26 వ తేదీకి నాకరువది యేండ్లు నిండునని చెప్పితిని. పిమ్మట వారు చెన్నపురి వెళ్ళి, శ్రీ మునగాల రాజాగారిని గలుసుకొని, మన మందరము లక్ష్మీనరసింహము గారికి షష్ఠిపూర్తి చేయవలెనని వారితో జెప్పిరట! మునగాల రాజా గారు మిక్కిలి సంతోషించి, శర్మగారితో గలిసి, రఘుపతి వేంకట రత్నము నాయుడుగారిదగ్గరకు వెళ్ళిరట. అప్పుడాయన చెన్నపురి విశ్వవిద్యాలయమున కుపాధ్యక్షులుగ నచ్చటనే యుండిరి. వారును వీరి సలహా నంగీకరించిరట. పిమ్మట విశ్వనాథశర్మగారు, రాజమహేంద్రవరమువచ్చి, షష్ఠిపూర్తిసంఘ మొకదాని నేర్పరచి, దానికి శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగా రధ్యక్షులుగను, పాలకోడేటి గురుమూర్తిగారిని గార్యదర్శిగాను, నేర్పరచిరి. "కర్పూరమంజరి" మొదటిభాగము 1907 వ సంవత్సరములో వ్రాసి యప్పటినుండియు రెండవభాగము వ్రాయలేదు. పూర్వ మొకసారి శ్రీ పిఠాపురము మహారాజావారు, మొక్కపాటి సుబ్బారాయుడుగారు జీవించియున్నప్పుడే, "ప్రహ్లాద" నాటకము రసవంతముగా వ్రాయుమని నాతో జెప్పిరి. నేను దాని కొప్పుకొంటినిగాని వ్రాయలేదు. విశ్వనాథశర్మ గారు నాతో నొకసారి "కర్పూరమంజరి" రెండవభాగమును, "ప్రహ్లాద" నాటకమును మరియు వ్రాయవలసిన గ్రంథము లేవైన యున్నపక్షమున, వాటిని షష్ఠిపూర్త్యుత్సవము లోపుగ వ్రాయవలసినదని నాతో జెప్పిరి. గ్రంథములు వ్రాయుటకు నాకు లేఖకునిగా, కామరాజు వెంకటరమణ శర్మగారినిచ్చి, యాయన జీతము నెలకు ముప్పదిరూపాయల చొప్పున షష్ఠిపూర్తి సంఘమువారే యిచ్చుచుండిరి. నేను గ్రంథములను వ్రాయుట కారంభించితిని. అంతకు

మున్నే "భాస" నాటకములలోని "మధ్యమవ్యాయోగము"ను,"స్వప్న వాసవదత్త"ను నాంధ్రీకరించి ప్రచురించితిని. ''భాస'' నాటకముల నన్నింటిని దెనుగుచేయవలెనని నాకు మొదటినుండియు గుతూహలము గలదు. నా గ్రంథము లన్నియు షష్టిపూర్తి సంఘమువారు 10 సంపుటములుగా ముద్రింపించ దలచిరి, అవి యీ క్రిందివిధముగా నున్నవి.

మొదటిసంపుటము "దేశమాత'' లోను మనోరమలోను నేను ప్రకటించిన హాస్యములు చాలవరకు నిందుగలవు. 2, 3, 4, 5, సంపుటములలో నా రచించిన నవలలన్నియు గలవు. ఆరవసంపుటములో నేను స్వకపోలకల్పితముగ రచియించిన నాటకములు గలవు. 7 వ సంపుటములో నే నాంధ్రీకరించిన నాటకములు చాలగలవు. కర్ణభారము నభిషేకనాటకముదక్క దక్కిన "భాస'' నాటకములన్నియు దెనిగించి నే నీసంపుటములలో గూర్చితిని. 8 వ సంపుటములో నే వ్రాసిన ''సిద్ధార్థచరిత్ర" మొదలైన జీవచరిత్రలు గలవు. 9 వ సంపుటమున "భాగవతకథామంజరి" ''భారతకథామంజరి'' "వినోదములు" 2 భాగములు ''చమత్కారమంజరి'' 2 భాగములు గలవు. 10 వ సంపుటమున "రాజస్థానకథావళి'' 1, 2 భాగములు, "రఘుకులచరిత్ర" "ప్రచ్ఛన్నపాండవము'' గలవు. సుబ్బారావుపంతులుగారు షష్టిపూర్తిసంఘమున కధ్యక్షులుగ నుండుటయేగాక, యాంధ్రదేశములోనున్న యన్ని జిల్లాలలోని ప్రముఖులగు పెద్దమనుష్యులకు, షష్టిపూర్తి సంఘములో సభ్యులుగనుండుమనివ్రాసి, లిఖితపూర్వకమైన వారి సమ్మతులు దెప్పించి, వారి నందుచేర్చిరి. ఆ షష్టిపూర్తి సంఘములో సభ్యు లిరువదితొమ్మండుగురు, వారిపేళ్ళివి.

(1) రఘుపతి వెంకటరత్నము నాయుడుగారు, చెన్నపురి. (2) కట్టమంచి రామలింగారెడ్డిగారు, బెజవాడ. (3) కిళాంబి రామానుజాచార్యులుగారు, విజయనగరము. (4) జయంతి రామయ్యగారు, తొత్తరమూడి. (5) సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు, కలకత్తా. (6) వేపా రామేశంగారు, చెన్నపురి. (7) ముత్తా వెంకటసుబ్బారావుగారు, చెన్నపురి. (8) నాయని వెంకటరంగారావుగారు, మునగాలరాజాగారు. (9) మంత్రిప్రగడ భుజంగరావుగారు, లక్కవరం

రాజాగారు. (10) వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వరప్రసాదుగారు, జయంతిపురంరాజాగారు, (11) కాశీనాథుని నాగేశ్వరరావుగారు, చెన్నపట్టణము. (12) వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపురి. (13) చింతలపాటి నరసింహరాజుగారు, విశాఖపట్టణము. (14) భూపతిరాజు వెంకటపతిరాజుగారు, విశాఖపట్టణము. (15) మోచర్ల రామచంద్రరావుగారు, ఏలూరు. (16) వరదా కామేశ్వరరావుగారు, (పూండి) గంజాంజిల్లా. (17) వరహగిరి వెంకటజోగయ్యగారు, బరంపురం. (18) కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తిగారు, కాకినాడ. (19) కొండా వెంకటప్పయ్యగారు, గుంటూరు. (20) బి. పెరుమాళ్ళనాయుడుగారు, కందుకూరు. (21) రాయసం వెంకటశివుడుగారు, నెల్లూరు. (22) అల్లాడ కృష్ణస్వామయ్యరుగారు, చెన్నపురి. (23) సామి వెంకటాచలంచెట్టిగారు, చెన్నపురి. (24) గంటి లక్ష్మన్నగారు, చెన్నపట్టణము. (25) టి. రాఘవాచార్యులుగారు, బళ్ళారి. (26) టి. శివశంకరముగారు, పెనుగొండ. (27) మాడపాటి హనుమంతరావుగారు, హైదరాబాదు. (28) పాలకోడేటి గురుమూర్తిగారు, రాజమహేంద్రవరం. కార్యదర్శి. (29) న్యాపతి సుబ్బారావుపంతులుగారు, రాజమహేంద్రవరము. అధ్యక్షులు. ఒక్క రాజమహేంద్రవర పురవాసులే యీ యుత్సవము జేసినట్లుగాకుండ దేశమంతయు జేసిరని తెలియుటకై సుబ్బారావుపంతులుగారును గురుమూర్తిగారును దేశములో నానాభాగములందున్న ప్రముఖులకు వ్రాసి వారి యనుజ్ఞ బడసిరి. ఈ సంపుటములన్నియు రాజమహేంద్రవరములో సుజనరంజనీ ముద్రాక్షరశాలాధిపతియైన పోతాప్రగడ శేషగిరిరావుగారు ముద్రించుట కంగీకరించిరి. 10 సంపుటములకు కావలసిన కాగితము షష్టిపూర్తిసంఘమువా రిచ్చునట్లును, ముద్రణమైన తరువాత ముద్రణమునకైన సొమ్ము సంఘమువారిచ్చునట్లును, సంఘమువారును శేషగిరిరావుగారు నొడంబడిక చేసికొనిరి. కాగితముల నిమిత్తమై సంఘమువారికి శ్రీ మునగాలరాజాగారగు నాయని వెంకటరంగారావుబహదూరువారు రు 500/-లు పెట్టుబడి పెట్టిరి. వుయ్యూరు జమీందారుగారగు శ్రీ వెంకటాద్రి అప్పారావు బహద్దరువారు రు 150/-లు పంపిరి. 10 సంపుటముల ఖరీ దిరువదియైదురూపాయిలు.

చందాదారులనిమిత్తము విశ్వనాథశర్మగారును, గురుమూర్తిగారును నరసాపురము, భీమవరము, ఏలూరు, గుంటూరు మొదలగు ననేక స్థలములకరిగి తిరిగి శ్రమపడి చందాదారులను చేర్చిరి. సంపుటముల కట్టలిక్కడ చక్కగకట్టరని, యచ్చుపడిన పుస్తకములను చెన్నపురి బంపి యట్టలుగట్టించి దెప్పించిరి. నా వ్రాతయు, ముద్రణమును 1927 సెప్టెంబరులోపుగ గాలేదు. 1927 సెప్టెంబరు 26 వ తేదీకి నా కరువది యేండ్లు నిండెను. తెనుగు తిథులప్రకారము ప్రభవసంవత్సర భాద్రపద బ ౧౪ నాటికి నా కరువదియేండ్లు నిండెను. ఆ రెండుతిథులనాటికి ముద్రణము ముగియనందున బహిరంగమైన షష్టిపూర్త్యుత్సవము సంఘమువారు జేయలేదు. ముద్రణము పూర్తియైనతరువాత యీ యుత్సవము జేయవలెనని శర్మగారి సంకల్పము.

అయినను భాద్రపద బ ౧౪ నాడు నా స్వజనము నా కభ్యంగనము చేయించి బంధుమిత్రులకు భోజనములుపెట్టి గృహమందుత్సవము జేసిరి. ఆ నాడు కాకినాడ నుండి వి. సి. రాజునాయుడుగారు వచ్చి, మా యింట నాయారోగ్యము నిమిత్తమై దైవప్రార్థనములు సలిపిరి. రాజమహేంద్రవరములోని మిత్రులు గొందరు నా కా దినమున బుస్తకముల బహుమాన మంపిరి. శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు నా కొక విలువగల పట్టుపంచను, నా భార్యకొక పట్టుచీరయు, బహుమానము జేసిరి. సంపుటముల ముద్రణము ముగియునప్పటికి 1927 వ సంవత్సరముగడచి 1928వ సంవత్సరము వచ్చెను. కాబట్టి షష్టిపూర్తి మహోత్సవము బహిరంగముగ 1928 వ సంవత్సరము మార్చి 11వ తారీఖున టవునుహాలు వెనుకనున్న యావరణములో జరిగెను. అప్పటికి ప్రభవ సంవత్సరము గడచిపోలేదు. నేను ప్రభవ సంవత్సరములో జన్మించితిని. కావున మాసము భేదించినను ప్రభవ సంవత్సరములోనే ఈ యుత్సవము జరిగెను. చెన్నపురి నుండి శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారువచ్చి సభ కధ్యక్షత వహించిరి. హైదరాబాదు (డక్కను) నుండి శ్రీ మునగాలరాజాగారగు నాయని వెంకటరంగారావుగారు దయచేసిరి. ఏలూరునుండి శ్రీ మోచర్ల రామచంద్రరావుగారు దయచేసిరి. బందరునుండి శ్రీ పురాణం సూరిశాస్త్రిగారు వచ్చిరి. కాకినాడనుండి శ్రీ పిఠాపురము రాజాగారి కళాశాలా

ప్రధానాచార్యులైన డాక్టరు వేమూరి రామకృష్ణారావుగారు దయ చేసిరి. ఆ దినమున నుదయమున శ్రీ వేమూరి విశ్వనాథశర్మగారు నాకును నా మిత్రులకును విందు చేసిరి. గురుమూర్తిగారింటివద్ద మధ్యాహ్నము 3 గంటలకు నాకు నా మిత్రులతో గలిపి ఛాయా చిత్రము (Photo) దీసిరి. ఆనాడు మోటారుబండిలో నన్ను గూర్చుండబెట్టి మంగళవాద్యములతో నూరేగించిరి. కారులో నాకొక ప్రక్క న్యాయపతి సుబ్బారావు పంతులుగారును, రెండవ ప్రక్క శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారును గూర్చుండిరి. మోటారు వెంబడి శ్రీ మునగాల రాజాగారును, మోచర్ల రామచంద్రరావు గారును, వేమూరి విశ్వనాథశర్మగారును, పాలకోడేటి గురుమూర్తి గారును, వేమూరి రామకృష్ణారావుగారును, మరియు కొందరు పుర ప్రముఖులును, పైయూళ్ళనుండి వచ్చిన మిత్రులును నడచివచ్చిరి. సభ జరుగు టవునుహాలులో ముందు వెనుక ప్రక్క యావరణమంతయు జనులతో నిండెను. శ్రీ వేమూరి రామకృష్ణారావుగారు సభా ప్రారంభమున దైవప్రార్థనములు సలిపిరి. సభకు రాజాలని జయంతి రామయ్య పంతులుగారు మొదలగు మిత్రులు పంపిన జాబులును, శ్రీ పిఠాపురము మహారాజాగారు సభకు రాజాలనందున వారి సానుభూతిని దెలుపుచు పంపిన తంతివార్తయు జదువబడెను.

శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు తమ యధ్యక్షోపన్యాసములో నా నవలలనుగూర్చియు, నా నాటక రచనలను గూర్చియు, నా వక్తృత్వమును గూర్చియు నెంతో ప్రశంసించి మాటాడిరి. పురాణము సూరిశాస్త్రిగారు నన్నుగురించి కొంతసేపు మాటాడిరి. శ్రీ వడ్డాది సుబ్బారాయుడుగారు, శ్రీ వారణాసి సూర్యనారాయణశాస్త్రిగారు, అడవి శంకరరావుగారు, పొన్నాడ కృష్ణమూర్తిగారు, వేదుల సత్యనారాయణగారు, విద్వాన్ రావూరి వెంకటసుబ్బయ్యగారు సమయోచితముగ పద్యములు వ్రాసి సభలో చదివిరి. ఎర్రగుంటల జనార్దనమ్మగారు కొంతసేపు మాటాడిరి. పాలకోడేటి గురుమూర్తిగారు (కార్యదర్శి) షష్టిపూర్తి సంఘముయొక్క నివేదికను జదివిరి. శ్రీ మునగాల రాజాగారు హైదరాబాదు నుండి దెచ్చిన విలువగల రెండు శాలువలను నాకుగప్పి యభినందన పత్రి

మును స్వయముగా జదివి సమర్పబడిన యొక చట్రములో బెట్టిన యచ్చుపత్రికను నాకిచ్చిరి. ఆ సమయముననే యందమైన యట్టలు గట్టిన 10 సంపుటములు చక్కని నగిషీ పెట్టెలో బెట్టి దానిని నాకు సంఘమువారు బహుమానమిచ్చిరి. ఈ షష్టిపూర్తి సందర్భమున విశ్వనాధశర్మగారు చేసినకృషి యమూల్యము. వారికిని మునగాల రాజాగారికిని, న్యాపతి సుబ్బారావు పంతులుగారికిని, పాలకోడేటి గురుమూర్తిగారికిని, నేను మిక్కిలి కృతజ్ఞుడను. రాజమహేంద్రవరమున షష్టిపూర్తి మహోత్సవము జరుగుట కదియే ప్రధమము, అది జయప్రదముగా జరిగెనని నా మిత్రుల యభిప్రాయము.

నా మేనకోడలు సుబ్బమ్మ 1925 వ సంవత్సరమున నుభయ భాషాప్రవీణ పరీక్షకు దరఖాస్తుచేసి పరీక్షకు వెళ్ళెను. కాని యా సంవత్సరము కృతార్థురాలుగాక తప్పిపోయెను. అయినను బాలికా పాఠశాలాధికారిణియైన "రాజోరియా" దొరసానిగారు పరీక్షలో మరుచటి సంవత్సరము మా మేనగోడలు సిద్ధిపొందునట్టి షరతుమీద, నా మేనను విశాఖపట్నములోని మేరీరాణి బాలికా పాఠశాలలో, నాంధ్రోపాధ్యాయురాలినిగ నియమించిరి.

1926 వ సంవత్సరమున సాహిత్య పరిషద్వార్షికసభ నాకినాడలో జరిగెను. ఆసభకు నేనధ్యక్షుడుగ నెన్నుకొనబడితిని. నాకును ప్రతిథులకును మంత్రిప్రగడవారి సత్రములో బసయిచ్చిరి. అన్నదాన సమాజ భవనములో సభజరిగెను. దివానుబహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు సన్మానసంఘమునకధ్యక్షులై ప్రతినిధులకు స్వాగతమిచ్చిరి. ఆ సభకు శ్రీ గిడుగు రామమూర్తిగారు గూడ దయచేసిరి. నా ప్రారంభోపన్యాసమును నే నెప్పటియట్లు యాశుధారగా జెప్పితినిగాని వ్రాసి జదువలేదు. పిమ్మట కొంత వ్రాసి పంపగా నప్పటి సాహిత్య పరిషత్పత్రికలో బ్రచురింపబడెను. వ్యావహారిక భాషావాదులైన గిడుగు రామమూర్తిపంతులుగారికిని నాకును కొంత చర్చ జరిగెను. రామమూర్తిగారు సభలో పాలుగొనక సభ నుండి వెడలిపోయిరి. సభ సలక్షణముగానే జరిగెను.

1927 వ సంవత్సరమున సాహిత్య పరిషద్వార్షికసభ మరల కాకినాడలోనే జరిగెను. ఆ సన్మానసంఘమునకు శ్రీ మునుకుట్ల

యచ్యుతరామయ్యగారు అధ్యక్షులై ప్రతినిధులకు స్వాగతమిచ్చిరి. ఆ మహాసభకు వుయ్యూరు రాజాగారైన శ్రీ వెంకటాద్రి అప్పారావుగారు అధ్యక్షులైరి. ఆసభకు నేనునుబోయి పాలుగొంటిని. ఆసభకు శ్రీ పిఠాపురము మహారాజావారుగూడ దయచేసిరి. ఆ సంవత్సరమంతయు నేను నా షష్ఠిపూర్తికి వ్రాయవలసిన గ్రంథములను వ్రాయుచుంటిని.

1928 వ సంవత్సరమున నొక విశేషము జరిగెను. టంగుటూరి శ్రీరాములుగారి రెండవ కుమారుడైన లక్ష్మీనారాయణకు జబ్బుచేసి ప్రాణముమీదికి వచ్చెను. 1913 వ సంవత్సరమున నేను వీరేశలింగముగారి పక్షమున సాక్ష్యమిచ్చినది మొదలు శ్రీరాములుగారు నాతో మాటాడుట మానిరి. నేను కాపురమున్న కారణమున శ్రీరాములుగారు తన తోడల్లుడైన రాయవరపు రామమూర్తిగారియింటికి వచ్చుట మానిరి. అట్లున్నను నేను వారిపై ద్వేషముబూనక వారి కుమారుని కెక్కువ జబ్బుగా నున్నప్పుడు పిల్లవానిని జూచుటకై నా తమ్ముడు కృష్ణమూర్తిని నా మేనల్లుడు పురాణపండ వెంకటదీక్షితులిని వెంటదీసుకొని శ్రీరాములుగారి యింటికి బోయితిని. ఆజబ్బుగానున్న బాలుడు విభవసంవత్సర చైత్ర శు ౯ అనగా, శ్రీరామనవమినాటి యుదయమున. మృతినొందెను. ఏ సందేహమును లేక నా మేనల్లుడు పురాణపండ వెంకట దీక్షితులను శవమును మోయుటకై నియోగించితిని. మిడమిడగాలుచున్న యెండలో పాదములు పొక్కులెక్కినను నా మేనల్లు డాపనిజేసి, శవదహనము పూర్తియైనదాకనుండి, సాయంకాలము మూడుగంట లగుసరికి యింటికివచ్చెను. శ్రీరాములుగారి కుటుంబములోని జనుల నోదార్చుటకు మాతమ్ముని నియోగించితిని. మా తమ్ముడు వారి నోదార్చి స్నానములుజేయించి వారికందరకు వంట జేసిపెట్టి వారి భోజనములైనపిమ్మట రాత్రి కింటికి వచ్చెను.

ఆ సంవత్సరము జూలై నెలలో (1928) అనంతపురము రావలసినదని నా కాహ్వానమంపిరి. వీరేశలింగోన్నత పాఠశాలలో వ్యాయామోపాధ్యాయుడుగా నున్న మల్లుభొట్ల వెంకయ్యను దీసికొని, యనంతపురము వెళ్ళితిని. అక్కడ వారు నాకు మిక్కిలి యాద

రాభిమానములు జూపి గౌరవించిరి. నేను కళాశాలలో నొక యుప
న్యాసమును, టవునుహాలులో నొక యుపన్యాసము నిచ్చితిని. అచ్చట
నిరంతరము చల్లగాలి వీచుచుండును. అచటి విద్యార్థులు "వరవి
క్రియ"యను నాటకమును ప్రయోగించి, దానికి నన్నాహ్వానించిరి.
కళాశాలా ప్రధానాచార్యులు, యస్. ఆర్. కృష్ణమ్మగారు వారి
గుర్రపుబండిమీద నన్ను నాటకమునకు దీసికొనిపోయిరి. రాజమ
హేంద్ర నివాసులైన మిత్రులనేకు లచట నుద్యోగములలో నుండిరి.
ప్రయాగ వెంకటరామశాస్త్రిగారును, చిలుకూరి నారాయణరావు
గారును, దామెర్ల వెంకటరావుగారును, కర్రా వెంకటరావుగారును,
కేశరాజు సత్యనారాయణగారును, నొకరినిమించి యొకరు విందినంట
లతో నాకు విందులు చేసిరి. కాలేజి విద్యార్థులొకనాటిరాత్రి నాకు
హాస్టలులో విందుచేసిరి. యస్. ఆర్. కృష్ణమ్మగారుగూడ విందులో
పాలుగొనిరి. నేను దేశభట్ల లక్ష్మీనరసింహముగారి యింటనే బస
చేసితిని. వారు భార్యాభర్తలు నన్ను మిక్కిలి గౌరవించి సకలోప
చారములుజేసి, నాయునికి సౌఖ్యప్రదముగా జేసిరి. కడపటి దిన
మున హాస్టలు విద్యార్థులు నాకొక "టీ" పార్టీ నిచ్చిరి. అందుపా
ధ్యాయులు విద్యార్థులు గూడ పాలుగొనిరి. ఆ దినముననే నేను
వారందరికడను సెలవు గైకొని మల్లిభొట్ల వెంకయ్యను దీసికొని
బయలుదేరితిని. నా మిత్రులైన యుపాధ్యాయులును విద్యార్థులును,
రైలుస్టేషనువరకు సాగనంపి యచట నాకు నూరు రూపాయలను
బహుమానముగా నిచ్చిరి. రైలెక్కి గుంటకల్లు చేరితిని. గుంటకల్లు
చేరగానే కడుపులో గుడగుడ శబ్దము బయలుదేరెను. అనంతపుర
మున జరిగిన విందులలో నేను మితముగా భుజించినను, నా కా
స్వల్పాహారమే యజీర్ణము జేసెను. రైలుబండిలోనే యజీర్ణ విరేచ
నములు ప్రారంభమయ్యెను. త్రోవలో నందియాలలోను, మార్కా
పురములోను విషూచి జాడ్యము విశేషముగా వ్యాపించియుండెను.
నాదిగూడ విషూచిజాడ్యమని తలంచి రైల్వేయధికారులు నన్ను
రైలు దింపివేయుదురేమోయని నేను సందేహించితిని. కాని డోకులు
కాళ్లుతీతలు లేవుగనుక విషూచిగాదని నాలో నేను నిశ్చయించుకొం
టిని. దొడ్డికి వళ్ళివచ్చి పండుకొనుటయేగాని మంచినీళ్ళుగాని

యాహారముగాని నేను మ్రింగలేదు. రెండుదినము లిట్లుపవసించిన తరువాత నే యౌషధ మక్కరలేకయే నాకు రోగము కుదిరెను. నేను సురక్షితముగా రాజమహేంద్రవరము జేరితిని.

1928 ఆగస్టు నెలలో నా బాల్యమిత్రుడైన, టంగుటూరి ప్రకాశముగారి పెద్దకుమారునకు, విజయనగరములో వివాహముచేయుటకు నిశ్చయింపబడెను. కవిపురపు వెంకటరత్నము పంతులుగారి రెండవకుమార్తెయు, గురజాడ శ్రీరామమూర్తిపంతులుగారి దౌహిత్రియునైన యహల్యను, ప్రకాశముగారి పెద్దకుమారుడైన నరసింహమునకిచ్చి వివాహముజేసిరి. ప్రకాశముగారికి నేను ముఖ్యమిత్రుడ నగుటచే వివాహమునకు రమ్మని నన్ను బలవంతపెట్టి దీసుకొని పోయిరి. నా మేనల్లుడు పురాణపండ వెంకటదీక్షితులు నా వెంట వచ్చెను. ప్రకాశముగారు, వారిభార్య, ఆయన తమ్ముడు టంగుటూరి శ్రీరాములుగారు, నేను రెండవతరగతిలో ప్రయాణము జేసితిమి. అంతకుముందు 15 సంవత్సరములనుండి నాతో మాటాడుట మానిన, టంగుటూరి శ్రీరాములుగారు నన్ను బలుకరించి, నాతో మాటాడుట ప్రారంభించిరి. వారికి నామీద హటాత్తుగ నంతదయ యెట్లుగలిగెనో నే నెరుగను. విజయనగరములో ప్రకాశముగారి కుమారున కేకరాత్రి వివాహము జరిగెను. మరునాడు ప్రకాశము గారును, నేనును, రాజకీయపరిస్థితులను గురించి బహిరంగసభలో నుపన్యసించితిమి. ఆ మరునాడు రాజమహేంద్రవరమునకు బయలు దేరి వెళ్ళితిమి. సెప్టెంబరు నెలలో నేను గుంటూరుజిల్లాలోని వేట పాలెము వెళ్ళితిని. ఊటకూరు సుబ్బరాయశ్రేష్ఠియను నొక వైశ్య శిఖామణి యచట నొక గ్రంథభాండాగారము స్థాపించి, దాని కేటేట వార్షికోత్సవములు జేయుచు నన్నా యే డధ్యక్షునిగరమ్మని యాహ్వానించిరి. నా తమ్ముని జ్యేష్ఠకుమారుడైన వెంకటావ్రును దీసికొని పోతిని. సభ రెండుదినములు చక్కగ జరిగెను. సుబ్బరాయశ్రేష్ఠి గారా గ్రంథభాండాగారమునకు బహువిధముల తోడ్పడుచు దానిని వృద్ధిచేయుచుండిరి.

ఆ సంవత్సరమనగా 1928 లో బ్రహ్మసమాజ శతవార్షికోత్సవము వచ్చెను. కాకినాడలో రఘుపతి వేంకటరత్నము నాయుడు

గారు (శ్రీ) పిఠాపురము మహారాజావారి సహాయమున గొప్ప యుత్సవములు జేయించిరి. నేను కాకినాడ బోయి యీ యుత్సవములలో గొంత పాలుగొంటిని. ఆ సంవత్సరము నవంబరు నెలలో నాకు మిక్కిలి జబ్బుచేసెను. అమితమైన వికారము, వమనములు, నెడతెగని యెక్కిళ్ళు, నా కాజబ్బులో పొడజూపెను. నా భార్యయు, నా కుటుంబములోనివారును. నావిషయమై నిరాశపడిరి. ఇరువు రింగ్లీషు వైద్యులు నాకు వైద్యముచేసిరి. కాని తగ్గలేదు. నేను వారి సలహామీదనే వారివైద్యముమాని యీయాయుర్వేద వైద్యశిఖామణియు, నాకు పరిచితుడును, పండిత గోపాలాచార్యులుగారి శిష్యుడునైన బ్రహ్మశ్రీ చావలి రామమూర్తిశాస్త్రిగారియొద్ద మందు పుచ్చుకొంటిని. వారి చికిత్సవలన నారోగము నివారణమయ్యెను. వారు నాయొద్ద ధనమేమియు స్వీకరింపకయే నాకు బలుమారులు వైద్యము జేసినందులకు కృతజ్ఞుడను.

నా పెద్దమేనకోడలు రావూరి వెంకటసుబ్బమ్మ విశాఖపట్నములో నున్న మేరీ పాఠశాలలో పనిచేయుచునే యుభయభాషా ప్రవీణ పరీక్షలో గృతార్థురాలై 1928వ సంవత్సరమున జరిగిన ఆంధ్ర విశ్వవిద్యాపీఠ పట్టప్రదానసభకు (Convocation) హాజరై, యుభయ భాషాప్రవీణ పట్టము గ్రహించెను. ఆంధ్ర విశ్వవిద్యాపీఠమున నుభయ భాషాప్రవీణపట్టము గైకొన్న ప్రథమస్త్రీ యీమెయే. తరువాత స్త్రీలు పెక్కండ్రు తత్పరీక్షయందు గృతార్థతనొందిరిగాని, ప్రథమ యువతి నా మేనకోడలగుటచే నా పరిశ్రమ ఫలించినదని నేను గర్వముతో సంతసించితిని.

నా తమ్ముని పెద్దకుమారుడు వెంకట్రావు పిఠాపురము హైస్కూలులో జదివి మూడు సంవత్సరములు స్కూలుఫైనలు పరీక్షలో దప్పెను. వానిని దీసుకొనివచ్చి రాజమహేంద్రవరములో జదివించితిని. అతడు 1928 వ సంవత్సరమున స్కూలుఫైనలు పరీక్షయందు త్తీర్ణుడయ్యెను. ఆ సంవత్సరము జూలై నెలలో వాని నింటరుమీడియటు తరగతిలో రాజమహేంద్రవర కళాశాలలో జేర్పించితిని. ఆ సంవత్సరమందే వుయ్యూరు రాజాగారగు (శ్రీ) వెంకటాద్రియప్పారావు బహద్దరుగారు నూజవీడులో గట్టించిన యున్నత పాఠశాలా

భవనముయొక్క గృహప్రవేశ మహోత్సవమునకు, నన్నాహ్వానము చేసిరి. నేను నూజివీడు వెళ్ళి పాఠశాలా ప్రధానోపాధ్యాయులైన జీడిగుంట సత్యనారాయణగారింట బసచేసితిని. అచట నేను రెండుపన్యాసము లిచ్చితిని. శ్రీ రాజాగారు నన్ను కోటలోనికి దీసికొనిపోయి రు. 116 ల నిచ్చిరి. ఆ తరువాతగూడ వారు నాకు గొంత ధనసహాయము జేసిరి.

1925 వ సంవత్సరమున బ్రహ్మసమాజ శతవార్షికోత్సవ సందర్భమున, బిపినుచంద్ర పాలుగారు రాజమహేంద్రవరమువచ్చి, బ్రహ్మమతమునుగూర్చియు రామమోహనరాయలువారినిగూర్చియు, టవునుహాలునకు వెనుకప్రక్కనున్న యావరణలో రెండుసభలు జేసిరి. ఆ రెండు బహిరంగసభలకు మాయూరు ప్రార్థన సమాజము వారు నన్నే యధ్యక్షునిగ నెన్నుకొనిరి. రెండు సభలలోను నేనాంగ్లేయభాషలో మాటాడితిని. ఈ సంవత్సరమున 1929 వ సంవత్సరము నవంబరు నెలలో నా పెద్దమేనకోడలు తనకుమార్తె మీనాక్షియొక్క వివాహము జేసెను. ఆపిల్లకపుడు 13 సంవత్సరములు వయసు. ఇదివరలో పిఠాపుర సంస్థానమునం దాస్థాన కవీశ్వరుడుగనుండి చనిపోయిన వేదుల రామకృష్ణశాస్త్రిగారి కుమారుడు రామచంద్రకీర్తికి నిచ్చి, యా పిల్లను వివాహముజేసితిమి. వివాహము మాయింటనే జరిగెను. కాని నా మేనకోడలికి వివాహము నిమిత్తము నేనేమియు ధనసహాయము చేయలేదు. ఆమె తన సొంతసొమ్ము ఖర్చుచేసికొని కూతువివాహము జేసెను. ఆ వరునకు శ్రీ పిఠాపురము మహారాజా వారు ఆనర్సు పరీక్షయం దుత్తీర్ణుడగువరకు విశాఖపట్టణములో జదివించిరి. ఆ రామచంద్రకీర్తి యిపుడు కాకినాడలో రాజాగారి కళాశాలలో నుపాధ్యాయుడుగ నున్నాడు. ఆ సంవత్సరము డిశంబరు నెలలో నా రెండవ మేనకోడలు కోట వెంకటరత్నమ్మ తన కుమార్తె సరస్వతికి పిఠాపురములో వివాహముచేసెను. వరుడు గొల్లప్రోలు నివాసులైన అల్లంరాజు లక్ష్మీపతిగారి కుమారుడు వెంకట్రావు. ఆమెయు తనసొంత సొమ్ముతోనే తన కూతువివాహము జేసుకొనెను. నేనావివాహమునకు నాభార్యను దీసికొని పిఠాపురము వెళ్ళితిని. ఈ పెండ్లినుండి తిరిగివచ్చిన తరువాత యీపూరుపాలెములో జరిగిన

యాంధ్రాస్తిక మహాసభకు, నా మేనల్లుడు పురాణపండ వెంకటదీక్షి తులను దీసుకొని వెళ్ళితిని. ఆసభకు రఘుపతి వెంకటరత్నము నాయుడు గారు, వేమూరి రామకృష్ణారావుగారును, కో॥ కా॥ వెంకటసుబ్బారావు నాయ్డుగారును, పెద్దాడ రామస్వామిగారును, కొంపపల్లి కళ్యాణ స్వామిగారును సకుటుంబముగా వచ్చిరి. నాభి జగన్నాథరావుగారా సభకధ్యక్షులు.

---

# స్వీయ చరిత్రము

## ఇరువది యొకటవ ప్రకరణము

## భార్యా వియోగము

1930 వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో నేను గూడూరు వెళ్ళ వలసివచ్చెను. కారణమేమన, నా వదినగారి యల్లుడు పెరుమాళ్ళ కోటయ్య యనునతడు, సెంట్రలు జెయిలులో నుపాధ్యాయుడుగ నుం డెను. నాయుడుపేటనుండి వచ్చిన ఖయిదీ కత డుత్తరము వ్రాసి పెట్టెనన్న నేరము మోపి, గూడూరు కలెక్టరుగారియొద్ద నతనిమీద జెయిలు యధికారు లభియోగము దెచ్చిరి. అన్యాయమైన కేసని నే నభిప్రాయపడితిని. అతనికి సహాయముచేయుటకు, నేను, నా గుమాస్తా కామరాజు వెంకటరమణశర్మగారిని దీసుకొని, గూడూరు వెళ్ళితిని ఆ కేసు వెంకటగిరిలో విచారింపబడెను. వాయిదానాటికి కోటయ్యకు సహాయముచేయుటకు చెన్నపురినుండి నా మేనమామ కుమారుడు పురాణపండ కామేశ్వరరావు వకీలుగా వచ్చెను. సబు కలెక్టరుగారు కేసు విచారించి కోటయ్య నిర్దోషియని కేసు కొట్టి వేసిరి.

1930 వ జూను 13 వ తేదీని, అనగా ప్రమోదూత సంవత్సర జ్యేష్ఠ బ. 3 శనివారము నాఁడుదయమున రమారమి యెనిమిది గంటల కాకస్మికముగా గుండెలలో పోటువచ్చి, నా భార్య వెంకా యమ్మ స్వర్గస్థురాలయ్యెను. ఆ వెనుకటిదినమునగూడ నిల్లై గుండె లలో పోటువచ్చి క్రిందపడగా, శిరసుమీద గాయము తగిలెను.

దానికి వెంటనే చికిత్స చేయబడెను. శనివారమ నా డామె యెప్పటి వలె లేచి, కాలకృత్యములు దీర్చుకొని, కాఫీ పుచ్చుకొని, పిదప తాత తినవలెనని కొన్ని మామిడిపండ్లు తన మంచముక్రింద బెట్టుకొని, మాటాడుచు పండుకొనెను. అంతలో గుండెలలో నొప్పివచ్చెను. మంచముమీద పండుకొని బాధపడుచుండగా నామిత్రుడును, వైద్యుడునైన చామకూరి వెంకటస్వామినాయుడుగారు చేయిజూచి నాడి కనబడుట లేదనిరి. ఆ మాట వినగానే యామె కపుడు స్మృతియుండు టచే క్రిందికిదిగి నేలమీద పండుకొనెను. మంచితీర్థము నిమ్మని యడిగి త్రాగి, నా పెదచెల్లెలైన యన్నపూర్ణమ్మ దెచ్చిన తలగడా మీదనే చేయి పెట్టుకొని పదుండి మరియొక పదునైదు నిమిషములలో ప్రాణ ములు విడచెను. ఆమె నాతో ముప్పదిరెండు వర్షములు గాపురము జేసెను. నా యింట నెందరో బంధువులు, వారములుచేసికొని తిను విద్యార్థులును, జాలమంది యుండినను, నా భార్య విసుగుకొనక, చికాకుపడక, మడికట్టుకొని వంటజేసి యందరను నిష్పక్షపాతముగ భోజనములుపెట్టి యాదరించుచుండెను. ఆమె మరణముచేత నే నస హాయుడ నైతిని.

మ. గరిమన్ నాకనుఁగుం గళత్రము గు వెంకాయమ్మ హృత్పీడ నా
 దురదృష్టమ్ము ఫలించినందునఁ బ్రమోదూతాహ్వయాబ్దంబునం
 దరిగె న్మేనుదొరంగి జ్యేష్ఠ బహుళంబందుం ద్వితీయాతిథిన్
 స్థిరవారంబున, నామెయాత్మకిదు శాంతిన్ సత్కృపాంభోనిధీ.

మ. చెలిమిన్ ముప్పదిరెండువర్షములు జేసెన్ గాపురం బామె బి
 డ్డలులేకుండిన బంధువర్గముల బిడ్డల్ స్వీయసంతానమై
 మెలఁగం జుట్టలపాలికి న్సురభియై మెల్చెసె, నాయాజ్ఞ వ
 ర్తిలె నిన్నేడులు, నామెయాత్మకిదు శాంతిన్ సత్కృపాంభోనిధీ.

మ. అనుఁగై యెప్పుడుఁ దోడునీడయయి కన్నై చేయియై ప్రాణమై
 నను సేవించె ననేకవర్షములు, గానన్ నెమ్మనం బెంతయున్
 వనటంజెందెడు ; దుఃఖవారిధిఁ ధరింప న్నాకు ధైర్యంబు బ్రీ
 తినిఁ జేకూర్చి, యామెయాత్మ కిదు శాంతిన్ సత్కృపాంభోనిధీ.

మ. ఎది సర్వేశ్వరుఁ డాచరించు నది మేలే, కీడుగాదంచుఁ గో
 విదులెల్ల న్వచియింత్రు, గాన మది నిర్వేదంబునుం దక్కి యుం

డుదు నీయానతి యైనదాఁక యిహమందున్; మీఁదికార్యంబు నీ
యది; నీచిత్తము నాదుభాగ్యమఁట దేవా యోకృపాంభోనిధీ.

మ. జననిన్ రత్నమసాధ్వీ మజ్జనకు వంశగ్రామణిన్ వెంకనా
ర్యుని మత్సోదరి నచ్చమాంబికను, ధీరున్ మాతులున్ మల్లయా
ర్యుని గొంపోయితివీవు నీకడకు మున్నోయన్న నీవాత్మశాం
తిని మున్నేయిడి యుంమనందఱకు తండ్రీ యోకృపాంభోనిధీ.

ఆ సంవత్సరము (1930) మార్చి నెలలోనే నా తమ్ముఁడు కృష్ణ మూర్తి కుటుంబముతో వచ్చి మా యింట ప్రవేశించెను. నా దుర దృష్టముచేత కుటుంబముమీఁద కుటుంబమువచ్చి నా మీఁద పడుచుం డెను. నా భార్య మృతినొందిన రోజున, నా తమ్ముఁడు కృష్ణమూర్తియు, నా మేనల్లుఁడు పురాణపండ వెంకటదీక్షితులునుగూడ గ్రామములో లేరు. అదివరకు నా భార్యకు ఛాయాపటము లేనందున శవమునకు ఛాయాచిత్రము దీయించిరి. నా భార్యకు రెండవయప్ప కుమారుఁడును, బాల్యమునుండియు నామెయొద్దనే పెరిగి చదువుకొన్న వాఁడునునైన, రావూరి సూర్యనారాయణ యగ్నిహోత్రము దీసికొని కోటిలింగాలవద్ద నామె కంత్యక్రియలు జేసెను. మరునాటికి మా తమ్ముఁడువచ్చి కర్మచేయ నారంభించెను. నా భార్య పోయినదినమున శ్రీ పిఠాపురము దివానుగారు, నా మిత్రులునైన కోకా వెంకటసుబ్బారావునాయుడుగారు రాజమహేంద్రవర మేడో పనిమీఁద వచ్చినందున యీ వార్త విని, మా యింటికి వచ్చి నన్ను పరామర్శచేసి, నా కేబది రూపాయలు బదులిచ్చి, తరువాత వారింటికిపోయిన పిమ్మట మరికొంత సొమ్ముగూడ నాకు బంపిరి.

శ్రీ రఘుపతి వెంకటరత్నము నాయుడుగారికి షష్టిపూర్తి యైనది మొదలుకొని, వారి శిష్యులందరు నేఁటేట మహార్ణవమినాడు, వారికి జన్మదినోత్సవము చేయుచుండిరి. నాయుడుగారి మిత్రులలో నెవరినో యొకరి నా జన్మదినోత్సవసభ కధ్యక్షులుగా బిలుచుచుండిరి. 1930 వ సంవత్సరమున జరిగిన జన్మదినోత్సవసభకు నధ్యక్షుడుగా తమ్మని సుబ్బారావు నాయుడుగారు నన్నాహ్వానించిరి. నేను వెళ్లి యధ్యక్షత వహించి సభ జరిపితిని. ఆనాడు జయంతి గంగన్న

గారు, కూచి నరసింహముగారు, వెంకటరత్నము నాయుడుగారిని గురించి చక్కగ మాటాడిరి.

చెన్నపురిలో యిండియన్ పబ్లిసింగుహౌస్ (Indian publishing Company) అను గ్రంధప్రకటన సంఘముండెను. వారు తమకు కొన్ని తెనుగు వాచకములు వ్రాసి యిమ్మని నన్ను గోరిరి. వాచక మొకటికి రు 500/- లు నాకిచ్చి గుమాస్తా జీతము వారు భరించు నట్లు నే మొడంబడిక జేసికొంటిమి. వివేకవాచకములను పేర మొదటిఫారము మొద లైదవఫారమువరకు, నయిదు ఫారములు వ్రాసియిచ్చితిని. ఒడంబడిక ప్రకారము నాకు వారాసొమ్మిచ్చిరి. ఈ సంఘముతో నే నొడంబడిక చేసికొనుట 1929 లోనో 1930 లోనో నాకు జ్ఞాపకము లేదు. కాని 1932 వ సంవత్సరములోపుగా వాచకము లన్నియు పూర్తిజేసి యిచ్చితిని.

1930 వ సంవత్సరము డిశంబరు నెలలో రెండవయాంధ్రాస్తిక మహాసభ పిఠాపురములో జరిగెను. కోకా వెంకటసుబ్బారావు నాయుడుగారు ముందు సంవత్సరము పిఠాపురము రమ్మని, గత సంవత్సరమే యాహ్వానము జేసిరి. దానికి ఖర్చులన్నియు మహారాజు గారే భరించిరని వింటిని. వెంకట సుబ్బారావు నాయుడుగారే సన్మానసంఘమున కధ్యక్షులైరి. ఆసభకు డాక్టరు వేమూరి రామ కృష్ణారావుగా రధ్యక్షులుగ నెన్నుకొనబడిరి. నేనా సభకు బోయి ప్రహ్లాదుని భక్తినిగురించి మాట్లాడితిని. రఘుపతి వెంకటరత్నము నాయుడుగారు మొదలగు పెద్దలు చాలమంది వచ్చిరి. ఆదినముల లోనే నా పెద్దమేనకోడలికి విశాఖపట్టణము క్వీనుమేరీ బాలికా పాఠశాలనుండి, రాజమహేంద్రవరములోని దొరతనమువారి బాలికోన్నత పాఠశాలకు బదలీయయ్యెను. నాటనుండియు నామె రాజమహేంద్రవరము దొరతనమువారి బాలికోన్నత పాఠశాలలోనే దెనుగు పండితురాలుగ పనిచేయుచున్నది.

1931 వ సంవత్సర మక్టోబరు నెలలో శ్రీపిఠాపురము మహారాజావారికి రజతోత్సవము (Silver jubilee) జరిగెను. వారు సంస్థాన పరిపాలన మారంభించి యిరువది సంవత్సరములగుటచే నీమహోత్సవము జరిగెను. కాకినాడ నుండియు నితర స్థలములనుండియు ననేకులు

దయచేసిరి. ఆహ్వానము రాగానే వెళ్ళితిని. ఆసమయమున మహా రాజాగారికి బహుసమాజములవారును బహుసంఘములవారును నభివందన పత్రికములు సమర్పించిరి. ఆసంవత్సరము నవంబరునుండి నాపరిస్థితి కొంతమారెను. ఎట్లన (శ్రీ) మహారాజావారు నాకు నెలకు రు 125 లు యిచ్చుచుండిరిగదా! ఆనవంబరునుండి నాకు వారు నెలకు రు 60 లు మాత్రమే యీయనారంభించిరి. ఇందుకు గారణ మేమన, 1916 వ సంవత్సరమున నా మిత్రుడు రాయసవరపు రామమూర్తి మహారాజావారిచేత తనకు నాలుగువేల రూపాయలు ఋణమిప్పింపుమని నన్ను గోరెను. నేను పిఠాపురము వెళ్ళి మొక్కపాటి సుబ్బారాయుడుగారితో నీ విషయమై మాటాడితిని. సుబ్బారాయుడు గారా విషయమై మహారాజాగారి యభిప్రాయమును దెలిసికొని నాతో నిట్లనిరి. "మహారాజావారు మీ మిత్రునకు బదులీయుట కొప్పుకొనిరి. గాని, వా రెరుగనివారితో వ్యవహారములు చేయుట వారి కిష్టములేదు. కాబట్టి మీరే మహారాజావారికా సొమ్మునకు నోటు వ్రాసియిచ్చి, సొమ్ము దీసుకొని మీరు మీ మిత్రునకిచ్చి మీ మిత్రునివల్ల నాసొమ్ము మీరే వసూలుజేసి మహారాజాగారి కీయవలెను." అట్లు చేయుటకు సమ్మతించి నేనా సొమ్ము దీసికొని నా మిత్రుడు రాయసవరపు రామమూర్తి కిచ్చితిని. కాని నామిత్రుడు నాకా సొమ్ము తీర్చలేకపోయెను. క్రమముగా నతనియాస్తి ఋణగ్రస్తమై ఛిన్నాక్రాంతమయ్యెను. అప్పటినుండియు మహారాజావారికి మూడేండ్ల కొకసారి యసలుఫాయిదాలు గలిపి నోటువ్రాసి యిచ్చుచుంటిని. సొమ్ము మహారాజావారికి జేరనందున భాకీ తీరుమానమునకై మహారాజావారొక యేర్పాటుజేసిరి. నాకు వారు నెల నెలకు నిచ్చుజీతము నూటయిరువదియైదు రూపాయిలలోను, నరువది రూపాయిలు మాత్రము నాకిచ్చి తక్కిన యరువదియైదు రూపాయిలు భాకీ తీరుమానముక్రింద మినహాయించవలసినదని మహారాజావారు దుత్తరువుజేసిరి. ఆ ప్రకారము జరుగజొచ్చెను. డబ్బు తగ్గినది గాని నా కుటుంబములోని జనము తగ్గలేదు. మునుపటి జనమునకు దోడుగా మా తమ్ముని కుటుంబమువచ్చి నామీద పడెను. మా చెల్లెలు పెనిమిటిపోవుటచే వారికుటుంబము నామీదపడెను. నా పెద

తమ్ముని కుమారుడు ప్రథమసంవత్సరమునందే యింటరుమీడియటు పరీక్షయందు కృతార్థు డగుటచే వానిని. బి. ఏ. తరగతిలో 1930 వ సంవత్సరములో జేర్పించితిని. వానికి స్కూలుజీతము, పుస్తకములు మొదలగువానికి సొమ్ము నేను భరించవలసియుండెను. అందుచేత సొమ్ముచాలక మరల గిజగిజ తన్నుకొనవలసివచ్చెను. కొన్ని మాసముల తరువాత నా తమ్ముడు వేరుండెను. అయినను వాని కుటుంబ వ్యయము నేనే భరింపవలసియుండెను. నాకుటుంబములో నప్పుడు నా చెల్లెలు, నా మెకొడుకు, కోడలు, నేను, వేదుల కామేశ్వరరావను బాలుడు నుంటిమి. కామేశ్వరరావును గురించి యొకమాట చెప్ప వలెను. ఇతడు నా వదినగారి దౌహిత్రుడు. అతడు పుట్టిన దినము ననే యతనితల్లి 1914 వ సంవత్సరము నవంబరు నెలలో మృతినొందెను. .అందుచేత నా భార్య తల్లిలేని యీ పిల్లవానిపై జాలిగొని ప్రేమతో బెంచెను. నా భార్య పోయినను వాడు నాదగ్గరనే యుండెను. 1931 వ సంవత్సరమున నా మూడవ మేనకోడలి పెనిమిటి పొన్నపల్లి వెంకట లక్ష్మీనరసింహారావునకు విశాఖపట్టణము యింజనీరుగారి యాఫీసులో పని ఖాయపడి, ధవళేశ్వరము బదిలీకాబడెను. అప్పటినుండియు నతడు ధవళేశ్వరములో యింజనీరింగు ఆఫీసులో పనిచేయుచున్నాడు.

ఈ 1931 వ సంవత్సరము డిశంబరులో నాంధ్రాస్తికమహాసభ నెల్లూరులో జరిగెను. అప్పుడక్కడ నుద్యోగములోనున్న కంభంపాటి రామశాస్త్రిగారు నెల్లూరు పురవాసులను ప్రోత్సాహపరచి సభజేయించిరి. పెద్దాడ రామస్వామిగారా సభకధ్యక్షులు. నే నా సభకు బోయితిని. "ముకృణ్ కరణే" యను విషయమును గురించి మాటాడితిని. నిమ్నజాత్యుద్ధరణ గురించి ప్రత్యేకమహాసభ జరిగెను. నేను దాని కధ్యక్షుడను. నా యుపన్యాసము మిక్కిలి బాగున్నదని వేమూరి రామకృష్ణారావుగారు మెచ్చుకొనిరి. ఈ డిశంబరు 18 వ తేదీని నా మేనల్లుడు వెంకటదీక్షితులునకు కుమారుడు పుట్టెను. వానికి నా పేరు పెట్టిరి.

నాకు 1932 వ సంవత్సరములో కొన్ని చిక్కులు కలుగుటచే, తాలూకాబోర్డుల ప్రెసిడెంటులతో, నా పుస్తకములు లైబ్రరీ పుస్తక

ములుగా వేయించుకోవలెనని విశాఖపట్టణముజిల్లా బోయితిని. విశాఖపట్టణ మెప్పుడుబోయినను నేను సామాన్యముగా (శ్రీ) ప్రభల లక్ష్మీనరసింహముగారి యింట బసచేయుచుండెడివాడను. ఆయన గొప్పవకీలు. వేదాఢ్యుడున సంపన్నుడు. సంస్కృతాంధ్రభాషాభిమాని. మంచివక్త. అతిథుల నభ్యాగతుల మిక్కిలి దయతో నాదరించుచుండెడివాడు. ధర్మాత్ముడు. విశాఖపట్టణమునుండి నాకు పూర్వపరిచితులైన (శ్రీ) జయపురం మహారాజుగారైన విక్రమదేవవర్మగారిని జూచుటకు జయపురము వెళ్ళితిని. జయపురములో నేను కాళిదాసుని గురించి యుపన్యసించితిని. ఆ సభకు (శ్రీ) విక్రమదేవవర్మగా రధ్యక్షత వహించిరి. నాకు (శ్రీ) విక్రమదేవవర్మగారు, రు 100 లు ఖర్చులక్రింద నొసంగిరి. సాలూరులో రెండుపన్యాసములిచ్చితిని. త్రోవలో పార్వతీపురము వెళ్ళి, నా పూర్వమిత్రుడైన యాచంట సాంఖ్యాయన శర్మగారిని జూచి వారికతిథినై వారియింట రెండు దినములుండి విజయనగరము వెళ్లితిని. అక్కడ కవిప్రపు వెంకటరత్నముగారి యింట బసచేసితిని. ఆయన గురజాడ శ్రీరామమూర్తిగారి యల్లుడు.

(శ్రీ) కిళాంబి రామానుజాచారిగారి పుత్రుడును, విజయనగరము మునిసిపల్ సంఘాధ్యక్షుడునైన (శ్రీ) రంగాచార్యులుగారొక సభచేయించి, యా సభలో నన్ను గౌరవించి, మిక్కిలి చక్కని నగిషీ చెక్కిన వెండి సజ్జలో రు 116 లు బోసి, యా సొమ్మును, సజ్జను నాకు బహుమాన మొసంగిరి. అచ్చటనుండి విశాఖపట్టణము వెళ్ళితిని. అక్కడ శ్రీ గురజాడ శ్రీరామమూర్తిగారి జ్యేష్ఠకుమారుడు దుర్గాప్రసాదరావుగారు న్యాయవాదిగ నుండిరి. నేను ప్రభల వారి యింట నుండగ, దుర్గాప్రసాదరావుగారు బలవంత పెట్టి దమ యింటికి తీసుకొనిపోయి, నన్ను మిక్కిలి యాదరించి, వారి యింటనే నన్ను నిలుపుకొనిరి. నేనాయూరులో మూడో నాలుగో యుపన్యాసములిచ్చితిని. ఆ పురజనులు నా యుపన్యాసములకు సంతసించి,టవును హాలులో సభచేసి, యాసభకు ప్రభల లక్ష్మీనరసింహముగారి నధ్యక్షులుగ జేసి, నా కభినందన పత్రము సమర్పించి, రు 116 లు బహుమానము జేసిరి. ఆసభలో (శ్రీ) ప్రభల లక్ష్మీనరసింహంగారు నన్ను

గూర్చి యుపన్యసించుచు యాసభవారు నాకు "సాహిత్యచక్రవర్తి" యను బిరుద మొసగినట్లు చెప్పిరి. వారికి నేను సమాధానముగా నుపన్యసించుచు నేనా బిరుదున కర్హుడనుగానని చెప్పితిని. బిరుదములు పుచ్చుకొనుట నాకిష్టములేదు. బిరుదములు మనుష్యుని గర్వ ప్రమత్తుని జేయునని నాయభిప్రాయము. అందుచేతనే శ్రీ బురా శేషగిరిరావుగారు "ఆరాను" యూనివర్సిటీకి వ్రాసి డాక్టరను బిరుదము నాకు దెప్పించి యాపట్టా నాకు బంపించినప్పటికిని, నా బిరుదము నెప్పుడు నేనుపయోగించుకొనలేదు. పిమ్మట నచ్చటనుండి యనకాపల్లికిని, బిమ్మట చోడవరమునకును, నవ్వల నరిసీపట్టణమునకు వెళ్లి, యాయాపురజనుల ప్రేరణముచేత నుపన్యాసములిచ్చితిని. వారందరు నన్నభినందించి ధనరూపముగా బహుమానములిచ్చిరి. తాలూకా బోర్డుల ప్రెసిడెంటులెవరును నా పుస్తకములను పాఠశాలలలోగాని లైబ్రరీలలోగాని పెట్టి నాకుపకారము చేయలేదు. కాని మొత్తముమీద నాకీయాత్రలో నైదువందల రూపాయలు బహుమానరూపములుగా వచ్చెను. ఈ ప్రయాణములలో నా వెంబడి నా గుమాస్తాయైన కామరాజు వెంకట రమణశర్మ వచ్చెను. ఈ తూర్పుమండలములలో నేను రెండు మాసములు తిరిగినను, రొంప యైన పట్టక దేహారోగ్యము యెప్పటియట్లుండెను. ఆ సంవత్సరము 1932 ఏప్రియలులో నే నింటికి వచ్చితిని. ఈ మే నెలలో మా తమ్ముని కుమారుడు వెంకటార్రావును దీసుకొని చెన్నపట్టణము వెళ్ళితిని. నా మేనమామ కుమారుడు పురాణపండ కామేశ్వరరావు గృహమందు బసచేసితిమి. ఆ దినములలో రఘుపతి వెంకటరత్నము నాయుడుగారు చెన్నపట్టణములో డన్మూరుహౌసులో నుండిరి. వేమూరి రామకృష్ణారావుగారుకూడ వారివద్దనుండిరి. నేను తరుచు వారిని దర్శించుచుంటిని. నే నచట సుమారొక నెలదినము లుంటిని. ఆదినములలో కుమారస్వామినాయుడు కంపెనీవారికి నాలుగైదు ఫారములకు తెనుగువాచకములు వ్రాసియిచ్చుటకు వారితో నే నొడంబడిక చేసుకొంటిని. జూను నెలలో రాజమహేంద్రవరము వచ్చితిని.

1932 వ సంవత్సరము రెండవభాగమున రాజమహేంద్రవరములో రెండు పండిత సన్మానములు జరిగెను. ఒకటి శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికి "కవిగండపెండేరము" వేయబడిన యుత్సవము. ఆ యుత్సవము గౌతమీ గ్రంధాలయావరణములో జరిగెను. ఆ యుత్సవమునకు వెళ్ళవలెనన్న యుద్దేశము నాకు లేదుగాని, కృష్ణమూర్తిశాస్త్రిగారు స్వయముగావచ్చి బిలుచుటచేతను, ఓరుమళ్ళ యచ్యుతరావుగారి బలవంతముచేతను, నేను వెళ్ళితిని. కాని నేనా సభలో పాలుగొనలేదు. ఆ యుత్సవమునకు వ్యతిరేకముగా నెవరో తీవ్రమైన వ్యాసమొకటి వ్రాసి "చి॥ల" యని సంతకముజేసి ప్రకటించిరి. "చి॥ల" యనగ నేనే యని చాలమంది భ్రమపడిరి. కాని యది నేను వ్రాయలేదు. అది యెవరు వ్రాసిరో నిలుకడమీద నిజము లోకులకును శాస్త్రిగారికినిగూడ దెలిసెను. ఆ యుపన్యాసము వ్రాసి నవాను పత్రికలో ప్రకటింపక మునుపే, ఆ యుత్సవమునాటి మధ్యాహ్నము 12 గంటలకు నా కందునట్లు టపాలో నాకొక వ్రాతప్రతి బంపి, దాని నా సాయంకాలము సభలో జదువుమని నాకొక యుత్తరముగూడ వ్రాసిరి. ఆ వ్రాతప్రతి వెంటనే జదివించుకొని వింటిని. దానిమీదగూడ పత్రికలోవలెనే "చి॥ల" యని సంతకముండెను. సభలో దానింజదువుట యనుచితమైన పనియని నేను జదివింపలేదు. సభకు నేను వెళ్ళదలచుకొనలేదని వ్రాసితిని. యేలయన; శాస్త్రిగారికిని నాకును జిరకాలమునుండి మనస్పర్థలు గలవు. వారి పత్రికలలో మా నాటకసమాజమును విమర్శన మను పేరుపెట్టి మిక్కిలి దూషించిరి. నా "ప్రసన్నయాదవ" నాటకమును, "గయోపాఖ్యాన" నాటకమును వారి "కళావతీ" పత్రికలోను "కృష్ణాపత్రిక" (బందరు) లోను విమర్శన యని పేరుపెట్టి దూషించిరి. నేను నా "దేశమాత" లో "వెఱ్ఱిపప్పీయమ"ని యొక ప్రహసనము వ్రాయగా, నది తన భారతముమీద వ్రాసితినని భ్రమపడి, నన్ను దూషించుచు నొక ప్రహసనము వ్రాసి, శాస్త్రిగారు ప్రకటించిరి. ఆయన భారతము రచియించుచున్నందు కాయనను బహూకరించుటకై కొంతమంది సంతకములుజేసి, నోటీసు లచ్చువేసి పంచిపెట్టి, టవునుహాలులో నొక సభ జేసిరి. ఆ సభకు చిత్రపు వెంకటాచలముగా రధ్యక్షత వహిం

చిరి. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికి బంధువులైన శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారును, శ్రీపాద పాపయ్యశాస్త్రిగారును, మరికొందరును శాస్త్రిగారి భారతమును పొగడుచు మాటాడిరి. ఆ సభకు నేను బోయితిని. కాని శాస్త్రిగారి కనుకూలముగాగాని, వ్యతిరేకముగా గాని మాటాడలేదు. పిమ్మట నా "దేశమాత" పత్రికలో సభను గురించి విమర్శించితిని. వారిని నే నెంతమాత్రము దూషించలేదు. కవిత్రయమువారు రసవంతముగా నాంధ్రీకరించిన భారతమునే శాస్త్రిగారు మరల నాంధ్రీకరించిరి. కాని యిటువంటి సభజేసి బహూకరించుటకు వారుజేసిన ఘనకార్యమేమియు లేదని నేను వ్రాసితిని. సంస్కృతమునుండి తెనిగింపవలసిన గ్రంథము లనేకములుండగా బూర్వపుకవులు మిక్కిలి చక్కగా రసవంతముగా రచియించిన భారతముండగా మరల వీరేల యీ భారతమునే యాంధ్రీకరింపవలెనని నేనావిమర్శనములో వ్రాసితిని. అదిగాక, వీరి భారతము కవిత్రయమువారి భారతమంత రసవంతముగా లేదనిగూడ, విమర్శించితిని. ఆ కోపముచేత కృష్ణమూర్తిశాస్త్రిగారును, మరికొందరును నా "గయోపాఖ్యాన" విమర్శనమునకై టవునుహాలులో నొకసభ పెట్టి, దానికి శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారిని బిలిపించిరి. వెంకటశాస్త్రిగారు చమత్కారముగా మాటాడిరేగాని, నన్ను దూషించలేదని వింటిని. పిమ్మట టవునుహాలులో సభపెట్టించినవారే, నాళమువారి సత్రములో నొకసభ పెట్టెంచి, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి నధ్యక్షులుగా నేర్పరచి నా "గయోపాఖ్యానము"ను విమర్శించుటకై, చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారిని మరల బిలిచిరి. వెంకటశాస్త్రిగారు నన్ను దూషింపలేదు సరిగదా తప్పులెల్లవారికి నుండునని చెప్పి నా కవిత్వమును మెచ్చిరట. నాటిసభలో విద్యార్థులు మొదలయినవారు కొందరు, సభలో నుపన్యసించువారికి వ్యతిరేకముగా నల్లరిచేసిరట. 1901 వ సంవత్సరము మొదలుకొని నాకును శాస్త్రిగారికిని సంబంధ మీ విధముగా నుండెను. అందుచేతనే, నేను, వారి "గండపెండేర" సభకు బోవుట కిష్టము లేదని వ్రాసితిని. కాని శాస్త్రిగారు స్వయముగా వచ్చి, టేకుమళ్ళ యచ్యుతరావుగారు బలవంతము జేసిన వెంటనే, క్రోధము చిరకాలముండకూడ దుచితముగాదనియు, సాధు

లక్షణముగాదనియు, నేననుకొని సభకుబోతిని. సభలో నేనేమియు పాలుగొనలేదు. రెండవది వడ్డాది సుబ్బారాయుడుగారి సన్మానము. సుబ్బారాయుడుగారు చిరకాలమునుండి బహునాటకములను కావ్యములను రచియించి మాతృభాషాసేవ చేయుచున్నను వారికి దగిన సన్మానము జరుగలేదు. ఆకొరత తీర్చుటకై పాలకోడేటి గురుమూర్తిగారును, నేనును వారికొక సన్మానము చేయించవలెనని తలపెట్టితిమి. ఆ సన్మాన సభా సన్నాహము గురుమూర్తిగారు చేసిరి. సభ టవును హాలులో జరిగెను. ఆంధ్రవిశ్వవిద్యాలయమున కుపాధ్యక్షులుగా నున్న సర్వేపల్లి రాధాకృష్ణయ్యగా రా సభ కధ్యక్షులుగ నుండిరి. అనేకులు సుబ్బారాయుడుగారిని గురించి మాటాడిరి. వారిని గురించి నేనుగూడ మాటాడితిని. సభ సలక్షణముగా జరిగెను. ఆ సంవత్సరమే (1932) నా తమ్ముని జ్యేష్ఠకుమారుడైన వెంకటాద్రివునకు నొక కుమారుడు గలిగెను. వానికిగూడ నా పేరే పెట్టిరి.

1932 వ సంవత్సరము మహార్నవమినాటికి రఘుపతి వెంకటరత్నము నాయుడుగారికి డెబ్బది సంవత్సరములు నిండెను. వారికి జన్మదినోత్సవ సభ పిఠాపురములో జరిగెను. ఆ సభకు కలకత్తా నుండి శ్రీ సీతానాథ తత్త్వభూషణగారు వచ్చి ప్రార్థనాదికములు జరిపిరి. ఆ సభకు నేనుబోయి పాలుగొంటిని. అచటనుండి తత్త్వభూషణగారు రాజమహేంద్రవరము వచ్చిరి. రెండుసభలు జరిగెను. సభలకు నే నధ్యక్షుడను. వా రుపన్యాసకులు.

ఈ 1932 వ డిశంబరులో నాంధ్రాస్తిక మహాసభ మచిలీపట్టణములో జరిగెను. ఆసభకు శ్రీ పాలావఝుల లక్ష్మీనారాయణగా రధ్యక్షులైరి. శ్రీ రఘుపతి వెంకటరత్నమునాయుడుగా రనారోగ్యముగా నుండుటచే గత సంవత్సరము నెల్లూరుగాని, బందరుగాని రాలేదు. తక్కిన బ్రహ్మమతస్థులు చాలమంది వచ్చిరి. నేను వెంకటాద్రివును దీసుకొని బందరుసభకుబోయి "తృణ"మను విషయమును గురించి సుమారొక గంటకాల ముపన్యసించితిని. ఈ యుపన్యాసము మిక్కిలి బాగున్నదని నా మిత్రులు డాక్టరు వేమూరి రామకృష్ణారావుగారును, తదితరులును చాల ప్రశంసించిరి.

1933 వ సంవత్సర ప్రారంభమున శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారికి రాజమహేంద్రవరములో గొప్పసన్మానము జరిగెను. చెన్నపురి శాసన నిర్మాణసభలో నాలు సంవత్సరములును, గవర్నరు జనరలుగారి శాసననిర్మాణసభలో 3 సంవత్సరములును సభ్యుడుగా నుండి, దేశీయమహాసభకు 3 సంవత్సరములు కార్యదర్శిగానుండి, సుబ్బారావుపంతులుగారు హిందూదేశమునకు జేసిన యుపకారసేవను గుర్తించి, రాజమహేంద్రవర పురజనులు పంతులుగారికి తమ కృతజ్ఞతను దెల్పుటకీ సభగావించి సన్మానము జేసిరి. ఆ సభకు శ్రీ చిర్రావూరి యజ్ఞేశ్వర చింతామణి (C. Y. Chintamani) గారు ప్రయాగ (Allahabad) నుండి వచ్చి యధ్యక్షత వహించిరి. శ్రీ చింతామణి గారికి సుబ్బారావుపంతులుగారియెడ మిక్కిలి గౌరవమును, భక్తి యును గలవు. ఆ సభకు రాజాలనందున నైటానరబుల్ శ్రీనివాస శాస్త్రిగారు, సర్. పి. యస్. శివస్వామి అయ్యరుగారు మొదలగు దేశనాయకులు రాజాలనందున, తమ సానుభూతిని దెలుపుచు జాబులు వ్రాసిరి. బందరునుండి వావిలాల వెంకట శివావధానులుగారును, గుంటూరునుండి కొండా వెంకటప్పయ్యగారు మొదలగు నాంధ్ర నాయకులుగూడ దయచేసి సభలో పాలుగొనిరి. ఆ సభలో నాకు పంతులుగారియెడగల భక్తియు, గౌరవమును వెల్లడియగునట్లు చాల సేపు మాటాడితిని. వెంకటప్పయ్యగారు, శివావధానులుగారు గూడ మాటాడిరి. ఈ సభాసన్నాహమంతయు శ్రీ పాలకొడేటి గురుమూర్తి గారు చేసిరి. ఈ సభ రెండుదినములు హిందూసమాజభవనములో జరిగెను. పురజను లమితోత్సాహముతో హాజరై పాలుగొనిరి. చింతామణిగారి యుపన్యాసములు మిక్కిలి గంభీరములై, రసవంత ములై, జనాకర్షకములై యుండెను.

ఆంధ్రసాహిత్య పరిషత్సభ 1933 వ సంవత్సర మేప్రియలు నెలలో రాజమహేంద్రవరములో చేయ సంకల్పించిరి. ఒకరిద్దరు రాజమహేంద్రపురవాసులు సభ రాజమహేంద్రవరములో జేయు మనియు తామందుకు తోడుపడుదుమనియు జయంతి రామయ్య గారితో జెప్పి మార్చి నెలలో శక్యముగాదని చెప్పిరట. అప్పుడు రామయ్యగారు సాహిత్యపరిషత్తునకు మేనేజరైన క్రొత్తపల్లి సూర్యా

రావుగారిని నావద్దకు బంపిరి. సూర్యారావుగారు నాతో మాట్లాడిరి. "సభ నీపురజనులు జరుపలేనిపక్షమున జయంతి రామయ్యగారే నూటయేబది రూపాయిలో తమ సొంతసొమ్ము ఖర్చుపెట్టి నీయూరనే సభ చేయించదలచుకున్నారు." ఆమాటలు విని నేనిట్లంటిని "ఇది రామయ్యగారింట వడుగా! పెండ్లియా! ఆయన సొంత సొమ్మేల ఖర్చుపెట్టవలెను? ఆయన సొంతసొమ్ము ఖర్చుపెట్టుట రాజమహేంద్రవరమున కప్రతిష్ఠ. కావున నీసభ రాజమహేంద్రిపురజనులే చేయవలెను. ఆపూచీ నేను పడియెదను.'' అని చెప్పి సూర్యారావుగారిని బంపితి. ఈ విషయమై నేను హిందూసమాజములో మద్దాల వెంకటచలంగారితోను, పాలకోడేటి గురుమూర్తిగారితోను చెప్పగా, వారు నాతో నేకీభవించి పురము వెంట దిరిగి రమారమి రు 150/-లు, ప్రోగుచేసిరి. ఆ సొమ్ముతో పరిషత్సభ మిక్కిలి జయప్రదముగా జరిగెను. అతిథులకు బసలు భోజనములు నాళమువారి సత్రములో నేర్పాటుచేయబడెను. సభలు చింతామణీ నాటకశాలలో జరిగెను. సన్మానసంఘమునకు శ్రీ రాజా కాంద్రేగుల శ్రీనివాస జగన్నాథరావు పంతులుగారును, మహాసభకు శ్రీ వడ్డాది సుబ్బారాయుడుగారును నధ్యక్షులైరి. సుబ్బారాయుడుగారు తమ యుపన్యాసమును వ్రాసి జదివిరి. పండితులు చాలమంది వచ్చిరి.

1933 వ సంవత్సరమున నేను ''భాసుని'' ''యభిషేక'' నాటకమును దెనిగించితిని. షష్టిపూర్తినాటి కీగ్రంథమును దెనిగింపలేదు. 1932 లో యాంధ్రాస్తిక మహాసభ బందరులో జరిగినప్పుడు, మరుచటి సంవత్సరము రాజమహేంద్రవరము రావలసినదని, నేనే బిలిచితిని. శ్రీ రఘుపతి వెంకటరత్నము నాయుడుగారు దేహారోగ్యము బాగులేక, శ్రీ సోమిన కామేశ్వరరావుగారియొద్ద నౌషధము పుచ్చుకొనుటకై, యా సంవత్సర మక్టోబరు మొదలుకొని రాజమహేంద్రవరములో పిఠాపురము మహారాజావారి బంగాళాలో నుండిరి. సెప్టెంబరు నెలలో రామమోహనరాయ జయంతి కాకినాడలో శ్రీ నాయుడుగారు మహావైభవముతో జరిపించిరి. ఆ యుత్సవ దినములలో బ్రహ్మమందిరము, మహారాజావారి కళాశాల మొదలగు

ముఖ్యస్థలములు విద్యుద్దీపములతో మిక్కిలి శృంగారముగా నలంక రింపబడెను. బీదల కన్నదానము జరిగెను. బ్రహ్మమతస్థు లనేకు లనేక స్థలములనుండివచ్చి పాలుగొని యుపన్యాసము లిచ్చిరి. ఆ సందర్భమున నేనును కాకినాడ వెళ్ళి, రామమోహనరాయల జీవితమును గురించి యుపన్యసించితిని. అంతకుమున్నే నేను రచియించిన "కృపాంభోనిధి" యను భక్తిరసప్రధానమైన నిర్గుణపరబ్రహ్మస్తవ పద్యకావ్యమును రామమోహనరాయలవారి జయంత్యుత్సవ సందర్భమున బ్రకటించితిని. దానిని శ్రీ రఘుపతి వెంకటరత్నమునాయుడుగా రచ్చువేయించిరి. 1933 వ సంవత్సరమున జరిగిన యాంధ్రాస్తిక మహాసభయొక్క సన్మానసంఘమునకు నాయుడుగారు మున్నుగువారు నన్నధ్యక్షునిగ నేర్పరచిరి. కంభంపాటి రామశాస్త్రిగారిని, ముత్తంగి జగ్గారావుగారిని సన్మానసంఘమునకు కార్యదర్శులుగా నేర్పాటుచేసిరి. పేరునకు నేను సన్మాన సంఘాధ్యక్షుడ నన్నమాటయేగాని, సొమ్మునంతయు కార్యదర్శులే ప్రోగుచేసి సభను జయప్రదముగా జరిపిరి. మహాసభ వీరేశలింగోన్నతపాఠశాలలో జరిగెను. ప్రతినిధుల బసలు భోజనములుగూడ నచటనే యేర్పాటు చేయబడెను. నా సన్మానసంఘాధ్యక్షోపన్యాసమును నేను వ్రాసి నా మిత్రులు జయంతి గంగన్నగారిచేత సభలో జదివించితిని. శ్రీ కొండపల్లి కల్యాణస్వామిగారు సభ కధ్యక్షులు. రఘుపతి వెంకటరత్నము నాయుడుగారు, కోకా వెంకటసుబ్బారావుగారు, తదితర స్థలముల నుండి యనేకమంది ప్రముఖులును యీసభకు విచ్చేసిరి. ఈ 1933వ సంవత్సరమున శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారు హిందూసమాజములో నన్నొక గౌరవసభ్యునిగా జేర్చుకొనిరి. అప్పటినుండియు, నేను ప్రతిదినము సాయంకాలము హిందూసమాజమునకుబోయి, యచటజేరు మిత్రులతో గాలక్షేపముజేసి యానందించుచుంటిని. సుబ్బారావుపంతులుగారు ప్రతిదిన మచటికి వచ్చుచుండెడివారు. చిత్రపు వెంకటాచలము పంతులుగారు కడుపులో నేదో నొప్పిచే బాధపడి, 1333 వ సంవత్సరము డిశంబరు 27 వ తేదీని చనిపోయిరి. వారి మరణమునకు విషాదమును దెలుపుటకై పురజనులు టవును హాలులో శోకసభ నేర్పాటుచేసి యా సభకు నన్నధ్యక్షుని జేసిరి.

వెంకటచలముగారు మిక్కిలి సజ్జనులు ; స్నేహపాత్రులు. వారి మరణమువలన రాజమహేంద్రవరమునకు మిక్కిలి లోపము గలిగినదని నేను చెప్పితిని. ఆ దినములలోనే విఠలుభాయి పటేలుగారును, నేను గుప్తాగారును గూడ మృతినొందిరి. వారి మరణమునుగూర్చిగూడ విషాదము తెలియపరచుటకై నా యధ్యక్షతక్రింద పురజనులు సభలు గావించిరి.

ఈ 1933 లోనే నా మిత్రులైన రాయసవరపు రామమూర్తికి నేదో జబ్బుజేసెను. దానికి జికిత్స జేయించుకొనుటకై యతడు కాకినాడ వెళ్ళెను. కాని యతను యెన్నిమందులు పుచ్చుకొన్నను రోగము హెచ్చెనేగాని తగ్గలేదు. జూను నెలలో నతనికి మిక్కిలి యెక్కువగానున్నదని విని, నేను కాకినాడ వెళ్ళితిని. నేను కాకినాడ చేరినతరువాతకూడ కొన్నిదినములతడు వ్యాధిచేత బాధపడి, జూను 21 వ తేదీ యుదయమున 5 గంటలకు మృతినొందెను. ఇతనికి నేను చిన్నతనమున నింటియొద్ద పాఠములు చెప్పుటచే మాకిరువురకును మైత్రి గలసెను. మా మేనమామగారు రాజమహేంద్రవరమునుండి వెళ్ళిపోయిన తరువాత నే నొక్కడనే యుండుటచే కొంతకాలము వీరి యింటనే యుంటిని. రామమూర్తి మరణము నాకు మిక్కిలి విషాదము గలిగించెను.

1934 వ సంవత్సరము జూలై నెలలో శ్రీ రఘుపతి వెంకటరత్నము నాయుడుగారు కాకినాడ కళాశాలనుండి మా తమ్ముని కుమారుడు వెంకటరావును ట్రియినింగుకు బంపిరి. ఈ 1934 సెప్టెంబరులోనో యక్టోబరులోనో, గుంటూరు జిల్లాలోని కనగాల గ్రామములోని గ్రంథభాండాగార వార్షికోత్సవమునకు నధ్యక్షత నహించవలెనని కోరుచు నన్నాహ్వానించిరి. నా మేనల్లుడు పురాణపండ వెంకటదీక్షితులను దీసికొని నే నాయూరు పోయి సభ జరిపించితిని. ఆ సభకు నా మిత్రులు రాయసం వెంకటశివుడుగారుకూడ దయచేసి సభలో నుపన్యసించిరి. అచటనుండి నేను వెంకటశివుడుగారితో గలిసి గుంటూరు వెళ్ళి, యచట వారింట నే నాలుగైదు దినములుంటిని. అచట క్రిష్టియను కాలేజి భవనములో కాళిదాసునుగూర్చి యొక్క యుపన్యాసము రమారమి 2 గంటలసేపు చెప్పితిని. తరు

వాత నచట ప్రార్థనసమాజములో నొకనాడును, స్త్రీల సమాజములో నొకనాడును, నుపన్యాసమిచ్చితిని. పిమ్మట రాజమహేంద్రవరము వెళ్ళితిని.

ఆంధ్రాస్తికమహాసభ యీ సంవత్సరము మాధవరములో జరిగెను. ఆ సభకు శ్రీమతి జ్ఞానాంబగా రధ్యక్షతవహించి చక్కని యుపన్యాస మిచ్చిరి. కుగ్రామమైనను తమ్మిసెట్టి వీరన్నగారి కృషిచేత సభ సలక్షణముగానే జరిగెను. నేనాసభకు బోయి బ్రహ్మమతమును గురించి మాటాడితిని. వేంకటరత్నము నాయుడుగారు మొదలగు బ్రహ్మమతస్థులు చాలమంది వచ్చిరి. నరసాపురము వాసులు తమ గ్రామమువచ్చి నన్ను కొన్ని యుపన్యాసము లిమ్మని కోరినందున, నేను 1935 వ సంవత్సర ప్రారంభమున నరసాపురము బోయి కొన్ని యుపన్యాసములు చేసితిని. అప్పుడక్కడ న్యాయవాదిగానున్న భమిడిపాటి సత్యనారాయణగారి యింట బసచేసితిని. ఆ యూరిలో మూడో నాలుగో యుపన్యాసములిచ్చితిని. నా మిత్రుడైన చేబియ్యము వెంకట్రామయ్యగారి కుమారుడు బుచ్చిబ్బాయి రాజవోలులో న్యాయవాదిగా నుండెను. అతని జూచుటకై నరసాపురమునుండి రాజవోలు వెళ్ళితిని. ఆ పురజనులు నన్ను విడిచిపెట్టక కొన్ని యుపన్యాసములిమ్మని కోరిరి. వారి కోరిన ననుసరించి నాలు గైదుపన్యాసము లచట నిచ్చితిని. అప్పు డమలాపురములో గూడా హరిశ్చంద్రుడుగారు న్యాయవ్యాదిగనుండిరి. అతనిని జూచి చాలకాలమైనందున యతనిని చూచుట కమలాపురము వెళ్ళితిని. నేనతనిని బాల్యమునుండియు నెరుగుదును. వారియింట బసచేసి, కొన్ని దినములుండి యా పురజనుల కోరికమీద నచట కొన్ని యుపన్యాసములిచ్చితిని. అమలాపురములోను, రాజవోలులోను, నరసాపురములోను, నా యుపన్యాసములు విని నాకు కొంతధనము సభలలో బహుమానములుగా నిచ్చుచుండిరి. ఈ సంవత్సరమందే యేలూరులోనున్న వెంకట్రామ అండుకో వారితో మాటలాడవలసి యుండుటచే నే నేలూరు వెళ్ళితిని. అప్పుడక్కడ నా మిత్రుడు తల్లాప్రగడ చలపతిరావుగారి కుమారుడు నరసింహారావు న్యాయవాదిగానుండెను. అతని బలవంతముమీద నేను వారియింటనే మూడు మాసము

లుంటిని. ఆ పట్టణమున వివిధస్థలములలో నేనారుపన్యాసము లిచ్చి తిని. శ్రీ పార్థి రాఘవేంద్రరావుపంతులుగారును, నేను గలిసి, పాఠశాలలలోని క్రిందితరగతులకు వెంకట్రామ అండుకో వారి కారువాచకములు వ్రాసి యిచ్చుటకు నిర్ణయించుకొంటిమి. పిమ్మట రాజమహేంద్రవరము వచ్చి వాచకములు వ్రాయుట కారంభించితిని.

ఆంధ్రాస్తిక మహాసభ 1935 వ సంవత్సరము డిశంబరులో శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారి యాధిపత్యమున రామచంద్రపురములో జరిగెను. చెన్నాప్రగడ భానుమూర్తిగారి కుమారుడు సుబ్బారావుగారు రామచంద్రపురములో వైద్యులుగ నుండిరి. వారి యింట బసచేసి సభలకు హాజరగుచుంటిని. ఒకనాటి సాయంకాలము నేను సభలో విశ్వరూప సందర్శనమును గురించి మాటాడితిని.

నా రెండవ మేనకోడలు తన యిద్దరు కుమారులు స్కూలు ఫైనలు పరీక్షయందు త్తీర్ణులైనందున, వారిని కళాశాలలో జదివించుటకు కాకినాడబోయి, యచట రెండుసంవత్సరములు గాపురముండెను. ఆమెకు కాకినాడలో మిక్కిలి జబ్బుచేసెను. ఆమెకు ప్రాణము మీదికి వచ్చినదని నాకు తంతివార్త రాగా, నేను కాకినాడ వెళ్ళి యామెకు నిమ్మళించినదాక నేనచ్చట నుంటిని. ఆ దినములలోనే నాకు చిరమిత్రులైన కోకా వెంకటసుబ్బారావు నాయుడుగారికి పిఠాపురములో షష్టిపూర్త్యుత్సవము జరిగెను. పిఠాపుర సంస్థానపు రైతులును, సంస్థానపు టుద్యోగస్థులును ఈ యుత్సవమును మహావైభవముతో జేసిరి. ఆ మహాసభకు శ్రీ కనకపల్లి రంగనాయకులు నాయుడుగా రధ్యక్షత వహించిరి. ఆహ్వానము రాగా నేనా సభకుబోయి సుబ్బారావు నాయుడుగారి సామర్థ్యమును, రాజభక్తిని, సంఘసంస్కరణాభిమానమును బ్రశంసించుచు మాటాడితిని. నేను కాకినాడలో నున్నకాలములోనే బెజవాడ వాస్తవ్యులైన నిడుముక్కల సుబ్బారావుగారువచ్చి, నా "గయోపాఖ్యానము"ను సినిమా ఫిలిము దీయించుకొనుటకు హక్కు నిమ్మని యడుగగా నేను దానికి ప్రతిఫలము రు 500/-లు పుచ్చుకొని, గయోపాఖ్యానము ఫిలిము దీసికొను హక్కునుమాత్రము వారి కిచ్చితిని. అదిగాక నా గయోపాఖ్యాన నాటకమును రంగస్థలమున బ్రదర్శించుహక్కు తనకే యుండు

వట్టిమ్మని యడుగగా కొంతసొమ్మును బుచ్చుకొని మూడేండ్లవరకు వట్టిహక్కు వారి కిచ్చితిని. కాని వారు నాగ్రంథోపాఖ్యానము ఫలిము నిప్పటికిని దీయించలేదు.

ఆంధ్రాస్తిక మహాసభ 1936 వ సంవత్సరము డిశంబరులో అనకాపల్లి గ్రామములో జరిగెను. నాకు దీరికలేకపోవుటచే నేనా సభకు వెళ్ళలేదు. ఆసంవత్సరము నందే పూర్వము నాచే వివేక వాచకములు వ్రాయించుకొన్న "ఇండియన్ పబ్లిషింగు హౌసు" వారు మొదటి తరగతి మొదలైదువరకు వాచకములు వ్రాసియిమ్మని నన్నడిగిరి. ప్రతిఫలముగా నేను రు 2000/-లు వారివలన గ్రహించి వాచకములను 1937 వ సంవత్సరము డిశంబరులోపుగా వ్రాసియిచ్చి తిని. ఆకంపెనీవారా వాచకములకు సదాశివ వాచకములని పేరు పెట్టుకొనిరి.

1937 వ సంవత్సరము ఆంధ్రాస్తిక మహాసభ డిశంబరులో కాకినాడలో జరుగునట్లు నిర్ణయింపబడెను. కాని యట్లు జరుగక మరుచటి సంవత్సర మాయూరనే ఫిబ్రవరిలో జరిగెను. దానికి శ్రీ రఘుపతి వెంకటరత్నము నాయుడుగా రధ్యక్షులైరి. ఆసభకు నేను బోయి "మరణము"ను విషయము మీద మాటాడితిని. ఆసంవత్స రమే కాకినాడలో జీవకారుణ్య మహాసభ జరిగెను. ఆసభాసన్నా హకులు నన్నధ్యక్షునిగ నాహ్వానించిరి. నేను బోయి యధ్యక్షుడుగ నుండి సభజరిపితిని. ఆసభకు హైదరాబాదునుండియు, చెన్నపురి నుండియు, యితరస్థలముల నుండియు ననేక ప్రతినిధులు వచ్చిరి.

1937 వ సంవత్సరము మార్చినెలలో నామేనల్లుడు పురాణ పండ వెంకటదీక్షితులునకు రెండవ కుమారుడు గలిగెను. ఆ పిల్ల వానికి దీక్షితులు తన తండ్రియైన వెంకన్నగారి పేరుపెట్టెను. ఆ సంవత్సరముననే రఘుపతి వెంకటరత్నమునాయుడుగారు హితకారిణీ సమాజాధ్యక్ష పదవి వదలుకొనిరి. వదలుకోవలదని సభలో తీర్మా నముజేసి వారిని బ్రతిమాలినను వారంగీకరింపక మానుకొనిరి. వీరే శలింగముగారు చనిపోయినది మొదలుకొని నాయుడుగా రధ్యక్షులు గను, నేనుపాధ్యక్షుడుగాను నుంటిమి. నాయుడుగారు మానుకొన గానే పాలకోడేటి గురుమూర్తిగారు మొదలగువారు నన్నధ్యక్షునిగ

నెన్నుకొనిరి. 1936 వ సంవత్సరమున చెన్నపురి శాసననిర్మాణ సభ్యత్వముల కెన్నికలు జరిగెను. ఆ ఎన్నికలలో గెలిచి ప్రకాశము పంతులుగారు సభ్యులై పిమ్మట రెవిన్యూమంత్రి యయ్యెను. ఆమహా పదవిలో నుండి వారు రాజమహేంద్రవరము వచ్చిరి. వారిని గౌర వించుటకై పాలుచౌకులో నొక మహాసభ జరిగెను. ఆసభకు నన్ను ధ్యక్షులుగ జేసిరి. ప్రకాశముగారు నాకు బాల్యమిత్రుడగుటచేత పురజనులు నన్నిట్లు గౌరవించిరి. ఆసభానంతరము పాలకోడేటి గురు మూర్తిగారు ప్రకాశముగారికి విందుజేసిరి. ఆవిందుకు నన్నును, న్యాయపతి సుబ్బారావు పంతులుగారిని, మరికొందరు పురప్రముఖు లను గూడ నాహ్వానించిరి.

కాకినాడలోనున్న "స్కేఫ్ అండుకో" యను వారి ముద్రాక్షర శాలలో గొన్ని పుస్తకము లచ్చువేయించితిని. కాగితములు పెట్టు బడి వారేపెట్టి కొన్ని పుస్తకము లచ్చువేసిరి. అచ్చుఖర్చునకు, కాగి తముఖర్చునకు వారు నామీద వ్యాజ్యముదెచ్చిరి. అది నామీద డిక్రి చేయబడెను. ఆ వ్యవహారము పూర్తియగుసరికి చాలకాలము పట్టెను. ఆ వ్యవహారములో నాకు మిత్రులైన దర్భా వెంకట శివ రామరాసుగారు మిక్కిలి శ్రద్ధతో నాపక్షమున బనిచేసిరి. దానికి ప్రతిఫలముగా వారికి నేనేమియు నీయలేదు. వారి ప్రయత్నము వల్లనే నేను స్కేఫుఅండుకోవారితో రాజీపడి రాజీప్రకారము సొమ్ముం తయు దీర్చివేసితిని. ఈవిషయములో రాసుగారు నాకుజేసిన యుప కారము మరువజాలను. నేను పూర్వము గాపురముండిన రాయవరపు వారియిల్లు, ఋణగ్రస్థమై వేలము వేయబడినందున నే నాయిల్లు విడిచి, యాయింటికి వెనుకప్రక్కనున్న చిన్నయింటిలో 1938 ఏప్రి యలు నెలలో ప్రవేశించితిని.

1937 వ సంవత్సరము కడపట శ్రీ వడ్డాది సుబ్బారాయుడు గారికి సహస్రమాసజీవితోత్సవము జరిగెను. ఆ యుత్సవము జరుగు టకు నేను మిక్కిలి ప్రయత్నముజేసితిని. అందులో చెరుకువాడ వెంకటాద్రియ్యగారు మిక్కిలి సహాయముజేసిరి. ఆ సమయమున సుబ్బారాయుడుగారికి రాగిపలకమీద నభినందనపత్రమును జెక్కించి, దానికి వెండిపూతబెట్టించి సమర్పించితిమి. ఈగౌరవమునకు సుబ్బా

రాయుడుగారు మిక్కిలి సంతసించిరి. 1938 వ సంవత్సరమున పక్ష వాతముచే బాధపడి, మార్చి నెల మొదటివారములో సుబ్బారాయుడుగారు స్వర్గస్థులైరి. ఆయనయెడల నాకు మిక్కిలి గౌరవము గలదు. ఆయనశవము వెంట స్మశానమునకుబోయి నాకడపటిగౌరవము జూపితిని.

1938 వ సంవత్సర మాగస్టులో మా తమ్ముడు తన నాలుగవ కుమార్తెయైన కృష్ణవేణికి వివాహముజేసెను. అప్పుడు నాదగ్గర ధనము లేనందున నేనేమియు రొఖ్ఖరూపకముగా సహాయముచేయలేదు. వరుడు వేమల నారాయణశాస్త్రిగారి కుమారుడు సత్యనారాయణ శాస్త్రి.

1938 వ సంవత్సరము 21 ఆగస్టు తారీఖున నా మేనల్లుడు పురాణపండ వెంకటదీక్షితులునకు నాడుపిల్ల పుట్టెను. అతని రెండవ కుమారుడు కడుపులో బల్లపెరిగి మాసమురోజులు బాధపడి, ఆగస్టు 25 వ తేదీ మధ్యాహ్నము మృతినొందెను. అప్పటి కా బాలుడు 17 మాసములు వయసు గలవాడు. పాపను తల్లి పచ్చిబాలింతరాలు. దుఃఖపడుటకైన వీలులేకపోయెను. ఆ సంవత్సరమే సెప్టెంబరు నెలలో మా తమ్ముని భార్య రామలక్ష్మమ్మ నాలుగుదినములు బాధపడి, సెప్టెంబరు 9 తారీఖునకు సరియగు భాద్రపద శు ౧౫ నాడుదయమున చనిపోయెను. ఆమె కపుడు 48 సంవత్సరముల వయసు. ఆమె మా మేనమామగారు పురాణపండ మల్లయశాస్త్రిగారి కుమార్తె. ఆమె పోవునప్పటి కామె కేనమండుగురు పిల్లలు. ఆమె తల్లి చెన్నపురిలో రెండవ కుమారునియొద్ద పక్షవాతముచే బాధపడుచు జీవించియుండెను. అది మిక్కిలి శోచనీయము. మా మరదలు మిక్కిలి సుగుణవతి. ఆమె యోపిక మిక్కిలి ప్రశంసనీయము. ఆ మరణము మా కుటుంబమునకు గొప్పలోపము. నా వలెనే నా తమ్ముడుగూడ కళత్రహీను డగుట మిక్కిలి విచారకరము. 1938 సెప్టెంబరు 25 వ తారీఖు మొదలుకొని 10 దినములు నేను జబ్బుపడితిని. దైవానుగ్రహమువలన నెమ్మదిగా నుండెను. వడ్డాది సుబ్బారాయుడుగారు జీవించియుండగా నా ఛాయాపటమును టవునుహాలులో పెట్టించవలెనని వారి కభిలాషగా నుండెడిది. వారు చనిపోయిన తరువాత సుబ్బా

రాయుడుగారి ప్రియశిష్యుడును, నాకు మిత్రుడునైన శ్రీ చెరుకువాడ వెంకట్రామయ్యగారును, ముడుంబై శ్రీరామాచార్యులుగారును తగు ప్రయత్నముజేసి సుబ్బారాయుడుగారి యభిలాష దీర్చవలెనని శ్రమపడి ధనము ప్రోగుచేసి, చామకూర భాష్యకారులు నాయుడుగారిచేత నాఛాయాపటమును (Oil Painting) వ్రాయించిరి. అది ది30-10-1938 తేదీని టవునుహాలులో ప్రతిష్ఠింపబడెను.

ఆ దినమున టవునుహాలావరణములో గొప్ప సభ జరిగెను. ఆ సభకు కాకినాడ కళాశాలా ప్రధానాచార్యులును, నా మిత్రులునైన, శ్రీ పెద్దాడ రామస్వామిగా రధ్యక్షత వహించిరి. టవునుహాలు పరిపాలక సంఘాధ్యక్షులైన న్యాపతి సుబ్బారావు పంతులుగారు నా ఛాయాపటమును టవునుహాలులో బెట్టుటకు దమ యంగీకారమును దెలుపుచు, సభలో నన్ను గురించి మాటాడిరి. తరువాత శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు నా గ్రంథము లన్నిటిమీాదను ననుకూలమైన యొక పెద్ద విమర్శనమును వ్రాసి చదివిరి. ఆ సభలో నే మార్కండేయుడను హరిజను డిట్లు మాట్లాడెను. "లక్ష్మీనరసింహముగారు నాకును నా సంఘమునకును జేసిన యుపకారమునకు నా కుమారునకు లక్ష్మీనరసింహమని పేరు పెట్టుకొంటి" నని చెప్పి, యా బాలుని సభాసదులకు చూపెను. ఈ సభ నా షష్టిపూర్తి సభ కంటె వైభవముగా జరిగినదని వేమూరి విశ్వనాథశర్మగారు నాతో ననిరి. శ్రీ తాళూరి రామచంద్రరావుగారు పద్యములు వ్రాసి జదివిరి. ఇంకను ననేకు లుపన్యాసము లిచ్చిరి. భాష్యకారులు నాయుడుగారు ఛాయాపటము మిక్కిలి బాగున్నదని సభాసదులు మెచ్చిరి. శ్రీ పిఠాపురము మహారాజాగారు భాష్యకారులు నాయుడుగారికి సంవత్సరమునకు రు 500/- వేతనమిచ్చి, బొంబాయిలోని చిత్రకళాశాలకు బంపి నాలుగు సంవత్సరములు చిత్రలేఖనము నేర్పించిరి. ఆ దినమున నా మిత్రులైన రఘుపతి వెంకటరత్నముగా రొక వెండి గిన్నెయు, వెండి పళ్ళెరమును చేయించి, కాకినాడనుండి బహుమానముగ నాకు పంపిరి. మా యూరి వైశ్యశ్రేష్ఠులలో నొకరైన తటవర్తి శీతారామయ్యగారొక శాలువను గప్పిరి. డాక్టరు బెజవాడ వెంకట

స్వామి నాయుడుగారు బంగారపుటుంగరమును నా వ్రేలికి దొడిగిరి. ఇచట నొక విశేషము వ్రాయవలెను.

కీర్తిశేషులైన కల్లూరి వెంకటరామశాస్త్రిగారి జీవితము వ్రాయవలసినదని, వారి రెండవ కుమారుడైన రామచంద్రమూర్తి గారు నన్ను గోరిరి. వ్రాయుటకు నే నంగీకరించితిని. తండ్రిగారు వ్రాసిన గ్రంథములను, మరి యితర సాధనసామగ్రులను రామచంద్ర మూర్తిగారు నాకిచ్చిరి. తీరుబడి లేక వ్రాయుటకు నేను కొంత యాల స్యముచేసినందున, నేను వ్రాయననుకొని, రామచంద్రమూర్తిగారు నా కిచ్చిన కాగితములు మొదలైనవి తీసుకొని, వాటిని చిలుకూరి వీరభద్రరావుగారి కిచ్చి వారిచేత తండ్రిగారి జీవితము వ్రాయించిరి. వీరభద్రరావుగారు చాల పెద్దగ్రంథము వ్రాసి, యందు వెంకటరామ శాస్త్రిగారికిని, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికిని జరిగిన వివాద విషయ మెత్తుకొని, కృష్ణమూర్తిశాస్త్రిగారిని గురించి కొన్ని యన వసర వాక్యములు వ్రాసిరి. అవి తమ ప్రతిష్ఠకు భంగకరముగానున్న వనియెంచి, వ్రాసినందుకు వీరభద్రరావుగారిమీదను, వ్రాయించినం దుకు రామచంద్రమూర్తిగారిమీదను, పరువునష్టమునకు కృష్ణమూర్తి శాస్త్రిగారు క్రిమినలుఛార్జి నిచ్చిరి. తండ్రిగారి జీవితమును వ్రాయ మని నన్ను కోరినపుడు రామచంద్రమూర్తిగారు కృష్ణమూర్తిశాస్త్రి గారిని దూషింపుమని నాతో నెన్నడు చెప్పలేదు. ఆ యభియోగ మును మొదటితరగతి మేజస్ట్రీటుగారు (First class Magistrate) విచా రించిరి. రామచంద్రమూర్తిగారు నన్ను తమపక్షమున సాక్ష్యము వేసుకొనిరి. కృష్ణమూర్తిశాస్త్రిగారిని దూషింపుమని రామచంద్ర మూర్తిగారు నాతో నెన్నడు చెప్పలేదని నేను సాక్ష్యమిచ్చితిని. ఆ యభియోగఫలిత మేమనగా, వీరభద్రరావుగారికి రు 200/-లు జరి మానా విధింపబడెను. రామచంద్రమూర్తిగా రేశిక్షలేక యే బయట పడిరి.

1938 వ సంవత్సరము డిశంబరు 8 వ తేదీని నా దేహారోగ్య మునిమిత్తము నా మేనల్లుడు పురాణపండ వెంకట దీక్షితులును దీసు కొని చెన్నపురిబోయి, నా మేనమామ కుమారుడైన పురాణపండ కామేశ్వరరావుగారి గృహమందు బసచేసితిమి. శ్రీ రఘుపతి వెంక

టరత్నము నాయుడుగారు తమ కన్నులు జబ్బుగానున్నందున చికిత్స చేయించుకొనుచు నా దినములలో చెన్నపురిలో నుండిరి. నేను పలు మారులు వారి దర్శనము చేసితిని. వారినేగాక నా పూర్వమిత్రులైన గంటి లక్ష్మన్నగారిని, బులుసు సాంబమూర్తిగారిని, టంగుటూరి ప్రకాశముగారిని, మంత్రిప్రగడ నరసింహంగారిని, కోకా సాంబశివ రావు నాయుడుగారిని, సూరతు వీరాస్వామి నాయుడుగారిని, సర్. కూర్మా వెంకటరెడ్డి నాయుడుగారిని, పిళ్ళారిసెట్టి నారాయణరావు నాయుడుగారిని మరికొందరిని జూచెడి యవకాశము గలిగినది. ఒక నాటి శాసననిర్మాణసభకు వెళ్ళి, జమీందారి బిల్లునుగురించి ప్రకా శము పంతులుగారియొక్కయు, రాజగోపాలాచారిగారియొక్కయు, నుపన్యాసములను మరియు నా బిల్లుమీద నితర ప్రముఖులు చేసిన చర్చయు వింటిని.

చెన్నపురిలోని యాంధ్రులందరు నొక సంఘముగాగూడి, యాంధ్రమహాసభ యనుపేర నొకసభ స్థాపించి నడుపుచుండిరి. దాని నదివరకున్న జార్జిటవునునుండి, 1939 జనవరిలో విక్టోరియా టవునుహాలు భవనములోనికి మార్చిరి. ఆ నూతన గృహప్రవేశసంద ర్భమున గొప్పసభ జరిగెను. నాటిసభకు చెన్నపురిలోని యాంధ్రు లందరు వచ్చిరి. బులుసు సాంబమూర్తిగా రాహ్వానింపగా నేనా సభకు బోయితిని. ఆ దినమున సభలో శ్రీ పిఠాపురము మహారాజా గారు, శ్రీ బొబ్బిలి మహారాజాగారు, మంత్రిప్రగడ నరసింహము గారు, సర్. కె. వి. రెడ్డినాయుడుగారు, న్యాయమూర్తి వెంకట రమణరావుగారు, మంత్రి గోపాలరెడ్డిగారు, వెంకటస్వామినాయుడు గారు, గద్దె రంగయ్యనాయుడుగారు మొదలగు ప్రముఖులందరు, నాంధ్రుల గొప్పతనమును గూర్చియు, నట్టి మహాసభయొక్క యావ శ్యకతను గూర్చియు మాటాడిరి.

ఈ సభయైన కొన్నిదినముల కాంధ్రమహాసభవారు, జనవరి 29 వ తేదీని, నన్ను సగౌరవముగా రావించి స్వాగతమిచ్చి తెను గులో నొక యభినందనపత్రమును సమర్పించిరి. ఆ సందర్భమున నన్ను ప్రశంసించుచు, నాటి సభాధ్యక్షులైన బులుసు సాంబమూర్తి గారును, సర్. కె. వి. రెడ్డినాయుడుగారును, శతావధాని దోమా

వెంకటస్వామిగుప్తగారును, తాడిపర్తి రాఘవాచార్యులుగారును, వాసా సూర్యనారాయణశాస్త్రిగారును, దేవులపల్లి కృష్ణశాస్త్రి గారును, కృత్తివెంటి సుబ్బారావుగారును మరికొందరు ప్రముఖులును మాటాడిరి. ఆంధ్రమహాసభవారు నాడు నాకొక పట్టుశాలువను కప్పిరి. ఆనాడే నన్నాంధ్రమహాసభలో గౌరవసభ్యునిగా చేర్చుకొన్నట్లు నాటిసభకేగాక యాంధ్రమహాసభకే శాశ్వతాధ్యక్షులైన బులుసు సాంబమూర్తిగారు ప్రకటించిరి.

ఆ దినములలోనే రేడియో కార్యస్థానమువారు నన్నాహ్వానించి రేడియోలో నొక యుపన్యాసమిమ్మని కోరిరి. "ఆంధ్రభాషయందలి వచనరచన" గురించి నే నాశుధారగ నిరువదినిముషములు మాటాడితిని. అది తాత్కాలికము గాకుండ ఎలిక్ట్రికలురికార్డు (Electrical Record) తీసి కొనిరి. 1939 ఫిబ్రవరి మొదటివారములో నాకు నెలనెలకు మునుపిచ్చు రు 60/-ల జీతము తగ్గించి, యిప్పటి నుండి నెలకు రు 30/-లు మాత్రమే యివ్వబడునని, పిఠాపురము మహారాజావారి కార్యస్థానమునుండి నాకు హుకుము వచ్చెను. ఆ సంవత్సర మేప్రియలు 8 వ తేదీని బయలుదేరి 9 వ తేదీ నుదయము రాజమహేంద్రవరము వచ్చితిని.

శ్రీ రఘుపతి వెంకటరత్నమునాయుడుగారు చెన్నపురిలో తమ కంటిజబ్బు కుదురనందున నచ్చట లాభము లేదని కాకినాడవచ్చి యచ్చట మరి రెండుమాసములు బాధపడి, మే 26 వ తేదీ రాత్రి చని పోయిరి. ఆవార్త నాకు తెలియగానే మరునాడుదయమున బయలు దేరి కాకినాడ వెళ్ళి, యామహాత్ముని యంత్యక్రియలలో పాలుగొంటిని. వారు పోయినచోట శిష్యులు ప్రార్థనలుజేసి, పిమ్మట బ్రహ్మ మందిరమువద్ద ప్రార్థనముచేసి, శవము ననాథశరణాలయమువద్దకు గొంపోయి, యచట ప్రార్థనలుసలిపి, యూరేగింపుచు రుద్రభూమి చేర్చిరి. నేను కూడ వెళ్ళితిని. చాలమంది జనులు వచ్చిరి. రుద్రభూమికడకు శ్రీ దురిశేటి శేషగిరిరావుగారు, శ్రీ లక్కరాజు సుబ్బారావుగారు, చావలి రామసోమయాజులుగారు మొదలగు పుర ప్రముఖులు వచ్చిరి. అచట డాక్టరు వేమూరి రామకృష్ణారావుగారు, పెద్దాడ రామస్వామిగారు, లక్కరాజు సుబ్బారావుగారు, చావలి

రామసోమయాజులుగారు. నేనును నాయుడుగారి పరిశుద్ధజీవనమును గురించి యుపన్యసించితిమి. కోకా వెంకటసుబ్బారావునాయుడుగారు శవముతలక్రింద హారతికర్పూరముపెట్టి పుత్రునివలె నగ్నిసంస్కారము జేసిరి. రెండుగంటలలో నాయుడుగారి శరీరము భస్మావశేషమయ్యెను.

ఆ మరునాడు నేను రాజమహేంద్రవరము వచ్చితిని. నేను వ్రాసిన "మహాపురుషముక్తావళి'' యను వచనగ్రంథమును పాఠ్యపుస్తక నిర్ణయ సంఘమువారిచే నామోదింపబడినట్లు 1939 మే 16వ తేదీ గెజిటులో ప్రకటింపబడెను. ఈ సంవత్సరమున నాయుడుగారికి ప్రియశిష్యుడును, నాయుడుగారి తరువాత కాకినాడ కళాశాలా ప్రధానాచార్యుడును, నాజన్మబ్రహ్మచారియు, మహావిద్వాంసుడునైన డాక్టరు వేమూరి రామకృష్ణరావుగారు, నవంబరు నెలలో బందరు పట్టణమున మృతినొందిరి. ఆయన నాకు చిరమిత్రుడగుటచేతను, నా కన్న చిన్నవాడయ్యు గుణవృద్ధుడగుటచేతను, నాయన మరణముగూడ నాకు విచారము గలుగజేసెను. పండితుడును, గుణసంపన్నుడును, మహాకవియు, నందుచేత శ్రీ పిఠాపురము మహారాజావారి కాస్థానకవి డును, నాకు బంధువునైన, ఓలేటి వెంకటరామశాస్త్రిగారు కూడ నీ సంవత్సరమే మరణించిరి.

పాలావఝ్ఝుల లక్ష్మీనారాయణగారు సకుటుంబముగా బ్రహ్మమతస్థులై, యనేకబ్రహ్మమతగ్రంథములువ్రాసి, 1935 వ సంవత్సరమున నరసాపురములో చనిపోయిరి. నరసాపురవాసులు లక్ష్మీనారాయణగారి ఛాయాపటమును దీయించి, టెయిలరుహైస్కూలులో దానిని ప్రతిష్ఠించి, దానిని బహిష్కరణముచేయుటకురమ్మని నన్నాహ్వానించిరి. 1940 మార్చి 17 వ తేదీని నేనాపనిచేయుటకు నా తమ్ముని కుమారుడు మల్లయ్యశాస్త్రిని వెంటబెట్టుకొని నరసాపురము వెళ్ళితిని. ఆయుత్సవము నిమిత్తమే పెద్దాడ రామస్వామిగారు నరసాపురము దయచేసిరి. మార్చి 17 సాయంకాలము టెయిలరుహైస్కూలు భవనములో సభజరిగెను. ఆసభకు నేనధ్యక్షుడనై లక్ష్మీనారాయణగారి సుగుణసంపద నభినందించుచు వారి ఛాయాపటము నావిష్కరణముచేసితిని. పెద్దాడ రామస్వామిగారును, మరికొందరు నర

సాపురవాసులునుగూడ, లక్ష్మీనారాయణగారివిషయమై మాటాడిరి. నరసాపురమునకు నాలుగైదుమైళ్లదూరములో మత్స్యపురియనుగ్రామ మున్నది. అక్కడ మాకు జ్ఞాతులుగొందరున్నారు. వారిలో నొకడు చిలకమర్తి నరసింహమనునతడు నన్ను మత్స్యపురిరమ్మని తీసుకొని పోయెను. ఆగ్రామవాసులు నన్ను టంజాములో గూర్చుండబెట్టి, బ్యాండు మేళముతో నూరేగించి, జనార్దనస్వామివారి యాలయము నకు గొంపోయి, యచట నొకసభచేసి యేదేని యొకయుపన్యాస మిమ్మని నన్నుగోరిరి. ఆంధ్రవాఙ్మయమునుగురించి నేనుపన్యసించి తిని. పిమ్మట నచటనుండి నరసాపురము వెళ్లి, కాళిదాసునిగురించి యొకయుపన్యాసమిచ్చితిని. అచటనే రెండవ యుపన్యాసము పండిత రాయలవారినిగురించి యిచ్చితిని. అచ్చటనుండి పాలకొల్లు వెళ్ళి, నాలుగో యైదో యుపన్యాసములిచ్చితిని. అచటనుండి రాజోలుమీ దుగా నమలాపురము వెళ్ళి, గూడా సత్యహరిశ్చంద్రుడుగారి యింట బసచేసితిని. అప్పుడు శ్రీరామనవమి యుత్సవములు జరుగుచుం డెను. పురజనులు కోరగా శ్రీరాముని గుణగణములనుగురించి యుప న్యసించితిని. ఆంధ్ర విశ్వవిద్యాపీఠమువారు శ్రీజయంతి రామయ్య పంతులుగారికి కళాప్రపూర్ణబిరుదమిచ్చినందున నమలాపురవాసులు వారిని సన్మానించుటకై ముక్తేశ్వరమునుండి వారినిరావించి యొక సభజేసి, యాసభకు నన్నధ్యక్షునిగనుంచిరి. రామయ్యపంతులుగారు చేసిన భాషాసేవ నుగ్గడించుచు యుపన్యసించితిని. ఆపురవాసులు మరి కొందరుగూడ వారినిగూర్చి మాటాడిరి. ఆ పురవాసులు నాకు గొంత ధనము బహుమానముజేసి బంపిరి. అచటినుండి బయలుదేరి ధవళే శ్వరములో మా మూడవ మేనగోడలి పెనిమిటి పొన్నపల్లి వెంకట లక్ష్మీనరసింహారావుగారి యింట గొన్నిదినములుండి, పిమ్మట రాజ మహేంద్రవరము వెళ్ళితిని. అప్పటికి రాజమహేంద్రవరములో "హితకారిణీ" సమాజపరిస్థితులు మారెను. ఆ సమాజమునకు నే నధ్యక్షుడుగాను, పెద్దాడ సుందరశివరావుగారు కార్యదర్శిగాను, నుం టిమి. ఆయన కార్యదర్శిగా నున్నకాలమున, శ్రీమపడి, చెన్నపురి, కాకినాడ మొదలగు ననేకస్థలములలో దిరిగి, సొమ్ము ప్రోగుచేసి వీరేశలింగముగారి శిలావిగ్రహమును జేయించి, యిన్నీసుపేటలో

వీరేశలింగోన్నత పాఠశాల కెదురుగా, రాచబాటమీద దానిని ప్రతి ష్ఠించిరి. అప్పుడు గొప్పసభ జరిగెను. ఆ సభకు "మోడరన్ రెవ్యూ" (Moderen Review) పత్రికాధిపతియైన రామానంద చటర్జిగారు కల కత్తానుండివచ్చి, యధ్యక్షతవహించిరి. ఆసభలో నేను దెనుగున మాటాడితిని. పెద్దాడ సుందర శివరావుగారి కుమార్తె కామేశ్వరమ్మ గా రింగ్లీషులో మాటాడిరి. మరికొందరుగూడ మాటాడిరి. సుందర శివరావుగారు కార్యదర్శిగానున్న కాలమున వీరేశలింగముగారి తోట శిస్తు యేడాదికి రు. 1600/-ల వరకు పెరిగెను. వితంతు శరణాలయ మునకు, క్రొవ్విడి శేష వెంకటకాశీపతిగారిని మేనేజరుగనుంచి, శర ణాలయమును, తోటను, సుందర శివరావుగారు చక్కగ నడుపుచుం డిరి. శరణాలయములో వితంతు వివాహములు జరుగుచుండెను. ఇట్లుండగా నే నధ్యక్షుడుగానున్న మూడు సంవత్సరములకాలము ముగిసెను. క్రొత్త యధ్యక్షుని యెన్నుకొనవలసి వచ్చెను. సుందర శివరావుగారు తమ కార్యదర్శిపదవిని వదలుకొనిరి. వారిస్థానమున (శ్రీ) రెబ్బాప్రగడ సుబ్బరామయ్యగారిని కార్యదర్శిగా నెన్నుకొనిరి. అధ్యక్షునిగా (శ్రీ) కనుపర్తి (శ్రీ)రాములుగారి నెన్నుకొనిరి. సమాజ సభ్యులలో అధికారవాంఛలు, పరస్పర ద్వేషములు, నసూయలు పెరిగెను. వీరేశలింగముగారు, రఘుపతి వెంకటరత్నము నాయుడు గారు వేసిన పద్ధతులనుమీరి, సమాజము వేరుగ వర్తింపజొచ్చెను. అనుష్ఠానిక బ్రహ్మమతస్థుడును, విద్యాధికుడును, సజ్జనుడునునైన కంభంపాటి రామశాస్త్రిగారిని, హితకారిణీ సమాజసభ్యులు కార్య నిర్వాహకవర్గములో నుండకుండ చేసిరి. సంఘసంస్కరణముమీా దను, బ్రహ్మమతముమీాదను, నభిమానము లేనివారు సభ్యులైరి. ఆ పరిస్థితులలో, నేను సభ్యుడుగానుండి చేయవలసిన పనేమియు లేక పోవుటచే, నా యావజ్జీవసభ్యత్వమును వదలుకొని, హితకారిణీసమా జములో 1940 వ సంవత్సర మార్గష్టు నెలలో సంబంధము వదలు కొంటిని. కుందూరి వెంకటరత్నముగారు పూర్వము వీరేశలింగో న్నత పాఠశాలలో చాలకాలము సహోపాధ్యాయుడుగ నుండిరి. అందుచేత వారు పాఠశాలా పరిపాలక సంఘములో సభ్యులుగానుండ గూడదని, (శ్రీ) రఘుపతి వేంకటరత్నము నాయుడుగారు స్పష్టముగా

చెప్పిరి. దానికివ్యతిరేకముగా వెంకటరత్నముగారిని పాఠశాలా పరి పాలకసంఘములో సభ్యునిగా జేయుటయేగాక, దానికి కార్యదర్శిగా గూడ జేసిరి. వెంకటరత్నముగారు పాఠశాలా సంఘమువారిమీద వ్యాజ్యమువేసి కోర్టుకెక్కించిరి. ఇటువంటి పరిస్థితులలో నేను పాఠ శాలా పరిపాలక సంఘములోగాని, హితకారిణీ సమాజములోగాని సభ్యుడుగా లేనందుకు సంతసించుచున్నాను.

1940 సెప్టెంబరులో రామమోహనరాయలవారి వార్షికోత్సవ మునకు రమ్మని నాకు నాహ్వానము యేలూరునుండి వచ్చెను. నే నేలూరు వెళ్లి యీ యుత్సవమున కధ్యక్షుడనై యుపన్యసించితిని. ఆ సభ జరిగిన మరునాడే నా జన్మదినమైనందున నా పురవాసులు నా డెబ్బదినాలుగవ జన్మదినోత్సవముజేసి నన్ను గౌరవించిరి.

1941 జనవరి 6 తేదీనా డుదయమున నే నొక పనిమీద కాకి నాడపోతిని. ఆ క్రిందటి దినము సాయంకాలము శ్రీ న్యాపతి సుబ్బా రావు పంతులుగారు రాజమహేంద్రవరములో పరమపదించిరి. ఆ వార్త నాకు తెలియకుండగనే, నేను కాకినాడ వెళ్ళితిని. ఆ సమయ మునకు రాజమహేంద్రవరమునుండి వారికి నా కడపటి గౌరవము జూపలేకపోతినని మిక్కిలి విచారించితిని. వారికి నామీద దయ మెండు. కాని కాకినాడలో సుబ్బారావుపంతులుగారి మరణమును గురించి విషాదము తెలుపుటకై పురజనులు టవునుహాలులో నొక సభ జేసిరి. ఆ సభలో నేను పంతులుగారినిగురించి మాటాడి తృప్తి చెందితిని. నే నక్కడనున్నప్పుడే శ్రీ జయంతి రామయ్యపంతులు గారు ముక్తేశ్వరములో ఫిబ్రవరి 9 తేదీని మృతినొందిరి. వారి మర ణమునుగూర్చి విషాదము దెలుపుటకై పురమందిరములో సభ జరి గెను. ఆ సభ కధ్యక్షుడనైతిని. శ్రీ దుగ్గిరాల సూర్యప్రకాశరావు పంతులుగారు మరికొందరుకూడ మాటాడిరి. కాకినాడలో నే నున్న కాలములో నీశ్వరపుస్తకభాండాగారములో రెండుపన్యాసము లిచ్చి తిని. పిమ్మట రాజమహేంద్రవరమువచ్చి వేసవికాలములో గొంత సౌఖ్యముగా నుండునని నా పెద్ద మేనగోడలియింట దానవాయి పేటలో నెలదినము లుంటిని.

ఆ సంవత్సరము జూను నెలలో నేను పూర్వముండెడి బస విడిచి యార్యపురము మారితిని. ఆర్యపురములో నుండగా గలిగిన యుద్ధభయమువల్ల 1942 ఏప్రియలు 6 వ తేదీని బయలుదేరి, పడమటిగోదావరిజిల్లా తణుకుతాలూకాలోని కాకరపఱ్ఱు గ్రామము వెళ్ళితిని. ఆ యూరిలోనున్న నా పెద్దవదినగారి కుమాళ్ళయిన ద్విభాషి చిన్నయ్య, కనకయ్య యను సోదరుల యింట గాపురముంటిని. వారు నాకు సకలసౌకర్యములు జేసిరి. కాకరపఱ్ఱు గ్రామవాసులు నన్ను సన్మానింపదలచి యొక సభ చేసిరి. నన్ను మేనాలో గూర్చుండబెట్టి వేదపండితులు స్వస్తిచెప్పుచు, ప్రతి గుమ్మముకడ హారతు లిచ్చుచు, బి. ఏ., యమ్. ఏ., పరీక్షలయందు త్తీర్ణులైన యువకులు, బోయీలచే మోయింపక, తామే మేనాను మోయుచు, సభకు గొంపోయిరి. ఆ సభకు శ్రీ చర్ల భాష్యకారశాస్త్రిగారు, వేదుల వెంకటశాస్త్రిగారు మొదలగు పండితులు వచ్చిరి. కాకరపర్తి వెంకటశాస్త్రిగారు సభ కధ్యక్షత వహించిరి. కొందరు నామీద పద్యములు రచియించి చదివిరి. కాకరపర్తి సత్యనారాయణగారు మొదలగు యువకులు కొందరు ప్రశంసాపూర్వకముగా నన్నుగురించి మాటాడిరి. కట్టకడపటసభలో నా కరువదిరెండు రూపాయిలు బహుమానము చేసిరి. కాకరపర్తి గ్రామము నా యత్తవారి గ్రామమగుటచే, "ఆలివంకవార లాప్తబంధువులన్నట్లు" నా భార్యవంక వారందరితో గలిసి, యా గ్రామస్థులు నన్నివిధముగ గౌరవించినందున మిక్కిలి సంతసించితిని.

---

# స్వీయ చరిత్రము

## చరమ ప్రకరణము

### కృతజ్ఞత

1942 వ సంవత్సరము ఏప్రియలు నెలలో, నేను రాజమహేంద్రవరమునుండి కాకరపఱ్ఱు వచ్చితిని. 1943 వ సంవత్సరము మార్చి నెలవరకు నేను ద్విభాష్యం చిన్నయ్యగారింట కాపురముండి యది యిరుకుగ నున్నందున యీ మార్చి నెలలో మరియొకగృహ మద్దెకు దీసుకొని, యందు ప్రవేశించితిని. ఈ 43 వ సంవత్సరాంతమున నాంధ్రవిశ్వవిద్యాపీఠమువారు నాకు 'కళాప్రపూర్ణ' బిరుదొసంగిరి. ఆ పట్టము నందుకొనుటకు నేను స్వయముగ గుంటూరు వెళ్ళదలచితిని. గాని నా దేహారోగ్యము సరిగ లేనందున వెళ్ళలేకపోతిని. చెన్నపురి గవర్నరుగా రధ్యక్షులై యీసభ జరిపి, నే నాసభలో హాజరు లేకుండగనే యీ బిరుదు నా కొసంగిరి. అత్తరి జయపురము మహారాజుగారైన శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజుగారు నామీది యభిమానముచేత నాకు బంపుమని విలువగలిగిన యొక జరీశాలువ విద్యాపీఠము రిజిష్ట్రారుగారైన శ్రీ కూర్మా గోపాలస్వామిగారి కిచ్చిరట. ఆయన యీ శాలువను, బిరుదపట్టమును, టపాలో నాకు బంపిరి. వాటిని నేను కృతజ్ఞతాపూర్వకముగ నందుకొంటిని.

రాజమహేంద్రవర నివాసులైన శ్రీ కర్రా మావుళ్ళయ్యగారు, యమ్. వి. క్రిష్ణయ్యనాయుడుగారు, అంగర నారాయణరావుగారు, తిమ్మరాజు వెంకటశివరావుగారును గలసి, మరికొందరిమిత్రుల ప్రోత్సాహముచేతను, సహాయమువల్లను, నా యందలి భక్తిగౌరవములచేత సుప్రసిద్ధమైన నటకులను బిలిపించి నేరచియించిన గయోపాఖ్యాన నాటకమును ప్రదర్శించి దానివల్ల వచ్చిన ధనమును వ్యయములు పోగా మిగిలిన మొత్తమును తమయొద్ద నిలువయుంచి 1943 డిశంబరు మొదలుకొని నెలకు నలుబదిరూపాయలు చొప్పున బంపుచున్నారు.

ఆ నాటకప్రదర్శనమునాటి రాత్రి మహాసభలో తూర్పుగోదావరిజిల్లా మోరి గ్రామనివాసులైన శ్రీ కందెం సత్యనారాయణగా

రను నొక యుదారశీలుడు ముందుకువచ్చి "బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు జీవించినంతకాలము వారికి నెలయొకటికి పది రూపాయలు బంపుదు" నని వాగ్దానము జేసిరట. సత్యసంధులైన యీ సత్యనారాయణగారు ప్రతినెలకు నయిదవు తారీఖులలోపుననే పంపి ప్రతిజ్ఞాపాలనము చేయుచున్నారు.

1943 వ సంవత్సరమునందే పడమటిగోదావరిజిల్లా పెనుగొండ గ్రామనివాసులైన జవ్వాది లక్ష్మయ్యనాయుడుగారు తమ గ్రామమున శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మగారి యాధిపత్యమున జరిగిన యొక మహాసభకు నన్నుగూడ నాహ్వానించిరి. నే నాసభకు వారు బంపిన మోటారుమీద వెళ్ళితిని. నాటిసభలో శ్రీ లక్ష్మయ్యనాయుడు గారు నెలకు పదిరూపాయలవంతున యావజ్జీవము బంపుదుమని వాగ్దానముజేసిరి. ఆ వాగ్దానము ప్రకారము వారు నాకు బంపుచున్నారు. ఈ విధముగ నేను కాలక్షేపము జేయుచు నీ గ్రంథమును సమాప్తము చేయగలిగితిని. నేనుజేసిన స్వల్ప దేశసేవను, భాషాసేవను గుర్తించి యాంధ్రదేశస్థులలో గొందరు నాయం దభిమానము గలిగి చేయుచున్న యీ సహాయమునకు వారి కెంతయు కృతజ్ఞుడను.

1944 వ సంవత్సరమున రాజమహేంద్రవర నివాసులును, శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగారి కుమారులును నైన శ్రీ న్యాపతి కామేశ్వరరావుపంతులుగారు తమ తండ్రిగారి పేర నే నిరువది యైదువందలకు వ్రాసియిచ్చిన ప్రామిసరీనోటు, ఒకరూపాయియైనను నావల్ల పుచ్చుకొనకుండ నోటు చెల్లువ్రాసి నాకు బంపివేసిరి. ఆహా హా! ఎంత యౌదార్యము, యెంతయభిమానము, యెంతత్యాగము! నా కృతజ్ఞత దెలియజేయుటకు మాటలు చాలవు. ఈ కామేశ్వర రావుగారికే గాక తమ తండ్రిగారైన శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులు గారికి గూడ నాయం దత్యంతాభిమానమే కాబట్టి యీ కామేశ్వర రావుగారికి నాయం దభిమానము వంశక్రమాగతమైనదే.

## కృతజ్ఞత

సామాన్యగృహస్థులయ్యు ధనవ్యయమునకు నెనుదీయక ధనము ఖర్చుపెట్టి నాచే నీ గ్రంథము వ్రాయించిన శ్రీ విస్సా అప్పారావుగారికిని, శ్రీ రాయసము వెంకటశివుడుగారికిని, వేలకొలది

ధనము వెచ్చబెట్టి గ్రంథ మచ్చువేయించి యాంధ్రమహాజనుల కొసం
గిన ఆంధ్రాభ్యుదయ రచయితల సంఘమువారికిని, మొదటినుండియు
ననేకవిధముల నాకు సహాయముజేసిన మహనీయులకును, నా కన్న
తల్లియైన యాంధ్రదేశమునకును, డెబ్బదియెనిమిది వత్సరములు నాకు
దీర్ఘాయురారోగ్యముల నిచ్చి నాచే నీ గ్రంథమును వ్రాయించిన జగ
త్పితయైన పరమేశ్వరునకును, కృతజ్ఞతాపూర్వక వందన సహస్రము
లర్పించి విరమించుచున్నాను.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

స్వీయ చరిత్రము సమాప్తము.

———

# సింహావలోకనము

నా జీవితకాలములో నాంధ్రదేశమునందు నెన్నో మార్పులు
జరిగినవి. నా చిన్నతనమునందు కందుకూరి వీరేశలింగముగారు
సంఘసంస్కరణ మారంభించిరి. ఆయన మొట్టమొదట నుద్యో
గస్థులు లంచములు పుచ్చుకొనకుండ జేయవలయుననియు, వివా
హాది శుభకార్యములలో భోగమునేళములు పెట్టకుండ జేయవలయు
ననియు. మగపెండ్లివారు దురాశచే నాడుపెండ్లివారిని గొప్పకట్న
ములు తెమ్మని బాధించకుండ జేయవలయుననియు, నుద్యోగస్థులు,
ప్లీడరులు భోగమువాండ్ర నుంచుకొనకుండ జేయవలయుననియు,
సంకల్పించి, పిమ్మట వితంతు వివాహముల నారంభించిరి. ఈ సంక
ల్పములలో వీరేశలింగముగారు చాలవరకు కృతార్థులైరి. ఒక గవర్న
మెంటు ప్లీడరుయొక్కయు, నొక డిస్ట్రిక్టుమునసబుయొక్కయు నాత్మ
హత్యలతో లంచగొండులసంఖ్య కొంతకాలము చాలవరకు తగ్గినది.

పూర్వకాల మాంగ్లేయ విద్యరాని యుద్యోగస్థులే లంచగొం
డులుగ నుండెడివారు. ఆంగ్లేయవిద్య నేర్చినవారికి గొప్ప యుద్యో
గము లిచ్చినపక్షమున లంచగొండితనము చాలవరకు తగ్గిపోవునని
జిల్లాకలెక్టరులు, జిల్లాజడ్జీలు మొదలగువా రాంగ్లేయవిద్య నేర్చినవా
రికే నుద్యోగముల నీయనారంభించిరి. కాని వారుకూడ నెనుకటి
వారి దారినే త్రొక్క, రెండుచేతుల లంచముల నందుకొన నారం
భించిరి. ధన మెంతవారినైన భ్రమపెట్టునుగదా! శాస్త్ర మెంతచదివి
నప్పటికి దుర్జనుడు సజ్జనుడుకాడు. మైనాకపర్వతము లక్షలకొలది
యేండ్లు సముద్రములోనున్నను లేశమైన మెత్తపడలేదు. అట్లే దుష్ట
నుడు బహుశాస్త్ర పారంగతుడైనను మంచివాడు కానేరడు. ఆవిష
యమై దేశస్థితి యించుమించుగ మునుపటివలెనే యున్నది. కోర్టు
లలో బనియుండి మనము వెళ్ళినపక్షమున, యెక్కడనో మున్సబు
నలుగురుతప్ప తక్కినవారందరు చేయి జాపువారే. వీరందరు పరీక్షల
యందు కృతార్థులైనవారే! దీని ముఖ్యకారణము దారిద్ర్యమేయని

నా యభిప్రాయము. గుమాస్తాలకు కుటుంబము పెరిగి ఖర్చు లెక్కు
వైనవి. దానికి దోడుగ జీతములు తక్కువ. రాజబంధువు లగులచే
కాబోలు నాంగ్లేయులకు ప్రతిశాఖలోను జీతములెక్కువ. మనవారికి
గూడ నధికారులు తగిన జీతము లిచ్చినపక్షమున లంచగొండితన
ములు మనదేశములో నిర్మూలన మగును. అంతవరకు నిది ప్రతిశాఖ
లోను నుండెడిదే. గృహమందు తండులములు లేనపుడు గుమాస్తా
లంచములుపట్టక, తప్పుడువ్రాతలు వ్రాయక, దారాపుత్రులను
మాడ్చి చంపునా ? కష్టస్థితిలో నీతిమంతులైయుండుట దుర్లభము.
ఇక భోగముమేళములమాట జూతము.

వివాహాది శుభకార్యములలో నాంగ్లేయ విద్యాభ్యాసము
జేసిన యుద్యోగస్థులు, న్యాయవాదులు భోగముమేళము పెట్టుట
మానిరి. ఇప్పటికిని మిక్కిలి పల్లెటూళ్ళయందును, వైశ్యులు మొద
లైనవారి యిండ్లయందును భోగముమేళము లేనిపక్షమున శోభస్క
రముగాదనియు, నలుగురు జేరరనియు వేశ్యలకాదరణము జరుగుచు
న్నది. ఈ వేశ్యా నిరసనమును గురించి వీరేశలింగముగారేగాక,
రఘుపతి వెంకటరత్నముగారును కృషిజేసిరి. వారితో నేనును
మహోపన్యాసములుచేసియు, పత్రికలలో వ్రాసియు, పనిచేసితిని.
నేను చేసినపనికి ఫలితములు కనపడినందుకు సంతసించుచున్నాను.

వివాహముల యందలి కట్నములు లేకుండ చేయవలెనని
వీరేశలింగము పంతులుగారు చాల శ్రమపడిరి. వారితో బాటు నేనును
మొదటినుండియు యేకీభవించుచున్నాను. కాని యీ విషయమై
యెంద రెంత ప్రయత్నము జేసినను మంచి ఫలితములు కనబడలేదు.
విద్యావంతులీ విషయమున ముందంజవేసి, మార్గదర్శకు లౌదురని
చే మాశించితిమి. గాని మా యాశ నిరాశయైనది. విద్యావంతు
లైనకొలది పెండ్లికొడుకులకును, వారి తలిదండ్రులకును, ధనాశా
రోగము క్రమక్రమముగ హెచ్చినది. అది చికిత్సకు సాధ్యమగునట్లు
తోచదు. గొడ్లను కటికివాని కమ్ముకొన్నట్లు తండ్రి కన్నకూతును
ముసలివానికో మూర్ఖునకో దరిద్రునకో కొన్ని వందల రూపాయల
కమ్ముకొనుట యెంత పాడుపనియో పిల్లవానికి కట్నము పుచ్చుకొ
నుట గూడ నంత పాడుపనియే. ఈ విషయమై చాల కాలము బహు

విధములుగ పత్రికలలో వ్రాసియు, వేదికలపైనుండి యుపన్యాసము లిచ్చియు, ప్రబోధము జేసితిమి. కాని యది బూడిదలోఁబోసిన పన్నీ రైనది. వివాహముల విషయమై యాడుపిల్లల తలిదండ్రులు తమ పుత్రికలకు మంచి వరులను దేవలెనని ఋణములను జేసి, యవి దీర్చ లేక, గృహారామక్షేత్రములను విక్రయించుకొని, దరిద్రావస్థల పాల గుచున్నారు. ఆడ పెండ్లివారు తమకు గులాములని మనసులో మగ పెండ్లివారు భావించి, యాడుపెండ్లివారి కొంపలు బందిపోటు దొం గలవలె దోచుకొనుచున్నారు. ఈ దురభ్యాస మడుగంటినగాని దేశము బాగుపడదు. విద్యావంతులైన యువకులు గొందరు బయలు దేరి, యాడుపెండ్లివారు కట్నము లిచ్చెదమని చెప్పినను, తలిదం డ్రులు తీసికొనుటకు బలవంతపెట్టినను, ధైర్యముబూని వారి మాట నిరాకరించి, నీతిమంతులై కట్నములు, కానుకలు, లాంచనములు దీసికొనకుండ వివాహము చేసికొన్న పక్షమున నీ దురాచారము తుదముట్టును. దేశాభిమానము గలవారట్టి యువకులను దగినట్లు ప్రోత్సాహపరచి, యట్టి వివాహములనే ప్రశంసింపవలెను. పిల్ల నమ్ముకొన్న వాని నెంతనీచముగ మనము జూచుచున్నామో, కట్నము బుచ్చుకొన్న తండ్రిని గూడ నంత నీచముగ జూచి నిరసింపవలెను. కట్నము దీసికొనుట గౌరవమనిభావించుట దేశములో నశింపవలెను. అది నీచమనియు, నవినీతి యనియు, జనులలో భావమేర్పడవలెను. ఇది పూర్వ మగ్రజాతులలోనే యుండెడిది. గాని క్రమముగ నంటు వ్యాధివలె నన్ని జాతులలోనికి వ్యాపించినది. ఇది ముఖ్యముగ వైశ్యులలోను కమ్మవారిలోను. హెచ్చుగనున్నది. దీనికి కారణము, వారు మిక్కిలి ధనవంతులగుట. ధనమున్న పక్షమున, ధర్మకార్య ములుజేసి సంస్థల నేర్పరచి జేయవలసిన పనులెన్నియేని గలవు. అంతియేగాని యదివరకే భాగ్యవంతులై ధనముతో తులతూగు చున్న పెండ్లికొడుకులకు వివాహకాలమున మంగళస్నానములతో బాటు కనకాభిషేకముచేయుట శ్రేయస్కరముగాదు. గుణవంతు లైన మరియొక బీదపెండ్లికొడుకునుదెచ్చి యాధనమతనికి కట్నముగ నిచ్చి, పిల్లనిచ్చినపక్షమున నట్టిదంపతులు చిరసౌఖ్యమునందుదురు.

సంఘసంస్కరణములో వితంతువివాహము మిక్కిలి ముఖ్యమైనది. ఈ యుత్కృష్టకార్యమునిమిత్తమై వీరేశలింగముగారు తమ యావజ్జీవము ధారవోసిరి. ఈ సంస్కరణములో వీరేశలింగముగారి భార్య రాజ్యలక్ష్మమ్మగారు సర్వవిధముల భర్తకు తోడుపడి, సహధర్మచారిణియను మాట సార్థకముజేసినది. ఆమె తోడ్పాటులేనిపక్షమున వీరేశలింగముగారా కార్యమున కృతకృత్యులుగాకపోయియుందురు. పండితులు, పామరులు, బంధువులు, మిత్రులు, వియ్యాలవారు, దేశస్థులందరు వ్యతిరేకభావముజూపినను ఒంటరిగా మీరుపనులు కించుకేనియు గదలని హిమాలయపర్వతమువలె ధైర్యమున్నాని నిలిచి స్వాములవారి యాంక్షలకు, కులమువారి నిరాదరణమునకు, వెరువక పంతులుగారు నిరాటంకముగ తాముపూనినపని కొనసాగించిరి. వివాహముకంటె ముఖ్యమైనది వితంతుశరణాలయస్థాపనము. వితంతువుల దుర్దశదొలగించుటకీశరణాలయమును వారుస్థాపించిరి. ఈ శరణాలయ నిర్వహణమునందు నేనును వారికించుక తోడ్పడితిని. నా యెడ వారికి మిక్కిలి గౌరవమును, దయయు నుండెడివి.

వితంతువివాహములు పంతులుగారు జీవించినకాలమున జరిగినట్లు నేడంత విజృంభణముగ జరుగుటలేదు. వివాహములు విశేషముగ జరుగవలెనన్న వితంతుబాలికల తలిదండ్రులు సామాన్యవివాహములవలెనే తమ యిండ్లలో వివాహములు చేయవలెను. మన యువకులుగూడ కట్నములకు, కానుకలకు నాశపడక, స్వార్థత్యాగముజేసి గుణవతులు, విద్యావతులు, సద్వంశజాతలునైన బాలవితంతువులను వివాహమాడవలెను.

వీరేశలింగముగారివంటి ధైర్యవంతులు దేశమున బయలుదేరి యీ సంస్కరణమును జేపట్టిన నది దేశమంతటను వ్యాపించును. వీరేశలింగముగారు వారియనుచరులు కష్టపడి యెంత ప్రబోధము జేసినను సంఘమింకను గాఢనిద్రనుండి మేలుకొనలేదు. ఈ కుంభకర్ణనిద్రనుండి సంఘమును మేలుకొలుపుట కష్టసాధ్యముగ దోచుచున్నది. ప్రౌఢవివాహములు జేసినపక్షమున బాలవితంతువులసంఖ్య కొంతవరకు క్షీణమగునేమోయని తోచుచున్నది. కాని యీ విషయమునగూడా సంఘము ముందంజ వేయుటలేదు. తలిదండ్రులు

రజస్వలలైనపిల్లలకు రజస్వలలుగా లేదని బొంకులు బొంకి, వివాహ ములు చేయుచున్నారు గాని, ధైర్యముబూని సత్యము పలుకుటలేదు. ఈ విషయమున బ్రాహ్మణ, వైశ్యులకంటె క్షత్రియులు, శూద్రులు ప్రశంసనీయులు. వారికులాచారము చిన్నబిడ్డలకే వివాహములు చేయుమని వారిని నిర్బంధించుటలేదు. పూర్వకాలమున బ్రాహ్మణు లలోగూడ రజస్వలలైన కన్యలకే వివాహములు జరిగినట్లు పురాణ ములలోను, కావ్య, నాటకములలోను, స్పష్టముగ వ్రాయబడి యున్నది.

ప్రాచీనకాలమునుండియు హిందూసంఘమున నెన్నో సంస్క రణములు జరిగినట్లు మన మతగ్రంథములలో నుండినను, వాటిని లెక్కసేయక, మహాపండితులు సయితము పామరులట్లె మూఢవిశ్వా సములకు లోనై, "గతానుగతికో లోకోనలోకః పారమార్థికః" యను లోకోక్తినిబట్టి వారు జేయుచున్నారని వీరు, వీరు జేయుచున్నా రని వారు జనులు వెనుకటి పుంతనే బోవుచున్నారు. సంఘసంస్క రణవిషయమున మునుపటివలె ప్రబోధముగూడ లేదు. పూర్వము రాజకీయవిషయమున నేటేట జిల్లాసభలు జరుగుచుండెడివి. ఆసభ లతో పాటు సంఘసంస్కరణ సభలుగూడ జరుగుచుండెడివి. కొంత కాలమునుండి రాజకీయసభ లంతరించినవి. వానితోపాటు సంస్క రణ సభలుగూడ మటుమాయమైనవి. రాజకీయసభల మాటటుం డగ సంఘసంస్కరణసభలు ప్రతి మండలములోనున్న నాయకులు ప్రతి సంవత్సరము జరిపి ప్రబోధముజేసిన బాగుండును. రాజకీయ విషయములు దొరతనమువారి యధీనములోనివి. సాంఘికవిషయ ములు మనచేతిలో నున్నవేగనుక, మనమే వాటిని చక్కపరచుకో వలెను.

## మతస్థితి

1828 వ సంవత్సరమున రాజా రామమోహనరాయలు బంగా ళాదేశమున బ్రహ్మసమాజమతము స్థాపించెను. ఆగాలి దక్షిణముగ వీచినందున నేకేశ్వరారాధనము జేయింపదలచి వీరేశలింగముగారు 1878 లో నొక ప్రార్థనసమాజమును రాజమహేంద్రవరమున స్థాపిం చిరి. కొందరు యువకు లాయనచుట్టును చేరి ప్రతివారము పరబ్రహ్మ

మునుగూర్చి నిర్గుణముగ ప్రార్థనములు చేయజొచ్చిరి. బ్రహ్మమత వ్యాప్తికై బంగాళాదేశమునుండి బిపినుచంద్రపాలు, శివనాథశాస్త్రి మొదలగువా రాంధ్రదేశమువచ్చి బ్రహ్మమతమునుగూర్చి ప్రబోధ ముజేసిరి. క్రమముగ వీరేశలింగముగారికా సిద్ధాంతములు నచ్చించి నందున వారు 1906 వ సంవత్సరమున సనుష్ఠానిక బ్రహ్మమతస్థు లైరి. అనగ యజ్ఞోపవీతమును త్యజించుట, కర్మలుమానుట, జాతిభే దము పాటింపకుండుట. కొందరు యువకులు వారిమార్గము ననుసరిం చిరి. నాటనుండి బ్రహ్మసమాజము వెలసినది. వీరికిదోడుగ శ్రీ రఘుపతి వేంకటరత్నము నాయుడుగారుకూడ బ్రహ్మమతావలంబ కులై కాకినాడలోని కళాశాల కధ్యక్షులుగనచ్చి యచ్చటగూడ బ్రహ్మసమాజబీజములు నాటిరి. అది కొంతకాలమచట వృద్ధిపొం దెను. ఆంధ్రదేశములో పెక్కు ప్రార్థనసమాజములు స్థాపింపబడెను. వీరేశలింగముగారును, నాయుడుగారును గతించినతరువాత బ్రహ్మ మతము క్షీణించుచున్నది. మనదేశములోనున్న బ్రహ్మమతస్థులను వ్రేళ్ళమీద లెక్కపెట్టవచ్చును. ఎందుచేతనో మనదేశమున బ్రహ్మమతవృక్ష మేపుగ బెరుగలేదు. అది మనదేశ విరుద్ధమైన మతము గాకపోయినను, మహర్షి సమ్మతమై యుపనిషత్సమ్మతమైనను పూర్వము బౌద్ధమత, జైనమతములకు స్థానమిచ్చిన యాంధ్రదేశము నేడీ పరిశుద్ధాస్తికమతమునకు నాశ్రయ మియ్యకపోవుట మిక్కిలి శోచనీయము. నాకీమతమునం దత్యంతాభిమానము గలదు. ఈ మత మవలంబించినవారికి మూఢవిశ్వాసము లుండవు. బంగాళా దేశమునం దిది బాగుగ వ్యాపించినది.

రాధాస్వామి మతము మనదేశమున నెక్కువగ వ్యాపించు చున్నది. దానియందు నా కెంతమాత్రము విశ్వాసములేదు. కాని వారు చేయుచున్న పరిశ్రమలు మాత్రము మిక్కిలి శ్లాఘాపాత్రములు.

ఆర్యసమాజ మతము మన యాంధ్రదేశమున నించుమించుగ లేనేలేదని చెప్పవచ్చును.

దివ్యజ్ఞాన సమాజములుమట్టుకు మన యాంధ్రదేశమున నెల్ల యెడల నున్నవి. దివ్యజ్ఞానసమాజ మొక మతముగాదు. దాని

సిద్ధాంతము లుదార భావములు గలిగియున్నవి. నాకు దానియందును విశ్వాసములేదు. చిన్ననాడు నేనొకసారి కొందరు మిత్రుల ప్రోత్సాహముచేత దివ్యజ్ఞాన సమాజికుడనైతినిగాని తరువాత మానుకొంటిని.

## నిమ్న జాత్యుద్ధరణము.

గొప్ప సమస్యలలో నిదియొకటి. మన హిందూదేశములో నిమ్నజాతులవారు రమారమి యారుకోట్లమంది యున్నారు. వీరి యవస్థ పశువుల యవస్థకన్న దీనముగ నున్నది. వీరి సంఖ్య క్రమక్రమముగ తగ్గుచున్నది. ఏమన నొకవంక క్రైస్తవులు, మరియొకవంక మహమ్మదీయులు, వారిని జేరదీసి తమ తమ మతములలో గలుపుకొనుచున్నారు. దీని కుత్తరవాదు లెవరన్న నగ్రజాతులమని విఱ్ఱవీగుచున్న బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులే. ఈ వర్ణముల వారు పంచములు మొదలైన నిమ్నజాతులచేత తమకు గావలసిన సేవలన్నియు జేయించుకొని, వారిని యింట్లకు రానీయక దరికి చేరనీయక యంటరానివారనియు, చెప్పరానివారనియు, వారికసహ్యములైన పేళ్ళుపెట్టి హీనముగ జూచుచున్నారు. పశువులు మన యింట నుండవచ్చును. కుక్కలుండవచ్చును. కాని పంచములు మట్టుకు మన గృహావరణములోనికి రాగూడదు. వారు మన పశువులను మేపవచ్చును. కాని మనము నోరువిచ్చి వారితో మాటలనైన నాడజాలము. వారు భగవంతునిచే సృష్టింపబడిన మనుష్యులే యనియు, నగ్రవర్ణములవారి కున్నట్లే వారికిగూడ క్షుత్పిపాసలు, సుఖదుఃఖములు గలవనియు మనవారు తలంపరు. తలంచిన పక్షమున వారి నా రీతిగ నుంచుదురా ?

మనదేశములో ధనవంతులు లేకపోలేదు. విజ్ఞానవంతులు లేకపోలేదు. వేలకొలది ధనము వెచ్చించి పేరు ప్రతిష్ఠలకై సత్రములు, సావడులు గట్టించి, సంతర్పణములు, సమారాధనలు చేయింతురుగాని, మాలపల్లి యవస్థనుజూచి దానిని బాగుచేయుటకై ప్రయత్నించువారు లేరుగదా ! వారుండు పల్లెలు గ్రామమునకు వెలుపల నుండి దుర్గంధ భూయిష్టములై, హేయములై, మానవులు వసించుటకు వీలుగనుండవని యెవ్వరెరుంగరు ? మన దేశమున ననేక పండితులు గలరు. వారిలో ననేకులు భగవద్గీత జదివియుందురు. అందు

శ్రీకృష్ణభగవానుడు చెప్పిన యీ క్రింది శ్లోకమును వారు పలుమారు పఠించియే యుందురు.

శ్లో॥ విద్యా వినయ సంపన్నే
బ్రాహ్మణే గవి హస్తిని
శుని చైవశ్వపాకేచ
పండితా స్సమదర్శినః ॥

దీనికి తిక్కన సోమయాజి మహాభారతమునందు పద్యమిట్లు వ్రాసినాడు.

చ. వినయము విద్యయుం గలుగు విప్రునియందును గోవునందు నొ
ప్పు నెరయు హస్తియందు నొక పోకకుబోవని కుక్కయందు దా
ని నడచి తెచ్చి వండి తిను నీచపు మాలనియందు తుల్యద
ర్శనులు తదంతరాత్మని నిరంజనునిం గను పండితోత్తముల్.

భగవద్గీతా పారాయణము జేయునట్టియు, పంచమవేదమైన భారతము చదువునట్టియు, వినునట్టియు నగ్రజాతులవారందరు పై శ్లోకమును నోటితో పఠించుటయేగాని మనసునకు పట్టించుకొనరు. హిందువు లందరిచేత భగవంతుడని సేవింపబడుచున్న శ్రీకృష్ణభగవానుని మాటలయందే మనవారికి లక్ష్యము లేనప్పుడు నిమ్నజాతుల నుద్ధరింపుడోయని మొరవెట్టు నీనాటి నవనాగరికుల మాటయందు లక్ష్యముండునా ?

హిందూదేశమందలి యితరభాగములందువలెనే మన యాంధ్రదేశమునగూడ నీ సమస్య జనుల నాకర్షించినది. శ్రీ పిఠాపురము మహారాజుగారు పంచమ బాలబాలికలకై రెండు వసతిగృహము లేర్పరచి, యన్నవస్త్రము లిచ్చి, విద్యాబుద్ధులు గరపి, చాలకాలము పోషించిరి. వారి కళాశాలలోను, పాఠశాలలోను జీతము లేకుండ పంచములకు జదువు చెప్పించుచున్నారు. శ్రీ వీరేశలింగముగారు కూడ పంచమ బాలురకు తమ పాఠశాలలో నుచితముగ విద్య చెప్పించిరి. రఘుపతి వేంకటరత్నమునాయుడుగారుకూడ నీ సమస్యయందు మిక్కిలి యభిమానము గలవారు.

ఈ సమస్య నాకు మిక్కిలి యిష్టమైనది. ఉడుతభక్తిగల నేనుగూడ పంచమోద్ధరణము గూర్చి పనిజేసితిని. 1909 వ సంవత్సరము

"రామమోహన" పాఠశాల యను పేర నొక పాఠశాల స్థాపించితిని. మొదట పదిమంది విద్యార్థులే చేరినను, క్రమముగ నని నూటయేబది మంది విద్యార్థులతో నిండియుండెను. ఏడుగురుపాధ్యాయులు పని జేసిరి. విద్యార్థుల కుచితముగ పుస్తకములిచ్చి, నుచితముగ చదువు చెప్పించితిని. ఆ దినములలో నా పుస్తకములవల్ల నాకు మంచిరాబడి వచ్చుచుండినందున, నా స్వంత ధనముతో నే పాఠశాలను నిర్వహించుచుంటిని. (శ్రీ) పిఠాపురము మహారాజావారు గూడ దీనికి కొన్ని వందల రూపాయలు సహాయముజేసిరి. ఈవిధముగ నే నా పాఠశాలను వ్యయప్రయాసలకోర్చి పదమూడు సంవత్సరములు నడిపి, నా స్వంతసొమ్ము మూడువేలరూపాయలు ఖర్చుపెట్టి, చిట్టచివరకు దానిని వదలుకొంటిని. నే నీ పాఠశాల నారంభింపక ముందు మన యాంధ్రదేశమున మరియెవరును నిమ్నజాతుల నిమిత్తమై ప్రత్యేకముగ పాఠశాలను పెట్టలేదు. ఇటీవల క్రైస్తవాదు వారి నిమిత్తమై పాఠశాలల నచ్చటచ్చట బెట్టుచున్నారు.

భాగ్యవంతులు తమ ధనమును దేవాలయములక్రింద సత్రములక్రింద ఖర్చుపెట్టక, ఈ సమస్యను తీసుకొని నిమ్నజాత్యుద్ధరణము కొరకై వినియోగించిన మన దేశమునకు, మన జాతికి నెంతో మేలుకలుగును. ఆ జాతులవారు క్రైస్తవ, మహమ్మదీయులలో కలియకుందురు గనుక సనాతనమై యతి పవిత్రమైన మన హిందూమతము వృద్ధిపొందును.

## స్త్రీ విద్య

విద్య పురుషుల కెంత యవసరమో స్త్రీలకుగూడ నంతే యవసరమే యని నా యభిప్రాయము. భరతఖండము మిక్కిలి యెక్కువ నాగరికతగల దశలో నున్నకాలమున, హిందూస్త్రీలు విద్యావతులై యుండిరని, మన పురాణాది గ్రంథములు వేనోళ్ళ చాటుచున్నవి. వేదమంత్రములు రచియించినవారిలో కొందరు స్త్రీలు గూడ గలరు. వేదాంత విద్యాపారంగతులై, బ్రహ్మవేత్తలలో నగ్రగణ్యులై, జనక మహారాజునకు గురువై, యాతనిచేత పలుమన్ననలు బడసిన యాజ్ఞవల్క్య మహామునితో, జనక భూపాలుని సభలో గార్గియను నొకానొక స్త్రీ రత్నము, వేదాంత విద్యావాదముజేసి యా మునిని పెక్కు

చిక్కులు పెట్టెను. స్త్రీలకు బ్రహ్మవిద్యాధికారము లేదని తెలియక వాదింతురు గాని, పురాణబ్రహ్మవాదియైన యాజ్ఞవల్క్యమహామునియే, తన ప్రియ భార్యయైన మైత్రేయికి, బ్రహ్మవిద్యోపదేశము చేసెనని, బృహదారణ్యకోపనిషత్తులో స్పష్టముగ చెప్పబడియున్నది. కావ్యనాటకాలంకారాది గ్రంథములలో గూడ స్త్రీలు పాండిత్యము సంపాదించి పేరువడసినట్లు మన గ్రంథములవల్ల దెలియుచున్నది. కాని కాలక్రమమున నేమికారణముననో స్త్రీలకు మనవారు మునుపటి యున్నత స్థానము తప్పించి, వారి నధోగతిపాలు జేసిరి. ఈ యధఃపతనములో స్త్రీలకు విద్యాభ్యాసముగూడ తగదని మన పెద్దలు శాసించిరి. బాలికా పాఠశాలలకు యాడుబిడ్డలను బంపుటయే యరుదైపోయెను. గత శతాబ్దముయొక్క మధ్యభాగమునుండి యాంగ్లేయ విద్యావంతులైనవారు తమ బిడ్డలను బాలికా పాఠశాలకు పంపదొడగిరి. అప్పుడు మనవారు మేలుకొని పూర్వకాలమునుండి మనలోనున్న స్త్రీవిద్య యవసరమని పాశ్చాత్యులవలన మనవారు గ్రహింపవలసినంతటి దురవస్థ పట్టినది. స్త్రీ విద్యావిషయమున వీరేశలింగముగారు మిక్కిలి కృషిచేసిరి. బాలికలకు పాఠశాలలు స్థాపించిరి. వారినిమిత్తమై సులభమైన గ్రంథములు వ్రాసిరి. తమ యున్నత పాఠశాలలలో బాలికల కుచితముగ విద్య చెప్పునట్లు శాసించిరి. వారును వారి యనుచరులును చేసిన కృషినిబట్టి స్త్రీవిద్య గౌరవనీయమైనదే గాని నింద్యముగాదని దేశస్థులలో సదభిప్రాయము చాలవరకేర్పడినది. దీనినిబట్టి యాంగ్లేయవిద్యయే ప్రధానమని నేదలంచినట్లు మీరభిప్రాయపడగూడదు. సంస్కృతాంధ్రములు మన బాలికలకు చెప్పించినను నా కిష్టమే. స్త్రీలు వీటియం దున్నతవిద్యావతులగుట మిక్కిలి శ్రేష్ఠమని నా యభిప్రాయము. ఆంగ్లేయవిద్య నేర్చుకొని మన పురుషులలో చాలమంది దేశాభిమానము, భాషాభిమానము, జాత్యభిమానము మరచి, మన కట్టుబాటులను పద్ధతులనురోసి, మద్యపానాది దురభ్యాసముల కలవాటుపడి భ్రష్టులగుచున్నారు. స్త్రీలు లోకజ్ఞానముకొరకు నాంగ్లేయవిద్య నభ్యసింపవచ్చునుగాని, వారి యాచార వ్యవహారముల నవలంబించుట గర్హ్యమని నా యభిప్రాయము. స్త్రీ లేవిషయమున బనిచేసినను మన భారతజాతి కట్టుబాటు

లను విసర్జింపక, వాటి ననుసరించి కాలానుగుణముగ పనిచేయుట కర్తవ్యము. అరవభాషలో నవయారను నామెయు, నాంధ్రమున మొల్లయు, తరిగొండ వెంకమ్మయు, చక్కని కవిత్వముజెప్పి ప్రఖ్యాతిగాంచిరి. ఈనాటి మన యాంధ్ర స్త్రీలుగూడ వారిమార్గము ననుసరించుట శ్రేయస్కరము. ఈవిషయమున నా స్వవిషయముకొంత వ్రాయవలసి వచ్చినందులకు క్షమించవలెను. నా మేనకోడలైన శ్రీమతి రావూరి వెంకటసుబ్బమ్మ యిరువది రెండేండ్ల వయసున తన భర్తను గోలుపోయెను. అప్పటికామె కొక కుమార్తెగలదు. వారిరువురను నాయొద్ద నుంచుకొని నా యాశయము ననుసరించి యామెకు సంస్కృతాంధ్రములు చెప్పితిని. మిక్కిలి శ్రద్ధాభక్తులతో నామె విద్యకరచి, యుభయభాషాప్రవీణతో కృతార్థురాలై, 1928వ సంవత్సరమున నాంధ్ర విశ్వవిద్యాపీఠముయొక్క పట్టమునుపొందెను. ఆంధ్ర విశ్వవిద్యాపీఠమున నీపట్టమునుపొందిన మొదటి స్త్రీ నా మేనకోడలే యైనందుకు నేను సంతోషించుటయేగాక గర్వించుచున్నాను. ఆమె యిప్పుడు రాజమహేంద్రవరమున దొరతమువారి బాలికాపాఠశాలలో నాంధ్ర పండితురాలై నెల కిరువదిరూపాయిలు వేతనము దీసికొనుచున్నది. స్త్రీవిద్యా విషయమున నాకు మొదటినుండియు నభిమానముగలదని తెలియజేయుటకు మరియొక్క యుదాహరణము చెప్పుచున్నాను. నే కాపురమున్న యింటి యజమానునియొక్క మఱదలు నిమిషకవి సీతాయమ్మయను నామె దురదృష్టమున బాల్యమునందే భర్తను గోలుపోయి, తనసోదరి యింటికివచ్చి యుండి తెనుగు తనకుజెప్పుమని కోరినందున నేనామెకు నాంధ్రము జెప్పితిని. ఆమె చదివి పాండిత్యము సంపాదించి పెద్దతరగతులకుగూడ పాఠములు చెప్పగలిగిన సామర్థ్యము సంపాదించెను. నా రెండవ మేనకోడలు కోట వెంకటరత్నమ్మగూడ భారత, భాగవతాదిగ్రంథములు చక్కగ చదువగలదు. ఆమెకుగూడ నేను గొంతప్రవేశము గలిగించితిని.

## లలితకళలు

ఇందు ముఖ్యమైనది గానము. గానమునకు దక్షిణదేశము మిక్కిలి ప్రసిద్ధము. ఆంధ్రదేశమున గొప్ప గాయకులు మిక్కిలి యరుదుగ నున్నారు. గానకళానిధియైన త్యాగరాజు తెనుగువాడే.

మైనను ద్రవిడ దేశమున గాపురముండుటచేత గానరసమంతయు దక్షిణాత్యులకే పట్టినది. ఆంధ్రదేశమున నెవరియింటనైనను శుభకార్యము జరుగునపుడు దాక్షిణాత్య గాయకులనే పిలిపించుచున్నారు. ఇది మిక్కిలి శోచనీయము. ఆ పాత మధురమైన గానరసము గ్రోలుటలో మనవారు వెనుకబడియుండుట మిక్కిలి విచారకరముగదా! ధనవంతులు దేశమున గానపాఠశాలలను నెలకొలిపి, యీ కళను మిక్కిలి యభివృద్ధిచేయుదురుగాక. మనము వారి పాండిత్యముజూచి దక్షిణాత్యులను పిలిపించుకొన్నట్లే దాక్షిణాత్యులు గానసభలనిమిత్తమై యాంధ్రగాయకులను పిలుపించుకొనవలసినంతటి యుత్తమస్థితి మన యాంధ్రదేశమునకు రావలెను. ఆ సుదినముకొరకు మన మెదురుచూచి సరియగు మార్గమున పనిచేయవలెను.

ఈ లలితకళలలో రెండవది చిత్రలేఖనము. ఇందు మనయాంధ్రులు కొంత ప్రజ్ఞను సంపాదించి పేరు వడయుచున్నారు. ఐనను, నిది ప్రారంభదశయందే యున్నది. ఇంకను బహువిధములుగ వృద్ధి పొందవలెను. శిల్పమునందుగూడ దాక్షిణాత్యులే మనవారికంటె నధికులు. ఏలయన నచటనున్న యాలయములకూడను, యాలయములలోను గల శిల్పము భరతఖండమునందెచ్చటనులేదు. ఇది పాశ్చాత్యులనుగూడ నాశ్చర్యరసమున మగ్నముజేయుచున్నది. ఈ విషయమున నాంధ్రదేశములో శిల్పము లేనేలేదని చెప్పవలయును. ఇందు మన యాంధ్రులు దేశములోని నితరభాగములకుబోయి శిల్పకళను నేర్చుకొని, ప్రజ్ఞాధికులై, మన యాంధ్రదేశమున నీ కళలను వృద్ధిపొందించుటకు ప్రయత్నములు చేయవలెను.

నాట్యకళ:—ఇది కులటా వృత్తివల్ల జీవించు వేశ్యల పాలగుటచే గాబోలు ప్రజలకు దీనియందు గౌరవాదరములులేవు. ఇదియు బ్రశస్తమైన కళలలో నొకటి. శుంగవంశస్థుడైన యగ్నిమిత్రమహారాజు తన ప్రియురాలైన యిరావతికిని, దనయింటనుండిన మాళవికకును, హరదత్తగణదాసు లనెడు నాట్యాచార్యులచేత నాట్యము నేర్పించినట్లు కాళిదాసమహాకవి తన మాళవికాగ్నిమిత్ర నాటకములో వర్ణించియున్నాడు. ఇదిగాక విరాటుడు యుక్తవయస్కురాలైన తన కూతు రుత్తరకు బృహన్నలచేత నాట్యము నేర్పించినట్లు

మహాభారతములో నున్నది. దీనినింబట్టి మగవారుగూడ నీ విద్యను నేర్చుకొనునట్లును, రాజులు తమ యంతఃపుర స్త్రీలకు నేర్పించినట్లును స్థిరపడుచున్నది. ఈ విద్య నేర్చినవారు పూర్వము కూచిపూడి భాగవతులలో నెక్కువగ నుండెడివారు. ఇప్పుడుకూడ కొందరున్నారు. నాట్యాభినయమునం దభిరుచిగల యాంధ్రు లీవిద్య తమ చిన్న పిల్లలకు నేర్పించిన బాగుండును. కళవృద్ధిపొందును.

భాషా సంస్కరణము.

రమారమి ముప్పది సంవత్సరముల క్రిందట గ్రంథములలో గూడ వ్యాకరణ విరుద్ధమైన వ్యావహారికభాషనే వాడవలయునని యొక వాదము బయలుదేరినది. ఈ వాదము లేవదీసినవారు, మహారాజ శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారును, గురజాడ అప్పారావు పంతులుగారును. ఇందు రామమూర్తిపంతులుగారు సంస్కృతాంధ్రభాషలయందు గొప్ప పండితులు. వారివాదముతో నే నేకీభవింపకపోయినను వారియెడ నాకత్యంత గౌరవాభిమానములు గలవు. వ్యావహారిక భాషయను మారుపేరుపెట్టి, గ్రామ్యమునే గ్రంథములో వాడుట నా కెంతమాత్ర మిష్టము లేదు. అట్లు వాడుట భాషను నాశనముచేయుటగాని, వృద్ధిచేయుటగాదని నా దృఢవిశ్వాసము. వారి యనుచరులమని పేరుపెట్టుకొని కొందరు మిక్కిలి యశ్లీలములు, నసభ్యములు, హేయములు నైన గ్రంథములు వ్రాయుచున్నారు. భాష మాట యటుండగ మన సాంప్రదాయములకు విరుద్ధములైన వ్రాతలు వ్రాయుచున్నారు. సీత, సావిత్రి మొదలగు మహాపతివ్రతలకు గూడ దోషము లారోపించి గ్రంథములలో వ్రాయుచున్నారు. దీనినిబట్టి మన భాషయు, పవిత్రాశయములు, నెంతటి దుస్థితిలోనికి వచ్చినవో గ్రహింపవచ్చును. ఇందు కుదాహరణములు గావలసినవారు నా మిత్రులు బ్రహ్మశ్రీ కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు వ్రాసిన "సాహిత్యకళ" యను గ్రంథము చూడవచ్చును. వ్యావహారిక భాష సులభముగ నందరకు దెలియునని వారు వాదింతురు. వేమన సలక్షణమైన భాషలో వ్రాసినను నా మహాత్ముని కవిత్వ మెల్లరకును దెలియుటలేదా ? అంతకంటె సులభముగ కవిత్వము జెప్పగల కవి మరియొకడుగలడా ? శ్రీ వీరేశలింగముగారికంటె వచనము సులభ

ముగ వ్రాయగలవారు మరియొకరు గలరా? ఆయన సలక్షణమైన భాషను వాడిరిగదా? కావున వ్యావహారికభాష గ్రంథములలో వాడగూడదని నేను త్రికరణశుద్ధిగ నొక్కి చెప్పుచున్నాను.

## రాజకీయ సంస్కరణము

1905 వ సంవత్సరము మొదలుకొని రాజకీయసంక్షోభము దేశములో జరుగుచున్నది. స్వరాజ్యసంపాదనము దీని ముఖ్యోద్దేశము. ఇందు మన యాంధ్రదేశముగూడ పాల్గొన్నది. విదేశవస్తు బహిష్కారము, స్వదేశవస్తు ప్రోత్సాహము స్వరాజ్యసంపాదనకు సాధనములుగ మన పెద్ద లేర్పాటుచేసినారు. స్వదేశవస్త్రము కొంత వరకు వాడబడుచున్నది. కాని యీకృషి యింకను చాలదు. వస్త్రమేగాక యితర వస్తువులుగూడ స్వదేశమం దుత్పత్తియైనవే వాడుట శ్రేయస్కరము. ఇంచుమించుగ సమస్తవస్తువులకు మనము విదేశీయులపై నాధారపడుట లజ్జాకరము. ఈవిధముగ బ్రతుకుచున్న జాతి ప్రపంచమున మరియొకటి లేదని నా నమ్మకము. గాఢ దేశాభిమానమున్న పక్షమున స్వదేశవస్తు ప్రోత్సాహము విశేషముగ జరుగును. ఇది మనవారి కుండవలసినంత లేదు. అది దృఢముగనున్న పక్షమున మనదేశములో నొక్క విదేశవస్తువు ఖర్చుపడునా? అట్టివ్యాపారము జేయువారు తమ యంగళ్ళు కట్టిపెట్టుకొని పోరా?

ఆంధ్రులు గొప్పజాతివారు. వారల పూర్వచరిత్రము మిక్కిలి ప్రసిద్ధమైనది. ఆంధ్రవంశపురాజులు మగధరాజ్యమును జయించి నాలుగువందల సంవత్సరము లవిచ్ఛిన్నముగ బరిపాలించిరి. పల్నాటి వీరులయొక్కయు, బొబ్బిలి మొదలగు వెలమసంస్థానములయందలి స్త్రీపురుషులయొక్కయు తేజము శౌర్యము జగత్ప్రసిద్ధములుగదా! దేశమభివృద్ధి పొందవలెనన్న తీవ్ర దేశాభిమానము, స్వార్థత్యాగము స్త్రీలనక పురుషులనక యాబాలగోపాలమునకుండవలసినదే. దేశాభిమాననే మన మతముగనుండవలెను. దేశ మాతృపూజయే ప్రత్యాంధ్రుడు నీమముగ నాచరించవలెను. ప్రతి గృహము దేశమాతృదేవత యాలయముగ నుండవలెను. గృహ యజమానుడు దాని యర్చకుడు. దీనికి దేశములో నైకమత్యము విశేషముగనుండవలెను. "ఐకమత్యము" అను పంచాక్షరీ మహామంత్రము ప్రతిమాన

వృతు పునశ్చరణము జేసి యాచరింపవలెను. బ్రాహ్మణ బ్రాహ్మణేతర సమస్య రూపుమాసిపోవలెను. హిందూ - మహమ్మదీయ సమస్య గూడ సమసిపోవలెను. అందరము భారతమాతకొక్క యనుంగు బిడ్డలమేయన్న భావము ప్రబలవలెను. విశ్వమానవ సౌభ్రాతృత్వము నుపన్యాసములవల్లను, గ్రంథములవల్లను సమస్తులైనవారు దేశము నకు ప్రబోధము చేయవలెను. హిందువులు, మహమ్మదీయులు, బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు, నిమ్నజాతులు వేలకొలది యేండ్ల నుండి, యిక్కడనే పుట్టి యిక్కడనే బెరిగి, యిక్కడ గాలి పీల్చి, యిక్కడ నీరుద్రావి, యిక్కడి పాడిపంటలనుభవించి, భారతమాతృ స్తన్యపానముజేసి యిచ్చటనే వర్ధిల్లిరి. పరస్పర ద్వేషములు వినాశ కారకములుగాని, శ్రేయోదాయకములుగావు. భేదవాదలను భేద ముండకూడదు. శ్రీరాముడెవరు? బ్రాహ్మణేతరుడు గాడా? వార లను భగవంతుడని యన్నివర్ణములవారు పూజించుటలేదా? పన్నిద్ద రాళ్వార్లలో బెక్కండ్రు బ్రాహ్మణేతరులులేరా? వారిని దేవతార్చన పెట్టెలోనుంచుకొని పూజించుటలేదా? భారతము బ్రాహ్మణేతరు లైన పాండవుల చరిత్రమేగదా? దానికి పంచమవేదమని పేరు పెట్టి దానిని బ్రాహ్మణులు పారాయణము జేయుటలేదా? విశ్వామిత్రుడు బ్రాహ్మణేతరుడుగాడా? మహాపవిత్రమైన గాయత్రీమంత్ర మతడు గాదా నిర్మించినది. వేదవ్యాసుడెవరు? పల్లెదానికొడుకు అతడే పంచమవేద రచయిత. అతడే నాలుగువేదములు విభజించెను. అతడే పదునెనిమిది పురాణములు రచియించెను. అతడే బ్రహ్మజ్ఞాన గర్భి తములైన బ్రహ్మసూత్రములు రచియించెను. వాటినన్నిటిని బ్రాహ్మ ణాదులు శిరసావహించుటలేదా? బ్రాహ్మణేతరు లెవరు? బ్రాహ్మణు లెవ్వరు? చలికి, వానకు, నెండకు, లెక్కసేయక నేలదున్ని పంటలు పండించి మన కన్నముపెట్టినవారెవరు? బ్రాహ్మణేతర సోదరులు గాదా? ఒక కుటుంబములోనివారు తలకొక పనిని బూని కుటుంబ రక్షణము జేసికొన్నట్లు దేశమునందలి యన్ని జాతులవారు తలకొక పరిశ్రమను బూని దేశరక్షణము జేయవలదా? అది మనకర్తవ్యము గాదా? జ్ఞానముగల మనుష్యులు హీనమైన పశువులు, కుక్కలవలె కొట్లాడుకొనుట, కొట్లాడుకొనుట ధర్మమా? జంతువులకు మనకు

భేదముండవలదా? ఐకమత్యము సర్వార్థ సాధకము. ఐకమత్యముం డుటచేతనే గదా గాలి కెగిరిపోవు గడ్డిపోచలు పెంటిగ నల్లబడి మదపుటేనుగును బంధింపగలవు? ఐకమత్యముచేతనేగదా చిన్నిచిన్ని మర్రియాకులు గుమిగూడి, గలసియుండి, బ్రహ్మాండమంతను దగ్ధముచేయగల సూర్యతాపము నడ్డుకొని, క్రిందనున్న ప్రాణికోటికి నీడనొసగి, సౌఖ్యమొందజేయుచున్నవి! పరమాణువులు పర్వతముగ గూడి జంఝామారుతము నెదుర్కొని చలియింపక నిలిచియున్నవి.



పాపులర్ పవర్ ప్రింటింగ్ ప్రెస్, కాకినాడ.